

श्री रामचंद्रजी अने हनुमान भक्ति.

# విజ్ఞాపన.

మహాజనులారా!

శ్రీమద్వాల్మీకిమహర్షి ప్రణీతమగు రామాయణ మిచ్చెన్నపురంబునఁ దెనుంగులిపితోఁ బ్రథమమున వ్యాఖ్యానసహితముగ గీర్వాణమున సరస్వతీనిలయ ముద్రాశాలాధికారులచే ముద్రింపఁబడియెను. అదియును గోవిందరాజీయము మొదలగు నాల్గువ్యాఖ్యానములతోఁ గూడినదియై యున్నందున జనులకు మిక్కిలి ప్రయోజనకారియగుటచే రెండుమూఁడు కూర్పులు నచ్చై వారిచేత ముద్రింపంబడియెను. ఇటీవల నాపూర్ణగ్రంథమునకేని దానిలోని భాగములకేని యాంధ్రమునం దాత్పర్యము టీక వ్రాయఁబూనినవారును మూలగ్రంథమును మాత్రమే పారాయణమున కనుకూలించునట్లు పూర్ణముగనో భాగములు భాగములుగనో ప్రకటించుచుండువారును మీఁదఁజెప్పంబడిన వ్యాఖ్యానరామాయణము ననుసరించి గ్రంథములు వ్రాయుచుండుట వాడుకై యున్నది. వేయేల వ్యాఖ్యానరామాయణము పూర్ణమైన గ్రంథమైన నిటీవలి రామాయణప్రకటనలెల్ల పూర్ణములు. అందు గ్రంథపాతముండిన వీనియందును గ్రంథపాతమున్నట్లు రూఢిగ నంగీకరింపవలసియున్నది. 1896 సంవత్సరమున నేను సుందరకాండమునకు మాత్రము తెనుంగు తాత్పర్యమును వ్రాసి పారాయణమునకును సౌకర్యముగానుండునట్లు చిన్నయాకృతిగ ముద్రింపించి ప్రకటించితిని. అది జనరంజకముగ

సందుకొంజేసి యాపోత్తములన్నియు శీఘ్రకాలముననే విక్రీతములైరి
వ్యాఖ్యాన రామాయణము మొదలుగ నన్నింటియందును గ్రంథపాతక
న్నప్తశ్లోకరిద్దరు పెద్దలవలన విని నాఁటనుండియు లుప్తముగాని సుంద
రకాండమును బురాతనప్రతిని సంపాదింప వేచియుండి యటీవల
సంచినందున దాని ననుసరించి తొల్లింటినాపోత్తమునందలి మూలము
లోపించియుండిన శ్లోకములనెల్లం దాదాపుగ ౭౦ ది శ్లోకములను జేర్చి
తిం దాత్పర్యమునువ్రాసి తొల్లింటివలెనే యీమారును బ్రకటించిన
ను. నూతనముగ నిందుఁ జేర్పంబడిన శ్లోకములకు ముందును వెనుక
○ అను కుండలీకరణము లుంపఁబడియున్నవి. కాఁబట్టి యాగుణములు
గమనించి యవి యిప్పటితరులందఱచేతను విక్రయింపఁబడు గ్రంథములం
లోపించి యున్నవని యెఱుంగుదురుగాక. ఇట్టిశ్లోకములు ముఖ్యముగ [illegible]
సర్గయందు ౫, ౨౮ వ సర్గయందు ౧౨, ౫౨ వ సర్గయందు ౭ శ్లోకము
లు మొత్తము నందంద రెండేసి మూఁడేసి శ్లోకములు నిట్లు లోపించియున్న
వి. తొలుదొల్త ముద్రింపించినవారికి శుద్ధప్రతి చిక్కకపోవుటచే నిట్టిలో
పము గలిగియుండును. వారియందుఁగల గౌరవముచేతను వేఱు శుద్ధప్ర
తులు చిక్కకపోవుటచేతను నిట్లుండ పరంపరయైయుండెనని తెల్పఁజెదను. శ్రీరా
మాయణములగువారనుదినము పారాయణముచేయు నీగ్రంథమునందు లోపము
న్నచో నెట్లు ఫలప్రాప్తియగునో యోచింపవలసియున్నది.



# పీఠిక.

చేతనుల కైహికాముష్మిక సౌఖ్యప్రదంబుగ శ్రీమద్రామాయణమును వ్రాయంబూనిన వాల్మీకిమహర్షి గాయత్రీ మహామంత్రమునందలి యిరువది నాల్గక్షరములను మొదటనిలిపి యన్నిశ్లోకములు వ్రాసెను. అట్టిశ్లోకములు తక్కినకాండములందుకంటె సుందరకాండమున మెండుగనుండుటంజేసి యీకాండమునకుఁ బ్రఖ్యాతియెక్కువయ్యె, నైహేతువుచేతనే యీకాండము పఠించువారికిని వినువారికిఁ గామధేనువువలె సర్వాభీష్టముల నొసంగును.

## ఈకాండమందలి నీతి.

సహధర్మచారిణియగు భార్యను మగం డెన్నియిడుములువడియు నుపేక్షింపఁదగదనుట (శ్రీరామునకు సీతయందలి రాగముచేతను). పతిభక్తి, నియతవ్రతము, సదాచారము, బంధుప్రీతియు నిల్లాండ్రకు భూషణములనుట (సీతయొక్కచరితముచేతను), రాజభక్తి, స్వామికార్యధురంధరత్వము భృత్యులకుండవలయుగుణములనుట (హనుమచ్చరితముచేతను) బోధింపఁబడియెను.

"ఈ గ్రంథము కేవల సంస్కృతభాషయందుండినను, ఆభాషయందుఁ బరిచయములేనివారుంగూడ దీని ప్రఖ్యాతి నెట్లోయెఱింగి యనుదినము పారాయణముచేయుచుండుటయు, అందలియభిప్రాయమెఱుంగక వగచుటయు లోకవిదితము. కావుననే యట్టికొఱఁతను వారించుటయు, సులభక్రయమునకే గ్రంథములభించునట్లుచేయుటయు సుకృత" మని మన్మిత్రులును, దయార్ద్రహృదయులును, భగవద్భాగవత కైంకర్యపరులును నగు మ-రా-రా-శ్రీ, నాగులకొండ-శ్రీరాములుగారు నన్నుఁ బ్రేరేపించినందున భగవత్ప్రీతిగ నీకాండమున కాంధ్రతాత్పర్యమును నాశక్తికొలందినివ్రాసి శ్రీరామచంద్రున కర్పించినాఁడను. పండితులగు వారిందలిదోషములు సైతురుగాక.

శ్రీమాన్, నే-పార్థసారథి అయ్యంగారు.

# దేవతాస్తుతి.

---

శా॥ శ్రీయుం భూమియు దోయిక్రేవలఁ దను న్సేవింపఁగా భక్తిఁ బ్రే
మాయత్తంబగు వీక్షణంబులను లోకాళిం దగం జూచుచున్
శ్రీయుక్తి న్నిగమాద్రినుండు నృహరిన్ దేవర్షి సంసేవ్యు నే।
నాయుః కీర్తి శుభంబులిచ్చుకొఱకై హర్షంబుమైఁ గొల్చెదన్।

తే॥ అస్మదాచార్యభజియింతు ననఘుఁగోటి। కన్యకాంబాసకులవార్ధి
కంజవైరి। శ్రీనృసింహార్యతాతదేశికుని ముక్తి। మార్గతత్త్వోపదేష్టను
మంపనిష్ఠ॥

క॥ ఆసంపసరసవ్వత్యభి। ధానున్ సంయమివరేణ్యుఁ దవిలికొలుతు నా
కూనినకృపనేగురుఁడిల। మానుగనెఱిఁగించె శాస్త్రమతమంగురునిన్

సీ॥ మనుధర్మసంహితకును దెనుంగున వ్యాఖ్యమును వ్రాసినాఁడను బు
ధులు మెచ్చ। భారతంబున శాంతిపర్వత్రయమునకు వ్రాసితి వ్యాఖ్య
శ భాసనంగఁ। బదబడియుద్యోగపర్వంబునకు నట్లె వ్రాసియున్నాఁ
డన గ్రకులఁ జూండ। వర భరద్వాజాన్వవాయసంభూతుండఁ శాస్త్ర
సారజ్ఞియనఁ బరఁగువాఁడ। సొంపుమీఱినట్టి సుందరకాండంబు
నకును బూని వ్రాసినాఁడ వ్యాఖ్య। జానకీధవుండు సర్వశుభంబులఁ
గూర్చుఁగాత మాకుఁ గొమరు మిగుల॥

## శ్రీమత్సుందరకాండపఠనశ్రవణాదిఫలము.

బ్రహ్మాండే. తతో రావణ నీతాయా స్సీతాయా శ్శత్రుకర్శనః॥
ఇతి శ్లోకం సమాకర్ణ్య కార్యసిద్ధిం లభే న్నరః॥
సుంద రాదిమసర్గస్థ హనూమ ద్విక్రమాదికమ్।
శ్రుత్వాపస్మార కుష్ఠాది భూత భేతాళ నాశనమ్॥
సనిర్జిత్య పురీం శ్రేష్ఠా మితిశ్లో కాదిమాక్షరమ్।
శ్రుత్వా బంధా ద్విము క్తస్సన్ బ్రహ్మ భూయాయ కల్ప్యతే
సీతా సందర్శనం శ్రుత్వా వీతశోకో భవిష్యతి।
శ్రుత్వాతు త్రిజటా స్వప్నం దుస్స్వప్నో నశ్యతిధ్రువమ్॥
శ్రీరామ ముద్రికాదానం యేశ్శృణ్వం త్యాదరేణతు।
నిర్జిత్య శత్రూన్ సంగ్రామే స్థిరం రాజ్యం వ్రజంతి తే॥
ధన్యా దేవా స్సగంధర్వా స్సిద్ధా ఇత్యత్ర చాదిమమ్।
శ్రుత్వా చతుర్దశం వర్ణ మనంగో వాయువ చ్చరేత్॥
హనూమ ద్గ్రహణం శ్రుత్వా బంధా న్ముచ్యేత మానవః।
లంకాదాహా ద్యనుశ్రుత్వా తాపత్రయ హతిర్భవేత్॥
మంగళాభిముఖీ త్యస్మిన్ శ్లోకేయ త్ప్రథమాక్షరమ్।
తద్గాయత్ర్యాః పంచదశం శ్రుత్వా మద్రూపభా గ్భవేత్॥
శ్రుత్వాతు పంచమం కాండం హనూమ ద్విజయాంకితమ్।
ఆంజనేయ ప్రసాదేన బ్రహ్మలోకం సగచ్ఛతి॥

కాండస్య సుందరాఖ్యస్య శ్రవణా త్పఠనా దపి।
మోక్షంప్రాప్నుయా జ్జగద్ధేతుం నాత్ర సందేహ ఇష్యతే॥

శ్రీవైష్ణవానాం శ్రీమద్రామాయణ పఠనోప
క్రమానుసంధేయక్రమః.

ప్రథమత స్స్వస్వసంప్రదాయ నిర్వాహకాచార్యాను సంధానం
తతః లక్ష్మీనాథేత్యారభ్య ప్రణామోస్మి నిత్యమిత్యంతం అనంత
రం శ్రీశైలపూర్ణవిషయం పితామహస్యేతి శ్లోకమారభ్య శ్రీభా
ష్యకారప్రభృతి స్వాచార్యపర్యంతవిషయా స్సాంప్రదాయికాః
శ్లోకా అనుసంధేయాః యద్వా శ్రీధరాది స్వాచార్యపర్యంతాః
ప్రతిస్విక్తిశ్లోకా అనుసంధేయాః.

తతః కూజంతం రామరామేతి మధురం మధురాక్షరమ్।
ఆరుహ్య కవితాశాఖాం వందే వాల్మీకికోకిలమ్॥
వాల్మీకే ర్మునిసింహస్య కవితా వనచారిణః।
శృణ్వ న్రామ కథానాదం కో నయాతి పరాంగతిమ్॥
యః పిబన్ సతతం రామ చరితామృతసాగరమ్।
అతృప్తస్తం మునింవందే ప్రాచేతస మకల్మషమ్॥
గోష్పదీకృత వారాశిం మశకీకృత రాక్షసమ్।
రామాయణ మహామాలా రత్నం వందే నిలాత్మజమ్॥
అంజనా నందనం వీరం జానకీ శోక నాశనమ్।
కపీశ మక్షహంతారం వందే లంకాభయంకరమ్॥

మనోజవం మారుతతుల్యవేగం జితేంద్రియం బుద్ధిమతాంవరి
ష్ఠమ్ । వాతాత్మజం వానరయూథముఖ్యం శ్రీరామదూతం శి
రసా నమామి॥

ఉల్లంఘ్య సింధోస్సలిలం సలీలం యశ్శోకవహ్నిం జనకాత్మజా
యాః । ఆదాయ తేనైవ దదాహలంకాం నమామి తం ప్రాం
జలి రాంజనేయమ్॥

ఆంజనేయ మతిపాటలాననం కాంచనాద్రి కమనీయవిగ్రహమ్।
పారిజాత తరుమూలవాసినం భావయామి పవమాననందనం
యత్రయత్ర రఘునాథకీర్తనం తత్రతత్రకృతమస్తకాంజలిం। బా
ష్పవారి పరిపూర్ణలోచనం మారుతింనమత రాక్షసాంతకమ్॥
వేదవేద్యే పరేపుంసి జాతే దశరథాత్మజే।
వేదః ప్రాచేతసా దాసీ త్సాక్షా ద్రామాయణాత్మనా॥
తదుపగతసమాససంధియోగంసమమధురోపనతార్థవాక్యబద్ధం।
రఘువరచరితం మునిప్రణీతం దశశిరసశ్చవధం నిశామయధ్వమ్
శ్రీరాఘవం దశరథాత్మజమప్రమేయం సీతాపతిం రఘుకులా
న్వయ రత్నదీపమ్ । ఆజానుబాహు మరవింద దళాయతాక్షం
రామం నిశాచర వినాశకరం నమామి॥
వైదేహీ సహితం సురద్రుమతలే హైమే మహా మంటపే
మధ్యే పుష్పకమాసనే మణిమయే వీరాసనే సుస్థితమ్
అగ్రేవాచయతి ప్రభంజనసుతే తత్త్వం మునిభ్యః పరమ్

వాఖ్యాంతం భరతాదిభిః పరివృతం రామంభజే శ్యామలమ్
తతో యథాశక్తి శ్రీకోశోపరి భగవదారాధనం కర్తవ్యమ్.

పారాయణ సమాపనక్రమః.

ఏవ మేతత్పురావృత్త మాఖ్యానం భద్రమస్తు వః
ప్రవ్యాహరత విస్రబ్ధం బలం విష్ణోః ప్రవర్ధతామ్॥
లాభ స్తేషాం జయ స్తేషాం కుత స్తేషాం పరాభవః
యేషా మిందీవరశ్యామో హృదయే సుప్రతిష్ఠితః॥
కాలే వర్షతు పర్జన్యః పృథివీ సస్యశాలినీ
దేశోయం క్షోభరహితో బ్రాహ్మణా స్సంతు నిర్భయాః॥
కావేరీ వర్ధతాం కాలే కాలేవర్షతు వాసవః
శ్రీరంగనాథో జయతు శ్రీరంగ శ్రీశ్చ వర్ధతామ్॥
స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం న్యాయ్యేన మార్గేణ
మహీం మహీశాః। గో బ్రాహ్మణేభ్య శుభమస్తు నిత్యం లో
కాస్సమస్తా స్సుఖినో భవంతు॥
మంగళం కోసలేంద్రాయ మహనీయ గుణాబ్ధయే
చక్రవర్తి తనూజాయ సార్వభౌమాయ మంగళమ్॥
వేదవేదాంత వేద్యాయ మేఘశ్యామల మూర్తయే
పుంసాం మోహనరూపాయ పుణ్యశ్లోకాయ మంగళమ్॥
విశ్వామిత్రాంతరంగాయ మిథిలానగరీపతేః
భాగ్యానాం పరిపాకాయ భవ్యరూపాయ మంగళమ్॥

పితృభక్తాయ సతతం భ్రాతృభి స్సహ సీతయా
నందితాఖిల లోకాయ రామభద్రాయ మంగళమ్॥
త్యక్త సాకేతవాసాయ చిత్రకూట విహారిణే
సేవ్యాయ సర్వయమినాం ధీరోదారాయ మంగళమ్॥
సౌమిత్రిణాచ జానక్యా చాపబాణాసి ధారిణే
సంసేవ్యాయ సదాభక్త్యా స్వామినే మమ మంగళమ్॥
దండకారణ్య వాసాయ ఖండితామర శత్రవే
గృధ్రరాజాయ భక్తాయ ముక్తిదాయాస్తు మంగళమ్॥
సాదరం శబరీదత్త ఫలమూలాభిలాషిణే
సౌలభ్య పరిపూర్ణాయ సత్వోద్రిక్తాయ మంగళమ్॥
హనుమ త్సమవేతాయ హరీ శాభీష్టదాయినే
వాలిప్రమథనాయాస్తు మహాధీరాయ మంగళమ్॥
శ్రీమతే రఘువీరాయ సేతూల్లంఘిత సింధవే
జిత రాక్షసరాజాయ రణధీరాయ మంగళమ్॥
ఆసాద్య నగరీం దివ్యా మభిషిక్తాయ సీతయా
రాజాధిరాజ రాజాయ రామభద్రాయ మంగళమ్॥
మంగళాశాసనపరై ర్మదాచార్య పురోగమైః
సర్వైశ్చ పూర్వై రాచార్యై స్సత్కృతాయాస్తు మంగళమ్॥
తతః పితామహాస్యే త్యారభ్య స్వాచార్యాంతా శ్లోకా అను సంధేయాః.

శ్రీస్మార్తమధ్వాదీనాం శ్రీమద్రామాయణ పఠనోప
క్రమాను సంధేయక్రమః.

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్
ప్రసన్నవదనం ధ్యాయే త్సర్వ విఘ్నోపశాంతయే॥
వాగీశాద్యా స్సుమనస స్సర్వార్థానా ముపక్రమే
యన్నత్వా కృతకృత్యాస్స్యు స్తన్నమామి గజాననమ్॥
తతః॥ శ్రీమచ్ఛంకరాచార్యాది గురుపరంపరానుసంధేయా.
దోర్భిర్యుక్తా చతుర్భి స్స్ఫటికమణిమయీ మక్షమాలాం ద
నా హస్తేనైకేన పద్మం సిత మపిచశుకం పుస్తకం చాప
భాసా కుందేందుశంఖ స్ఫటికమణినిభా భాసమానా సమా
సా మే వాగ్దేవతేయం నివసతువదనే సర్వదాసుప్రసన్నా॥
కూజంతం రామరామేతి మధురం మధురాక్షరమ్
ఆరుహ్య కవితాశాఖాం వందే వాల్మీకికోకిలమ్॥
వాల్మీకే ర్మునిసింహస్య కవితా వనచారిణః
శృణ్వ న్రామకథానాదం కో నయాతి పరాంగతిమ్॥
యః పిబ న్సతతం రామచరితామృత సాగరమ్
అతృప్త స్తం మునిం వందే ప్రాచేతస మకల్మషమ్॥
గోష్పదీకృత వారాశిం మశకీకృత రాక్షసమ్
రామాయణ మహామాలారత్నం వందే నిలాత్మజమ్॥
అంజనానందనం వీరం జానకీ శోకనాశనమ్॥

కపీశ మక్షహంతారం వందే లంకాభయంకరమ్॥

ఉల్లంఘ్యసింధోస్సలిలం సలీలం యశ్శోకవహ్నిం జనకాత్మజా
యాః। ఆదాయ తేనైవ దదాహ లంకాం నమామి తం
ప్రాంజలి రాంజనేయమ్॥

ఆంజనేయ మతిపాటలాననం కాంచనాద్రి కమనీయ విగ్రహమ్।
పారిజాత తరుమూలవాసినం భావయామి పవమాననందనమ్॥

యత్రయత్ర రఘునాథకీర్తనం తత్రతత్ర కృతమస్తకాంజలిమ్।
బాష్పవారి పరిపూర్ణలోచనం మారుతింనమత రాక్షసాంతకమ్॥

మనోజవం మారుతతుల్యవేగం జితేంద్రియం బుద్ధిమతాం వరి
ష్ఠమ్। వాతాత్మజం వానరయూథముఖ్యం శ్రీరామదూతం శి
రసా నమామి॥

యఃకర్ణాంజలి సంపుటై రహరహ స్సమ్యక్పిబంత్యాదరా
ద్వాల్మీకే ర్వదనారవిందగళితం రామాయణాఖ్యం మధు
జన్మవ్యాధి జరావిపత్తిమరణై రత్యంత సోపద్రవమ్
సంసారం సవిహాయ గచ్ఛతిపుమా న్విష్ణోఃపదం శాశ్వతమ్॥

తదుపగతసమాస సంధియోగం సమమధురోపనతార్థ వాక్య
బద్ధమ్। రఘువరచరితం మునిప్రణీతం దశశిరసశ్చవధం ని
శామయధ్వమ్॥

వాల్మీకి గిరిసంభూతా రామసాగర గామినీ
పునాతి భువనం పుణ్యా రామాయణ మహానదీ॥

శ్లోకసార సమాకీర్ణం సర్గకల్లోల సంకులమ్
కాండగ్రాహ మహామీనం వందే రామాయణార్ణవమ్॥
వేదవేద్యే పరేపుంసి జాతే దశరథాత్మజే
వేదః ప్రాచేతసా దాసీత్ సాక్షా ద్రామాయణాత్మనా॥
వైదేహీసహితం సురద్రుమతలే హైమే మహామంటపే
మధ్యే పుష్పకమాసనే మణిమయే వీరాసనే సుస్థితమ్
అగ్రేవాచయతిప్రభంజనసుతే తత్త్వం మునిభ్యః పరమ్
వ్యాఖ్యాంతం భరతాదిభిః పరివృతం రామంభజే శ్యామలమ్॥
వామే భూమిసుతా పురశ్చహనుమా న్పశ్చా త్సుమిత్రాసుత
శ్శత్రుఘ్నో భరతశ్చ పార్శ్వదళయో ర్వాయ్వాదికోణేషు చ
సుగ్రీవశ్చ విభీషణశ్చ యువరాట్ తారాసుతో జాంబవా
న్మధ్యే నీలసరోజ కోమలరుచిం రామం భజే శ్యామళమ్॥
నమోస్తు రామాయ సలక్ష్మణాయ దేవ్యైచ తస్యై జనకా
త్మజాయై। నమోస్తు రుద్రేంద్ర యమానిలేభ్యో నమోస్తు
చంద్రార్క మరుద్గణేభ్యః॥
తతః శ్రీకోశోపరి శ్రీరామావాహనాది నైవేద్యాంత పూజా
విధేయా - పారాయణావసానేచ పునఃపూజా కర్తవ్యా॥

—*పారాయణ సమాపనసమయానుసంధేయక్రమః.*—

స్వస్తిప్రజాభ్యః పరిపాలయంతాం న్యాయ్యేన మార్గేణ మ
హీం మహీశాః। గోబ్రాహ్మణేభ్యః శుభమస్తు నిత్యం లో

కా స్సమస్తా స్సుఖినో భవంతు॥
కాలే వర్షతు పర్జన్యః పృథివీ సస్యశాలినీ
దేశోయం క్షోభరహితో బ్రాహ్మణా స్సంతు నిర్భయాః॥
అపుత్రాః పుత్రిణస్సంతు పుత్రిణస్సంతు పౌత్రిణః
అధనా స్సధనా స్సంతు జీవంతు శరదాం శతమ్॥
చరితం రఘునాథస్య శతకోటి ప్రవిస్తరమ్
ఏకైక మక్షరం ప్రోక్తం మహాపాతక నాశనమ్॥
శృణ్వ న్రామాయణం భక్త్యా యః పాదం పదమేవవా
సయాతి బ్రహ్మణస్థానం బ్రహ్మణా పూజ్యతే సదా॥
రామాయ రామభద్రాయ రామచంద్రాయ వేధసే
రఘునాథాయ నాథాయ సీతాయాః పతయే నమః॥
యన్మంగళం సహస్రాక్షే సర్వదేవ నమస్కృతే
వృత్రనాశే సమభవ త్తత్తే భవతు మంగళమ్॥
యన్మంగళం సుపర్ణస్య వినతా కల్పయత్పురా
అమృతం ప్రార్థయానస్య తత్తే భవతు మంగళమ్॥
మంగళం కోసలేంద్రాయ మహనీయ గుణాత్మనే
చక్రవర్తి తనూజాయ సార్వభౌమాయ మంగళమ్
అమృతోత్పాదనే దైత్యాన్ ఘ్నతో వజ్రధరస్యయత్
అదితి ర్మంగళం ప్రాదా త్తత్తేభవతు మంగళమ్॥
త్రీ న్విక్రమాన్ ప్రక్రమతో విష్ణో రమిత తేజసః

యదాసీ న్మంగళం రామ తత్తే భవతు మంగళమ్॥
ఋతవ స్సాగరా ద్వీపా వేదా లోకా దిశశ్చ తే
మంగళాని మహాబాహో దిశంతు తవ సర్వదా॥
కాయేన వాచా మనసేంద్రియైర్వా బుద్ధ్యాత్మనావా ప్రకృతే
స్స్వభావాత్ । కరోమి యద్య త్సకలం పరస్మై నారాయ
ణాయేతి సమర్పయామి॥

—* శ్రీగాయత్రీరామాయణమ్. *—

తపస్స్వాధ్యాయ నిరతం తపస్వీ వాగ్విదాం వరమ్
నారదం పరిపప్రచ్ఛ వాల్మీకి ర్మునిపుంగవమ్॥ ౧
సహత్వా రాక్షసాన్ సర్వాన్ యజ్ఞఘ్నాన్ రఘునందనః
ఋషిభిః పూజిత స్సమ్య గ్యథేంద్రో విజయీ పురా॥ ౨
విశ్వామిత్ర స్సధర్మాత్మా శ్రుత్వా జనకభాషితమ్
వత్స రామ ధనుఃపశ్య ఇతి రాఘవ మబ్రవీత్॥ ౩
తుష్టావాస్య తదావంశం ప్రవిశ్య స విశాంపతేః
శయనీయం నరేంద్రస్య తదా సాద్య వ్యతిష్ఠత॥ ౪
వనవాసం హి సంఖ్యాయ వాసాంస్యాభరణాని చ
భర్తార మనుగచ్ఛంత్యై సీతాయై శ్వశురో దదౌ॥ ౫
రాజా సత్యం చ ధర్మం చ రాజా కులవతాం కులమ్
రాజా మాతా పితా చైవ రాజా హితకరో నృణామ్॥ ౬
నిరీక్ష్య సముహూర్తం తు దదర్శ భరతో గురుమ్

ఉటజే రామమాసీనం జటావల్కల ధారిణమ్॥ ౭

యది బుద్ధిః కృతా ద్రష్టుం మగస్త్యం తం మహామునిమ్
అద్యైవ గమనే బుద్ధిం రోచయస్వ మహాయశః॥ ౮
భరతస్యార్యపుత్రస్య శ్వశ్రూణాం మమచ ప్రభో
మృగరూప మిదం వ్యక్తం విస్మయం జనయిష్యతి॥ ౯
గచ్ఛ శీఘ్ర మితో రామ సుగ్రీవం తం మహాబలమ్
వయస్యం తం కురు క్షిప్ర మితో గత్వాద్య రాఘవ। ౧౦
దేశ కాలౌ ప్రతీక్షస్వ క్షమమాణః ప్రియాప్రియే
సుఖదుఃఖసహః కాలే సుగ్రీవ వశగో భవ॥ ౧౧

వంద్యాస్తే తు తపస్సిద్ధా స్తపసా వీతకల్మషాః
ప్రష్టవ్యా స్తేపి సీతాయాః ప్రవృత్తిం వినయాన్వితైః। ౧౨
స నిర్జిత్య పురీం శ్రేష్ఠాం లంకాం తాం కామరూపిణీమ్
విక్రమేణ మహాతేజా హనుమాన్ మారుతాత్మజః॥ ౧౩
ధన్యా దేవా స్సగంధర్వా స్సిద్ధాశ్చ పరమర్షయః
మమ పశ్యంతి యే నాథం రామం రాజీవలోచనమ్। ౧౪
మంగళాభిముఖీ తస్య సా తదాసీ న్మహాకపేః
ఉపతస్థే విశాలాక్షీ ప్రయతా హవ్యవాహనమ్॥ ౧౫
హితం మహార్థం మృదుపూర్వసంహితం వ్యతీత కాలాయతి
సంప్రతిక్షమమ్। నిశమ్య తద్వాక్య ముపస్థితజ్వరః ప్రసంగవా ను
త్తరమేత దబ్రవీత్॥ ౧౬

ధర్మాత్మా రక్షసాం శ్రేష్ఠ స్సంప్రాప్తోయం విభీషణ
లంకైశ్వర్యం ధ్రువంశ్రీమా నయంప్రాప్నో త్యకంటకమ్॥ ౧౭
యో వజ్రపాతా శనిసన్నిపాతా న్నచుక్షుభే నాపిచచాలరా
జా । స రామబాణాభిహతో భృశార్త శ్చచాలచాపంచ ము
మోచ వీరః॥ ౧౮

యస్యవిక్రమ మాసాద్య రాక్షసా నిధనం గతాః
తం మన్యే రాఘవంవీరం నారాయణ మనామయమ్॥ ౧౯
నతే దదృశిరే రామం దహంత మరివాహినీమ్
మోహితాః పరమాస్త్రేణ గాంధర్వేణ మహాత్మనా॥ ౨౦
ప్రణమ్య దేవతాభ్యశ్చ బ్రాహ్మణేభ్యశ్చ మైథిలీ
బద్ధాంజలిపుటా చేద మువా చాగ్నిసమీపతః॥ ౨౧
చలనా త్పర్వతేంద్రస్య గణా దేవా శ్చకంపితాః
చచాల పార్వతీచాపి తదాశ్లిష్టా మహేశ్వరమ్॥ ౨౨
దారాః పుత్రాః పురం రాష్ట్రం భోగాచ్ఛాదన భాజనమ్
సర్వమేవా విభక్తంనో భవిష్యతి హరీశ్వర॥ ౨౩
యామేవరాత్రిం శత్రుఘ్నః పర్ణశాలాం సమావిశత్
తామేవరాత్రిం సీతాపి ప్రసూతా దారకద్వయమ్॥ ౨౪
ఇదం రామాయణం కృత్స్నం గాయత్రీ బీజసంయుతమ్
త్రిసంధ్యం యఃపఠే న్నిత్యం సర్వపాపైః ప్రముచ్యతే॥

గా య త్రీ రా మా య ణం సం పూ ర్ణ మ్.

---

శ్రీ

శ్రీమహాగ్రీవాయనమః.

శ్రీరామచంద్రపరబ్రహ్మణే నమః.

శ్రీసుందరకాండే - ప్రథమస్సర్గః.



తతో రావణనీతాయా స్సీతాయా శ్శత్రుకర్శనః।
ఇయేష పద మన్వేష్టుం చారణా చరితే పథి॥ ౧।

దుష్కరం నిష్ప్రతి ద్వంద్వం చికీర్ష న్కర్మ వానరః।
సముదగ్ర శిరో గ్రీవో గవాంపతి రివా బభౌ॥ ౨॥

శ్రీ

శ్రీహయగ్రీవాయనమః.

శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః.

# శ్రీసుందరకాండ-తాత్పర్యసంగ్రహము.



౧. కిష్కింధాకాండమున శ్రీరామచంద్రుఁడు సుగ్రీవాదుల నాదరించుటయు, వాలినిహరించి యారాజ్యమును సుగ్రీవునకొసంగుటయు సుగ్రీవుఁడు పదంపడి తన వానరసేనలనెల్లఁ బిలుపించి సీతాదేవిని వెదకుటకై వారిని నియమించుటయు, దక్షిణదేశమున వెదకుట కనుపంబడిన వానరులలో శూరోత్తముండగు హనుమంతునిచే (సీతాదేవికి, హనుమంతుండు శ్రీరామభటుండను నమ్మికపుట్టుటకై) శ్రీరాముని యుంగరమిచ్చుటయు నైన పిమ్మట శత్రువులను హరింపంజాలిన దర్పముగలవాఁడగు నాంజనేయుఁడు రావణునిచేఁ గొనిపోవంబడినదగు సీతాదేవియుండు నెలవును వెదకుటకై యాకాశమార్గమునం జన నుద్దేశించెను.

౨. చేయ నలవికాదనియు, అడ్డులేనిదియునగు (సముద్రముం దాటుటయను) పనిని జేయఁదలఁచినవాఁడై యాతం డుబుకఁబట్టిన తలయు భుజములునుగలిగి యాఁబోతెద్దువలె నుబ్బెను.

అథ వైడూర్యవర్ణేషు శాద్వలేషు మహాబలః।
ధీర స్సలిలకల్పేషు విచచార యథాసుఖమ్॥ ౨॥

ద్విజాన్ విత్రాసయన్ ధీమా నురసా పాదపాన్ హరన్।
మృగాంశ్చ సుబహూ న్నిఘ్నన్ ప్రవృద్ధ ఇవ కేసరీ॥ ౩॥

నీలలోహిత మాంజిష్ఠ పత్ర వర్ణై స్సితాసితైః।
స్వభావ విహితైశ్చిత్రై ర్ధాతుభి స్సమలంకృతమ్॥ ౪॥

కామరూపిభి రావిష్ట మభీక్ష్ణం సపరిచ్ఛదైః।
యక్ష కిన్నర గంధర్వై ర్దేవ కల్పైశ్చ పన్నగైః॥ ౫॥

స తస్య గిరివర్యస్య తలే నాగ వరాయుతే।
తిష్ఠ న్కపివర స్తత్ర హ్రదే నాగ ఇవా బభౌ॥ ౬॥

స సూర్యాయ మహేంద్రాయ పవనాయ స్వయంభువే।
భూతేభ్య శ్చాంజలిం కృత్వా చకార గమనే మతిమ్॥ ౭॥

అంజలిం ప్రాఙ్ముఖః కుర్వన్ పవనా యాత్మ యోనయే।
తతో భివవృధే గంతుం దక్షిణో దక్షిణాం దిశమ్॥ ౮॥

౩. అటుపై మహాబలవంతుఁడును, ధైర్యశాలియు నగు నాతండు నీటితోఁదుల్యముగ నగుపడుచున్న పచ్చని కసవుంగలపొలములపై సంచరించెను.

౪. అట్లు పెఱిగిన సింగమువలెనేగుచున్న హనుమంతుని యొక్క వేగముచేఁ బక్షులు భీతిచెందెను. అతని ఱొమ్ముతాఁకులచేఁ బెనుమ్రాఁకులు విఱిగికూలెను. మృగములు నొచ్చెను.

౫, ౬, ౭. ఆయాంజనేయుఁడు నలుపు, ఎఱుపు, పసుపు మొదలగు నానావర్ణములనుగలిగి, సహజమగు నందముంజూపుచున్న మణిశిల మొదలగు బండలచే నలంకరింపఁబడినదియు, అలంకారముతోఁ గూడినవారై, తలంచినరూపము నెల్ల ధరించినవారగు యక్ష కిన్నర గంధర్వులచేతను, దేవతలతో సములగు సర్పములచేతను బలుమఱు చుట్టంబడినదియు, ఉత్తమజాతింగల యేనుఁగులతోఁగూడినదియు నగు నాపర్వతప్రదేశమందు నిలచినవాఁడై, యొక సరస్సునందు నిర్భయముగ నిలచియున్న యేనుఁగువలెఁ బ్రకాశించినవాఁ డయ్యెను.

౮. అట్లున్న యాతండు సూర్య దేవేంద్రవాయువులకును సమస్త దేవతలకును బ్రహ్మదేవునకును జేతులెత్తి మ్రొక్కి సీతాదేవిని వెదకుటకై సముద్రముం దాఁటిచన నుద్దేశించెను.

౯. అట్లుతలంచి సమర్థుఁడగు నాహనుమంతుఁడు తనజనకుండగు వాయుదేవునకు,తూర్పుముఖముగనిలచి నమస్కరించి దక్షిణముఖముగఁ బ్రయాణము సేయుటకై మేనును బెంచెను.

ప్లవంగ ప్రవరైర్దృష్టః ప్లవనే కృతనిశ్చయః
వవృధే రామవృద్ధ్యర్థం సముద్ర ఇవ పర్వసు॥ ౧౦॥

నిష్ప్రమాణ శరీరస్సన్ లిలంఘయిషు రర్ణవమ్
బాహుభ్యాం పీడయామాస చరణాభ్యాం చ పర్వతమ్॥ ౧౧॥

స చచాలాచల శ్చాపి ముహూర్తం కపిపీడితః
తరూణాం పుష్పితాగ్రాణాం సర్వం పుష్ప మశాతయత్॥ ౧౨॥

తేన పాదపముక్తేన పుష్పౌఘేణ సుగంధినా
సర్వత స్సంవృత శ్శైలో బభౌ పుష్పమయో యథా॥ ౧౩॥

తేన చోత్తమ వీర్యేణ పీడ్యమాన స్స పర్వతః
సలిలం సంప్రసుస్రావ మదం మత్త ఇవ ద్విపః॥ ౧౪॥

పీడ్యమానస్తుబలినా మహేంద్ర స్తేన పర్వతః
రీతీ ర్నిర్వ ర్తయామాస కాంచనాంజన రాజతీః॥ ౧౫॥

ముమోచ చ శిలా శ్శైలో విశాలా స్సమనశ్శిలాః
మధ్యమే నార్చిషా జుష్టో ధూమరాజీ రివానలః॥ ౧౬॥

గిరిణా పీడ్యమానేన పీడ్యమానాని సర్వతః
గుహావిష్టాని భూతాని వినేదు ర్వికృతైస్స్వరైః॥ ౧౭॥

౧౦. శ్రీరామునియొక్క శ్రేయోభివృద్ధికై సముద్రమును దాఁటుటకు నిశ్చయించుకొన్నవాఁడై, పున్నమ మొదలగు పర్వదినములయందుఁ బొంగెడు సముద్రమువలెనే వానరశ్రేష్ఠుల కగుపడుచుండ బెఱిగెను.

౧౧. సముద్రమును దాఁటుఁ దివురుచున్న మితిలేని శరీరముఁగలవాఁడై యాకొండను జేతులుగాళ్లచే నుఱ్ఱట్లూఁచెను.

౧౨. ఆకొండ బలవంతుఁడగు నాంజనేయునిచేఁ గదల్పఁబడినదై రెండుగడియలకాలము గడగడలాడెను అందలి చెట్లపువ్వులన్నియు రాలెను.

౧౩. అట్లు చెట్లనుండిరాలిన పరిమళయుక్తములగు పుష్పములయొక్క సమూహముచేత నంతటను గప్పఁబడినదై యాపర్వతము పువ్వులకొండవలెఁ దోఁచెను.

౧౪. మహాబలశాలియగు నాతనిచే నట్లు ఊన్చినదై యాకొండ, మదించినయేనుఁగు పొగరును గార్చికొనినట్లుగా జలము నెల్లెడఁ గ్రక్కెను.

౧౫. బలవంతుఁడగు హనుమంతునిచే బాధింపఁబడినదై మహేంద్రపర్వతము బంగారు, వెండి, కాటుక మొదలగువాని గుఱుతులను గలిగించెను.

౧౬. ఆపర్వతము మణిశిలతోఁగూడిన పెద్దపెద్దబండలను, అగ్నిహోత్రుఁడు పొగనుగ్రక్కినట్లు పర్వతగర్భమందున్నజ్వాలతోడ వెడలఁ గ్రక్కెను.

౧౭. పర్వతము గదలింపఁబడినపుడు దాని గుహలయందున్న భూతములన్నియుఁ గదల్పఁబడినవైనవి గావున నవియన్నియు భీతిల్లి వికారముగ ధ్వనిచేసెను.

స మహాసత్త్వ సన్నాద శ్శైలపీడా నిమిత్తజః।
పృథివీం పూరయామాస దిశ శ్చోపవనాని చ॥ ౧౮॥
శిరోభిః పృథుభి స్సర్పా వ్యక్త స్వస్తిక లక్షణైః।
వమంతః పావకం ఘోరం దదంశు ర్దశనై శ్శిలాః॥ ౧౯॥
తా స్తదా సవిషై ర్దష్టాః కుపితై స్తై ర్మహాశిలాః।
జజ్వలుః పావ కోద్దీప్తా బిభిదు శ్చ సహస్రధా॥ ౨౦॥
యాని చౌషధ జాలాని తస్మి న్జాతాని పర్వతే।
విషఘ్నా న్యపి నాగానాం న శేకు శ్శమితుం విషమ్॥ ౨౧॥
భిద్యతేయం గిరి ర్భూతై రితి మత్వా తపస్వినః।
త్రస్తా విద్యాధరా స్తస్మా దుత్పేతు స్స్త్రీగణై స్సహ॥ ౨౨॥
పానభూమిగతం హిత్వా హైమ మాసవభాజనమ్।
పాత్రాణిచ మహార్హాణి కరకాంశ్చ హిరణ్మయాన్। ౨౩।
లేహ్యా నుచ్చావచా న్భక్ష్యా న్మాంసాని వివిధానిచ।
ఆర్షభాణి చ చర్మాణి ఖడ్గాంశ్చ కనకత్సరూన్॥ ౨౪॥
కృతకంఠగుణాః క్షీబా రక్తమా ల్యానులేపనాః।
రక్తాక్షాః పుష్కరాక్షాశ్చ గగనం ప్రతిపేదిరే॥ ౨౫॥
హార నూపుర కేయూర పారిహార్యధరా స్స్త్రియః।
విస్మితా స్సస్మితా స్తస్థు రాకాశే రమణై స్సహ॥ ౨౬॥

౧౮. పర్వతముగదలుటనిమిత్తముగాఁ గలిగిన యా గొప్పభూత ములధ్వని యాకాశమందెల్లను, దిక్కులయందును, ఉద్యానవనములయం దును వ్యాపించెను.

౧౯. పడిగలపైనల్లని గుఱుతులచే, స్పష్టముగాఁ దెలియవచ్చుచు న్న యుత్తమజాతినిగల సర్పములు భయంకరమగు నిప్పును గ్రక్కుచున్న వై కోఱలచే బండలను గఱచెను.

౨౦. అంతటఁ గోపముం జెందినవియు విషముతోఁ గూడినవియు నగు నాపాములచేఁ గఱవంబడిన యా పెద్దబండలు విహాగ్నిచే మండెను.

౨౧. ఆపర్వతమునఁ బుట్టినవై విషమును హరించుస్వభావముగల యోషధులును, ఆసర్పములవిషమును హరింపఁ జాలకపోయెను.

౨౨, ౨౩, ౨౪. తపస్సుగలవారగు విద్యాధరు లనుదేవత “లీప ర్వతము భూతములతోఁడఁగూడ బ్రద్దలు సేయంబడు నేమో యనితలఁచి వెఱ చి, తాము కల్లుద్రావుచోటునుండు బంగారుగిన్నెను, వెలగల యితరపా త్రలను, బంగారుగిండీలను, పచ్చడులను, నానావిధములగు భక్ష్యముల ను, బంగారుపిడులుగల పెద్దకత్తులను, ఎద్దుచర్మముచేఁ జేయంబడిన డాళ్ల నుగూడ మాని యాఁడువాండ్రతోడ నాకాశమున కెగిరిరి.

౨౫. కంఠములందుఁ బుష్పమాలికలుగలవారును, కల్లుద్రాగి మత్తు లైనవారును, ఎఱ్ఱనిపువ్వులను, పూతలనుగలవారును, ఎఱ్ఱనైన కన్నులు గలవారును నగు నావిద్యాధరు లాకాశముం జెందిరి.

౨౬. దండలను, అందెలను, భుజకీర్తులను, కడియములను, ధరించి నవారగు విద్యాధరస్త్రీ) లాశ్చర్యముందుచుఁ జిఱునగవుంగలిగి తమమగల తోడ నాకాశమున నిలచియుండిరి.

బాహూ సంస్తంభయామాస మహాపరిఘ సన్నిభౌ।
ససాద చ కపిః కట్యాం చరణౌ సంచుకోచ చ॥ ౩౫॥

సంహృత్య చ భుజౌ శ్రీమాన్ తథైవచ శిరోధరామ్।
తేజ స్సత్వం తథా వీర్య మావివేశ స వీర్యవాన్॥ ౩౬॥

మార్గ మాలోకయన్దూరా దూర్ధ్వం ప్రణిహితేక్షణః।
రురోధ హృదయే ప్రాణా నాకాశ మవలోకయన్॥ ౩౭॥

పద్భ్యాం దృఢ మవస్థానం కృత్వా స కపికుంజరః।
నికుంచ్య కర్ణౌ హనుమా నుత్పతిష్యన్మహాబలః॥
వానరాన్వానరశ్రేష్ఠ ఇదం వచన మబ్రవీత్। ౩౮॥

[1]యథా రాఘవనిర్ముక్త శ్శర శ్శ్వసనవిక్రమః॥
గచ్ఛే త్తద్వ ద్గమిష్యామి లంకాం రావణపాలితామ్। ౩౯॥

నహి ద్రక్ష్యామి యది తాం లంకాయాంజనకాత్మజామ్।
అనేనైవ హి వేగేన గమిష్యామి సురాలయమ్। ౪౦॥

యదివా త్రిదివే సీతాం న ద్రక్ష్యా మ్యకృతశ్రమః॥
బధ్వా రాక్షసరాజాన మానయిష్యామి రావణమ్। ౪౧॥

సర్వథా కృతకార్యోఽహ మేష్యామి సహసీతయా॥
ఆనయిష్యామి వా లంకాం సముత్పాట్య సరావణామ్। ౪౨॥

౩౫. మఱియు నాతండు గుదియలవంటిభుజములను గదలక బిగియఁ బట్టెను, నడుమును సన్నము చేసెను, కాళ్లు ముడుంచుకొనెను.

౩౬. కాంతియుఁ బరాక్రమమును గలవాఁడగు నాహనుమంతుఁడు భుజములను మెడను బిగియంబట్టియే, బలదర్పములను బ్రతాపమును బొందెను.

౩౭. మీఁదుగా నుంపఁబడిన చూపునుగలవాఁడై దూరము నుండియే మార్గముంజూచికొనుచు, ఆకాశమున దృష్టినిలిపి ప్రాణములను గొమ్మునఁ జిక్కఁబట్టెను.

౩౮. మిక్కిలి బలశాలియు, వానరోత్తముఁడునునగు హనుమంతుండు పాదములను బిస్సగనూని, చెవులనిఱికిపట్టి యెగయఁబోవుచుఁ దనతోడివానరులతోడ నిట్టులనియెను.

౩౯. "రామచంద్రునిచే విడువంబడినబాణము వాయువేగముం గలదై యెట్లుపోవునో యటువలెనే రావణునిచేఁబాలింపఁబడుచున్నదగు లంకకుఁ బోవంగలవాఁడను.



౪౦. జనకరాజపుత్రికయగు సీతాదేవిని లంకయందుఁ గనఁజాలనైతినేని, స్వర్గమునకిదేవేగమునఁ బోవుదును.

౪౧. స్వర్గమందును సీతాదేవిని గననేరనిచో నలయికలేనివాఁడనై తోడనే లంకకేగి రాక్షసరాజగు రావణుం గట్టితెచ్చెదను.

౪౨. ఎన్నిమార్గముల నేనియు శ్రమపడి సీతాదేవిని దోడ్కొనివచ్చువాఁడను. లంకాద్వీపమును [illegible]లించికొనియైనను దేఁగలవాఁడఁ జూడీ!

ఏవ ముక్త్వాతు హనుమాన్ వానరా న్వానరోత్తమః॥ ౪౩॥

ఉత్పపాతాథ వేగేన వేగవా నవిచారయన్।
సుపర్ణమివ చాత్మానం మేనే స కపికుంజరః॥ ౪౪॥

సముత్పతతి తస్మింస్తు వేగాత్తే నగరోహిణః।
సంహృత్య విటపాన్ సర్వాన్ సముత్పేతుః సమంతతః॥ ౪౫॥

సమత్తకోయష్టిమకాన్ పాదపా న్పుష్పశాలినః।
ఉద్వహ న్నూరువేగేన జగామ విమలేంబరే। ౪౬॥

ఊరువేగోద్ధతా వృక్షా ముహూర్తం కపిమన్వయుః।
ప్రస్థితం దీర్ఘ మధ్వానం స్వబంధు మివ బాంధవాః॥ ౪౭॥

తమూరువేగోన్మథితా స్సాలా శ్చాన్యే నగోత్తమాః।
అనుజగ్ము ర్హనూమంతం సైన్యా ఇవ మహీపతిమ్। ౪౮॥

సుపుష్పితాగ్రై ర్బహుభిః పాదపై రన్వితః కపిః।
హనుమా న్పర్వతాకారో బభూ వాద్భుత దర్శనః॥ ౪౯॥

సారవంతో థయేవృక్షా న్యమజ్జ న్లవణాంభసి।
భయాదివ మహేంద్రస్య పర్వతా వరుణాలయే॥ ౫౦

౪౩, ౪౪. అని వేగవంతుఁడును వానరశ్రేష్ఠుండును నగు నాంజనేయుఁడు వానరులతోఁ బలికి ముందువెనుక యోచింపకమీఁదికెగిరెను. వానరోత్తముఁడగు నాతండు దన్ను గరుఁడునివలెను దలంచికొనియెను.

౪౫. వేగముతోడ నాతం డట్లు లెగురుచుండఁగా నాపర్వతమందున్న చెట్లన్నియు విఱిగినకొమ్మలతోడన నాతనివెంటనే యెగిరెను.

౪౬. మదించిన లకుముకిపిట్టలతోఁ గూడినవియు, మెండౌఁ బుష్పములనుగలవియునగు వృక్షములను దొడలవేగముచే భరించి, నిర్మలమైన యాకాశమున నాతండు సంచరించెను.

౪౭. అట్లు తొడలవేగముచే నెగిరిన చెట్లు (దూరదేశమునకుఁ బ్రయాణమై పోవుచున్నవానిని బంధువులు సాగనంపఁబోవునట్లు) రెండుగడియలకాలము తోడనేగెను.

౪౮. తొడలవేగముచే నెగరఁ గొట్టఁబడినవియు. ఇతరములైనవియు నగు గొప్పవృక్షములు (రాజును సేనలు వెంబడించునట్లు) హనుమంతునివెంట నేగెను.

౪౯. చక్కఁగఁ బూచినకొనలుగల వృక్షములతోఁ గూడిన వాఁడై హనుమంతుఁడను నావానరుఁడు పర్వతముంబోలె యాశ్చర్యకరముగ నగుపడువాఁడయ్యెను.

౫౦. అట్లాతనితోడ నెగిరిన చెట్లు మరలి సముద్రముపైఁబడినవై యు వానిలోఁ జేవగలవి (ఇంద్రుని భయముచేఁ బర్వతములుమునిఁగినట్లు) సముద్రమున మునిఁగెను.

స నానాకుసుమైః కీర్ణః కపి స్సాంకురకోరకైః।
శుశుభే మేఘసంకాశః ఖద్యోతైరివ పర్వతః॥ ౫౧॥

విముక్తా స్తస్య వేగేన ముక్త్వా పుష్పాణి తే ద్రుమాః।
అవశీర్యంత సలిలే నివృత్తా స్సుహృదో యథా॥ ౫౨॥

లఘుత్వే నోపపన్నం తద్విచిత్రం సాగరే పతత్।
ద్రుమాణాం వివిధం పుష్పం కపివాయు సమీరితమ్॥ ౫౩॥

తారాశత మివాకాశం ప్రబభౌ సమహార్ణవః॥ ౫౩½॥

పుష్పౌఘే ణానుబద్ధేన నానావర్ణేన వానరః।
బభౌ మేఘ ఇవాకాశే విద్యుద్గణ విభూషితః॥ ౫౪॥

తస్య వేగ సమాధూతైః పుష్పై స్తోయ మదృశ్యత।
తారాభి రభిరామాభి రుదితాభి రివాంబరమ్॥ ౫౫॥

తస్యాంబరగతౌ బాహూ దదృశాతే ప్రసారితౌ।
పర్వతాగ్రా ద్వినిష్క్రాంతౌ పంచాస్యావివ పన్నగౌ॥ ౫౬॥

పిబన్నివ బభౌ చాపి సోర్మిజాలం మహార్ణవమ్।
పిపాసురివ చాకాశం దదృశే స మహాకపిః॥ ౫౭॥

౫౧. మేఘముతో సమానుఁడగు నావానరుండు చిగుళ్లతోడను మొగ్గలతోడను గూడిన పుష్పములచేతఁ గప్పఁబడినవాఁడై మిణుగురుపురుగులచేఁ గప్పఁబడిన పర్వతమువలెఁ బ్రకాశించెను.

౫౨. ఆంజనేయుని వేగమునుండి విడువఁబడినచెట్లు పుష్పములను వదలి (సాగనంపివచ్చు స్నేహితులవలె) మరలినవై నీటియందుఁబడెను.

౫౩. తేలికయైనవియు, నానావర్ణములుగలవియు, గాలిచే నెగరఁగొట్టఁబడినవియునగు నానావిధములగు పుష్పములను సముద్రమునఁబడియెను.

౫౩౪. అట్లు పుష్పములు రాలినందున సముద్రము, నక్షత్రములచే నొప్పిన యాకాశమువలెఁ బ్రకాశించెను.

౫౪. అనేకవర్ణములుగల పుష్పసమూహముచేత నొప్పినహనుమంతుఁడు మెఱపులచే నలంకరింపఁబడిన మేఘమువలె నాకాశమందుఁ బ్రకాశించెను.

౫౫. అతనివేగముచేత నెగరఁగొట్టఁబడిన పుష్పములచేత నుదకము, ఉదయించి రమ్యముగ వెలుఁగుచున్న నక్షత్రములచే నొప్పిన యాకాశమువలెఁ గనంబడియెను.

౫౬. చాపఁబడినవియు, ఆకాశమందు వ్యాపించినవియు నగు నాతనిభుజములు, పర్వతముచివరనుండి వెలువడుచున్న యైదేనితలల సర్పములవలెఁ గనంబడియెను.

౫౭. హనుమంతుండలలమొత్తముతోఁగూడిన మహాసముద్రమును బానముచేయుచున్నట్లుగా, నాకాశమునుండి చూచువారికిఁ దోఁచెను. ఆకాశమును బ్రాఁగఁదలంచినవానివలెఁ గ్రిందనుండువారికిఁ గనంబడియెను.

తస్య విద్యుత్ప్రభాకారే వాయుమార్గానుసారిణః।
నయనే విప్రకాశేతే పర్వతస్థా వివానలౌ॥ ౫౭॥

పింగే పింగాక్ష ముఖ్యస్య బృహతీ పరిమండలే।
చక్షుషీ సంప్రకాశేతే చంద్రసూర్యా వివోదితౌ॥ ౫౮॥

ముఖం నాసికయా తస్య తామ్రయా తామ్ర మాబభౌ।
సంధ్యయా సమభిస్పృష్టం యథా తత్సూర్యమండలమ్॥ ౫౯॥

లాంగూలంచ సమావిద్ధం ప్లవమానస్య శోభతే।
అంబరే వాయుపుత్రస్య శక్రధ్వజ ఇవోచ్ఛ్రితమ్॥ ౬౦॥

లాంగూలచక్రేణ మహాన్ శుక్లదంష్ట్రో ఽనిలాత్మజః।
వ్యరోచత మహాప్రాజ్ఞః పరివేషీవ భాస్కరః॥ ౬౧॥

స్ఫిగ్దేశే నాభితామ్రేణ రరాజ స మహాకపిః।
మహతా దారితేనేవ గిరి ర్గైరిక ధాతునా॥ ౬౨॥

తస్య వానర సింహస్య ప్లవమానస్య సాగరమ్।
కక్షాంతరగతో వాయు ర్జీమూత ఇవ గర్జతి॥ ౬౩॥

ఖే యథా నిపతం త్యుల్కా హ్యుత్తరాంతా ద్వినిస్సృతా।
దృశ్యతే సానుబంధాచ తథా స కపికుంజరః॥ ౬౪॥

౫౮. ఆకాశమార్గమున నేగుచున్నట్టి యాహనుమంతుని యొక్క మెఱుపులకాంతులు గ్రక్కుచున్నకన్నులు కొండయందుండు నగ్నికణములవలె వెలుంగుచున్నవి.

౫౯. వానరశ్రేష్ఠుఁడగు నాంజనేయునియొక్క పింగళవర్ణమైనట్టియు, విశాలమై గుండ్రమైనట్టియుఁగన్నులుదయించుచున్న చంద్రసూర్యులవలె వెలుంగుచున్నవి.

౬౦. ఆతనియొక్క యెఱ్ఱనిముక్కుచే రాగివలె నెఱ్ఱనైనముఖము, సంధ్యాకాలముచేఁ దంటఁబడిన సూర్యమండలమువలెఁ బ్రకాశించెను.

౬౧. సముద్రమును దాఁటుచున్న యాంజనేయునియొక్క నిడుపైవంకరగా మీఁదికెత్తఁబడినతోఁక యాకాశమున నింద్రధనుస్సువలెఁ బ్రకాశించెను.

౬౨. తెల్లనిదంతములు గలవాఁడును, సమస్తమెఱింగినవాఁడును, దొడ్డవాఁడునునైన వాయుపుత్రుఁడు (ఆంజనేయుఁడు) మండలమధ్యమునను్న సూర్యునివలెఁ దనతోఁకయొక్క వలయమునం దుండి వెలింగెను.

౬౩. ఆవానరోత్తముఁ డంతటను నెఱుపుగనున్న తోఁకయొక్క మొదటిభాగముచే, బ్రద్దలునేయఁబడిన గొప్పమణిశిలబండతోఁ గూడిన కొండవలె నొప్పెను.

౬౪. వేగముతో సముద్రమునుదాఁటుచున్న యావానరోత్తముని యొక్క చంకలం దగిలికొన్నగాలి మేఘములవలె ధ్వనించుచున్నది.

౬౫. ఉత్తరమునఁగొనసుగలిగి పడుచున్నతోఁకచుక్క యాకాశమం దెట్లుకనంబడునో యటువలెనే వానరోత్తముఁడగు హనుమంతుఁడు రమున ప్రేలుచున్న తోఁకతోడ దక్షిణముఖముగఁ జనుచుండెను.

ఏత తత్సంగ సంకాశో వ్యాయత శ్శుశుభే కపిః।
ప్రవృద్ధఇవ మాతంగః కక్ష్యయా బధ్యమానయా॥ ౬౬॥

ఉపరిష్టా చ్ఛరీరేణ ఛాయయా చావగాఢయా।
సాగరే మారుతావిష్టా నౌ రివాసీ త్తదా కపిః॥ ౬౭॥

యం యం దేశం సముద్రస్య జగామ స మహాకపిః।
స స తస్యోరువేగేన సోన్మాదఇవ లక్ష్యతే॥ ౬౮॥

సాగర స్యోర్మిజాలానా మురసా శైలవర్ష్మణామ్।
అభిఘ్నం స్తు మహావేగః పుప్లువే స మహాకపిః॥ ౬౯॥

కపివాత శ్చ బలవాన్ మేఘవాత శ్చ నిస్సృతః।
సాగరం భీమనిర్ఘోషం కంపయామాసతు ర్భృశమ్॥ ౭౦॥

వికర్ష న్నూర్మిజాలాని బృహంతి లవణాంభసి।
పుప్లువే కపిశార్దూలో వికిర న్నివ రోదసీ॥ ౭౧॥

మేరుమందర సంకాశా నుద్ధతాన్ సమహార్ణవే।
అత్యక్రామ న్మహావేగ సరంగాన్ గణయన్నివ॥ ౭౨॥

౬౬. చనుచున్న సూర్యునితోఁ దుల్యమగు తేజస్సుగలవాఁడును నిడుపగు మేనుగలవాఁడును నగునాతండు, నడుమునఁగట్టఁబడిన త్రాటిచే నొప్పిన గొప్పయేనుంగువలెఁ దోఁచెను.

౬౭. నీటికిఁబైనున్న మేనిచేతను, నీటినంటియున్న తననీడచేతను హనుమంతుఁడు సముద్రమున గాలితాఁకున నడుచునోడవలె నుండెను.

౬౮. ఆంజనేయుఁడు సముద్రముపై నేయేచోట జేరఁబోవుచుండెనో యాయాచోటెల్ల నాతనితొడలపైనిగాలి సోఁకి యలలుపుట్టుట మొదలగు వికారములతోడ వెఱ్ఱిపట్టినదానివలె నుండెను.

౬౯. మిక్కిలి వేగముతో నేగుచున్న యావానరోత్తముఁడు, పర్వతాకృతిం గలవియగు నలలమొత్తములను ఱొమ్ముచేఁ జెదరఁగుమ్ముచుం దాఁటి పోవుచుండెను.

౭౦. అట్లు చనుచున్న బలవంతుఁడగు వానరునియొక్క వేగముచేఁ గలిగినవాయువుచేతను మేఘములవాయువుచేతను భయంకరముగ ధ్వనించుచున్న సముద్రము మిక్కిలి చలించెను.

౭౧. లవణసముద్రమునందలి పెద్దయలలమొత్తముల నురయుచు, వానరశ్రేష్ఠుండగు నాతండు భూమియాకాశముల వేఱుపఱచువానివలె నేగెను.

౭౨. ఆ మహావేగముగలవాఁడగు హనుమంతుఁడు సముద్రమున మేరుమందర పర్వతములతోఁ దుల్యములుగ లేచుచున్నయలలను లెక్కించుచున్నవానివలె దాఁటెను.

తస్య వేగసముద్ధూతం జలం సజలదం తదా।
అంబరస్థం విబభ్రాజ శారదాభ్రమివాతతమ్॥ ౬౩॥

తిమి నక్ర ఝషాః కూర్మా దృశ్యంతే వివృతా స్తదా।
వస్త్రాపకర్షణే నేవ శరీరాణి శరీరిణామ్॥ ౬౪॥

ప్లవమానం సమీక్ష్యాథ భుజంగా స్సాగరాలయాః।
వ్యోమ్ని తం కపిశార్దూలం సుపర్ణ ఇతి మేనిరే॥ ౬౫॥

దశయోజన విస్తీర్ణా త్రింశద్యోజన మాయతా।
ఛాయా వానరసింహస్య జలే చారుతరాభవత్॥ ౬౬॥

శ్వేతాభ్రఘనరాజీవ వాయుపుత్రానుగామినీ।
తస్య సా శుశుభే ఛాయా వితతా లవణాంభసి॥ ౬౭॥

శుశుభే స మహాతేజా మహాకాయో మహాకపిః।
వాయుమార్గే నిరాలంబే పక్షవానివ పర్వతః॥ ౬౮॥

యేనాసౌ యాతి బలవాన్ వేగేన కపికుంజరః।
తేన మార్గేణ సహసా ద్రోణీకృత ఇవార్ణవః॥ ౬౯॥

ఆపాతే పక్షిసంఘానాం పక్షిరాజ ఇవ వ్రజన్।
హనుమాన్ మేఘజాలాని ప్రకర్షన్ మారుతో యథా॥ ౭౦॥

౭౩. అతని వేగముచే సముద్రమునుండి యెగరఁగొట్టఁబడిన యుదకము మేఘములతోఁగూడి యాకాశమందుండి, శరదృతువునందలి మేఘములవలె నిర్మలమై ప్రకాశించెను:

౭౪. అట్లు సముద్రోదకము మీఁదికెగరినందున, లోపలనుండిన పెద్దచేఁపలును మొసళ్లును చిఱుతచేఁపలును, పైనున్నబట్టను దీయఁగాఁ బెలియవచ్చు శరీరమువలెఁ దేటగ నగుపడియెను.

౭౫. అటుపై, సముద్రమునందుండు సర్పములు, సముద్రమును దాఁటుచున్న వానరోత్తముని యాకాశమునం గాంచి గరుడుఁడని తలఁచెను.

౭౬. పదియోజనముల వెడల్పును, ముప్పదియోజనముల నిడుపును గల హనుమంతుని నీడ సముద్రపు నీటిపై రమ్యమై తోఁచెను.

౭౭. లవణసముద్రమున వాయుపుత్రుండగు హనుమంతునాశ్రయించి పోవుచున్నదగు విరివిగలయాతని నీడ తెల్లని మేఘముల నడుమనున్న నీటిమబ్బువలె నగుపడియెను. (నీటిమబ్బనఁగా వర్షించుటకు సిద్ధముగానున్న నల్లని మేఘము.)

౭౮. మిక్కిలి దర్పముగలవాఁడును గొప్పశరీరముగలవాఁడును నైన నాగొప్పవానరుఁడు, ఆధారమేపాటియు లేని యాకాశమున ఱెక్కలుగల పర్వతమువలె నొప్పెను.

౭౯. వానరశ్రేష్ఠుఁడగు నాబలవంతుఁడే మార్గమున వేగముతోఁబోయెనో యామార్గము వెంటనే సముద్రము దోనెవలెఁ బల్లమై తోఁచెను.

౮౦. హనుమంతుఁడు మార్గమున, పక్షులసమూహమున నడుమనున్న పక్షిరాజువలె నేగుచు, వాయుదేవునివలె మేఘములందోలుచు నొప్పెను.

పాండు రారుణ వర్ణాని నీలమాంజిష్ఠ కానిచ।
కపినా కృష్యమాణాని మహాభ్రాణి చకాశిరే॥ ౭౧।

ప్రవిశ న్నభ్రజాలాని నిష్పతంశ్చ పునః పునః।
ప్రచ్ఛన్నశ్చ ప్రకాశశ్చ చంద్రమా ఇవ లక్ష్యతే॥ ౭౨।

ప్లవమానం తు తం దృష్ట్వా ప్లవంగం త్వరితం తదా।
వవర్షుః పుష్పవర్షాని దేవగంధర్వ దానవాః॥ ౭౩।

తతాప న హి తంసూర్యః ప్లవంతం వానరో త్తమమ్॥ ౭౪।

సిషేవేచ తదావాయూ రామకార్యార్థ సిద్ధయే।
ఋషయస్తుష్టువు శ్చైనం ప్లవమానం విహాయసమ్॥ ౭౫।

జగుశ్చ దేవగంధర్వాః ప్రశంసంతో మహౌజసమ్॥ ౭౬।

నాగాశ్చ తుష్టువు ర్యక్షా రక్షాంసి విబుధాః ఖగాః।
ప్రేక్ష్య సర్వే కపివరం సహసా విగతక్లమమ్॥ ౭౭।

తస్మిన్ ప్లవగశార్దూలే ప్లవమానే హనూమతి।
ఇక్ష్వాకుకుల మానార్థీ చింతయామాస సాగరః॥ ౭౮

సాహాయ్యం వానరేంద్రస్య యదినాహం హనూమతః।
కరిష్యామి భవిష్యామి సర్వవాచ్యో వివక్షతామ్॥ ౭౯॥

౮౧. తెలుపు నెఱుపు రంగులను, పసపువర్ణమును నీలవర్ణమునుగల మేఘములు హనుమంతునిచే నాక్రమింపఁబడి యొప్పెను.

౮౨. మేఘముల మొత్తము సంజొచ్చుచు నప్పుడప్పుడు వెలుపడుచు నాతండు, మఱుఁగుపడుచు వెలిఁబడుచున్న చంద్రునివలెఁగనంబడియె.

౮౩. అట్లెగరిచనుచున్న వానరునిఁగాంచి యప్పుడు దేవతలు గంధర్వులు దానవులును శీఘ్రముగాఁ బుష్పవాన గురిసిరి.

౮౩½. అట్లుసముద్రమును దాఁటుచున్న వానరోత్తమునికై సూర్యుండు దనవేడిమి చూపఁడయ్యెను.

౮౪½,౮౫. శ్రీరామునియొక్క కార్యము బాగుపడవలయునను నిచ్ఛతో వాయుదేవుం డాంజనేయునకనుకూలుండై మెలఁగెను. ఆకసమున దాఁటుచున్నయాతని ఋషులు స్తోత్రము నేసిరి. మిక్కిలి దర్పముగల యావానరుని దేవగంధర్వులు పొగడుచుఁ బాడిరి.

౮౬. యక్ష రాక్షసులును, దేవతలును, పక్షులును బాములును మొత్తములై బడలిక యేమాత్రములేనివాఁడగు నావానరోత్తమునిఁ గనిపొగడిరి.

౮౭. వానరశ్రేష్ఠుఁడగు నాంజనేయుండట్లు దాఁటుచుండఁగా, ఇక్ష్వాకువంశముయొక్క క్షేమమును గోరుచున్నవాఁడగు సముద్రుం డిట్లు యోచించెను.

౮౮. "వానరశ్రేష్ఠుఁడగు హనుమంతునకు నేనుసహాయముచేయనేని, లోకమున ననుకొనువారికి సర్వవిధములచేతను నిందకుఁ బాత్రుఁడనగుదును".

అహ మిక్ష్వాకునాథేన సగరేణ వివర్ధితః।
ఇక్ష్వాకు సచివ శ్చాయం నావసీదితు మర్హతి॥ ౮౯॥

తథా మయా విధాతవ్యం విశ్రమేత యథా కపిః।
శేషంచ మయి విశ్రాంత స్సుఖేనాతి పతిష్యతి॥ ౯౦॥

ఇతికృత్వా మతింసాధ్వీం సముద్రశ్ఛన్న మంభసి।
హిరణ్యానాభం మైనాక మువాచ గిరిసత్తమమ్॥ ౯౧॥

త్వమిహా సురసంఘానాం పాతాళ తలవాసినామ్।
దేవరాజ్ఞా గిరిశ్రేష్ఠ పరిఘ స్సన్నివేశితః॥ ౯౨॥
త్వమేషాం జాతవీర్యాణాం పునరేవోత్పతిష్యతామ్।
పాతాళ స్యాప్రమేయస్య ద్వార మావృత్య తిష్ఠసి॥ ౯౩॥
తిర్యగూర్ధ్వ మధశ్చైవ శక్తిస్తే శైల వర్ధితుమ్।
తస్మాత్సంచోదయామి త్వా ముత్తిష్ఠ గిరిసత్తమ॥ ౯౪॥

౮౯. “ఇక్ష్వాకు కులసంభవుఁడగు సగరచక్రవర్తిచే నేను వృద్ధి పొందింపఁ బడితిని. ఆతండో! ఆకులమువారికి మిత్రుఁడు, కావున నీతం డెంతబడలిక పొందఁదగినవాఁడు గాఁడు.

౯౦. కావున నీవానరుఁడెట్లు బడలిక తీర్చికొనఁదలంచునోయట్లు నే నమర్పవలయును. నాయందునిలిచి యలుపుదీర్చికొనునేనిఁ దక్కినత్రోవను సుఖముగఁ దాఁటఁగలండు”

౯౧. అనితలంచి మనస్సును మెత్తపఱచి, బంగారు శిఖరములుగలిగి యుదకమునం దణఁగియున్నవాఁడగు మైనాకుండనుపర్వతోత్తముని తోనిట్లనియెను.

౯౨, ౯౩, ౯౪. ఓపర్వతశ్రేష్ఠుఁడ! నీవు దేవేంద్రుని యాజ్ఞచేత, పాతాళలోకమునందు వసియించుచుండు రాక్షసులగుంపుల కినుపకట్లుగుదియవలె నుంపఁబడియున్నావు. అప్పటికప్పటికిఁ బ్రబలురై మీఁది కెగయఁ బోవు రాక్షసులకై, నీవు మితిలేనిదగు పాతాళద్వారము నడ్డగించినిలచియున్నావు. క్రిందికిని మీఁదికిని బ్రక్కలకును బెఱుగునట్టిశక్తి నీకుఁగలదు గావున నట్లుసేయ నిన్నుఁగోరెదను, పెఱుగుమా! పర్వతోత్తమా!

సఏష కపిశార్దూల స్త్వాముపర్యేతి వీర్యవాన్।
హనుమాన్ రామకార్యార్థం భీమకర్మా ఖమాప్లుతః॥ ౯౪॥

అస్యసాహ్యం మయా కార్య మిక్ష్వాకుకుల వర్తినః।
మమ హీక్ష్వాకవః పూజ్యాః పరం పూజ్యతమా స్తవ॥ ౯౫॥

కురుసాచివ్య మస్మాకం ననః కార్య మతిక్రమేత్।
కర్తవ్య మకృతంకార్యం సతాంమన్యు ముదీరయేత్॥ ౯౬॥

సలిలాదూర్ధ్వ ముత్తిష్ఠ తిష్ఠత్వేష కపి స్త్వయి।
అస్మాక మతిథిశ్చైవ పూజ్యశ్చ ప్లవతాంవరః॥ ౯౭॥

చామీకర మహానాభ దేవగంధర్వ సేవిత।
హనుమాం స్త్వయి విశ్రాంత స్తతశ్శేషం గమిష్యతి॥ ౯౮॥

కాకుత్స్థ స్యానృశంస్యం చ మైథిల్యాశ్చ వివాసనమ్।
శ్రమంచ ప్లవగేంద్రస్య సమీక్ష్యోత్థాతు మర్హసి॥ ౯౯॥

హిరణ్యనాభో మైనాకో నిశమ్యలవణాంభసః।
ఉత్పపాత జలాత్తూర్ణం మహాద్రుమ లతాయుతః॥ ౧౦౦

స సాగర జలం భిత్వా బభూ వాభ్యుత్థిత స్తదా।
యథా జలధరం భిత్వా దీప్తరశ్మి ర్దివాకరః॥ ౧౦౧॥

౯౫, ౯౬, ౯౭, ౯౮, ౯౯. శ్రీరాముని కార్యమునకై యాకాశమున కెగరుటయను భయంకరమగు కార్యముగల వానరోత్తముఁడగు నీ హనుమంతుఁడు నీమీఁదుగాఁబోవుచున్నాఁడు. ఇక్ష్వాకువంశమువారికిఁ బరిచర్యచేయుచున్న యాబలవంతునకుఁ దోడ్పడుట నాకు విధియైయున్నది. ఏలనంటివేని, ఇక్ష్వాకువంశవు రాజులందఱును నాకుఁబూజ్యులు. అట్లే నీకును బూజార్హులుసుమా! నేఁజెప్పునదిచేయుము! నామాటమీఱకుము! యోగ్యులగువారు చెప్పెడుపనిని జేయనిచో వారి కాగ్రహముగలుగును. నీటినుండి వెలువడుము. వానరుని నీపై నిలువనిమ్ము! సముద్రమును దాఁటెడువారిలో మేటియనఁ దలంపఁదగిన యీ హనుమంతుఁడు నాకతిథియుఁ బూజ్యుఁడు నగును. బంగారు శిఖరములను గలిగి, దేవగంధర్వాదులచేఁ గొలువంబడిన వాఁడ! ఈ యాంజనేయుఁడు నీపైనిలిచి యలుపుం దీర్చికొనితక్కినత్రోవ నేగంగలఁడు.

౧౦౦. శ్రీరామచంద్రునియొక్క దయాగుణమును, సీత పరదేశమున నవయుటయు, హనుమంతుఁడు శ్రమపడుటయుఁదలంచి నీవు త్వరపడి లేచుటయుక్తము (మైనాకుఁడ)

౧౦౧. బంగారు శిఖరములచే నొప్పినవాఁడగు మైనాకుండు సముద్రునిమాట లాలించి పెద్దవృక్షములతోడను తీఁగెలతోడనుగూడి నీటనుండి వేగమున వెలువడియెను.

౧౦౨. ఆమైనాకుండు, మేఘమును బ్రద్దలునేసికొని వెలువడి సూర్యుండు వెలుంగునట్లుగా నుదకమును భేదించుకొని యప్పుడు వెలువడియొప్పెను.

స మహాత్మా ముహూర్తేన పర్వత స్సలిలావృతః।
దర్శయామాస శృంగాణి సాగరేణ నియోజితః॥ ౧౦౩॥

శాతకుంభమయై శ్శృంగై స్సకిన్నర మహోరగైః।
ఆదిత్యోదయ సంకాశై రాలిఖద్భి రివాంబరమ్॥ ౧౦౪

తస్య జాంబూనదమయై శ్శృంగై స్సర్వ స్సముత్థితైః।
ఆకాశం శస్త్రసంకాశ మభవ త్కాంచనప్రభమ్॥ ౧౦౫।

జాతరూప మయైశ్శృంగై ర్భ్రాజమానై స్స్వయంప్రభైః।
ఆదిత్య శతసంకాశ స్సోభవ ద్గిరిసత్తమః॥ ౧౦౬।

త ముత్థిత మసంగేన హనుమా నగ్రతస్స్థితమ్।
మధ్యే లవణతోయస్య విఘ్నోయమితి నిశ్చితః॥ ౧౦౭॥

స త ముచ్ఛ్రిత మత్యర్థం మహావేగో మహాకపిః।
ఉరసా పాతయామాస జీమూతమివ మారుతః॥ ౧౦౮।

సతదా పాతిత స్తేన కపినా పర్వతోత్తమః।
బుద్ధ్వా తస్య కపే ర్వేగం జహర్ష చ ననంద చ॥ ౧౦౯॥

౧౦౩, ౧౦౪. గొప్పదేహముగలవాఁడును, జలముచేఁ జుట్టంబడినవాఁడును, బంగారుమయములై కిన్నరులు మొదలగు దేవతలనుగలిగి సూర్యోదయముతోఁ దుల్యములై యొప్పి యాకాశముతోడ నొరయుచున్నట్లుండు శిఖరములతోఁ గూడినవాఁడును నగు నాపర్వతశ్రేష్ఠుఁడు సముద్రుని ప్రేరణచేత శీఘ్రమునన తనశిఖరములను జూపెను.

౧౦౫. నీటినుండి యప్పుడు వెలువడినట్టియు, బంగారముయొక్క కాంతులు గ్రక్కునట్టియు పర్వతశిఖరములచేత ఖడ్గముయొక్క ఛాయ గలిగిన (నల్లనైయున్న) యాకాశము బంగారపు కాంతిని గలదయ్యెను.

౧౦౬. పయిఁడిచేఁ గలిగినవై స్వభావసిద్ధమగుకాంతిచే వెలుంగుచున్న శిఖరములనుగలిగి యాపర్వతశ్రేష్ఠుఁడు నూఱుమంది సూర్యులతోఁ దుల్యమగుకాంతిని గలవాఁడయ్యెను.

౧౦౭. ఒంటరిగా వెలువడినదియు, తనముంగనిలచినదియు, నగు పర్వతముంగాంచి హనుమంతుఁడు, 'ఇది లవణసముద్రమునడుమ గలుగు నట్టి విఘ్నము' అని నిశ్చయించికొనియెను.

౧౦౮. మిక్కిలి యున్నతింగాంచి యెదుటనిలచిన మైనాకుని, మితిలేనివేగముంగల యాహనుమంతుఁడు (వాయువు మేఘమును దోలునట్లు) ఱొమ్ముచేఁ బడనడిచెను.

౧౦౯. ఆపర్వతోత్తముఁడగు మైనాకుఁ డప్పు డావానరునిచేఁ బడఁగొట్టఁబడిన యాతనివేగము నెఱిఁగినవాఁడై పలుమాఱు సంతసించెను.

త మాకాశ గతంవీర మాకాశే సముపస్థితః।
ప్రీతో హృష్టమనా వాక్య మబ్రవీ త్పర్వతః కపిమ్॥ ౧౧౦॥

మానుషం ధారయ న్రూప మాత్మన శ్శిఖరేస్థితః॥ ౧౧౧॥

దుష్కరం కృతవా న్కర్మ త్వ మిదం వానరోత్తమ।
నిపత్య మమశృంగేషు విశ్రమస్వ యథా సుఖమ్॥ ౧౧౨॥

రాఘవస్య కులేజాతై రుదధిః పరివర్ధితః।
స త్వాం రామహితే యుక్తం ప్రత్యర్చయతి సాగరః॥ ౧౧౩॥

కృతే చ ప్రతికర్తవ్య మేషధర్మ స్సనాతనః।
సోయం తత్ప్రతికారార్థీ త్వత్త స్సమ్మాన మర్హతి॥ ౧౧౪॥

త్వన్నిమిత్త మనే నాహం బహుమానా త్ప్రచోదితః।
తిష్ఠ త్వం కపిశార్దూల మయి విశ్రమ్య గమ్యతామ్॥ ౧౧౫॥

యోజనానాం శతంచాపి కపి రేష సమాప్లుతః।
తవసానుషు విశ్రాంత శ్శేషం ప్రక్రమతా మితి॥ ౧౧౬॥

త దిదం గంధవ త్స్వాదు కందమూలఫలం బహు।
త దాస్వాద్య హరిశ్రేష్ఠ విశ్రాంతో నుగమిష్యసి॥ ౧౧౭॥

౧౧౦, ౧౧౧. ఆకాశమందున్నవాఁడును, సంతోషించినవాఁడును, మెచ్చినమనస్సు గలవాఁడునునగు మైనాకుఁడు మనుష్య రూపమును ధరించి శిఖరములపై నిలచి, యాకాశమందున్న వీరుఁడగు వానరుం గూర్చి యిట్లనెను.

౧౧౨. ఓవానరోత్తముఁడ! చేయనసాధ్యమగు నింతటిపనిని జేసినవాఁడవైతివి. నాశిఖరములపైఁ గొంతసేపునిలచినవాఁడవై బాగుగ నలసట దీర్చికొనుము.

౧౧౩. శ్రీరామునికులమునందుఁ బుట్టిన పూర్వులచేత సముద్రుఁడు వృద్ధిపొందినవాఁడు. కావున నాతండు రామకార్యమందు వర్తించిన నిన్నుఁ బూజించుచున్నాఁడు.

౧౧౪. ఒకయుపకారము చేయంబడినపుడు దానికిమాఱు సేయవలయుననుట పెద్దలమతము. పూర్వము శ్రీరామునికులమువారిచే మేలు గాంచిన యీసముద్రుఁడు మఱుమేలు నీకుఁజేయందలఁచి యున్నాఁడు. నీవాతనిగౌరవించి యుపచారముంగొనుట న్యాయము సుమా!

౧౧౫, ౧౧౬. ఈవానరుఁడు నూఱామడలదూరమును సరకుసేయక దాఁటుచున్నాఁడు. నీచరియలందుఁ గొంతసేదదీర్చికొని మిగిలినత్రోవను జననిమ్మని, నీకొఱకునేను సముద్రునిచే మన్ననతోఁ బ్రేరేరింపఁబడినవాఁడనైతిని. ఓ వానరోత్తమ నాయందునిలచి యలుపు దీర్చికొని పోవుదువుగాక.

౧౧౭. ఓవానరశ్రేష్ఠుఁడా! మీఁదఁజెప్పినట్లుగాఁ బరిమళముగలట్టియు రుచిగలట్టియుఁ దుంపలను వేళ్లను ఫలములను లెస్సగననుభవించి యలుపు దీర్చికొని పోదువు లెమ్ము!

అస్మాక మపి సంబంధః కపిముఖ్య త్వయాస్తివై।
ప్రఖ్యాత స్త్రిషు లోకేషు మహాగుణ పరిగ్రహః॥ ౧౧౮॥

వేగవంతః ప్లవంతో యే ప్లవగా మారుతాత్మజ।
తేషాం ముఖ్యతమం మన్యే త్వామహం కపికుంజర॥ ౧౧౯॥

అతిథిః కిల పూజార్హః ప్రాకృతోపి విజానతా।
ధర్మం జిజ్ఞాసమానేన కింపున స్త్వాదృశో మహాన్॥ ౧౨౦॥

త్వంహి దేవవరిష్ఠస్య మారుతస్య మహాత్మనః।
పుత్ర స్తస్యైవ వేగేన సదృశః కపికుంజర॥ ౧౨౧॥

పూజితే త్వయి ధర్మజ్ఞ పూజాం ప్రాప్నోతి మారుతః।
తస్మాత్త్వం పూజనీయో మే శృణు చాప్యత్ర కారణమ్॥ ౧౨౨॥

పూర్వం కృతయుగే తాత పర్వతాః పక్షిణోభవన్।
తేభిజగ్ము ర్దిశ స్సర్వా గరుడానిల వేగినః॥ ౧౨౩॥

తత స్తేషు ప్రయాతేషు దేవసంఘా స్సహర్షిభిః।
భూతాని చ భయం జగ్ము స్తేషాం పతన శంకయా॥ ౧౨౪॥

౧౧౮. వానరోత్తముఁడా! నీతోడ మాకగుసంబంధము గొప్పవారిచేతను నంగీకరింపఁబడినది. మూఁడు లోకములయందును బ్రసిద్ధమైనదియుఁగా నున్నదిసుమా!

౧౧౯. వాయుపుత్రుఁడవగుసో వానరోత్తమా! ఏవానరులు వేగముగలవారై దాఁటుచున్నారో, వారలలోనెల్ల మొదటివానిఁగా నిన్నెన్నెదను.

౧౨౦. ధర్మము నెఱుంగఁగోరువారిచేతను, ఎఱుఁగు చున్నవారిచేతను, నీచుఁడేనియు నతిథిగావచ్చినవాఁడు పూజార్హుఁడు గదా! ఇఁక నీబోటిదొడ్డవాఁడు పూజార్హుఁడని వేఱుగఁజెప్పవలెనా?

౧౨౧, ౧౨౨. ఓవానరోత్తమా! నీవు దేవతలలో శ్రేష్ఠుఁడును గొప్పవాఁడునునైన వాయుదేవునకుఁ బుత్రుఁడవుగదా! వేగమునను నాతనితోసమానుఁడవు. నీవు పూజింపఁబడితివేని వాయుదేవుండు పూజనుజెందినవాఁడగుచున్నాఁడు గావున నీవు నాకుఁ బూజార్హుఁడవైతివి. ఇట్లగుటకుఁ గారణముంగూడఁ జెప్పెదవినుము.

౧౨౩, ౧౨४. ఓతండ్రీ! పూర్వము కృతయుగమందుఁ బర్వతములు పక్షులవలె నన్నిదిశలయందును గరుడునియొక్కయు వాయుదేవునియొక్కయు వేగమువంటి వేగముంగలిగి యెగిరిపోవుచుండెను. అట్లు పర్వతములుపోవుచుండఁగా దేవతలసమూహములును ఋషులును సర్వభూతములును బర్వతములు తమపైఁ బడునేమోయని మిక్కిలి భయమొందెను.

తతః క్రుద్ధ స్సహస్రాక్షః పర్వతానాం శతక్రతుః।
పక్షాం శ్చిచ్ఛేద వజ్రేణ తత్రతత్ర సహస్రశః॥ ౧౨౫॥

స మాముపగతః క్రుద్ధో వజ్ర ముద్యమ్య దేవరాట్।
తతోఽహం సహసా క్షిప్త శ్శ్వసనేన మహాత్మనా॥ ౧౨౬॥

అస్మి౯ల్లవణతోయే చ ప్రక్షిప్తః ప్లవగోత్తమ।
గుప్తపక్ష సమగ్రశ్చ తవపిత్రా భిరక్షితః॥ ౧౨౭॥

తతోఽహం మానయామి త్వాం మాన్యోహి మమమారుతః।
త్వయా మే హ్యేష సంబంధః కపిముఖ్య మహాగుణః॥ ౧౨౮॥

అస్మిన్నేవం గతే కార్యే సాగరస్య మమైవచ।
ప్రీతిం ప్రీతమనాః కర్తుం త్వ మర్హసి మహాకపే॥ ౧౨౯॥

శ్రమం మోక్షయ పూజాంచ గృహాణ కపిసత్తమ।
ప్రీతించ బహుమన్యస్వ ప్రీతోఽస్మి తవదర్శనాత్॥ ౧౩౦॥

ఏవముక్తః కపిశ్రేష్ఠ స్తం నగోత్తమ మబ్రవీత్।
ప్రీతోఽస్మి కృత మాతిథ్యం మన్యు రేషోఽపనీయతామ్॥ ౧౩౧॥

త్వరతే కార్యకాలో మే అహశ్చాప్యతివర్తతే।
ప్రతిజ్ఞాచ మయాదత్తా నస్థాతవ్య మిహాంతరే॥ ౧౩౨॥

౧౨౫, ౧౨౬. వేయి యజ్ఞములం జేసినవాఁడగు దేవేంద్రుఁడు పర్వతములు భీతిల్లుటంగని కొండలపైనలిగి వాని ఱెక్కలను జూచినచోట నెల్ల ముక్కలువడ నఱికెను. అట్టియింద్రుఁడు నన్నునుగని కోపించి వజ్రము నెత్తికొని చేరవచ్చెను, కాని యదృష్టవశమున నేను బుహాత్ముఁడగు వాయుదేవుని కృపచే శీఘ్రమున నిటుచిమ్మఁబడితిని.

౧౨౭, ౧౨౮. ఓవానరోత్తమ యీలవణసముద్రమునఁ ద్రోయంబడినవాఁడనై ఱెక్కలుగాపాడుకొని, కొదువలేనివాఁడనుగా నీతండ్రిచే రక్షింపఁబడితిని. కావుననే నిన్ను నేను గౌరవించుచున్నాఁడను. నీజనకుండు నాకుఁ బూజ్యుఁడుగదా! ఓవానరోత్తమ! నీతోడనాకుఁగలిగిన యీసంబంధము మిక్కిలియోగ్యమైనది.

౧౨౯. ఓమహాత్ముఁడ! నేనుజెప్పినట్లుగా నతిథిపూజనంగీకరించి సంతోషించినవాఁడవై నాకును సముద్రమునకును సంతోషమునుగలిగించుట తగును.

౧౩౦. వానరోత్తమ! అలుపునుదీర్చికొనుము! పూజనంగీకరింపుము! సఖ్యము నాదరింపుము! నినుంగనుటచే సంతోషించితిని.

౧౩౧, ౧౩౨. ఇట్లుపలుకంబడినవాఁడై హనుమంతుఁడుపర్వతముతో నిట్లనియె. ఓమైనాక! అతిథిపూజ చేయంబడినట్లే తలంపుము. నీవు కోపమునుమానుము. నాకుంగలకార్యము నన్నుఁద్వరపెట్టుచున్నది. దినము పూర్తియగుచున్నది. మార్గమధ్యముననిలువనని ప్రతిజ్ఞ చేసికొనియున్నాను.

ఇత్యుక్త్వా పాణినా శైల మాలభ్య హరిపుంగవః।
జగా మాకాశ మావిశ్య వీర్యవా న్ప్రహసన్నివ॥ ౧౩౩॥

సపర్వత సముద్రాభ్యాం బహుమానా దవేక్షితః।
పూజిత శ్చోపపన్నాభి రాశీర్భి రనిలాత్మజః॥ ౧౩౪॥

అథోర్ధ్వం దూర ముత్పత్య హిత్వా శైల మహార్ణవౌ।
పితుః పంథాన మాస్థాయ జగామ విమలేంబరే॥ ౧౩౫॥

భూయ శ్చోర్ధ్వగతిం ప్రాప్య గిరిం త మవలోకయన్।
వాయుసూను ర్నిరాలంబే జగామ విమలేంబరే॥ ౧౩౬॥

తద్ద్వితీయం హనుమతో దృష్ట్వా కర్మ సుదుష్కరమ్।
ప్రశశంసు స్సురా స్సర్వే సిద్ధాశ్చ పరమర్షయః॥ ౧౩౭॥

దేవతా శ్చాభవన్ హృష్టా స్తత్రస్థా స్తస్యకర్మణా।
కాంచనస్య సునాభస్య సహస్రాక్షశ్చ వాసవః॥ ౧౩౮॥

ఉవాచ వచనం ధీమాన్ పరితోషా త్సగద్గదమ్।
సునాభం పర్వతశ్రేష్ఠం స్వయమేవ శచీపతిః॥ ౧౩౯॥

హిరణ్యనాభ శైలేంద్ర పరితుష్టోస్మి తే భృశమ్।
అభయం తే ప్రయచ్ఛామి తిష్ఠ సౌమ్య యథాసుఖమ్॥ ౧౪౦॥

సాహ్యం కృతం తే సుమహా ద్విక్రాంతస్య హనూమతః।
క్రమతో యోజనశతం నిర్భయస్య భయే సతి॥ ౧౪౧॥

రామ స్యైష హి దౌత్యేన యాతి దాశరథే ర్హరిః।
సత్క్రియాం కుర్వతా తస్య తోషితోస్మి దృఢం త్వయా॥ ౧౪౨॥

౧౩౩,౧౩౪,౧౩౫,౧౩౬. బలవంతుఁడును వానరోత్తముఁడును నగునాతఁడు మీఁదఁజెప్పంబడినట్లుపలికి చిఱునగవుతోఁబర్వతమునుబట్టుకొని, వదలి, యాకాశమునుబొంది చనియెను. ఆతఁడు పర్వతసముద్రములచే మిక్కిలి యాదరముతోఁ జూడఁబడి తగినదీవెనలచేఁ బూజింపఁబడి, అనంతరము వారలనువిడిచి మీఁదికెగిరి నిర్మలమగు నాకాశమున వాయుమార్గమునుబొంది మరలి మరలి పర్వతసముద్రములంగనుచు నిరాధారమగు నాకసమునఁ జనియెను.

౧౩౭. దేవతలందఱును, సిద్ధులును, ఋషిశ్రేష్ఠులు నాంజనేయుని యొక్క, చేయనలవికానిదగు (మైనాకుని ముట్టుటయను) నారెండవపనిని జూచి పొగడి తమలోఁ జెప్పికొనిరి.

౧౩౮, ౧౩౯. బంగారు శిఖరములుగలవాఁడగు మైనాకునియొక్క కార్యముచే నందున్న దేవతలు సంతోషించిరి. వేయికన్నులు గలవాఁడగు నింద్రుండు నానందించెను. బుద్ధిమంతుఁడగు దేవేంద్రుండు సంతోషముచే వడఁకుచున్న మాటలుగలవాఁడై మంచిశిఖరముగలవాఁడగు మైనాకుంగూర్చి తానే యిట్లనియె.

౧౪౦,౧౪౧,౧౪౨. బంగారుశిఖరములను గలవాఁడవగు నో పర్వతోత్తమా! నీయెడల మిక్కిలిసంతోషించినవాఁడను. సాధుస్వభావము గలవాఁడా! నీకునే నభయమునిచ్చుచున్నాను. సౌఖ్యముగా నుండుము. నాకు నీవు భయపడువాఁడవైనను, నిర్భయుఁడై నూఱామడలదూరమును దాఁటఁబోవుచున్నవాఁడగు హనుమంతునకు నీచేత సహాయముచేయంబడియెను. ఈతఁడు దశరథపుత్రుఁడగు శ్రీరామునికార్యమునకై చనుచున్నాఁడుగావున నట్టివానికి నుపచారముచేసిననీవలన మిక్కిలి సంతోషము గలవాఁడనైతిని.

తతః ప్రహర్ష మగమ ద్విపులం పర్వతోత్తమః।
దేవతానాం పతిం దృష్ట్వా పరితుష్టం శతక్రతుమ్॥ ౧౪౩॥
సవై దత్తవర శ్శైలో బభూవా వస్థిత స్తదా
హనుమాంశ్చ ముహూర్తేన వ్యతిచక్రామ సాగరమ్॥ ౧౪౪॥
తతో దేవా స్సగంధర్వా స్సిద్ధాశ్చ పరమర్షయః।
అబ్రువన్ సూర్యసంకాశాం సురసాం నాగమాతరమ్॥ ౧౪౫॥
అయం వాతాత్మజ శ్శ్రీమాన్ ప్లవతే సాగరోపరి।
హనుమా న్నామ తస్య త్వం ముహూర్తం విఘ్నమాచర॥
రాక్షసం రూప మాస్థాయ సుఘోరం పర్వతోపమమ్।
దంష్ట్రాకరాళం పింగాక్షం వక్త్రం కృత్వానభస్సమమ్॥ ౧౪౬॥
బల మిచ్ఛామహే జ్ఞాతుం భూయ శ్చాస్య పరాక్రమమ్।
త్వాం విజేష్య త్యుపాయేన విషాదం వా గమిష్యతి॥ ౧౪౭॥
ఏవ ముక్తా తు సా దేవీ దైవతై రభిసత్కృతా।
సముద్ర మధ్యే సురసా బిభ్రతీ రాక్షసం వపుః॥ ౧౪· ॥
వికృతం చ విరూపం చ సర్వస్య చ భయావహమ్।
ప్లవమానం హనూమంత మావృ త్యేద మువాచహ॥ ౧౫౦॥
మమ భక్షః ప్రదిష్ట స్త్వ మీశ్వరై ర్వానరర్షభ।
అహం త్వాం భక్షయిష్యామి ప్రవిశేదం మమాననమ్॥ ౧౫౧॥

౧౪౩. అటుపైఁ బర్వతోత్తముఁడు దేవతలకుఁ బ్రభుఁడగు నింద్రుని సంతోషించినవానిఁగా నెఱింగి తానును మిక్కిలి యానందము నొందెను.

౧౪౪. ఇంద్రునిచే నట్లువరముం బొందిన మైనాకుఁడు నెమ్మదినుండెను. స్వల్పకాలముననే హనుమంతుఁడు సముద్రమున నానెలవులు దాఁటి పైపై చనియెను.

౧౪౫, ౧౪౬, ౧౪౭, ౧౪౮. అంతట గంధర్వులును దేవతలును సిద్ధులును మహర్షులును, సూర్యుని కాంతివంటి కాంతినిగలదియగు సురసయను నాగమాతను (సర్పములతల్లిని) గాంచి "తేజోవంతుడును వాయుపుత్రుఁడునగు హనుమంతుఁడను నతండు సముద్రముపై దాఁటుచున్నవాఁడు, కోఱలచే భయంకరమైనదియుఁ బచ్చనికన్నులుగలదియునగు ముఖమునుగలిగి యాకాశమునంటునట్టియుఁ బర్వతముంబోలునట్టియు భయంకరమగు రాక్షసరూపమునుబొందికొంతకాలము విఘ్నము సేయుము. అతండుపాయముచే నిన్ను జయించునో నీచేతఁజిక్కి దుఃఖించునో! ఆతనిబలపరాక్రమముల నెఱుంగుటకు మిక్కిలికోరుచున్నాము. అని చెప్పిరి.

౧౪౯, ౧౫౦, ౧౫౧. ఆసురస దేవతలచే నిట్లుపలుకఁబడినదియు నాదరింపఁబడినదియునై సముద్రమధ్యమున సర్వభూతములకును భయంకరమగు, వికారమై విరూపమైన రాక్షసదేహమునుధరించి హనుమంతునడ్డగించి, వానరోత్తమా! దైవముచే నీవు నాకాహారముగాఁ జూపంబడితివి. నిన్ను నేను భక్షించెదను, నానోటఁ బ్రవేశింపుము" అని పలికెను.

ఏవముక్త స్సురసయా ప్రాంజలి ర్వానరర్షభః।
ప్రహృష్టవదన శ్రీమా నిదంవచన మబ్రవీత్॥ ౧౫౨॥

రామో దాశరథి ర్నామ ప్రవిష్టో దండకావనమ్।
లక్ష్మణేన సహభ్రాత్రా వైదేహ్యా చాపి భార్యయా॥ ౧౫౩॥

అన్యకార్య విషక్తస్య బద్ధవైరస్య రాక్షసైః।
తస్య సీతా హృతా భార్యా రావణేన యశస్వినీ॥ ౧౫౪॥

తస్యా స్సకాశం దూతోఽహం గమిష్యే రామశాసనాత్।
కర్తు మర్హసి రామస్య సాహ్యం విషయవాసినీ॥ ౧౫౫॥

అథవా మైథిలీం దృష్ట్వా రామం చాక్లిష్టకారిణమ్।
ఆగమిష్యామి తేవక్త్రం సత్యం ప్రతిశృణోమి తే॥ ౧౫౬॥

ఏవముక్తా హనుమతా సురసా కామరూపిణీ।
అబ్రవీ న్నాతివర్తేన్మాం కశ్చి దేషవరో మమ॥ ౧౫౭॥

౧. (తంప్రయాంతం సముద్వీక్ష్య సురసా వాక్య మబ్రవీత్।
బలం జిజ్ఞాసమానా వై నాగమాతా హనూమతః॥

౨. ప్రవిశ్య వదనం మేద్య గంతవ్యం వానరోత్తమ।
వర ఏష పురాదత్తో మమ ధాత్రేతి సత్వరా॥

౨౪. వ్యాదాయ వక్త్రం విపులం స్థితా సా మారుతేః పురః।

౧౫౩నుండి ౧౫౬ వఱకు. కాంతివంతుఁడును వానరోత్తముఁడు నగు నాతండు సురసచే నట్లుపలుకంబడినవాఁడై చేతులుమోడ్చి నగుమోముతోడ నిట్లనియెను. దశరథునిపుత్త్రుఁడగు శ్రీరాముఁ డనునాతండు తమ్ముఁడగు లక్ష్మనితోడను భార్యయగు సీతతోడను దండకారణ్యమునం జొచ్చెను. రాక్షసులతో విరోధించియున్న యాతండు మారీచుని ఖండించుట యను పనికై యేగియుండఁగా కీర్తివంతురాలగు నాతనిభార్య సీతాదేవి రావణునిచేఁ గొనిపోఁబడియెను. శ్రీరామునియాజ్ఞచేత, సీతాదేవియుండు చోటును వెదకికొనుచు నేనుదూతనై పోవుచున్నాఁడను. శ్రీరాము రాజ్యమందున్నదానవుగావునఁ బ్రభుఁడగునాతనికిఁ దోడ్పడుటన్యాయము. అట్లుకాదేనియు నేను సీతాదేవినిఁ, సంకటములహరింవాఁడగు శ్రీరామునిం జూచివచ్చి నీనోటంబడియెదను. ఇది సత్యమని తలంపుము.

౧౫౭. ఇట్లు హనుమంతునిచేఁ బలుకఁబడినదై కామరూపముంగలదియగు సురస " నన్నుమీఱియీమార్గమున నెవండును బోఁగూడదనట్లు వరముంగొనియున్నదాన " ననియెను.

౧, ౨, ౨౪. పాతాళమందలిసర్పములతల్లియగు సురసచనుచున్నవాఁడగు హనుమంతుంగాంచి, యాతనిబలము నెఱుంగఁగోరినదై యిట్లనియె. వానరోత్తమ! ఇప్పుడు నానోటంజొచ్చి మఱిపోఁదగుదువు. పూర్వమిట్లని బ్రహ్మదేవునిచే నాకువరమీయంబడియెనని చెప్పుచుఁ దననోటిం వేగము నందెఱచి వాయుపుత్త్రున కెదుట నిలచెను.

౩. ఏవ ముక్త స్సురసయా క్రుద్ధో వానరపుంగవః॥
౪. అబ్రవీ త్కురుషై వక్త్రం యేన మాం విషహిష్యసే।
ఇత్యుక్త్వా సురసాం క్రుద్ధో దశయోజన మాయతః॥
౪౧, దశయోజన విస్తారో బభూవ హనుమాం స్తదా।
౫. తం దృష్ట్వా మేఘసంకాశం దశయోజన మాయతమ్॥
చకార సురసా చాస్యం వింశ ద్యోజన మాయతమ్॥
౬. హనుమాంస్తు తతః క్రుద్ధ స్త్రింశద్యోజన మాయతః।
చకార సురసా వక్త్రం చత్వారింశ త్తథోచ్ఛ్రితమ్॥
౭. బభూవ హనుమా న్వీరః పంచాశ ద్యోజనోచ్ఛ్రితః।
చకార సురసా వక్త్రం షష్టియోజన మాయతమ్॥
౮. తథైవ హనుమా న్వీర స్సప్తతీ యోజనోచ్ఛ్రితః।
చకార సురసా వక్త్ర మశీతీ యోజనాయతమ్॥
౯. హనుమా నచలప్రఖ్యో నవతీ యోజనోచ్ఛ్రితః।
చకార సురసా వక్త్రం శతయోజన మాయతమ్॥
౧౦. తద్దృష్ట్వా వ్యాదితం వక్త్రం వాయుపుత్ర స్సుబుద్ధిమాన్।
దీర్ఘజిహ్వం సురసయా సుఘోరం నరకోపమమ్॥
సంక్షిప్య చాత్మనః కాయం జీమూత ఇవమారుతిః।
తస్మిన్ ముహూర్తే హనుమాన్ బభూవాంగుష్ఠమాత్రకః౧౫౮॥
సో భిప త్యాశు తద్వక్త్రం నిష్పత్యచ మహాజవః।
అంతరిక్షే స్థిత శ్శ్రీమా నిదంవచన మబ్రవీత్॥ ౧౫౯॥

(౩,౪,౪౪) సురసచే నిట్లుపలుకంబడినవాఁడై హనుమంతుఁడు కోపించి, ఏనోటిచేత నన్ను మ్రింగెదవో దానిం దెఱువుమా! అనియె. అని సురసనుగూర్చి పలికి కోపించి యాంజనేయుఁడు పదియోజనముల పొడవును లావును గలవాఁడుగా నప్పుడయ్యెను.

(౫,౬,౭,౮,౯,౧౦) మేఘమువలె నున్నవాఁడును, పదియోజనముల నిడువుగలవాఁడును నగు నాతనిం గాంచి, సురస యిరువదియోజనముల వెడల్పుగాఁదననోరు తెఱచెను. హనుమంతుఁడును గోపించినవాఁడై ముప్పదియోజనముల దేహము గలవాఁడయ్యెను, తోడన సురసయుఁ దననోటినంత వెడల్పుగాఁదెఱచెను. ఇట్లు సురసయు నాంజనేయుఁడును బరసర్పముకోపించిరి. ఆంజనేయుఁడు దేహము నేకొలఁదికిఁబెంచినను సురసయు నంతమేఱకుఁ దననోటిని దెఱచుచుండెను. ఇట్లగుచుండఁగా హనుమంతుఁడు దనమేను తొంబదియోజనముల నిడివిగలదిచేసెనుగాని తోడనె సురసయు నూఱుయోజనముల వెడల్పుగఁ దననోరుదెఱచెను.

(౧౫౮, ౧౫౯) బుద్ధిమంతుఁడగు హనుమంతుఁడు, నిడుపగునాలుకంగలిగి, తెఱువంబడి భయంకరమై నరకముతోఁ దుల్యముగనున్న సురసనోటినిఁగాంచి, తన దేహము మేఘమువలె గుఱుచపఱచి యప్పుడె వ్రేలెడుప్రమాణముగలవాఁడయ్యెను. అట్లు సూక్ష్మదేహముతో శీఘ్రమున సురసనోటంబడి తోడన వెలువడి వెలుంగుచున్నవాఁడై యాకాశమున నిలచి యిట్లుపలికెను.

ప్రవిష్టోస్మి హి తే వక్త్రం దాక్షాయణి నమోస్తు తే।
గమిష్యే యత్ర వైదేహీ సత్యశ్చాసీ ద్వర స్తవ॥ ౧౬౦॥
తం దృష్ట్వా వదనా న్ముక్తం చంద్రం రాహుముఖా దివ।
అబ్రవీ త్సురసా దేవీ స్వేన రూపేణ వానరమ్॥ ౧౬౧॥
అర్థసిద్ధ్యై హరిశ్రేష్ఠ గచ్ఛ సౌమ్య యథాసుఖమ్।
సమానయస్వ వైదేహీం రాఘవేణ మహాత్మనా॥ ౧౬౨॥
త త్తృతీయం హనుమతో దృష్ట్వా కర్మ సుదుష్కరమ్।
సాధు సాధ్వితి భూతాని ప్రశశంసు స్తదా హరిమ్॥ ౧౬౩॥
స సాగర మనాధృష్య మభ్యేత్య వరుణాలయమ్।
జగా మాకాశ మావిశ్య వేగేన గరుడోపమః॥ ౧౬౪॥
సేవితే వారిధారాభిః పతగైశ్చ నిషేవితే।
చరితే కైశికాచార్యై రైరావత నిషేవితే॥ ౧౬౫॥
సింహకుంజర శార్దూల పతగోరగ వాహనైః।
విమానై స్సంపతద్భి శ్చ విమలై స్సమలంకృతే॥ ౧౬౬॥
వజ్రాశని సమాఘాతైః పావకై రుపశోభితే।
కృతపుణ్యై ర్మహాభాగై స్స్వర్గజిద్భి రలంకృతే॥ ౧౬౭॥
వహతా హవ్యమత్యర్థం సేవితే చిత్రభానునా।
గ్రహనక్షత్ర చంద్రార్క తారాగణ విభూషితే॥ ౧౬౮॥

(౧౬౦, ౧౬౧, ౧౬౨) దక్షుని పుత్రికఁ వగు నోతల్లీ! నీ నోటఁ జొచ్చినవాఁడనైతినిగదా! నీకు మ్రొక్కుచున్నాఁడను. నేను సీతాదేవియుండుచోటున కేగెదను. నీవరమునకు భంగము లేదయ్యెనుగదా! రాహుముఖమునుండి వెలువడినచంద్రునివలెఁ దన నోటనుండి వెలువడినహనుమంతుం గని, తన పూర్వరూపమును ధరించినదై సురస యిట్లనియెను. సాధుఁడవగు నో వానరోత్తమా! కార్యము సాధించుకొఱకు సౌఖ్యముగా నేగుము. సీత నుదెచ్చి మహాత్ముఁడగు రాఘవునితోఁ జేర్పుము.

(౧౬౩) అట్లు సురస నోటనుండి వెలువడుటయను నసాధ్యమగు మూఁడవపని నాంజనేయుఁడు నేయుటంగని భూతములన్నియు బాగుబాగని యాతనింగూర్చి లెస్సగఁ జెప్పికొనియెను.

(౧౬౪) గరుడుని వేగమువంటి వేగమునుగలవాఁడగు నాతండు దాఁటరానిదియు, వరుణున కునికిపట్టయినదియు నగు సముద్రమును విడచి యాకాశమున కెగరి చనియెను.

(౧౬౫నుండి౧౭౧వఱకు) నీటిధారలనుగలదియుఁ బక్షులకాశ్రయమైనదియు, తుంబురు నారదాదులచే సంచరింపఁబడినదియు, ఇంద్రునివాహనమగు నైరావతముచే సేవింపఁబడునదియు, సింగములు పులులు నేనుంగులు పక్షులు సర్పములును వాహనములుగాఁ గలవారిచేతను దిరుగాడుచున్న కాంతిగల విమానములచేతను బాగుగ నలంకరింపఁబడినదియు, పిడుగులయొక్కయు వజ్రాయుధముయొక్కయుఁ దాఁకులచేఁ బుట్టినయగ్నిచే వెలుఁగుచున్నదియు, మిక్కిలి పుణ్యములుచేసి స్వర్గమునుజయించిన మహాత్ములచే నలంకరింపఁబడినదియు, దేవతలతృప్తికై తనయందు సమర్పింపఁబడిన హవ్యములధరించియున్న యగ్నిహోత్రునిచే నాశ్రయింపఁబడినదియు,

మహర్షిగణ గంధర్వ నాగయక్ష సమాకులే।
వివిక్తే విమలే విశ్వే విశ్వావసు నిషేవితే॥ ౧౭౯॥
దేవరాజ గజాక్రాంతే చంద్రసూర్యపథే శివే।
వితానే జీవలోకస్య వితతే బ్రహ్మనిర్మితే॥ ౧౮౦॥
బహుశ స్సేవితే వీరై ర్విద్యాధరగణై ర్వరైః।
జగామ వాయుమార్గే తు గరుత్మా నివ మారుతిః॥ ౧౮౧॥
(హనుమా న్మేఘజాలాని ప్రకర్ష న్మారుతో యథా।
కాలాగరు సవర్ణాని నీల రక్తసితానిచ॥
కపినాకృష్యమాణాని మహాభ్రాణి చకాశిరే।
ప్రవిశ న్నభ్రజాలాని నిష్పతంశ్చ పునఃపునః॥
ప్రావృషీందు రివాభాతి నిష్పతన్ ప్రవిశం స్తదా)
సదృశ్యమాన స్సర్వత్ర హనుమా న్మారు తాత్మజః।
భేజేంబరం నిరాలంబం లంబపక్ష ఇవాద్రిరాట్॥ ౧౮౨॥
ప్లవమానం తు తం దృష్ట్వా సింహికానామ రాక్షసీ।
మనసా చింతయామాస ప్రవృద్ధా కామరూపిణీ॥ ౧౮౩॥
అద్య దీర్ఘస్య కాలస్య భవిష్యా మ్యహ మాశితా।
ఇదం హి మే మహత్సత్వం చిరస్య వశమాగతమ్॥ ౧౮౪॥
ఇతి సంచింత్య మనసా ఛాయా మస్య సమాక్షిపత్॥ ౧౮౫॥
ఛాయాయాం గృహ్యమాణాయాం చింతయామాస వానరః॥
సమాక్షిప్తోస్మి సహసా పంగూకృత పరాక్రమః।
ప్రతిలోమేన వాతేన మహానౌరివ సాగరే॥ ౧౮౬॥

అంగారకాది గ్రహములు నశ్విని మొదలగు నక్షత్రములు సూర్యచంద్రులు చుక్కలమొత్తములు వీనిచే నందమైయున్నదియు, యోగ్యులగు ఋషులు గంధర్వులు నాగులు యక్షులు ననువారిచేనిండి తెఱపలేకున్నదియు, విశ్వావసుండను గంధర్వరాజుచే నుపయోగింపఁబడుచున్నదియు, దేవతలలోఁ బ్రభువులగు దిక్పాలకులగజములచే నాక్రమింపఁబడినదియు, చంద్రసూర్యులమార్గమైనదియు, ఇంపైనదియు, జంతుజాలమునకెల్ల మేల్కట్టయినదియు, విశాలమైనదియు, దర్పముగలవారును శ్రేష్ఠులునునైన విద్యాధరులచేఁ దఱుచుగ నాశ్రయింపఁబడినదియునగు నాకాశమున, గరుత్మంతునివలె నాంజనేయుం డేగెను.

(కృష్ణాగరుంబోలెను నీలరక్తశ్వేతవర్ణములం గలవిగను నుండెడు మహామేఘములు వానరుని వేగముచేఁ జలించినవై పెనుగాలిచేఁదోలంబడిన మొయిళ్లవలె నొప్పెను మఱియు నామేఘములలోఁ జొచ్చుచువెలువడుచు వర్షర్తువందలి చంద్రునివలె హనుమంతుండు వెలింగెను.)

౧౭౨. వాయుపుత్రుండగు నాహనుమంతుఁడన్ని దిక్కుల కగపడుచున్నవాఁడై, వ్రేలుచున్న ఱెక్కలుగల పెనుకొండవలె నాకాశముం జెందెను.

౧౭౩. అట్లు గగనమునంజనుచున్న యాతనింగాంచి సింహికయను రక్కసి, దేహమును బెంచి మనంబున నిట్లుతలంచె.

౧౭౪, ౧౭౪½ దీర్ఘకాలమునుండి యాహారమెఱుఁగని నే నిప్పుడు భక్షించునంతటి భాగ్యమబ్బెను. యెద్దియో పెద్దజంతు విపుడు నాకుల్లోఁబడుచున్నది!" అని మనస్సునందలంచి యాతనినీడను బట్టెను.

౧౭౫, ౧౭౬. ఆసింహికచేత నీడ పట్టఁబడెనది కాఁగా నావానరుఁడు, 'ఎదురుగాలిచేఁ జిక్కువడిన యోడవలె దర్పము నెడి శీఘ్రము నఁబట్టువడిన వాఁడ నైతిని.'

తిర్యగూర్ధ్వ మధశ్చైవ వీక్షమాణ స్తతః కపిః।
దదర్శ స మహత్సత్త్వ ముత్థితం లవణాంభసి॥ ౧౭౭॥
త ద్దృష్ట్వా చింతయామాస మారుతి ర్వికృతాననమ్।
కపిరాజ్ఞా యదాఖ్యాతం సత్త్వ మద్భుత దర్శనమ్॥ ౧౭౮॥
ఛాయాగ్రాహి మహావీర్యం త దిదం నాత్ర సంశయః॥ ౧౭౮½
స తాం బుద్ధ్వా ర్థతత్త్వేన సింహికాం మతిమా న్కపిః॥
వ్యవర్ధత మహాకాయః ప్రావృషీవ వలాహకః॥ ౧౭౯½
తస్యసా కాయ ముద్వీక్ష్య వర్ధమానం మహాకపేః॥ ౧౮౦॥
వక్త్రం ప్రసారయామాస పాతాళాంతర సన్నిభమ్।
ఘనరాజీవ గర్జంతీ వానరం స మభిద్రవత్॥ ౧౮౧॥
స దదర్శ తత స్తస్యా వివృతం సుమహ న్ముఖమ్।
కాయమాత్రం చ మేధావీ మర్మాణిచ మహాకపిః॥ ౧౮౨॥
స తస్యా వివృతే వక్త్రే వజ్రసంహననః కపిః।
సంక్షిప్య ముహు రాత్మానం నిష్పపాత మహాబలః॥ ౧౮౩॥
ఆస్యే తస్యా నిమజ్జంతం దదృశు స్సిద్ధచారణాః।
గ్రస్యమానం యథాచంద్రం పూర్ణం పర్వణి రాహుణా॥౧౮౪।
తత స్తస్యా నఖై స్తీక్ష్ణై ర్మర్మా ణ్యుత్కృత్య వానరః।
ఉత్పపా తాథ వేగేన మనస్సంపాత విక్రమః॥ ౧౮౫।

౧౭౭, ౧౭౮, ౧౭౮½ అనుచుఁ గ్రిందను మీఁదను బ్రక్కలను జూచుచుండి యీసముద్రమునుండి వెలువడిన పెనుభూతమును గాంచెను. సుగ్రీవునిచే దనకుఁ జెప్పఁబడినట్లు భయంకరమగు మోముగలదియు, ఆశ్చర్యకరముగ నగపడుచున్నదియునగు భూతమును జూచి, నీడనుబట్టునదియు మహాబలముగలదియు నిద్దియే సుమా! సందేహము లేదు. అని తలంచెను.

౧౭౯½. ఆబుద్ధిమంతుఁడగు నాతండు దానిని వాస్తవముగా నెఱింగి వానకాలమందు మేఘుఁడు దేహమును బెంచునటుల శరీరమును బెంచెను.

౧౮౦, ౧౮౧. <u>ఆసింహిక</u> హనుమంతునియొక్క పెరుగుచున్న మేనుం గాంచి పాతాళగర్భముతో సమముగనున్న ముఖమును దెఱచెను. మేఘముల సమూహమువలె ధ్వనించుచు వానరునిమీఁదికిఁ బరుగెత్తెను.

౧౮౨, ౧౮౩. బుద్ధిమంతుఁడగు నావానరశ్రేష్ఠుఁడు సింహికయొక్క తెఱువఁబడిన నోటిని, శరీరప్రమాణమును, ఆయములను జూచెను. వజ్రముతోఁ దుల్యమైన శరీరమునుగల బలవంతుఁడగు నావానరుఁడు దన మేను మిక్కిలి ముడుచుకొని దాని నోటం బడెను.

౧౮౪. పున్నమనాఁటి చంద్రుఁడు రాహువుచే మ్రింగఁబడినట్లు రాక్షసస్త్రీయొక్క నోటంబడి మునుంగుచున్న హనుమంతుని సిద్ధులును, చారణులును గాంచిరి.

౧౮౫. అటుపిమ్మట మనస్సుతో సమానమగు వేగముగలవాఁడగు వానరుఁడు దానియొక్క ప్రాణముండు నెలవులను దనకఱకుగల గోళ్లచేఁ బ్రద్దలుచేసి వేగమున వెలువడియెను.

తాం తు దృష్ట్వా చ ధృత్వాచ దాక్షిణ్యేన నిపాత్యచ।
స కపిప్రవరో వేగా ద్వవృధే పున రాత్మవాన్॥ ౧౮౬॥

హృతహృత్సా హనుమతా పపాత లవణాంభసి॥ ౧౮౭॥
తాం హతాం వానరేణాశు పతితాం వీక్ష్య సింహికామ్।

భూతా న్యాకాశచారీణి త మూచుః ప్లవగర్షభమ్॥ ౧౮౮॥

భీమ మద్యకృతం కర్మ మహత్సత్త్వం త్వయా హతమ్।
సాధయార్థ మభిప్రేత మరిష్టం ప్లవతాంవర॥ ౧౮౯॥

యస్య త్వేతాని చత్వారి వానరేంద్ర యథా తవ।
ధృతి ర్దృష్టి ర్మతి ర్దాక్ష్యం స్వకర్మసు న సీదతి॥ ౧౯౦॥

స తైః స్సంభావితః పూజ్యః ప్రతిపన్న ప్రయోజనః।
జగా మాకాశ మావిశ్య పన్నగాశనవ త్కపిః॥ ౧౯౧॥

ప్రాప్త భూయిష్ఠ పారస్తు సర్వతః ప్రతిలోకయన్।
యోజనానాం శతస్యాంతే వనరాజిం దదర్శ సః॥ ౧౯౨॥

దదర్శ చ పతన్నేవ వివిధద్రుమ భూషితమ్।
ద్వీపం శాఖామృగ శ్రేష్ఠో మలయోపవనానిచ॥ ౧౯౩॥

౧౮౬, ౧౮౬½ బుద్ధిమంతుఁడగు నావానరోత్తముఁ డారక్కసిని ... వుచేతను ధైర్యముచేతను నేర్పుచేతను బడఁగూల్చి శీఘ్రమునఁ బెరిగె ను. గుండె బ్రద్దలగుటచే నదిమడిసి సముద్రమునఁబడియెను.

౧౮౭½. వానరునిచేఁ గొట్టఁబడి వేగమునఁబడుచున్నదియగు సిం హికనుజూచి యాకాశమందు సంచరించుచున్న భూతములు హనుమంతు నితోనిట్లనియెను.

౧౮౮½. ఓవానరశ్రేష్ఠుఁడ! ఇప్పుడుచేయంబడిన కార్యముభయం కరమైనది. పెనుభూతమొక్కటి నీచేఁజచ్చెను. కోరఁబడినదగు శుభము ను సాధించికొమ్ము!

౧౮౯½. ఓవానరోత్తమా! నీవలెనే యెవనికి ధైర్యము యోచన నేర్పు, సమర్థత గలుగునో వాఁడు దనపనులయందుఁ జెడఁడు.

౧౯౦½. పూజ్యుఁడగు నావానరుఁడు వారలచే గౌరవింపఁబడి, కార్యములలో వెనుదగులక సాధించి యాకాశమును జెంది గరుడునివలె నేగెను.

౧౯౧½. అతండునూఱామడలేగి విశాలమైన యెదటిగట్టునుబొంది నవాఁడగుచు, నలుదిక్కులంజూచుచు వనములచాలును గాంచెను.

౧౯౨½. కోఁతులలో శ్రేష్ఠుఁడగునాతండు పోవుచుండియె నానా విధములగు వృక్షములచే నలంకరింపఁబడిన ద్వీపమును, మలయమునందలి యుద్యానవనములవంటి వనములను గాంచెను.

సాగరం సాగరానూపం సాగరానూపజాన్ ద్రుమాన్।
సాగరస్య చ పత్నీనాం ముఖాన్యపి విలోకయన్॥ ౧౯౩
స మహామేఘసంకాశం సమీక్ష్యాత్మాన మాత్మవాన్।
నిరుంధంత మివాకాశం చకార మతిమా న్మతిమ్॥ ౧౯౪
కాయవృద్ధిం ప్రవేగంచ మమ దృష్ట్వైవ రాక్షసాః।
మయి కౌతూహలం కుర్యు రితి మేనే మహాకపిః॥ ౧౯౫
తత శ్శరీరం సంక్షిప్య తన్మహీధర సన్నిభమ్।
పునః ప్రకృతి మాపేదే వీతమోహ ఇవాత్మవాన్॥ ౧౯౬
తద్రూప మతిసంక్షిప్య హనుమాన్ప్రకృతౌ స్థితః।
త్రీన్క్రమా నివ విక్రమ్య బలివీర్యహరో హరిః॥ ౧౯౭
సచారునానావిధ రూపధారీ పరంసమాసాద్య సముద్రతీరమ్।
పరై రశక్యః ప్రతిపన్నరూప స్సమీక్షితాత్మా సమవేక్షితార్థః॥
తత స్సలంబస్య గిరే సమృద్ధే విచిత్రకూటే నిపపాతకూటే।
సకేతకోద్దాలక నారికేళే మహాద్రికూటప్రతిమో మహాత్మా॥

తత స్తు సంప్రాప్య సముద్రతీరమ్।
సమీక్ష్య లంకాం గిరివర్యమూర్ధ్ని
కపి స్తు తస్మి న్నిపపాత పర్వతే
విధూయ రూపం వ్యథయన్ మృగద్విజాన్॥ ౨౦౦

౧౯౩వ, ౧౯౪వ. బుద్ధిమంతుఁడగు నాతఁడు సముద్రమును, దానిగట్టుననున్న భూములను, వానియందుఁబుట్టిన ప్రాఁకులను, సముద్రుని భార్యలగు నదులయొక్క ముఖద్వారములను గాంచుచు, గొప్పమేఘముతోఁ దుల్యమై యాకాశము నడ్డగింపఁజాలిన దానివలెనున్న తనమేనుంగాంచి మనస్సున నిట్లుయోచించెను.

౧౯౫వ, ౧౯౬వ. రాక్షసులు నాదేహముయొక్క పెంపును వేగమును జూచి నన్ను బ్రేమింతురుగదా యని యాపెద్దవానరుఁడు దలఁచెనుగాని, వెంటనే మోహమును ద్యజించు వివేకివలె, పర్వతమువంటి మేనును సంగ్రహించి తనతొల్లింటి యాకృతి నందెను.

౧౯౭వ. హనుమంతుఁడు మూఁడడుగుల నునిచి బలిచక్రవర్తియొక్క దర్పమునుహరించిన శ్రీహరివలెఁ దనరూపమును గుఱుచగాఁ జేసి యెప్పటియట్లుండెను.

౧౯౮వ. సొంపైన నానావిధములైన రూపములనుధరించినవాఁడును, శత్రువులకు గెలువరానివాఁడును నగు నాతఁడు తనయెప్పటిరూపమును బొంది సముద్రపునవతలిగట్టును జేరి తనుందానుజూచికొనుచుఁగార్యముం గూర్చి యోచించుచుండెను.

౧౯౯వ. గొప్పపర్వతశిఖరముతోఁ దుల్యుఁడును, సమర్థుఁడును నైన హనుమంతుఁడు ప్రేలుచున్నదియగు పర్వతముయొక్క విశాలమయి యనేకములగు చిన్నచిన్నశిఖరములతోఁగూడి, మొగిలిమొదలగు ననేకవృక్షములచేనొప్పిన శిఖరమందు దిగియెను.

౨౦౦వ. అటుపై నాంజనేయుఁడు సముద్రతీరముం జేరి పర్వతముపైనున్న లంకనుగాంచి శరీరమును విదిలించుచు మృగములను బక్షులను భయపెట్టుచు నాపర్వతమునం దుమికెను.

శాద్వలాని చ నీలాని గంధవంతి వనానిచ।
పుష్పవంతిచ మధ్యేన జగామ నగవంతి చ॥ ౬॥

శైలాం శ్చ తరుసంఛన్నా న్వనరాజీశ్చ పుష్పితాః।
అభిచక్రామ తేజస్వీ హనుమాన్ ప్లవగర్షభః॥ ౭॥

స తస్మి న్నచలే తిష్ఠన్ వనా న్యుపవనానిచ।
స నగాగ్రేచ తాం లంకాం దదర్శ పవనాత్మజః॥ ౮॥

సరళా న్కర్ణికారాం శ్చ ఖర్జూరాం శ్చ సుపుష్పితాన్।
ప్రియాళూ న్ముచుళిందాం శ్చ కుటజా న్కేతకా నపి॥ ౯॥

ప్రియంగూ న్గంధపూర్ణాంశ్చ నీపాన్ సప్తచ్ఛదానపి।
పనసా న్కోవిదారాం శ్చ కరవీరాం శ్చ పుష్పితాన్॥ ౧౦॥

పుష్పభా రావ నద్ధాంశ్చ తథా ముకుళితా నపి।
పాదపా న్విహగాకీర్ణాన్ పవనోద్ధూత మస్తకాన్॥ ౧౧॥

హంస కారండ వాకీర్ణా వాపీః పద్మోత్పలాయుతాః।
ఆక్రీడా న్వివిధా న్రమ్యాన్ వివిధాంశ్చ జలాశయాన్॥ ౧౨॥

సంతతా న్వివిధై ర్వృక్షై స్సర్వర్తు ఫలపుష్పితైః।
ఉద్యానాని చ రమ్యాణి దదర్శ కపికుంజరః॥ ౧౩॥

సమాసాద్య చ లక్ష్మీవాన్ లంకాం రావణపాలితామ్।
పరిఖాభి స్సపద్మాభి స్సోత్పలాభి రలంకృతామ్॥ ౧౪॥

౬, ౭, ౮. పచ్చనిబయళ్లనుగలిగి, నల్లనై పరిమళముంగలిగి, పెద్దబండలనుగలిగి, కొండలనుగలిగియున్న వనములంగనుచు నాతండేగెను. చెట్లచేఁ గప్పంబడిన కొండలయందును, నిండారఁబూచిన వనములసమూహమందును, తేజోవంతుఁడును వానరోత్తముఁడు నగు హనుమంతుఁ డెల్లయెడల సంచరించెను. అతం డాపర్వతమందు నిలచినవాఁడై వనములనుద్యానవనములను బర్వతశిఖరముతోఁ గూడినలంకను గాంచెను.

౯, నుండి ౧౩, వఱకు. బాగుగఁ బుష్పించిన దేవదారు, కొండగోగు ఖర్జూరపుచెట్లను, నిమ్మ మొగలి మొదలగుచెట్లను, పరిమళము వెదచల్లుచున్న కడిమిచెట్లను, ఏడాకుల యనఁటిచెట్లను, పనస కొండగోగుచెట్లను, పూచినట్టి గన్నేరు మొదలగుచెట్లను. పువ్వులమొగ్గల భారముచేవంగి పక్షులమొత్తములచేనొప్పి, గాలిచేఁ దూలఁగొట్టఁబడిన కొమ్మలంగలిగిన వృక్షములను, కమలములు కలువలుంగలిగి, హంసలు మొదలగు నీటిపక్షులచే నొప్పిన బావులను, నానావిధములై రమ్యములైన రాజసంచార యోగ్యస్థలములను, అనేకవిధములగు నీటిపట్లను, అన్నిఋతువులయందును ఫలపుష్పములనుగలిగిన నానావిధములగు వృక్షములతోఁగూఁడినరమ్యములగు నుద్యానవనములను వానరోత్తముఁడగు నాతండు గాంచెను.

౧౪, నుండి ౧౮, వఱకు. కమలములతోడనుగలువలనుతోడనుగూడినవియగునగడ్తలచేత నలంకరింపఁబడినదియు రావణునిచేనేలంబడినదియు నగు లంకాపట్టణమునుబొంది, సీతనుహరించుటను బ్రయోజనముగాఁగాంచిన రావణునిచేతను, భయంకరములగు ధనుస్సులతోసంచరించుచున్న రాక్షసులచేతను రక్షింపఁబడినదియు, బంగారు ప్రాకారములచేతను, ఎత్తగు

సంపూర్ణాం రాక్షసై ర్ఘోరై ర్నాగై ర్భోగవ తీమివ।
అచింత్యాం సుకృతప్రఖ్యాం కుబేరాధ్యుషితాం పురీమ్॥ ౨౪॥
దంష్ట్రిభి ర్బహుభి శ్శూరై శ్శూల పట్టస పాణిభిః।
రక్షితాం రాక్షసై ర్ఘోరై ర్గుహా మాశీవిషై రివ॥ ౨౫॥
తస్యాశ్చ మహతీం గుప్తిం సాగరం చ నిరీక్ష్య సః।
రావణం చ రిపుం ఘోరం చింతయామాస వానరః॥ ౨౬॥
ఆగత్యాపీహ హరయో భవిష్యంతి నిరర్థకాః।
న హి యుద్ధేనవై లంకా శక్యా జేతుం సురైరపి॥ ౨౭॥
ఇమాం తు విషమాం దుర్గాం లంకాం రావణపాలితామ్।
ప్రాప్యాపి స మహాబాహుః కింకరిష్యతి రాఘవః॥ ౨౮॥
అవకాశో నసాంత్వస్య రాక్షసే ష్వభిగమ్యతే।
న దానస్య న భేదస్య నైవ యుద్ధస్య దృశ్యతే॥ ౨౯॥
చతుర్ణామేవ హి గతి ర్వానరాణాం మహాత్మనామ్।
వాలిపుత్రస్య నీలస్య మమ రాజ్ఞశ్చ ధీమతః॥ ౩౦॥
యావ జ్జానామి వైదేహీం యది జీవతివా నవా।
తత్రైవ చింతయిష్యామి దృష్ట్వా తాం జనకాత్మజామ్॥ ౩౧॥
తత స్స చింతయామాస ముహూర్తం కపికుంజరః।
గిరిశృంగే స్థిత స్తస్మిన్ రామ స్యాభ్యుదయే రతః॥ ౩౨॥

యు, బాగుగఁగట్టంబడినదియు, నిర్మలమైనదియు, కుబేరుఁడు నివసించి నదియు, శూలములు, ఈటెలు మొదలగునవి ధరించి నిడుపులగు కో ఱలుగల శూరులచేతను, గుహనుగాచియున్న సర్పములవలె భయంకరులై న రాక్షసులచేతను రక్షింపఁబడినదియైనలంకను, దానికి దుర్గమువలె మి క్కిలిప్రాపైయున్న సముద్రమును, భయంకరుండగు రావణుఁడనుశత్రునిఁ జూచి హనుమంతుఁ డిట్లుయోచించెను.

౨౭. వానరు లిచటికివచ్చియుఁబ్రయోజనములేనివారగుదురు. ఈ లంక యుద్ధముచేనైనను దేవతలకును లోఁబడునదికాదు.

౨౮. చదరముగాక, ఘోర నితరులకశక్యమై రావణునిచే రక్షింపఁ బడినదియగు నీలంకకువచ్చియు బలశాలియగు శ్రీరాముఁ డేమి సేయంగ లవాఁడు.

౨౯. ఈరాక్షసులయందుమంచితనమునకవకాశములేదు. ఇచ్చు టకును, వారిస్నేహితులలో విరోధముగల్గించుటకును, వారితోయుద్ధమునకు ను గొంచెమేనియు వీలుగలుగదు.

౩౦. సమర్థులగువానరులలో వాలిపుత్రునకునునీలునకును నాకును బుద్ధిమంతుఁడగు సుగ్రీవునకును మాత్రమే యిందురాఁగలుగును. తక్కినవా రు రానేరరు.

౩౧, ౩౨. సీతాదేవి బ్రదికియున్నదో లేదో! నేనెప్పుడెటుంగుదు నో! ఆమెబ్రదికియున్నయెడలఁ గనుంగొని యచ్చటనే యోచించెదను. అటుపై హనుమంతుఁడుకొంతసే పాపర్వతశిఖరమున నేనిలచి శ్రీరామునిక్షే మమునం దాసక్తిగలవాఁడై యోచించెను.

అనేన రూపేణ మయా నశక్యా రక్షసాం పురీ।
ప్రవేష్టుం రాక్షసై ర్గుప్తాం క్రూరై ర్బలసమన్వితైః॥ ౩౩॥
ఉగ్రౌజసో మహావీర్యా బలవంతశ్చ రాక్షసాః।
వంచనీయా మయా సర్వే జానకీం పరిమార్గతా॥ ౩౪॥
లక్ష్యాలక్ష్యేణ రూపేణ రాత్రౌ లంకాపురీ మయా।
ప్రవేష్టుం ప్రాప్తకాలో మే కృత్యం సాధయితుం మహత్॥ ౩౫॥
తాం పురీం తాదృశీం దృష్ట్వా దురాధర్షాం సురాసురైః।
హనుమాం శ్చింతయామాస వినిశ్వస్య ముహుర్ముహుః॥ ౩౬॥
కేనోపాయేన పశ్యేయం మైథిలీం జనకాత్మజామ్।
అదృష్టో రాక్షసేంద్రేణ రావణేన దురాత్మనా॥ ౩౭॥
న వినశ్యే ద్యథా కార్యం రామస్య విదితాత్మనః।
ఏకా మేకశ్చ పశ్యేయం రహితే జనకాత్మజామ్॥ ౩౮॥
భూతా శ్చార్థా విపద్యంతే దేశకాల విరోధితాః।
విక్లబం దూతమాసాద్య తమ స్సూర్యోదయే యథా॥ ౩౯॥
అర్థానర్థాంతరే బుద్ధి ర్నిశ్చితాపి న శోభతే।
ఘాతయంతి హి కార్యాణి దూతాః పండితమానినః॥ ౪౦॥
న వినశ్యే త్కథం కార్యం వైక్లబ్యం న కథం భవేత్।
లంఘనం చ సముద్రస్య కథం ను న వృథా భవేత్॥ ౪౧

౩౩, ౩౪. నిర్దయులును బలవంతులునగు రాక్షసులచేరక్షింపఁబడి నదియగు నీరాక్షసపట్టణము నీరూపముతోడనే చొచ్చుటకు నాకసాధ్యము రాక్షసులు భయంకరమగు ప్రతాపమును బలమునుగలవారు. వీరందఱును జానకిని వెదకుచున్న నాచేత మోసపుచ్చంబడఁ దగినవారు.

౩౫. లంకాపురము నేనితరులకుఁ గనఁబడకుండునట్టి రూపముచే రాత్రివేళ నాచేఁ జూడఁబడఁదగినది. దొడ్డదియగునాపనినిసాధించికొనుటకై యందుఁ బ్రవేశింప నద్దియె కాలము.

౩౬ నుండి ౪౭ వఱకు. దేవతలకును రాక్షసులకును జొరనశక్యమైనదియు, మీఁదఁజెప్పఁబడినట్లు భయంకరమైనదియు నగు నాపురముం జూచిహనుమంతుఁడు సీతనువెదకుచొప్ప నిశ్చయించికొనియిట్లుయోచించెను. పాపాత్ముండగు రావణుఁడను నీరాక్షస రాజునకగపడక, జనకరాజపుత్రికయగు సీతాదేవిని నేనేయుపాయముచేఁ జూడందగును మహాపురుషుండగు శ్రీరామునియొక్క కార్యమెట్లు చెడకుండును. ఎవ్వరునులేనపు డామెను నేనొక్కండ నెట్లు చూడఁగలుగును. కార్యములు తప్పకలోఁబడునవి యైనను దూతలతెలివిలేమిచే దేశకాలవిరోధములు చెంది సూర్యోదయముచేఁజీఁకటిచెడునట్లు నశించుచున్నవి. ఇదితగునిదితగదని నిశ్చయింపఁబడిన బుద్ధియుఁబ్రయోజనపడుటలేదు. ఏలనన వారిదూతలు తాముసమర్థులమని గర్వించి కార్యముంజెఱుచుచున్నారు. కార్యమెట్లుచెడకుండును, బుద్ధిహీనత నాకెట్లుగలుగకుండును. సముద్రమును దాటుటయు నెట్లువ్యర్థ

మయి దృష్టే తు రక్షోభీ రామస్య విదితాత్మనః।
భవేద్వ్యర్థ మిదం కార్యం రావణానర్థ మిచ్ఛతః॥ ౩౨।
నహిశక్యం క్వచిత్ స్థాతు మవిజ్ఞాతేన రాక్షసైః।
అపి రాక్షసరూపేణ కిముతాన్యేన కేనచిత్॥ ౩౩।
వాయుర ప్యత్ర నజ్ఞాత శ్చరే దితి మతిర్మమ।
నహ్యస్త్యవిదితం కించి ద్రాక్షసానాం బలీయసామ్। ౩౪।
ఇహాహం యదితిష్ఠామి స్వేనరూపేణ సంవృతః।
వినాశ ముపయాస్యామి భర్తురర్థశ్చ హీయతే॥ ౩౫।
తదహం స్వేనరూపేణ రజన్యాం హ్రస్వతాం గతః।
లంకా మభిపతిష్యామి రాఘవ స్యార్థసిద్ధయే॥ ౩౬।
రావణస్య పురీంరాత్రౌ ప్రవిశ్య సుదురాసదామ్।
విచిన్వన్భవనం సర్వం ద్రక్ష్యామి జనకాత్మజామ్॥ ౩౭।
ఇతిసంచింత్య హనుమాన్ సూర్య స్యాస్తమయంకపిః।
ఆచకాంక్షే తదావీరో వైదేహ్యా దర్శనోత్సుకః॥ ౩౮।
సూర్యేచాస్తంగతే రాత్రౌ దేహం సంక్షిప్య మారుతిః।
పృషదంశక మాత్రస్సన్ బభూ వాద్భుత దర్శనః॥ ౩౯।
ప్రదోషకాలె హనుమాం స్తూర్ణ ముత్ప్లుత్య వీర్యవాన్।
ప్రవివేశ పురీంరమ్యాం సువిభక్త మహాపథామ్॥ ౪౦।

ము గాకుండును. నేను రాక్షసులచేఁ జూడఁబడుదునేని, రావణునిచేతను గోరుచున్నట్టియు, సమర్థుఁడగునట్టియు శ్రీరాముని కార్యము వ్యర్థమగును. రాక్షసరూపమును ధరించియైనను మఱియెటులైనను రాక్షసులకుఁదెలియక నిలుచుట నాకుశక్యముకాదుగదా! వాయుదేవుఁడుంగూడ వీరికిఁ దెలియక యిందుసంచరింపనేరఁడని నేనుదలంచెదను. బలవంతులగు రాక్షసులకుఁదెలియని దెద్దియు నిందుండదు. ఇందు నేను నారూపముతోడనేయున్నచో నాశముందుదును. నాప్రభుని కార్యమును జెడిపోవును. కావున నేను నారూపమును గుఱుచపఱచి, కార్యమును సాధించుటకై లంకయందు రాత్రివేళ సొచ్చెదను. చొరఁగూడనిదియగు నీరావణునిపట్టణమును రాత్రివేళ సొచ్చి యన్నియిండ్లయందును వెదకి జానకిని గాంతును.

౪౮, ౪౯. ఇట్లని యోచించి వీరుఁడగు హనుమంతుఁడు సీతనుజూడఁగోరుచున్నవాఁడై యప్పుడు సూర్యాస్తమయమగుటనుగోరెను. సూర్యుఁడస్తమించి రాత్రికాఁగనె యాతండు దేహమును గుఱుచపఱచి పిల్లియంతమేనుగలవాఁడై వింతగ నగపడినవాఁ డయ్యెను.

౫౦. బలవంతుండగు హనుమంతుఁడు సూర్యుఁడస్తమించుసమయమున శీఘ్రమున నెగసి పెద్దపెద్ద బాటలనుగల రమ్యమగు నాపట్టణమునఁ జొచ్చెను.

ప్రాసాదమాలావితతాం స్తంభైః కాంచన రాజతైః।
శాతకుంభమయై ర్జాలై ర్గంధర్వనగరోపమామ్॥ ౫౧॥
స ప్తభౌ మాష్టభౌమైశ్చ సదదర్శ మహాపురీమ్।
తలై స్స్ఫటిక సంకీర్ణైః కా ర్తస్వర విభూషితైః॥ ౫౨॥
వైడూర్య మణిచిత్రైశ్చ ముక్తాజాల విరాజితైః।
తలై శ్శుశుభిరే తాని భవనా న్యత్ర రక్షసామ్॥ ౫౩॥
కాంచనాని విచిత్రాణి తోరణాని చ రక్షసామ్।
లంకాముద్యోతయామాసుః సర్వత స్సమలంకృతామ్॥ ౫౪॥
అచింత్యామద్భుతాకారాం దృష్ట్వా లంకాంమహాకపిః।
ఆసీ ద్విషణ్ణో హృష్ట శ్చ వై దేహ్యా దర్శనోత్సుకః॥ ౫౫॥
స పాండరోద్విద్ధ విమానమాలినీం మహార్హ జాంబూనద
జాలతోరణామ్ యశస్వినీం రావణబాహుపాలితాం క్షపా
చరై ర్భీమబలై స్సమావృతామ్॥ ౫౬॥
చంద్రోపిసాచివ్యమివాస్యకుర్వన్తారాగణైర్మధ్యగతోవిరాజన్।
జ్యోత్స్నావితానేన వితత్యలోక ముత్తిష్ఠతేనైకసహస్రరశ్మిః॥
శంఖప్రభంక్షీరమృణాళవర్ణముద్గచ్ఛమానంవ్యావభాసమానమ్
దదర్శచంద్రం సహరిప్రవీరః పోప్లూయమానం సరసీవ హంసమ్॥

ఇతి శ్రీమత్సుందరకాండే - ద్వితీయస్సర్గః.

౫౧, ౫౨. బంగారము వెండివీనిచేఁ జేయఁబడిన స్తంభములతోడను, గవాక్షములతోడను గూడిన గొప్పమేడల బారులచే విశాలమైనదియు గంధర్వనగరముతోఁ బోలినదియు, స్ఫటికములను బఱచి బంగారము చేత నలంకరింపఁబడిన ప్రదేశమునుగల యేడెనిమిది యంతస్థుల మేడలతోఁ గూడినదియగు మహాపట్టణము నాతండు గాంచెను.

౫౩, ౫౪. ఆలంకయందు రాక్షసులయిండ్లు పచ్చలచేవింతగఁబని చేయఁబడి ముత్తెపుసరులచేనలంకరింపఁబడి వెలుంగుచున్నప్రదేశములచేఁ బ్రకాశించెను. బంగారముచేతనే చేయంబడిన వింతలగు, రాక్షస గృహముల వెలుపలిద్వారములు చక్కగనంతటఁ నలంకరింపఁబడియున్న లంకా పట్టణమును బ్రకాశింపఁ జేసెను.

౫౫, ౫౬, వర్ణింపఁ దరముగానిదియు, ఆశ్చర్యకరమగు రూపముంగలదియు, తెల్లనై వెలుంగుచున్న విమానములను గలదియు, ఇంపగు బంగారుగవాక్షములను వెలుపలిద్వారములను గలదియు, కీర్తిగలదియు, రావణునిచే రక్షింపఁబడినదియు, భయంకరమైన బలముగలరాక్షసులతోఁ గూడినదియునగులంకను వానరోత్తముఁడగు నాతండుగాంచి మిక్కిలి చింతించెను. సీతనుజూచు నుత్సాహముచే సంతోషించెను.

౫౭, ౫౮. చంద్రుఁడు నాతనికి మేలుచేయువాఁడై తన కాంతులచే లోకమెల్ల వెలిఁగించి నక్షత్రములకు నడుమనుండి వెలింగినవాఁడై తానునాతనికి సాహాయ్యము చేయువానివలెఁ బెక్కుకిరణములతో నుదయించుచున్నాఁడు. శంఖమువలెఁ బాలవలెఁ దామరతూడువలెఁ దెల్లనైన వానిని, ప్రకాశించుచు మీఁదికిఁ బోవుచున్నవానిని జంద్రుని వానరోత్తముఁడుసరస్సునందిరుగుచున్న హంసనుగాంచినట్లుగాంచెను.

ఇది రెండవ సర్గ.

తప్తహాటక నిర్యూహై రాజతామల పాండురైః॥ ౯

వైడూర్యకృత సోపానైః స్ఫాటికాంతర పాంసుభిః।
చారు సంజవనోపేతైః ఖమివోత్పతితైః శ్శుభైః॥ ౧౦

క్రౌంచ బర్హిణ సంఘుష్టై రాజహంస నిషేవితైః।
తూర్యాభరణ నిర్ఘోషై స్సర్వతః ప్రతినాదితామ్॥ ౧౧

వస్వోకసారా ప్రతిమాం సమీక్ష్య నగరీంతతః।
ఖమివోత్పతితాం లంకాం జహర్ష హనుమాన్కపిః॥ ౧౨

తాం సమీక్ష్య పురీం రమ్యాం రాక్షసాధిపతే శ్శుభామ్।
అనుత్తమా మృద్ధిమతీం చింతయామాస వీర్యవాన్॥ ౧౩

నేయమన్యేన నగరీ శక్యా ధర్షయితుం బలాత్।
రక్షితా రావణబలై రుద్యతాయుధ ధారిభిః॥ ౧౪

కుముదాంగదయో ర్వాపి సుషేణస్య మహాకపేః।
ప్రసిద్ధేయం భవే ద్భూమి ర్మైంద ద్వివిదయోరపి॥ ౧౫

వివస్వత స్తనూజస్య హరేశ్చ కుశపర్వణః।
ఋక్షస్య కేతుమాలస్య మమచైవ గతిర్భవేత్॥ ౧౬

సమీక్ష్యతు మహాబాహూ రాఘవస్య పరాక్రమమ్।
లక్ష్మణస్య చ విక్రాంత మభవ త్ప్రీతిమాన్ కపిః॥ ౧౭

గు దిండ్లుగలవియు, వెండిపనిచే నిర్మలమగు తెల్లదనముగలవియు, వైడూర్యముల మెట్లనుగలవియు, స్ఫటికములధూళులను గలవియు, చక్కఁగఁబక్షులు తీర్పంబడియున్నవియు, ఆకాశమున కెగరఁబోవునట్లున్నవియు, క్రౌంచములు నెమళ్లు వీని విశేషధ్వనిగలవియు రాజహంసలచేత నాశ్రయింపఁబడినవియు నైన ద్వారములనుగలదియు, వాద్యములయొక్కయు సొమ్ములయొక్కయు మ్రోతలచేనంతటను బ్రతిధ్వనిని గలదియు, దేవేంద్రుని రాజధానికి సాటియైనదియు, ఆకాశము నందికొనఁగోరుచున్నదాయేమి యని సంశయించుటకుఁజాలిన యెత్తునుగలదియు నగు లంకాపురమును వానరుండు గాంచి సంతోషించెను.

౧౩, ౧౪, ౧౫, ౧౬. బలవంతుఁడగు నాంజనేయుఁడు, రమ్యమైనదియు, శుభమైనదియు, తనకంటెమించినది గలుగనిదియు, సకలసంపదలు గలదియునగు రావణుపురముంగాంచి యిట్లుతలంచెను. మీఁది కెత్తిపట్టంబడిన యాయుధములను ధరించియున్న రావణుని సేనలచే రక్షింపఁబడినది యగు నీనగరి యితరులకు గెలువసాధ్యముగాదు. కుముదాంగదులకును మహావానరుఁడగు సుషేణునకును మైందద్వివిదులకు నీచోటు రాఁదగినది. సూర్యపుత్రుఁడగు సుగ్రీవునకును, కుశపర్వునకును, ఋక్షునకును, కేతుమాలునకును నాకును మాత్ర మీచోటు నడువంగూడినది యగును.

౧౭. మిక్కిలి భుజబలముగలవాఁడగు హనుమంతుఁడు మీఁదఁజెప్పంబడినట్లు వెలిచియు శ్రీరామునిబలమును లక్ష్మణుని దర్పమును దలంచి సంతోషించెను.

తాం రత్నవసనోపేతాం గోష్ఠాగారావతంసకామ్।
యన్త్రాగారస్తనీ మృద్ధాం ప్రమదామివ భూషితామ్॥ ౧౮॥
తాం నష్టతిమిరాం దీప్తై ర్భాస్వరైశ్చ మహాగృహైః।
నగరీం రాక్షసేంద్రస్య దదర్శ స మహాకపిః॥ ౧౯॥
అథ సా హరిశార్దూలం ప్రవిశంతం మహాబలమ్।
నగరీ స్వేనరూపేణ దదర్శ పవనాత్మజమ్॥ ౨౦॥
సా తం హరివరం దృష్ట్వా లంకా రావణపాలితా।
స్వయమే వోత్థితా తత్ర వికృతానన దర్శనా॥ ౨౧॥
పురస్తా త్కపివర్యస్య వాయుసూనో రతిష్ఠత।
ముంచమానా మహానాద మబ్రవీ త్పవనాత్మజమ్॥ ౨౨॥
క స్త్వం కేన చ కార్యేణ ఇహప్రాప్తో వనాలయ।
కథయ స్వేహ య త్తత్వం యావ త్ప్రాణా ధరిష్యసి॥ ౨౩॥
న శక్యా ఖల్వియం లంకా ప్రవేష్టుం వానర త్వయా।
రక్షితా రావణబలై రభిగుప్తా సమంతతః॥ ౨౪॥
అథ తా మబ్రవీ ద్వీరో హనుమా నగ్రత స్థితామ్।
కథయిష్యామి తే త త్త్వం యన్మాం త్వం పరిపృచ్ఛసి॥ ౨౫॥
కా త్వం విరూపనయనా పురద్వారే వతిష్ఠసి।
కిమర్థం చాపి మాం రుద్ధ్వా నిర్భర్త్సయసి దారుణా॥ ౨౬॥

౧౮, ౧౯. రత్నములకాంతు లనువస్త్రమును ధరించినదియు, పశువులకొట్టము లను కర్ణాభరణములు (చెవులసొమ్ములు) గలదియు. యంత్రములయిండ్లను స్తనములను గలదియునై యందమగు పడుచువలె నలంకరింపఁబడినదియు, ప్రకాశించుచున్న గృహములయొక్క కాంతులచేతఁ జెడి నచీఁకటినిగలదియు నగురావణునిపురమును వానరోత్తముఁడగు నాతండు గాంచెను.

౨౦, ౨౧, ౨౨. అటుపై నాపురమందుఁ బ్రవేశించుచున్న మహాబలుఁడగు వానరోత్తమునికా లంకతనరూపముతోడనె కాంచెను. రావణుని చేఁబాలింపఁబడు నాలంకాదేవి వానరోత్తముంగని వికారమగు మోముతోడ తానే లేచినదై వాయుపుత్రుని ముందునిలచెను. హనుమంతునిఁజూర్చి గంభీరముగ నిట్లనియెను.

౨౩, ౨౪. ఓవానరుఁడ! నీవెవ్వఁడవు? ఇచ్చటి కేలవచ్చితివి? నీవు ప్రాణములను గలిగియుండు కొద్దికాలములోనే వాస్తవమును దెలియఁబలుకుము. రావణుని సేనలచే నంతటను జుట్టఁబడి రక్షింపఁ బడుచున్నయీలంకయందుఁ జొచ్చుటకు నీవలనఁ గానేరదుసుమా!

౨౫, ౨౬. అని లంకయడుగఁగా వీరుండగు హనుమంతుఁడు దన యెదుటనున్న దానితో నిట్లనియెను. 'నీవు నన్నడుగుచున్నావు గావున నీతో సత్యమే చెప్పెదనుగాని, ఈపురమువాకిట వికారమగు కన్నులతోని లచియున్ననీ వెవ్వతెవు? భయంకరురాలవైనన్నడ్డగించి యేలనిందించెదవు?

హనుమ ద్వచనం శ్రుత్వా లంకా సా కామరూపిణీ।
ఉవాచ వచనంక్రుద్ధా పరుషం పవనాత్మజమ్॥ ౨౭॥
అహం రాక్షసరాజస్య రావణస్య మహాత్మనః।
ఆజ్ఞా ప్రతీక్షా దుర్ధర్షా రక్షామి నగరీ మిమామ్॥ ౨౮॥
న శక్యా మా మవజ్ఞాయ ప్రవేష్టుం నగరీ త్వయా।
అద్య ప్రాణైః పరిత్యక్త స్స్వప్స్యసే నిహతో మయా॥ ౨౯॥
అహంహి నగరీ లంకా స్వయమేవ ప్లవంగమ।
సర్వతః పరిరక్షామి హ్యేతత్తే కథితం మయా॥ ౩౦॥
లంకాయా వచనంశ్రుత్వా హనుమా న్మారు తాత్మజః।
యత్నవాన్ స హరిశ్రేష్ఠ స్థిత శ్శైల ఇవా పరః॥ ౩౧॥
స తాం స్త్రీరూపవికృతాం దృష్ట్వా వానరపుంగవః।
ఆబభాషే థ మేధావీ సత్వవాన్ ప్లవగర్షభః॥ ౩౨॥
ద్రక్ష్యామి నగరీం లంకాం సాట్ట ప్రాకార తోరణామ్।
తదర్థ మిహ సంప్రాప్తః పరం కౌతూహలం హి మే॥ ౩౩॥
వనా న్యుపవనా నీహ లంకాయాః కాననాని చ।
సర్వతో గృహముఖ్యాని ద్రష్టు మాగమనం హి మే॥ ౩౪॥
తస్య తద్వచనం శ్రుత్వా లంకా సా కామరూపిణీ।
భూయఏవ పునర్వాక్యం బభాషే పరుషాక్షరమ్॥ ౩౫॥

౨౭. అని హనుమంతుఁ డడుగఁగా విని లంక కామరూపమును ధరించి కోపించి యాతనితోఁ గఠినముగా నిట్లు లనియె.

౨౮, ౨౯, ౩౦. నేను మహాత్ముండను రాక్షసరాజునగు రావణుని యాజ్ఞ ననుసరించి యితరుల కసాధ్యనై యీపురిని రక్షించుదానను, నాకుఁదెలియక యిందుఁజొర నీకసాధ్యము. నాచేఁగొట్టఁబడి ప్రాణముల నువదలి యిప్పుడు నిద్రింతువు చూడుము, వానరుఁడా! నేనేలంకను. అంతటను జక్కఁగరక్షించుచున్నాను. ఇది నాచరిత్రము, నీకుఁ దెలియంజెప్పితిని.

౩౧, ౩౨. వాయుపుత్త్రుండు లంకయాడినమాటలువిని యోచించుచుఁ గదలమెదలక కొండవలె నూరకుండెను. అట్లుండి ధైర్యవంతుఁడును బుద్ధిమంతుఁడును నగు నాతండు వికారపు నాఁడురూపముంగల దానిఁగని యిట్లనియెను.

౩౩, ౩౪. కోటలు, కోటలమీఁదియిండ్లు వాకిండ్లు గలిగి యందమైన లంకానగరమును జూడవలయునని మిక్కిలియాశతో నిందువచ్చితిని. ఇందలివనములు, ఉద్యానవనములు, ప్రసిద్ధమగు గృహములుఁ జూచుటకే నేనువచ్చితిని జుమా!

౩౫, ౩౬. అని యాంజనేయుఁడువల్కినమాటవిని కామరూపమును గలదియగులంక యాతనిమాటలకుత్తరముగా బిగ్గరఁగఠినముగా నిట్లు

మా మనిర్జిత్య దుర్బుద్ధే రాక్షసేశ్వర పాలితామ్।
నశక్యా హ్యద్య తే ద్రష్టుం పురీయం వానరాధమ॥ ౩౬॥

తత స్స కపిశార్దూల స్తా మువాచ నిశాచరీమ్।
దృష్ట్వా పురీ మిమాం భద్రే పున ర్యాస్యే యథాగతమ్॥ ౩౭॥

తతః కృత్వా మహానాదం సా వై లంకా భయావహమ్।
తలేన వానర శ్రేష్ఠం తాడయామాస వేగితా॥ ౩౮॥

తత స్స కపిశార్దూలో లంకయా తాడితో భృశమ్।
ననాద సుమహానాదం వీర్యవా న్పవనాత్మజః॥ ౩౯॥

తత స్సంవర్తయామాస వామహ స్తస్య సోంగుళీః।
ముష్టినా భిజఘానైనాం హనుమానో్క్రోధ మూర్ఛితః॥ ౪౦॥
స్త్రీచేతి మన్యమానేన నాతి క్రోధ స్స్వయంకృతః॥ ౪౧॥

సా తు తేన ప్రహారేణ విహ్వలాంగీ నిశాచరీ।
పపాత సహసా భూమౌ వికృతానన దర్శనా॥ ౪౧॥

తతస్తు హనుమా న్ప్రాజ్ఞ స్తాందృష్ట్వా వినిపాతితామ్।
కృపాం చకార తేజస్వీ మన్యమానః స్త్రియంతు తామ్॥ ౪౨॥

తతో వై భృశ సంవిగ్నా లంకా సా గద్గదాక్షరమ్।
ఉవా చాగర్వితం వాక్యం హనుమంతం ప్లవంగమమ్॥ ౪౩॥

నియెను. దుష్టబుద్ధివగు నీచవానరుఁడా! రావణునిచేఁ బాలింపఁబడు నీపురమును జూచుటకు నన్ను గెలువక నీకుసాధ్యముగాదు.

౩౭. అని లంకపలుకఁగా "ఓపుణ్యాత్మురాలా! ఈపురముంజూచి వచ్చినమార్గముననే నేనుబోవుదును" అని వానరోత్తముఁడు చెప్పెను.

౩౮. అంతట లంక భయంకరమైనధ్వనిచేసి వానరోత్తముని శీఘ్రమున నరచేత నడఁచెను.

౩౯, ౪౦, ౪౧½ అటుపై నావానరోత్తముఁడు లంకచే లెస్సగఁ గొట్టంబడినవాఁడై మిక్కిలి దర్పముతో నొకపెద్దకేకవైచెను. కోపముచే నొడలుమఱచి యాతండు వ్రేళ్లనుముడుకొని యెడమచేతి పిడికిలిచే నొక పోటుపొడిచెను గాని 'యాఁడుదిగదా!' అనితలఁచి మిక్కిలిక్రోధము చూపఁడయ్యెను.

౪౧½. ఆదెబ్బతోడనె కంపముంబొందినమేనుగలదై యారాక్షసి వికారముగా నోరుతెఱచుకొని శీఘ్రమున నేలంగూలెను.

౪౨½. అటుపై, బుద్ధిమంతుఁడగు హనుమంతుం డట్లుపడినదానిం గాంచి యాఁడుదియని కొంత కరుణించెను.

౪౩½. అంతట నది భయపడినదై, గర్వముమాని వణఁకుచున్న గొంతుతోడ హనుమంతున కిట్లనియెను.

ప్రసీద సుమహాబాహో త్రాయస్వ హరిసత్తమ।
సమయే సౌమ్య తిష్ఠంతి సత్వవంతో మహాబలాః॥ ౪౪
అహంతు నగరీ లంకా స్వయమేవ ప్లవంగమ।
నిర్జితా హం త్వయా వీర విక్రమేణ మహాబల॥ ౪౫
ఇదం తు తథ్యం శృణువై బ్రువంత్యా మే హరీశ్వర।
స్వయంభువా పురాదత్తం వరదానం యథా మమ॥ ౪౬
యదా త్వాం వానరః కశ్చి ద్విక్రమా ద్వశమానయేత్।
తదా త్వయాహి విజ్ఞేయం రక్షసాం భయ మాగతమ్॥ ౪౭
స హి మే సమయ స్సౌమ్య ప్రాప్తోద్య తవ దర్శనాత్।
స్వయంభు విహిత స్సత్యో న తస్యాస్తి వ్యతిక్రమః॥ ౪౮
సీతా నిమిత్తం రాజ్ఞ స్తు రావణస్య దురాత్మనః।
రక్షసాం చైవ సర్వేషాం వినాశ స్సముపాగతః॥ ౪౯
తత్ప్రవిశ్య హరిశ్రేష్ఠ పురీం రావణపాలితామ్।
విధత్స్వ సర్వకార్యాణి యాని యానీహ వాంఛసి॥ ౫౦
ప్రవిశ్య శాపోపహతాం హరీశ్వరః శుభాం పురీం రాక్షస
ముఖ్య పాలితాం। యదృచ్ఛయాత్వం జనకాత్మజాం సతీం వి
మార్గ సర్వత్ర గతో యథాసుఖమ్॥ ౫౧

ఇతి శ్రీమత్సుందరకాండే - తృతీయస్సర్గః.

౪౪౹, ౪౫౹. ఓబలవంతుఁడ! వానరోత్తమ! కరుణింపుము! సాత్త్వికస్వభావముగల మహాబలవంతులు స్త్రీనిజంపుట తగదని వ్రతముంగలిగి యున్నారు. నేను లంకనుజుమా! బలవంతుఁడవగు నీదర్పమున కోడిపోయితిని.

౪౬౹. వానరోత్తమా! మున్ను బ్రహ్మదేవునిచే నాకీయంబడిన వరముయొక్క విధమును సత్యముగాఁ జెప్పుచున్నాను, వినుము.

౪౭౹. "ఎప్పుడు వానరుండొకఁడు బలాధికుఁడై నిన్నులోఁబఱచికొనుచున్నాఁడో రాక్షసులకుఁజేటు నాఁడేవచ్చెనని తెలిసికొనుము"

౪౮౹, ౪౯౹. ఓసాధుఁడ! ఆకాలము నేఁడు నిన్నుంగాంచుటచే సిద్ధించినది. బ్రహ్మచేఁ బలుకంబడినది సత్యముగాని యేపాటియు వ్యత్యాసము లేదు. సీతను నిమిత్తముచేసికొని దుర్జనుండగు నీరావణునకును రాక్షసులకందఱకును జేటుకాలము వచ్చెను.

౫౦౹. కావున వానరోత్తమ! రావణునిచేఁ బాలింపఁబడు నీపట్టణమునంజొచ్చి నీకోరినకార్యములన్నియుఁ జక్కఁజేసికొనుము.

౫౧౹. ఓవానరేశ్వర! శాపముచేఁ జెడినట్టి, ఈ యందమై రావణాదులచేఁ బాలింపఁబడిన పట్టణమునఁబ్రవేశించి యన్నిచోట్ల నడ్డులేక సంచరించి పతివ్రతయగు జానకిని వెదకికొనుము!

ఇది మూఁడవ సర్గ.



## చతుర్థస్సర్గః.

---

స నిర్జిత్య పురీం శ్రేష్ఠాం లంకాం తాం కామరూపిణీమ్।
విక్రమేణ మహాతేజా హనూమా న్కపిసత్తమః॥
అద్వారేణ మహాబాహుః ప్రాకార మభిపుప్లువే। ౧½
ప్రవిశ్య నగరీం లంకాం కపిరాజ హితంకరః॥
చక్రేఽథ పాదం సవ్యంచ శత్రూణాం సతు మూర్ధని। ౨½
ప్రవిష్ట స్సత్వసంపన్నో నిశాయాం మారుతాత్మజః॥
స మహాపథ మాస్థాయ ముక్తాపుష్ప విరాజితమ్।
తత స్తు తాం పురీం లంకాం రమ్యా మభియయౌ కపిః॥ ౪
హసితో త్కృష్ట నినదై స్తూర్యఘోష పురస్సరైః।
వజ్రాంకుశ నికాశై శ్చ వజ్రజాల విభూషితైః॥ ౫
గృహమేఘైః పురీ రమ్యా బభాసే ద్యౌ రివాంబుదైః। ౫½
ప్రజజ్వాల తదా లంకా రక్షోగణ గృహైశ్శుభైః॥ ౬
సితాభ్రసదృశై శ్చిత్రైః పద్మ స్వస్తిక సంస్థితైః।
వర్ధమానగృహై శ్చాపి సర్వత స్సు విభూషితా॥ ౭
తాం చిత్రమాల్యాభరణాం కపిరాజ హితంకరః।
రాఘవార్థం చర న్శ్రీమా న్దదర్శ చ ననంద చ॥ ౮

## నాల్గవసర్గ.

౧౪. ఉత్తమురాలును, కోరినరూపమును ధరించునదియు నగు లంకను మిక్కిలి బలదర్పములు గలవాఁడగు హనుమంతుఁడుజయించి వాకిలిలేని యొకచోటఁ గోటను దాఁటెను.

౨౪. వానరరాజగు సుగ్రీవునకు హితము నేయువాఁడగు నాతండు లంకానగరమునఁ బ్రవేశించి(శత్రుపురము గావున) యెడమపాదమును ముందుపెట్టెను. అదియే శత్రువుల నెత్తిన నని తలంపఁ దగినది.

౪. బలవంతుఁడగు నాతండు రాత్రివేళ లంకయందుఁ జొచ్చి ముత్యములచేతను బుష్పములచేతను వెలుంగుచున్నదియగు రాజమార్గము నాశ్రయించి మనోహరమగు నాపురమం దంతటను సంచరించెను.

౫౪. వాద్యముల ధ్వనులతోఁగూడిన పెద్దనవ్వుల ధ్వనినిగలవియు, వజ్రముల ముత్తములచే నలంకరింపఁబడినవియు, ఐరావతమను తెల్లయేనుఁగును బోలినవియునగు గృహములను మేఘములచేత నాపట్టణము తెల్లని మేఘములతోఁగూడిన యాకాశమువలె నొప్పెను.

౬, ౭, ౮. మేఘములచే రమ్యమైన యాకాశమువలెనున్నదియు మంగళకరమైనానావర్ణములుగలదియు, పద్మము, స్వస్తికము, వర్ధమానము ననుభేదములతోఁ గట్టంబడిన రాక్షసగృహములచేత నంతట నలంకరింపఁబడియున్నదియునగు లంకాపట్టణము మిక్కిలి వెలింగెను. సుగ్రీవుని హితమునకును రాముని కార్యమునకును సంచరించుచున్న కాంతివంతుఁడగుహనుమంతుఁడు నానావిధములగు పుష్పములచేత నలంకరింపఁబడి నయాపట్టణమును బాగుగఁగాంచెను, సంతోషించెను.

భవనా ద్భవనం గచ్ఛ౯ దదర్శ పవనాత్మజః।
వివిధాకృతి రూపాణి భవనాని తత స్తతః॥ ౯॥
శుశ్రావ మధురం గీతం త్రిస్థాన స్వరభూషితమ్।
స్త్రీణాం మదసమృద్ధానాం దివి చాప్సరసా మివ॥ ౧౦॥
శుశ్రావ కాంచీనినదం నూపురాణాం చ నిస్స్వనమ్।
సోపాన నినదాం శ్చైవ భవనేషు మహాత్మనామ్॥ ౧౧॥
ఆస్ఫోటిత నినాదాంశ్చ క్ష్వేళితాం శ్చ తత స్తతః॥ ౧౧½
శుశ్రావ జపతాం తత్ర మంత్రా న్రక్షోగృహేషు వై॥ ౧౨॥
స్వాధ్యాయ నిరతాం శ్చైవ యాతుధానా న్దదర్శ సః।
రావణ స్తవ సంయుక్తా౯ గర్జతో రాక్షసా నపి॥ ౧౩॥
రాజమార్గం సమావృత్య స్థితం రక్షోబలం మహత్।
దదర్శ మధ్యమేగుల్మే రావణాను చరా౯ బహూ౯॥ ౧౪॥
దీక్షితా న్జటిలా న్ముండా౯ గోజినాంబర వాససః।
దర్భముష్టిప్రహరణా నగ్నికుండాయుధాం స్తథా॥ ౧౫॥
కూట ముద్గర పాణీం శ్చ దండాయుధ ధరా నపి।
ఏకాక్షా నేకకర్ణాం శ్చ లంబోదర పయోధరా౯॥ ౧౬॥
కరాళా న్భుగ్నవక్త్రాం శ్చ వికటా న్వామనాం స్తథా।
ధన్వినః ఖడ్గిన శ్చైవ శతఘ్నీ ముసలాయుధా౯॥ ౧౭॥

౯, ౧౦, ౧౧, ౧౧½. వాయుపుత్రుండొకయింటనుండిమఱియొక యింటికేగుచు నందందు నానావిధములంగల యిండ్లనుగనియె. లెస్సగమదించియున్న స్త్రీలయొక్క (శాస్త్రసమ్మతమై యింపై దేవలోకమందలియప్సరలపాటవలెనున్న) పాటను వినెను. భాగ్యవంతులయిండ్లయందు మొలనూళ్ళచప్పుడును, అందెలధ్వనిని, మెట్లనెక్కుచు దిగుచున్నవారి కాళ్లరొదను, అందందు రాక్షసులు పరాక్రమములువెళ్ళఁబోసికొనుచు [illegible]లప్పళించుటయు సింహనాదములు సేయుటయు వినియెను.

౧౨, ౧౩, ౧౪. ఆరాక్షసగృహములయందు జపించుచున్నవారియొక్క మంత్రములను వినెను. శ్రద్ధతో వేదఘోషము జరించుచున్న రాక్షసులను రావణుని స్తోత్రముసేయుచు అంకెలువేయుచున్న రక్కసులనుగనియెను. పెద్దవీథియందు నిండియున్న గొప్పరాక్షససేనను, నడుమనున్న సేనయందలి పెక్కండ్రు వేగులవారిని హనుమంతుఁడు గనియెను.

౧౫, నుండి ౧౯½. వఱకు. వైదికకార్యములకై దీక్షవహించినవారిని, జడలుధరించినవారిని, బోడితలలవారిని, ఎద్దుచర్మమును వస్త్రముగాధరించినవారిని, పిడికెడుదర్భలను శత్రులపైఁ బ్రయోగింప నాయుధముగాఁగలవారిని, శత్రులజంపునట్టి శక్తులను బుట్టించుటకై హోమకుండముల నాయుధములుగాఁ గలవారిని, కొనలుసన్నగిల్లిన ముద్గరలను జేతులయందుఁ గలవారిని, దండములనునాయుధములను గలవారిని, ఒంటికంటి నొక్కచెవిని గలవారిని, వ్రేలుపొట్టలు ఱొమ్ములు గలవారిని, భయంకరులను, కుంటిముఖములుగలవారిని, వ్యత్యాసముగునంగములుగలవారిని, [illegible]

పరిఘోత్తమహస్తాం శ్చ విచిత్ర కవచోజ్జ్వలాన్।
నాతిస్థూలా న్నాతికృశా న్నాతిదీ ర్ఘాతిహ్రస్వకాన్॥ ౧౮॥
నాతిగౌరా న్నాతికృష్ణా న్నాతికుబ్జా న్నవామనాన్।
విరూపా న్బహురూపాం శ్చ సురూపాం శ్చ సువర్చసః॥ ౧౯॥
ధ్వజోత్పతాకిన శ్చైవ దదర్శ వివిధాయుధాన్॥ ౧౯½

శక్తి వృక్షాయుధాం శ్చైవ పట్టిసాశని ధారిణః॥ ౨౦॥
క్షేపణీ పాశహస్తాం శ్చ దదర్శ స మహాకపిః।
స్రగ్విణ స్త్వనులిప్తాం శ్చ వరాభరణ భూషితాన్॥ ౨౧॥
నానావేష సమాయుక్తాన్ యథా స్వైరగతాన్ బహూన్।
తీక్ష్ణశూలధరాం శ్చైవ వజ్రిణ శ్చ మహాబలాన్॥ ౨౨॥

శత సాహస్ర మవ్యగ్ర మారక్షం మధ్యమం కపిః।
రక్షోధిపతి నిర్దిష్టం దద ర్శాంతః పురాగ్రతః॥ ౨౩॥

స తదా తద్గృహం దృష్ట్వా మహా హాటకతోరణమ్।
రాక్ష సేంద్రస్య విఖ్యాత మద్రిమూర్ధ్ని ప్రతిష్ఠితమ్॥ ౨౪॥
పుండరీ కావతంసాభిః పరిఖాభి రలంకృతమ్।
ప్రాకారావృత మత్యర్థం దదర్శ స మహాకపిః॥ ౨౫॥

ష్టివారిని, ధనుస్సులు, ఖడ్గములు, పిరంగులు, రోకళ్లు నాయుధములుగాఁగలవారిని, చేతులయందు దినుపకట్లుగుదియలుగలవారిని, వింతయగు కవచములు గలవారిని, మిక్కిలి యగులావును, బక్కతనమును బొడవును గుఱుచతనమును లేనివారిని, మిక్కిలియగుపసపుచాయను నలుపును లేనివారిని, పెక్కురూపములు గలవారిని, మంచిరూపమును మంచితేజస్సును గలవారిని, గెలుపునుదెలుపు స్తంభములను, టెక్కెములనుగలవారిని; అనేకములగు నాయుధములను జూచెను.

౨౦, ౨౧, ౨౨. శక్తులనువృక్షముల నాయుధములుగాఁగలవారిని, పట్టసము పిడుగులను ధరించియున్నవారిని, పాశము లను నాయుధములగలవారిని వానరోత్తముఁడగు నాతండుగనియెను. పుష్పములు ధరించిన వారిని, మేనగంధములందియున్నవారిని, మంచిసొమ్ముల నలంకరించి కొన్న వారిని, పెక్కువేషములుధరించియున్నవారిని, తోఁచినట్లుతిరుగుచున్నయనేకులను, కఱకైన శూలములధరించినవారిని, బలవంతులైవజ్రములను ధరించినవారిని గాంచెను.

౨౩. ఆవానరుఁడు, స్త్రీలుండుమేడకెదుట లక్షసంఖ్యగలదియు, రావణునిచే నియమింపఁబడినదియు, నడుమనున్నదియునగు మూలబలమును గనుంగొనియెను.

౨౪, ౨౫. ఆయాంజనేయుఁడు బంగారు తోరణముంగలదియుఁ బ్రసిద్ధమైనదియు, పర్వతముపైఁ గట్టంబడినదియునగు రాక్షస రాజుయొక్కగృహమునుగాంచి, అందమగు తెల్లతామరలనుగల యగడ్తలచే నలంకరింపఁబడినదియు, ప్రాకారముచేఁ జుట్టుఁబడినదియునగు నాగృహమును సంపూర్ణముగాఁ గాంచెను.

త్రివిష్టప నిభం దివ్యం దివ్యనాద వినాదితమ్।
వాజిహ్రేషిత సంఘుష్టం నాదితం భూషణై స్తథా॥ ౨౬॥
రథై ర్యానై ర్విమానై శ్చ తథాభూతై ర్గజై శ్శుభైః।
వారణై శ్చ చతుర్దంతై శ్శ్వేతాభ్ర నిచయోపమైః॥ ౨౭॥
భూషితం రుచిర ద్వారం మత్తై శ్చ మృగపక్షిభిః।
రక్షితం సుమహావీర్యై ర్యాతుధానై స్సహస్రశః॥ ౨౮॥
రాక్షసాధిపతే ర్గుప్త మావివేశ మహాకపిః॥ ౨౯॥

స హేమ జాంబూనద చక్రవాళమ్ మహార్హ ముక్తామణి భూషితాం తమ్। పరార్థ్య కాలాగరు చందనా క్తం స రావణాంతఃపుర మావివేశ॥ ౩౦॥

ఇతి శ్రీమత్సుందరకాండే చతుర్థ స్సర్గః.

పంచమ స్సర్గః.

తత స్స మధ్యంగత మంశుమంతం జ్యోత్స్నా వితానం మహ దుద్వమంతమ్। దదర్శ ధీమా౯ దివి భానుమంతం గోష్ఠే వృషం మత్తమివ భ్రమంతమ్॥ ౧॥

౨౬, ౨౭, ౨౮, ౨౮½. స్వర్గముతోఁ దుల్యమైనదియు, శ్రేష్ఠమైనదియు, రమ్యమగు నాదమునుగలదియు, గుఱ్ఱముల సకిలింపులచే మిక్కిలి మ్రోయుచున్నదియు, సొమ్ములధ్వనిచే నొప్పినదియు, రథముల చేతను విమానములచేతను వాహనములచేతను శుభకరములగు గుఱ్ఱములు నేనుంగులచేతను, తెల్లనిమేఘముల మొత్తమువలెనున్న నాల్గుదంతములుగల యేనుఁగులచేతను, మదించినమృగములచేతను బత్తులచేతను నలంకరింపఁబడినదియు, రక్షింపఁజాలిన మహాబలముంగలరాక్షసులచే వేయివిధముల రక్షింపఁబడినదియునైన రావణునియొక్క గృహద్వారమును వాయుపుత్రుఁడు చేరనేగెను.

౨౯½. పెక్కువిధములగు బంగారముచేఁ గట్టఁబడిన ప్రాకారములుగలదియు, మిక్కిలివెలగల ముత్తెములు రత్నములచే నలంకరింపఁబడి యందమైనదియు, శ్రేష్ఠములగు నల్లయగురు శ్రీగంధములతోఁ గూడినదియునగు రావణుని యంతఃపురమును హనుమంతుఁడు ప్రవేశించెను.

ఇది నాల్గవసర్గ.

ఐదవ సర్గ.

౧. అటుపై నాకాశమునడుమనున్నవాఁడును వెన్నెలమొత్తమును వెదచల్లుచున్నవాఁడును, కిరణములనుగలవాఁడును, మందయందాఁబోతెద్దువలె నాకాశమున సంచరించుచున్నవాఁడునునగు చంద్రుని బుద్ధిమంతుఁడగు హనుమంతుఁడు గనియెను.

లోకస్య పాపాని వినాశయంతం మహోదధిం చా పి సమేధ
యంతమ్ । భూతాని సర్వాణి విరాజయంతం దదర్శశీతాం
శు మథా భియాంతమ్॥ ౨॥

యా భాతి లక్ష్మీ ర్భువి మందరస్థా తథా ప్రదోషేషుచ సా
గరస్థా । తథైవ తోయేషు చ పుష్కరస్థా రరాజ సా చారు
నిశాకరస్థా॥ ౩॥

హంసో యథా రాజత పంజరస్థః సింహో యథా మందర
కందరస్థః । వీరో యథా గర్వితకుంజరస్థ శ్చంద్రోపి బభ్రా
జ తథాంబరస్థః॥ ౪॥

స్థితః కకుద్మా నివ తీక్ష్ణశృంగో మహాచల శ్శ్వేత ఇ వోచ్చ
శృంగః । హ స్తీవ జాంబూనద బద్ధశృంగో రరాజ చంద్రః ప
రిపూర్ణశృంగః॥ ౫॥

వినష్ట శీతాంబు తుషార పంకో మహాగ్రహ గ్రాహ వినష్ట
పంకః । ప్రకాశ లక్ష్మ్యా శ్రయ నిర్మలాంకో రరాజ చంద్రో
భగవాన్ శశాంకః॥ ౬॥

శిలాతలం ప్రాప్య యథామృగేంద్రో మహారణంప్రాప్య య
థా గజేంద్రః । రాజ్యంసమాసాద్య యథానరేంద్ర స్తథాప్ర
కాశో విరరాజ చంద్రః॥ ౭॥

౨. లోకముయొక్క దుఃఖమును నశింపఁజేయువాఁడును, సముద్రము నుప్పొంగించువాఁడును సర్వభూతములను వెలిఁగించువాఁడును, ఎదుటవచ్చుచున్నవాఁడును నగు చంద్రునిఁ గనియెను.

౩. భూమిపై మందరపర్వతమందుండి వెలుంగునదియు, సాయంకాలములందు సముద్రమందుండి ప్రకాశించునదియు, ఉదకమునఁగములయందునిలిచి వెలుంగునదియునగు కాంతియప్పుడు చంద్రునందు వెలింగెను.

౪. హంస వెండిపంజరమునందుండి వెలుంగునట్లును, సింహము పర్వతగుహయందుండి యొప్పునట్లును, వీరుం డేనుఁగుపైనుండి ప్రకాశించునట్లును జంద్రుం డాకాశమందుండి యొప్పారెను.

౫. వాడియైన కొమ్ములుగలయెద్దువలెను, ఉన్నతమైన శిఖరములుగల కైలాసమువలెను, బంగారుకడియములుగల దంతములచేఁ దనరినయేనుఁగువలెను సంపూర్ణమగుకళలతోఁ జంద్రుఁ డొప్పెను.

౬. చల్లనినీటినిగల మంచుజల్లుచే విడువఁబడినవాఁడును రాహుకేతువులచేఁ బట్టువడినపుడు చెందినదోషమునుండి తొలఁగినవాఁడును, కాంతిసంపదకాధారమగు నిర్మలమగు గుఱుతునుగలవాఁడును, మహాత్ముఁడు నగు చంద్రుండు వెలింగెను.

౭. సింగము కొండభూమిని జేరి వెలింగినట్లును, ఏనుఁగు గొప్పయరణ్యముంజొచ్చి యొప్పారినట్లును, రాజు రాజ్యమును జెంది ప్రకాశించునట్లును జంద్రుండు మిక్కిలి వెలింగెను.

ప్రకాశచంద్రోదయ నష్టదోషః ప్రవృత్తరక్షఃపిశితాశ దోషః।
రామాభిరామేరిత చిత్తదోషః స్వర్గప్రకాశో భగవాన్ప్రదోషః॥

తంత్రీస్వనాః కర్ణసుఖాః ప్రవృత్తాః స్వపంతి నార్యః పతిభి స్సు
వృత్తాః । నక్తంచరాశ్చాపి తథాప్రవృత్తా విహర్తు మత్యద్భు
త రౌద్ర వృత్తాః॥ ౯॥

మత్తప్రమత్తాని సమాకులాని రథాశ్వ భద్రాసన సంకులాని
వీరశ్రియా చాపి సమాకులాని దదర్శ ధీమాన్ సకపిఃకులాని॥

పరస్పరం చాధిక మాక్షిపంతి భుజాంశ్చ పీనా నధివిక్షిపంతి
మత్తప్రలాపా నధికం క్షిపంతి మత్తాని చాన్యోన్యమధిక్షిపంతి॥

రక్షాంసి వక్షాంసి చ విక్షిపంతి గాత్రాణి కాంతాసు చ విక్షి
పంతి । రూపాణి చిత్రాణి చ విక్షిపంతి దృఢాని చాపాని
చ విక్షిపంతి॥ ౧౨॥

దదర్శ కాంతాశ్చ సమాలపంత్య స్తథాపరా స్తత్ర పునస్స్వ
పంత్యః।సురూపవక్త్రాశ్చ తథా హసంత్యః క్రుద్ధాః పరా
శ్చాపి వినిశ్శ్వసంత్యః॥ ౧౩॥

౮. వెలుంగుచున్న చంద్రోదయముచేఁ బోయినచీఁకటికలదియు వృద్ధిపొందుచున్న మాంసభక్షకులగురాక్షసుల పాపమునుగలదియు, తొలఁగింపఁబడిన స్త్రీపురుషుల మనోదోషము (విరోధము) గలదియు నగు తొలిజాముర్త్రాత్రి మిక్కిలి వెలింగెను.

౯. వీణమొదలగు వాద్యముల తంతెలధ్వని విననింపై యొప్పెను, ఉత్తమ చరితముంగల యిల్లాండ్రు మగలతోడఁబరుండి నిద్రించుచున్నారు రాక్షసులును మిక్కిలి భయంకరమగు దుష్టకార్యములయందు వర్తించుచున్నారు.

౧౦. మత్తుగలుగుపదార్థములం గుడుచుటచే నెడలుముఱచినవారిని గలవియు రథములు గుఱ్ఱములు రాజపీఠములు వీనిచే నెడము లేకున్నవియు, వీరలక్ష్మి చేతను గ్రిక్కిఱిసియున్నవియు నగు రాక్షసగృహములను వానరోత్తముఁడు గనియెను.

౧౧, ౧౨. ఒకరినొకరు హేళనచేసికొనుచున్నారు, బలిసియున్న భుజముల నెరయుచున్నారు, మదించి యొడలెఱుంగక మాటలాడుచున్నారు, ఒకరినొకరు తిరస్కరించుచున్నారు, ఱొమ్ములను వెడల్పుగా విచ్చుచున్నారు, శరీరములను స్త్రీలపై వైచుచున్నారు, రూపములను చిత్రవిచిత్రములుగ ధరించుచున్నారు, బటువగువిండ్లను మ్రోయించుచున్నారు. ఇట్టివారి నాతండు గనియె.

౧౩. మాటలాడుకొనుచున్నట్టి స్త్రీలను, నిద్దురపోవుచున్న భామలను, అందమగు మోములుగలిగి నవ్వుచున్నవారిని, కోపగించి నిట్టూర్పులు విడుచుచున్న యింతులను హనుమంతుఁడు గనియెను.

అభ్రావృతాః కాంచనరాజివర్ణాః కాశ్చిత్పరార్థ్యా స్తపనీ
యవర్ణాః । పునశ్చ కాశ్చి చ్ఛశలక్ష్మవర్ణాః కాంతప్రహీణా
రుచిరాంగవర్ణాః॥ ౨౦॥

తతః ప్రియా న్ప్రాప్య మనోభిరామా సుప్రీతియుక్తాః ప్రస
మీక్ష్య రామాః గృహేషు హృష్టాః పరమాభిరామా హరిప్ర
వీర స్స దదర్శ రామాః॥ ౨౧॥

చంద్రప్రకాశా శ్చ హి వక్త్రమాలా వక్రాక్షిపక్ష్మా శ్చ సు
నేత్రమాలాః । విభూషణానాం చ దదర్శ మాలా శ్శతహ్రదా
నా మివ చారుమాలాః॥ ౨౨॥

న త్వేవ సీతాం పరమాభిజాతాం పథిస్థితే రాజకులే ప్రజా
తామ్ । లతాం ప్రఫుల్లామివ సానుజాతాం దదర్శ తన్వీం మ
నసాభిజాతామ్॥ ౨౩॥

సనాతనే వర్త్మని సన్నివిష్టాం రామేక్షణాం తాం మదనాభివి
ష్టామ్। భర్తుర్మనశ్శ్రీమ దనుప్రవిష్టాం స్త్రీభ్యోవరాభ్యశ్చ సదా
విశిష్టామ్॥ ౨౪॥

ఉష్ణార్దితాం సానుసృతాస్రకంఠీం పురా వరార్హోత్తమ నిష్క
కంఠీమ్। సుజాతపక్ష్మా మభిరక్తకంఠీం వనే ప్రవృత్తా మివ
నీలకంఠీమ్॥ ౨౫॥

౨౦, ౨౧. పైటచెరఁగు లేనివారిని, బంగారువర్ణపు మేనులుగలవారిని, మంచినడవడిగలవారిని, కుంపనపుచాయగలవారిని గొందఱను, చంద్రుని కాంతివంటి కాంతిగలవారిని, మగలుచేరువలేక విరహముచేఁ దపించువారిని, మగలను బొంది యింపుగనున్నవారిని, మగలయందుఁ బ్రేమగలవారిని, మనస్సునకుఁ దృష్టిగనున్నవారిని గాంచి తమయిండ్లయందుఁ గలతఁ లేక సంతోషముతోనున్న స్త్రీలను వానరోత్తముఁడు గనియెను.

౨౨. చంద్రుని ప్రకాశమువంటి ప్రకాశముంగలముఖముల వరుసలను, వంకరలయిన కనుబొమలవరుసలను, సొమ్ములయొక్క వరుసలను మెఱుపులమాలలవలెఁ గాంచెను.

౨౩. మంచిపుట్టుకను మంచినడవడిని [illegible]ంతటనే గాంచినదియు, రాచకొలమునఁ బుట్టినదియు, కొండచరింబుట్టి పెరిగినతీఁగవలె మెత్తగనున్న శరీరసౌష్ఠవముగలదియునగు సీతను హనుమంతుఁడుగనఁ జాలఁడయ్యె.

౨౪, ౨౫, ౨౬, ౨౭. పురాతనాచారమందేయున్నదానిని, విరహముచే నెచ్చినదై శ్రీరామదర్శనముం గోరుచున్నదానిని, మగనిమనస్సునఁ బ్రవేశించియున్నదానిని, ఉత్తమురాండ్రగు స్త్రీలలో నుత్తమురాలిని, తపించుచున్నదానిని, జారుచున్నకన్నీళ్ళతోఁ గూడిన కంఠముగలదానిని, మున్ను ధరించికొన్న వెలగలపతకమును గంఠమునం గలదానిని, బాగుగ నమరినకనుబొమలుగలదానిని, నున్నని మెడగలదానిని, వనమందు నాట్యము సేయు నెమలివలెనున్నదానిని, మబ్బుచే మఱుఁగుపడిన చంద్రకళవలెను, దుమ్ముచే

అవ్యక్తరేఖా మివ చంద్రరేఖాం పాంసు ప్రదిగ్ధా మివ హే
మరేఖాం క్షతప్రరూఢా మివ బాణరేఖాం వాయుప్రభిన్నా
మివమేఘరేఖామ్॥ ౨౬॥
సీతామపశ్య న్మనుజేశ్వరస్య రామస్యపత్నీం వదతాం వరస్య
బభూవ దుఃఖాభిహత శ్చిరస్య ప్లవంగమో మందఇవాచిరస్య॥

ఇతిశ్రీమత్సుందరకాండే - పంచమస్సర్గః.

---

## షష్ఠ స్సర్గః.

స నికామం విమానేషు విషణ్ణః కామరూప ధృత్।
విచచార పున ర్లంకాం లాఘవేన సమన్వితః॥ ౧॥
ఆససా దాథ లక్ష్మీవా న్రాక్షసేంద్ర నివేశనమ్।
ప్రాకారే ణార్కవర్ణేన భాస్వరే ణాభిసంవృతమ్॥ ౨॥
రక్షితం రాక్షసై ర్ఘోరై స్సింహై రివ మహద్వనమ్।
సమీక్షమాణో భవనం చకాశే కపికుంజరః॥ ౩॥
రూప్య కోపహితై శ్చిత్రై స్తోరణై ర్హేమభూషితైః।
విచిత్రాభి శ్చ కక్ష్యాభి ర్ద్వారై శ్చ రుచిరై ర్వృతమ్॥ ౪॥
గజాస్థితై ర్మహామాత్రై శ్శూరై శ్చ విగతశ్రమైః।
ఉపస్థిత మసంహార్యై ర్హయై స్స్యందనయాయిభిః॥ ౫॥

చూసియున్న బంగారుతునుకవలెను, గాయమునందగులుకొన్న బాణపుములికి వలెను, గాలిచేఁ నెడబాపఁబడిన మేఘమువలెను నున్న దానిని, వాక్పాటి గలవారిలో నుత్తముఁడగు శ్రీరామచంద్రునియొక్క భార్యను, దీర్ఘకాలము వెదకియుఁ జూడనేరనివాఁడై యాంజనేయుండు తోడనెదుఃఖమునమునిం గినవాఁడయి మూఘునివలెనయ్యెను,

ఇది యైదవసర్గ.

---

ఆఱవసర్గ.

౧. అహానుమంతుఁడు సీత గనంబడమికిఁ గరంబు చింతించి దేవాలయములు విమానములు మొదలగువానిపై, మఱియొకతూరి పట్టణ మంతటను దిరిగి వెదకెను.

౨. అటుపై సూర్యునికాంతివంటి కాంతినిగలిగి వెలుంగుచున్న ప్రాకారముచేఁ జుట్టంబడిన రావణునిమందిరమును ధీరుండగు నాంజనేయుండు నేరెను.

3. సింగముచే రక్షింపఁబడిన దొడ్డవనమువలెనే భయంకరులగు రాక్షసులచే రక్షింపఁబడిన రావణునిగృహమును జూచుచు వానరోత్తముఁడు మిక్కిలిప్రకాశించెను.

౪ మొదలు ౧3౪వఱకు. బంగారపు జిలుగుపనినిగల, వెండిచేఁగల్పితమైన వెలుపలి ద్వారములచేతను, విచిత్రముగుపనిగల భవంతులచేత

సింహ వ్యాఘ్ర తనుత్రాణై ర్దాంత కాంచన రాజతైః॥
ఘోషవద్భి ర్విచిత్రైశ్చ సదా విచరితంరథైః॥ ౬॥

బహురత్న సమాకీర్ణం పరార్ధ్యాసన భాజనమ్।
మహారథ సమావాసం మహారథ మహాసనమ్॥ ౭॥

దృశ్యైశ్చ పరమోదారై స్తైస్తైశ్చ మృగ పక్షిభిః
వివిధై ర్బహుసాహస్రైః పరిపూర్ణం సమంతతః॥ ౮॥
వినీతై రంతపాలైశ్చ రక్షోభిశ్చ సురక్షితమ్।
ముఖ్యాభిశ్చ వరస్త్రీభిః పరిపూర్ణం సమంతతః॥ ౯॥

ముదిత ప్రమదారత్నం రాక్షసేంద్ర నివేశనమ్॥
వరాభరణ సంహ్రాదై స్సముద్రస్వన నిస్స్వనమ్॥ ౧౦॥

తద్రాజగుణసంపన్నం ముఖ్యైశ్చ వరచందనైః।
మహాజనై స్సమాకీర్ణం సింహైరివ మహద్వనమ్॥ ౧౧॥

భేరీమృదంగాభిరుతం శంఖఘోష నినాదితమ్।
నిత్యార్చితం పర్వహుతం పూజితం రాక్షసైస్సదా॥ ౧౨॥
సముద్రమివ గంభీరం సముద్ర మివ నిస్స్వనమ్।
మహాత్మనో మహద్వేశ్మ మహారత్న పరిచ్ఛదమ్॥ ౧౩॥
మహారత్న సమాకీర్ణం దదర్శ స మహాకపిః॥ ౧౩౪

ను, అందముగువాకిళ్లచేతను, ఏనుఁగులనెక్కియున్న మంత్రులచేతను, ఢక్కి లేనిశూరులచేతను, అడ్డులేక రథములనీడ్చుకొనిపోవుచున్న గుఱ్ఱములచేతను వెలుంగునదియు సింగపుతోలు పులితోలు వీనిచేఁ జేయఁబడిన కవచములు వేయంబడి దంతము వెండిబంగారు వీనిచేఁ జిత్రముగఁబనిచేయంబడి వింతగనుండి యెడదెగని ధ్వనితోడఁగూడిన రథముల సంచారమును గలదియు, అనేకరత్నములతోఁగూడినదియు మేలగు పీఠములను గలదియు శూరులయి మహారథు లనుబిరుదునుగన్నవారలం గలదియు గొప్పరథములను సింహాసనములను గలదియు మనోహరమై గొప్పవై నానావిధములై వేలకొలఁదినున్న మృగములచేతను బక్షులచేతను నిండినదియు బాగుగ నేర్పంబడినవారై సమర్థులైన రాక్షసులచే రక్షింపఁబడినదియు రావణునకుముఖ్యారాండ్రగు భోగముపడుచులచే నంతటను నిండినదియు సంతోష పెట్టంబడిన యౌవనవతులగు స్త్రీలను గలదియు రాక్షసప్రభువులకు నెలవైనదియు శ్రేష్ఠములగు సొమ్ములయొక్క ధ్వనిచే సముద్రపుధ్వనివంటి ధ్వనిని గలదియు మేలగు నగురుచందనముల ధూపములచే రాజునకిష్టమైనదియు సింగములచే వెలుంగు గొప్పవనమువలె బలవంతులచే నిండినదియు భేరీమృదంగములయొక్కయు శంఖములయొక్కయు ధ్వనులచే మాఱుమ్రోయునదియు, ప్రతిదినమును బూజింపఁబడునదియు పర్వకాలములందు హోమములం గలదియు రాక్షసులచే నెల్లపుడుపూజింపఁబడునదియు, సముద్రమువలె మితిలేనిదియు సముద్రమువలె మ్రోయుచున్నదియు గొప్ప రత్నములచేఁగప్పంబడినదియు గొప్పరత్నములతోఁ గూడినదియు నగు (సమర్థుఁడగు రావణునియొక్క) పెద్దగృహమును వానరోత్తముఁడు గనుంగొనియెను.

విరాజమానం వపుషా గజాశ్వ రథ సంకులమ్॥ ౧౪॥

లంకాభరణమిత్యేవ సో మన్యత మహాకపిః।
చచార హనుమాం స్తత్ర రావణస్య సమీపతః॥ ౧౫॥

(సంక్షిప్య చాత్మనః కాయంప్రవిశ్యా నుపలక్షితః।
చింతయానాస మనసా ముహూర్తం ధ్యానమాస్థితః॥

కపిప్రవీరో హనుమాణ్ రాఘవప్రియకామ్యయా॥
కీదృశీ బంధనేబద్ధా ముక్తావా స్వైర చారిణీ॥

కాశ్చరక్షంతి రాక్షస్యః కథంరూపాచ మైథిలీ।
నదృష్టపూర్వా చ మయా వైదేహీ జనకాత్మజా॥

ఇంగితైశ్చాను మానైశ్చ మయాజ్ఞేయా భవిష్యతి।
ఏతాం బుద్ధిం తదా కృత్వా హనుమా న్మారుతాత్మజః॥

అన్వియేమతదాసీతాం రాఘవప్రియకామ్యయా।
స నికామం విమానేషు నిపతణ్ పాదపేషుచ॥
విచచార కపి ర్లంకాం లఘుప్రక్రమవిక్రమః। )

గృహాద్గృహం రాక్షసానా ముద్యానానిచ వానరః।
వీక్షమాణో హ్యసంత్రస్తః ప్రాసాదాం శ్చ చచారా సః॥ ౧౬॥

౧౪, ౧౫. ఏనుఁగులను, గుఱ్ఱములను మొత్తములుగఁ గలిగి యాకృతిచే మిక్కిలిప్రకాశించుచున్న రావణునిమందిరమును లంకకుభూషణముగాఁదలంచెను. ఆహనుమంతుఁడు రావణునకు సమీపముననున్న మీఁదఁజెప్పంబడినకోటలు మేడలు చూచుచు సంచరించెను.

(వానరవీరుఁడగు హనుమంతుఁడు శ్రీరాముని మేలుగోరినవాఁడై తన దేహమును గుఱుచపఱచి యితరులకుఁ గానంబడకయుండి రెండుఘడియల కాలముయోచించి "సీతాదేవి రావణునిచే నొకచోట చెరసాలయందునుపంబడియున్నదో స్వేచ్ఛతో సంచరింప విడువంబడియున్నదో యేరాక్షసస్త్రీలు కాచియున్నారో జానకియెట్టిరూపముంగలదియో మున్ను నేనెన్నఁడుంజూచినవాఁడనుగాను గావున నామెయొక్క చేష్టలచేతను, ఊహచేతను నామెనాకుఁదెలియఁ బడవలయునని తలంచెను. ఇట్లునిశ్చయించుకొని చులకనగా దాటునట్టి బలముంగలవాఁడగు వాయుపుత్రుఁడు రాఘవుని క్షేమముంగోరి విమానములమీఁదను వృక్షములమీఁదను దుమికిదుమికి లెస్సగ సీతనువెదకుచుం దిరిగెను.)

౧౬. ఆరాక్షసులయొక్క యొకయింటినుండి మఱియొకయింటికిని వనమునుండి మఱియొకవనమునకును, ప్రాకారమునుండి ప్రాకారమునకు నలువులేనివాఁడై చూచుచు నాతండు సంచరించెను.

అవప్లుత్య మహావేగః ప్రహస్తస్య నివేశనమ్।
తతో న్యత్పుప్లువే వేశ్మ మహాపార్శ్వస్య వీర్యవాన్॥ ౧౭॥

అథ మేఘప్రతీకాశం కుంభకర్ణ నివేశనమ్।
విభీషణస్య చ తదా పుప్లువే స మహాకపిః॥ ౧౮॥

మహోదరస్య చ గృహం విరూపాక్షస్య చైవ హి।
విద్యుజ్జిహ్వస్య భవనం విద్యున్మాలే స్తథైవ చ॥ ౧౯॥

వజ్రదంష్ట్రస్య చ తథా పుప్లువే స మహాకపిః। ౧౯ ½
ధూమ్రాక్షస్య చ సంపాతే ర్భవనం మారుతాత్మజః।
విద్యుద్రూపస్య భీమస్య ఘనస్య విఘనస్య చ॥ ౨౦ ½

శుకస్య చ మహాతేజా స్సారణస్య చ ధీమతః॥

తథా చేంద్రజితో వేశ్మ జగామ హరియూథపః। ౨౧ ½

రశ్మికేతో శ్చ భవనం సూర్యశత్రో స్తథైవ చ।
జంబుమాలే స్సుమాలేశ్చ జగామ హరిసత్తమః॥ ౨౨ ½॥

వజ్రకాయస్య చ తథా పుప్లువే స మహాకపిః॥ ౨౩॥

౧౭, ౧౮. మిక్కిలివేగముగలయాతండు ప్రహస్తునియింటికిందాటి యందుండి మహాపార్శ్వునియింటికిని, అచటనుండి మేఘమువలె నుండుకుంభకర్ణుగృహమునకును బిమ్మట విభీషణుని మందిరమునకును దాఁటెను.

౧౯, ౧౯½ ఆవానరోత్తముఁడు మహోదర విరూపాక్షులయిండ్లను, విద్యుజ్జిహ్వ విద్యున్మాలులయొక్క గృహములను, వజ్రదంష్ట్రుని నివాసమును జెందెను.

౨౦½, ౨౧½. వానర సమూహమునకు మొనగాఁడగునాతండు ఘూర్ణాక్షుఁడు సంపాతి విద్యుద్రూపుఁడుభీముఁడు ఘనుఁడు విఘనుఁడు శుకసారణులు ననువారియిండ్లకు దాఁటి యింద్రజిత్తుయొక్క గృహమున కేగెను.

౨౨½, ౨౩. ఆవానరశ్రేష్ఠుఁడు! జంబుమాలి సుమాలియనువారియొక్కయు రశ్మికేతు సూర్యశత్రులయొక్కయు వజ్రకాయునియొక్కయు గృహమును జేరి కనియెను.

శుకనాభస్య వజ్రస్య శఠస్య వికటస్య చ।
హ్రస్వ కర్ణస్య దంష్ట్రస్య రోమశస్య చ రక్షసః॥ ౨౪॥

యుద్ధోన్మత్తస్య మత్తస్య ధ్వజగ్రీవస్య రక్షసః।
విద్యుజ్జిహ్వేంద్రజిహ్వానాం తథా హస్తిముఖస్య చ॥ ౨౫॥

కరాళస్య పిశాచస్య శోణితాక్షస్య చైవ హి।
క్రమమాణః క్రమేణైవ హనుమాన్మారుతాత్మజః॥ ౨౬।

తేషు తేషు మహార్హేషు భవనేషు మహాయశాః।
తేషా మృద్ధిమతా మృద్ధిం దదర్శ స మహాకపిః॥ ౨౭

సర్వేషాం సమతిక్రమ్య భవనాని సమంతతః।
ఆససా దాథ లక్ష్మీవాన్ రాక్షసేంద్ర నివేశనమ్॥ ౨౮

రావణస్యోపశాయిన్యో దదర్శ హరిసత్తమః।
విచరన్ హరిశార్దూలో రాక్షసీ ర్వికృతేక్షణాః॥ ౨౯

శూల ముద్గర హస్తాశ్చ శక్తితోమర ధారిణీః।
దదర్శ వివిధా న్గుల్మాం స్తత్ర రక్షఃపతే ర్గృహే॥ 3(

రాక్షసాంశ్చ మహాకాయా న్నానాప్రహరణోద్యతాన్।
రక్తాన్ శ్వేతాన్ సితాంశ్చైవ హరీం శ్చాపి మహాజవాన్।

౨౪, మొదలు ౨౭. వఱకు. శుకనాభుఁడువజ్రుఁడుశఠుఁడువికటుఁడు హ్రస్వకర్ణుఁడు దంష్ట్రుఁడు రోమశుఁడు రక్షసుఁడు యుద్ధోన్మత్తుఁడు మత్తుఁడు ధ్వజగ్రీవుఁడనురాక్షసుఁడు విద్యుజ్జిహ్వుఁడు, ఇంద్రజిహ్వుఁడు హస్తిముఖుఁడు కరాళుఁడు పిశాచుఁడు శోణితాక్షుఁడు ననువారలయొక్క (మిక్కిలి వెలగలట్టియు, సకలపదార్థసంపన్నంబైనట్టియు) గృహముల యందు సంచరించి వానిపెంపును గాంచెను.

౨౮. బలపరాక్రమములచే నొప్పినవాఁడగు నాహనుమంతుఁడుగృహముల నన్నింటిని దాఁటి రాక్షసరాజుయొక్క నివాసముంజేరెను.

౨౯, ౩౦. ఆవానరోత్తముఁ డిటునటుఁ దిరుగుచు రావణునిప్రక్కనఁ బరుండియున్నవారును, వికారమగు చూపులంగలవారును శూలము ముద్గర శక్తితోమరములను నాయుధములను ధరించినవారును నగు రాక్షసస్త్రీలనుగాంచెను. ఆరాక్షసరాజుయొక్క యింట నానావిధములగు సేనలను గనియెను.

౩౧, ౩౨, ౩౩, ౩౪ ఆయాంజనేయుఁడు గొప్పమేనులు గలిగి, నానావిధాయుధముల ధరించి సిద్ధముగనున్న రాక్షసులను, ఎఱుపు తెలుపువర్ణములుగలిగి మిక్కిలి వేగముతోఁగూడినవై కట్టంబడియున్న గుఱ్ఱములను, మంచికులమునఁబుట్టి యందముంగలిగి శత్రువులగు నేనుంగులఁ బీడింపం జాలి, గజశిక్షయందుండినవై యుద్ధమున నైరావతమును నేనుంగుతోఁ దుల్యము

కులీనా న్రూపసంపన్నా న్గజా న్పరగజారుజాన్।
నిష్ఠితా న్గజశిక్షాయా మైరావత సమా న్యుధి॥ ౩౨॥
నిహంతౄ న్పరసైన్యానాం గృహే తస్మి న్దదర్శ సః।
క్షరతశ్చ యథా మేఘాన్ స్రవతశ్చ యథా గిరీన్॥ ౩౩॥
మేఘ స్తనిత నిర్ఘోషా న్దుర్ధర్షా న్సమరే పరైః॥ ౩౩½
సహస్రం వాహినీ స్తత్ర జాంబూనద పరిష్కృతాః॥ ౩౪॥
హేమజాల పరిచ్ఛన్నా స్తరుణాదిత్య సన్నిభాః।
దదర్శ రాక్షసేంద్రస్య రావణస్య నివేశనే॥ ౩౫॥
శిబికా వివిధాకారా స్స కపి ర్మారుతాత్మజః।
లతాగృహాణి చిత్రాణి చిత్రశాలా గృహాణిచ॥ ౩౬॥
క్రీడాగృహాణి చాన్యాని దారుపర్వతకా నపి।
కామస్యచ గృహం రమ్యం దివాగృహక మేవ చ॥ ౩౭॥
దదర్శ రాక్షసేంద్రస్య రావణస్య నివేశనే॥ ౩౭½
స మందరగిరిప్రఖ్యం మయూరస్థాన సంకులమ్। ౩౮॥
ధ్వజయష్టిభి రాకీర్ణం దదర్శ భవనోత్తమమ్।
అనేకరత్న సంకీర్ణం నిధిజాలం సమంతతః ౩౯॥
ధీర నిష్ఠిత కర్మాంతం గృహం భూతపతే రివ॥ ౩౯½

లై శత్రుసైన్యముల నాశము నేయునవియై మేఘములవలె గర్జించుచు శత్రువులకు సహింపరానివై, వర్షించుచున్న మేఘములవలెను నడచుచున్న కొండలవలెను నున్నయేనుంగుల నారాక్షసరాజుయొక్క గృహమునఁ గాంచెను.

౩౪, ౩౫. బంగారుసొమ్ములను గలవారును. కవచములఁగలవారును నై బాలసూర్యునితోఁ దుల్యులైన పెక్కండ్రు భటులను రాక్షసరాజగు రావణునియొక్కయింట హనుమంతుఁడు గాంచెను.

౩౬, ౩౭, ౩౭½. నానావిధములగు పల్లకీలను వింతలగు తీఁగెల పొదరిల్లను, చిత్రశాలలనుగల గృహములను, క్రీడించుటకై నిర్మింపఁబడిన యిండ్లను మ్రానుతోఁజేయంబడిన యాటకొండలను, అందమగు మన్మథు నిగృహమును, పగటిపూట వనమందు విలాసముగనుండుటకై కట్టంబడిన యింటిని రాక్షసరాజగు రావణునినగరునందు వాయుపుత్రుండుగనియెను.

౩౮, ౩౯, ౩౯½. మందరగిరితోఁ బోలినదియు, నెమళ్ల కూఁతలచే సందడించునదియు ధ్వజస్తంభములచే నిండినదియు, పెక్కురత్నములచే నిండిన బొక్కసములఁగలదియు,అంతటను యోగ్యులచే నాచరింపఁబడుచున్న వైదికకర్మలపూర్తిని గలదియునై శివునిగృహముంబోలిన యుత్తమగృహమును హనుమంతుఁడుగనియె.

ప్రభయా చైవ రత్నానాం తేజసా రావణస్య చ॥ ౪౦॥
విరరాజాథ తద్వేశ్మ రశ్మిమానివ రశ్మిభిః।
జాంబూనదమయా న్యేవ శయనా న్యాసనాని చ॥ ౪౧॥
భాజనాని చ ముఖ్యాని దదర్శ హరియూథపః। ౪౧½
మధ్వాసవ కృతక్లేదం మణిభాజన సంకులమ్॥ ౪౨॥
మనోరమ మసంబాధం కుబేరభవనం యథా।
చందనాగరు ధూపైశ్చ దివ్యధూపై స్సుధూపితం॥ ౪౩॥
మాల్యదామభి రాకీర్ణం భక్తపుష్ప విరాజితం।
దివ్యగంధావసిక్తాభి ర్దీపికాభి ర్విదీపితం॥ ౪౪॥
లోకపాలాన్ పరిత్యజ్య తచ్ఛ్రియేవ సమావృతం।
నూపురాణాం చ ఘోషేణ కాంచీనాం నినదేన చ॥ ౪౫॥
మృదంగవాద్య ఘోషైశ్చ ఘోషవద్భి ర్వినాదితమ్।
ప్రాసాద సంఘాత శతం స్త్రీరత్న శత సంకులమ్॥ ౪౬॥
సువ్యూఢకక్ష్యం హనుమాన్ ప్రవివేశ మహాగృహమ్॥ ౪౬½

ఇతి శ్రీమత్సుందరకాండే - షష్ఠస్సర్గః.

---

## సప్తమస్సర్గః.

స వేశ్మజాలం బలవా న్దదర్శ వ్యాసక్త వైడూర్య సువర్ణ
జాలమ్। యథా మహాత్ప్రావృషి మేఘజాలం విద్యుత్పినద్ధం
సవిహంగజాలమ్॥ ౧॥

౮౦, ౮౧, ౮౧౪. రత్నములకాంతిచేతను, రావణుని శరీరకాంతి చేతను వానిగృహము (సూర్యుఁడు కిరణములచే వెలుంగునట్లు) వెలింగెను. శుద్ధమగుబంగారముచేతనే చేయంబడినవియగు పానువులను బీఠములను ముఖ్యములగు పాత్రలను వానరశ్రేష్ఠుండు గనియెను.

౮౨, మొదలు ౮౬౪వరకు. పుష్పరసముచేఁజేయంబడినసారాయి చేనంతటను దడిసియున్నదియు రత్నమయములగు పాత్రలనందుఁ గలది యువిశాలమైనదియు, కుబేరునినగరువలె రమ్యమైనదియు, చందనాగరు ధూపములచేతను, దివ్యధూపములచేత సొప్పినదియు, పూవుదండలచే నిం డినదియు, విడిపుష్పములచేఁ బ్రకాశించినదియు, పరిమళతైలములదీప ములచే వెలుంగుచున్నదియు, దిక్పాలకులను విడిచివచ్చిన లక్ష్మిచేనాశ్ర యింపఁ బడినదియు అందెలచప్పుడు చేతను మొలనూళ్లధ్వనిచేతను మద్దె లలు మొదలగువాని శబ్దములచేతను, మ్రోయుచున్నదియు, ప్రభువుల మేడ లసమూహముతోఁ గూడినదియు, అందెకత్తెలగు స్త్రీలవందలతోఁగూడిన దియు, విశాలమగు లోఁగిళ్లనుగలదియు నగుగొప్పరాజగృహమును హను మంతుఁడు ప్రవేశించెను.

ఇది యాఱవసర్గ.

---

ఏడవసర్గ.

౧. బలవంతుఁడగు నాంజనేయుఁడు పచ్చలుచెక్కంబడిన బంగా రుగవాక్షములనుగలిగి, వానకాలమందు మెఱువులతోఁగూడి పక్షులసమూ హముచే వెలింగినదియగు మేఘసమూహమువలెనున్న యిండ్లసమూహము ను జూచెను.

నివేశనానాం వివిధాశ్చ శాలాః ప్రధాన శంఖా యుధ చాప
శాలాః। మనోహరా శ్చాపి పునర్విశాలా దదర్శ వేశ్మాద్రిషు
చంద్రశాలాః॥ ౨॥

గృహాణి నానావసురాజితాని దేవాసురై శ్చాపి సుపూజితాని
సర్వై శ్చ దోషైః పరివర్జితాని కపిర్దదర్శ స్వ బలార్జితాని॥ ౩॥
తాని ప్రయత్నాభి సమాహితాని మయేన సాక్షా దివ ని
ర్మితాని। మహీతలే సర్వగుణోత్తరాణి దదర్శ లంకాధిపతే
ర్గృహాణి॥ ౪॥

తతో దదర్శో చ్ఛ్రిత మేఘరూపం మనోహరం కాంచనచా
రురూపం। రక్షోధిప స్యాత్మబలానురూపం గృహోత్తమం
హ్య ప్రతిరూప రూపమ్॥ ౫॥

మహీతలే స్వర్గమివ ప్రకీర్ణం శ్రియాజ్వలంతం బహురత్న
కీర్ణమ్। నానాతరూణాం కుసుమావకీర్ణం గిరేరివాగ్రం రజ
సావకీర్ణమ్॥ ౬॥

నారీప్రవేకై రివ దీప్యమానం తటిద్భి రంభోదవ దర్చ్యమాన
మ్। హంసప్రవేకై రివవాహ్యమానం శ్రియాయుతంఖే సుకృ
తాం విమానమ్॥ ౭॥

యథా నగాగ్రం బహుధాతు చిత్రం యథానభ శ్చ గ్రహ
చంద్రచిత్రమ్। దదర్శ యుక్తీకృత మేఘచిత్రం విమానరత్నం
బహురత్న చిత్రమ్॥ ౮॥

౨. ఆగృహములయొక్క నానావిధశాలలను, ఆయుధశాలలను ఆయిండ్లు ప్రాకారములు మొదలగువానిపైనున్న విశాలమయి యందమైన చంద్రశాలలను చిన్నయిండ్లను గనుంగొనియెను.

౩. నవవిధరత్నములయొక్క యకాంతులచేఁ బ్రకాశించునవియు, దేవతలచేతను రాక్షసులచేతను బూజింపఁబడునవియు సమస్తదోషముల వలనను విడువంబడినవియు తనభుజబలముచేతనే సంపాదింపఁ బడినవియునగు రావణుని గృహములను హనుమంతుఁడు గనియెను.

౪. సర్వయత్నములతో సిద్ధమైయున్నవియు మయుఁడనువిశ్వకర్మ చేతనే నిర్మింపఁబడినవియు భూమిపైనుండుగృహముల నన్నింటినిమించిన యందముంగలవియునగు లంకానాథునియొక్కయిండ్ల నాంజనేయుండుగని యెను.

౫, ౬, ౭, ౮. అటుపై నున్నతమైన మేఘమువలెనున్నదియు బం గారముచే మనోహరమైన రూపమునుగలదియుఁ దనబలమునకుఁ బోలినది యు సాటిలేనిరూపమునుగలదియునగు రాక్షసరాజుయొక్క గృహమును బోలినదియు, పెక్కురత్నములచేఁ బొదగఁబడి కాంతిచేనొప్పిభూలోకస్వ ర్గమువలెనున్నదియు, అనేకవృక్షములయొక్క పుష్పములతోఁ గూడినది యు, పుప్పొడిచేఁ గప్పఁబడి పర్వతశిఖరమునవలెనున్నదియు శ్రేష్ఠతచేస్త్రీ వెలుంగునట్లును మెఱుపులచే మేఘమొప్పునట్లును వెలుంగునదియు, ఆకాశ మున శ్రేష్ఠమగు హంసలచే నీడ్వంబడుచున్న విమానమువలెఁ గాంతితోఁ గూడినదియు మణిశిలమొదలగు వానిచే నొప్పుచున్న పర్వత శిఖరముంబోలి నదియు గ్రహములచేతను జంద్రునిచేతను రమ్యమైతోఁచుచున్న యాకాశ మువలెను, మేఘములయందలి చిత్రములనెల్ల మొత్తముగాఁ గలదానివలెను నున్న రత్నమయమగు విమానశ్రేష్ఠమును గాంచెను.

మహీంకృతా పర్వతరాజి పూర్ణా శైలాఃకృతా వృక్షవి
తానపూర్ణాః। వృక్షాఃకృతాః పుష్పవితానపూర్ణాః పుష్పంకృ
తం కేసరపత్రపూర్ణమ్॥ ౯॥

కృతాని వేశ్మాని చ పాండురాణి తథా సుపుష్పాణ్యపి
పుష్కరాణి। పునశ్చ పద్మాని సకేసరాణి ధన్యాని చిత్రాణి
తథా వనాని॥ ౧౦॥

పుష్పాహ్వయంనామ విరాజమానం రత్నప్రభాభిశ్చ
వివర్ధమానమ్। వేశ్మోత్తమానామపి చోచ్చమానం మహాకపి
స్తత్ర మహావిమానమ్॥ ౧౧॥

కృతాశ్చ వైడూర్యమయా విహంగా రూప్యప్రవాళై
శ్చ తథా విహంగాః। చిత్రాశ్చ నానావసుభిర్భుజంగా జా
త్యానురూపాస్తురగాశ్శుభాంగాః॥ ౧౨॥

ప్రవాళజాంబూనదపుష్పపక్షాః సలీలమావర్జితజిహ్మ
పక్షాః। కామస్య సాక్షాదివ భాంతి పక్షాః కృతా విహంగా
స్సుముఖాస్సుపక్షాః॥ ౧౩॥

నియుజ్యమానాస్తు గజాస్సుహస్తాస్సకేసరాశ్చోత్ప
లపత్రహస్తాః। బభూవ దేవీ చ కృతా సుహస్తా లక్ష్మీస్తథా ప
ద్మిని పద్మహస్తా॥ ౧౪॥

౯, ౧౦, ౧౧. ఎచ్చటఁ బర్వతములసమూహముతోఁబూర్ణమైనభూమిచిత్తరువుగా వ్రాయంబడియెనో వృక్షములసమూహముచేనిండినవిగాఁబర్వతములు వ్రాయంబడియెనో పువ్వులతో నిండినవిగా వృక్షములు వ్రాయంబడియెనో గర్భమందుండు కేసరములతోఁ బుష్పములు వ్రాయంబడెనో తెల్లనిగృహములు వ్రాయంబడియెనో అందమగుపుష్పములం గలవిగా సరస్సులురచియింపఁబడినవో కేసరములతోఁ గూడినకమలములు వ్రాయంబడినవో విచిత్రములును శ్రేష్ఠములు నగు వనములును వ్రాయంబడినవో యట్టి ప్రకాశించుచున్నదియు రత్నములకాంతిచే నవ్వుచున్నదియు గొప్పయిండ్లకంటె నున్నతమైనదియు పుష్పకమను పేరుగలదియునగుయోగ్యమగు విమానమును వానరోత్తముఁడగు హనుమంతుఁడు గనియెను.

౧౨, ౧౩, ౧౪. ఏవిమానమందు వైడూర్యముచేఁ జేయంబడినపక్షులును, వెండిచేతను బగడముచేతను జేయంబడిన పులుఁగులును, పెక్కువిధములగు రత్నములచేఁ జేయంబడి నానావర్ణములను గల సర్పములును, సుందరములై జాతికిందగిన గుణములనుగల గుఱ్ఱములును, పగడములచేతను బంగారముచేతను జేయంబడిన పువ్వులు ఱెక్కలయందుఁగలవియు, విలాసార్థము గావంపఁబడిన ఱెక్కలనుగలవియు, మన్మథునకు సహాయభూతములయినట్లుగా నందమగు ఱెక్కలనుగలిగి మనోహరములై యున్నవియుఁగాఁ జేయంబడినపక్షులు ప్రకాశించుచున్నవో, తొండములచే కేసరములనుగల కలువఱేకులను బట్టుకొనియున్న యేనుంగులు ప్రతిమలుగా వ్రాయంబడియున్నవో, కమలములనుగల యందమగుచేతులతోఁగూడిన లక్ష్మీదేవియుఁ బ్రతిమగా వ్రాయంబడెనో యట్టి పుష్పకవిమానము నాంజనేయుండు కనియెను.

ఇతీవ తద్గృహ మభిగమ్య శోభనం సవిస్మయో నగమి
వ చారుశోభనం పునశ్చ తత్పరమ సుగంధిసుందరం హిమ
త్యయే నగమివ చారు కందరమ్॥ ౧౫

తత స్స తాం కపి రభిపత్య పూజితాం చర న్పురీం ద
ముఖబాహుపాలితాం । అదృశ్యతాం జనకసుతాం సుపూ
తాం సుదుఃఖితః పతిగుణవేగ నిర్జితామ్॥ ౧౬

తత స్తదా బహువిధ భావితాత్మనః కృతాత్మనో జన
సుతాం సువర్త్మనః । అపశ్యతో భవ దతిదుఃఖితంమన స్సు
చక్షుషః ప్రవిచరతో మహాత్మనః॥

ఇతి శ్రీమత్సుందరకాండే - సప్తమస్సర్గః.



అష్టమస్సర్గః.

స తస్యమధ్యే భవనస్య సంస్థితం మహద్విమానం మ
వజ్రచిత్రితమ్ । ప్రతప్త జాంబూనదజాలకృత్రిమం దద
వీరః పవనాత్మజః కపిః॥

తదప్రమేయా ప్రతికారకృత్రిమం కృతం స్వయం సా
ధి విశ్వకర్మణా । దివంగతం వాయుపథ ప్రతిష్ఠితం వ్యా
తాదిత్య పథస్య లక్ష్మవత్॥

౧౫. మీఁదఁజెప్పంబడినట్లు మంగళ కరమైనదియు, వృక్షమువలె పుష్పకందమై బరిమళముంగలదియు, మంచుకాలమునకుఁబిమ్మట నంపమగు గుహలచే నొప్పిన పర్వతమువలె రమ్యమైనదియునగు నారావణుని యింటిచేరి మరలనాశ్చర్యపడినవాఁడయ్యెను.

౧౬. అటుపైఁ బూజింపఁబడినదియు, రావణుని భుజములచేఁ బాలింపఁబడినదియు నగు నాలంకను జొచ్చితిరుగుచు, యోగ్యులచేఁబూజింపఁబడినదియు భర్తయొక్కగుణములకుఁ జిక్కియున్నదియు నగుజానకిని గానక హనుమంతుఁడు మిక్కిలి దుఃఖించెను.

౧౭. అనేక విధములుగ యోచించుచున్న మనస్సుగలవాఁడును శాఘవర్తనగలవాఁడును మంచిచూపుగలవాఁడును సీతాదేవిని గానకతిరుగుచున్నవాఁడును యోగ్యుఁడును నగు హనుమంతునియొక్క మనస్సుమిక్కిలి దుఃఖించిన దయ్యెను.

ఇది యేడవసర్గ.

---

ఎనిమిదవసర్గ.

౧. రత్నములచేఁ జిత్తరవులు వ్రాయంబడినదియు, కుంపనపుబంగారముచేఁ జేయంబడినదియు, అగ్రహమునకునడుమనున్నదియు దొడ్డదియునగు పుష్పకవిమానమును వీరుఁడగు వాయుపుత్రుండు గనియెను.

౨. మితియును సాటియులేనట్లు నేయంబడినదియు మిక్కిలియందముగానుండవలయునని విశ్వకర్మ చేతనే చేయంబడినదియు, ఆకాశమంటునంతయెత్తుగ భూమినంటకయున్నదియు నగునావిమానము సూర్యునిమార్గమున గుఱుతువలె వెలింగెను.

న తత్ర కించి న్నకృతం ప్రయత్నతో న తత్ర కించి
న్న మహార్హ రత్నవత్ । న తే విశేషా నియతా స్సురేష్వపై న
తత్ర కించి న్న మహా విశేషవత్॥ ౩॥

తప స్సమాధాన పరాక్రమార్జితం మన స్సమాధాన
విచార చారిణమ్ । అనేకసంస్థాన విశేషనిర్మితం తత స్తత
స్తుల్యవిశేష దర్శనమ్॥ ౪॥

మన స్సమాధాయతు శీఘ్రగామినం దురావరం మా
రుతతుల్య గామినమ్ । మహాత్మనాం పుణ్యకృతాం మహర్ధినాం
యశస్వినా మగ్ర్య ముదా మివాలయమ్॥ ౫॥

విశేషమాలంబ్య విశేషసంస్థితం విచిత్రకూటం బహు
రత్నమండితమ్ । మనోభిరామం శరదిందునిర్మలం విచిత్రకూ
టం శిఖరం గిరే ర్యథా॥ ౬॥

వహంతి యం కుండలశోభితాననా మహాశనా వ్యోమచ
రా నిశాచరాః । వివృత్తవిధ్వస్త విశాలలోచనా మహాజవా
భూతగణా స్సహస్రశః॥ ౭॥

వసంతపుష్పోత్కర చారుదర్శనం వసంతమాసా దపి
కాంతదర్శనమ్। స పుష్పకం తత్ర విమానముత్తమం దదర్శ త
ద్వానరవీరసత్తమః॥ ౮॥

ఇతి శ్రీమత్సుందరకాండే - అష్టమస్సర్గః.

౩. ఆవిమానమున మిక్కిలియత్నముతోఁ జేయఁబడనిది కొంచెమే ని లేదు, వెలపోడుగు కాని రత్నమొకటియైనను లేదు, ఆవిమానమందున్నన్ని విశేషములు దేవతలవిమానములందును గలుగవు, అందువిశేషము కాని విషయ మొక్కటియు లేదు.

౪, ౫, ౬, ౭, ౮. తపోబలముచేతను బరాక్రమముచేతను సంపాదింపఁబడినదియు మనస్సునఁ దలంచినచోటున కెల్లఁ బోవునదియు లెక్కకు మించిన చిత్తరువులు వ్రాయంబడియున్నదియు, అందందుఁ బెక్కువిశేషములనుగలదియు మనస్సునఁదలంచినంతవేగమునఁ బోవునదియు నివారింపరానిదియు వాయువేగమువంటి వేగమునుగలదియు మిక్కిలి యోగ్యతగలవారికిని బుణ్యాత్ములకును సర్వసంపత్సమృద్ధిగలవారికిని యశస్సుగలవారికిని మిక్కిలి యానందముగలవారికిని బూజ్యమగునెలవగు స్వర్గము వలెనున్నదియు, విశేషములగు విషయములను జిత్తరువులుగాఁగలదియు, సొంపులై రత్నమయములగు శిఖరములనుగలిగి వెలుఁగునదియు, శరత్కాలమందలి చంద్రునివలెస్వచ్ఛమై మనస్సునకింపై యున్నదియు మణిశిలమొదలగు ధాతువులచే నానావర్ణములనుగలిగియున్న కొసలుగల పర్వతశిఖరము వలెనున్నదియు రత్నకుండలములచేఁ బ్రకాశించుచున్న మోములుగలిగి పెద్దతిండిపోతులై యాకసమునఁ దిరుగాడునట్టియు,విశాలములై వికారములైనట్టియు కన్నులును వేగమునుగల వేలకొలఁది భూతగణములచే మోయంబడునదియువసంతఋతువునందలిపుష్పసమూహమువలెనగు పడునదియు, వసంతమాసమునకంటెను రమ్యమైతోఁచునదియు విమానములలోనుత్తమమైనదియు నగుపుష్పకమును వానరవీరులలో నుత్తముఁడగు నాంజనేయుం డచ్చటఁగనియెను.

ఇది యెనిమిదవసర్గ.

## నవమస్సర్గః.

త స్యాలయవరిష్ఠస్య మధ్యే విపులమాయతమ్।
దదర్శ భవనశ్రేష్ఠం హనుమా న్మారుతాత్మజః॥ ౧॥
అర్ధయోజనవిస్తీర్ణ మాయతం యోజనం హి తత్।
భవనం రాక్షసేంద్రస్య బహుప్రాసాద సంకులమ్॥ ౨॥
మార్గమాణ స్తు వైదేహీం సీతా మాయతలోచనామ్।
సర్వతః పరిచక్రామ హనుమా నరిసూదనః॥ ౩॥
ఉత్తమం రాక్షసావాసం హనుమా నవలోకయన్।
ఆససా దాథ లక్ష్మీవా న్రాక్షసేంద్ర నివేశనమ్॥ ౪॥
చతుర్విషాణై ర్ద్విరదై స్త్రివిషాణై స్తథైవ చ।
పరిక్షిప్త మసంబాధం రక్ష్యమాణ ముదాయుధైః॥ ౫॥
రాక్షసీభి శ్చ పత్నీభీ రావణస్య నివేశనమ్।
ఆహృతాభి శ్చ విక్రమ్య రాజకన్యాభి రావృతమ్॥ ౬॥
త న్నక్రమకరాకీర్ణం తిమింగిల ఝషాకులమ్।
వాయువేగ సమాధూతం పన్నగై రివ సాగరమ్॥ ౭॥
యా హి వైశ్రవణే లక్ష్మీ ర్యా చేంద్రే హరివాహనే।
సా రావణగృహే సర్వా నిత్యమే వానపాయినీ॥ ౮॥
యా చ రాజ్ఞః కుబేరస్య యమస్య వరుణస్య చ।
తాదృశీ తద్విశిష్టా వా ఋద్ధీ రక్షోగృహే ష్విహ॥ ౯॥

## తొమ్మిదవసర్గ.

౧. పైఁజెప్పంబడినట్లు శ్రేష్ఠమైన పుష్పకవిమానము నందు నడుమ విశాలమై యుత్తమమైన గృహమును వాయుపుత్రుండగు హనుమంతుండు గనియెను.

౨. అర్ధయోజనము వెడల్పును యోజనము నిడుపునుగలిగి పెక్కు మేడలను గలదియగు మీఁదఁజెప్పంబడిన పుష్పకవిమానమందలి (రావణుని) గృహమును గనియెను.

౩. దీర్ఘములగు కన్నులను గలదియగు సీతాదేవిని వెదకుచు శత్రువుల హరించువాఁడగు హనుమంతుం డంతటను సంచరించెను.

౪, ౫, ౬, ౭. కాంతిచేనొప్పినవాఁడగు హనుమంతుండు శ్రేష్ఠమై పెక్కుండ్రు రాక్షసులకు నెలవై యున్న రావణుని గృహమును జూచుచు నాల్గుదంతములను మూఁడుదంతములను గలిగినయేనుఁగలచేఁ గ్రిక్కిరిసియున్నదియు, ఎత్తిపట్టంబడిన యాయుధములు గలవారిచేత రక్షింపఁబడినదియు, రాక్షసస్త్రీలచేతను రావణుని భార్యలచేతను దర్పముచే జయించి తేఁబడిన రాజకన్యకలచేతను నిండుకొనియున్నదియు, మొసళ్లు తిమింగిలములు మొదలగు భయంకరములగు జలజంతువులచేఁ గలఁతచెంది వాయువేగముచే నెగరఁగొట్టంబడి సర్పములతోడఁ గూడియున్న సముద్రమువలెనున్నదియు నగు రావణుని పుష్పకమందలి మందిరమును జేరెను.

౮, ౯. ఏసంపద కుబేరునియందుఁ గలదో, ఏభోగసంపద దేవేంద్రునియందున్నదో, ఏబలసంపద గరుడునియందుండునో యట్టిసర్వసంపదలును రావణునియింటఁజేరి విడువకయున్నవి. కుబేరునకును యమునకును వరుణునకు నేపాటియైశ్వర్యసంపత్తిగలదో యట్టిదియు నంతకంటె మించినదియు నగుపెంపిచ్చోట సమస్తరాక్షసుల గృహములయందున్

తస్య హర్మ్యస్య మధ్యస్థం వేశ్మ చాన్యత్సు నిర్మితమ్।
బహునిర్యూహ సంకీర్ణం దదర్శ పవనాత్మజః॥ ౧౦॥

బ్రహ్మణో౽ర్థే కృతం దివ్యం దివి యద్విశ్వకర్మణా।
విమానం పుష్పకంనామ సర్వరత్న విభూషితమ్॥ ౧౧॥

పరేణ తపసా లేభే యత్కుబేరః పితామహాత్।
కుబేర మోజసా జిత్వా లేభే త ద్రాక్ష సేశ్వరః॥ ౧౨॥

ఈహామృగసమాయుక్తైః కార్తస్వర విభూషితైః।
సుకృతై రాచితం స్తంభైః ప్రదీప్తమివ చ శ్రియా॥ ౧౩॥

మేరుమందరసంకాశై రుల్లిఖద్భి రివాంబరమ్।
కూటాగారై శ్శుభాకారై స్సర్వత స్సమలంకృతమ్॥ ౧౪॥

జ్వలనార్క ప్రతీకాశం సుకృతం విశ్వకర్మణా।
హేమ సోపానసంయుక్తం చారుప్రవర వేదికమ్॥ ౧౫॥

జాలవాతాయనై ర్యుక్తం కాంచనై స్స్ఫాటికై రపి।
ఇంద్రనీల మహానీల మణిప్రవర వేదికమ్॥ ౧౬॥

విద్రుమేణ విచిత్రేణ మణిభి శ్చ మహాధనైః।
నిస్తులాభి శ్చ ముక్తాభి స్తలే నాభివిరాజితమ్॥ ౧౭॥

చందనేన చ రక్తేన తపనీయనిభేన చ।
సుపుణ్యగంధినా యుక్త మాదిత్య తరుణోపమమ్॥ ౧౮॥

౧౦, ౧౧, ౧౨. స్వర్గమున బ్రహ్మకుఁగా విశ్వకర్మయను దేవశిల్పిచే నిర్మింపఁబడిన రత్నపూర్ణముగు నే పుష్పకమనుదివ్యవిమానమును కుబేరుఁడు మిక్కిలి తపస్సుచేసి బ్రహ్మవలనఁ బొందెనో, రాక్షసేశ్వరుఁడగు రావణుఁడు భుజబలముచేఁ గుబేరునింగెలిచి యేవిమానమును జెందెనో యావిమానముయొక్క నడుమనున్న గృహమందు రమ్యముగ నిర్మింపంబడిన పెక్కురుగుదిండ్లనుగల మఱియొక గృహమును వాయుపుత్రుండు గాంచెను.

౧౩ నుండి ౧౯ వఱకు. బంగారముచే నలంకరింపంబడి తోడేళ్లవలెఁ జిత్తరువులు వ్రాయంబడిన స్తంభములచే మోయంబడి కాంతిచే మండుచున్నట్లున్నదియు మేరుమందర పర్వతములవలె నున్నతములై యాకాశము నొరయుచున్న యందమగు చవికలచే నంతటనలంకరింపఁబడినదియు సూర్యాగ్నులతోఁ దుల్యమైనదియు, విశ్వకర్మచే బాగుగఁ జేయంబడినదియుబంగారుమెట్లనుగలదియు, అందమై శ్రేష్ఠములయినతిన్నెలనుగలదియు, బంగారముచేతను స్ఫటికములచేతను గట్టంబడిన గవాక్షములనురంధ్రములను గలదియు, ఉత్తమ రత్నములచేఁ గట్టంబడిన తిన్నెలనుగలదియు, పగడముచేతను వెలగలరత్నములచేతను సాటిలేనిముత్తెములచేతను వింతగనున్నభూమిచేఁ బ్రకాశించినదియు, మంచివాసనయుఁగుందనపుచాయయుఁ గలిగిన యెఱ్ఱని చందనముతోఁగూడి బాల సూర్యునివలె

విమానం పుష్పకం దివ్య మారురోహ మహాకపిః॥ ౧౯

తత్రస్థ స్స తదా గంధం పాన భక్ష్యాన్న సంభవమ్।
దివ్యం సమ్మూర్ఛితం జిఘ్ర న్రూపవంత మివానిలమ్॥ ౨౦

సగంధ స్తం మహాసత్త్వం బంధు ర్బంధుమి వోత్తమమ్।
ఇత ఏహీ త్యువాచే వ తత్ర యత్ర స రావణః॥ ౨౧

తత స్తాం ప్రస్థిత శ్శాలాం దదర్శ మహతీం శుభామ్।
రావణస్య మనఃకాంతాం కాంతామివ వరస్త్రియమ్॥ ౨౨

మణిసోపానవికృతాం హేమజాలవిభూషితామ్।
స్ఫాటికై రావృత తలాం దంతాంతరిత రూపికామ్॥ ౨౩

ముక్తాభి శ్చ ప్రవాళై శ్చ రూప్య చామీకరై రపి।
విభూషితాం మణి స్తంభై స్సుబహు స్తంభ భూషితామ్॥ ౨౪

సమై రృజుభి రత్యుచ్చై స్సమంతా త్సువిభూషితైః।
స్తంభైః పక్షై రివాత్యుచ్చై ర్దివం సంప్రస్థితా మివ॥ ౨౫

మహత్యా కుథయా స్తీర్ణాం పృథివీ లక్షణాంకయా।
పృథివీ మివ విస్తీర్ణాం సరాష్ట్ర గృహమాలినీమ్॥ ౨౬

నాదితాం మత్తవిహగై ర్దివ్యగంధాధి వాసితామ్।
పరార్ధ్యా స్తరణోపేతాం రక్షోధిప నిషేవితామ్।

నెత్తినై వెలుఁగుచున్నదియునగు పుష్పకమను నుత్తమ విమానమును శక్తిసంపన్నుఁడగు హనుమంతుఁ డెక్కెను.

౨౦. ఆపుష్పకముపైనున్న వానరుఁ డందున్న పుష్పరసము మొదలగు పానద్రవ్యముల యొక్కయుఁ బిండివంటలయొక్కయు నన్నము యొక్కయు (అంతటనువ్యాపించుచున్న) నింపగుపరిమళమును స్వరూపముం ధరించియున్నవాయువు మూర్కొనునట్లు మూర్కొనియె.

౨౧. రావణుఁడెచ్చట మెలఁగునో యచ్చటనుండు పరిమళము మిక్కిలిబలవంతుఁడగు హనుమంతుని (చుట్టము దగ్గరిచుట్టమును బిలచినట్లుగా) నాకడకురమ్మని పిలచిన ట్లుండెను.

౨౨ నుండి ౨౯ వఱకు. ఆహనుమంతుఁడు పుష్పకమునుండి తరలి దొడ్డదియు మంగళకరమయినదియు మనోహరయగు పడుచువలె రావణునిమనస్సున కింపైనదియు, రత్నములమెట్లు నందముగఁగలదియు బంగరుగవాక్షములచే సొంపైనదియు నడుమనడుమ దంతపుపలకలుగల స్ఫటికపునేలను గలదియు, ముత్తెములు పగడములు బంగారము వీనిచేతనె యలంకరింపఁబడినదియు, అనేకములగు రత్నస్తంభములచే నలంకరింపఁబడినదియు, చక్కనై యున్నతములై పొడవునన్ లెస్సగ నలంకరింపబడిన స్తంభములచే, పొడవైన ఱెక్కలసహాయముచే స్వర్గమున కెగయఁ దలంచినట్లున్నదియు, రాజ్యములయొక్కయు గృహములయొక్కయు వరుసలనుగలవిశాలమగు భూమండలమువలె (చిత్తరువుగా వ్రాయఁబడిన భూమిచిహ్నమును గల) విశాలమగురత్న కంబళి పఱచుటనుగలదియు, మదించినపులుఁగులచే ధ్వనించుచున్నదియు రమ్యమగు పరిమళమును గుప్పించుచున్నదియు, వెల

ధూమ్రా మగురుధూపేన విమలాం హంసపాండురామ్।
చిత్రాం పుష్పోపహారేణ కల్మాషీ మివ సుప్రభామ్॥ ౨౮॥

మన స్సంహ్లాదజననీం వర్ణస్యాపి ప్రసాదినీమ్।
తాం శోకనాశినీం దివ్యాం శ్రియ స్సంజననీ మివ॥ ౨౯॥

ఇంద్రియా ణీంద్రియార్థై స్తు పంచపంచభి రుత్తమైః।
తర్పయామాస మాతేవ తదా రావణపాలితా॥ ౩౦॥

స్వర్గోయం దేవలోకోయ మింద్రస్యేయం పురీభవేత్।
సిద్ధి ర్వేయం పరాహి స్యా దిత్యమన్యత మారుతిః॥ ౩౧॥

ప్రధ్యాయత ఇవాపశ్య త్ప్రదీప్తాం స్తత్ర కాంచనాన్।
ధూర్తా నివ మహాధూర్తై ర్దేవనేన పరాజితాన్॥ ౩౨॥

దీపానాం చ ప్రకాశేన తేజసా రావణస్య చ।
అర్చిర్భి ర్భూషణానాం చ ప్రదీప్తే త్యభ్యమన్యత॥ ౩౩॥

తతో పశ్య త్కుథాసీనం నానావర్ణాంబరస్రజమ్।
సహస్రం వరనారీణాం నానావేష విభూషితమ్॥ ౩౪

గలకంబళములు పరువంబడియున్నదియు రాక్షసప్రభునిచే సేవింపఁబడినదియు, అగరుచెక్కల ధూపముచేఁ బొగక్రమ్మియున్నదియు నిర్మలమై హంసలచేఁ దెల్లనైయున్నదియుఁ బుష్పములతెగలచే ననేకవర్ణములుగలిగి నానావర్ణములుగల కల్మాషియను గోవువలె వెలుంగుచున్నదియు మనస్సునకు సంతోషమును గలిగించునదియు వర్ణములను వెడలఁగ్రక్కుచున్నదియు దుఃఖమును నశింపఁ జేయునదియు సంపదను గలిగించునదియు నగు దేవసంబంధమగు శాలను గనియెను.

౩౦. రావణునిచే నేలఁబడుచున్నదగు నాశాల శ్రేష్ఠములగు రూపరసగంధ శబ్దస్పర్శలనువిషయము లైదింటిచేతను హనుమంతుని నేత్రములు మొదలగు నైదింద్రియములను దల్లివలె నప్పుడు తృప్తిపఱచెను.

౩౧. ఆంజనేయుండాశాలనుగని, ఇదిస్వర్గలోకమని తలఁచెను దేవలోకముగానుండుననియు నెంచెను, ఇంద్రుఁడేలెడునమరావతి యనుపట్టణముగానుండుననియు యోచించెను. రావణుని తపస్సుయొక్క ఫలమిట్లు సిద్ధించెననియు ననుకొనియె.

౩౨. ఆశాలయొక్క కంబములపై నపరంజిచేఁ జిత్తరువులుగా వ్రాయంబడి ప్రకాశించుచున్న జూదరులలోఁ జిన్నవాఁడు పెద్దజూదరిచే నోడఁ గొట్టంబడి దుఃఖించుచున్నట్లు హనుమంతుఁడు దలఁచెను.

౩౩. దీపముల ప్రకాశముచేతను రావణుని శరీరకాంతిచేతను సొమ్ములయొక్క తళతళలచేతను, ఆశాల తగులఁబడుచున్నట్లుగ హనుమంతుఁడు తలఁచెను.

౩౪, ౩౫. సగమురాత్రి కాఁగనె రత్నకంబళముపైఁ గూర్చుండినదియుఁ బెక్కువర్ణములగు వస్త్రములను బుష్పములను ధరించినదియుసొ

పరివృత్తే ఽర్ధరాత్రే తు పాననిద్రా వశంగతమ్।
క్రీడిత్వోపరతం రాత్రౌ సుష్వాప బలవత్తదా॥ ౩౫॥

తత్ప్రసుప్తం విరురుచే నిశ్శబ్దాంతర భూషణమ్।
నిశ్శబ్ద హంసభ్రమరం యథా పద్మవనం మహత్॥ ౩౬॥

తాసాం సంవృత దంతాని మీలితాక్షాణి మారుతిః।
అపశ్య త్పద్మగంధీని వదనాని సుయోషితామ్॥ ౩౭॥

ప్రబుద్ధానీవ పద్మాని తాసాం భూత్వా క్షపాక్షయే।
పున స్సంవృత పత్రాణి రాత్రావివ బభుస్తదా॥ ౩౮॥

ఇమాని ముఖపద్మాని నియతం మత్తషట్పదాః।
అంబుజానీవ ఫుల్లాని ప్రార్థయంతి పునఃపునః॥ ౩౯॥

ఇతి చామన్యత శ్రీమా నుపపత్త్యా మహాకపిః।
మేనే హి గుణత స్తాని సమాని సలిలోద్భవైః॥ ౪౦॥

సా తస్య శుశుభే శాలా తాభి స్స్త్రీభి ర్విరాజితా।
శారదీవ ప్రసన్నా ద్యౌ స్తారాభి రభిశోభితా॥ ౪౧॥

స చ తాభిః పరివృత శ్శుశుభే రాక్షసాధిపః।
యథా హ్యుడుపతి శ్శ్రీమాం స్తారాభి రభిసంవృతః॥ ౪౨॥

రాయివలని మత్తునకును నిద్రకును లోఁబడినదియు, క్రీడించి తనినినది యనగు స్త్రీసహస్రము (వేయిమంది యందకత్తెలు) గాఢముగా నప్పుడు నిద్రించెను.

౩౬. మఱియేశబ్దమును గలుగక గాఢముగ నిద్రించుచున్న యా యుత్తమస్త్రీల సహస్రము (హంసలయొక్కయుఁ దుమ్మెదలయొక్కయు ధ్వనియడంగి నెమ్మదిగనున్న) గొప్ప పద్మములవనముఁబలెనే చారుతరమై యొప్పారెను.

౩౭. మీఁదఁజెప్పంబడిన యుత్తమస్త్రీలయొక్క కప్పుగలపంతము లను మూయంబడినకన్నులను, తామరపువ్వుల వాసనవంటి వాసనసుగల నోళ్ళను హనుమంతుఁడు గనియెను.

౩౮. ఆ స్త్రీలయొక్కముఖములు, పగటియందు వికసించియుండిన వై రాత్రులయందు మూసికొనుచున్న రేకులుగల కమలములవలె నప్పు [illegible]ప్పెను.

౩౯. మదించిన తుమ్మెదలీ స్త్రీలయొక్క ముఖములను బూచిన కమలములవలెఁ బలుమఱు ప్రార్థించుచున్నవియని యాతండు దలఁచె.

౪౦. వానరోత్తముఁడే కారణముచేత నా స్త్రీల ముఖములు, చల్లద నము పరిమళము మొదలగు గుణములుగలిగినకమలములకుసాటియని తలంచె నో యుక్తిచే నాబుద్ధిమంతుఁడు దాని నూహించెను.

౪౧. ఆ స్త్రీలచేఁ బ్రకాశించుచున్నదియగుశాల శరత్కాలమందు నక్షత్రములకాంతిచేత నంతటను బ్రకాశించుచున్న యాకాశమువలెవెలిం గెను.

౪౨. ఆస్త్రీలచేఁ జుట్టంబడినవాఁడై యారావణుఁడు, నక్షత్ర ములచేఁ జుట్టంబడిన కాంతిమంతుఁడగు చంద్రునివలెఁ దోఁచెను.

యాశ్చ్యవంతేంబరాత్తారాః పుణ్యశేష సమావృతాః।
ఇమాస్తాస్సంగతాః కృత్స్నా ఇతి మేనే హరిస్తదా॥ ౪౩॥

తారాణామివ సువ్యక్తం మహతీనాం శుభార్చిషామ్।
ప్రభావర్ణ ప్రసాదాశ్చ విరేజుస్తత్ర యోషితామ్॥ ౪౪॥

వ్యావృత్త గురుపీన స్రక్ప్రకీర్ణ వరభూషణాః।
పాన వ్యాయామ కాలేషు నిద్రాపహృత చేతసః॥ ౪౫॥

వ్యావృత్త తిలకాః కాశ్చి త్కాశ్చి దుద్భ్రాంత నూపురాః।
పార్శ్వే గళితహారాశ్చ కాశ్చి త్పరమయోషితాః॥ ౪౬॥

ముక్తాహారావృతా శ్చాన్యాః కాశ్చి ద్విస్రస్త వాససః।
వ్యావిద్ధ రశనా దామాః కిశోర్య ఇవ వాహితాః॥ ౪౭॥

సుకుండలధరా శ్చాన్యా విచ్ఛిన్న మృదిత స్రజః।
గజేంద్ర మృదితాః ఫుల్లాః లతా ఇవ మహావనే॥ ౪౮॥

చంద్రాంశు కిరణాభా శ్చ హారాః కాసాంచి దుత్కటాః।
హంసా ఇవ బభు స్సుప్తా స్స్తనమధ్యేషు యోషితామ్॥ ౪౯॥

అపరాసాం చ వైడూర్యాః కాదంబా ఇవ పక్షిణః।
హేమసూత్రాణి చాన్యాసాం చక్రవాకా ఇవా భవన్॥ ౫౦॥

౪౩. ఏనక్షత్రములు గొంచెముపుణ్యము మిగిలియుండఁగనే భూమి కేవచ్చుచున్నవో, ఆనక్షత్రములుగా నంటఁ జేరియున్న స్త్రీల నందఱను హనుమంతుఁడు దలంచెను.

౪౪. మంగళకరమగుకాంతినిగల నక్షత్రములయొక్క ప్రకాశము వలెనే, ఆశాలయందున్న స్త్రీలయొక్క కాంతియు నిర్మలతయు గుణములును బేటగా వెలింగెను.

౪౫. ఆస్త్రీలు మద్యపానముచేసి మైమఱచి యున్నపుడును నృత్తము మొదలగువాని పరిశ్రమచేసినపుడును సడలిన పుష్పహారములును జెదరిన భూషణములును నిద్దురకులోఁబడిన మనస్సులును గలవారగుచుఁ బ్రకాశించిరి.

౪౬. కొంద ఱుత్తమురాండ్రగు నిల్లాండ్రు జాఱినతిలకముగలవారును, మఱికొందఱు జరిగినయందెలుగలవారును, ఇంకఁగొందఱు ప్రక్కనూడిరాలిన కంఠహారములు గలవారునుగా వెలింగిరి.

౪౭. తెగినముత్తెముల దండలచేఁ జుట్టుకొనఁబడినవారును, కట్టువదలిన చీరెలుగలవారును, ధ్వనించుచున్న మొలనూళ్లు కలవారునుగానిటునటుత్రిప్పఁబడి యాఁడుగుఱ్ఱపు పిల్లలవలె నాస్త్రీలుప్రకాశించిరి.

౪౮. వెలగలకుండలములుధరించిన మఱికొందఱు భాములు దెగినలిగివాడిన పూదండలుగలవారై, మహావనమందు దొడ్డయేనుఁగుచే నలుపంబడిన పూచిన తీఁగలవలె వెలింగిరి.

౪౯. చంద్రకిరణములవలెఁదెల్లగనున్నముత్తెములహారములు నిద్రించుకొందఱు స్త్రీలయొక్క స్తనములనడుమ నిద్రించుచున్నహంసలవలెఁ బ్రకాశించెను.

౫౦. మఱికొందఱు స్త్రీలయొక్క వైడూర్యమణులదండలు హంసలవలెను.ఇంకఁగొందఱ బంగారుదండలు చక్రవాకములవలెను నుండెను.

హంస కారండవాకీర్ణా శ్చక్రవా కోపశోభితాః।
ఆపగా ఇవ తా రేజు ర్జఘనైః పులినై రివ॥ ౫౧॥

కింకిణీజాల సంకోశా స్తా హైమవిపులాంబుజాః।
భావగ్రాహా యశ స్తీరా స్సుప్తా నద్య ఇవా బభుః॥ ౫౨॥

మృదు ష్వంగేషు కాసాంచి త్కుచాగ్రేషు చ సంస్థితాః।
బభూవు ర్భూషణానీవ శుభా భూషణరాజయః॥ ౫౩॥

అంశుకాన్తాశ్చ కాసాంచి న్ముఖమారుత కమ్పితాః।
ఉపర్యుపరి వక్త్రాణాం వ్యాధూయంతే పునఃపునః॥ ౫౪॥

తాః పతాకా ఇవోద్ధూతాః పత్నీనాం రుచిర ప్రభాః।
నానావర్ణ సువర్ణానాం వక్త్రమూలేషు రేజిరే॥ ౫౫॥

వవల్గు శ్చాత్ర కాసాంచి త్కుండలాని శుభార్చిషామ్।
ముఖమారుత సంసర్గా న్మందంమందం సుయోషితామ్॥ ౫౬॥

శర్కరా సవ గంధై శ్చ ప్రకృత్యా సురభి స్సుఖః।
తాసాం వదననిశ్శ్వాస స్సిషేవే రావణం తదా॥ ౫౭॥

రావణానన శంకా శ్చ కాశ్చి ద్రావణయోషితః।
ముఖాని స్మ సపత్నీనా ముపాజిఘ్ర న్పునఃపునః॥ ౫౮॥

౫౧. అనిద్రింపబడుచుండు, ఇసుకదిన్నెలచేతను హంసలు మొదలగు నీటిపక్షులచేతను చక్రవాకములచేతను, వెలింగిన నదులవలెఁ దమపొత్తికడుపులచే నొప్పిరి.

౫౨. ఆనిద్రించుచున్న స్త్రీలు మువ్వలనెడు మొగ్గలను బంగారుసొమ్ములనెడుకమలములను, అభిప్రాయములనెడి మొసళ్ళను కీర్తియనెడు తీరములను గలిగి నదులవలె వెలింగిరి.

౫౩. కొందఱు స్త్రీలయొక్క మెత్తని యంగములయందును స్తనములమీఁదను నున్నట్టి మంగళకరమగు భూషణములగుఱుతులు భూషణములవలెనే యుండెను.

౫౪. కొందఱు స్త్రీలయొక్క పైటచెఱఁగులకొనలు వారిముఖములనుండి వెలువడువాయువుచేఁ గదల్పఁబడినవై ముఖములమీఁదఁ బలుమఱు తూలుచున్నవి.

౫౫. పెక్కుతెఱంగుల నింపగు శరీరచ్ఛాయలుగల రావణుని భార్యలయొక్కముఖములపైఁ దూలఁగొట్టఁబడిన పయటచెఱఁగులు మిక్కిలి కాంతిగలవై టెక్కెములవలెఁ బ్రకాశించెను.

౫౬. ఈపడకటింటియందే మిక్కిలి యందకత్తెలగు కొందరిల్లాండ్రయొక్కకమ్మలు నోటిగాలిసోఁకుటచే మెల్లమెల్లఁగాఁ గదలెను.

౫౭. సహజముగనే చక్కెరగలిసిన కల్లుకంపును గొట్టుచున్న యాయిల్లాండ్రనోటిగాలి రావణునిఁ జెందెను.

౫౮. అట్లు నిద్రించుచున్న రావణునిభార్యలలోఁ గొందఱు రావణునిముఖమనితలంచి మయికముచే నొకరిమో మొకరు మూర్కొనిరి.

అత్యర్థం సక్తమనసో రావణే తా వరస్త్రియః।
అస్వతంత్రా స్సపత్నీనాం ప్రియమేవాచరం స్తదా॥ ౫౯

బాహూ నుపనిధా యాన్యాః పారిహార్య విభూషితాన్।
అంశుకాని చ రమ్యాణి ప్రమదా స్తత్ర శిశ్యిరే॥ ౬౦

అన్యా వక్షసి చాన్యస్యా స్తస్యాః కాశ్చి త్పునర్భుజమ్।
అపరా త్వంక మన్యస్యా స్తస్యా శ్చా ప్యపరా భుజౌ॥ ౬౧

ఊరూపార్శ్వ కటీ పృష్ఠ మన్యోన్యస్య సమాశ్రితాః।
పరస్పర నివిష్టాంగ్యో మదస్నేహ వశానుగాః॥ ౬..

(అన్యోన్యస్యాంగ సంస్పర్శా త్ప్రియమాణా స్సుమధ్యమాః।
ఏకీకృత భుజాస్సర్వా స్సుషుపు స్తత్ర యోషితః॥)
అన్యోన్య భుజసూత్రేణ స్త్రీమాలా గ్రథితా హి సా।
మాలేవ గ్రథితాసూత్రే శుశుభే మత్తషట్పదా॥ ౬

లతానాం మాధవేమాసి ఫుల్లానాం వాయుసేవనాత్।
అన్యోన్యమాలాగ్రథితం సంసక్త కుసుమోచ్చయమ్॥ ౬

వ్యతివేష్టిత సుస్కంధ మన్యోన్య భ్రమరాకులమ్।
ఆసీ ద్వన మివోద్ధూతం స్త్రీవనం రావణస్య తత్॥ ౬

౫౯. ప్రేమకుఁబరవశలై, రావణునియందు మిక్కిలిమోహముంగలయాస్త్రీలు నిద్దురమత్తున, సవతులను ద్వేషములేక మైత్రితో మెలంగిరి.

౬౦. కొందఱు యౌవనవతులగు స్త్రీలు కంకణములచే నలంకరింపఁబడిన యందములగుభుజములను, మెత్తనిపైటచెఱఁగులను దలక్రిందనుంచుకొని యందు నిద్రించిరి.

౬౧, ౬౨. ఒక్కత మఱియొకదానియొక్క ఱొమ్మునఁ దలయిడియు, కొందఱుపరల భుజములుతలగడలుచేసికొనియు, కొంతమంది యితరులతొడలపైఁ దలలుంచియు, కొందఱు రెండుభుజములు తలక్రిందనిడికొనియుఁ బరుండియుండిరి. మత్తెక్కినవారైనందున తొడలును బ్రక్కలును మొలయుఁ బిరుదులు నొకరిటొకరుపట్టుకొనియు నొకరిమేనుపై మఱియొకరి యంగములనువైచికొనియు నిట్లుపరస్పర స్పర్శచేత నతిశయించిన ప్రేమగలవారై యాసన్నని నడుముగల పడుచులు వరుసగా నిలిపినభుజములతో పరుండియుండిరి.

౬3. ఈవేయిమంది స్త్రీలును వరుసగఁబరుండిరి కావున, వీరిభుజములనియెడుత్రాటిచేఁ గూర్పఁబడిన స్త్రీలవరుస దారమందుఁ గూర్పఁబడిన తుమ్మెదలదండవలె నొప్పెను.

౬౪, ౬౫. వాయువువీచుటవలనఁ బరస్పరముగలిసినవియు,కూడికొనిన పూగుత్తులగలవియు, పెనఁగిన మొదళ్ళనుగలవియు, ఇందలియందలి తుమ్మెదలుగలియుటచేఁ గలతనొందుచున్నవియునగు లెస్సగఁబూచియున్న వైశాఖమాసమందలి తీఁగెలుగల వనమువలెనే, రావణుని యంతఃపురమందలి స్త్రీలు చేతులుచాచికొని బట్టలుతొలఁగి తొడలుపెనచికొని ముంగురులుచెదరి పరవశలై పరుండి నిద్రించుచుండిరి.

ఉచితే ష్వపి సువ్యక్తం న తాసాం యోషితాం తదా।
వివేక శ్శక్య అధాతుం భూషణాం గాంబరస్రజామ్॥ ౬౬॥
రావణే సుఖసంవిష్టే తాః స్త్రియో వివిధప్రభాః।
జ్వలంతః కాంచనాదీపాః ప్రైక్షంతానిమిషా ఇవ॥ ౬౭॥
రాజర్షి పితృ దైత్యానాం గంధర్వాణాం చ యోషితః।
రాక్షసానాంచ యాః కన్యా స్తస్య కామవశంగతాః॥ ౬౮॥
యుద్ధకామేన తా స్సర్వా రావణేన హృతా స్త్రియః।
సమదా మదనే నైవ మోహితాః కాశ్చి దంగనాః॥ ౬౯॥

స తత్ర కాచి త్ప్రమదా ప్రసహ్యా వీర్యోపపన్నేన గుణేనలబ్ధా। నచాన్యకామాపి న చాన్యపూర్వా వినా వరార్హాం జనకాత్మజాం తామ్॥ ౭౦॥

న చా కులీనా న చ హీనరూపా నాదక్షిణా నా నుపచారయుక్తా। భార్యాభవ త్తస్య న హీనసత్వా న చాపి కాంత స్యా న కామనీయా॥ ౭౧॥

౬౬. అప్పుడా స్త్రీలయొక్క సొమ్ములు వస్త్రములు నవయవములు పూవుమెత్తులు కలసినవియయినందున వానినిగూర్చి యీయాభూషణాదులు వీరివనినిర్ణయింప జాలనివారై యుండిరి.

౬౭. ఆరావణుఁడు సుఖముగనిద్రించుచుండఁగా నానావిధములను కాంతులుగల బంగారుస్తంభములయందున్న దీపము లాస్త్రీలను ఱెప్పపాటులేక చూచుచున్నట్లుండెను.

౬౮. రాజశ్రేష్ఠులయొక్కయు రాక్షసులయొక్కయు గంధర్వులయొక్కయు పడుచులు రావణునికోరికకు లోఁబడినవారై వానికి భార్యలై యుండిరి.

౬౯. యుద్ధమునందు దర్పమునుజూపి రావణుఁడుగెలిచితెచ్చిన కొందఱు స్త్రీలు వయస్సుననున్నవారుగావున మన్మథవికారము చెంది వానికి లోఁబడిరి.

౭౦. అట్లు యుద్ధమునజయించి తేఁబడిన స్త్రీలలో నాతనిచే నొక్కతెయైనను బలవంతముగఁ బొందఁబడినదిలేదు. అందఱు నాతనియందమును జూచియే మోహించిరి. ఆ స్త్రీలలో నితరునికోరియున్న దానినిగాని యితరునకు భార్యయైయుండిన దానినిగాని రావణుఁడు తేఁడయ్యెను. సీతనుమాత్రమె పరునిభార్యయని శంకింపక తెచ్చెను.

౭౧. ఆ స్త్రీలలో నీచకులమునఁబుట్టినదియు, అందముచేఁదగ్గినదియు నేర్పుచాలనిదియు మగనికుపచారము చేయనిదియు బలహీనయైనదియు మగని కింపుకానిదియు వానికి భార్యకాదయ్యెను.

బభూవ బుద్ధి స్తు హరీశ్వరస్య యదీదృశీ రాఘవధర్మపత్నీ
ఇమా యథా రాక్షసరాజభార్యా స్సుజాత మస్యేతిహి సా
ధుబుద్ధేః॥ ౭౨॥

పున శ్చ సో చింతయ దార్తరూపో ధ్రువం విశిష్టా గుణతో
హి సీతా। అథాయ మస్యాం కృతవా న్మహాత్మా లంకేశ్వ
రః కష్ట మనార్యకర్మ॥ ౭౩॥

ఇతి శ్రీమత్సుందరకాండే - నవమస్సర్గః.

---

దశమస్సర్గః.

తత్ర దివ్యోపమం ముఖ్యం స్ఫాటికం రత్నభూషితమ్।
అవేక్షమాణో హనుమాన్ దదర్శ శయనాసనమ్॥ ౧॥

దాంతకాంచన చిత్రాంగై ర్వైడూర్యై శ్చ వరాసనైః।
మహార్హాస్తరణోపేతై రుపపన్నం మహాధనైః॥ ౨॥

తస్య చైకతమే దేశే సోగ్ర్యమాలా విభూషితమ్।
దదర్శ పాండరచ్ఛత్రం తారాధిపతి సన్నిభమ్॥ ౩॥

౭౨. ఈసకలగుణసంపన్నలగు పడుచులందఱురావణున కెట్లు భార్యలైరో యటువలెనే, శ్రీరామున కగ్నిసాక్షిగాభార్యయైయున్న యీసీత వివాహమునకుమున్నే వీనిభార్యయైయుండు నేని వీనికిఁ జేటుగలుగకుండునుగదాయని బుద్ధిమంతుఁడగు హనుమంతుఁడు రావణునివెంపునుగాంచి తలంచెను.

౭౩. సీత సమస్తసద్గుణసంపత్తిచేతను మిక్కిలియుత్తమురాలగుట సత్యముకదా! అట్టియామెయెడలఁ గ్ధలసంపదలచేనధికుఁడగు లంకానాథుండు తనయోగ్యతకుందగని మహాపరాధము నేసినవాఁడయ్యెను, కటకటా! అని ఖిన్నుఁడై హనుమంతుఁడు యోచించెను.

ఇది తొమ్మిదవసర్గ.

---

పదియవసర్గ.

౧, ౨. ఆరావణుని యంతఃపురశాలయందు నలుప్రక్కలఁగను చుండి దేవలోకమునందలి దానితో సమమైనదియు రావణునికిష్టమైనదియు స్ఫటికములచేఁ జేయంబడి యితరరత్నములచే నలంకరింపఁబడినదియు దంతము బంగారములచేతఁ జిత్రమగు పనులుచేయంబడినదియు, వైడూర్యముచే నిర్మింపఁబడినపీఠములను బార్శ్వములయందుఁ గలదియు మిక్కిలివెలగల పాన్పులతోఁ గూడినదియు నగుమంచమును హనుమంతుఁడు గనియె.

౩. ఆమంచముయొక్క మీఁదిభాగమున నందమగు పూదండలచే నలంకరింపఁబడినదియు, తెల్లనై పున్నమచంద్రునిం బోలినదియునగుగొడుగును హనుమంతుఁడు గాంచెను.

జాతరూప పరిక్షిప్తం చిత్రభాను సమప్రభమ్।
అశోకమాలా వితతం దదర్శ పరమాసనమ్॥ ౪॥
వాలవ్యజన హస్తాభి ర్వీజ్యమానం సమంతతః।
గంధైశ్చ వివిధై ర్జుష్టం వరధూపేన ధూపితమ్॥ ౫॥
పరమా స్తరణా స్తీర్ణ మావికాజిన సంవృతమ్।
దామభి ర్వరమాల్యానాం సమంతా దుపశోభితమ్॥ ౬॥
తస్మిన్జీమూతసంకాశం ప్రదీప్తోత్తమ కుండలమ్।
లోహితాక్షం మహాబాహుం మహారజత వాససమ్॥ ౭॥
లోహితే నానులిప్తాంగం చందనేన సుగంధినా।
సంధ్యారక్త మివాకాశే తోయదం స తటిద్గణమ్॥ ౮॥
వృత మాభరణై ర్దివ్యై స్సురూపం కామరూపిణమ్।
స వృక్ష వనగుల్మాఢ్యం ప్రసుప్త మివ మందరమ్॥ ౯॥
క్రీడిత్వోపరతం రాత్రౌ వరాభరణభూషితమ్।
ప్రియం రాక్షసకన్యానాం రాక్షసానాం సుఖావహమ్॥ ౧౦॥
పీత్వా ప్యుపరతం చాపి దదర్శ స మహాకపిః॥ ౧౦½
భాస్వరే శయనే వీరం ప్రసుప్తం రాక్షసాధిపమ్॥ ౧౧॥
నిశ్శ్వసంతం యథా నాగం రావణం వానరర్షభః।
ఆసాద్య పరమోద్విగ్న స్సోపాసర్పత్సు భీతవత్॥ ౧౨॥

౪, ౫, ౬. బంగారముచేఁ జేయంబడినదియు సూర్యునికాంతి వంటి కాంతినిగలదియు, అశోకపుష్పముల మాలికలనుగలిగి విశాలమైనదియు, చామరములను జేతులందుగల స్త్రీలచేఁ సంతతము వీవంబడుచున్నదియు నానావిధములైన పరిమళముతోఁగూడినదియు మేలైన ధూపద్రవ్యముచేఁ బొగవేయంబడినదియు శ్రేష్ఠములగు పరుపుల సంతతము బరువంబడినదియు గొర్రెతోలుచేఁ గప్పఁబడినదియు శ్రేష్ఠములగు పుష్పదండలచే సంతతము వెలుంగుచున్నదియు నగుపాన్పును వాయుపుత్రుండు లెస్సఁగఁ గనియెను.

౭, ౮, ౯, ౧౦, ౧౧ ఆపాన్పునందు మేఘముతోఁ దుల్యముగ వెలుంగువాఁడును బ్రకాశించుచున్న వెలగల కుండలములఁగలవాఁడును, ఎఱ్ఱనికన్నులుగలవాఁడును బంగారుపచ్చడమును ధరించినవాఁడును మంచిపరిమళముగల యెఱ్ఱనిచందనములందినవాఁడును సంధ్యాకాలమునందలి యెఱుపుతోడను మెఱుపుతోడను గూడినమేఘమువలె నున్నవాఁడును దేవతల సంబంధమగు భూషణములను ధరించియున్నవాఁడును జక్కనివాఁడును గోరిన రూపమును ధరించువాఁడును, వృక్షములయొక్కయుఁ బొదలయొక్కయు సమూహముతోఁగూడి పరుండినిద్రించుచున్న సుందరపర్వతముతోఁ దుల్యుఁడును, భోగించి యొడలుమఱచి నిద్రించువాఁడును వెలగలభూషణములచే నలంకరింపఁబడినవాఁడును రాక్షసకన్యకల కిష్టుఁడైనవాఁడును రాక్షసులకు మేలుకూర్చువాఁడును లెస్సఁగఁబానము చేసె పరవశుఁడై యున్నవాఁడును నగు రావణాసురుని వానరశ్రేష్ఠుండు గనియెను.

౧౨, ౧౩. ప్రకాశించుచున్న పాన్పునందు నిద్రించుచున్నవాఁడునువీరుఁడును రాక్షసరాజును సర్పమువలె శ్వాసవిడచుచున్నవాఁడును నగు రావణునిసమీపించి హనుమంతుఁడు బెదరినట్లు దూరముగ నేగెను.

అథారోహణ మాసాద్య వేదికాంతర మాశ్రితః।
సుప్తం రాక్షసశార్దూలం ప్రేక్షతే స్మ మహాకపిః॥ ౧౩॥
శుశుభే రాక్షసేంద్రస్య స్వపత శ్శయనోత్తమమ్।
గంధహస్తిని సంవిష్టే యథా ప్రస్రవణం మహత్॥ ౧౪॥
కాంచనాంగద సన్నద్ధౌ స దదర్శ స మహాత్మనః।
విక్షిప్తౌ రాక్షసేంద్రస్య భుజా వింద్రధ్వజోపమౌ॥ ౧౫॥
ఐరావత విషాణాగ్రై రాపీడనకృత వ్రణౌ।
వజ్రోల్లిఖిత పీనాంసౌ విష్ణుచక్ర పరిక్షతౌ॥ ౧౬॥
పీనౌ సమసుజాతాంసౌ సంగతౌ బలసంయుతౌ।
సులక్షణ నఖాంగుష్ఠౌ స్వంగుళీయక లక్షితౌ॥ ౧౭॥
సంహతౌ పరిఘాకారౌ వృత్తౌ కరికరోపమౌ।
విక్షిప్తౌ శయనే శుభ్రే పంచశీర్షా వివోరగౌ॥ ౧౮॥
శశక్షతజ కల్పేన సుశీతేన సుగంధినా।
చందనేన పరార్థ్యేన స్వనులిప్తౌ స్వలంకృతౌ। ౧౯॥
ఉత్తమస్త్రీ విమృదితౌ గంధోత్తమ నిషేవితౌ।
యక్ష పన్నగ గంధర్వ దేవ దానవ రావిణౌ॥ ౨౦॥
దదర్శ స కపి స్తస్య బాహూ శయనసంస్థితౌ।
మందరస్యాంతరే సుప్తౌ మహాహీ రుషితా వివ॥ ౨౧॥

౧౩. అందుండి సోపానములకేగి యచటనుండి మఱియొకతిన్నె కెక్కి యావాసరోత్తముఁడు రాక్షసశ్రేష్ఠునిం గనుంగొనియెను.

౧౪. అపుడు రాక్షసరాజు పరుండియున్న పానుపు, మదపుటేనుఁగు ప్రవేశించిన ప్రవాహ మెట్లుండునో యటువలె వెలింగెను.

౧౫ నుండి ౨౧ వఱకు. బంగారుభుజకీర్తులతోఁగూడినవియుఁ జాపంబడినవియు నింద్రునిధ్వజస్తంభములవలె నున్నవియు యుద్ధమునందైరావతము దేవేంద్రునియేనుఁగ కొమ్ముచేఁ జేయంబడిన గాయములనుగలవియు నింద్రునివజ్రాయుధముచే నొరసిన స్థూలమగు మూఁపును గలవియు విష్ణుదేవుని సుదర్శనము చక్రముచే గాయములుపడినవియు బలిసినవియు సమానమై యందమైయున్న మూఁపులనుగలవియుఁ గూడియున్నవియు బలముంగలవియు శుభలక్షణములతోఁ గూడినగోళ్లనువ్రేళ్లను గలవియు సొంపగుసుంగరములచే నొప్పినవియు, అమరినట్లున్నవియు గదలవలె బలిష్ఠములైనవియుఁ బుష్టిగలిగి యేనుఁగుతొండమువలె నున్నవియు, అయిదేసితలలు గలసర్పములవలెఁ దెల్లనిపాన్పునందుఁ జాపంబడియున్నవియు, కుందేటిరక్తమువలె నెఱ్ఱనై పరిమళముంగల శ్రేష్ఠమగుగంధముచే జక్కఁగఁ బూయంబడి యలంకరింపఁబడినవియు రూపవతులగు స్త్రీలచేఁ బట్టంబడినవియు, కల్లుచేనాశ్రయింపఁబడినవియు యక్షులు పన్నగులు గంధర్వులు దేవదానవులు మొదలగువారినిరోదనము చేయునట్లు చేసినవియు నగు సమర్థుఁడగు నారాక్షసరాజు భుజములను హనుమంతుఁడుగనియెను. మిక్కిలి రోషముతోఁగూడినవై మందరపర్వతమందు నిద్రించుచున్న సర్పములవలె నా పాన్పునందున్నవియగు రావణుని భుజములను వానరుండు గాంచెను.

తాభ్యాం స పరిపూర్ణాభ్యాం భుజాభ్యాం రాక్షసేశ్వరః।
శుశుభే చల సంకాశ శ్శృంగాభ్యామివ మందరః॥ ౨౧॥

చూత పున్నాగ సురభి ర్బకులో త్తమ సంయుతః।
మృష్టాన్నరస సంయుక్తః పానగంధ పురస్సరః॥ ౨౨॥

తస్య రాక్షససింహస్య నిశ్చక్రామ మహాముఖాత్।
శయానస్య వినిశ్శ్వాసః పూరయన్నివ తద్గృహమ్॥ ౨౩॥

ముక్తామణి విచిత్రేణ కాంచనేన విరాజితమ్।
మకుటే నాపవృత్తేన కుండలోజ్జ్వలి తాననమ్॥ ౨౪॥

రక్తచందన దిగ్ధేన తథా హారేణ శోభినా।
పీనాయత విశాలేన వక్షసా భివిరాజితమ్॥ ౨౫॥

పాండరే ణాపవిద్ధేన క్షౌమేణ క్షతజేక్షణమ్।
మహార్హేణ సుసంవీతం పీతే నో త్తమవాససా॥ ౨౬॥

మాషరాశి ప్రతీకాశం నిశ్శ్వసంతం భుజంగవత్।
గాంగే మహతి తోయాంతే ప్రసుప్తమివ కుంజరమ్॥ ౨౭॥

చతుర్భిః కాంచనై ర్దీపై ర్దీప్యమాన చతుర్దిశమ్।
ప్రకాశీకృత సర్వాంగం మేఘం విద్యుద్గణై రివ॥ ౨౮॥

పాదమూల గతా శ్చాపి దదర్శ సుమహాత్మనః।
పత్నీ స్స ప్రియభార్యస్య తస్య రక్షఃపతే ర్గృహే॥ 3౦॥

౨౨. పర్వతముతోఁ దుల్యుండగు రావణుండు పూర్ణములగు [illegible] జలముతో శిఖరములచేసె నొప్పెడు మందరమువలె వెలింగెను.

౨౩, ౨౪. మామిడిపండ్లయొక్కయుఁ బొన్నపూలయొక్కయు వాసననుగలదియు మేలగు పొగడపూల పరిమళమునుగలదియు శ్రేష్ఠమగు నన్నముయొక్క తావినిగల్గదియుఁ గల్లుసారాయీలయొక్క కంపునుగలదియు నగు శ్వాసవాయు వాయింటినంతయు నిండించుటకుఁజాలినదై యారాక్షసప్రభునిముఖమునుండి వెలువడియెను.

౨౫ నుండి ౩౦ వఱకు. ముత్తెములచే వింతయైనదియై తలనుండి తొలఁగినదియగు బంగారుకిరీటముచేఁ బ్రకాశించుచున్నవాఁడును, కుండలములచే వెలుంగుచున్న ముఖమునుగలవాఁడును, ఎఱ్ఱనిచందనముచేఁబూయంబడి యెఱ్ఱనిహారములచే నలంకరింపంబడి యున్నతమై వెడల్పయిన ఱొమ్ముచేఁ బ్రకాశించువాఁడును, చెదరియున్న తెల్లనిపట్టుపచ్చడముచే నొప్పినవాఁడును, ఎఱ్ఱనికన్నులుగలవాఁడును వెలగలపచ్చనిపట్టువస్త్రమునుధరించియున్నవాఁడును మినుములరాశివలె నున్నవాఁడును సర్పమువలెబుసపెట్టుచున్నవాఁడును, దొడ్డదియగు గంగాప్రవాహమునకునడుమ నిద్దురపోవుచున్న యేనుఁగువలె నున్నవాఁడును నలుదిక్కులయందును నాల్గుబంగారుస్తంభములయందలి దీపములచే వెలుంగువాఁడును, మెఱుపులచే మేఘము వెలింగినట్లు శరీరమంతయుఁ దేటగఁదెలియవచ్చుచున్న వాఁడును ఇష్టభార్యలను గలవాఁడునగు రావణునియింటు, మహాత్ముఁడగు నాతనిపాదములకడనున్న భార్యలను హనుమంతుఁడుగనియె.

శశిప్రకాశవదనా శ్చారుకుండలభూషితాః।
అమ్లానమాల్యాభరణా దదర్శ హరియూథపః॥ ౩౧॥

నృత్త వాదిత్ర కుశలా రాక్షసేంద్ర భుజాంకగాః।
వరాభరణధారిణ్యో నిషణ్ణా దదృశే హరిః॥ ౩౨॥

వజ్ర వైడూర్యగర్భాణి శ్రవణాంతేషు యోషితామ్।
దదర్శ తాపనీయాని కుండలా న్యంగదాని చ॥ ౩౩॥

తాసాం చంద్రోపమై ర్వక్త్రైః శ్శుభై ర్లలిత కుండలైః।
విరరాజ విమానం త న్నభ స్తారాగణై రివ॥ ౩౪।

మదవ్యాయామ ఖిన్నా స్తా రాక్షసేంద్రస్య యోషితః।
తేషు తే ష్వవకాశేషు ప్రసుప్తా స్తనుమధ్యమాః॥ ౩౫

అంగహారై స్తథైవాన్యా కోమలై ర్నృత్తశాలినీ।
విన్యస్త శుభసర్వాంగీ ప్రసుప్తా వరవర్ణినీ॥ ౩౬

కాచి ద్వీణాంపరిష్వజ్య ప్రసుప్తా సంప్రకాశ తే।
మహానదీ ప్రకీర్ణేవ నళినీ పోత మాశ్రితా॥ ౩౭

అన్యా కక్షగతేనైవ మడ్డు కే నాసితేక్షణా।
ప్రసుప్తా భామినీ భాతి బాలపుత్రేవ వత్సలా॥ ౩౮

౩౧. చంద్రునింబోలు మోముగలట్టియు నందమగు కన్నులనుగలట్టియు వాడని పూదండలచే నలంకరింపఁబడినట్టియు స్త్రీలను వానరోత్తముఁడు గాంచెను.

౩౨. నాట్యమందును వాద్యములువాయించుటయందును నేర్పరులైనవారిని, రావణునితొడలకడను భుజములకడనున్నవారిని శ్రేష్ఠమగు సొమ్ములను ధరించినవారిని స్త్రీలను హనుమంతుఁడు గనియె.

౩౩. వజ్రములను వైడూర్యములను బొదగఁబడిన బంగారుకమ్మల నా స్త్రీలయొక్క చెవులతుదలందుఁ గనియెను, అట్టిభుజకీర్తులను ధరించియుంటయుఁ గాంచెను.

౩౪. ప్రకాశించెడు కుండలములచేనొప్పి మంగళకరమై చంద్రునితోఁ దుల్యములగు వారిమోములచే నావిమానము, నక్షత్రములసమూహముచే నాకాశము వెలింగిన ట్లొప్పెను.

౩౫. అందమగు నడుములంగల యారాక్షసరాజభార్యలు కల్లుమొదలగునవిత్రావి యొడలెఱుంగకుండునంతకై యెక్కి తోఁచినచోటనె ల్లఁ బడినిద్రించుచుండిరి.

౩౬. మంచి మేనికాంతినిగల యొకచిన్నది సుకుమారములగు నవయవములచే నభినయముంజూపుచు నాట్యముంజేసి యందములగు నంగములన్నియు నట్లే నిలిపి నిద్రించుచున్నది.

౩౭. ఒకచిన్నది వీణను గౌఁగిలించికొని నిద్రించుచు, గొప్పప్రవాహముయొక్క వేగమునఁదగిలి దోనెనాశ్రయించిన తామరతీఁగవలెఁ బ్రకాశించెను.

౩౮. నల్లనికన్నులంగలదియగు మఱియొక యందకత్తె మడ్డుకమను వాద్యమును జంకనిడికొని నిద్రించుచు లేఁతబిడ్డను జంకయందుంచుకొని ప్రేమచూపుచున్నదానివలె నొప్పెను.

పటహం చారుసర్వాంగీ పీడ్య శేతే శుభస్తనీ।
చిరస్య రమణం లబ్ధ్వా పరిష్వజ్యేవ భామినీ॥ ౩౯॥

కాచి ద్వంశం పరిష్వజ్య సుప్తా కమలలోచనా।
రహః ప్రియతమం గృహ్యా సకామేవ చ కామినీ॥ ౪౦॥

విపంచీం పరిగృహ్యాన్యా నియతా నృత్తశాలినీ।
నిద్రావశ మనుప్రాప్తా సహకాంతేవ భామినీ॥ ౪౧॥

అన్యా కనకసంకాశై ర్మృదుపీనై ర్మనోరమైః।
మృదంగం పరిపీడ్యాంగైః ప్రసుప్తా మత్తలోచనా॥ ౪౨॥

భుజపార్శ్వాంతరస్థేన కక్షగేన కృశోదరీ।
పణవేన సహానింద్యా సుప్తా మదకృతశ్రమా॥ ౪౩॥

డిండిమం పరిగృహ్యాన్యా తథైవాసక్తడిండిమా।
ప్రసుప్తా తరుణం వత్స ముపగూహ్యేవ భామినీ॥ ౪౪।

కాచి దాడంబరం నారీ భుజసంయోగపీడితమ్।
కృత్వా కమలపత్రాక్షీ ప్రసుప్తా మదమోహితా॥ ౪౫

కలశీ మపవిధ్యాన్యా ప్రసుప్తా భాతి భామినీ।
వసంతే పుష్పశబలా మాలేవ పరిమార్జితా॥ ౪౬

౩౯. గుత్తమగు స్తనములుగలదియు సర్వాంగ సౌందర్యముంగలదియునగు నొకతె పటహమను వాద్యమును బట్టుకొని, దీర్ఘకాలమునకుఁ బిమ్మట మగనిఁబొంది గాఢముగాఁ గౌఁగలించికొనియున్న యౌవనవతి వలెఁ బరుండియున్నది.

౪౦. కమలములవంటి కన్నులుగలదియగు నొకపడుచు పిల్లనగ్రోవిని జేతంబూని ప్రియుఁడగువాని నేకాంతమునంబొంది కోరికతోఁ డనున్న దానివలె నిద్రించెను.

౪౧. మఱియొకతె వీణనుధరించి నాట్యము చేయుచుండి, మగనితోఁడఁగూడఁ బరుండియున్న కాంతవలె నిద్రకులోఁబడియెను.

౪౨. ఇంకొక్కతె బంగారువన్నెగలవియు మెత్తనై బలిసి యందమైనవియునగు చేతులచే మద్దెలంబట్టుకొని నిద్దురమత్తెక్కినదై పరుండెను.

౪౩. సూక్ష్మమగు నుదరమును (పొట్టను) గలదియు నందమగు మేనుగలదియునగు నొకతె మద్దెలనుజంకనిడికొని యౌవనవ్యాపారముచే నలసి నిద్రించెను.

౪౪. వేఱొకముద్దుగుమ్మ డిండిమమనువాద్యమును జేతఁబట్టుకొని మఱియొకడిండిమము నానుకొని, వయస్సునసున్న ప్రియునికి ముద్దుల బిడ్డనిం గౌఁగలించికొనియున్న వయస్సుకత్తెవలె నుండెను.

౪౫. కమలదళములవంటికన్నులుగల యొకయింతి యౌవనముచే మేనుమఱచి యాడంబరమను వాద్యమును భుజములచే బిగియఁబట్టినదై నిద్దురవోయెను.

౪౬. మఱియొకయందకత్తియ నీటికలశమును దొరలించి తానుదడిసినదై, వసంతకాలమున నానావర్ణములను గలదియగు పుష్పమాలిక వాడిపోకుండఁ దడుపంబడినట్లు వెలింగి నిద్రించెను.

పాణిభ్యాం చ కుచౌ కాచి త్సువర్ణకలశోపమౌ।
ఉపగూహ్యాబలా సుప్తా నిద్రాబల పరాజితా॥ ౪౭

అన్యా కమల పత్రాక్షీ పూర్ణేందు సదృశాననా।
అన్యా మాలింగ్య సుశ్రోణీం ప్రసుప్తా మద విహ్వలా॥ ౪౮॥

ఆతోద్యాని విచిత్రాణి పరిష్వజ్య వరస్త్రియః।
నిపీడ్య చ కుచై స్సుప్తాః కామిన్యః కాముకానివ॥ ౪౯।

తాసా మేకాంతవిన్యస్తే శయానాం శయనే శుభే।
దదర్శ రూపసంపన్నా మపరాం స కపి స్త్రియమ్ ౫౦॥

ముక్తామణి సమాయుక్తై ర్భూషణై స్సువిభూషితామ్।
విభూషయంతీ మివ త త్స్వశ్రియా భవనోత్తమమ్॥ ౫౧॥

గౌరీం కనకవర్ణాభా మిష్టా మంతఃపురేశ్వరీమ్।
కపి ర్మందోదరీం తత్ర శయానాం చారురూపిణీమ్॥ ౫౨॥

స తాం దృష్ట్వా మహాబాహు ర్భూషితాం మారుతాత్మజః।
తర్కయామాస సీతేతి రూప యౌవన సంపదా॥ ౫౩॥

హర్షేణ మహతా యుక్తో ననంద హరియూథపః॥ ౫౪

౪౭. ఒకచిన్నది బంగారుకలశములంబోలిన స్తనములను జేతులచేఁ గప్పుకొని నిద్రకులోఁబడినదయి యవమానమెఱుంగక పరుండి యున్నది.

౪౮. తామరరేకులవంటి కన్నులంగలదియు నిండుచంద్రుని వంటి మోమునుగలదియు నగునొక్కతె మత్తెక్కుటచే మేనుమఱచి సొంపగు పిఱుదులంగల మఱియొక్కతెను గౌఁగలించుకొని నిద్రించుచున్నది.

౪౯. అందకత్తెలగు కొందఱుపడుచులు పిల్లనగ్రోవి మొదలగు నాల్గితెగలవాద్యములను మోహముగల స్త్రీలు ప్రియులను గౌఁగిలించికొనినట్లు ఱొమ్ములపై నదుముకొని నిద్రించిరి.

౫౦. మీఁదఁ జెప్పంబడిన స్త్రీలున్నచోటఁ గాక మఱియొకచోట నుంపఁబడిన యందమగు పాన్పునఁబరుండి యున్నదియు సౌందర్యముచే నొప్పినదియునగు మఱియొక స్త్రీని వానరోత్తముఁడు గనియెను.

౫౧, నుండి, ౫౩ వఱకు. ముత్తెములతోఁ గూడినట్టియు రత్నములు చెక్కంబడినట్టియు భూషణములచేనలంకరింపఁబడినదియుఁ దనశరీరకాంతిచే గృహమంతయు వెలింగించుచున్నదియు బంగారువర్ణమునుగల శరీరకాంతిగలదియు రావణునకిష్టురాలును, అంతఃపుర స్త్రీలలో శ్రేష్ఠురాలును బవ్వళించియున్నదియు నందకత్తెయునగు మండోదరిని బలవంతుఁడగు హనుమంతుఁడుగాంచి యౌవనముచేతను జక్కఁదనముచేతను నొప్పినది యగు సీతాదేవి కాఁబోలునని తలంచెను. అట్లుతలంచి వానరోత్తముఁడు మిక్కిలి సంతోషముతోఁగూడిన వాఁడయ్యెను.

ఆస్ఫోటయామాస చుచుంబ పుచ్ఛం ననంద చిక్రీడ జగౌ జగామ స్తంభా నరోహ న్నిపపాత భూమౌ నిదర్శయన్ స్వాం ప్రకృతిం కపీనామ్॥ ౫౪॥

ఇతి శ్రీమత్సుందరకాండే - దశమస్సర్గః.

## ఏకాదశ స్సర్గః.

అవధూయ చ తాం బుద్ధిం బభూ వావస్థిత స్తదా
జగామ చాపరాం చింతాం సీతాంప్రతి మహాకపిః॥ ౧॥

న రామేణవియుక్తా సా స్వప్తు మ్మర్హతి భామినీ
నభోక్తుం నాప్యలంకర్తుం నపాన ముపసేవితుమ్॥ ౨॥
నాన్యం నర ముపస్థాతుం సురాణామపి చేశ్వరమ్।
నహి రామసమః కశ్చి ద్విద్యతే త్రిదశేష్వపి॥ ౩॥
అన్యేయమితి నిశ్చిత్య పానభూమౌ చచారసః। ౩౫
క్రీడితే నాపరాః క్లాంతా గీతేన చ తథాపరాః॥ ౪॥
నృత్తేన చాపరాః క్లాంతాః పాన విప్రహతా స్తథా।
మురజేషు మృదంగేషు పీఠికాసు చ సంస్థితాః॥ ౫॥
తథా స్తరణముఖ్యేషు సంవిష్టా శ్చా పరా స్త్రియః।
అంగనానాం సహస్రేణ భూషితేన విభూషణైః॥ ౬॥
రూపసల్లాపశీలేన యుక్తగీతార్థ భాషిణా।
దేశకాలాభియుక్తేన యుక్తవాక్యాభి ధాయినా॥ ౭॥
రతాభిరత సంసుప్తం దదర్శ హరియూథపః। ౭౫

౫౪½ అట్లు సంతోషించినవాఁడై భుజములప్పళించెను తోఁకను ముద్దిడియెను గంతులువైచెను గానముచేసెను, ఇటునటుతిరిగెను దన వానర స్వభావమును జూపుచు స్తంభములపై కెక్కి నేలకు దుమికెను.

ఇది పదియవసర్గ.

---

పదొకండవసర్గ.

౧. అట్లు మండోదరినిగాంచి సీతయనితలంచి సంతోషించిన హనుమంతుఁడాతలంపుమాని సీతనుగూర్చి మఱియొక చింతను గలవాఁడయ్యెను.

౨, ౩, ౩½. సీతాదేవి రామునిఁబాసియున్నది గావున నిద్రింపదు భుజింపదు యలంకరించికొనదు పానము సేయదు. రామునితో సమానుఁడు లేఁడుగాన నితరపురుషుని దేవేంద్రునియంతటివానినైనను బొందుటకు సమ్మతింపదు. కావున నీనిద్రించుచున్నయింతి సీత కాదని నిశ్చయించికొని పానభూమియందు (కల్లు ద్రావుచోట) హనుమంతుఁడు దిరుగాడుచుండెను.

౪, ౫, ౬, ౭, ౭½ ఆటలాడుటచే డస్సినవారును బాటలుపాడుటచే నలసినవారును నాట్యముచే బడలినవారును లెస్సగఁ బానముచేసిసోలినవారును మురజములుమృదంగములు వాయించు పీఠములం గూరుచున్నవారును మేలగుపానుపులపై నిద్రించుచున్నవారును నగు స్త్రీలయొక్క (భూషణములచేత నలంకరింపఁబడినదియు, రూపసౌందర్యములను గూర్చి భాషించు నదియు, కాలమునకుందగిన పాటపాడి యర్థమును జెప్పుచున్నదియు స్థలమునకును గాలమునకును దగినట్టి నేర్పుగలదియుఁ దగినమాటలాడుచున్నదియునగు) సహస్రముతోడ మిక్కిలిభోగేచ్ఛగలిగి పరుండియున్న రావణుని వానరశ్రేష్ఠుండగు హనుమంతుఁడు గనియె.

తాసాంమధ్యే మహాబాహు శ్శుశుభే రాక్షసేశ్వరః।
గోష్ఠే మహతి ముఖ్యానాం గవాంమధ్యే యథా వృషః॥

స రాక్షసేంద్ర శ్శుశుభే తాభిః పరివృత స్స్వయమ్।
కరేణుభి ర్యథారణ్యే పరికీర్ణో మహాద్విపః॥ ౯

సర్వకామై రుపేతాం చ పానభూమిం మహాత్మనః।
దదర్శ హరిశార్దూల స్తస్య రక్షఃపతే ర్గృహే॥ ౧౦

మృగాణాం మహిషాణాం చ వరాహాణాం చ భాగశః।
తత్ర న్యస్తాని మాంసాని పానభూమౌ దదర్శ సః॥ ౧౧

రౌక్మేషు చ విశాలేషు భాజనే ష్వర్ధభక్షితాన్।
దదర్శ హరిశార్దూలో మయూరా న్కుక్కుటాం స్తథా॥ ౧౨

వరాహవాధ్రాణసకాన్ దధి సౌవర్చలా యుతాన్।
శల్యా న్మృగమయూరాం శ్చ హనుమా నన్వవైక్షత॥ ౧౩

క్రకరా న్వివిధా న్సిద్ధాం శ్చకోరా నర్ధభక్షితాన్।
మహిషా నేకశల్యాం శ్చ ఛాగాం శ్చ కృతనిష్ఠితాన్॥ ౧౪

లేహ్యా నుచ్చావచా న్పేయాన్ భోజ్యాని వివిధాని చ॥ ౧౫

౮౹ ఆ వేయిమంది స్త్రీలకు నడుమనున్న బలవంతుఁడగు రావణాసురుఁడు, మందయందుఁ బ్రీతిపాత్రములగు పెక్కుగోవులనడుమ నున్న యాఁబోతువలె నొప్పెను.

౯౹ ఆ స్త్రీలమండలములచేఁ జుట్టంబడినవాఁడై రాక్షసరాజు చొరఁగూడని గొప్పవనమందుఁ బెక్కాఁడుయేనుఁగులచేఁ గొలువంబడిన మదగజ మెట్లుండునో యట్లుండెను.

౧౦౹ బలవంతుఁడగు నారాక్షసరాజుయొక్కయింట నెవరెవరికే దేదివలయునో యట్టివాని నెల్లఁగలదియగు కల్లుద్రావుచోటును వానరశ్రేష్ఠుఁడు గనుంగొనియెను.

౧౧౹ జింకలయొక్కయు దున్నపోతులయొక్కయుఁ బందులయొక్కయు మాంసము లందందు భాగములచొప్పున నుంపఁబడియున్నవాని నాకల్లుద్రావుచోట హనుమంతుఁడు గనియెను.

౧౨౹ బంగారముచేఁ జేయంబడిన పెద్దపాత్రలయందు సగసగము భుజింపఁబడి మిగిలియున్న నెమలిమాంసమును గోడిమాంసమును బానము సేయుచోట హనుమంతుఁడు గనియె.

౧౩౹ నుండి ౧౬౹కు. పెరుగుతోడను సౌవర్చలవణముతోఁడను గూర్పఁబడిన పందిమాంసమును ఖడ్గమృగపునంజుడును, ముళ్ళపంది జింక నెమలి మొదలగు వానిమాంసములును నానావిధములఁ బక్వము సేయంబడిన కొక్కెర మాంసమును సగముదిని మిగిలియున్న చకోరమాంసములును దున్నపోతు మాంసమును గొమ్ము చేపనంజుడును వండి పాళ్ళువడ నుంపఁబడియున్నవియు, అనేకవిధములగు పచ్చడులను, త్రాగందగినపసుచారు పాయసములను బెక్కుతెఱంగులయన్నములను హనుమంతుఁడు గనియెను.

తథా మ్లలవణో త్తంసై ర్వివిధై రాగషాడబైః।
హారనూపుర కేయూరై రపవిద్ధై ర్మహాధనైః॥ ౧౬॥

పానభాజన విక్షిప్తైః ఫలైశ్చ వివిధై రపి।
కృత పుష్పోపహారా భూ రధికం పుష్యతి శ్రియమ్॥ ౧౭॥
తత్ర తత్ర చ విన్యస్తై స్సుశ్లిష్టై శ్శయనాసనైః।
పానభూమి ర్వినావహ్నిం ప్రదీప్తే వోపలక్ష్యతే॥ ౧౮॥
బహుప్రకారై ర్వివిధై ర్వరసంస్కార సంస్కృతైః।
మాంసైః కుశలసంయుక్తైః పానభూమిగతైః పృథక్॥ ౧౯॥
దివ్యాః ప్రసన్నా వివిధా స్సురాః కృతసురా అపి।
శర్కరాసవ మాధ్వీక పుష్పాసవ ఫలాసవాః॥ ౨౦॥
వాసచూర్ణై శ్చ వివిధై ర్మృష్టా స్తై స్తైః పృథక్పృథక్।
సంతతా శుశుభే భూమి ర్మాల్యైశ్చ బహుసంస్థితైః॥ ౨౧॥
హిరణ్మయై శ్చ వివిధై ర్భాజనై స్స్ఫాటికై రపి।
జాంబూనదమయై శ్చాన్యైః కరకై రభిసంవృతా॥ ౨౨॥
రాజతేషు చ కుంభేషు జాంబూనద మయేషు చ।
పాన శ్రేష్ఠం తదా భూరి కపి స్తత్ర దదర్శ హ॥ ౨౩॥
సో పశ్య చ్ఛాతకుంభాని శీలామణి మయాని చ।
రాజతాని చ పూర్ణాని భాజనాని మహాకపిః॥ ౨౪॥

౧౬, ౧౭. తగినంతటి యుప్పువులునులతోఁగూడిన నానావిధము లగు పలుచని చిక్కని ద్రవపదార్థములచేతను వీఁడదీసివై చియున్న వెలఁగ లదండలు భుజకీర్తులు నందెలు ననుభూషణములచేతను భుజించు పాత్రలం దుంపఁబడియున్న నానావిధ ఫలములచేతను బుష్పములకానుకలచేతనున చోోటు మిక్కిలియందమును జూపెను.

౧౮, ౧౯. అందందునుపఁబడి సందులు తెలియరాక చట్టముగా నున్న మంచములచేతను నానావిధములుగాఁ జక్కఁగాఁబక్వము చేయంబ డి వేర్వేరుగ కల్లునందడిసియున్న నానాజంతువులయొక్క మాంసములచేత ను, పానభూమి యగ్ని లేకయే మండుచున్నదానివలె వెలింగెను.

౨౦, ౨౧, ౨౨. దేవసంబంధముగలవియు నిర్మలమైనవియు, చ క్కెరచేతను దేనెచేతను ఫలములచేతను బుష్పరసముచేతను జేయంబడి నవియునగు కల్లువినుసులు నానావిధములగు వాసనచూర్ణములతోఁడఁగూడ హనుమంతునిచేఁ జూడంబడియెను. మీఁదఁజెప్పంబడిన యాయా విశేషము లచేతను బెక్కువిధముల వింతలైయున్న పుష్పహారములచేతను బంగార ముచేతను స్ఫటికములచేతను జేయింబడిన నానావిధపాత్రలచేతను శుద్ధమ గు బంగారముచేతనేచేయఁబడిన మఱికొన్ని గిండిచెంబులచేతను గ్రమ్మిన దియై యాపానభూమి యెడములేక ప్రకాశించెను.

౨౩. అప్పుడు వెండిపాత్రలయందును బంగారుకలశముల యందు ను నునుపఁబడియున్న శ్రేష్ఠమగు సారాయి మొదలగు మద్యద్రవ్యముల నాంజనేయుం డందుం గాంచెను.

౨౪. ఆవానరోత్తముఁడు బంగారముచేతను వెండిచేతను రత్నము లచేతను జేయంబడినవియగు నిండినకల్లుకుండలను గాంచెను.

క్వచి దర్ధావశేషాణి క్వచి త్పీతాని సర్వశః।
క్వచి న్నైవ ప్రపీతాని పానాని స దదర్శ హ॥ ౨౫॥
క్వచి ద్భక్ష్యాంశ్చ వివిధా న్క్వచి త్పానాని భాగశః।
క్వచిదర్ధావశేషాణి పశ్య న్వై విచచార హ॥ ౨౬॥
క్వచి త్ప్రభిన్నైః కరకైః క్వచి దాలోళితై ర్ఘటైః।
క్వచి త్సంపృక్త మాల్యాని జలాని చ ఫలాని చ॥ ౨౭॥
శయనా న్యత్ర నారీణాం శుభ్రాణి బహుధా పునః।
పరస్పరం సమాశ్లిష్య కాశ్చి త్సుప్తా వరాంగనాః॥ ౨౮॥
కాశ్చి చ్చ వస్త్ర మన్యస్యా స్స్వపంత్యాః పరిధాయ చ।
ఆహృత్య చాబలా సుప్తా నిద్రాబల పరాజితా॥ ౨౯॥
తాసా ముచ్ఛ్వాసవాతేన వస్త్రం మాల్యం చ గాత్రజమ్।
నాత్యర్థం స్పందతే చిత్రం ప్రాప్య మంద మివా నిలమ్॥ ౩౦॥
చందనస్య చ శీతస్య శీధోర్మధురసస్య చ।
వివిధస్య చ మాల్యస్య ధూపస్య వివిధస్య చ॥ ౩౧॥
బహుధా మారుత స్తత్ర గంధం వివిధ ముద్వహన్।
స్నానానాం చందనానాం చ ధూపానాంచైవ మూర్ఛితః॥ ౩౨॥
ప్రవవౌ సురభిర్గంధో విమానే పుష్పకే తదా॥ ౩౨౪
శ్యామావదాతా స్తత్రాన్యాః కాశ్చి త్కృష్ణా వరాంగనాః
కాశ్చి త్కాంచనవర్ణాంగ్యః ప్రమదా రాక్షసాలయే॥ ౩౩౪

౨౫. కొన్నివిశేషభాగము త్రావంబడినవియుఁ బూర్ణముగఁ ద్రాగంబడినవికొన్నియుఁ గొంచెమేనియుఁ ద్రావకయున్నవికొన్నియు నగు కల్లుగిన్నెలను వానరుఁడు గనియెను.

౨౬, ౨౭, ౨౮, ౨౯. ఒకచోట నానావిధభక్ష్యములను, ఒకచో వెవ్వేరుగను, ఒకయెడ సగము మిగిలియునున్న కల్లుపాత్రలను, ఒకప్రక్క బద్ధలైయున్న చిన్నచెంబులతోడను, ఒకచక్కి దొరలుచున్న కడవలతోడనుగూడి వెదచల్లంబడిన పూదండలు జలము ఫలములను, అందున్న స్త్రీల యొక్క శుభ్రమగుపానుపులను, తఱుచుగా నొకరినొకరు కౌఁగలించుకొని నిద్రించుచున్న స్త్రీలను, నిద్దురచే మిక్కిలి యొడలుమఱచి తమప్రక్కని ద్రించుచున్న స్త్రీలయొక్కవస్త్రములనులాగి తమమేనికింజుట్టుకొని నిద్రించుచున్న పడుచులను గనుంగొనుచు హనుమంతుఁడు సంచరించెను.

౩౦. ఆ స్త్రీలయొక్క యొడలియందున్న వస్త్రములును బుష్పములునుగూడ వారువిడుచుశ్వాసమను మెల్లనిగాలినిబొంది యానందించుచున్నట్లు కొంచెమేనియుఁ జలింపకున్నవి.

౩౧, ౩౨, ౩౪ ఆపానభూమియందుఁ జల్లనిశ్రీగంధము యొక్కయు, తియ్యనితావిగల కల్లుయొక్కయు నానావిధములగు పూదండలయొక్కయు ధూపములయొక్కయుఁ బెక్కువాసనలనుధరించి వాయుదేవుం డువీచెను. స్నానార్హచందనముల యొక్కయు ధూపములయొక్కయు దట్టమగువాసన పుష్పకవిమానమందు వ్యాపించెను.

౩౫ అచ్చోటఁగొందఱు నల్లనిశరీరచ్ఛాయయు, బంగారమును బోలుశరీరకాంతియు, కొందఱు నలుపుతెలుపునుగలిగిన మేనిరంగును గలిగి పరుండి యుండిరి.

తాసాం నిద్రావశత్వాచ్చ మదనేన విమూర్ఛితమ్।
పద్మినీనాం ప్రసుప్తానాం రూపమాసీద్యథైవ హి॥ ౩౪½

ఏవం సర్వ మశేషేణ రావణాంతఃపురం కపిః।
దదర్శ సుమహాతేజా న దదర్శ చ జానకీమ్॥ ౩౫½

నిరీక్షమాణశ్చ తదా తాః స్త్రియస్స మహాకపిః।
జగామ మహతీం చింతాం ధర్మసాధ్వసశంకితః॥ ౩౬½

పరదారావరోధస్య ప్రసుప్తస్య నిరీక్షణమ్।
ఇదం ఖలు మమాత్యర్థం ధర్మలోపం కరిష్యతి॥ ౩౭½

నహి మే పరదారాణాం దృష్టిర్విషయవర్తినీ।
అయం చాత్ర మయా దృష్టః పరదారపరిగ్రహః॥ ౩౮½

తస్య ప్రాదురభూచ్చింతా పునరన్యా మనస్వినః।
నిశ్చితైకాంతచిత్తస్య కార్యనిశ్చయదర్శినః॥ ౩౯½

కామం దృష్టా మయా సర్వా విశ్వస్తా రావణస్త్రియః।
నహి మే మనసః కించిద్వైకృత్యముపపద్యతే॥ ౪౦½

మనో హి హేతుస్సర్వేషా మింద్రియాణాం ప్రవర్తనే।
శుభాశుభా స్వవస్థాసు తచ్చ మే సువ్యవస్థితమ్॥ ౪౧½

నాన్యత్ర హి మయా శక్యా వైదేహీ పరిమార్గితుమ్।
స్త్రియో హి స్త్రీషు దృశ్యంతే సదా సంపరిమార్గణే॥ ౪౨½

యస్య సత్త్వస్య యా యోని స్తస్యాం తత్పరిమార్గ్యతే।
నశక్యా ప్రమదా నష్టా మృగీషు పరిమార్గితుమ్॥ ౪౩½

౩౪వ. కేవలము నిద్రకు లోఁబడియున్న వారగుటచే, రతిక్రీడల యందు మిక్కిలిడస్సి నిద్రించుచున్నయా స్త్రీలయొక్క రూపములు తామరతీఁగెలవలె నుండెను.

౩౫వ. మిక్కిలి దర్పమునుగలవాఁడగు నావానరుఁడు మీఁదఁజెప్పంబడినచొప్పున రావణుని యంతఃపురమంతయుఁ గాంచెనుగాని సీతను గనంజాలఁడయ్యెను.

౩౬వ, ౩౭వ, ౩౮వ. ఆవానరోత్తముఁ డాయంతఃపురస్త్రీలను గనుచు ధర్మభంగముగలిగెనుగదా! అనిసంశయించి 'నిద్రించుచున్న వారగు నీపరస్త్రీలయంతఃపురమునుజొచ్చిచూచుట నాకుమిక్కిలియధర్మకర్మమయ్యెను, నాచూపులు పరస్త్రీలనుభవించు భోగములను శ్రద్ధతోఁ జూచునవి కావు. అట్లుండియు నిందురావణుఁ డితరులభార్యలను బొందుట నాఁచే జూడంబడెయె, అనిచింతించెను. ఇంతలోనొంటరిగానుండి యోచించి కార్యమును నిశ్చయించుచున్న యాతనికి మఱియొక యోచన యుం దోఁచెను.

౩౯వ, నుండి ౪౪వకు. రావణునిదయకుఁబాత్రురాండ్రగు నంతఃపురస్త్రీలందఱునునాచేఁజక్కఁగఁజూడంబడిరి. కాని వారియెడలనాకుమనస్సు కొంచమేనియుఁజలించినది కాదు. సమస్తేంద్రియములయొక్కయు శుభాశుభరూప వ్యాపారములకు మనస్సేకదా హేతువు. అట్టిమనస్సునాకుస్థిరమై యున్నది. ఇందుఁగాక సీతనునేనుమఱెందు వెదుకవచ్చును; ఆఁడువా రాఁడువారినడుమనకదా! మెలఁగుదురు. ఏజంతు వేజాతియందుఁ బుట్టినదో యాజంతువు నాజాతిజంతువులలోననె కదా వెదుకఁదగును. ఆఁడుమానిసి కనంబడనిచో నాఁడుజింకలయందు వెదుకుటచే లభింపదుగదా! అందుచేతనే సీత శుద్ధముగుమనస్సుగలనాచేత సంపూర్ణముగా వెదకంబడియెను.

తదిదం మార్గితం తావ చ్ఛుద్ధేన మనసా మయా।
రావణాంతఃపురం సర్వం దృశ్యతే న చ జానకీ॥ ౪౪
దేవగంధర్వకన్యాశ్చ నాగకన్యాశ్చ వీర్యవాన్।
అవేక్షమాణో హనుమా న్నైవాపశ్యత జానకీమ్॥ ౪౫
తామపశ్య న్కపి స్తత్ర పశ్యం శ్చాన్యా వరస్త్రియః।
అపక్రమ్య తదా వీరః ప్రధ్యాతు ముపచక్రమే॥ ౪౬
స భూయ స్తు పరం శ్రీమా న్మారుతి ర్యత్న మాస్థితః।
ఆపానభూమి ముత్సృజ్య తద్విచేతుం ప్రచక్రమే॥ ౪౭

ఇతి శ్రీమత్సుందరకాండే - ఏకాదశస్సర్గః.

---

## ద్వాదశస్సర్గః.

స తస్య మధ్యే భవనస్య మారుతి ర్లతాగృహాం శ్చిత్రగృహాన్ని
శాగృహాన్। జగామ సీతాం ప్రతి దర్శనోత్సుకో న చైవ తాం
పశ్యతి చారుదర్శనామ్॥ ౧॥
స చింతయామాస తతో మహాకపిః ప్రియా మపశ్య న్రఘునంద
నస్య తాం। ధ్రువం హి సీతా మ్రియతే యథా న మే విచిన్వ
తో దర్శనమేతి మైథిలీ॥ ౨॥
సా రాక్షసానాం ప్రవరేణ జానకీ స్వశీలసంరక్షణతత్పరా స
తీ। అనేన నూనం ప్రతి దుష్టకర్మణా హతా భవే దార్యపథే
పరే స్థితా॥ ౩॥

రావణునియంతఃపురమందలి స్త్రీలందఱు నాచేఁజూడంబడిరికాని జానకి గనంబడకున్నది గదా!

౪౫½. బలవంతుఁడగు హనుమంతుఁడు దేవగంధర్వ నాగకన్యకలను జూచుచుండియు జానకిని జూడఁడయ్యెను.

౪౬½, ౪౭½. వీరుండగు హనుమంతుఁ డప్పుడచట సీతాదేవిని గానక మఱికొంద ఱుత్తమురాండ్రగు స్త్రీలను గాంచి యచ్చోటు విడిచి చింతింపఁబూనెను. అతండు సీతను వెదకుటయను దీర్ఘయత్నమును మరలఁబూని పానభూమిని వదలి వెదకుట కారంభించెను.

ఇది పదకొండవ సర్గ.

———:0:———

పండ్రెండవ సర్గ

౧. ఆహనుమంతుఁడు సీతాదేవినింగను నుత్సాహముతో నాయింటి నడుమనున్న తీఁగెలయిండ్లను, చిత్రములు వ్రాయంబడియున్న కూటములను రాత్రులయందుఁ బరుండునిండ్లను గాంచెను గాని సీతను గనంజాలఁడయ్యెను.

౨. అటుపై నావానరోత్తముఁడు "శ్రీరాముని ప్రాణప్రియయగు" సీతను వెదకుచున్న నా కామె యెందును గనంబడకున్నది. కావున మృతి నొందినదో మఱి యెందున్నదో తెలియదయ్యెను.

3. ఉత్తమమగు సాధుమార్గమున నున్న జానకి రావణుని కోర్కికి లోఁబడక తనపాతివ్రత్యముం గాపాడుకొనఁదలంచినది యగుటచే దుర్జనుఁడగు నీతనిచేఁ జంపఁబడియుండును. అట్లగుట సత్యము. కాదేని యెందేని కనంబడదా?

చిత్రశాలాశ్చ విచితా భూయః క్రీడాగృహాణి చ।
నిష్కుటాంతర రథ్యాశ్చ విమానాని చ సర్వశః॥ ౧౩॥
ఇతి సంచింత్య భూయోపి విచేతు ముపచక్రమే।
భూమీగృహాం శ్చైత్యగృహాన్ గృహాతి గృహకా నపి॥ ౧౪॥
ఉత్పత న్నిష్పతం శ్చాపి తిష్ఠన్ గచ్ఛ న్పునఃపునః।
అపావృణ్వం శ్చ ద్వారాణి కవాటా న్యవఘాటయన్॥ ౧౫॥
ప్రవిశ న్నిష్పతం శ్చాపి ప్రపత న్నుత్పత న్నపి।
సర్వమ ప్యవకాశం చ విచచార మహాకపిః॥ ౧౬॥
చతురంగుళమాత్రోపి నావకాశ స్స విద్యతే।
రావణాంతఃపురే తస్మిన్ యం కపిర్న జగామ సః॥ ౧౭॥
ప్రాకారాంతర రథ్యాశ్చ వేదికా శ్చైత్య సంశ్రయాః।
దీర్ఘికాః పుష్కరిణ్యశ్చ సర్వం తే నావలోకితమ్॥ ౧౮॥
రాక్షస్యో వివిధాకారా విరూపా వికృతా స్తథా।
దృష్టా హనుమతా తత్ర నతు సా జనకాత్మజా॥ ౧౯॥
రూపే ణాప్రతిమా లోకే వరా విద్యాధర స్త్రియః।
దృష్టా హనుమతా తత్ర న తు రాఘవనందినీ॥ ౨౦॥
నాగకన్యా వరారోహాః పూర్ణచంద్రనిభాననాః।
దృష్టా హనుమతా తత్ర నతు సీతా సుమధ్యమా॥ ౨౧॥
ప్రమథ్య రాక్ష సేంద్రేణ దేవకన్యా బలా ద్ధృతాః।
దృష్టా హనుమతా తత్ర నసా జనకనందినీ॥ ౨౨॥

చిత్తరువులనుగలశాలలను, క్రీడించునట్టి యిండ్లను, రాజగృహము
తో జేరినవనములను, రాజవీధులను, విమానములను వెస్సగ వెదకితిని
అని యోచించికొని భూమిలోపలనున్న యిండ్లను చెక్కువాకిండ్లుగల
మందిరములను, తక్కిన యిండ్లతోగలియక దూరముననున్న యిండ్లను
వెదకు నారంభించెను.

౧౫, ౧౬. అవానరోత్తముడున్నతస్థలములకెక్కుచు దగ్గినచో
దుమికుచు బలుమా అందందునిలుచుచు బోవుచు వాకిండ్లను మూయుచు
దలుపులనుదెఱచుచు నాయిండ్లయందుజొచ్చుచు వెలువడుచు శాతాళ
గృహములలోనికి దుముకుచు మీదికెక్కుచు నిదియదియను నియతి లేక
యెల్ల యెడలను సంచరించెను.

౧౭. ఆరావణుని యంతఃపురమున దానుజూడనిచోటు జెత్తెడై
నను లేకుండునట్లు సీతను హనుమంతుడంతటను వెదకెను.

౧౮. కోటలోపలనుండుత్రోవలును, మంటపములనాశ్రయించియు
న్న తిన్నెలును, నడబావులును, కోనేళ్లను సర్వము నాతనిచే జూడంబడి
యెను.

౧౯. నానావిధ రూపములుగలవారును, వికారాకారములు గలవా
రునునగు రాక్షసస్త్రీలు పెక్కండ్రు కనంబడిరి కాని యందెందును సీతాదే
వి కనంబడదయ్యెను.

౨౦, ౨౧, ౨౨. లోకమందు దమకు సాటిలేనిరూపము గలవారగు
విద్యాధర స్త్రీలు గూడ జూడంబడిరిగాని యచ్చోటను రాఘవునిప్రియయు
రాలగుజానకి కనంబడదయ్యె. పున్నమచంద్రునింబోలు మోములుగల యరం
పకత్తెలగు నాగకన్యకలును గనంబడిరి సింగమునడుమువంటి నడుముంగలది
యగుసీత కానరాదయ్యె. యుద్ధమున గెలిచి రావణునిచే బలవంతముగ
దేబడిన దేవకన్యకలును హనుమంతునిచే జూడంబడిరి, జనకుని ముద్దుల
పట్టియగుసీత యెందును లేదయ్యెను.

సో పశ్యం స్తాం మహాబాహుః పశ్యం శ్చా న్యా వర స్త్రియః।
విషసాద ముహు ర్ధీమా౯ హనుమా న్మారుతాత్మజః॥ ౨౩॥
ఉద్యోగం వానరేంద్రాణాం ప్లవనం సాగరస్య చ।
వ్యర్థం వీక్ష్యా నిలసుత శ్చింతాం పునరుపాగమత్॥ ౨౪॥
అవతీర్య విమానా చ్చ హనుమా న్మారుతాత్మజః।
చింతా ముపజగా మాథ శోకోపహత చేతసః॥ ౨౫॥

ఇతి శ్రీమత్సుందరకాండే - ద్వాదశస్సర్గః.

---

## త్రయోదశ స్సర్గః.

విమానా త్తు సుసంక్రమ్య ప్రాకారం హరియూథపః।
హనుమా న్వేగవా నాసీ ద్యథా విద్యు ద్ఘనాంతరే॥ ౧॥
సంపరిక్రమ్య హనుమా౯ రావణస్య నివేశనాత్।
అదృష్ట్వా జానకీం సీతా మబ్రవీ ద్వచనం కపిః॥ ౨॥
భూయిష్ఠం లోళితా లంకా రామస్య చరతా ప్రియమ్।
నహి పశ్యామి వైదేహీం సీతాం సర్వాంగశోభనామ్॥ ౩॥
పల్వలాని తటాకాని సరాంసి సరిత స్తథా।
నద్యో నూప వనాం తా శ్చ దుర్గా శ్చ ధరణీధరాః॥ ౪॥
లోళితా వసుధా సర్వా న తు పశ్యామి జానకీమ్॥ ౪½
ఇహ సంపాతినా సీతా రావణస్య నివేశనే।
ఆఖ్యాతా గృధ్రరాజేన న చ పశ్యామి తా మహమ్॥ ౫½

౨౩. మిక్కిలిబలవంతుఁడగు హనుమంతుఁడు సీతను వెదకియుఁ గానక యందున్న యందక త్తెలగు పెక్కుండితరభామలను బలుమాఱు గాంచుచు మిక్కిలి ఖిన్నుఁడయ్యెను.

౨౪. వాయుపుత్రుఁడు వానరోత్తములు చేసిన యత్నమును దాను సముద్రముం దాఁటుటను వ్యర్థము గాఁదలంచి మరల ఖిన్నుఁడయ్యెను.

౨౫. వాయుపుత్రుండగు (బలవంతుఁడైన) హనుమంతుఁడు విమానమునుండిదిగి శోకముచేఁ గొట్టంబడిన మనస్సుగలవాఁడై చింతనొందెను.

ఇది పండ్రెండవసర్గ.

---

పదమూఁడవసర్గ.

౧. వేగవంతుఁడగు నావానరోత్తముండు విమానమునుండి ప్రాకారమునకు దాఁటి మేఘమునడుమనున్న మెఱుపువలె నుండెను.

౨. సీతను గనుంగొనఁజాలకయే రావణుని నివేశనమునుండి కపిలి హనుమంతుఁ డిట్లనుకొనియెను.

౩. శ్రీరామునకు హితము నేయుచున్న నాచేత సీలంక చక్కఁగా వెదుకంబడియెను. ప్రతియవయవమందును సౌందర్యముంగలదియగు సీతను జూడ నేరనైతిని.

౪, ౪౻. నీటిపడియలును జెఱువులును దొరువులును వాగులును నదులును నీటిపట్లుకడనుండు వనములందును జొరరాఁనిని కొండలును, ఇంతయేల? భూమియంతయు వెదుకంబడియెను. జానకి నెందును గాననైతిని.

౫౻. సంపాతి యనుపక్షిచేత, రావణునియింటనున్నదని చెప్పంబడినసీత నిందెచ్చోటను గనఁజాలకున్నాఁడను గదా!

కిన్ను సీతా థవై దేహీ మైథిలీ జనకాత్మజా।
ఉపతిష్ఠేత వివశా రావణం దుష్టచారిణమ్॥ ౬౹

క్షిప్ర ముత్పతతో మన్యే సీతా మాదాయ రక్షసః।
బిభ్యతో రామబాణానా మంతరా పతితాభవేత్॥ ౭౹

అథవా హ్రియమాణాయాః పథి సిద్ధనిషేవితే।
మన్యే పతిత మార్యాయా హృదయం ప్రేక్ష్య సాగరమ్॥ ౮౹

రావణ స్యోరు వేగేన భుజాభ్యాం పీడితే న చ।
తయా మన్యే విశాలాక్ష్యా త్యక్తం జీవిత మార్యయా॥ ౯౹

ఉపర్యుపరి వా నూనం సాగరం క్రమత స్తదా।
వివేష్టమానా పతితా సముద్రే జనకాత్మజా॥ ౧౦౹

అహో క్షుద్రేణ వా నేన రక్షంతీ శీల మాత్మనః।
అబంధు ర్భక్షితా సీతా రావణేన తపస్వినీ॥ ౧౧౹

అథవా రాక్షసేంద్రస్య పత్నీభి రసితేక్షణా।
అదుష్టా దుష్టభావాభి ర్భక్షితా సా భవిష్యతి॥ ౧౨౹

సంపూర్ణ చంద్రప్రతిమం పద్మపత్ర నిభేక్షణమ్। ౧౩

౬౫. అందఱివలె మానుష దేహమువలనఁ బుట్టక నాఁగేటిచాలునఁ బుట్టినదియు, విదేహరాజునకుఁ గూఁతురైనదియు, మిథిలాధిపునకుఁ బుత్రికయైనదియు, అధ్యాత్మవేత్తయగు జనకునకుఁ బ్రియపుత్రికయైనదియు నగు రామునిభార్య కామవికారమును జెందినదై దుర్జనుఁడగు రావణునకు లోఁబడెనా!

౭౫. సీతనుగొని రామబాణములకు భయపడుచు వేగమున రావణుఁడు వచ్చుచుండఁగా మార్గమధ్యమున సీతపడినదై యుండును అని తలంచెదను.

౮౫. అట్లుగాక సిద్ధులు తిరుగాడునట్టి యాకాశమార్గమునఁ దేఁబడుచుండిన సీతాదేవియొక్క మనస్సు సముద్రమును గాంచి భీతిలుటచే నందుఁ బడియుండునేమో యని తలంచెదను.

౯౫. సీతను దెచ్చునపుడు రావణుఁడు వచ్చు మిక్కిలి వేగముచేతను, వానిభుజములచే నలుపంబడుటచేతను, విశాలమగు కన్నులుగల యాసీతచేఁ బ్రాణములు విడువంబడియెనని యెంచెదను.

౧౦౫. విమానమునందుండి సముద్రపునీటిని దాఁటుచో జనకపుత్రికయగు సీత సత్యముగా సముద్రమునఁ బడియుండును.

౧౧౫. సాధువై తోడ్పాటెందునుం గలుగక చుట్టములకు దూరమైతన పతివ్రతాధర్మమును గాపాడుచున్న సీత యల్పుఁడగు నీరాక్షసునిచేతఁ దినంబడియేనియు నుండును.

౧౨౫నుండి౧౪౫. అట్లుగాకున్నను సాధురాలును నల్లనికన్నులు గలదియునగుసీత దుష్టస్వభావముగల రావణునిభార్యలచే భక్షింపఁ బడియేని యుండును. పున్నమచంద్రునిం బోలునదియుఁ దామరరేకులవంటి కన్నులు గలదియును.

రామస్య ధ్యాయతీ వక్త్రం పంచత్వం కృపణా గతా॥ ౧౩

హా రామ లక్ష్మణే త్యేవం హా యోధ్యే చేతి మైథిలీ।
విలప్య బహు వైదేహీ న్యస్తదేహా భవిష్యతి॥ ౧౪

అథవా నిహితా మన్యే రావణస్య నివేశనే।
నూనం లాలప్యతే సీతా పంజరస్థేవ శారికా॥ ౧౫

జనకస్య సుతా సీతా రామపత్నీ సుమధ్యమా।
కథ ముత్పల పత్రాక్షీ రావణస్య వశం వ్రజేత్॥ ౧౬

వినష్టా వా ప్రణష్టా వా మృతా వా జనకాత్మజా।
రామస్య ప్రియభార్యస్య న నివేదయితుం క్షమమ్॥ ౧౭

నివేద్యమానే దోషస్స్యా ద్దోషస్స్యా దనివేదనే।
కథన్ను ఖలు కర్తవ్యం విషమం ప్రతిభాతి మే॥ ౧౮

అస్మి న్నేవంగతే కార్యే ప్రాప్తకాలం క్షమం చ కిమ్।
భవే దితి మతం భూయో హనుమా న్ప్రవిచారయత్॥ ౧౯

ప్రాణసఖుఁడగు శ్రీరామునిమోమును ధ్యానము సేయుచు దీనురాలై ప్రాణములు విడచియుండును. హా! రామా! లక్ష్మణా! అయోధ్యా! అని పెక్కు తెఱంగుల (పరమవిరక్తుఁడగు జనకుని పుత్రికయయ్యు) నిట్లు శ్రీరామునియందలి స్నేహముచే దుఃఖించుచుఁ బ్రాణములు విడచియుండునేమో! జ్ఞానియగుజనకుని పుత్రికయగుసీత శ్రీరాముఁ డీశ్వరుఁడుగావునను, లక్ష్మణుఁడు భాగవతోత్తముఁడుగావునను, అయోధ్యయన వైకుంఠముగావునను, ఆస్మరణసేయుచు నాతనియందు భరన్యాసముచేసి దేహమును ద్యజించియుండును. అట్లుగానిచో రావణునియింటనే యునుపంబడి (పంజరమం దునుపంబడియున్న యాఁడుగోరువంకవలె) మిక్కిలి దుఃఖించుచున్నది యని తలంచెదను.

౧౬౪ నుండి ౧౯౪ వ. వివేకియగు జనకునకుఁ గూఁతురును, మనుష్యగర్భమునఁ బుట్టనిదియు, శ్రీరామునకు భార్యయైనదియు, సాటిలేని యందమును గలదియు, గుణాగుణముల యోచింపఁగలదియు నగునిల్లాలు కేవలమృగప్రాయుఁడగు రావణునకు లోఁబడునా? అట్లుండదుగావున సీత పాతాళగృహము మొదలగుచోటులం దునుపంబడి కానరాకపోయి యేని యుండును, అచ్చటనుండి తెచ్చునపుడు సముద్రమునం బడియేని యుండును శ్రీరామునిం దలఁచితలఁచి ప్రాణములను విడచియేనియుండును గావున నీమాటను (భార్యయందుఁ బ్రాణము నుంచియున్నవాఁడను) శ్రీరామున కేమనిచెప్పుదును. శ్రీరామున కీవిషయముం దెలుపుటచే నాకు దోషముగలుగును, తెలుపకున్నను దోషము. ఎట్లు సేయుదును? ఎటుపోయినను విరోధముగ నున్నది. ఇట్లున్నది కావున కాఁగలయది కాకమానదు. అని హనుమంతుఁడు మఱిమఱి యోచించుచుండెను.

యది సీతా మదృష్ట్వాహం వానరేంద్ర పురీ మితః।
గమిష్యామి తతః కో మే పురుషార్థో భవిష్యతి॥ ౨౦

మమేదం లంఘనం వ్యర్థం సాగరస్య భవిష్యతి।
ప్రవేశ శ్చైవ లంకాయా రాక్షసానాం చ దర్శనమ్॥ ౨౧

కిం మాం వక్ష్యతి సుగ్రీవో హరయో వా సమాగతాః।
కిష్కింధాం స మనుప్రాప్తం తౌ వా దశరథాత్మజౌ॥ ౨౨

గత్వా తు యది కాకుత్స్థం వక్ష్యామి పరమప్రియమ్।
నదృష్టేతి మయా సీతా తత స్త్యక్ష్యతి జీవితమ్॥ ౨౩

పరుషం దారుణం క్రూరం తీక్ష్ణ మింద్రియతాపనమ్।
సీతానిమిత్తం దుర్వాక్యం శ్రుత్వా స న భవిష్యతి॥ ౨౪

తం తు కృచ్ఛ్రగతం దృష్ట్వా పంచత్వగత మానసమ్।
భృశానురక్తో మేధావి న భవిష్యతి లక్ష్మణః॥ ౨౫

వినష్టౌ భ్రాతరౌ శ్రుత్వా భరతోఽపి మరిష్యతి।
భరతం చ మృతం దృష్ట్వా శత్రుఘ్నో న భవిష్యతి॥ ౨౬

పుత్రాన్ మృతాన్ సమీక్ష్యాథ న భవిష్యంతి మాతరః।
కౌసల్యా చ సుమిత్రా చ కైకేయీ చ నసంశయః॥ ౨౭

కృతజ్ఞః సత్యసంధ శ్చ సుగ్రీవః ప్లవగాధిపః।
రామం తథాగతం దృష్ట్వా తత స్త్యక్ష్యతి జీవితమ్॥ ౨౮

౨౦౪ నుండి ౨౮౪ కు. నేను సీతనుజూడకయే యిచ్చటనుండి కి ష్కింధకేగితినేని నాకుం బ్రయోజన మేమిగలదు ! నూఱామడల నిడివిగల యీసముద్రమును దాటుటయు లంకలోఁ బ్రవేశించుటయు రాక్షసులను గాంచుటయు వ్యర్థమగునుగదా ! నావెంటవచ్చిన వానరు లేమితలంతురు! సుగ్రీవుఁడు నన్ను నిందింపకుండునా! కిష్కింధయందు నారాక కెదురుచూచుచున్న దశరథపుత్రులు కటకటపడి నన్నుందిట్టకుందురా ! వ్యర్థుఁడనై కి ష్కింధకేగి 'సీతగనంబడలే'దని రామునకుం జెప్పితినేని వెంటనే యాతం డు ప్రాణములను విడుచును! కఠినమైనదియు భయంకరమైనదియుఁ గ్రూ రమైనదియు సైరింపరానిదియు నింద్రియముల నుడికించునదియునగు నీచెడు మాటను (సీత గనంబడలే దనుట) విని రాముఁడు జీవించియుండునా !

౨౯౪నుండి ౨౭౪. అట్లు కటకటంబడి శ్రీరాముఁడు ప్రాణము లు విడచినచో నాతనియందుఁ దనప్రాణముల నుంచియున్నవాఁడగు లక్ష్మ ణుఁడు నిలువఁజాలక తానును దేహమునుద్యజించును. ఈయిద్దరిమాటను వినినతోడనె భరతుండు సచ్చును. భరతునిచావుంగని శత్రుఘ్నుఁడు జీ వించియుండఁడు, ఇట్లు పుత్రులు నలువురును దెగినపిమ్మట పేరితల్లులగు కౌ సల్యా సుమిత్రా కైకలు నిమిషమేని బ్రదుకఁ జాలరు.

౨౮౪నుండి౩౮౪. అట్లుశ్రీరాముఁడు తెగుటను గాంచి,ఉపకారము మఱువనివాఁడును సత్యవ్రతము గలవాఁడును వానరులకు రాజును నగు సు గ్రీవుఁడు తనబ్రదుకును జాలించును. అంతటఁబీడింపబఁడిన మనస్సునుగలది

మర్మ్నా వ్యథితా దీనా నిరానందా తపస్వినీ।
పీడితా భర్తృశోకేన రుమా త్యక్ష్యతి జీవితమ్॥ ౨౯
వాలిజేన తు దుఃఖేన పీడితా శోకకర్శితా।
పంచత్వం చ గతేరాజ్ఞి తారాపి నభవిష్యతి॥ ౩౦
మాతాపిత్రో ర్వినాశేన సుగ్రీవ వ్యసనేన చ।
కుమారో ప్యంగదః కస్మా ద్ధారయిష్యతి జీవితమ్॥ ౩౧
భర్తృజేన తు దుఃఖేన హ్యభిభూతా వనౌకసః।
శిరాం స్యభిహనిష్యంతి తలై ర్ముష్టిభి రేవ చ॥ ౩౨
సాంత్వే నానుప్రదానేన మానేన చ యశస్వినా।
లాలితాః కపిరాజేన ప్రాణాం స్త్యక్ష్యంతి వానరాః॥ ౩౩
న వనేషు న శైలేషు ననిరోధేషు వా పునః।
క్రీడా మనుభవిష్యంతి సమేత్య కపికుంజరాః॥ ౩౪
సపుత్రదారా స్సామాత్యా భర్తృవ్యసన పీడితాః।
శైలాగ్రేభ్యః పతిష్యంతి సమేత్య విషమేషుచ॥ ౩౫
విష ముద్బంధనం వాపి ప్రవేశం జ్వలనస్య వా।
ఉపవాస మథో శస్త్రం ప్రచరిష్యంతి వానరాః॥ ౩౬
ఘోర మారోదనం మన్యే గతే మయి భవిష్యతి।
ఇక్ష్వాకుకులనాశ శ్చ నాశ శ్చైవ వనౌకసామ్॥ ౩౭
సో హం నైవ గమిష్యామి కిష్కింధాం నగరీ మితః।
న చ శక్ష్యా మ్యహం ద్రష్టుం సుగ్రీవం మైథిలీం వినా॥ ౩౮

యు దిక్కుమాలినదియు సంతోషము లేనిదియు, పతివ్రతయునగు రుమ సుగ్రీవునితోడనే దేహమును బాయును. వాలిచచ్చుటచేఁ గలిగిన దుఃఖముచేఁ బీడింపఁబడినదై నవయుచున్న తారయు, వాలి నశించుటచేతను బినతండ్రియు రాజునునగు సుగ్రీవుండుపోవుటచేతను దుఃఖించిదుఃఖించి నవయు బాలుఁడగు నంగదుండునునెట్లుబ్రదికియుందురు! రాజగు సుగ్రీవుఁడు మృతినొందిన దుఃఖముచేఁ గరంబునొచ్చి వానరులందఱు నఱచేతులచేతను బిడికిళులచేతను దలలపైఁగొట్టుకొనుదురు. కీర్తిని గలవాఁడగు సుగ్రీవునిచే మంచిమాటలచేతను బహుమతుల నిచ్చుటచేతను గౌరవించుటచేతను బాలింపఁ బడిన వానరులందఱును బ్రాణములు విడుతురు. వానరోత్తములు మునుపటివలెఁ గిష్కింధకు వచ్చి వనములయందును గొండలయందును, అడ్డుగల మఱియేచోట్లయందేనియు నాటలాడఁబోరు. అట్లు రాజుచచ్చుటవలనివ్యసనముచేఁ బీడింపఁబడిన వానరప్రభువులు భార్యలతోడను బిడ్డలతోడను మంత్రులతోడను గొండలకొనలనుండి మిట్టపల్లములంబడి మ్రుగ్గుదురు. వానరులు విషముంగొనుదురు. గొంతున నురిపోసికొందురు. అగ్నియందుఁ బ్రవేశింతురు. అన్నపానములుమాని ప్రాయోపవేశము సేయుదురు. ఖడ్గముచే గొంతులుకోసికొనుదురు. నేను గిష్కింధ కేగితినేని భయంకరమగు రోదనధ్వని యంతటను బుట్టును. ఇక్ష్వాకుకులముయొక్క నాశమును మర్కటవంశముయొక్కచేటును గలుగును. కావున నేను గిష్కింధ కిచ్చటనుండి పోవుటలేదు. సీతనుగొనిపోకయే సుగ్రీవునిఁ జూడనోప.

మ య్యాగచ్ఛతి చేహస్థే ధర్మాత్మానౌ మహారథౌ।
ఆశయా తౌ ధరిష్యేతే వానరాశ్చ మనస్వినః॥ ౩౯
హస్తాదానో ముఖాదానో నియతో వృక్షమూలికః।
వానప్రస్థో భవిష్యామి హ్యదృష్ట్వా జనకాత్మజామ్॥ ౪౦
సాగరానూపజే దేశే బహుమూలఫలోదకే।
చితాంకృత్వా ప్రవేక్ష్యామి సమిద్ధ మరణీసుతమ్॥ ౪౧
ఉపవిష్టస్య వా సమ్య గ్లింగినీం సాధయిష్యతః।
శరీరం భక్షయిష్యంతి వాయసా శ్శ్వాపదాని చ॥ ౪౨
ఇదం మహర్షిభి ర్దృష్టం నిర్యాణ మితి మే మతిః।
సమ్య గాపఃప్రవేక్ష్యామి నచే త్పశ్యామి జానకీమ్॥ ౪౩
సుజాతమూలా సుభగా కీర్తిమాలా యశస్వినీ।
ప్రభగ్నా చిరరాత్రీయం మమ సీతా మపశ్యతః॥ ౪౪
తాపసో వా భవిష్యామి నియతో వృక్షమూలికః।
నేతః ప్రతిగమిష్యామి తా మదృష్ట్వా సితేక్షణామ్॥ ౪౫
యదీతః ప్రతిగచ్ఛామి సీతా మనధిగమ్య తామ్।
అంగద స్సహ తైః స్సర్వై ర్వానరై ర్నభవిష్యతి॥ ౪౬
వినాశే బహవో దోషా జీవన్ భద్రాణి పశ్యతి।
తస్మా త్ప్రాణాన్ ధరిష్యామి ధ్రువో జీవితసంగమః॥ ౪౭
ఏవం బహువిధం దుఃఖం మనసా ధారయ న్ముహుః।
నాధ్యగచ్ఛ త్తదా పారం శోకస్య కపికుంజరః॥ ౪౮

౩౮½. నేను కిష్కింధకుఁబోక యిక్కడనే యుండునంత వఱకు ధర్మముగ వర్తించువారును మహారథులనుబిరుదులనుగలవారునునగు రామలక్ష్మణులు నారాకకెదురుచూచుచు నాశచే బ్రతికియుండుదురు. వానరులును నెమ్మదిగనుందురు.

౪౦½, నుండి ౪౮½. జానకినిజూడనేరనేని, తానై చేతికందినవస్తువును నోటికందినపదార్థమును మాత్రమెకుడుచుచు నియమముగలవాఁడనై వృక్షములనీడన వసియించుచు వానప్రస్థాశ్రమమందుండెదను. అనేకములగు దుంపలను ఫలములను శుద్ధమగు నుదకమునుగల సముద్రతీర భూములందు శరీరమును దహించుటకై సొదపేర్చికొని యగ్నితగిల్చి యామంట యందుఁ జొచ్చువాఁడను. అన్నపానములనువర్జించి ప్రాయోపవేశమును వ్రతమునుధరించి జీవుని వెలువరించు చున్నదియగు నాదేహమును కాకులును మృగములును భక్షించునుగాక. జానకిని జూడనేరనైతి నేని లోఁతుగలనీటిం జొచ్చువాఁడను, ఇట్లు దేహమును విడుచుట యోగ్యులగు ఋషులకు సమ్మతమైనమార్గము, అని తలంచెదను. బాగుగఁ బ్రారంభమైనదియు, మిక్కిలిమాహాత్మ్యముంగలదియు, స్తోత్రార్హమైనదియు, కీర్తిగలదియునగు నీదీర్ఘమగురాత్రి సీతనుగానకయే ముగియవచ్చినది. నల్లనికన్నులుగలదియునగు సీతాదేవిని గానక నేను మరలుట లేదు. నియతిగలవాఁడనై వృక్షములనీడనిలచి తపస్సుచేయువాఁడ నయ్యెదను. సీతనుజూనకయే యిందుండిపోయితినేని ననుంజూచినతోడనే యంగదుఁడు వానరసేనలతోఁగూడఁ బ్రాణములను ద్యజించును. మరణముగలిగినచో దోషములనేకములు సంభవించుచున్నవి. జీవించియున్నవాఁడుగదా శుభములను బొందఁగలఁడు. కావుననే నేను బ్రాణములబిగఁబట్టి యుంచెదను మేలుకలుగునుగాక. అనియిట్లనేకవిధములయినదుఃఖములను బలుమఱుమనస్సున ధరించినవాఁడై హనుమంతుఁడు శోకమునకుఁ దుదగానక యుండెను.

రావణం వా వధిష్యామి దశగ్రీవం మహాబలమ్।
కామ మస్తు హృతా సీతా ప్రత్యాచీర్ణం భవిష్యతి॥ ౪౯
అథ వైనం సముత్క్షిప్య ఉపర్యుపరిసాగరమ్।
రామా యోపహరిష్యామి పశుం పశుపతే రివ॥ ౫౦
ఇతి చింతాం సమాపన్న స్సీతా మనధిగమ్య తామ్।
ధ్యానశోక పరీతాత్మా చింతయామాస వానరః॥ ౫౧
యావ త్సీతాం హి పశ్యామి రామపత్నీం యశస్వినీమ్।
తావ దేతాం పురీం లంకాం విచినోమి పునః పునః॥ ౫౨
సంపాతి వచనా చ్చాపి రామం య ద్యానయా మ్యహమ్।
అపశ్యన్ రాఘవో భార్యాం నిర్దహే త్సర్వవానరాన్॥ ౫౩
ఇహైవ నియతాహారో వత్స్యామి నియతేంద్రియః।
న మత్కృతే వినశ్యేయు స్సర్వే తే నరవానరాః॥ ౫౪
అశోకవనికా చేయం దృశ్యతే యా మహాద్రుమా।
ఇమా మధిగమిష్యామి నహీయం విచితా మయా॥ ౫౫
వసూ న్రుద్రాం స్తథా దిత్యా నశ్వినౌ మరుతో పి చ।
నమస్కృత్వా గమిష్యామి రక్షసాం శోకవర్ధనః॥ ౫౬
జిత్వా తు రాక్షసా న్సర్వా నిక్ష్వాకుకుల నందినీమ్।
సంప్రదాస్యామి రామాయ యథాసిద్ధిం తపస్వినే॥ ౫౭
స ముహూర్త మివ ధ్యాత్వా చింతా విగ్రథితేంద్రియః।
ఉదతిష్ఠ న్మహాతేజా హనుమా న్మారుతాత్మజః॥ ౫౮

౪౯½, నుండి ౫౧½కు. రావణునిచేఁ దేఁబడినదియగుసీతయెట్లయి యుండుఁగాక. పదితలలనుగలిగి మిక్కిలి బలవంతుఁడనుపేరు పొందిన యీరావణునిం జంపితినేని ద్వేషమేనియుఁ దీఱును. అట్లుగానిచో సీరావణునెత్తికొని, అగ్నికుండముకడకు హోమముసేయుటకై యజ్ఞపశువును గొనిపోయినట్లు శ్రీరామునికడకు గొనిపోయెదను. అనుచుఁ జింతను పొందినవాఁడగు వానరుఁడు సీతనుగానమిచేత మిక్కిలి ఖిన్నమైన మనస్సుగలవాఁడై యోచించుచుండెను.

౫౨½, నుండి ౫౯½. కీర్తిగలదియు,శ్రీరామునిభార్యయైనదియునగు సీతనెప్పుడుగందునో యంతవఱకును నేనీలంకాపురమందుఁ బలుమాఱు వెదుకుచుందును. సంపాతియనుపక్షిపలికిన మాటనునమ్మి శ్రీరామునిం బిలచికొనివచ్చియుందునేని శ్రీరాముండు సీతనుగానకదుఃఖించి కోపించి వానరులనందఱను గాల్చివైచును. మితమైన యాహారముంగొని యింద్రియముల వేగమునణంచుచు నేనీలంకయందే యుందును. అట్లయినచో వానరులకును రాజపుత్రులగు రామలక్ష్మణులకును నానిమిత్తమునఁ జావుకలుగకుండును. గొప్పవృక్షములనుగలిగి యగుపడుచున్న యీ యశోక వనమునకేగెదను. అచ్చోటనేను మున్ను వెదుకనైతిని. దేవతలలోనివారగు వసువులను,రుద్రులను,ఆదిత్యులను,అశ్వినీదేవతలను వాయువునుగూర్చి మ్రొక్కలిడి రాక్షసులకుశోకమును బెంచువాఁడనై యశోకవనమున కేగుచున్నాఁడను. సమస్తరాక్షసులను జయించి (ఇక్ష్వాకుకులమునకువన్నె తెచ్చు కోడలగు) సీతను (తపస్సుచేయుచున్నవానికి దానిఫలము నిచ్చినట్లుగా)శ్రీరామునకు సమర్పించువాఁడను. అనిమిక్కిలిప్రతాపముగలవాఁడునువాయుపుత్రుండునునగు హనుమంతుఁడు కొంతసేపు యోచించి శోకముడిగిన చిత్తముగలవాఁడయ్యెను.

నమోఽస్తు రామాయ సలక్ష్మణాయ
దేవ్యైచ తస్యై జనకాత్మజాయై।
నమోఽస్తు రుద్రేంద్ర యమా నిలేభ్యో
నమోఽస్తు చంద్రార్క మరు ద్గణేభ్యః॥ ౫౯

స తేభ్యస్తు నమస్కృత్వా సుగ్రీవాయ చ మారుతిః।
దిశ స్సర్వా స్సమాలోక్య హ్యశోక వనికాం ప్రతి॥ ౬౦

స గత్వా మనసా పూర్వ మశోక వనికాం శుభామ్।
ఉత్తరం చింతయామాస వానరో మారుతాత్మజః॥ ౬౧

ధ్రువంతు రక్షోబహులా భవిష్యతి వనాకులా।
అశోకవనికా చింత్యా సర్వసంస్కార సంస్కృతా॥ ౬౨

రక్షిణ శ్చాత్ర విహితా నూనం రక్షంతి పాదపాన్।
భగవా నపి సర్వాత్మా నాతిక్షోభం ప్రవాతి వై॥ ౬౩

సంక్షిప్తోఽయం మయాఽఽత్మా చ రామార్థే రావణస్యచ।
సిద్ధిం మే సంవిధాస్యంతి దేవా స్సర్షిగణా స్త్విహ॥ ౬౪

బ్రహ్మా స్వయంభూ ర్భగవాన్ దేవా శ్చైవ దిశంతు మే।
సిద్ధి మగ్ని శ్చ వాయు శ్చ పురుహూతశ్చ వజ్రభృత్॥ ౬౫

వరుణః పాశహ స్త శ్చ సోమాదిత్యౌ తథైవ చ।
అశ్వి నౌ చ మహాత్మానౌ మరుత శ్శర్వ ఏవ చ॥ ౬౬

సిద్ధిం సర్వాణి భూతాని భూతానాం చైవ యః ప్రభుః।
దాస్యంతి మమ యే చాన్యే హ్యదృష్టాః పథి గోచరాః॥ ౬౭

౫౯. లక్ష్మణ సహితుఁడగు శ్రీరామునకు మ్రొక్కెదను. జనక మహారాజపుత్రియగు సీతాదేవికిని నమస్కారము సేసెదను. రుద్ర, ఇంద్ర, యమ, వాయువులకు జోహారొనర్చెదను. చంద్రసూర్యాది దేవతలకుఁ జేతులుమోడ్చెదను.

౬౦, ౬౧. అని హనుమంతుఁడు వారలకెల్ల మ్రొక్కులిడి సుగ్రీవునిఁదలఁచి నమస్కరించి యన్నిదిక్కులను గాంచియటుపై నశోకవనము నుజూచెను. అట్లుచూచినవాఁడై ముందువెనుకయోచింపక మంగళకరముగు నశోకవనమున కేగి పిమ్మటఁ జేయందగుపనింగూర్చి యోచించెను.

౬౨, ౬౩. పెక్కండ్రు రక్కసులచే నిండినదియు, పట్టమైన చెట్లనుగలదియు సర్వవిధములగు నలంకారములచేనొప్పినదియు నగు నీయశోకవనము తప్పక వెదకఁదగినది వనమునుగాపాడు సేవకులును వనమందే యుండువారై చెట్లను శ్రద్ధతోఁ బెంచుచున్నారు. సర్వశక్తుఁడును సర్వవ్యాపియు నగు వాయుదేవుఁడుకూడ నీవనమున లెస్సగ వీచుటలేదు

౬౪. నాదేహము శ్రీరాముని శుభమునకును, రావణుఁడు చూచునేమో యనుభయమునకునుగా మిక్కిలి చిన్నదిగాఁజేయంబడియె. ఋషులును దేవతలును నాకుఁ గార్యము చక్కఁబడునట్లు సేయంజాలుదురు.

౬౫, ౬౬. తల్లిదండ్రులవలనఁగాక తనంతటనే పుట్టినవాఁడును మాహాత్మ్యము గలవాఁడును నగు బ్రహ్మయు, వజ్రాయుధమును ధరించియున్న దేవేంద్రుఁడును, అగ్నియు, వాయుదేవుండును, పాశమును ధరించినవాఁడగు వరుణుఁడును, సూర్యచంద్రులును, అశ్వినీదేవతలును, దేవతలును, రుద్రుండును నాకుఁ గార్యము సిద్ధించునట్లు చేయుదురుగాక.

౬౭. సమస్త భూతములును, సర్వభూతములకును బ్రభుఁడును నాబుద్ధి కందకయున్నను, కార్యానుకూల మార్గమందున్న యితర దేవతలును నాకు నీకార్యము ననుకూలము సేయుదురుగాక.

తదున్నసం పాండురదంత మవ్రణమ్
శుచిస్మితం పద్మ పలాశ లోచనమ్।
ద్రక్ష్యేత దార్యావదనం కదా న్వహమ్
ప్రసన్న తారాధిప తుల్యదర్శనమ్॥ ౬౮ ‌
క్షుద్రేణ పాపేన నృశంసకర్మణా
సుదారుణాలంకృత వేషధారిణా।
బలాభిభూతా హ్యబలా తపస్వినీ
కథంను మే దృష్టిపథే ద్య సాభవేత్॥ ౬౯

ఇతి శ్రీమత్సుందరకాండే - త్రయోదశస్సర్గః.

## చతుర్దశస్సర్గః.

సముహూర్త మివధ్యాత్వా మనసా చాధిగమ్యతామ్।
అవప్లుతో మహాతేజాః ప్రాకారం తస్య వేశ్మనః॥ ౧॥
సతు సంహృష్ట సర్వాంగః ప్రాకారస్థో మహాకపిః।
పుష్పితాగ్రా న్వసంతాదౌ దదర్శ వివిధాన్ ద్రుమాన్॥ ౨॥
సాలా నశోకా న్భవ్యాం శ్చ చంపకాం శ్చ సుపుష్పితాన్।
ఉద్దాలకా న్నాగవృక్షాం శ్చూతా న్కపిముఖా నపి॥ ౩॥
అథామ్రవణ సంఛన్నాం లతాశత సమావృతామ్।
జ్యాముక్త ఇవనారాచః పుప్లువే వృక్షవాటికామ్॥ ౪॥

౬౮. ఎఱ్ఱని ముక్కునుగలదియు, తెల్లని పండ్లనుగలదియు, గాయ మెందునులేనిదియు, నిర్మలమగునవ్వును దోఁపించునదియు, తామరరేకులవంటి కన్నులుగలదియు, నిండుచందురునింబోలె నగపడుచున్నదియు నగునట్లు రామునిచేఁ జెప్పంబడిన సీతమోమును నేనెప్పుడు గాంతునో.

౬౯. నీచుండును, పాపియు, ఘాతుకుఁడును, మిక్కిలిభయంకరముగా నలంకరింపఁబడిన వేషమును గలవాఁడునునగు రావణునిచేత బలహీనయు, తపస్సు చేయునదియునగు సీత బలాత్కారముగా నవమానపెట్టంబడియెను. అట్టిసీత మొగము నాకన్నుల కెట్లగపడును.

ఇది పదమూఁడవసర్గ.

---

పదునాల్గవసర్గ.

౧. మిక్కిలి దర్పముగలవాఁడగు హనుమంతుఁడు కొంతసేపు మనస్సున నిట్లుయోచించి యొక్క దాఁటున రావణుని గృహమునువదలి యశోకవనముయొక్క ప్రాకారమును జేరెను.

౨,౩. మీఁదఁ జెప్పంబడినట్లు ప్రాకారమునం జేరినవాఁడగు హనుమంతుఁడు తనదేహమును మిక్కిలి కుఱుచపఱచి యావసంత ఋతువుయొక్క ప్రారంభదశయందుఁ బుష్పించి వెలుంగుచున్న కొనలుగల నానావిధ వృక్షములను, ఏపె చెట్లను, అందమగు నశోకవృక్షములను లెస్సగఁ బూచిన సంపెంగచెట్లను, ఉద్దాలక నాగకేసరములను చెట్లను మామిడిచెట్లను, కపిముఖమను చెట్లను గనియె.

౪. అటుపై మామిడిప్రాఁకులచే మఱుఁగుపడియున్నదియుఁ బెక్కుతీఁగలచేఁ జుట్టంబడి యున్నదియు నగు వృక్షసమూహమునకు (వింటినారి నుండి విడువంబడినబాణమువలె) నాతండు దాఁటెను.

స ప్రవిశ్య విచిత్రాం తాం విహగై రభినాదితామ్।
రాజతైః కాంచనై శ్చైవ పాదపై స్సర్వతో వృతామ్॥ ౫॥

విహగై ర్మృగసంఘైశ్చ విచిత్రాం చిత్రకాననామ్।
ఉదితాదిత్యసంకాశాం దదర్శ హనుమా న్కపిః॥ ౬॥

వృతాం నానావిధై ర్వృక్షైః పుష్పోపగ ఫలోపగైః।
కోకిలై ర్భృంగరాజైశ్చ మత్తై ర్నిత్య నిషేవితామ్॥ ౭॥

ప్రహృష్టమనుజే కాలే మృగపక్షి సమాకులే।
మత్తబర్హిణ సంఘుష్టాం నానాద్విజ గణాయుతామ్॥ ౮॥

మార్గమాణో వరారోహాం రాజపుత్రీ మనిందితామ్।
సుఖప్రసుప్తా న్విహగా న్బోధయామాస వానరః॥ ౯॥

ఉత్పతద్భి ర్ద్విజగణైః పక్షై స్సాలా స్సమాహతాః।
అనేకవర్ణా వివిధా ముముచుః పుష్పవృష్టయః॥ ౧౦॥

పుష్పావకీర్ణ శ్శుశుభే హనుమా న్మారుతాత్మజః।
అశోకవనికామధ్యే యథా పుష్పమయో గిరిః॥ ౧౧॥

దిశ స్సర్వాః ప్రధావంతం వృక్షషండగతం కపిమ్।
దృష్ట్వా సర్వాణి భూతాని వసంత ఇతి మేనిరే॥ ౧౨॥

వృక్షేభ్యః పతితైః పుష్పై రవకీర్ణా పృథగ్విధైః।
రరాజ వసుధా తత్ర ప్రమదేవ విభూషితా॥ ౧౩॥

౫, ౬, ౭, ౮. అట్లు దాఁటి యావృక్ష సమూహమునఁజొచ్చి, పక్షులచే నంతటను ధ్వనించుచున్నదియు వెండిచేతను బంగారముచేతను జేయంబడిన చెట్లచే నంతటఁజుట్టంబడినదియుఁ బక్షులచేతను మృగసమూహములచేతను వింతయైనదియు వింతలగు చిన్న చిన్న వనములనుగలదియు బాలసూర్యునితోఁ దుల్యమై వెలుంగునదియుఁ బుష్పములను ఫలములను మెండుగఁ గలిగియున్న నానావిధవృక్షములచేతను జుట్టంబడినదియు మదించిన కోకిలలచేతను గండుతుమ్మెదలచేతను సర్వకాలములయందు నాశ్రయింపఁబడినదియు మదించిన నెమళులగొప్పధ్వనినిగలదియుఁ బెక్కువిధములగు పక్షుల గుంపులతోఁ గూడినదియు నగు నశోకవనమును సంతసించిన మనుష్యులతోఁ గూడిన దానిని, మృగములయొక్కయుఁ బక్షులయొక్కయు సమూహముచే మెంపుకొనియుండు దానిని వానరోత్తముఁడగు హనుమంతుఁ కనుఁ గనియెను.

౯. ఆవానరుఁ డుత్తమ చరితముంగలదియు రాజపుత్రికయు స్త్రీరత్నమును నగు సీతా దేవిని వెదకుచు నందు గాఢముగ నిద్రించుచున్న పక్షులను మేల్కొలిపెను.

౧౦. అట్లు మేల్కొని యెగయుచున్న పక్షులతాఁకునను వాని రెక్కల సోఁకునను వృక్షము లనేకవర్ణములుగల పుష్పములను విడచెను.

౧౧. అట్లు రాలిన పుష్పముల జల్లుచేఁ గప్పంబడినవాఁడై హనుమంతుఁడు (అశోకవనమధ్యమందు) పుష్పములకొండవలె నొప్పెను.

౧౨. అన్నిదిక్కులఁ బరుఁగెత్తుచున్నవాఁడును చెట్లకొమ్మలపై నున్నవాఁడునునగు హనుమంతునిఁగని సర్వభూతములును వసంతుఁడని తలంచెను.

౧౩. వృక్షములనుండి రాల్పఁబడిన నానావిధ పుష్పములచేతను నిండినదై భూదేవి (బాగుగ నలంకరింపఁబడిన) పడుచువలె నచ్చటఁ గనంబడియెను.

తరస్వినా తే తరవ స్తరసాభి ప్రకంపితాః।
కుసుమాని విచిత్రాణి ససృజుః కపినా తదా॥ ౧౪॥

నిర్ధూత పత్రశిఖరా శ్శీర్ణపుష్ప ఫలా ద్రుమాః।
నిక్షిప్త వస్త్రాభరణా ధూర్తా ఇవ పరాజితాః॥ ౧౫॥

హనూమతా వేగవతా కంపితా స్తే నగోత్తమాః।
పుష్పపర్ణఫలా న్యాశు ముముచుః పుష్పశాలినః॥ ౧౬॥

విహంగసంఘై ర్హీనా స్తే స్కంధమాత్రాశ్రయా ద్రుమాః।
బభూవు రగమా స్సర్వే మారుతే నేవ నిర్ధుతాః॥ ౧౭॥

నిర్ధూతకేశీ యువతి ర్యథా మృదిత వర్ణకా।
నిష్పీత శుభ దంతోష్ఠీ నఖై ర్దంతై శ్చ విక్షతా॥ ౧౮॥

తథా లాంగూలహస్తై శ్చ చరణాభ్యాం చ మర్దితా।
బభూ వాశోకవనికా ప్రభగ్న వరపాదపా॥ ౧౯॥

మహాలతానాం దామాని వ్యధమ త్తరసా కపిః।
యథా ప్రావృషి వింధ్యస్య మేఘజాలాని మారుతః॥ ౨౦॥

స తత్ర మణిభూమీశ్చ రాజతీ శ్చ మనోరమాః।
తథా కాంచనభూమీ శ్చ దదర్శ విచర న్కపిః॥ ౨౧।

౧౪. వేగవంతుఁడగు హనుమంతునిచే బలవంతముగఁ గదల్పఁబడిన యావృక్షములన్నియు నానావిధములగు పుష్పములను బ్రోగులుగఁ రాల్చెను.

౧౫,౧౬. కదల్పఁబడిన యాకులుం గొమ్మలుం గలవియు రాలిన పుష్పములుం ఫలములుం గలవియు నగువృక్షములు (పందెమునకై వస్త్రములను సొమ్ముల నూడ్చి పెట్టి పోసిగనున్న) జూదరులవలెఁ గాంతిహీనములై యుండెను. వేగవంతుఁడగు హనుమంతునిచేఁ గదల్పఁబడిన (పువ్వులంగల) పెద్దచెట్లును బుష్పములను బత్రములను ఫలములను జల్లున విడిల్చెను.

౧౭. పక్షిసమూహములను బోఁగొట్టుకొన్నవై కొమ్మలు నాకులు లేక మొదళ్లనుమాత్రముగలవియై వృక్షములు పెనుగాలిచే దన్నినవానివలెఁ గనంబడి నిలువ నాధారములేని వయ్యెను.

౧౮,౧౯. వదలిన కొప్పుగలదియు, నలిగిన మేనిపూతలు గలదియు లెస్సగఁ జీఁకంబడిన పెదవిఁగలదియు గోళ్లచేతను దంతములచేతను గాట్లు వడినదియునగు వయసుకత్తె యెట్లుండునో యటువలెనే తోఁకచేతనుహస్తములచేతను బాదములచేతను లెస్సగ మెదుపంబడి ధ్వంసమైన పెను మ్రాకులఁ గలిగినదై యశోకవన మొప్పెను.

౨౦. ఆవానరోత్తముఁడు, వానకాలమందు వింధ్యపర్వతముపైఁ జేరిన మేఘములను వాయుదేవుండు తూలఁగొట్టునట్లుగా నశోకవనమందలి పెద్దతీఁగెల వరుసలను వేగముచేఁ జదిపెను.

౨౧నుండి౨౬కు. ఆ యశోక వనమందు మనస్సునకింపగు రత్నములుపొదిగిన ప్రదేశములును, వెండిరేఁకులు బంగారుపలకలు పరువంబడిన నెలవులును, నిర్మలమగు నుదకముచేనిండి వెలగల రత్నముల మె

వాపీ శ్చ వివిధాకారాః పూర్ణాః పరమవారిణా।
మహార్హై ర్మణిసోపానై రుపపన్నా స్తత స్తతః॥ ౨౨॥

ముక్తాప్రవాళ సికతాః స్ఫాటికాంతర కుట్టిమాః।
కాంచనై స్తరుభి శ్చిత్రై స్తీరజై రుపశోభితాః॥ ౨౩॥

ఫుల్ల పద్మోత్పల వనా శ్చక్రవా కోప కూజితాః।
నత్యూహ రుత సంఘుష్టా హంస సారసనాదితాః॥ ౨౪॥

దీర్ఘాభి ర్ద్రుమయుక్తాభి స్సరిద్భి శ్చ సమంతతః।
అమృతోపమ తోయాభి శ్శివాభి రుపసంస్కృతాః॥ ౨౫॥

లతాశతై రవతతా స్సంతానకుసుమా వృతాః।
నానా గుల్మావృత ఘనాః కరవీర కృతాంతరాః॥ ౨౬॥

తతోంబుధర సంకాశం ప్రవృద్ధశిఖరం గిరిమ్।
విచిత్రకూటం కూటై శ్చ సర్వతః పరివారితమ్॥ ౨౭॥

శిలాగృహై రవతతం నానావృక్షై స్సమావృతమ్।
దదర్శ హరిశార్దూలో రమ్యం జగతి పర్వతమ్॥ ౨౮॥

దదర్శ చ నగా త్తస్మా న్నదీం నిపతితాం కపిః।
అంకా దివ సముత్పత్య ప్రియస్య పతితాం ప్రియామ్॥ ౨౯॥

జలే నిపతితాగ్రై శ్చ పాదపై రుపశోభితామ్।
వార్యమాణా మివ క్రుద్ధాం ప్రమదాం ప్రియబంధుభిః॥ ౩౦॥

పునరావృ త్త తోయాం చ దదర్శ స మహాకపిః।
ప్రసన్నా మివ కాంతస్య కాంతాం పునరుపస్థితామ్॥ ౩౧॥

ట్లుగలిగి నానావిధములుగా నిర్మింపఁబడి యందమైనవియు, ప్రక్కలనున్న విచిత్రములగు బంగారుచెట్లచేవెలింగి, ముత్తెములయొక్కయు, పగడముల యొక్కయుఁ జూరునుగలిగి స్ఫటికములు పరువంబడిన తగ్గుతిన్నెలును వికసించినట్టి కమలములయొక్కయు కలువలయొక్కయు సమూహములను గలవియు, చక్రవాక పక్షులయొక్క కూఁతలను గలవియు భరతపక్షుల విశేషధ్వనిని గలవియు హంసలయొక్కయు బెగ్గురుపక్షులయొక్కయు ధ్వనిచే మ్రోగుచున్నవియు, ఉన్నతములైన వృక్షములను గట్లయందుఁగలిగి యమృతమువంటి మంగళకరమగు నుదకమునుగలిగిన వాఁకలచే నంతటఁబరిశుద్ధములైయున్నవియు. తీఁగెల మొత్తములచే నిండినవియు, కల్పవృక్షములను జుట్టునుగలవియు, పెక్కువిధముల పొదలచేఁ జుట్టఁబడి పట్టమైనవియు గన్నేరుచెట్లను నడుమ నడుమ గలవియు నగు బావులను హనుమంతుం డిటునటుఁ దిరుగుచుఁ గాంచెను.

౨౭, ౨౮. అటుపై మేఘముతోఁ దుల్యమైనదియు, ఉన్నతమైన శిఖరములనుగలదియు,వింతలగు శిఖరములను గలదియు, శిఖరములచే నంతటఁ వ్యాపించునదియు,ఱాతియిండ్లను మెండుగఁ గలదియు సర్వవిధ వృక్షముల చేతను జుట్టంబడినదియు మనోహరమైనదియునగు క్రీడాపర్వతమును (ఆటలాడుకొనుటకై మంటిచేఁ జేయంబడినకొండను) వానరశ్రేష్ఠుఁడుగాంచెను.

౨౯, ౩౦, ౩౧. ఆపర్వతమునుండి వెలువడినదియు. ప్రియునియొక్క తొడపైనుండి వెలువడిన భార్యవలెనున్నదియు, పోవలదని చుట్టముల డ్డగింపఁగా వినక యలిగిపోవుచున్న స్త్రీలవలె నీటియందుఁగొనలు వ్రాలియున్న చెట్లచేనొప్పి ప్రవహించుచున్నదియు, కోపమునుమాని మరల మగనింజేరవచ్చు నిల్లాలివలె మరలివచ్చుచున్న యుదకమునుగలదియు నగు నదిని వానరోత్తముఁడగు హనుమంతుఁడు గాంచెను.

తస్యా దూరా త్స పద్మిన్యో నానాద్విజగణాయుతాః।
దదర్శ హరిశార్దూలో హనుమా న్మారుతాత్మజః॥ ౩౨॥

కృత్రిమాం దీర్ఘికాం చాపి పూర్ణాం శీతేన వారిణా।
మణిప్రవర సోపానాం ముక్తా సికతశోభితామ్॥ ౩౩॥

వివిధై ర్మృగసంఘై శ్చ విచిత్రాం చిత్రకాననామ్।
ప్రాసాదై స్సుమహద్భి శ్చ నిర్మితై ర్విశ్వకర్మణా॥
కాననైః కృత్రిమై శ్చాపి సర్వత స్సమలంకృతామ్॥ ౩౪॥

యే కేచి త్పాదపా స్తత్ర పుష్పోపగ ఫలోపగాః॥
సచ్ఛత్రా స్సవితర్దీకా స్సర్వే సౌవర్ణ వేదికాః॥ ౩౫॥

లతాప్రతానై ర్బహుభిః పర్ణై శ్చ బహుభి ర్వృతామ్॥ ౩౬॥

కాంచనీం శింశుపా మేకాం దదర్శ హనుమా న్కపిః।
వృతాం హేమమయీభి స్తు వేదికాభి స్సమంతతః॥ ౩౭॥

సో పశ్య ద్భూమిభాగాం శ్చ గర్త ప్రస్రవణాని చ।
సువర్ణవృక్షా నపరాన్ దదర్శ శిఖిసన్నిభాన్॥ ౩౮॥

తేషాం ద్రుమాణాం ప్రభయా మేరో రివ దివాకరః।
అమన్యత తదా వీరః కాంచనోఽస్మీతి వానరః॥ ౩౯॥

౩౨. వానరశ్రేష్ఠుండును వాయుపుత్రుఁడును నగు హనుమంతుఁడు మీఁదఁజెప్పంబడిన నదికి దూరమున ననేకవిధములగు పక్షిసమూహము లతోఁగూడిన తామరతీఁగలను గనియెను.

౩౩, ౩౪. చల్లని నీటిచేత నిండినదియు, శ్రేష్ఠమగు రత్నముల మెట్లను గలదియు, ముత్తెముల యిసుకచే నొప్పినదియు, అనేకవిధములగు మృగముల సమూహముచే నందమైనదియు, వింతలగు వనములను గలదియు, విశ్వకర్మచే నిర్మింపఁబడిన మిక్కిలిగొప్పమేడలచేతను, ఉద్యానవనములచేతను నంతట నలంకరింపఁబడిదియునగు నడబావిని వానరవీరుండు గనియెను.

౩౫. ఆనడబావికడ, మొదళ్లయందుఁ దిన్నెలను గలవియగు వృక్షములన్నియుఁ గొడుగులవలె దట్టముగ నాకులుం గొమ్మలుం గలవియుఁ బువ్వులను ఫలములను గలవియు బంగారు తిన్నెలను గలవియును గానుండెను.

౩౬, ౩౭. అనేకములగు తీఁగెలమొత్తములచేతను, పొదలచేతను జుట్టఁబడినదియు బంగారుతిన్నెలచేత నంతటను జుట్టంబడినదియు నగునిరుగుడుచెట్టు నొక్కదానిని వానరోత్తముఁడగు హనుమంతుఁడు గనియెను.

౩౮. ఆహనుమంతుఁడు గుంటలను, ఊటలను, భూమిభాగములను, అగ్నితోఁదుల్యముగ వెలుంగుచున్న బంగారువృక్షములను గొన్నింటిని గాంచెను.

౩౯. వీరుఁడగు నాంజనేయుఁడు, మీఁదఁ జెప్పంబడిన బంగారుచెట్లు సమీపమున నున్నపుడు (మేరువు సమీపమందున్న సూర్యునివలె) దాను బంగారుమయమయిన దేహముంగలిగినట్లు తలంచెను.

తాం కాంచనై స్తరుగణై ర్మారుతేన చ వీజితామ్।
కింకిణీశత నిర్ఘోషాం దృష్ట్వా విస్మయ మాగమత్॥ ౪౦
స పుష్పితాగ్రాం రుచిరాం తరుణాంకుర పల్లవామ్।
తా మారుహ్య మహాబాహు శ్శింశుపాం పర్ణసంవృతామ్॥
ఇతో ద్రక్ష్యామి వైదేహీం రామదర్శన లాలసామ్।
ఇత శ్చేత శ్చ దుఃఖార్తాం సంపతంతీం యదృచ్ఛయా॥ ౪౧
అశోకవనికా చేయం దృఢం రమ్యా దురాత్మనః।
చంపకై శ్చందనై శ్చాపి వకుళై శ్చ విభూషితా॥ ౪౨
ఇయం చ నళినీ రమ్యా ద్విజసంఘ నిషేవితా।
ఇమాం సా రామమహిషీ నూన మేష్యతి జానకీ॥ ౪౩
సా రామా రామమహిషీ రాఘవస్య ప్రియాసతీ।
వనసంచారకుశలా నూన మేష్యతి జానకీ॥ ౪౪
అథవా మృగశాబాక్షీ వనస్యాస్య విచక్షణా।
వనమేష్యతి సాచేహ రామచింతానుకర్శితా॥ ౪౫
రామశోకాభిసంతప్తా సా దేవీ వామలోచనా।
వనవాసే రతా నిత్య మేష్యతే వనచారిణీ॥ ౪౬
వనే చరాణాం సతతం నూనం స్పృహయతే పురా।
రామస్య దయితా భార్యా జనకస్యసుతా సతీ॥ ౪౭
సంధ్యాకాల మనా శ్శ్యామా ధ్రువమేష్యతి జానకీ।
నదీం చేమాం శివజలాం సంధ్యార్థే వరవర్ణినీ॥ ౪౮

౪౦. బంగారుచెట్ల సమూహముతోఁ గూడినదియు, గాలిచే వీవంబడినదియు, పెక్కులగు మువ్వలధ్వనితోఁ గూడినదియు నగు నశోకవృక్షమునుగాంచి హనుమంతుఁడు మిక్కిలి యాశ్చర్యపడెను.

౪౧ నుండి ౫౧. మిక్కిలి బలశాలియగు హనుమంతుఁడు పూచిన కొమ్మలతోఁ గూడెనదియు, ప్రకాశించుచున్నదియు, లేఁతచిగుళ్లను గలదియు, ఆకులను దట్టముగాఁ గలదియునగు నిరుగుడుచెట్టు నెక్కినవాఁడై శ్రీరామునిదర్శనమున కాశించుచున్నదియు, దుఃఖముచేనుబ్బి యిందిందు వెఱ్ఱిదానివలెఁ దిరుగుచున్నదియు నగుజానకి నిచ్చటనుండి చూచెదను గాక. సంపెంగ తీఁగెలచేతను జందనపు ప్రాకులచేతను బొగడచెట్లచేతను నలంకరింపఁ బడినదై దట్టమై యింపుగనున్నయిది పాపాత్ముఁడగు రావణుని యశోకవనము. పక్షుల కలకలముతోఁగూడిన యీతామరతీఁగె యందమైయున్నది, దీనియందమునుజూడ రామునిపట్టపు దేవియగుసీత రాకమానదు. జనకుని ప్రియపుత్త్రికయు రాఘవునకుఁ బ్రాణసఖియు రామునకుఁ బట్టపుదేవియు నయిన యీయింతి వనవిహారమందు నేర్పుగలదిగావునఁ దప్పకయిందు రాఁగలదు. అట్లుగాక పసిజింకచూపులవంటి చూపులుగలదియు రామునిం దలఁచితలఁచి దుఃఖించి బక్కచిక్కి యున్నదియు నగుసీత యీయశోక వనసంచారమందు శ్రద్ధగలదిగావున గుణవతియగు నాయిల్లాలు తప్పక యిందురాఁగలదు. అందమగు కన్నులుగలదియు శ్రీరామునెడబాయుటవలని శోకముచేఁ బరితపించుచున్నదియు వనవిహారమందాసక్తిగలదియు, వనమందేయుండ నిచ్ఛగలదియు నగుసీత యనుదినము వచ్చుచుండును. జనకుని పుత్త్రికయై ప్రఖ్యాతిగాంచినదియు శ్రీరామునకుఁ బ్రాణమువలెఁ బ్రియమైనదియునగుసీత ముందే వానరులకు మేలుంగోరుచున్నయది. మనోహరమగు రూపముంగలదియు యుత్తమగుప్రాయమునం దున్నదియు నగు జనకపుత్త్రిక సంధ్యాకాలమును వేచియుండి యీ నది

తస్యా శ్చా ప్యనురూపేయ మశోకవనికా శుభా।
శుభాయా పార్థివేంద్రస్య పత్నీ రామస్య సమ్మతా॥ ౫౦॥
యది జీవతి సా దేవీ తారాధిప నిభాననా।
ఆగమిష్యతి సా వశ్యా మిమాం శివజలాం నదీమ్॥ ౫౧॥
ఏవంతు మత్వా హనుమా న్మహాత్మా
ప్రతీక్షమాణో మనుజేంద్రపత్నీమ్।
అవేక్షమాణ శ్చ దదర్శ సర్వమ్
సుపుష్పితే పర్ణఘనే నిలీనః॥ ౫౨॥

ఇతి శ్రీమత్సుందరకాండే-చతుర్దశస్సర్గః.

---

## పంచదశస్సర్గః.

సవీక్షమాణ స్తత్రస్థో మార్గమాణ శ్చ మైథిలీమ్।
అవేక్షమాణ శ్చ మహీం సర్వాం తా మన్వవైక్షత॥ ౧॥
సంతానక లతాభి శ్చ పాదపై రుపశోభితామ్।
దివ్యగంధ రసోపేతాం సర్వత స్సమలంకృతామ్॥ ౨॥
తాం సనందన సంకాశాం మృగపక్షిభి రావృతామ్।
హర్మ్యప్రాసాద సంబాధాం కోకిలాకుల నిస్స్వనామ్॥ ౩॥
కాంచనోత్పల పద్మాభి ర్వాపీభి రుపశోభితామ్।
బహ్వాసన కుథోపేతాం బహుభూమి గృహాయుతామ్॥ ౪॥

యందలి పుణ్యోదకములలోఁ బరిశుద్ధురాలై యీశ్వరునారాధింపవచ్చుట సత్యము. ఆసీతాదేవికి మంగళకరమగు నీయశోకవనము తగినదై యున్నది. రాజోత్తముఁడగు శ్రీరామునియొక్క భార్యయు నీవనమునకుఁ దగినదై యున్నది. నిండుచంద్రునింబోలు మోముగల యీపట్టపుదేవి జీవించియే యున్నదైనచో నీ మంగళకరమగు జలమునుగల నదికిఁ దప్పకవచ్చును.

౫౨. ఇట్లుదలంచి సమర్థుఁడగు హనుమంతుఁడు రాజభార్యయగు సీతరాక కెదురుచూచుచున్నవాఁడై, మెండుగఁ బుష్పించి తఱుచుగ నాకులను గలిగియున్న విరుగుడుచెట్టునందాఁగి యంతటంగను చుండెను.

ఇదిపదునాల్గవసర్గ.

## పదునైదవసర్గ.

౧. ఆహనుమంతుఁ డావిరుగుడుచెట్టుపైనుండి సీతను వెదకుచున్నవాఁడై యన్నిదిక్కులకుఁ జూపుల వ్యాపింపఁజేయుచు నచ్చటి భూప్రదేశమునంతయుం గనియెను.

౨ నుండి ౧౪ వఱకు. కల్పవృక్షములయం దల్లిన తీఁగెలచేతను, పెక్కు వృక్షములచేతను బ్రకాశించునదియు, శ్రేష్ఠమగు పరిమళమును రుచియునుగల ఫలపుష్పములను గలదియు, దేవేంద్రుని నందనవనముతో సమమైనదియు మృగములచేతను బక్షులచేతను జుట్టుకొనంబడినదియు, ధనికులయొక్కయుఁ బ్రభువులయొక్కయు మేడలచేఁదఱుచైనదియు, కోకిలలయొక్క కలకలధ్వనిని గలదియు, బంగారపు కమలములను గలువలను గల బావులచే నందమైనదియు, పెక్కుపీఠములను గలదియు, రత్నకంబళములు పఱువంబడి యున్నదియు, పెక్కులగు పాతాళగృహములను గలదియు, అన్ని ఋతువుల యందును బుష్పములను గలిగి ఫలములచే నొప్పిన వృక్ష

సర్వర్తు కుసుమై రమ్యాం ఫలవద్భి శ్చ పాదపైః।
పుష్పితానా మశోకానాం శ్రియా సూర్యోదయప్రభామ్॥ ౪॥
ప్రదీప్తా మివ తత్రస్థో మారుతి స్సముదైక్షత।
నిష్పత్రశాఖాం విహగైః క్రియమాణా మివా సకృత్॥ ౫॥
వినిష్పతద్భి శ్శతశ శ్చిత్రైః పుష్పావతంసకైః।
ఆమూలపుష్పనిచితై రశోకై శ్శోక నాశనైః॥ ౬॥
పుష్పభా రాతిభారై శ్చ స్పృశద్భి రివ మేదినీమ్।
కర్ణికారైః కుసుమితైః కింశుకై శ్చ సుపుష్పితైః॥ ౭॥
స దేశః ప్రభయా తేషాం ప్రదీ ప్త ఇవ సర్వతః॥ ౭½
పున్నాగా స్సప్తపర్ణా శ్చ చంప కోద్దాలకా స్తథా॥ ౮॥
వివృద్ధమూలా బహవ శ్శోభంతే స్మ సుపుష్పితాః।
శాతకుంభనిభాః కేచి కేచి దగ్నిశిఖోపమాః॥ ౧౦॥
నీలాంజన నిభాః కేచి త్తత్రాశోకా స్సహస్రశః।
నందనం వివిధో ద్యానం చిత్రం చైత్రరథం యథా॥ ౧౧॥
అతివృ త్త మివాచింత్యం దివ్యం రమ్యం శ్రియావృతమ్।
ద్వితీయ మివ చాకాశం పుష్పజ్యోతి ర్గణాయుతమ్॥ ౧౨॥
పుష్పరత్నశతై శ్చిత్రం పంచమం సాగరం యథా।
సర్వర్తుపుష్పై ర్నిచితం పాదపై ర్మధుగంధిభిః॥ ౧౩॥
నానా నినాదై రుద్యానం రమ్యం మృగగణై ర్ద్విజైః।

ములచే మనోహరమైనదియు, లెస్సగఁ బూచియున్న యశోకవృక్షముల యొక్క కాంతిచే సూర్యోదయకాంతినిగలిగి మండుచున్నట్లున్నదియు, ఆకులును కొమ్మలును లేకుండఁజేయుటకుఁ గాబోలు ననునట్లు విదిలించుచున్న కొక్కులతోఁగూడిన పక్షులచే నొప్పినదియు, మితిలేక రాలుచున్న నానావర్ణములుగలపుష్పములచే మొదళ్లయందు పట్టమైయున్నట్టియు మనోవేదనను బాపునట్టియుఁ బుష్పములభారముచే భూమినంటుచున్నట్టియు నశోక వృక్షములచేతను, పూచిన కొండగోగులచేతను, బాగుగఁ బుష్పించియున్న మోదుగు చెట్లచేతను జారుతరంబైన యశోకవనమును హనుమంతుఁడు గనియె. ఆ యశోకవృక్షములకాంతిచే నాచోటెల్ల మండుచున్నట్లుండెను.

౯ నుండి ౧౪ కు. మొదళ్లు బలిసియున్నవియు బాగుగఁ బుష్పించియున్నవియు లెక్కకుమించియున్నవియు నగు పొన్నచెట్లును, ఏడాకుల యరఁటిచెట్లును, సంపంగియుద్దాలకములనుచెట్లును, కొన్ని బంగారుచాయయుఁ గొన్ని యగ్నిజ్వాలయొక్క కాంతియు, కొన్ని కాటుకవలెఁ బ్రకాశమును గలవియగుచున్న యశోకవృక్షము లచ్చోట మితిలేక ప్రకాశించుచుండెను. అందందుఁ జిన్నచిన్నవనములతోఁగూడియున్న యింద్రుని యుద్యానవనమువలెను, కుబేరునివనముంబోలెను వింతయైనదియు, మితిమించిన సొంపునుగలదియగుటచే వర్ణింపఁదరముకానిదియు, కాంతిచే నొప్పియుంపైయున్నదియు, ఆకాశము చుక్కలచేఁ బ్రకాశించునట్లు పుష్పములచేఁబ్రకాశించుచున్నదియు, పుష్పములనెడు రత్నములయొక్క కాంతిచే నొప్పినైదవసముద్రమువలె వింతగనున్నదియు, అన్నిఋతువులయందును బుష్పములనుగలవియుఁ దేనెవాసననుగలవియునైన చెట్లచేఁ దఱుచు నున్నదియు, పెక్కుధ్వనులుగల మృగములయొక్కయుఁ బక్షులయొక్కయు సమూహముచే రమ్యమైనదియు, పెక్కువాసనలను ధరించియున్నదియు, పవిత్రమగు

అనేకగంధప్రవహాం పుణ్యగంధం మనోరమమ్॥ ౧౪॥
శైలేంద్ర మివ గంధాఢ్యం ద్వితీయం గంధమాదనమ్॥ ౧౪
అశోకవనికాయాం తు తస్యాం వానరపుంగవః॥ ౧౫॥
సదదర్శావిదూరస్థం చైత్య ప్రాసాద ముచ్ఛ్రితమ్।
మధ్యే స్తంభసహస్రేణ స్థితం కైలాసపాండురమ్॥ ౧౬॥
ప్రవాళకృత సోపానం తప్తకాంచన వేదికమ్।
ముష్ణంత మివ చక్షూంషి ద్యోతమాన మివశ్రియా॥
విమలం ప్రాంశుభావత్వా దుల్లిఖంత మివాంబరమ్॥ ౧౭
తతో మలినసంవీతాం రాక్షసీభి స్సమావృతామ్॥ ౧౮॥
ఉపవాసకృశాం దీనాం నిశ్శ్వసంతీం పునఃపునః।
దదర్శ శుక్లపక్షాదా చంద్రరేఖా మివామలామ్॥ ౧౯॥
మంద ప్రఖ్యాయమానేన రూపేణ రుచిరప్రభామ్।
పినద్ధాం ధూమజాలేన శిఖా మివ విభావసోః॥ ౨౦॥
పీతేనైకేన సంవీతాం క్లిష్టే నోత్తమవాససా।
సపంకా మనలంకారాం విపద్మామివ పద్మినీమ్॥ ౨౧॥
వ్రీళితాం దుఃఖసంతప్తాం పరిమ్లానాం తపస్వినీమ్।
గ్రహే ణాంగారకేణేవ పీడితామివ రోహిణీమ్॥ ౨౨॥
అశ్రుపూర్ణముఖీం దీనాం కృశా మనశనేన చ।
శోకధ్యానపరాందీనాం నిత్యం దుఃఖపరాయణామ్॥ ౨౩॥

వాసనను గలిగి మనోహరమైనదియు, పర్వతశ్రేష్ఠములవలెఁబరిమళమును గ్రక్కుచున్నదియు రెండవ గంధమాదన పర్వతమువలె సుగంధమును వెదచల్లుచున్నదియు నగు నావనమును హనుమంతుఁడు గనియెను.

౧౫ నుండి ౧౭౮కు. ఆ యశోకవనమునందు సమీపమున నున్నదియు, వేయికంబములను గలిగి కైలాసమువలెఁ దెల్లనై మిక్కిలి యున్నతమై, పగడపు సోపానములను గలిగి కుందనపు వన్నెలచేఁ నొప్పి కన్నులను హరించునంతటి కాంతిచే వెలుంగుచు నిర్మలమై యున్నతిచే నాకాశము నొరయుచున్నట్లున్న రమ్యమగు మేడను వానరోత్తముఁడు గాంచెను.

౧౮ నుండి ౨౫౪. అటపైనాతఁడు, మాసినవస్త్రమును గలదియు రాక్షసస్త్రీలచేఁ జుట్టఁబడినదియు, ఉపవాసములచే డస్సియున్నదియు, పలుమారు నిట్టూర్పులు పుచ్చుచున్నదియు, శుక్లపక్ష పాడ్యమినాఁటి చంద్రరేఖవలె నిర్మలమై కృశించియున్నదియు, మెల్లఁగా నూహింపఁ దగిన రూపమును గలదియు, మిక్కిలి కాంతిచే నొప్పునదియు, పొగచేఁ గప్పంబడిన యగ్ని జ్వాలవలె నున్నదియు, మాసి చివికి జీర్ణించిన పచ్చని వెలగల యొంటిచీరతోనున్నదియు, మేనంతట దుమ్ము గ్రమ్మినదియు, భూషణములులేనిదియు, కమలములు లేని సరస్సువలె నున్నదియు, సిగ్గుతోఁ గూడినదియు, దుఃఖముచే బొగిలియున్నదియు, మిక్కిలి యలసియున్నదియు, తపస్సుచేయుచున్నదియు, అంగారకగ్రహముచేఁ బీడింపఁబడిన రోహిణివలె నున్నదియు, కన్నీళ్లచే నిండిన మోముగలదియు, దిక్కులేనిదియు, ఆహారములేక చిక్కియున్నదియు, శోకముపాలంబడి నొచ్చియున్నదియు, ఎల్లప్పుడు దుఃఖించుటయేవృత్తియైనదియు, హితులగు వారిని గలుగనిదియు, రాక్షసస్త్రీలచేఁజిక్కియున్నదియు, తనగుంపునుం

ప్రియంజన మపశ్యంతీం పశ్యంతీం రాక్షసీగణమ్।
స్వగణేన మృగీంహీనాం శ్వగణాభి వృతామివ॥ ౨౬
నీలనాగాభయా వేణ్యా జఘనంగత యైకయా।
నీలయా నీరదాపాయే వనరాజ్యా మహీ మివ॥ ౨౭
సుఖార్హాం దుఃఖసంతప్తాం వ్యసనానా మకోవిదామ్॥ ౨౮
తాం సమీక్ష్య విశాలాక్షీ మధికం మలినాం కృశామ్।
తర్కయామాస సీతేతి కారణై రుపపాదిభిః॥ ౨౯
హ్రియమాణా తదా తేన రక్షసా కామరూపిణా।
యథా రూపా హి దృష్టా వై తథా రూపేయ మంగనా॥ ౩
పూర్ణచంద్రాననాం సుభ్రూం చారువృత్త పయోధరామ్॥ ౩
కుర్వంతీం ప్రభయా దేవీం సర్వా వితిమిరా దిశః।
తాం నీలకేశీం బింబోష్ఠీం సుమధ్యాం సుప్రతిష్ఠితామ్॥ ౩
సీతాం పద్మపలాశాక్షీం మన్మథస్య రతింయథా।
ఇష్టాం సర్వస్య జగతః పూర్ణచంద్రప్రభా మివ॥ ౩
భూమౌ సుతను మాసీనాం నియతా మివ తాపసీమ్।
నిశ్శ్వాసబహుళాం భీరుం భుజగేంద్ర వధూమివ॥ ౩
శోకజాలేన మహతా వితతేన నరాజతీమ్।
సంసక్తాం ధూమజాలేన శిఖా మివ విభావసోః॥ ౩
తాం స్మృతీ మివ సందిగ్ధా మృద్ధిం నిపతితా మివ।
విహతా మివ చ శ్రద్ధా మాశాం ప్రతిహతా మివ॥ ౩

డి తొలఁగి వేటకుక్కలనడుమఁజిక్కినయున్న యాఁడుజింకవలెనున్న దియు, పిఱుఁదులపై నంటియున్న (నల్లత్రాచుంబోలిన) జడచే శరత్కాలమందలి యడవుల పాల్పుచేనొప్పిన భూదేవివలెనున్నదియు, దుఃఖముచే డస్సియున్నదియు, సుఖమునకుం దగినదియు మనోవ్యథను మున్నెఱుంగనిదియు నగు జానకిని హనుమంతుఁడు గనుంగొనియెను.

౨౬-౪. విశాలమగు కన్నులుగలదియు, మిక్కిలి మాసిన మేనుంగల దియు, చిక్కియున్నదియు నను నాదేవిని గాంచి 'ఈమె సీతాదేవియేయగునా'యని కారణములతోడ యోచింపఁబూనెను.

౨౭-౪. అప్పుడు కామరూపమును ధరించియుండిన రాక్షసునిచేఁ గొనిపోవంబడుచున్న యిల్లా లెట్టిరూపమును గలిగియుండెనో యట్టిరూపమునే యీయింతియుఁ గలిగియున్నది.

౨౮ నుండి ౩౮ వఱకు. నిండుచంద్రునింబోలు మోమునుగలదియు, సొగసగు కనుబొమలుగలదియు, కుదిరికగల స్తనములనుగలదియు, తనశరీరకాంతిచే దిశలయందలి చీఁకటినెల్ల బోఁగొట్టుచున్నదియు, నీలవర్ణముగు తలవెండ్రుకలు గలదియు, దొండపండువంటి పెదవికలదియు, అందముగు నడుముగలదియు, బాగుగఁజేయంబడిన రూపముంగలదియు, మన్మథుని రతీదేవివలె పసపువన్నె గలమేనును దామరఱేకులవలె విశాలమైన కన్నులుగలదియు, నిండుచంద్రుని కాంతివలెనే లోకములకెల్ల నింపైనదియు, నియతితోఁదపస్సు చేయుచున్నదానివలెభూమిపైఁగూర్చున్నదియు, మృదువగు మేనుగలదియు, నాగకన్యకవలె దీర్ఘశ్వాస విడుచు చున్నదియు, పిటికిదనమును గలదియు, ఎడదెగని గొప్పశోకముచేఁజిక్కి పొగచే మాటువడిన యగ్నిజ్వాలవలెఁ బ్రకాశములేకయున్నదియు, ధర్మశాస్త్రమువలె గూఢమయిన యభిప్రాయమునుగలదియు, క్షీణించిన భాగ్యమువలెనున్నదియు, ఈశ్వరుఁడు గలఁడనుటయందునమ్మికలేకపోవుటచేఁ జెడి

సోపసర్గాం యథాసిద్ధిం బుద్ధిం సకలుషా మివ।
అభూతే నాపవాదేన కీర్తిం నిపతితా మివ॥ ౩౪॥
రామోపరోధ వ్యథితాం రక్షోహరణ కర్శితామ్।
అబలాం మృగశాబాక్షీం వీక్షమాణాం తత స్తతః॥ ౩౫॥
బాష్పాంబు పరిపూర్ణేన కృష్ణవక్రాక్షి పక్ష్మణా।
వదనే నాప్రసన్నేన నిశ్శ్వసంతీం పునఃపునః॥ ౩౬॥
మలపంకధరాం దీనాం మండనార్హా మమండితామ్।
ప్రభాం నక్షత్రరాజస్య కాలమేఘై రివావృతామ్॥ ౩౭॥
తస్య సందిదిహే బుద్ధి ర్ముహు స్సీతాం నిరీక్ష్యతు।
ఆమ్నాయానా మయోగేన విద్యాం ప్రశిథిలా మివ॥ ౩౮॥
దుఃఖేన బుబుధే సీతాం హనుమా ననలంకృతామ్।
సంస్కారేణ యథా హీనాం వాచ మర్థాంతరం గతామ్॥ ౩౯
తాం సమీక్ష్య విశాలాక్షీం రాజపుత్రీ మనిందితామ్।
తర్కయామాస సీతేతి కారణై రుపపాదిభిః॥ ౪౦॥
వైదేహ్యా యాని చాంగేషు తదా రామో న్వకీర్తయత్।
తా న్యాభరణజాలాని శాఖాశోభీ న్యలక్షయత్॥ ౪౧॥
సుకృతౌ కర్ణవేష్టౌ చ శ్వదంష్ట్రౌ చ సుసంస్థితౌ।
మణివిద్రుమచిత్రాణి హస్తే ష్వాభరణాని చ॥ ౪౨॥

నట్టి యాస్తికబుద్ధివలె (దైవముగలఁడనుబుద్ధి) నున్నదియు, భంగముచెంది న యాశవలెనున్నదియు, విఘ్నముతోఁగూడిన కార్యసిద్ధివలెనున్నదియు, కలతచెందిన బుద్ధివలెనున్నదియు, అబద్ధమగు నపవాదముచేఁ జెడిన కీర్తి వలెనున్నదియు, రాముని, చెంగటలేనందున దుఃఖమందినదియు, రాక్షసు చేఁ దేఁబడినందున శోకించి కృశించియున్నదియు, బలహీనురాలును, జింకపిల్లయొక్క చూపులవంటి చూపులుగలదియు, అందందుఁ గనుచున్నదియు, కన్నీటితో నిండిన వక్రములగు నల్లని ఱెప్పలతోఁ గూడినదియు, నెమ్మది యేపాటియుఁ గలుగనిదగు మోముతోడఁ బలుమాఱు నిట్టూర్పులను విడుచుచున్నదియు, మురికిచేతను దుమ్ముచేతను గ్రమ్ముకొనం బడినదియు, ప్రాపులేనిదియు, భూషణములను ధరింపఁ దగినదయ్యును ధరింపకున్నదియు, నల్లని మబ్బులచేఁ గ్రమ్మంబడిన చంద్రునికాంతివలె నున్నదియు, వేదములయొక్క కూడికలేమిచే క్షీణించినవిద్యవలెనున్నదియు నగు సీతను జూచి హనుమంతునియొక్క బుద్ధి పలుమాఱు సందేహించెను.

౩౯. శాస్త్రమర్యాదకు లోఁబడనిదగుశబ్దము (వలయునర్థమును బోధింపక) వేఱొకయర్థమును బోధించునట్లుగా నలంకారహీనయైయున్న సీతను మిక్కిలి శ్రమపడి హనుమంతుఁడు తెలిసికొనియెను.

౪౦. సద్వర్తన గలదియు రాజపుత్రికయు విశాలమగు నేత్రములం గలదియు నగు సీతనుగాంచి హనుమంతుఁడు ఈమెయే సీతాదేవియని యూహించుటకుఁదగిన కారణములతోడ నూహించెను.

౪౧. శ్రీరామమూర్తి, సీతను వెదకుమని కిష్కింధనుండి తన్నంపుచో, సీతాదేవియొక్క శరీరముపై నేయే భూషణములున్నవని చెప్పెనో యా వియన్నియు నాచెట్టుయొక్క కొమ్మయందుఁ దగుల్పఁబడి యున్నవానిని గాఁ గనియెను.

౪౨, ౪౩. సొంపుగఁ జేయింపఁబడినవియగు కమ్మలును, అందమైనవగు బొగడలును రత్నములచేతను బగడములచేతను విచిత్రములుగఁ జే

శ్యామాని చిరయుక్తత్వా త్తథా సంస్థానవంతి చ।
తా న్యేవై తాని మన్యేహం యాని రామోన్వకీర్తయత్॥ ౪౩॥
తత్ర యా న్యవహీనాని తా న్యహం నోపలక్షయే।
యా న్యస్యా నావహీనాని తా నీమాని నసంశయః॥ ౪౪॥
పీతం కనకపట్టాభం స్రస్తం తద్వసనం శుభమ్।
ఉత్తరీయం నగాసక్తం తదా దృష్టం ప్లవంగమైః॥ ౪౫॥
భూషణాని చ ముఖ్యాని దృష్టాని ధరణీతలే।
అనయైవా పవిద్ధాని స్వనవంతి మహాంతి చ॥ ౪౬॥
ఇదం చిరగృహీతత్వా ద్వసనం క్లిష్టవత్తరమ్।
తథాపి నూనం తద్వర్ణం తథా శ్రీమ ద్యథేతరమ్॥ ౪౭॥
ఇయం కనకవర్ణాంగీ రామస్య మహిషీ ప్రియా।
ప్రణష్టా పి సతీ యాస్య మనసో నప్రణశ్యతి॥ ౪౮॥
ఇయం సా యత్కృతే రామ శ్చతుర్భిః పరితప్యతే।
కారుణ్యే నానృశంస్యేన శోకేన మదనేన చ॥ ౪౯॥
స్త్రీ ప్రణష్టేతి కారుణ్యా దాశ్రితే త్యానృశంస్యతః।
పత్నీ నష్టేతి శోకేన ప్రియేతి మదనేన చ॥ ౫౦॥
అస్యా దేవ్యా యథారూప మంగప్రత్యంగ సౌష్ఠవమ్।
రామస్య చ యథారూపం తస్యేయ మసితేక్షణా॥ ౫౧॥

యంబడినవియగు కంకణములును, దీర్ఘ కాలమునుండి ధరింపఁబడినవియగుటచే (విరహతాపముచేఁగాగిలిన యామెదేహమునసోఁకినవై) నల్లగనున్నవియు, అరిగియరిగి గుఱుతులుగలవియు నగు నీభూషణములే శ్రీరామునిచే నాకుఁ జెప్పంబడినవిగాఁ దలంచెదను.

౪౪ నుండి ౪౭. సీతాదేవి మొడలిపై నున్నభూషణము లివ్వియని శ్రీరాముండు సెప్పినవానిలోఁ గొన్నియిందున్నవి తక్కినవి రావణునిచే నీమె కొనిపోవంబడినపుడు కిష్కింధ ప్రాంతమున నీమె పై కొంగునంగట్టి పడవైచిన మూటయందుఁ గాంచియున్న వాఁడను భూషణములను గట్టియుండిన వస్త్రమును, ఈమెధరించియున్నదియు నొక్కటే యగునుగాని నాఁటినుండియు నీమె విడువక ధరించియున్నందున నిది కరంబు మాసియున్నది, కావున నెన్ని భంగులను శ్రీరాముండు సెప్పిన గుఱుతులు సరిపోయెను సంశయింపఁబనిలేదు. అని హనుమంతుఁడు తలంచెను.

౪౮ నుండి ౫౨కు. ఏయిల్లాలు బంగారవు చాయంబోలిన శరీరకాంతి గలదియు శ్రీరాముని కిష్టురాలును బట్టపుదేవియుఁ బతివ్రతయు, శ్రీరాముని బాసియుండియు నాతనిమనస్సును బాయకున్నదియు నయ్యెనో యట్టి సీత యీమెయేయగును. ఏదేవి నిమిత్తము శ్రీరాముఁడు దయచేతను, మెత్తదనముచేతను దుఃఖముచేతను మన్మథ వికారముచేతను దపించుచున్నాఁడో, ఆఁడుదిగదా! ఏమయ్యెనో, అని కరుణయు, నమ్మియుండిన దాని నేమరితినిగదా! అనిదీనతయు, భార్యను దొంగలు కొనిపోయిరేయని దుఃఖమును మనస్సునకింపైనది పోయెఁగదాయని మన్మథవేదనయుఁ జెందివేగుచున్నాఁడో యట్టియీసీతయొక్కయవయవములసౌంద

అస్యా దేవ్యా మన స్తస్మిం స్తస్య చా స్యాం ప్రతిష్ఠితమ్।
తే నేయం స చ ధర్మాత్మా ముహూర్త మపి జీవతి॥ ౫౨॥

దుష్కరం కృతవా న్రామో హీనో య దనయా ప్రభుః।
ధారయ త్యాత్మనో దేహం నశోకే నావసీదతి॥ ౫3॥

దుష్కరం కురుతే రామో య ఇమాం మ త్తకాశినీమ్।
సీతాం వినా మహాబాహు ర్ముహూ ర్త మపి జీవతి॥ ౫౪॥

ఏవం సీతాం తదా దృష్ట్వా హృష్టః పవనసంభవః।
జగామ మనసా రామం ప్రశశంస చ తం ప్రభుమ్॥ ౫౫॥

ఇతి శ్రీమత్సుందరకాండే - పంచదశస్సర్గః.

## షోడశస్సర్గః.

ప్రశస్య తు ప్రశ స్తవ్యాం సీతాం తాం హరిపుంగవః।
గుణాభిరామం రామం చ పున శ్చింతాపరో భవత్॥ ౧॥

స ముహూ ర్త మివ ధ్యాత్వా బాష్ప పర్యాకులేక్షణః।
సీతా మాశ్రిత్య తేజస్వీ హనుమా న్విలలాపహ॥ ౨॥

మాన్యా గురువినీతస్య లక్ష్మణస్య గురుప్రియా।
యది సీతా పి దుఃఖార్తా కాలో హి దురతిక్రమః॥ 3॥

ర్యము శ్రీరామునియొక్క శరీరసౌష్ఠమునకుందగినది. శ్రీరామునియంద ము సీతయొక్కమేని సొంపునకుంబోలినది యీసీతాదేవియొక్క మన స్సాతనియందును, ఆతనిమనస్సీదేవియందును నిలుపంబడియున్నవి. ఈ హేతువుచేతనే యీపుణ్యాత్ముఁ డింతవఱకు బ్రతికియున్నవాఁడు.

౫౩, ౫౪. ప్రభుఁడగు రాముఁడు సీతను బాసినవాఁడయ్యును వెగక జీవమును ధరించియుండుట యనునది సామాన్యుల కలవియగు పని కాదు. స్త్రీజాతియం దుత్తమురాలగు సీతను విడచి బలవంతుఁడగు నేరా ముమూర్తి ముహూర్తకాలమేనియుఁ (రెండుగడియలకాలము) జీవించియు న్నాఁడో యాతం డితరులకశక్యమగు కార్యముం జేసినవాఁడగుచున్నాఁడు.

౫౫. వాయుపుత్రుఁడగు హనుమంతుఁడు మీఁదఁజెప్పంబడినట్లు సీ తనుగాంచి యంతట మనస్సుచే శ్రీరామునిఁ దలంచెను. ప్రభుఁడగు నాత నిం గొనియాడెను.

ఇది పదునైదవసర్గ.



## పదునాఱవసర్గ.

౧. స్తోత్రమునకుఁ బాత్రులైన గుణవంతుఁడగు రామునిఁ బతివ్రత యగుసీతను మీఁదఁ జెప్పంబడినట్లు కొనియాడి వానరోత్తముఁడగు హ నుమంతుఁడు మరలఁ జింతించెను.

౨. మిక్కిలి కాంతిసంపద గలవాఁడగు హనుమంతుఁడు కొంత సేపుమనంబునఁ జింతించి కన్నీటిచేఁ గ్రమ్మిన కన్నులుగలవాఁడై సీతాదేవి నుద్దేశించి దుఃఖించెను.

౩. గురువులచేతను దల్లిదండ్రులచేతను బాగుగ శిక్షింపఁబడినవాఁ డై నేర్పునుగన్న లక్ష్మణునిచేతను బూజింపఁబడినదై లోకగురుండగు శ్రీరా మున కిల్లాలై యొప్పిన సీతయే దుఃఖములపాలై యిట్లల్లాడునది యైనయెడ లఁ గాలమును మీఱఁజాలమని యెవరు తలంపవచ్చును.

రామస్య వ్యవసాయజ్ఞా లక్ష్మణస్య చ ధీమతః।
నాత్యర్థం క్షుభ్యతే దేవీ గంగేవ జల దాగమే॥ ౪॥
తుల్య శీల వయో వృత్తాం తుల్యాభిజన లక్షణామ్।
రాఘవో౽ర్హతి వైదేహీం తం చే యమసితేక్షణా॥ ౫॥
తాం దృష్ట్వా నవహేమాభాం లోకకాంతా మివ శ్రియమ్।
జగామ మనసా రామం వచనం చేద మబ్రవీత్॥ ౬॥
అస్యా హేతో ర్విశాలాక్ష్యా హతో వాలీ మహాబలః।
రావణప్రతిమో వీర్యే కబంధ శ్చ నిపాతితః॥ ౭॥
విరాధ శ్చ హత స్సంఖ్యే రాక్షసో భీమవిక్రమః।
వనే రామేణ విక్రమ్య మహేంద్రే ణేవ శంబరః॥ ౮॥
చతుర్దశ సహస్రాణి రక్షసాం భీమకర్మణామ్।
నిహతాని జనస్థానే శరై రగ్నిశిఖోపమైః॥ ౯॥
ఖర శ్చ నిహత స్సంఖ్యే త్రిశిరా శ్చనిపాతితః।
దూషణ శ్చ మహాతేజా రామేణ విదితాత్మనా॥ ౧౦॥
ఐశ్వర్యం వానరాణాం చ దుర్లభం వాలిపాలితమ్।
అస్యా నిమిత్తే సుగ్రీవః ప్రాప్తవా౯ లోకసత్కృతమ్॥ ౧౧॥
సాగర శ్చ మయా క్రాంత శ్శ్రీమా న్నదనదీపతిః।
అస్యా హేతో ర్విశాలాక్ష్యాః పురీ చే యం నిరీక్షితా॥ ౧౨॥
యది రామ స్సముద్రాంతాం మేదినీం పరివర్తయేత్।
అస్యాః కృతే జగ చ్చాపి యుక్త మిత్యేవ మే మతిః॥ ౧౩॥

౪. శ్రీరామునియొక్కయు, బుద్ధిమంతుఁడగు లక్ష్మణునియొక్కయుఁ బూనిక నెఱింగినదిగావున సీతాదేవి (వానకాలమందు గంగానది గంభీరమైయుండునట్లుగనుండును) దుఃఖింపదు.

౫. తన్నుంబోలిన మంచిస్వభావమును వయస్సును, ఆచారమును పుట్టుకయు నుత్తమలక్షణములును గలదియగు సీతకు శ్రీరాముండు దగియున్నాఁడు, నల్లనికన్నులంగలదియగు సీతయు నాతనికిఁ దగియున్నది.

౬. క్రొత్తదియగు కుందనపుబంగారపు చాయవంటి శరీరకాంతిగలదియై లోకములకు మనోహరురాలైన లక్ష్మివలెనున్న యాసీతనుగాంచి మనస్సున రామునిఁదలఁచి హనుమంతుం డిట్లనియె.

౭ నుండి ౧౩ కు. విశాలమగు కన్నులంగలదియగు సీదేవినిమిత్తముగనే కదా! మహాబలశాలియగు వాలి చంపఁబడియెను, బలమున రావణునితో సమానుఁడైన కబంధుఁడను రాక్షసుండును గూల్పంబడెను. (భయంకరమగు బలమునుగలవాఁడగు విరాధుఁడను రాక్షసుఁడు దేవేంద్రునితో నెదుర్కొని పోరిన శంబరునివలె) శ్రీరాము నెదుర్కొని పోరి సమసెను. భయంకరవ్యాపారములఁ జేయువారగు పదునాల్గువేల రక్కసులు జనస్థానమనుచోట నగ్నిజ్వాలలంబోలిన శ్రీరాముని బాణములచే నీల్గిరి. వారితత్త్వము నెఱింగినవాఁడగు శ్రీరామునిచేఁ బరాక్రమవంతుఁడగు ఖరుండు పోరున రూపుసెడెను, దూషణుండు గూలెను, త్రిశిరుండు మడిసెను. ఈసీతాదేవినిమిత్తముననే పరులకుఁ జెందఁగూడనిదియు లోకముచే నాదరింపఁబడినదియు వాలిచే నేలఁబడినదియు నగు వానరప్రభుత్వమును సుగ్రీవుఁడు పొందఁగలిగెను. నదీనదముల కధికారియగు సముద్రుని నేను దాఁటుగలిగితిని ప్రశస్తమగు నీ లంకాపురము నాచే గానంబడియెను, ఈసీతనిమిత్తముగ శ్రీరాముఁడు సముద్రములవఱకు వ్యాపించినదియగు భూమినిలోకమును గ్రిందుమీఁదఁ జేసినను యుక్తమేయని తలంచెను.

అస్యా నూనం పునర్లాభా ద్రాఘవః ప్రీతిమేష్యతి।
రాజా రాజ్యపరిభ్రష్టః పునః ప్రాప్యేవ మేదినీమ్॥ ౨౩॥

కామభోగైః పరిత్యక్తా హీనా బంధుజనేన చ।
ధారయ త్యాత్మనో దేహం తత్సమాగమకాంక్షిణీ॥ ౨౪।

నైషా పశ్యతి రాక్షస్యో నేమాన్పుష్పఫలద్రుమాన్।
ఏకస్థహృదయా నూనం రామమేవానుపశ్యతి॥ ౨౫!

భర్తా నామ పరం నార్యా భూషణం భూషణాదపి।
ఏషా తు రహితా తేన భూషణార్హా న శోభతే॥ ౨౬।

దుష్కరం కురుతే రామో హీనో యదనయా ప్రభుః।
ధారయ త్యాత్మనో దేహం న దుఃఖే నావసీదతి॥ ౨౭॥

ఇమా మసితకేశాంతాం శతపత్ర నిభేక్షణామ్।
సుఖార్హాం దుఃఖితాం దృష్ట్వా మమాపి వ్యథితం మనః॥ ౨౮॥

క్షితిక్షమా పుష్కరసన్నిభాక్షీ యా రక్షితా రాఘవలక్ష్మణా
భ్యాం। సా రాక్షసీభి ర్వికృతేక్షణాభి స్సంరక్ష్యతే సంప్రతి వృ
క్షమూలే॥ ౨౯॥

౨౩. శ్రీరాముం డీయిల్లాలిని మరలఁబొందునపుడు (రాజ్యాధికారమును బోఁగొట్టుకొన్నరాజు దానిని మరలఁ బొందినపుడు సంతోషించునట్లు) సంతోషింపఁ గలఁడు.

౨౪. చుట్టములనుబాసియు, కామభోగములచే విడువంబడియు నీసీత శ్రీరాముని మరలఁ జేరుదునుగదాయను నాశచేత నెట్లో దేహము నింకను ధరించియున్నది.

౨౫. ఈదేవి రాక్షసస్త్రీలను జూచుటలేదు, లెస్సగఁ బూచికాచియున్న వృక్షములను గాంచుటలేదుగాని యేకదేశమం దునుపంబడినహృదయమునుగలదియై శ్రీరామునే నిశ్చయముగఁ గాంచుచున్నది.

౨౬. స్త్రీలకు మగఁడనుభూషణము సమస్తభూషణములకంటెను శ్రేష్ఠము. ఈసీత యట్టిభూషణము లేనిదైనది కావుననే కొదువపడి శోభావిహీనయై యున్నది.

౨౭. ప్రభుఁడగు శ్రీరామమూర్తి, సీతను దనకడ లేనివాఁడై యుండియు దుఃఖముచే మృతినొందక దేహమును ధరించియుండుటయను నశక్యమగుకార్యమును జేయుచున్నాఁడు.

౨౮. నల్లని వెండ్రుకకొనలుగలదియు, కమలదళములవంటి కన్నులుగలదియు, సుఖములననుభవింపఁదగినదియు, దుఃఖించుచున్నదియునగు సీతనుజూచి నాకును మనోవ్యథపుట్టెడును.

౨౯. భూదేవివలె నోర్పుగలదియు, కమలములవంటి కన్నులుగలదియు, రామలక్ష్మణులచే రక్షింపఁ బడుచుండినదియు నగునట్టిసీత, వికారములగు కన్నులుంగల రాక్షసస్త్రీలచేత నీచెట్టుక్రిందనిప్పుడు లెస్సగ రక్షింపఁబడుచున్నది.

హిమహతనళినీవ నష్టశోభా వ్యసనపరంపరయా నిపీడ్యమానా
సహచరరహితేవ చక్రవాకీ జనకసుతా కృపణాం దశాంప్ర
పన్నా॥ ౩౦॥

అస్యాహి పుష్పావనతాగ్రశాఖా శ్శోకం దృఢం వై జనయం
త్యశోకాః। హిమవ్యపాయే న చ మందరశ్మి రభ్యుత్థితో నై
కసహస్రరశ్మిః॥ ౩౧॥

ఇ త్యేవ మర్థం కపిరన్వవేక్ష్య సీతేయ మి త్యేవ నివిష్టబుద్ధిః
సంశ్రిత్య తస్మిన్నిషసాద వృక్షే బలీ హరీణా మృషభ స్తరస్వీ॥

ఇతి శ్రీమత్సుందరకాండే - షోడశస్సర్గః.



## సప్తదశస్సర్గః.

తతః కుముదషండాభో నిర్మలో నిర్మలం స్వయమ్।
ప్రజగామ నభ శ్చంద్రో హంసో నీలమివోదకమ్॥ ౧॥

సాచివ్య మివ కుర్వన్ స ప్రభయా నిర్మలప్రభః।
చంద్రమా రశ్మిభి శ్శీతై స్సిషేవే పవనాత్మజమ్॥ ౨॥

స దదర్శ తత స్సీతాం పూర్ణచంద్ర నిభాననామ్।
శోకభారై రివ న్యస్తాం భారై ర్నావ మివాంభసి॥ ౩॥

౩౦. మంచుచేఁ జెడినకాంతినిగల కమలమువలెనున్నదై యెడతె గనిదుఃఖముచే బాధింపఁబడుచున్నదియు, భర్తనుబాసి నవయుచున్న యాఁడుచక్రవాకపక్షివలె నవయుచున్నదియు జనకునికూఁతురును నగుసీత కడుదీనదశను బొందియున్నదిసుమా!

౩౧. మంచుకాలము గడచినందున లెస్సగఁబూచినవై భారముచే వంగియున్న కొమ్మలనుగల యశోకవృక్షములు సత్యముగ సీతకు దుఃఖమును బుట్టింపఁగలవు. అనేకసహస్రములగు కిరణములతోడ నుదయించిన చంద్రుఁడును బరితాపమును గలిగించుచున్నాఁడు.

౩౨. బలవంతుఁడును, వానరోత్తముఁడును, వేగవంతుఁడును నగు నాంజనేయుం డశోకవృక్షముక్రిందఁగూర్చున్న స్త్రీరూపమును గాంచి యీమె సీతయేయను బుద్ధిగలవాఁడై యావృక్షమునే యాశ్రయించియుండెను.

ఇది పదునాఱవసర్గ.

———:0:———

పదునేడవసర్గ.

౧. అటపైఁ దెల్లకలువల ముత్తమువలెఁ గాంతిగలిగి సహజముగ నిర్మలుఁడైన వాఁడగుచంద్రుఁడు నీలవర్ణముగనుండు జలముపై నొప్పు హంసవలె నాకాశమునం జొచ్చెను.

౨. చల్లనికిరణములతోఁ గూడినవాఁడును బరిశుద్ధమైన కాంతిగల వాఁడును నగునాచంద్రుఁడు దనకాంతిచేత సీతను వెదకుచున్న హనుమంతు నకుఁ దోడ్పడువానివలె నొప్పెను.

౩. అటపై నాయాంజనేయుఁడు నిండుచంద్రునింబోలు మోము గలదియు, సముద్రమున సరకులభారముచే మోపంబడిన యోడవలె శోక ముయొక్క భారముచే మోపంబడినదియు నగుసీతాదేవిని గనియె.

దిదృక్షమాణో వైదేహీం హనుమా న్మారుతాత్మజః।
స దద ర్శావిదూరస్థా రాక్షసీ ర్ఘోరదర్శనాః॥ ౪॥

ఏకాక్షీ మేకకర్ణాం చ కర్ణప్రావరణాం తథా।
అకర్ణాం శంకుకర్ణాం చ మస్తకోచ్ఛ్వాస నాసికామ్॥ ౫॥

అతికాయో త్తమాంగీంచ తనుదీర్ఘ శిరోధరామ్।
ధ్వస్తకేశీం తథాకేశీం కేశకంబళ ధారిణీమ్॥ ౬॥

లంబకర్ణ లలాటాం చ లంబోదర పయోధరామ్।
లంబోష్ఠీం చుబుకోష్ఠీంచ లంబాస్యాం లంబజానుకామ్॥ ౭॥

హ్రస్వాం దీర్ఘాం తథా కుబ్జాం వికటాం వామనాం తథా।
కరాళాం భుగ్నవక్త్రాం చ పింగాక్షీం వికృతాననామ్॥ ౮॥

వికృతాః పింగళాః కాళీః క్రోధనాః కలహప్రియాః।
కాలాయస మహాశూల కూట ముద్గర ధారిణీః॥ ౯॥

వరాహ మృగశార్దూల మహిషాజ శివాముఖీః।
గజోష్ట్ర హయపాదీ శ్చ నిఖాత శిరసో పరాః॥ ౧౦॥

౪. వాయుపుత్రుండగుహనుమంతుఁడు సీతాదేవిని జూడఁదలంచుచున్నవాఁడై యామెకువెంబడినున్న భయంకరాకారముగలరాక్షసస్త్రీలను గనుంగొనియెను.

౫. ఒంటికన్నుగలదానిని, తలను గప్పునంతపొడవగు చెవులుగలదానిని, చెవులేలేనిదానిని, గూటములవంటి చెవులనుగలదానిని, తలకుమించిన ముక్కుగలదానిని.

౬. దేహమునుమించిన తలగలదానిని. సన్ననైపొడవైన మెడనుగలదానిని, రాలిన వెండ్రుకలదానీని, వెండ్రుకలేలేనిదానిని, కంబళివలె దట్టముగ వెంట్రుకలు గలదానిని.

౭. వ్రేలుచున్న చెవులును మోమునుగలదానిని, జారియున్న పొట్టను స్తనములను గలదానిని, పొడవగుపెదవినిగలదానిని, గడ్డమునై వ్రేలెడు పెదవి గలదానిని, వ్రేలియాడుచున్న మోమును మోకాళ్ళను గలదానిని,.

౮. కుఱుచని మేనుగలది, పొడవైన కాళ్లుగలది, వికారముగఁ గుఱుచనైయున్నది, దేహమునకుం దగని మితిమించిన యంగములుగలది, పొట్టిగనున్నది, మిట్టపండ్లుగలది, గుంటమోమునుగలది, పచ్చనికన్నులుగల వికారముగు మోమునుగలది యగు నానారూపముల రాక్షసస్త్రీలను హనుమంతుఁడుగనియెను.

౯. వికారరూపముగలవారును, పచ్చని వర్ణముగలవారును, నల్లనివారును, కోపముగలవారును, జగడమం దిష్టముగలవారును, ఉక్కుచేఁజేయంబడి సన్ననికొనలుగలశూలములను గదలను ధరించినవారును.

౧౦. పంది, జింక, పెద్దపులి, ఎనుము, గొఱ్ఱె, నక్క లనునీమృగములయొక్కమోములను బోలిన ముఖములుగలవారును, ఏనుఁగు ఒంటె,గుఱ్ఱము మొదలగువాని పాదములవంటి పాదములనుగలవారును, మెడలోనికి దిగఁబడియున్న శిరస్సులు గలవారును.

ఏకహ స్తైకపాదాశ్చ ఖరక ర్ణ్యశ్వకర్ణికాః।
గోకర్ణీ హస్తికర్ణీ శ్చ హరికర్ణీ స్తథా పరాః॥

అనాసా అతినాసా శ్చ తిర్యఙ్నాసా వినాసికాః।
గజసన్నిభ నాసా శ్చ లలాటోచ్ఛ్వాస నాసికాః॥

హస్తిపాదా మహాపాదా గోపాదాః పాదచూళికాః।
అతిమాత్ర శిరోగ్రీవా అతిమాత్ర కుచోదరీః॥

అతిమాత్రాస్యనేత్రా శ్చ దీర్ఘ జిహ్వా నఖా స్తథా।
అజాముఖీ ర్హస్తిముఖీ ర్గోముఖీ స్సూకరీముఖీః॥

హయోష్ట్ర ఖర వక్త్రా శ్చ రాక్షసీ ర్ఘోరదర్శనాః।
శూల ముద్గర హస్తా శ్చ క్రోధనాః కలహప్రియాః॥

కరాళా ధూమ్రకేశీ శ్చ రాక్షసీ ర్వికృతాననాః।
పిబంతీ స్సతతం పానం సదా మాంస సురా ప్రియాః॥

౧౧. ఒంటిచేయియు, ఒకేపాదమునుగలవారును, గాడిదెచెవులను కుక్కచెవులవంటిచెవులను గలవారును, ఆవుచెవులవంటి చెవులను, ఏనుఁగు చెవులంబోలినచెవులను సింగపుకర్ణములను బోలిన కర్ణములను గలిగిన వారును.

౧౨. ముక్కులులేనివారును, మితిమించిన ముక్కులుగలవారును, అడ్డముగనుండుముక్కులవారును, చప్పిడిముక్కులవారును, ఏనుఁగుముక్కులవంటి ముక్కులవారును, ముఖములమీఁదికి వ్యాపించుచున్న ముక్కులవారును.

౧౩. ఏనుఁగుపాదములవంటి పాదములుగలవారిని, పెద్దపాదములు గలవారిని, ఆవు పాదములవంటి పాదములు గలవారిని, పాదముల యందు వెండ్రుకలుగలవారిని, మితిమించినశిరస్సును మెడలను స్తనములను గర్భములను గలవారిని.

౧౪. మితికిమించియున్న ముఖము కన్నులు నిడుపగు నాలుక గోళ్లు గలవారిని, మేకమోమువంటి మోమును గలవారిని, ఏనుఁగు మోమువంటి మోముంగలవారిని, ఆవులయొక్కయుఁ బందులయొక్క మోములవంటి మోములను గలవారిని.

౧౫. భయంకరముగ నగపడుచు గుఱ్ఱము గాడిదె యొంటె మొదలగు జంతువులయొక్క మోములవంటి ముఖములను గలవారిని, శూలము గుదియ మొదలగు నాయుధములనుధరించి కోపించి కలహమందు రుచిగలిగి యున్నవారిని.

౧౬. భయంకరముగనున్నవారిని బూడిదెవర్ణపు వెండ్రుకలుగల వారిని వికారమగు మోములుగలవారిని విడుమరలేక సారాయిత్రాగుచున్న వారిని, ఎల్లప్పుడు కల్లునందును మాంసమందును రుచిగలవారిని, రాక్షస స్త్రీలను.

మాంస శోణిత దిగ్ధాంగీ ర్మాంస శోణిత భోజనాః।
తా దదర్శ కపిశ్రేష్ఠో రోమహర్షణ దర్శనాః॥ ౧౬॥

స్కంధవంత ముపాసీనాః పరివార్య వనస్పతిమ్॥ ౧౬

తస్యా ధస్తా చ్చ తాం దేవీం రాజపుత్రీ మనిందితామ్॥ ౧౭॥

లక్షయామాస లక్ష్మీవాన్ హనుమా న్జనకాత్మజామ్।
నిష్ప్రభాం శోకసంతప్తాం మలసంకుల మూర్ధజామ్॥ ౧౯॥

క్షీణపుణ్యాం చ్యుతాం భూమౌ తారాం నిపతితామివ।
చారిత్రవ్యపదేశాఢ్యాం భర్తృదర్శన దుర్గతామ్॥ ౨౦॥

భూషణై రుత్తమైర్హీనాం భర్తృవాత్సల్యభూషితామ్।
రాక్షసాధిప సంరుద్ధాం బంధుభి శ్చ వినాకృతామ్॥ ౨౧॥

వియూథాం సింహసంరుద్ధాం బద్ధాం గజవధూ మివ।
చంద్రరేఖాం పయోదాంతే శారదాభ్రై రివావృతామ్॥

క్లిష్టరూపా మసంస్పర్శా దయుక్తా మివ వల్లకీమ్॥ ౨౨
సీతాం భర్తృవశే యుక్తా మయుక్తాం రాక్షసీ వశే॥ ౨౩॥

అశోకవనికామధ్యే శోకసాగర మాప్లుతామ్।
తాభిః పరివృతాం తత్ర సగ్రహా మివ రోహిణీమ్॥ ౨౪॥

౧౭, ౧౭½. మాంసరక్తములను మేనంతయుఁ బూసికొన్నవారిని, రక్తమాంసములను దినుచున్నవారిని, చూచినమాత్రమున గగుర్పాటు గలిగింపఁ జాలియున్నవారిని, ఆచెట్టుచుట్టును గూర్చున్నవారిని రాక్షసస్త్రీలను వానరోత్తముఁడు గనియెను.

౧౮, ౧౯. ఆచెట్టుక్రిందనున్నదియు సద్గుణములచే నొప్పినదియు, రాజపుత్రికయు, శోకముచేఁ గ్రాఁగి కాంతి చెడియున్నదియు, మిక్కిలి ముఱికితోఁగూడిన తలవెండ్రుకలనుగలదియు, జ్ఞానియగు జనకుని పుత్రికయైనదియు.

౨౦. పుణ్యహీనురాలై, ఆకాశమునుండి భూమికిరాలిన నక్షత్రమువలె నున్నదియు, మంచినడవడిగలదియును, కీర్తితోఁగూడినదియు మగనిని గాంచుట యనుభాగ్యములేక యున్నదియు.

౨౧. మంచిభూషణములు ధరింపకున్నదియు, మగనియందలి ప్రేమయే భూషణము గాఁగలదియు, రాక్షసరాజుచే నడ్డగింపఁ బడినదియు, చుట్టములయొద్దనుండి తొలఁగింపంబడినదియు.

౨౨, ౨౨½. తనగుంపునుండితొలఁగింపంబడి సింగముచే నడ్డగింపఁ బడిన పిడియేనుఁగువలె నున్నదియు, వానకాలమునకుఁ బిమ్మట శరత్కాలమందలి మేఘములచేఁ జుట్టంబడియున్న చంద్రబింబమువలె నున్నదియు శరీరమునకువలయు నుపచారములు లేమిచే (వాడుటలేనివీణవలె) నింపుమాలియున్నదియు నగుసీతాదేవిని దేజోవంతుఁడగు హనుమంతుఁడు గనుంగొనియెను.

౨౩, ౨౪, ౨౪½. మగనియందే మనస్సునుంచి యున్నదియు, రాక్షసస్త్రీలను గని విసుకుచున్నదియు, అశోకవనమధ్యమున శోకసముద్రమునఁ దేలుచున్నదియు గ్రహములతోఁ గూడిన రోహిణి (నక్షత్రము) వలె

దదర్శ హనుమా న్దేవీం లతా మకుసుమా మివ। ౨౪½
సా మలేన చ దిగ్ధాంగీ వపుషా చా ప్యలంకృతా॥ ౨౫॥
మృణాళీ పంకదిగ్ధేవ విభాతి నవిభాతి చ।
మలినేన తు వస్త్రేణ పరిక్లిష్టేన భామినీమ్॥ ౨౬॥
సంవృతా మ్మృగశాబాక్షీం దదర్శ హనుమా న్కపిః।
తాం దేవీం దీనవదనా మదీనాం భర్తృతేజసా॥
రక్షితాం స్వేన శీలేన సీతా మసితలోచనామ్। ౨౭½
తాం దృష్ట్వా హనుమాన్ సీతాం మృగశాబ నిభేక్షణామ్ ౨౮॥
మృగకన్యా మివ త్రస్తాం వీక్షమాణాం సమంతతః।
దహంతీ మివ నిశ్శ్వాసై ర్వృక్షా న్పల్లవధారిణః॥ ౨౯॥
సంఘాత మివ శోకానాం దుఃఖస్యోర్మి మివోత్థితమ్।
తాం క్షామాం సువిభక్తాంగీం వినాభరణశోభినీమ్॥ ౩౦॥
ప్రహర్ష మతులం లేభే మారుతిః ప్రేక్ష్య మైథిలీమ్। ౩౦½
హర్షజాని చ సోశ్రూణి తాం దృష్ట్వా మదిరేక్షణామ్॥ ౩౧॥
ముమోచ హనుమాం స్తత్ర నమశ్చక్రే చ రాఘవమ్ ౩౧½
నమస్కృత్వా స రామాయ లక్ష్మణాయ చ వీర్యవాన్॥ ౩౨॥
సీతాదర్శన సంహృష్టో హనుమాన్ సంవృతో భవత్॥ ౩౨½

ఇతి శ్రీమత్సుందరకాండే - సప్తదశస్సర్గః.

రాక్షసస్త్రీలచేఁ జుట్టంబడియున్నదియు, పుష్పములులేని తీఁగవలెను న్నదియునగు సీతాదేవిని హనుమంతుఁడు గనియెను.

౨౧ నుండి ౨౭ వఱకు. ఆదేవి మురికిచేఁ గప్పంబడిన మేనుగల దియు, సురూపముచే నలంకరింపఁబడినదియు, బురదయందుఁ జిక్కి యున్న తామరతీఁగెవలె నున్నదియునై ప్రకాశించియుఁ బ్రకాశింపక యునున్నది. మాసినవస్త్రమును ధరించియున్నదియు, జింకచూపుల వంటి చూపులుగలదియు, పేదపడిన మోమునుగలదియు, మగని దర్పము నుదలంచి ధైర్యమును గలిగియున్నదియు, తననడవడిచేతనే రక్షింపఁబడి నదియు నల్లనికన్నులనుగలదియునగుసీతను వానరోత్తముఁడగు హనుమం తుఁడు గనియెను.

౨౮, ౨౯. జింకచూపులవంటి చూపులనుగలదియు, నలుదిక్కు లఁ గనుచు జడిసినలేడిపిల్లవలెనున్నదై, వేడినిట్టూర్పులచేఁ జుట్టుపట్ల నున్న చిగుళ్లనుగలచెట్లను దగ్ధము సేయునట్లున్నదియు నగు సీతను హను మంతుఁడు గనియెను.

౩౦, ౩౧. శోకముల మొత్తమువలె నున్నదియు, దుఃఖసము ద్రమునందు లేచిన యలవలెనున్నదియు. బక్కపడినదియు, శాస్త్రప్రమా ణమునకుం దగినట్లుగా నవయవములను గలదియు, భూషణములులేకయే ప్రకాశించుచున్నదియు నగు జానకినిగని హనుమంతుఁడు మితిలేని సంతో షమును బొందెను.

౩౧ నుండి ౩౭ వఱకు. ఆహనుమంతుఁడు, ఎఱ్ఱని రక్తరేఖలతోఁ గూడిన కన్నులను గలదియగు సీతాదేవినిగాంచి సంతోషముచేఁ బుట్టి నకన్నీటి బొట్లను విడచెను. శ్రీరామునిందలఁచి మ్రొక్కెను. పరాక్రమ వంతుఁడగు నాహనుమంతుఁడు శ్రీరామలక్ష్మణులనుతలఁచి మ్రొక్కుచు సీ తనుగాంచుటచే సంతోషించినవాఁడై యాచెట్టునందలి యాకులలోదాగి యుండెను.

ఇది పదునేడవసర్గ.

---

## అష్టాదశస్సర్గః.

తథా విప్రేక్షమాణస్య వనం పుష్పితపాదపమ్।
విచిన్వతశ్చ వైదేహీం కించిచ్ఛేషా నిశా భవత్॥ ౧॥

షడంగ వేదవిదుషాం క్రతుప్రవర యాజినామ్।
శుశ్రావ బ్రహ్మఘోషాంశ్చ విరాత్రే బ్రహ్మరక్షసామ్॥ ౨॥

అథ మంగళ వాదిత్రైః శ్శబ్దైః శ్శ్రోత్ర మనోహరైః।
ప్రాబుధ్యత మహాబాహు ర్దశగ్రీవో మహా బలః॥ ౩॥

విబుధ్య తు యథా కాలం రాక్షసేంద్రః ప్రతాపవాన్।
స్రస్తమాల్యాంబరధరో వైదేహీ మన్వచింతయత్॥ ౪॥

భృశం నియుక్త స్తస్యాం చ మదనేన మదోత్కటః।
న సతంరాక్షసః కామం శశాకాత్మ నిగూహితుమ్॥ ౫॥

స సర్వాభరణై ర్యుక్తో బిభ్రచ్ఛ్రియమనుత్తమాం।
తాం నగై ర్బహుభి ర్జుష్టాం సర్వపుష్ప ఫలోపగైః॥ ౬॥

వృతాం పుష్కరిణీభిశ్చ నానా పుష్పోప శోభితామ్।
సదా మదైశ్చ విహగై ర్విచిత్రాం పరమాద్భుతామ్॥ ౭॥

ఈహామృగైశ్చ వివిధై ర్జుష్టాం దృష్టి మనోహరైః।
వీథీ స్సంప్రేక్షమాణ శ్చ మణికాంచన తోరణాః॥ ౮॥

## పదునెనిమిదవ సర్గ.

౧. ఆహనుమంతుఁ డశోకవనమునఁ బూచిన వృక్షములయొక్క సొంపును జూచుచు సీతను వెస్సఁగఁగనిభాషింప యుక్తమగుకాలమునకై వేచియుండఁగా వేఁకువయయ్యెను.

౨. ఆహనుమంతుఁడు శిక్షా వ్యాకరణము ఛందస్సు మొదలగునంగములతోఁగూడిన వేదములనెఱింగినట్టియు, యజ్ఞకర్మలయందు సమర్థులైనట్టియు బ్రాహ్మణధర్మముగల రాక్షసుల వేదపాఠములధ్వని నప్పుడువినెను.

౩. వినుటకింపైన మంగళవాద్యములయొక్క ధ్వనులచేత మహాబలశాలియగు నారావణుఁడు మేల్కొనియెను.

౪. ప్రతాపవంతుఁడగు నారాక్షసరాజు సడలిన పుష్పహారములను వస్త్రములను గలవాఁడై యుక్తమగుకాలమున మేల్కొని సీతాదేవిని గూర్చి చింతించెను.

౫. ఆరావణుఁడు మదించియున్నవాఁడుగావున మన్మథ వికారముచే మిక్కిలి ప్రేరితుఁడయి తనకామమును వెలికిఁదెలియరాకయుండునట్లుగా నణంపనేరఁడయ్యెను.

౬. ఆతండు సమస్తభూషణములతోడను గూడినవాఁడై మిక్కిలి ప్రకాశించి, సమస్త పుష్పములచేతను ఫలములచేతను నొప్పిన పెక్కువృక్షములం గలదియు.

౭. సరస్సులచేఁ జుట్టంబడినదియు, నానావిధపుష్పములచేఁ బ్రకాశించుచున్నదియు, మదించిన పక్షులచే నెల్లప్పుడు విచిత్రమై యాశ్చర్యమును గలిగించుచున్నదియు.

౮. చూపుల కందమైయున్న నానావిధములగు తోడేళ్ళతోడఁ గూడినదియునగు నశోకవనమును, రత్నములుచెక్కంబడిన బంగారుతోరణములనుగల వీథులను జూచుచున్నవాఁడగుచు.

నానామృగ గణాకీర్ణాం ఫలైః ప్రపతితై ర్వృతామ్।
అశోకవనికా మేవ ప్రావిశ త్సంతత ద్రుమామ్॥ ౯

అంగనా శతమాత్రంతు తం వ్రజంత మనువ్రజత్।
మహేంద్రమివ పౌలస్త్యం దేవ గంధర్వ యోషితః॥ ౧౦

దీపికాః కాంచనీః కాశ్చి జ్జగృహు స్తత్రయోషితః।
వాలవ్యజనహస్తా శ్చ తాల వృంతాని చాపరాః॥ ౧౧

కాంచనై రపి భృంగారై ర్జహ్రుః సలిలమగ్రతః।
మండలాగ్రాన్ బ్రసీం శ్చైవ గృహ్యాన్యాః పృష్ఠతో యయుః॥ ౧౨

కాచి ద్రత్నమయీం స్థాలీం పూర్ణాం పానస్య భామినీ।
దక్షిణా దక్షిణే నైవ తదా జగ్రాహ పాణినా॥ ౧౩

రాజహంస ప్రతీకాశం ఛత్రం పూర్ణశశిప్రభమ్।
సౌవర్ణ దండ మపరా గృహీత్వా పృష్ఠతో యయౌ॥ ౧౪

నిద్రామద పరీతాక్ష్యో రావణ స్యోత్తమాః స్త్రియః।
అనుజగ్ముః పతిం వీరం ఘనం విద్యుల్లతా ఇవ॥ ౧౫

వ్యావిద్ధహార కేయూరా స్సమా మృదిత వర్ణకాః।
సమాగళిత కేశాంతా స్సస్వేద వదనా స్తథా॥ ౧౬

ఘూర్ణంత్యో మదశేషేణ నిద్రయా చ శుభాననాః।
స్వేద క్లిష్టాంగ కుసుమా స్సుమాల్యాకుల మూర్ధజాః॥ ౧౭

౯. నానావిధములగు మృగములతో నిండినదియు రాల్పంబడిన ఫలములచే దట్టముగనున్నదియు, మెండుగ వృక్షములనుగలదియునగు నశోకవనమును బ్రవేశించెను.

౧౦. దేవేంద్రుని దేవగంధర్వకన్యలు వెంబడించి చనునట్లుగా నూఱుమంది స్త్రీలు రావణుని వెంట నేగుచుండిరి.

౧౧. ఆ స్త్రీలలోఁ గొందఱు బంగారముచేఁ జేయంబడిన దీపములును, మఱికొందఱు చామరములను, ఇంకంగొందఱు తాటియాకుల విసనకఱ్ఱలనుగొని చనుచుండిరి.

౧౨. బంగారు గిండిలయం దుదకములతోడ ముందటఁ గొందఱును, ఖడ్గములను, పీఠములనుగొని వెనుకఁగొందఱును స్త్రీలు నడచిరి.

౧౩. ఒకానొక నేర్పరియగు స్త్రీ కల్లుచేనిండియున్న [illegible]మయమగు పాత్రను కుడిచేతఁబట్టుకొని వెంట నేగెను.

౧౪. నిండుచంద్రుని కాంతివంటి కాంతినిగలదియు బంగారుకామనుగలదియునై రాజహంసవలెనున్న గొడుగునుబట్టుచు మఱియొక్క స్త్రీ యాతనివెనుక నేగెను.

౧౫. రావణునకు ముఖ్యురాండ్రగు స్త్రీలు (మేఘమును మెఱుపులు వెంబడించినట్లు) వీరుఁడును బ్రాణేశుఁడునునగు రావణుని వెంబడించి నిద్దురకన్నులతో నేగిరి.

౧౬, ౧౭, ౧౮. వ్యత్యాసములుగనున్న హారములను భుజకీర్తులనుగలవారును, లెస్సగఁ బూయంబడిన గంధములనుగలవారును, వదలిన కొప్పులుగలవారును, చెమటలుపట్టిన మోములవారును. మత్తతచేతను నిద్దురచేతను దూలిపడుచున్నవారును, అందమగు మోములవారును, చెమటచే వా

ప్రయాంతం నైరృతపతిం నార్యో మదిరలోచనాః।
బహుమానా చ్చ కామాచ్చ ప్రియా భార్యా స్తమన్వయుః౧౮॥

సచ కామపరాధీనః పతి స్తాసాం మహాబలః।
సీతాస క్త మనా మందో మదాంచిత గతిర్బభౌ॥ ౧౯॥

తతః కాంచీ నినాదం చ నూపురాణాం చ నిస్స్వనమ్।
శుశ్రావ పరమ స్త్రీణాం స కపి ర్మారుతాత్మజః॥ ౨౦॥

తం చా ప్రతిమ కర్మాణ మచింత్య బల పౌరుషమ్।
ద్వారదేశ మనుప్రా ప్తం దదర్శ హనుమా న్కపిః॥ ౨౧॥

దీపికాభి రనేకాభి స్సమంతా దవ భాసితమ్।
గంధ తైలావసిక్తాభి ర్ధ్రియమాణాభి రగ్రతః॥ ౨౨॥

కామదర్ప మదై ర్యు క్తం జిహ్మ తా మ్రాయ తేక్షణమ్।
సమక్ష మివ కందర్ప మపవిద్ధ శరాసనమ్॥ ౨౩॥

మథితామృత ఫేనాభ మరజో వస్త్ర ము త్తమమ్।
సలీల మనుకర్షం తం విస్ర స్తం స క్త మంగదే॥ ౨౪॥

తం పత్రవిటపే లీనః పత్రపుష్ప ఘనావృతః।
సమీప ముప సంక్రాంతం నిధ్యాతు ముప చక్ర మే॥ ౨౫॥

డిన పూఁదండల ధరించినవారును, మంచిపుష్పములతోఁగూడిన కొప్పులు గలవారును, మదముచే నెఱ్ఱనయిన కన్నులుగలవారును, ఇష్టురాండ్రును నగు స్త్రీలు గౌరవబుద్ధిచేతను మోహవికారముచేతను (పోవుచున్న) రావణుని వెంటఁదగిలి చనిరి.

౧౯. బలవంతుఁడును, ఆరాక్షసస్త్రీలకు భర్తయు నగు రావణుఁడు కామమునకధీనుఁడై సీతయందలిమోహముచే మదించి యొప్పెను.

౨౦. అటుపిమ్మట వాయుపుత్త్రుండగు నాంజనేయుం డుత్తము రాండ్రగు నాస్త్రీలయొక్క మొలనూళ్ళచప్పుడును, అందెల ధ్వనియు వినెను.

౨౧ నుండి ౨౪ కు. పరిమళముతోఁగూడిన తైలమునుగలిగి రావణున కెదుట స్త్రీలచే ధరింపఁబడియున్న పెక్కులగు దీపములచే వెలుంగుచున్నవాఁడును, కామముతోడను బ్రతాపముతోడను మదముతోడను గూడినవాఁడును, వంకరలై యెఱ్ఱగనున్న విశాలములగు కన్నులు గలవాఁడును, చెఱుకు వింటిని గొదువగాఁగల మన్మథునివలె నున్నవాఁడును, చిక్కని మజ్జిగవలెను, అమృతమువలెను, నురుగు వలెను నున్నవాఁడును, ముఱికిలేని విలువగల వస్త్రమును భుజకీర్తులపైనుండి విలాసముగా లాగిపట్టుచున్నవాఁడును, వర్ణింపఁదరముగాని బల పర్వములను గలవాఁడును, సాటిలేని పనులనుజేయువాఁడును, అశోక వనముయొక్క ద్వారమునఁ బ్రవేశించినవాఁడును నైన రావణుని వానరశ్రేష్ఠుఁడగు హనుమంతుఁడు గనియెను.

౨౫. ఆహనుమంతుఁ డశోకవృక్షమునందు దాఁగినవాఁడై, ఆకులు పువ్వులు మొదలగువాని తఱచుచేఁ గప్పంబడి, తన చేరువకు వచ్చినట్టి రావణునిఁజూచుట కారంభించెను.

ఆవేక్షమాణస్తు తతో దదర్శ కపి కుంజరః।
రూప యౌవన సంపన్నా రావణస్య వరస్త్రియః॥ ౨౬॥
తాభిః పరివృతో రాజా సురూపాభి ర్మహా యశాః।
తన్మృగ ద్విజసంఘుష్టం ప్రవిష్టః ప్రమదా వనమ్॥ ౨౭॥
క్షీబో విచిత్రా భరణ శ్శంకుకర్ణో మహాబలః।
తేన విశ్రవసః పుత్ర స్సదృష్టో రాక్షసాధిపః॥ ౨౮॥
వృతః పరమనారీభి స్తారాభి రివ చంద్రమాః।
తం దదర్శ మహాతేజా స్తేజోవంతం మహాకపిః॥ ౨౯॥
రావణోయం మహాబాహు రితిసంచింత్య వానరః।
అవప్లుతో మహాతేజా హనుమా న్మారు తాత్మజః॥ ౩౦॥
సతథా ప్యుగ్ర తేజాస్సా నిర్ధూత స్తస్య తేజసా।
పత్ర గుహ్యాంతరే సక్తో హనుమాన్ సంవృతో భవత్॥ ౩౧॥
సీతా మసిత కేశాంతాం సుశ్రోణీం సంహత స్తనీమ్।
దిదృక్షు రసితా పాంగా ముపావ ర్తత రావణః॥ ౩౨॥
ఇతి శ్రీమత్సుందరకాండే-అష్టాదశ స్సర్గః.

---

ఏకోనవింశస్సర్గః.

తస్మిన్నేవ తతః కాలే రాజపుత్రీ త్వనిందితా।
రూపయౌవన సంపన్నం భూషణో త్తమ భూషితమ్॥ ౧॥

౨౬. అట్లుచూచుచు నాహనుమంతుఁడు రూపముచేతను బ్రాయముచేతను జాలియున్నవారగు రావణుని స్త్రీలను గనుంగొనియెను.

౨౭ నుండి ౨౯. అందకత్తెలగు నాస్త్రీలచేఁ జుట్టంబడినవాఁడును రాక్షసరాజును, కీర్తిని మెండుగఁగలవాఁడును, మృగములతోడను బక్షులతోడను గూడియున్న యావనమునఁ జొచ్చినవాఁడును, మదించినవాఁడును, బలవంతుఁడును, నిక్కిన చెవులుగలవాఁడును, విశ్రవసుని పుత్రుఁడైనవాఁడును, చుక్కలచేఁ జుట్టంబడియున్న చంద్రునివలె నుత్తమురాండ్రగు స్త్రీలచేఁ జుట్టంబడినవాఁడును నగు రావణుఁడు హనుమంతునిచేఁ జూడంబడియెను. మిక్కిలి దర్పవంతుఁడగు హనుమంతుఁడు ప్రఖ్యాతమైనపరాక్రమమును గలరావణుని గనుఁగొనియెను. అనఁగా రావణుం డగుపడియెను; హనుమంతుఁ డక్కఱతోఁ గనియెను.

౩౦. ఈమహాబలశాలి రావణుండని తలఁచి వాయుపుత్రుండగు హనుమానుఁడు చెట్టుమీఁదికెల్ల నెక్కెను.

౩౧. బలవంతుఁడయ్యును హనుమంతుఁడు రావణుని దర్పముచే నోడి మిన్నక యాచెట్టునందలి యాకులలోఁ దాఁగియుండెను.

౩౨. ఆరావణుఁడు నల్లని వెండ్రుకకొనలుగలదియు, సొంపగు పిఱుఁదులుగలదియు, కూడియున్న స్తనభరముంగలదియు, నల్లనికడకన్నులుగలదియు నగు సీతనుజూడంగోరి డాయవచ్చెను.

ఇది పదునెనిమిదవసర్గ.

---

## పందొమ్మిదవసర్గ.

౧, ౨. అటుపిమ్మట, రావణుఁడు చేరరాఁగానే దుర్గుణములు గలుగనిదియు జనకమహారాజ పుత్రికయు స్త్రీలలో నుత్తమురాలును నగు సీత, సౌందర్యయౌవనములచే నొప్పినవాఁడును శ్రేష్ఠమగు భూషణముల

తతో దృష్ట్వైవ వైదేహీ రావణం రాక్షసాధిపమ్।
ప్రావేపత వరారోహా ప్రవాతే కదళీ యథా॥ ౨॥
ఊరుభ్యా ముదరం ఛాద్య బాహుభ్యాం చ పయోధరౌ।
ఉపవిష్టా విశాలాక్షీ రుదంతీ వరవర్ణినీ॥ 3॥
దశగ్రీవస్తు వైదేహీం రక్షితాం రాక్షసీగణైః।
దదర్శ సీతాం దుఃఖార్తాం నావం సన్నా మివార్ణవే॥ ౪॥
అసంవృతాయా మాసీనాం ధరణ్యాం సంశ్రితవ్రతామ్।
ఛిన్నాం ప్రపతితాం భూమౌ శాఖామివ వనస్పతేః॥ ౫॥
మల మండన చిత్రాంగీం మండనార్హా మమండితామ్।
మృణాళీ పంకదిగ్ధేవ విభాతి నవిభాతిచ॥ ౬॥
సమీపం రాజసింహస్య రామస్య విదితాత్మనః।
సంకల్ప హయ సంయుక్తై ర్యాంతీ మివ మనోరథైః॥ ౭॥
శుష్యంతీం రుదతీ మేకాం ధ్యానశోక పరాయణామ్।
దుఃఖస్యాంత మపశ్యంతీం రామాం రామ మనువ్రతామ్॥ ౮॥
వేష్టమానాం తథా విష్టాం పన్నగేంద్ర వధూ మివ।
ధూప్యమానాం గ్రహేణేవ రోహిణీం ధూమకేతునా॥ ౯॥
వృత్తశీల కులేజాతా మాచారవతి ధార్మికే।
పునస్సంస్కార మాపన్నాం జాతా మివ చ దుష్కులే॥ ౧౦॥

చే నలంకరింపఁ బడినవాఁడును, రాక్షసాధిపుఁడును నగు రావణు నచ్చటనుండియే కాంచి జోరుగాలిచేఁ గదల్పఁబడిన యరఁటిమ్రానువలెఁ గంపము నొందెను.

౩. స్త్రీలలో నుత్తమురాలును, విశాలమగు కన్నులనుగలదియును నగు సీతాదేవి తనతొడలచే గర్భమును, చేతులచే స్తనములను మఱుఁగుపఱచికొని కన్నీళ్లు కార్చుచుఁ గూర్చుండెను.

౪, ౫, ౬. ఆరావణుఁడును, రాక్షసస్త్రీసమూహముచేఁ గాపాడఁబడినదియు దుఃఖముచేఁ బీడింపఁబడినదియు, సముద్రమధ్యమున నోడుపాఱిన యోడవలెనున్నదియు, సంస్కారములేని భూమిపైఁ గూర్చున్నదియు, భీష్మమగు వ్రతమునుగలదియు, చెట్టునుండి త్రుంచి నేలవేయంబడిన కొమ్మవలె నున్నదియు, మురికియే భూషణముగాఁ గలిగి నానావర్ణములచే నొప్పిన శరీరమును గలదియు, అలంకారమునకుఁ దగియుండియు నలంకారరహితయైనదియు, బురదయందున్న తామరతీఁగవలె నొప్పియు నొప్పకయున్నదియు నగు సీతాదేవిని గనుంగొనియెను.

౭ నుండి ౨౩కు. సర్వము నెఱింగినవాఁడును రాజోత్తముఁడును నగు శ్రీరామునియొక్క సమీపమునకు నుద్దేశ్యములను గుఱ్ఱములను బూన్పఁబడిన మనోరథములచే (కోర్కులచేఁ) బోవుచున్నట్లున్నదియు, (౮) చిక్కియున్నదియు, ఏడ్చుచున్నదియు, ఒంటరిదియు, శ్రీరాముని దలఁచుటయు నేడ్చుటయునే పనిగాఁ గలదియు, దుఃఖమునకుఁ గడకాననేరకున్నదియు, క్రీడయందు రుచిగలిగియుండినదియు శ్రీరాము ననుసరించియుండినదియు (౯) అదేస్మరణగలదియు, గొప్పదగు నాఁడుసర్పమువలెఁ గ్రౌర్యముతో రాక్షసస్త్రీలచేఁ జూడంబడినదియు, తోఁకచుక్కచేఁ దపింపఁజేయఁబడిన రోహిణీ నక్షత్రమువలెనున్నదియు. (౧౦) సదాచారము

అభూతే నాపవాదేన కీర్తిం నిపతితా మివ।
ఆమ్నాయానా మయోగేన విద్యాం ప్రశిథిలామివ॥ ౧౧॥
సన్నా మివ మహాకీర్తిం శ్రద్ధా మివ విమానితామ్।
పూజా మివ పరిక్షీణా మాశాం ప్రతిహతా మివ॥ ౧౨॥
ఆయతీ మివ విధ్వస్తా మాజ్ఞాం ప్రతిహతా మివ।
దీప్తా మివ దిశం కాలే పూజా మపహృతా మివ॥ ౧౩॥
పద్మినీమివ విధ్వస్తాం హతశూరాం చమూమివ।
ప్రభా మివ తమోధ్వస్తా ముపక్షీణా మివాపగామ్॥ ౧౪॥
వేదీ మివ పరామృష్టాం శాంతా మగ్నిశిఖా మివ।
పౌర్ణమాసీ మివ నిశాం రాహుగ్రస్తేందు మండలామ్॥ ౧౫॥
ఉత్కృష్ట పర్ణకమలాం విత్రాసిత విహంగమామ్।
హస్తిహస్త పరామృష్టా మాకులాం పద్మినీ మివ॥ ౧౬॥
పతిశోకాతురాం శుష్కాం నదీం విస్రావితామివ।
వరయా మృజయా హీనాం కృష్ణపక్ష నిశా మివ॥ ౧౭॥
సుకుమారీం సుజాతాంగీం రత్నగర్భ గృహోచితామ్।
తప్యమానా మివోష్ణేన మృణాలీ మచిరోద్ధృతామ్॥ ౧౮॥
గృహీతా మాళితాం స్తంభే యూథపేన వినాకృతామ్।
నిశ్శ్వసంతీం సుదుఃఖార్తాం గజరాజ వధూమివ॥ ౧౯॥

గలట్టియు ధర్మగుణముగలట్టియు నుత్తమకులమునఁ బుట్టినదియు, పెద్దకులమునందుఁ బుట్టినదై యాదోషశాంతికై సంస్కారమును జేసికొనెనో యనునట్లు రేయింబగళ్లు తపస్సుచేయుటచే వేఱువిధమును గాంచి, మరల జన్మించినట్లున్నదియు, (౧౧) అసత్యమగు నపకీర్తిచేఁ జెఱుపంబడిన కీర్తివలె నున్నదియు, వేదములయభ్యాసము లేమిచే నశించిన విద్యవలెను న్నదియు, (౧౨) తగ్గిన కీర్తివలెను, ఆదరింపఁబడని శ్రద్ధవలెను, క్షీణించిన పూజవలెను, కొట్టంబడిన యాశవలె నున్నదియు (౧౩) జబ్బువడిన ధనలాభమువలెను, చెల్లనియాజ్ఞవలెను, చెడుకాలమున నవలక్షణ సూచకముగా నుండుచున్న దిక్కువలెను, దోచికొనిపోవంబడిన పూజాద్రవ్యమువలెను నున్నదియు (౧౪) చెఱుపఁబడిన తామరతీఁగవలెను, చంపఁబడిన శూరులనుగల సేనవలెను, చీఁకటిచే నడ్డపెట్టంబడిన తేజస్సువలెను, ఇనికిపోవుచున్న నీటినిగల నదివలెను నున్నదియు (౧౫) ద్విజులుగానివారిచే నంటంబడిన వైదికాగ్నినిగల ప్రదేశమువలెనున్నదియు, అణఁగిన యగ్నిజ్వాలవలె నున్నదియు రాహువుచే నాక్రమింపంబడిన చంద్రబింబమును గల పున్నమరేయివలె నున్నదియు (౧౬) ఏనుఁగుల నాడ్వఁబడిన కమలములను, భయపెట్టఁబడిన నీటిపక్షులను గలిగి యేనుఁగుతొండముచేఁ జిందఱవందఱచేయంబడి కలతనొందియున్న సరస్సువలెనున్నదియు(౧౭) మగని నెడఁబాసిన దుఃఖముచే బాధపడుచున్నదియు, నీరెండిన నదివలె దుర్బలయై యున్నదియు, మంచియుపచారములు లేమిచే మాసినమేనుగలది గనుకనే కృష్ణపక్షమునందలి రాత్రివలెనున్నదియు, (౧౮) మృదువైనదియు,ఇంపులగు నవయవములు గలదియు, రత్నములచేనిర్మింపంబడిన యంతఃపురముల నుండఁదగినదియు, సరస్సునుండి యప్పుడే వెడలింపఁబడిన దగుటచే నెండ సోఁకివాడుచున్న తామరతీఁగెవలె నున్నదియు (౧౯) భర్తవలన నెడఁ

ఏకయా దీర్ఘయా వేణ్యా శోభమానా మయత్నతః।
నీలయా నీరదాపాయే వనరాజ్యా మహీ మివ॥ ౨౦॥

ఉపవాసేన శోకేన ధ్యానేన చ భయేన చ।
పరిక్షీణాం కృశాం దీనా మల్పాహారాం తపోధనామ్॥ ౨౧॥

ఆయాచమానాం దుఃఖార్తాం ప్రాంజలిం దేవతా మివ।
భావేన రఘుముఖ్యస్య దశగ్రీవ పరాభవమ్॥ ౨౨॥

సమీక్షమాణాం రుదతీ మనిందితామ్
సుపక్ష్మ తామ్రాయత శుక్లలోచనామ్।
అనువ్రతాం రామ మతీవ మైథిలీమ్
ప్రలోభయామాస వధాయ రావణః॥ ౨౩॥

ఇతి శ్రీమత్సుందరకాండే - ఏకోనవింశ స్సర్గః.

---

## వింశ స్సర్గః

స తాం పతివ్రతాం దీనాం నిరానందాం తపస్వినీమ్।
సాకారై ర్మధురై ర్వాక్యై ర్న్యదర్శయత రావణః॥ ౧॥

మాం దృష్ట్వా నాగనాసోరు గూహమానా స్తనోదరమ్।
అదర్శన మివాత్మానం భయా న్నేతుం త్వమిచ్ఛసి॥ ౨॥

బాపి పట్టుకొనంబడి కంబమునఁ గట్టివేయంబడిన పెంటియేనుఁగవలె నిట్టూర్పు విడుచుచుం దుఃఖపీడితయై యున్నదియు (౨౦) ఒక్కటిమాత్రమేయగు జడనుగలిగి వేఱులంకారములులేకయే ప్రకాశించుచున్నదియై శరత్కాలమందు వనములవరుసచే నొప్పినభూదేవివలె నున్నదియు (౨౧) భయము చేతను, ఉపవాసముచేతను, శోకముచేతను, చింతచేతను మిక్కిలి చిక్కిపోయినదియు, దిక్కుమాలినదియు, జలమే యాహారముగాఁగలదియు, తపస్సుచేయుచున్నదియు (౨౨) పాపాత్ముఁడగు రావణునిచే శ్రీరాముసకుఁ జేయంబడిన యవమానమునుదలంచి కరంబుదుఃఖించి, క్షేమమునకై చేతులుమోడ్చి యిష్టదేవతలను బ్రార్థించుచున్నట్లున్నదియు, పరిశుద్ధరాలును, అందమగు ఱెప్పలుగలిగి యెఱ్ఱనిరేఖలచే నొప్పి విశాలమై సొంపయియున్న కన్నులనుగలదియు శ్రీరాముని మిక్కిలి యనుసరించినదియునగు సీతాదేవిని రావణుఁడు దనచావుకొఱకై మోహించెను.

ఇది పందొమ్మిదవసర్గ.

---

## ఇరువదవసర్గ.

౧. ఆరావణుఁడు పతివ్రతయు, దిక్కులేనిదియు, సంతోషములేనిదియు, తపస్సు చేయుచున్నదియు నగుసీతను, తన భావమును దెలుపునట్టి యింపగుమాటలఁచేఁ గొనియాడుచు వెలువడియెను.

౨. ఏనుఁగు తొండములవంటి తొడలనుగలదానా! నన్నుఁ జూచినమాత్రముననె నీవు స్తనములను గర్భమును గప్పికొనుచు నీశరీరము నాకగపడకుండునట్లు సేయఁ దలంచుచున్నావు.

శ్లో॥

కామయే త్వాం విశాలాక్షి బహుమన్యస్వ మాం ప్రియే।
సర్వాంగ గుణసంపన్నే సర్వలోక మనోహరే॥ 3

నేహ కేచి న్మనుష్యా వా రాక్షసాః కామరూపిణః।
వ్యపసర్పతు తే సీతే భయం మత్త స్సముత్థితమ్॥ ౪

స్వధర్మో రక్షసాం భీరు సర్వదైవ న సంశయః।
గమనం వా పరస్త్రీణాం హరణం సంప్రమథ్య వా॥ ౫

ఏవం చైత దకామాంతు న త్వాం స్ప్రక్ష్యామి మైథిలి।
కామం కామ శ్శరీరే మే యథాకామం ప్రవర్తతామ్॥ ౬

దేవి నేహ భయం కార్యం మయి విశ్వసిహి ప్రియే।
ప్రణయస్వ చ తత్త్వేన మైవం భూః శోకలాలసా॥ ౭

ఏకవేణీ ధరాశయ్యా ధ్యానం మలిన మంబరమ్।
అస్థానే ప్యుపవాస శ్చ నైతా న్యౌపయికాని తే॥ ౮

విచిత్రాణి చ మాల్యాని చందనా న్యగరూణి చ।
వివిధాని చ వాసాంసి దివ్యా న్యాభరణాని చ॥ ౯

మహార్హాణి చ పానాని శయనా న్యాసనాని చ।
గీతం నృత్తం చ వాద్యం చ లభ మాం ప్రాప్య మైథిలి॥ ౧౦

౩. విశాలములగు కన్నులుగలదానా! నిన్ను నేను గోరుచున్నాఁడను, ఓప్రియురాలా! సర్వాంగములయందును నందమును గలదానా! లోకములనెల్ల మోహింపఁజేయునట్టి శోభగలదానా! నన్నుఁ గౌరవింపుము!

౪. ఓసీతా! మనుష్యులుగాని కామరూపమునుధరించిన రాక్షసులుగాని నీకుభయమును గలిగించువారెందులేరు, నావలనను నీవు భయపడవలసిన యక్కఱ లేదు!

౫, ౬. ఓభయపడు స్వభావముగలదానా! ఇతరుల భార్యలను బొందుటకాని, బలవంతముగా నెత్తికొనివచ్చుటగాని రాక్షసులకు సహజముగు ధర్మము. సంశయమువలదు. ఇదిమాత్రముగాదు, నాశరీరముపై నీకుఁగామము మెండుగావలయును. ఓజానకి! నాయందిష్టము నీకుఁబుట్టునంతవఱకు నిన్నుముట్టను.

౭. ఓదేవి! ఓప్రియురాలా! నీవు భయపడ నక్కఱలేదు రూఢిగ నాయందు నమ్మికయుంచుము! నాయందు ద్వేషముమాని యనుగ్రహింపుము. దుఃఖించుటయే పనిగా నుండకుము!

౮. ఓదేవి! ఒంటిజడయు భూమియనెడి పాన్పును విడుదలలేక చింతించుటయు మాసిన వస్త్రమునుధరించుటయు సుఖము లనుభవింపఁదగిన యిచ్చోట నుపవాసము చేయుటయు నీకుఁ దగినవికావు సుమా!

౯,౧౦. ఓజానకీ! నన్నువరించినదానవై విచిత్రములగు పుష్పములును, చందనమును, అగురును, నానావిధవస్త్రములును, శ్రేష్ఠములగు సొమ్ములును, యోగ్యములగు సారాయి మొదలగు పానద్రవ్యములును, పానువులును, బీరములును, పాటలును నాట్యములును వాద్యములును బొందుము!

స్త్రీరత్న మసి మైవం భూః కురు గాత్రేషు భూషణమ్।
మాం ప్రాప్యతు కథం ను స్యా స్త్వమనర్హా సువిగ్రహే॥ ౧౧॥
ఇదం తే చారుసంజాతం యౌవనం వ్యతివర్తతే।
యదతీతం పునర్నైతి స్రోత శ్శీఘ్ర మపా మివ॥ ౧౨॥
త్వాం కృత్వోపరతో మన్యే రూపకర్తా స విశ్వసృట్।
నహి రూపోపమా త్వన్యా తవాస్తి శుభదర్శనే॥ ౧౩॥
త్వాం సమాసాద్య వైదేహి రూపయౌవన శాలినీమ్।
కః పుమా నతివర్తేత సాక్షా దపి పితామహః॥ ౧౪॥
యద్య త్పశ్యామి తే గాత్రం శీతాంశు సదృశాననే।
తస్మిం స్తస్మి న్పృథుశ్రోణి చక్షు ర్మమ నిబధ్యతే॥ ౧౫॥
భవ మైథిలి భార్యా మే మోహ మేనం విసర్జయ।
బహ్వీనా ముత్తమస్త్రీణా మాహృతానా మిత స్తతః॥
సర్వాసా మేవ భద్రం తే మమాగ్ర మహిషీ భవ॥ ౧౬
లోకేభ్యో యానిరత్నాని సంప్రమథ్యాహృతాని వై।
తాని మే భీరు సర్వాణి రాజ్యం చైత దహం చ తే॥ ౧౭
విజిత్య పృథివీం సర్వాం నానా నగరమాలినీమ్॥
జనకాయ ప్రదాస్యామి తవహేతో ర్విలాసిని॥ ౧౮
నేహ పశ్యామి లోకేన్యం యో మే ప్రతిబలో భవేత్॥
పశ్య మే సుమహ ద్వీర్య మప్రతిద్వంద్వ మాహవే॥ ౧౯

౧౧. ఓయందమగు రూపముగలదానా! నీవు స్త్రీలలో నుత్తమురాలవు. ఇట్లలంకారము మానియుండకుము! నన్నుఁబొందినపిమ్మట నలంకారశూన్యవుగా నిట్లుండుట నీకుఁదగదు.

౧౨. నీకుఁ గలిగియున్నదగు రమ్యమగు యౌవనము కడచిపోవుచున్నది. అది ప్రవాహమునఁ బాటి మించిపోయిననీళ్లవలె మరల నెన్నటికిని లభించునదిగాదు సుమా!

౧౩. ఇంపుగ నగుపడుదానా! రూపములను జేయువాఁడగు బ్రహ్మ నిన్ను సృజించినపిమ్మట సృష్టికార్యమే చాలించెనని తలంచెదను. ఏలననఁగా, నినుంబోలురూపము లోకమున నెందును లేదుగదా!

౧౪. సురూపముచేతను, మంచి ప్రాయముచేతను సొప్పినదానా! నిన్నుఁబొందినపిమ్మట, సాక్షాద్బ్రహ్మదేవుఁడైనను, నిన్ను విడుచునంతటి పురుషుఁడు గాఁడుసుమా!

౧౫. చంద్రునివంటి మోముగలదానా? గొప్పపిఱుఁదులు గలదానా! నీశరీరమం దేయేయంగమునుగనుచున్నానో, ఆయాయంగమందు నా చూపు చిక్కుకొని యచ్చటనుండికదలనేరకున్నది.

౧౬. ఓజానకీ! నాకుభార్యవుకమ్ము! శ్రీరామునియందున్న మోహమును మానుము. ఇందుండి నాచేఁదేఁబడిన యనేకులగు సంపకత్తెలలోపల ముఖ్యురాలవై పట్టపురాణివికమ్ము! నీకు మేలుగలుగును.

౧౭. భీతిల్లు స్వభావముగలదానా! లోకమును జయించియు దోఁచియు నాచేఁ దేఁబడిన వెలగల సమస్తరత్నములును, ఈయఖండమగు రాజ్యమును, నేనును నీకు లోఁబడినవారము సుమా!

౧౮. ఓయందముంగలదానా! మితిలేని నగరములను గలిగినదియగు నీభూమండలమంతయు నాభుజబలముచే జయించి నీకుఁ బ్రీతిగలుగునట్లు నీతండ్రికి సమర్పించెదను జుమీ?

౧౯. లోకమున భుజబలమున నాతోసమానుఁడై పోరంగలవాఁ డెవ్వఁడును లేఁడు. యుద్ధమున సాటిలేనిదగు నాబలమునుజూడుము.

అసకృ త్సంయుగే భగ్నా మయా విమృదితధ్వజాః॥
అశక్తాః ప్రత్యనీకేషు స్థాతుం మమ సురాసురాః॥ ౧౦॥
ఇచ్ఛయా క్రియతా మద్య ప్రతికర్మ తవో త్తమమ్॥ ౧౧॥
సప్రభా ణ్యవసజ్యంతాం తవాంగే భూషణాని చ।
సాధుపశ్యామి తే రూపం సంయుక్తం ప్రతికర్మణా॥ ౧౨॥
ప్రతికర్మాభి సంయుక్తా దాక్షిణ్యేన వరాననే।
భుంక్ష్వ భోగా న్యథాకామం పిబ భీరు రమస్వ చ॥ ౧౩॥
యథేష్టం చ ప్రయచ్ఛ త్వం పృథివీం వా ధనాని చ।
లలస్వ మయి విస్రబ్ధా ధృష్ట మాజ్ఞాపయస్వ చ॥ ౧౪॥
మత్ప్రసాదా ల్లలంత్యాశ్చ లలంతాం బాంధవా స్తవ।
ఋద్ధిం మా మనుపశ్య త్వం శ్రియం భద్రే యశశ్చ మే॥ ౧౫॥
కిం కరిష్యసి రామేణ సుభగే చీరవాససా।
నిక్షిప్త విజయో రామో గతశ్రీ ర్వన గోచరః॥ ౧౬॥
వ్రతీ స్థండిలశాయీ చ శంకే జీవతి వా న వా।
నహి వైదేహి రామ స్త్వాం ద్రష్టుం వా ప్యుపలప్స్యతే॥ ౧౭॥
పురోబలాకై రసితై ర్మేఘై ర్జ్యోత్స్నా మివావృతామ్।
నచాపి మమహస్తా త్త్వాం ప్రాప్తుమర్హతి రాఘవః॥
హిరణ్య కశిపుః కీర్తి మింద్రహ స్తగతామివ॥ ౧౮॥

౨౦౯. దేవతలును రాక్షసులును బలుమాఱు యుద్ధమందు నాచే భంగపడి, రథములకేతనములు విఱుగంగొట్టఁబడినవి యైనందున నా యెదుట నిలువనేరకున్నారు.

౨౧, ౨౨. నీవు నేఁడు రమ్యమగునలంకార మక్కఱతోఁ జేయఁ బడును. నీశరీరమునం దలంకరింపఁబడినవియై యాసొమ్ములును ప్రకాశ మును బొందినవై యొప్పును. అట్లుగ నలంకరింపఁబడిన నిన్నుంగాంచి నే నును సంతోషించెదను.

౨౩. అందమగు మోమును గలదానా! భయపడుచున్నదానా! అలంకారముచే నొప్పినదానవై నేర్పుమెఱసి యిష్టమునకు వచ్చినట్లు భోగము లనుభవింపుము, పానము సేయుము, సుఖింపుము!

౨౪, ౨౫. నీకిష్టమువచ్చినట్లుగా భూమినేని భాగ్యమునేనియుఁ గొల్లగ నిమ్ము! నాయందు నమ్మికయుంచి మైత్రినిజూపుము, తోఁచినట్లెల్ల నధికారము సేయుము. నినుంగూర్చి నాయందిష్టపడునట్టి నీచుట్టములంద ఱును నాతోత్పాటును గోరుదురు. సుఖపడుదురు. ఓపుణ్యవతీ నీవు న న్నును నాపెంపును సంపదను గీర్తిని గనుమా!

౨౬ నుండి ౨౮౯. అందముగలదానా! శ్రీరాముఁడు జయములేని వాఁడు, సంపదపోయినవాఁడు, అరణ్యమందున్నవాఁడు, ఆహారాదులు మి తముచేసి భూమిపై శయనించుచు నుగ్రమగువ్రతములతో నున్నాఁడు. అ తండు జీవించియున్నాఁడో లేఁడో సందేహించెదను. నారచీరలను గట్టి కొనియున్నయట్టివానితో నీకేమిపనిగలదు? కొక్కెరలనుముందుగల (వా న కాల మందలి) నీలమేఘములచేఁ జుట్టుకొనంబడిన వెన్నెలవలెను న్న నిన్నుఁజూచుటకునుగూడ నాతండు సమర్థుఁడుగాఁడు. హిరణ్యకశి పుఁడను రాక్షసుఁడు దేవేంద్రునిచే హరింపఁబడిన భార్యనుగలవాఁడై యు ఱకీర్తినొంది, మరల దానిందెచ్చికొని సంతుష్టినొందినమాత్రముగ నేనియు శ్రీరాముఁడు చెందుటకుఁ జాలఁడుసుమా!

చారుస్మితే చారుదతి చారునేత్రే విలాసిని।
మనోహరసి మే భీరు సుపర్ణః పన్నగం యథా॥ ౨౯

క్లిష్ట కౌశేయ వసనాం తన్వీమ ప్యనలంకృతామ్।
త్వాం దృష్ట్వా స్వేషు దారేషు రతింనోపలభామ్యహమ్॥ 30

అంతఃపుర నివాసిన్యః స్త్రియ స్సర్వ గుణాన్వితాః।
యావంత్యో మమ సర్వాసా మైశ్వర్యం కురు జానకి॥ 3౧

మమ హ్యసితకేశాంతే త్రైలోక్య ప్రవరా స్త్రియః।
తా స్త్వాం పరిచరిష్యంతి శ్రియ మప్సరసో యథా॥ 3౨

యాని వైశ్రవణే సుభ్రు రత్నానిచ ధనాని చ।
తాని లోకాంశ్చ సుశ్రోణి మాం చ భుఙ్క్ష్వ యథా సుఖమ్॥

నరామ స్తపసా దేవి నబలేన నవిక్రమైః।
నధనేన మయా తుల్య స్తేజసా యశసా పివా॥ 3౪

పిబ విహర రమస్వ భుఙ్క్ష్వ భోగాన్
ధననిచయం ప్రదిశామి మేదినీం చ।
మయి లల లలనే యథాసుఖం త్వం
త్వయి చ సమేత్య లలంతు బాంధవా స్తే॥ 3౫

౨౯౻. సొంపగుచెలువగవును, అందములగు పండ్లును, సుందరములగు కన్నులును గలదానా! ఇంపులుగలదానా! భయపడు స్వభావముగలదానా! గరుత్మంతుఁడు పామును బట్టుకొనునట్లు నీవు నామనస్సు నీడ్చుచున్నావు.

౩౦౻. మాసిన పట్టుచీరను, చిక్కియున్న మేనునుగలిగి యలంకారములేని దానవయియున్నను నిన్నుఁగాంచి నాస్వంతభార్యలయందాశను సుఖమును బొందకయున్నాను.

౩౧౻. అంతఃపురమందున్నవారును, సమస్తగుణములచే నొప్పినవారును నగు స్త్రీలెందఱు నాకుఁగలరో యందఱకును నీవధికారమును గలదానవై యుండుము.

౩౨౻. నల్లని వెండ్రుకకొనలుగలదానా! మూఁడు లోకములవారిలో నుత్తమురాండ్రగు నాయిల్లాండ్రు లక్ష్మీదేవిని దేవతాస్త్రీలు కొలుచునట్లు నిన్ను సేవింపఁగలవారు.

౩౩౻. అందమగు కనుబొమలుగలదానా! సొంపగు పిఱుఁదులు గలదానా! కుబేరుని పట్టణమందు రత్నములెవ్విగలవో ధనములేపాటి గలవో యాపాటివానిని నన్నును నీమనస్సునకుఁ బోలినట్లుగ ననుభవింపుము.

౩౪౻. ఓసీతా! శ్రీరాముఁడు తపస్సు, బలము, దర్పము, ధనము, ప్రతాపము, కీర్తి యను వీనిలో నేవిషయముననేని నాతోడసమానుఁడుగాఁడు.

౩౫౻. ఓయింపగుదానా! నీవు లెస్సగా మధు (కల్లు) పానము సేయుము, నాతోడఁ గ్రీడింపుము, పుష్పగంధాదులు ధరింపుము ధనసమూహములను నాభూమిని నీకు సమర్పించువాఁడను. సుఖముగ నాతోడఁ గ్రీడింపుము. నీబంధువులును నిందులకువచ్చి నీయందనురక్తులగుదురు.

కుసుమిత తరుజాల సంతతాని
భ్రమరయుతాని సముద్రతీరజాని।
కనక విమలహార భూషితాంగీ
విహార మయాసహ భీరు కాననాని॥ ౩౬

ఇతి శ్రీమత్సుందరకాండే - వింశస్సర్గః.

## ఏకవింశస్సర్గః.

తస్య తద్వచనం శ్రుత్వా సీతా రౌద్రస్య రక్షసః।
ఆర్తా దీనస్వరా దీనం ప్రత్యువాచ శనైర్వచః॥ ౧॥

దుఃఖార్తా రుదతీ సీతా వేపమానా తపస్వినీ।
చింతయంతీ వరారోహా పతిమేవ పతివ్రతా॥ ౨॥

తృణ మంతరతః కృత్వా ప్రత్యువాచ శుచిస్మితా॥ ౨౫

నివర్తయ మనో మత్తస్స్వజనే క్రియతాం మనః।
నమాం ప్రార్థయితుం యుక్తం త్వం సిద్ధి మివ పాపకృత్॥ ౩౫

అకార్యం నమయా కార్య మేకపత్న్యా విగర్హితమ్।
కులం సంప్రాప్తయా పుణ్యం కులే మహతి జాతయా॥ ౪౫

ఏవ ముక్త్వాతు వైదేహీ రావణం తం యశస్వినీ।
రాక్షసం పృష్ఠతః కృత్వా భూయో వచన మబ్రవీత్॥ ౫౫

౩౬½. స్వచ్ఛమగు బంగారముచేఁ జేయంబడిన ముత్యాలపేరులచే నలంకరింపఁబడిన మేనుగలదానా! బాగుగఁ బూచియున్న చెట్లసమూహముచే నెడములేక యున్నవియు, తుమ్మెదల మొత్తములనుగలిగి సముద్రతీరమున నున్నవియు నగువనములయందు నాతోడఁగూడి క్రీడింపుము! భయపడుస్వభావము గలదానా!

ఇది యిరువదవసర్గ.

---

ఇరువది యొకటవసర్గ.

౧. ఆసీతాదేవి భయంకరుఁడైన యారాక్షసుని మాటనువిని దుఃఖించినదై తిన్ననియెలుఁగుతో మెల్లన వానికి మఱుమాటగ నిట్లనియె.

౨, ౨½. దుఃఖముచేఁబీడింపఁబడినదియు నేడ్చుచున్నదియు వడఁకుచున్నదియుఁ దపస్సునుగలదియుఁ బతివ్రతయు భర్తనే తలంచుచున్నదియు నుత్తమురాలును నగుసీత నిర్దోషమగు చిఱునగవుతో గడ్డిపోఁచ నొంక్కదాని నడ్డముగాఁ బెట్టికొని వానికి మాఱుపలికెను.

౩½. నాకడనుండు నీమనస్సును వెనుకకుఁ ద్రిప్పికొనుము, నీకుంగల స్త్రీలయందు నీమనస్సు నుంచికొనుము, పాపాత్ముఁడు మోక్షసిద్ధిని పేక్షించినట్లుగా నీవును నన్నుంగోరుటకుఁ దగవుసుమా!

౪½. అధ్యాత్మవేత్తలగు విదేహరాజులకులమునఁ బుట్టిన దానను కుల శీల బల దర్పములచే నొప్పిన యిక్ష్వాకువంశమునఁ జొచ్చినదానను, ఒకేభార్యను గలిగియుండుటయను వ్రతమునుగల శ్రీరామున కిల్లాలి నైన దానను నగునాచేతం జేయఁదగని కార్యము చేయంబడదు.

౫½. యశస్సునుగలదియగుజానకి యిట్లుపలికినదై వానింజూడక మాఱుమొగమిడి మఱల నిట్లనియెను.

నాహ మౌపయికీ భార్యా పరభార్యా సతీ తవ।
సాధుధర్మ మవేక్షస్వ సాధు సాధువ్రతం చర॥ ౬½

యథాతవ తథా న్యేషాం దారా రక్ష్యా నిశాచర।
ఆత్మాన ముపమాం కృత్వా స్వేషుదారేషు రమ్యతామ్॥ ౭½

అతుష్టం స్వేషుదారేషు చపలం చలితేంద్రియమ్।
నయంతి నికృతిప్రజ్ఞం పరదారాః పరాభవమ్॥ ౮½

ఇహ సంతో నవాసంతి సతోవా నానువర్తసే।
తథాహి విపరీతా తే బుద్ధి రాచార వర్జితా॥ ౯½

వచో మిథ్యా ప్రణీతాత్మా పథ్యముక్తం విచక్షణైః।
రాక్షసానా మభావాయ త్వం వా నప్రతిపద్యసే॥ ౧౦½

అకృతాత్మాన మాసాద్య రాజాన మనయే రతమ్।
సమృద్ధాని వినశ్యంతి రాష్ట్రాణి నగరాణి చ॥ ౧౧½

తథేయం త్వాం సమాసాద్య లంకా రత్నౌఘ సంకులా।
అపరాధా త్తవైకస్య నచిరా ద్వినశిష్యతి॥ ౧౨½

స్వకృతై ర్హన్యమానస్య రావణా దీర్ఘదర్శినః।
అభినందంతి భూతాని వినాశే పాపకర్మణః॥ ౧౩½

ఏవం త్వాం పాపకర్మాణం వక్ష్యంతి నికృతా జనాః।
దిష్ట్యైత ద్వ్యసనం ప్రాప్తో రౌద్ర ఇత్యేవ హర్షితాః॥ ౧౪½

౬౪. ఇతరునిభార్యను బతివ్రతను నగునేను నీకుపయోగించుదాననుగాను. సత్పురుషులు వర్తించు మార్గమును గనుము. అట్టివారి యనుష్ఠానము నాశ్రయింపుము.

౭౪. ఓరిరాక్షసా! నీభార్యలెట్లు కాపాడఁబడఁ దగుదురో యటువలెనే యితరులభార్యలును రక్షింపఁబడఁదగినవారిని తలంపుము. నీవలెనే యితరులు నని తెలిసి, దుర్గుణములుమాని నీభార్యలతో సుఖింపుము.

౮౪. తనభార్యలయందుఁ దృప్తినొందక, చలించుచున్న యింద్రియములనుగల మూర్ఖుని, కపటబుద్ధి గలవానిఁగా నెంచి యితరుల భార్యలు పరాభవ పెట్టుచున్నారు.

౯౪. నీపట్టణమున సత్పురుషులు లేరా? అట్టివారున్నను వారిని నీవాశ్రయింపవు కాఁబోలును, అదిసత్యమే, లోకమునకు విరుద్ధమైనదియగు నీబుద్ధి యోగ్యులువర్తించు మార్గమునకుఁ దొలఁగియున్నది.

౧౦౪. బొంకులచేతనే పెనుపంబడిన స్వభావమునుగలనీవు విద్వాంసులచేఁ జెప్పంబడినమార్గములను మాటలను (రాక్షసులు నిర్మూలు రగుటకొఱకే) వినకున్నావు కాఁబోలు.

౧౧౪, ౧౨౪. సర్వపదార్థ సంపన్నములగు రాజ్యములును బట్టణములును, దుర్జనుఁడై యన్యాయమందాసక్తిఁగలరాజును జెంది యెట్లునశించునో యటువలెనే యంతటివాఁడవగు నిన్నుఁజెంది, సమస్త సంపదలచేతను నొప్పినదియగు నీలంక నీయొక్క దోషముచేతనే శీఘ్రమున నశించును.

౧౩౪, ౧౪౪. ఓరిరావణా! తానుజేసిన నేరములచేఁ జంపఁబడుచున్న వాఁడును. ముందుయోచనలేనివాఁడును నగుపాపాత్ముఁడు చేటును బొందుచుండఁగా సర్వభూతములును సంతోషించును, నీచేత హాని పొందినజనులు 'భయంకరుఁడగు రావణుఁ డదృష్టవశమునఁ జేటును బొంది దుఃఖించుచున్నాఁడుగదా! అని సంతోషించి చెప్పికొందురు.

శక్యా లోభయితుం నాహ మైశ్వర్యేణ ధనేనవా।
అనన్యా రాఘవేణాహం భాస్కరేణ ప్రభాయథా॥ ౧౫

ఉపధాయ భుజంతస్య లోకకాంతస్య సత్కృతమ్।
కథంనా మోపధాస్యామి భుజమన్యస్య కస్యచిత్॥ ౧౬

అహ మౌపయికీ భార్యా తస్యైవ వసుధాపతేః।
వ్రతస్నాతస్య విప్రస్య విద్యేవ విదితాత్మనః॥ ౧౭

సాధు రావణ రామేణ మాం సమానయ దుఃఖితామ్।
వనే వాశితయా సార్థం కరేణ్వేవ గజాధిపమ్॥ ౧౮

మిత్ర మౌపయికం కర్తుం రామస్థానం పరీప్సతా।
వధం చానిచ్ఛతా ఘోరం త్వయా సౌ పురుషర్షభః॥ ౧౯

విదిత స్సహి ధర్మజ్ఞ శ్శరణాగత వత్సలః।
తేన మైత్రీ భవతు తే యది జీవితు మిచ్ఛసి॥ ౨౦

ప్రసాదయస్వ త్వం చైనం శరణాగత వత్సలమ్।
మాం చాస్మై ప్రయతో భూత్వా నిర్యాతయితు మర్హసి॥ ౨౧

ఏవం హి తే భవే త్స్వస్తి సంప్రదాయ రఘూత్తమే।
అన్యథా త్వంహి కుర్వాణో వధం ప్రాప్స్యసి రావణ॥ ౨౨॥

వర్జయే ద్వజ్ర ముత్సృష్టం వర్జయే దంతకశ్చిరమ్।
త్వద్విధం తు నసంక్రుద్ధో లోకనాథ స్సరాఘవః॥ ౨౩

౧౫౪. నీధనముచేత నేని, ఐశ్వర్యముచేత నేని మోహింపఁ జేయుటకు నేను లోఁబడుదానను గాను. సూర్యునివలననుండి కాంతిని వేఱుపఱచుట యెట్లసాధ్యమో యట్టులనే శ్రీరామునివలననుండి నన్నును వేఱుసేయుట.

౧౬౪. లోకములకుఁ బ్రభుఁడగు శ్రీరామునియొక్క సొంపగుభుజమును దలగడగానుంచికొనిననే నెట్లు పరునిభుజము తలగడగాఁ గొందును.

౧౭౪. స్నాతకవ్రతమును జేసి వివేకియైయున్న విప్రున కధ్యాత్మవిద్యవలెనే రాజగు శ్రీరామునకే నేను దగినదానను.

౧౮౪. ఓరావణా! దుఃఖించుచున్న నన్ను (వనమందు యూథపనముచేఁ నొప్పిన) వెంటియేనుఁగును మంచిమగయేనుఁగుతోఁ గూర్చినట్లు శ్రీరామునితోడఁ బాగుగఁ జేర్పుమా!

౧౯౪. లంకయందే యుండవలయుననియు, ప్రాణములను గాపాడుకొనవలయుననియుఁ దలంచు నీవు పురుషోత్తముఁడగు శ్రీరామునితో సఖ్యము చేయుట మేలు. అటు సేయవేని తుదముట్టెదవు.

౨౦౪, ౨౧౪. ఆరాముఁడు ధర్మమెఱింగినవాఁడు, ఆశ్రయించిన వారిని రక్షించువాఁడు, ప్రసిద్ధుఁడు, నీకుఁ బ్రదుకవలయునను నాశకలచో నాతనితో మైత్రిచేయుము. ఆశ్రితరక్షకుఁడగు రాముని నీవును వేఁడికొమ్ము నీమనస్సునందలి కల్మషమునుమాని బుద్ధిమంతుఁడవై, యాతనికి నన్ను సమర్పించి ధన్యుఁడవగుము.

౨౨౪. ఓరావణా! శ్రీరామునకు నన్ను సమర్పించితివేని నీకు శుభమగును. అట్లు సేయనిచో నీవు భయంకరముగఁ జంపఁబడుదువు.

౨౩౪. దేవేంద్రునిచే నీపై వేయంబడిన వజ్రాయుధము నిన్నుఁ జంపలేకున్నను నుండుఁగాక. యముండును జిరకాలము నిన్ను విడచినను విడుచుఁగాక సర్వలోకములకు నధిపతియగు శ్రీరాముఁడు గోపించినచో నిన్నుం బోలునీచుని క్షణమేని మననియ్యఁడు.

రామస్య ధనుషశ్శబ్దం శ్రోష్యసి త్వం మహాస్వనమ్।
శతక్రతు విసృష్టస్య నిర్ఘోష మశనేరివ॥ ౨౪

ఇహ శీఘ్రం సుపర్వాణో జ్వలితాస్యా ఇవోరగాః।
ఇషవో నిపతిష్యంతి రామలక్ష్మణ లక్షణాః॥ ౨౫

రక్షాంసి పరినిఘ్నంతః పుర్యామస్యాం సమంతతః।
అసంపాతం కరిష్యంతి పతంతః కంకవాససః॥ ౨౬

రాక్షసేంద్ర మహాసర్పాన్ స రామగరుడో మహాన్।
ఉద్ధరిష్యతి వేగేన వైనతేయ ఇవోరగాన్॥ ౨౭

అపనేష్యతి మాం భర్తా త్వత్త శ్శీఘ్ర మరిందమః।
అసురేభ్య శ్శ్రియం దీప్తాం విష్ణుస్త్రిభి రివ క్రమైః॥ ౨౮

జనస్థానే హతస్థానే నిహతే రక్షసాం బలే।
అశక్తేన త్వయా రక్షః కృతమేత దసాధువై॥ ౨౯

ఆశ్రమంతు తయో శ్శూన్యం ప్రవిశ్య నరసింహయోః।
గోచరంగతయో ర్భ్రాత్రో రపనీతా త్వయాధమ॥ ౩౦

నహి గంధ ముపాఘ్రాయ రామలక్ష్మణయో స్త్వయా।
శక్యం సందర్శనే స్థాతుం శునా శార్దూలయో రివ॥ ౩౧

౨౪౫. ఓరీ! నీవు దేవేంద్రునిచే విడువంబడిన పిడుగువలెనే భయంకరమగు ధ్వనినిగల శ్రీరామునియొక్క వింటినారిచప్పుడు వినుదువు సుమా!

౨౫౫, నుండి ౨౭౫కు. సొంపులగుకణుపులుగలవియు, రామలక్ష్మణుల గుఱుతులుగలవియునగు బాణములు విషాగ్నిచేమండుచున్న మోములుగల సర్పములవలె నీలంకయందంతటు శీఘ్రమున రాలంగలవు. కంకపక్షి ఱెక్కలు గట్టఁబడియున్న బాణము లీపట్టణమందెల్లెడలను బడుచు రాక్షసుల రూపుమాపి పీనుఁగుపెంటలు చేయంగలవు. దొడ్డవాఁడగు నారాముఁడనుగరుత్మంతుఁడు రాక్షసరాజులను పెనుబాములను (గరుత్మంతుఁడు పాములను జిమ్మునట్లు) వేగమున నెగఁజిమ్మును.

౨౮౫. విష్ణుదేవుఁడు మూఁడడుగులచేత, సంపూర్ణమగు రాక్షసరాజ్యసంపదను హరించినట్టుల, శత్రువుల నణఁచినవాఁడగు నాప్రాణేశుఁడు శీఘ్రముననె నీయింటినుండి నన్నుంగొని పోఁగలండు.

౨౯౫. జనస్థానమను చోటు, శ్రీరామునిచేఁ (ఖర దూషణాదులను ప్రసిద్ధులగు రాక్షసులఁజంపి) బాడునేయఁబడినది కాఁగా, పదునాల్గువేల రాక్షసబలము నిర్మూలము నేయఁబడినది కాఁగా దుర్బలుఁడవగునీవు రాముసకు వెఱచి, యోగ్యముకాని తెఱంగున (దొంగతనముగా) నన్నుఁ దెచ్చితివి.

౩౦౫. ఓరినీచా! పురుషశ్రేష్ఠులగు రామలక్ష్మణు లాశ్రమమున లేనియపుడును, ఆయన్నదమ్ము లిరువురును గార్యాంతరమున వేగియుండఁగను, వారికిఁ దెలియరాక నన్ను సులభముగఁ దెచ్చితివి.

౩౧౫. పులులయొక్కగంధము సోఁకినమాత్రమున నచ్చోట నిలుచుట కుక్కకెట్లసాధ్యమో యటువలెనే రామలక్ష్మణులయెదుట వారిమీఁది గాలి నీపై సోఁకినమాత్రముననె నీవు నిలువఁజాలవు.

తస్య తే విగ్రహే తాభ్యాం యుగగ్రహణ మస్థిరమ్।
వృత్రస్యే వేంద్రబాహుభ్యాం బాహూ రేకస్య నిగ్రహః॥ ౩౨

క్షిప్రం తవ స నాథో మే రామ స్సౌమిత్రిణా సహ।
తోయ మల్ప మివాదిత్యః ప్రాణా నాదాస్యతే శరైః॥ ౩౩

గిరిం కుబేరస్య గతో ఽపధాయ వా సభాంగతో వా వరుణస్య
రాజ్ఞః। అసంశయం దాశరథే ర్న మోక్ష్యసే మహాద్రుమః కాల
హతో ఽశనే రివ॥ ౩౪

ఇతి శ్రీమత్సుందరకాండే - ఏకవింశస్సర్గః.

ద్వావింశస్సర్గః.

సీతాయా వచనం శ్రుత్వా పరుషం రాక్షసాధిపః।
ప్రత్యువాచ తతస్సీతాం విప్రియం ప్రియదర్శనామ్॥ ౧

యథా యథా సాంత్వయితా వశ్య స్స్త్రీణాం తథాతథా।
యథా యథా ప్రియంవక్తా పరిభూత స్తథాతథా॥ ౨

సన్నియచ్ఛతి మే క్రోధం త్వయి కామ స్సముత్థితః।
ద్రవతో మార్గమాసాద్య హయానివ సుసారథిః॥ ౩

వామః కామో మనుష్యాణాం యస్మిన్ కిల నిబధ్యతే।
జనే తస్మిం స్త్వనుక్రోశః స్నేహశ్చ కిల జాయతే ౪

౩౨౹ అట్టినీవు రామలక్ష్మణులతోడి యుద్ధమున గెలుచుట వృత్రాసురుం డొంటిచేతితో దేవేంద్రునితోడంబోరి పొందినజయము వలెనే శ్రేయము గాదు.

౩౩౹ నాప్రాణేశుఁడగు శ్రీరాముఁడు లక్ష్మణసమేతుఁడై (సూర్యుండు కిరణములచేఁ గొద్దిపాటిపడెయందున్న నీటినింబీల్చునట్లు) నీప్రాణములను బాణములచే శీఘ్రమున నాకర్షింపఁగలఁడు.

౩౪౹ నీవు కుబేరునియొక్క పర్వతమును బొందినను, వరుణునిసభయందు దాఁగినను (కాలముచేఁజెడినవృక్షము పిడుగుచేఁ గూలినట్లు) శ్రీరామునిబాణమునుండి తప్పించికొని తొలంగుట యబద్ధము.

ఇది యిరువది యొకటవసర్గ.

---

ఇరువది రెండవసర్గ.

౧. సీతాదేవియొక్క కఠినమైన మాటనువిని రాక్షసరాజగు నా రావణుఁడు సాధువుగ నగపడుచున్న యాదేవితో వినఁగూడని తెఱఁగునఁ గఠినముగా నిట్లనియెను.

౨. "మిక్కిలి యణఁగినవాఁడై స్త్రీలను మితిమించి ప్రార్థించువాఁడు వారికి లోఁబడినవాఁ డగుచున్నాఁడు. అట్లుగానివాఁడు వారిచేత నవమానింపఁ బడుచున్నాఁడు.

౩. నీయందునాకుఁబుట్టినఁ మోహము(త్రోవకానిప్రక్కన రథము నీడ్చికొనిపోవుచున్న గుఱ్ఱములను నేర్పుతోడఁబట్టి మరల్చునట్టి సారథివలె) నాకోపమును మట్టుపెట్టుచున్నది.

౪, ౫. రమ్యమైనదగు భోగేచ్ఛ యేజనముందుఁ గలుగుచున్నదో యాజనమందే జంతువులకు దయయు స్నేహమును పొడముచున్నవి

ఏతస్మా త్కారణా న్న త్వాం ఘాతయామి వరాననే।
వధార్హా మవమానార్హాం మిథ్యా ప్రవ్రజితే రతామ్॥ ౫॥

పరుషాణీహ వాక్యాని యానియాని బ్రవీషి మామ్।
తేషు తేషు వధో యుక్త స్తవ మైథిలి దారుణః॥ ౬॥

ఏవముక్త్వా తు వైదేహీం రావణో రాక్షసాధిపః।
క్రోధ సంరంభ సంయుక్త స్సీతా ముత్తర మబ్రవీత్॥ ౭।

ద్వౌమాసౌ రక్షితవ్యౌమే యోఽవధి స్తే మయాకృతః।
తత శ్శయనమారోహ మమ త్వం వరవర్ణిని॥ ౮।

ఊర్ధ్వం ద్వాభ్యాం తు మాసాభ్యాం భర్తారం మా మనిచ్ఛ
తీమ్। మమ త్వాం ప్రాతరాశార్థ మారభంతే మహానసే॥ ౯।

తాం తర్జ్యమానాం సంప్రేక్ష్య రాక్షసేంద్రేణ జానకీమ్।
దేవగంధర్వ కన్యా స్తా విషేదు ర్వికృతేక్షణాః॥ ౧౦॥

ఓష్ఠప్రకారై రపరా వక్త్రై ర్నేత్రై స్తథాపరాః।
సీతా మాశ్వాసయామాసు స్తర్జితాం తేన రక్షసా॥ ౧౧॥

తాభి రాశ్వాసితా సీతా రావణం రాక్షసాధిపమ్।
ఉవాచాత్మహితం వాక్యం వృత్తశౌండీర్య గర్వితమ్॥ ౧౨॥

నూనం న తే జనః కశ్చి దస్తి నిశ్శ్రేయసే స్థితః।
నివారయతి యో న త్వాం కర్మణో స్మాద్విగర్హితాత్॥ ౧౩॥

కావుననే యసత్యమగువృత్తినిగల రామునియందు మోహముంచియున్న నిన్ను, వధకు నవమానమునకుఁ దగినదానవైనను వధింప నిష్టములేకున్న వాఁడను.

౯, ౭. ఇప్పుడు నన్నేయేవిషయమునఁ గఠినమగుమాటలచే నిందించితివో యాయామాటల కెల్లను నిన్ను భయంకరముగ వధించుట న్యాయమైయున్నది, అని రాక్షసరాజగు రావణుఁడు సీతతోఁబలికి కోపముయొక్క పూనికతోఁగూడినవాఁడై సీతకిట్లనియె.

౮, ౯. మేలగు శరీరకాంతినిగలదానా! మున్ను నాచేఁ జెప్పంబడినట్లు నీకీయంబడిన సంవత్సరకాలములో నింకను రెండుమాసములు మిగిలియున్నవి గావున నంతవఱకు నిన్నురక్షించెదను. అటుపైనీవు నాపానుపునై నెక్కవలయును. ఆరెండునెలలకుఁబిమ్మట నన్ను భర్తగానెంచని చో మఱుసటియుదయమున నేనుదినుఁ సద్దికూటికిఁగా నాసేవకులు నావంటయింట నినుంజింపుదురు సుమా!

౧౦. అట్లు రాక్షసరాజుచే బెదరింపఁబడుచున్న జానకినిజూచి యందున్న దేవగంధర్వకన్యకలు వికారములగు చూపులుగలవారై. మిక్కిలిదుఃఖించిరి.

౧౧, ౧౨. ఆరాక్షసునిచేత బెదరింపఁబడిన సీతాదేవిని గొందఱు స్త్రీలు పెదవులఁ గదల్చుటచేతను మఱికొందఱు ముఖముల నేత్రముల గుఱుతులచేతను నూరడించిరి. ఆస్త్రీలచేత నట్లూరడింపఁబడినదై సీత రాక్షసాధిపుఁడగు రావణునిగూర్చి తనకనుకూలమగునట్టియు, పాతివ్రత్యధర్మమువలని పెంపును వెల్లడిచేయునట్టియు వాక్యమును బలికెను.

౧౩. ఓరీ! నీకు శుభముగలుగునట్టి మార్గముంజూపువాఁడొకండును లేఁడనుట సత్యము. ఈదుర్మార్గమునుండియేనియు నిన్నుఁదొలఁగించువాఁడు లేఁడుగదా!

మామిహ ధర్మాత్మనః పత్నీం శచీమివ శచీపతేః।
త్వదన్య స్త్రిషు లోకేషు ప్రార్థయే న్మనసాపి కః॥ ౧౪॥

రాక్షసాధమ రామస్య భార్యా మమితతేజసః।
ఉక్తవా నసి యత్పాపం క్వగత స్తస్య మోక్ష్యసే॥ ౧౫॥

యథా దృప్తశ్చ మాతంగ శ్శశశ్చ సహితౌ వనే।
తథా ద్విరదవద్రామ స్త్వం నీచశశవత్ స్మృతః॥ ౧౬॥

స త్వ మిక్ష్వాకునాథం వై క్షిప న్నిహ నలజ్జసే।
చక్షుషో ర్విషయం తస్య నతావ దుపగచ్ఛసి॥ ౧౭॥

ఇమే తే నయనే క్రూరే విరూపే కృష్ణపింగళే।
క్షితౌ నపతితే కస్మా న్మా మనార్య నిరీక్షతః॥ ౧౮॥

తస్య ధర్మాత్మనః పత్నీం స్నుషాం దశరథస్యచ।
కథం వ్యాహరతో మాం తే న జిహ్వా వ్యవశీర్యతే॥ ౧౯॥

అసందేశాత్తు రామస్య తపస శ్చానుపాలనాత్।
న త్వాం కుర్మి దశగ్రీవ భస్మ భస్మార్హ తేజసా॥ ౨౦॥

నాపహర్తు మహం శక్యా త్వయా రామస్య ధీమతః।
విధి స్తవ వధార్థాయ విహితో నాత్ర సంశయః॥ ౨౧॥

౧౪. ధర్మస్వభావముగలవాఁడగు శ్రీరామునకు భార్యనై (ఇంద్రునకు శచివలెనున్న) నన్నుఁ గ్రమముదప్పి మనస్సుచేతనేనియుఁ గోరువాఁడు నీకంటె నితరుఁడు లోకమున లేఁడు.

౧౫. రాక్షసులలో నీచుఁడా! మితిమించిన పరాక్రమముగలవాఁడగు శ్రీరామునియొక్క భార్యనగు ననుంగూర్చి పాపపుమాటలాడితివి. ఆ పాపమువలన నెక్కడకేగి విడిపించుకొనెదవు,

౧౬. మదించిన యేనుఁగయుఁ గుందేలును వనమందుఁ గూడికొన్నచో నెట్లుండునో యటువలెనే శ్రీరామునకును నీకును బోలికయొప్పును. అనఁగా శ్రీరాముని మదగజమువలెను, నిన్నుఁ గుందేటివలెను దలఁపఁదగును.

౧౭. అట్టియల్పుఁడవగునీ విక్ష్వాకుకుల సంభవుఁడగు శ్రీరామమూర్తిని జులకనసేయుచు నిచ్చోట సిగ్గుమాలియున్నావు. అతనికన్నులకెదుట నిలువలేక పోతివికదా.

౧౮. ఓరిదుర్జనుఁడా! నన్నుఁ జూచుచున్నట్టి నీయొక్క భయంకరమై విరూపమయిన నల్లని గోరోచనవర్ణముగలకన్నులు భూమిపై నేకారణముచేఁ గూలకున్నవో గదా!

౧౯. ధర్మాత్ముఁడగు నాశ్రీరామునకు భార్యయు, పరాక్రమఘనుఁడగు దశరథునకుఁగోడలును నగు నన్నుఁ బాపబుద్ధితో మాటలాడుచున్న నీయొక్క నాలుక యేలనశింపదో!

౨౦. ఓ పదితలలవాఁడా! శ్రీరామునియొక్కయాజ్ఞ లేమిచేతను, నాతపస్సును వ్యయపఱుపక కాపాడికొనుటవలనను, నిన్ను భస్మము సేయుటకుఁజాలిన నాపతిభక్తిచే భస్మము సేయకున్నదానను.

౨౧. బుద్ధిమంతుఁడగు శ్రీరాముని సంబంధముగలదాననగు నేను నీచే హరింపఁబడుదాననుగాను. నీవధకుఁ గారణముగలుగుటకై యిట్లు విధిచేఁ జేయంబడెను, ఇదిసత్యము.

శూరేణ ధనదభ్రాత్రా బలైస్సముదితేన చ।
అపోహ్య రామం కస్మాద్ధి దారచౌర్యం త్వయాకృతమ్॥ ౨౨॥

సీతాయా వచనం శ్రుత్వా రావణో రాక్షసాధిపః।
వివృత్య నయనే క్రూరే జానకీ మన్వవైక్షత॥ ౨౩॥

నీలజీమూత సంకాశో మహాభుజ శిరోధరః।
సింహసత్త్వగతి శ్శ్రీమాన్ దీప్తజిహ్వోగ్రలోచనః॥ ౨౪॥

చలాగ్ర మకుటప్రాంశు శ్చిత్రమాల్యాను లేపనః।
రక్తమాల్యాంబరధర స్తప్తాంగద విభూషణః॥ ౨౫॥

శ్రోణిసూత్రేణ మహతా మేచకేన సుసంవృతః।
అమృతోత్పాద నద్ధేన భుజగే నేవ మందరః॥ ౨౬॥

తాభ్యాం స పరిపూర్ణాభ్యాం భుజాభ్యాం రాక్షసేశ్వరః।
శుశుభే చలసంకాశ శ్శృంగాభ్యా మివ మందరః॥ ౨౭॥

తరుణాదిత్య వర్ణాభ్యాం కుండలాభ్యాం విభూషితః।
రక్తపల్లవ పుష్పాభ్యా మశోకాభ్యా మివాచలః॥ ౨౮॥

స కల్పవృక్ష ప్రతిమో వసంత ఇవ మూర్తిమాన్।
శ్మశాన చైత్యప్రతిమో భూషితోఽపి భయంకరః॥ ౨౯॥

అవేక్షమాణో వైదేహీం కోప సంరక్తలోచనః।
ఉవాచ రావణ స్సీతాం భుజంగ ఇవ నిశ్శ్వసన్॥ ౩౦॥

౨౨. శౌర్యముగలవాఁడవును, కుబేరునకు సహోదరుఁడవును నానావిధముల సేనలనుగలవాఁడవును నైన నీచేత నొరునిభార్యను దొంగిలుటయను మోసపుకార్యమేలచేయఁబడెను.

౨౩. రాక్షసరాజగు రావణుఁడు సీతయొక్క మాటవిని భయంకరములైన కన్నులనుదెఱచి సీతనుగనియెను.

౨౪ నుండి ౨౭కు. నీలమేఘములవలెం బ్రకాశించువాఁడును, దోర్ఘవియగు భుజములను గంతమును ధరించినవాఁడును సింహముయొక్క బలమువంటి బలమును నడకయుఁగలవాఁడును, తేజోవంతుఁడును మండుచున్న వాలుకకొనయుఁ గన్నులుగలవాఁడును (౨౫) కదలుచున్న కిరీటములకొనలచే నున్నతమైనవాఁడును, నానావిధములగు పుష్పములనుగంధమును ధరించినవాఁడును, ఎఱ్ఱనిపూదండలను వస్త్రమును గలవాఁడును, కుందనపుబంగారుచేఁ జేయంబడిన భుజకీర్తులను భూషణములను గలయతఁడును (౨౬) అమృతమును బుట్టించుటకై మందరపర్వతమును గవ్వము సేసి దానికి సర్పమును త్రాడుగాఁ జుట్టంబడినట్లు ప్రకాశించుచున్న దొడ్డమొలత్రాటిచేఁజుట్టంబడిన నడుముగలవాఁడునునగు (౨౭) రాక్షసరాజు దీర్ఘములై బలముతోఁ గూడినవియగు ప్రఖ్యాతములైన భుజబలముచేఁ నొప్పి, శిఖరములచేనొప్పిన మందర పర్వతమువలెఁ బ్రకాశించెను.

౨౮ నుండి ౩౦. ఉదయకాలమందలి సూర్యుని కాంతితోఁబోలిన కుండలములుగలవాఁడును, ఎఱ్ఱనిచిగుళ్ళను పుష్పములనుగల యశోకవృక్షములచేతఁ బర్వతమువలె నలంకరింపఁబడినవాఁడును (౨౯) కల్పవృక్షముతోఁ దుల్యుఁడును, శరీరమును ధరించిన వసంతునివలె నున్నవాఁడును, బాగుగ నలంకరింపఁబడియున్నను శ్మశానమునందలి మేడతోఁ దుల్యుఁడై భయంకరుఁడైనవాఁడును (౩౦)నగునారాక్షసుఁడు గోపముచే నెఱ్ఱనైన కన్నులుగలవాఁడై సర్పమువలె రోజుచు సీతతో నిట్లనియెను.

అనయే నాభిసంపన్న మర్థహీన మనువ్రతే।
నాశయా మ్యహ మద్యత్వాం సూర్య స్సంధ్యా మివౌజసా॥

ఇత్యుక్త్వా మైథిలీమ్ రాజా రావణ శ్శత్రు రావణః।
సందిదేశ తత స్సర్వా రాక్షసీ ర్ఘోరదర్శనాః॥ 3౨।

ఏకాక్షీ మేకకర్ణాంచ కర్ణప్రావరణాం తథా।
గోకర్ణీం హస్తికర్ణీంచ లంబకర్ణీ మకర్ణికామ్॥ 33॥

హస్తిపా ద్యశ్వ పాద్యాచ గోపాదీం పాదచూళికామ్।
ఏకాక్షీ మేకపాదీంచ పృథుపాదీ మపాదికామ్॥ 3౪॥

అతిమాత్ర శిరోగ్రీవా మతిమాత్ర కుచోదరీమ్।
అతిమాత్రాస్యనేత్రాం చ దీర్ఘజిహ్వా మజిహ్వికామ్॥ 3౫॥

అనాసికాం సింహముఖీం గోముఖీం సూకరీ ముఖీమ్॥ 3౫u

యథా మద్వశగా సీతా క్షిప్రం భవతి జానకీ।
తథా కురుత రాక్షస్య స్సర్వాః క్షిప్రం సమేత్య చ॥ 3౬

ప్రతిలోమాను లోమైశ్చ సామదానాది భేదనైః।
ఆవర్తయత వైదేహీం దండస్యోద్యమనేన చ॥ 3౭

ఇతి ప్రతి సమాదిశ్య రాక్షసేంద్రః పునః పునః।
కామమన్యు పరీతాత్మా జానకీం పర్యతర్జయత్॥ 3౮

౩౧. నీతిలేనివాఁడును, ధనములేనివాఁడును నగు రామునాశ్రయించియున్నదానా! నిన్ను నేనిప్పుడే (సూర్యుఁడు సంధ్యాకాలమునుజంపినట్లు) నశింపఁజేయుదునని పలికెను.

౩౨. అటుపిమ్మట, శత్రువులనేడ్పించువాఁడగు రావణుఁడు సీతతోడ నిట్లుచెప్పి, భయంకరరూపములుగల రాక్షసస్త్రీలతోడ నిట్లాజ్ఞాపించెను.

౩౩ నుండి ౩౫½ కు. ఒంటికన్నుగలదియు నొకేచెవిగలదియు, చెవులనే కప్పగాఁగలదియు, ఆవుచెవులదియు, ఏనుఁగుచెవులదియు, వ్రేలుచున్న చెవులుగలదియు, చెవులే లేనిదియు (౩౪) ఏనుఁగుపాదము వంటిపాదమును గుఱ్ఱముపాదమువంటిపాదమునుగలదియు, ఆవుపాదములవంటిపాదములుగలదియు, పాదమందు వెంట్రుకలుగలదియు, ఒకే కన్నును, ఒకేపాదమును గలదియు, పెద్ద పాదములు గలదియు, పాదమే లేనిదియు, ౩౫. మితిమించినముఖమును గన్నులను బాదములను గలదియు, నిడుపగు నాలుకనుగలదియు, నాలుక లేనిదియు, ౩౫½. ముక్కులేనిదియు సింగము గోవు పంది వీనిమోములవంటి ముఖములను గలవారును.

౩౬½. ఓ సమస్త రాక్షసస్త్రీలారా! మీరు జనకపుత్రికయగు సీతకడఁజేరి యూచిన్నది శీఘ్రమున నాకువశురాలగునట్లు చేయుఁడు.

౩౭½. విరోధ వాక్యములచేతను, అనుకూలవాక్యములచేతను, సామభేద దానా ద్యుపాయములచేతను, కొట్టుటకు యత్నించియు నెట్టులేని సీతను నాకు వశపరువుఁడు.

౩౮½. రావణుఁడు మీఁదఁ జెప్పంబడినట్లుగా వారికాజ్ఞాపించి కామక్రోధములచేతఁ గ్రమ్మిన యాత్మగలవాఁడై సీతాదేవిని బలుమాఱు బెదరించెను.

ఉపగమ్య తతః క్షిప్రం రాక్షసీ ధాన్యమాలినీ।
పరిష్వజ్య దశగ్రీవ మిదం వచన మబ్రవీత్॥ ౩౯

మయా క్రీడ మహారాజ సీతయా కిం తవానయా।
వివర్ణయా కృపణయా మానుష్యా రాక్షసేశ్వర॥ ౪౦

నూన మస్యా మహారాజ న దివ్యా న్భోగసత్తమాన్।
విదధా త్యమరశ్రేష్ఠ స్తవబాహు బలార్జితాన్॥ ౪౧

అకామాం కామయానస్య శరీర ముపతప్యతే।
ఇచ్ఛంతీం కామయానస్య ప్రీతి ర్భవతి శోభనా॥ ౪౨

ఏవముక్త స్తు రాక్షస్యా సముత్క్షిప్త స్తతో బలీ।
ప్రహస న్మేఘసంకాశో రాక్షస స్సన్న్యవర్తత॥ ౪౩

ప్రస్థిత స్స దశగ్రీవః కంపయన్నివ మేదినీమ్।
జ్వలద్భాస్కర వర్ణాభం ప్రవివేశ నివేశనమ్॥ ౪౪

దేవగంధర్వ కన్యాశ్చ నాగకన్యాశ్చ సర్వతః।
పరివార్య దశగ్రీవం వివిశు స్తద్గృహోత్తమమ్॥ ౪౫

స మైథిలీం ధర్మపరా మవస్థితాం ప్రవేపమానాం పరిభ
ర్త్స్య రావణః। విహాయ సీతాం మదనేన మోహిత స్స్వమేవ
వేశ్మ ప్రవివేశ భాస్వరమ్॥ ౪౬

ఇతి శ్రీమత్సుందరకాండే - ద్వావింశస్సర్గః.

౩౯-౪౧నుండి౪౨-౪౩. అటుపిమ్మట ధాన్యమాలినియను రాక్షసస్త్రీ వేగమున నాతని కడకువచ్చి వానిని కౌఁగలించుకొని ౪౦-౪౧. “ఓరాజేంద్రా నాతోడ రమింపుము, ఓ రాక్షసేశ్వరా? కాంతిహీనయైనదియు దీనురాలైనదియు మనుష్యురాలును నగు నీయిల్లాలిచే నీ కేమి లాభము గలుగును. ౪౧-౪౨. మహారాజ! బ్రహ్మదేవుఁడు నీభుజములచేత నార్జింపఁబడిన యుత్తమ భోగములలో నెద్దియు నీసీతకు సత్యముగఁ బొందింపఁడయ్యెను. ౪౨-౪౩. భోగమందిష్టములేని దానితోఁ భోగింపవలయునని మేగునట్టివాని శరీరము మండిపోవుచున్నది. భోగమం దిష్టముగలదానికై కందులకై యేగెడువానిమేను మిక్కిలి సంతోషముచేఁ బొంగుచున్నది” అని చెప్పెను.

౪౩-౪౪. ఇట్లు ధాన్యమాలినిచేఁ జెప్పఁబడినవాఁడును, అవ్వలికిఁదొలఁగింపఁ బడినవాఁడునునై బలవంతుఁడును మేఘముతోఁదుల్యమైన నల్లని యాకారముగలవాఁడును నగు రావణుఁడు నవ్వుచు మరలెను.

౪౪-౪౫. ఆరావణుఁడు భూమి వడంకునట్లుగమరలి ప్రయాణమై వెలుంగుచున్న సూర్యునికాంతివంటి కాంతినిగల తనయింటిని బ్రవేశించెను.

౪౫-౪౬. దేవగంధర్వ కన్యకలును నాగకన్యకలును రావణుని నలు ప్రక్కలఁ జుట్టుకొని, ఆదివ్యమందిరమునఁ బ్రవేశించిరి.

౪౬-౪౭. ఆరావణుఁడు ధర్మమం దాసక్తురాలయి యున్నదియు మిక్కిలి వడఁకుచున్నదియు నగుజానకిని బాగుగ బెదరించివిడిచి, మన్మథునిచేతఁ బ్రేరేపింపఁబడినవాఁడై ప్రకాశించుచున్నదియగు తనమందిరమునే ప్రవేశించెను.

ఇది యిరువది రెండవసర్గ.

---

## త్రయోవింశస్సర్గః.

ఇత్యుక్త్వా మైథిలీం రాజా రావణ శ్శత్రురావణః।
సందిశ్య చ తతస్సర్వా రాక్షసీ ర్నిర్జగామ హ॥ ౧॥

నిష్క్రాంతే రాక్షసేంద్రేతు పునరంతఃపురం గతే।
రాక్షస్యో భీమరూపా స్తా స్సీతాం సమభి దుద్రువుః॥ ౨॥

తతస్సీతా ముపాగమ్య రాక్షస్యః క్రోధమూర్ఛితాః।
పరం పరుషయావాచా వైదేహీ మిద మబ్రువన్॥ ౩॥

పౌల స్త్యస్య వరిష్ఠస్య రావణస్య మహాత్మనః।
దశగ్రీవస్య భార్యాత్వం సీతే న బహుమన్యసే॥ ౪॥

తత స్త్వేకజటానామ రాక్షసీ వాక్యమబ్రవీత్।
ఆమంత్ర్య క్రోధతామ్రాక్షీ సీతాం కరతలోదరీమ్॥ ౫॥

ప్రజాపతీనాం షణ్ణాంతు చతుర్థోయః ప్రజాపతిః।
మానసో బ్రహ్మణః పుత్రః పుల స్త్య ఇతి విశ్రుతః॥ ౬॥

పుల స్త్యస్యతు తేజస్వీ మహర్షి ర్మానసస్సుతః।
నామ్నా స విశ్రవానామ ప్రజాపతి సమప్రభః॥ ౭॥

తస్యపుత్రో విశాలాక్షి రావణ శ్శత్రురావణః।
తస్య త్వం రాక్షసేంద్రస్య భార్యా భవితు మర్హసి॥ ౮॥

మయోక్తం చారుసర్వాంగి వాక్యం కిం నానుమన్యసే॥ ౮౪

## ఇరువదిమూఁడవ సర్గ.

౧. శత్రువుల నేడ్పించువాఁడును రాక్షసరాజును నగురావణుఁడు సీతతో నిట్లుపలికి యందున్న రాక్షసస్త్రీలకాజ్ఞాపించి వెడలెను.

౨. రావణుం డట్లువెడలి మరల నంతఃపురమును జేరినతోడనే భయంకరరూపములుగల రాక్షసస్త్రీలు సీతను జేరవచ్చిరి.

౩. అట్లు చేరవచ్చినవారై కోపముచే నెడలెఱుంగకున్న రాక్షసస్త్రీలు మిక్కిలికఠినమైనవాక్యములచే సీతాదేవితో నిట్లనిరి.

౪. ఓసీతా! పులస్త్యబ్రహ్మపుత్రుఁడును రాక్షసులలో నుత్తముఁడును దొడ్డవాఁడునునగు రావణునకు భార్యవగుటను నీవు మిక్కిలియాఁదరింపకున్నావు.

౫. అటుపైఁ గోపముచే నెఱ్ఱనయిన కన్నులను గలదియగుచు నేకజటయనురాక్షసి యరచేతివలెఁ బల్చనికడుపునుగలదియగు సీతాదేవిని బిలిచి యిట్లనియెను.

౬. ఆఱుగురు బ్రహ్మలలోను నాల్గవవాఁడగునాతండును బ్రహ్మయొక్క మనస్సువలనఁబుట్టినకొమరుఁడును, పులస్త్యుఁడనుపేరునఁ బ్రఖ్యాతుఁడును.

౭. ఆపులస్త్యునకుఁ గొడుకు ఋషిశ్రేష్ఠుఁడును గాంతిసంపదగలవాఁడును, విశ్రవసుఁడను పేరుగలవాఁడునునై బ్రహ్మతోఁదుల్యుఁడై తేజస్సుచే నొప్పుచుండెను.

౮,౮½. శత్రువుల నేడ్పించువాఁడగు రావణుం డావిశ్రవసుని కొడుకు సుమా! అందమగు కన్నులనుగలదానా! అట్టిరాక్షసరాజునకు భార్యవగుటకు నీవు దగియున్నావు. సర్వాంగములయందు నందమ్ముంగల యోభామా! నామాటలను నమ్ముము! రావణాసురునకు భార్యవగుము.

తతో హరిజటానామ రాక్షసీ వాక్యమబ్రవీత్।
వివర్త్యనయనే కోపా న్మార్జార సదృశేక్షణా॥ ౯॥

యేన దేవా స్త్రయస్త్రింశ ద్దేవరాజశ్చ నిర్జితాః।
తస్య త్వం రాక్షసేంద్రస్య భార్యా భవితు మర్హసి॥ ౧౦॥

తతస్తు ప్రఘసా నామ రాక్షసీ క్రోధమూర్ఛితా॥
భర్త్సయంతీ తదా ఘోర మిదంవచన మబ్రవీత్॥ ౧౧॥

వీర్యోత్సిక్తస్య శూరస్య సంగ్రామే ష్వనివర్తినః।
బలినో వీర్యయుక్తస్య భార్యాత్వం కిం నలప్స్యసే॥ ౧౨॥

ప్రియాం బహుమతాం భార్యాం త్యక్త్వా రాజా మహాబలః।
సర్వాసాం చ మహాభాగాం త్వా ముపైష్యతి రావణః॥ ౧౩॥

సమృద్ధం స్త్రీసహస్రేణ నానారత్నోప శోభితమ్।
అంతఃపురం సముత్సృజ్య త్వా ముపైష్యతి రావణః॥ ౧౪॥

అన్యాతు వికటానామ రాక్షసీ వాక్యమబ్రవీత్॥ ౧౫॥

అసకృ ద్దేవతాయుద్ధే నాగగంధర్వ దానవాః।
నిర్జితా స్సమరే యేన స తే పార్శ్వ ముపాగతః॥ ౧౬॥

తస్య సర్వసమృద్ధస్య రావణస్య మహాత్మనః।
కిమద్య రాక్షసేంద్రస్య భార్యా త్వం నేచ్ఛ సేధమే॥ ౧౭॥

౯౪. అటుపైఁ బిల్లికన్నులవంటి కన్నులుగలదియగు హరిజట యనురాక్షసి కోపముచేఁ గన్నులుదెఱచి యిట్లుపలికెను.

౧౦౪. ఎవ్వనిచే ముప్పదిమూఁడుకోట్ల దేవతలును దేవేంద్రుఁడును జయింపఁబడిరో యట్టిరాక్షసరాజునకు భార్యవగుటకు నీవువరి యున్నావు.

౧౧౪. పిమ్మట ప్రఘసయను పేరుగలరాక్షసి కోపముచే నెడలు మఱచినదై బెదరించుచు భయంకరముగు నీమాటను బలికెను.

౧౨౪. పరాక్రమవంతుఁడును యుద్ధమందు వెనుకముగు నిట్టనివాఁడును బలవంతుఁడును బూనికకలవాఁడును నగురావణునకు భార్య వగుటను నీవేలకోరవు.

౧౩౪ నుండి ౧౮౪కు. బలవంతుఁడును రాక్షసరాజును నగురావణుఁడు సమస్తరాక్షస స్త్రీలలోను మిక్కిలియదృష్టవంతురాలును నిష్టురాలును బట్టపుదేవియునగు మండోదరిని విడిచి నిన్నుఁబొందును. అతండు సౌందర్యవతులగు వేయిమంది స్త్రీలచే నొప్పినదియు, సమస్తరత్నములచే తను రమ్యమైనదియు నయిన యంతఃపురమునువదలి నీవేదిక్కుగ నుండఁగలవాఁడు సుమా.

౧౯ నుండి ౨౭కు. వికటయను పేరుగల మఱియొక రాక్షసి 'ఏ రావణునిచే దేవతలు యుద్ధమందుఁ బలుమాఱు గెలువఁబడిరో నాగ గంధర్వులు జయింపఁబడిరో యట్టిరావణుఁడు నీప్రక్కన చేరినవాఁడు. సర్వసంపదలను గలవాఁడును దొడ్డవాఁడును రాక్షసరాజును నగురావణునకు భార్యవగుట కిపుడేల యిచ్చగింపకున్నావే నీచురాలా!' అని యెను.

తతస్తు దుర్ముఖీనామ రాక్షసీ వాక్య మబ్రవీత్।
యస్య సూర్యో నతపతి భీతో యస్య చ మారుతః॥ ౧౮॥
నవాతి స్మా యతాపాంగే కిం త్వం తస్య నతిష్ఠసి।
పుష్పవృష్టిం చ తరవో ముముచు ర్యస్య వై భయాత్॥ ౧౯॥
శైలాశ్చ సుభ్రూ పానీయం జలదాశ్చ యదేచ్ఛతి।
తస్య నైరృత రాజస్య రాజరాజస్య భామిని॥ ౨౦॥
కిం త్వం నకురుషే బుద్ధిం భార్యార్థే రావణస్య హి।
సాధు తే తత్త్వతో దేవి కథితం సాధు భామిని॥ ౨౧॥
గృహాణ సుస్మితేవాక్య మన్యథా నభవిష్యసి॥ ౨౧॥

ఇతి శ్రీమత్సుందరకాండే-త్రయోవింశస్సర్గః.

---

## చతుర్వింశ స్సర్గః.

తతస్సీతా ముపాగమ్య రాక్షస్యో వికృతాననాః।
పరుషం పరుషా నార్య ఊచుస్తాం వాక్య మప్రియమ్॥ ౧॥
కిం త్వ మంతః పురే సీతే సర్వభూత మనోహరే।
మహార్హా శయనోపేతే న వాస మనుమన్యసే॥ ౨॥
మానుషీ మానుషస్యైవ భార్యాత్వం బహుమన్యసే।
ప్రత్యాహర మనోరామా న్నత్వం జాతు భవిష్యసి॥ 3॥
త్రైలోక్య వసుభోక్తారం రావణం రాక్షసేశ్వరమ్।
భర్తార ముపసంగమ్య విహరస్వ యథాసుఖమ్॥ ౪॥

౧౮ నుండి ౨౧౫. అటుపై దుర్ముఖియను పేరుగల రాక్షసి, 'ఎవనికి సూర్యుఁడు వేడిమిఁజూపఁడో వాయుదేవుఁడు భయపడువాఁడై విసరనేరఁడో, నిడుపగు క్రీఁగన్నులుగలదానా! నీవెవ్వనికి లోఁబడక యున్నావో, ఎవనికి భయపడినవై కల్పవృక్షములు పువ్వులవాన కురిసెనో, సొంపగు కనుబొమలుగలదానా! కొండలును మేఘములును నెవనికిఁ గోరినప్పుడుదకమిచ్చుచున్నవో యట్టిరాక్షసరాజగు రావణునకు భార్యవగు సంకల్పము నేలధరింపవు. నీకనుకూలమగుమాటను గపటములేక చెప్పితిని. ఓ చిఱునగవుగలదానా! నామాటను గ్రహింపుము. కాదేని బ్రదుకవు, అని పలికెను.

ఇది యిరువది మూఁడవసర్గ.



## ఇరువది నాల్గవసర్గ.

౧. అటుపై వికారములగు ముఖములనుగల కఠినురాండ్రగు రాక్షసస్త్రీలు సీతను జేరవచ్చి విరోధమై వినఁగూడకయున్న మాటలతో నిట్లనిరి.

౨. ఓసీతా! సర్వభూతములకును మనోహరమైనదియు, శ్రేష్ఠమగు పానుపుతోఁ గూడినదియు నయిన రావణాసురుని యంతఃపురమునందు వసించుటకు నీవేలసమ్మతింపవు.

౩. మనుష్యస్త్రీ మనుష్యునకే భార్యకావలయునని మిక్కిలి తలఁచునట్లున్నావు. శ్రీరామునిపైనుండు నీమనస్సును మరలింపుము. ఇఁక నట్లగుట యబద్ధము.

౪. మూఁడు లోకములయందునుగలుగు సంపదనంతయు ననుభవించువాఁడును రాక్షసరాజునునగురావణుని భర్తగాఁబొంది సౌఖ్యముగఁ గ్రీడింపుము.

మానుషీ మానుషం తం తు రామమిచ్ఛసి శోభనే।
రాజ్యాద్భ్రష్ట మసిద్ధార్థం విక్లబం త్వ మనిందితే॥ ౫॥
రాక్షసీనాం వచశ్శ్రుత్వా సీతా పద్మనిభేక్షణా।
నేత్రాభ్యా మశ్రుపూర్ణాభ్యా మిదం వచన మబ్రవీత్॥ ౬॥
యదిదం లోకవిద్విష్ట ముదాహరథ సంగతాః।
నైతన్మనసి వాక్యంమే కిల్బిషం ప్రతిభాతి వః॥ ౭॥
నమానుషీ రాక్షసస్య భార్యా భవితు మర్హతి।
కామం ఖాదత మాం సర్వా నకరిష్యామి వోవచః॥ ౮॥
దీనో వా రాజ్యహీనోవా యో మేభర్తా స మేగురుః।
తం నిత్య మనురక్తాస్మి యథాసూర్యం సువర్చలా॥ ౯॥
యథాశచీ మహాభాగా శక్రం సముపతిష్ఠతి।
అరుంధతీ వసిష్ఠం చ రోహిణీ శశినం యథా॥ ౧౦॥
లోపాముద్రా యథాగస్త్యం సుకన్యా చ్యవనంయథా।
సావిత్రీ సత్యవంతం చ కపిలం శ్రీమతీ యథా॥ ౧౧॥
సౌదాసం మదయంతీవ కేశినీ సగరం యథా।
నైషధం దమయంతీవ భైమీ పతి మనువ్రతా॥ ౧౨॥
తథాహ మిక్ష్వాకువరం రామం పతి మనువ్రతా॥ ౧౨½
సీతాయా వచనం శ్రుత్వా రాక్షస్యః క్రోధమూర్ఛితాః।
భర్త్సయంతి స్మ పరుషై ర్వాక్యై రావణచోదితాః॥ ౧౩½

౫. అందమగు రూపమునుగలదానా! మంచి నడవడిగలదానా! రాజ్యమునుండి తొలఁగినవాఁడును ధనము లేనివాఁడును భయముచే గృశిం చినవాఁడును మనుష్యమాత్రుఁడునగు రాముని నీవుకోరుచున్నావు.

౬. తామరరేకులవంటి కన్నులుగల సీతాదేవి రాక్షసస్త్రీల మాట లనువిని, శోకమువలనఁబుట్టి రాలుచున్న నీళ్ళతోఁగూడిన కన్నులుగలదై యిట్లనియెను.

౭. ఓసీ! మీరందఱును జేరి లోకవిరోధముగఁ జెప్పుచున్న యీవి షయము మిక్కిలి పాపమును గలిగించునదిగా నాకుఁదోఁచుచున్నది.

౮. మనుష్యస్త్రీ రాక్షసునకు భార్యయగుట తగదుగావున మీరం దఱును నన్నుంజంపి తినుఁడు. నేను మీమాట వినను.

౯. దరిద్రుఁడైనను, రాజ్యము లేనివాఁడైనను నాకెవండుమగఁడో వాఁడే నాకుయోగ్యుఁడు. అట్టివానిని (సూర్యుని సువర్చలాదేవి యెడబా యనట్లుగా) విడువక యాశ్రయించుదానను.

౧౦,నుండి ౧౨౹. పూజ్యురాలగు శచీదేవి దేవేంద్రు నెట్లు పొందు చున్నదో యరుంధతి వసిష్ఠు నెట్లుపాయకున్నదో, లోపాముద్ర యగస్త్యుని, సుకన్య చ్యవనుని, సావిత్రిసత్యవంతుని, శ్రీమతి కపిలుని, సౌదాసుని మద యంతియు, సగరునిఁగేశినియు, నలుని దమయంతియు నెట్లు పాయక యుండిరో యటువలె నేనిక్ష్వాకుకులప్రభుండగు శ్రీరామమూర్తికి నేవకు రాలను గావున నెడబాయను.

౧౩౹. సీతయొక్కమాటనువిని రాక్షసస్త్రీలు కోపముచే మేనుమ ఱచి, రావణాసురునిచేఁ బ్రేరేపింపఁబడినవారై కఠినమగుమాటలచే బెద రించిరి.

అవలీన స్సనిర్వాక్యో హనుమా న్శింశుపాద్రుమే।
సీతాం సంతర్జయంతీ స్తా రాక్షసీ రశృణోత్కపిః॥ ౧౪

తా మభిక్రమ్య సంక్రుద్ధా వేపమానాం సమంతతః।
భృశం సంలిలిహు ర్దీప్తా న్ప్రలంబా న్దశనచ్ఛదాన్॥ ౧౫

ఊచుశ్చ పరమక్రుద్ధాః ప్రగృహ్యాశు పరశ్వధాన్।
నేయమర్హతి భర్తారం రావణం రాక్షసాధిపమ్॥ ౧౬

సంభర్త్స్యమానా భీమాభీ రాక్షసీభి ర్వరాననా।
సా బాష్ప మపమార్జంతీ శింశుపాం తా ముపాగమత్॥ ౧౭

తతస్తాం శింశుపాం సీతా రాక్షసీభి స్సమావృతా।
అభిగమ్య విశాలాక్షీ తస్థౌ శోకపరిప్లుతా॥ ౧౮

తాం కృశాం దీనవదనాం మలినాంబర ధారిణీమ్।
భర్త్సయాం చక్రిరే సీతాం రాక్షస్య స్తాం సమంతతః॥ ౧౯

తతస్తాం వినతానామ రాక్షసీ భీమదర్శనా।
అబ్రవీ త్కుపితాకారా కరాళా నిర్ణతోదరీ॥ ౨౦

సీతే పర్యాప్త మేతావ ద్భర్తుస్స్నేహో నిదర్శితః।
సర్వత్రాతికృతంభద్రే వ్యసనా యోపకల్పతే। ౨౧

౧౪౹. మాటలసందడిలేక యశోకవృక్షముయొక్క కొమ్మలయందుదాఁగియున్న యాహనుమంతుఁడు సీతాదేవిని నానావిధముల బెదరించుచున్న రాక్షసస్త్రీల ధ్వనినివినియెను.

౧౫౹, ౧౬౹. మిక్కిలిగాఁగోపించినవారై రాక్షసస్త్రీలు గడగడ వడఁకుచున్నదియగు సీతనుజుట్టుకొని మండుచున్నవియు వ్రేలుచున్నవియు నగుపెదవులను శీఘ్రమున విఱచిరి. గండ్రగొడ్డళ్ళను జేతులంగొని మిక్కిలి కోపముతోడ 'నీసీత రాక్షసరాజగు రావణుని భర్తగాఁ బొందునంతటి భాగ్యముగలది కాదనిరి.

౧౭౹. అందమగు మోమునుగలదియగు నాసీత భీతినిగలిగించునట్టి యారాక్షసస్త్రీలచే బెదరింపంబడినదై కన్నీరుగార్చుచు నాచెట్టు మొదటనుండెను.

౧౮౹. పిమ్మట, విశాలమగు కన్నులుగల యాసీతాదేవి రాక్షసస్త్రీలచే జుట్టంబడినదై యశోకవృక్షముక్రిందనే శోకముచే బొగులుచుండెను.

౧౯౹. ఆరాక్షసస్త్రీలు చిక్కియున్నదియుఁ బేలవడిన మోముగలదియు మాసినవస్త్రమును ధరించినదియు నగుసీతను నలుప్రక్కల నిలిచి మిక్కిలి బెదరించిరి.

౨౦౹. పిమ్మట, భయంకరమగు రూపమునుగలదియుఁ గోపించినదియు వంగియున్న కడుపునుగలదియు నగు వినతయనుపేరుగల రాక్షసి సీతతో నిట్లనియె.

౨౧౹. ఓ సీతా! నీచేత నింతవఱకును జూపంబడిన భర్తృస్నేహము (మగనియందలిప్రేమ) చాలును. అధికముగాఁ జేయంబడినదెద్దియు దుఃఖమునుగలిగించును సుందరి.

పరితుష్టాస్మి భద్రం తే మానుష స్తే కృతో విధిః।
మమాపి తు వచః పథ్యం బ్రువంత్యాః కురు మైథిలి॥ ౨౨
రావణంభజ భర్తారం భర్తారం సర్వరక్షసామ్।
విక్రాంతం రూపవంతంచ సురేశ మివ వాసవమ్॥ ౨౩
దక్షిణం త్యాగశీలంచ సర్వస్య ప్రియదర్శనమ్।
మానుషం కృపణం రామం త్యక్త్వా రావణమాశ్రయ॥ ౨౪
దివ్యాంగరాగా వైదేహి దివ్యాభరణ భూషితా।
అద్యప్రభృతి సర్వేషాం లోకానా మీశ్వరీ భవ॥ ౨౫
అగ్నేస్స్వాహా యథా దేవీ శచీవేంద్రస్య శోభనే।
కిం తే రామేణ వైదేహి కృపణేన గతాయుషా॥ ౨౬
ఏతదుక్తం చ మే వాక్యం యదిత్వం నకరిష్యసి।
అస్మిన్ముహూర్తే సర్వాస్త్వాం భక్షయిష్యామహే వయమ్॥ ౨౭
అన్యాతు వికటానామ లంబమాన పయోధరా।
అబ్రవీ త్కుపితా సీతాం ముష్టి ముద్యమ్య గర్జతీ॥ ౨౮
బహూ న్యప్రియరూపాణి వచనాని సుదుర్మతే।
అనుక్రోశా న్మృదుత్వాచ్చ సోఢాని తవ మైథిలి॥ ౨౯
నచ నః కురుషే వాక్యం హితం కాల పురస్సరమ్॥ ౩౦
ఆనీతాసి సముద్రస్య పార మన్యై ర్దురాసదమ్।
రావణాంతఃపురం ఘోరం ప్రవిష్టాచాసి మైథిలి॥ ౩౧
రావణస్య గృహే రుద్ధా మస్మాభిస్తు సురక్షితామ్।
న త్వాం శక్తః పరిత్రాతు మపి సాక్షాత్పురందరః॥ ౩౨

౨౨వ నుండి ౨౭వ కు. మనుష్యసంబంధముగా నీచేఁ జేయంబడిన విధి నీకు శుభమైనది. ఇంతవఱకు నీవుచేసినదానికై నేనును సంతసించెద ను. నీమేలునకై చెప్పుచున్న నామాటలనువినుమా! సర్వరాక్షసులకును ప్రభుండగు వానిని, పరాక్రమ సౌందర్యములచే నొప్పినవానిని, సమర్థుని, దాతను, అందఱ కనుకూలుఁడైనవానిని, దేవతల కధిపతియగు నింద్రుని వలె నున్నవానిని మగనిగా నంగీకరింపుమా! ఓజానకి! శ్రేష్ఠమగు చంద నము మొదలగు పూతలను, అందమై వెలగల భూషణములను ధరించిన దానవునై మనుష్యుఁడును, అల్పుఁడునునగు రామునివదలి రావణాసురు నాశ్రయింపుము. ఓ భామా! అగ్నికి స్వాహాదేవివలెను దేవేంద్రునకు శచి వలెను రావణునకిల్లాలివై నేఁడు మొదలు లోకములకెల్లఁ బ్రభు రాలివి కమ్ము? దీనుఁడును, ఆయుష్యము పోయినవాఁడును నగు రామునివలన నీకేమిప్రయోజనము. నాచేఁ జెప్పంబడినట్లు చేయవేని నిన్నీక్షణమున మేమందఱమును భక్షింతుముసుమా?

౨౮వ. వ్రేలుచున్న స్తనములుగలదియగు వికటయను పేరుగల మఱి యొకరాక్షసి కోపించినదై అంకెలువేయుచుఁ బిడికిలినెత్తి సీతతో నిట్ల నియెను.

౨౯, ౩౦. దుష్టమగు బుద్ధిగలదానా! జానకీ! ఓర్వఁగూడనివి యగు పెక్కుమాటలను నీవలన వింటిమి. అవియన్నియు నీయందలిదయ చేతను మెత్తదనముచేతను సహించితిమి. కాలమునకుఁ దగినదియు నీకను కూలమైనదియుఁగా మేమాడినమాటల నంగీకరింపవైతివి.

౩౧, ౩౨. ఇతరులకుఁ జేరరానిదగు సముద్రపునీవలిగట్టునకుఁ దేఁబడితివి, భయంకరమగు రావణునియింట నడ్డగింపఁబడియున్నదాన వు, మాచే రక్షింపఁబడుచున్నదానవు నగునిన్నుఁ గాపాడుటకు దేవేం ద్రుఁడేనియు సమర్థుఁడుగాఁడు.

కురుష్వ హితవాదిన్యా వచనం మమ మైథిలి।
అల మశ్రు ప్రపాతేన త్యజశోక మనర్థకమ్॥ ౩౩॥
భజ ప్రీతిం ప్రహర్షం చ త్యజైతాం నిత్యదైన్యతామ్।
సీతే రాక్షసరాజేన సహ క్రీడ యథాసుఖమ్॥ ౩౪॥
జానాసి హి యథాభీరు స్త్రీణాం యౌవన మధ్రువమ్।
యావన్న తే వ్యతిక్రామే త్తావత్సుఖ మవాప్నుహి॥ ౩౫॥
ఉద్యానాని చ రమ్యాణి పర్వతోపవనాని చ।
సహ రాక్షసరాజేన చరత్వం మదిరేక్షణే॥ ౩౬॥
స్త్రీసహస్రాణి తే సప్త వశేస్థాస్యంతి సుందరి।
రావణంభజ భర్తారం భర్తారం సర్వరక్షసామ్॥ ౩౭॥
ఉత్పాట్యవా తే హృదయం భక్షయిష్యామి మైథిలి।
యదిమే వ్యాహృతం వాక్యం న యథావ త్కరిష్యసి॥ ౩౮॥
తత శ్చండోదరీనామ రాక్షసీ క్రోధమూర్ఛితా।
భ్రామయంతీ మహచ్ఛూల మిదం వచనమబ్రవీత్॥ ౩౯॥
ఇమాం హరిణలోలాక్షీం త్రాసోత్కంపి పయోధరామ్।
రావణేన హృతాం దృష్ట్వా దౌహృదో మే మహానభూత్॥ ౪౦॥
యకృత్ ప్లీహ మథోత్పీడం హృదయం చ సబంధనమ్।
ఆంత్రాణ్యపి తథాశీర్షం ఖాదేయ మితి మేమతిః॥ ౪౧॥

౩౩. ఓసీతా ! హితమును జెప్పుచున్న నామాటను వినుము, కన్నీళ్లు రాల్చుట చాలును, చేటును గలిగించునదియగు నేడ్పు నుడుగుము.

౩౪. ఓసీతా ! సంతోషమును బొందుము, ఎడతెగని దీనభావమును మానుము ! ఈరాక్షసరాజుతోడ సర్వసుఖములం గ్రోలుము.

౩౫. ఓభయపడుదానా ! స్త్రీలయొక్క వయస్సు చంచలమైనదియని తెలియుచున్నావుగదా ! నీవయస్సు దాటునంతలో సమస్తసౌఖ్యములను బొందుము.

౩౬. రక్తరేఖలతోఁగూడిన కన్నులదానా నీవు సుందరములయిన యుద్యానవనములును, క్రీడించు నెలవులయందలి కొండలును దోఁపులను రాక్షస రాజుతోఁగూడి సంచరింపుము.

౩౭. ఓయందక త్తియ ! ఏడువేల స్త్రీలు నీకు లోఁబడియుందురు. సమస్తరాక్షసులకును బ్రభుండగు రావణాసురుని భర్తగాఁగొనుము.

౩౮. ఓసీతా ! నేను జెప్పినట్లు నీవుచేయనియెడల నీగుండెను ముక్కలుముక్కలు నేనీ మేమందఱముఁ దినెదము.

౩౯. పిమ్మట చండోదరియను రాక్షసస్త్రీయొక్క తె కోపముచే నొడలెఱుంగనిదై గొప్పదియగు శూలమునునాయుధమును ద్రిప్పుచు నిట్లు పలికెను.

౪౦. లేడిచూపులవలె సందడముగు చూపులుగలదియు భయముచే గదలుచున్న స్తనములనుగలదియు, రావణాసురునిచే హరింపఁబడినదియునగు సీతను గాంచి నాకుమిక్కిలి యిచ్ఛగలిగెను.

౪౧. యకృత్ ప్లీహములను మాంసఖండములను, తలక్రిందుగ వ్రేలుచున్న హృదయకమలమును, దానితోఁజేరిన నరములను బ్రేగులను దలను దినవలయునని యుద్దేశించియున్నాను, అనియెను.

తతస్తు ప్రఘసానామ రాక్షసీ వాక్యమబ్రవీత్।
కంఠమస్యా నృశంసాయాః పీడయామ కిమాస్యతే॥ ౪౨॥
నివేద్యతాం తతో రాజ్ఞే మానుషీ సా మృతేతి హ।
నాత్ర కశ్చన సందేహః ఖాదతేతి స వక్ష్యతి॥ ౪౩॥
తత స్త్వజాముఖీ నామ రాక్షసీ వాక్యమబ్రవీత్।
విశసేమాం తతస్సర్వా స్సమా న్కురుత పీలుకాన్॥ ౪౪॥
విభజామ తతస్సర్వా వివాదో మే న రోచతే।
పేయ మానీయతాం క్షిప్రం లేహ్య ముచ్చావచం బహు॥ ౪౫॥
తత శ్శూర్పణఖానామ రాక్షసీ వాక్యమబ్రవీత్।
అజాముఖ్యా యదుక్తం హి తదేవ మమ రోచతే॥ ౪౬॥
సురా చానీయతాం క్షిప్రం సర్వశోక వినాశినీ।
మానుషం మాంస మాస్వాద్య నృత్యామోథ నికుంభిలామ్॥
ఏవం సంభర్త్స్యమానా సా సీతా సురసుతోపమా।
రాక్షసీభి స్సుఘోరాభి ర్ధైర్య ముత్సృజ్య రోదితి॥ ౪౭॥

ఇతి శ్రీమత్సుందరకాండే - చతుర్వింశస్సర్గః.

---

## పంచవింశస్సర్గః.

తథా తాసాం వదంతీనాం పరుషం దారుణం బహు।
రాక్షసీనా మసౌమ్యానాం రురోద జనకాత్మజా॥ ౧॥

౪౨, ౪౩. అటుపిమ్మట ప్రఘసయను పేరుగల రాక్షసియిట్లనియె. ఈసీతయొక్క గొంతును నులుముదము, ఊరకయుండనేల! మనుష్య స్త్రీ చంపఁబడెనని రాజునకుం జెప్పుదము, ఆశవమును మీరే తినుండని యాతండు సెప్పును, అందులకేపాటియు సందేహము లేదు.

౪౪, ౪౫. అటుపిమ్మట, అజాముఖియను పేరుగల రాక్షసి మిగుల్ల నీమనుష్యస్త్రీనిజంపి యామాంసఖండములు సమములుగాఁ బ్రోగులు వేయుఁడు, అటుపైనందఱము పంచుకొందము, కలహించుట నాకిష్టము లేదు. సారాయి మొదలగు త్రాగఁదగినవియు, నానావిధములగు పచ్చడులును మెండుగ శీఘ్రముగఁదెండు.

౪౬, ౪౭. అవల శూర్పణఖయనురాక్షసి, అజాముఖి యేమిచెప్పెనో యద్దియే నాకుసమ్మతము, శోకములనెల్ల మఱపించునట్టిదగు కల్లును గూడఁదెండు! ఈమనుష్యస్త్రీమాంసముందిని నికుంభిలయను దేవతంగూర్చి నాట్యములు సేయుదము.

౪౮. దేవకన్యకంబోలునదియగు సీత మీఁదఁజెప్పంబడినట్లు ఘోరరూపిణులగు రాక్షసస్త్రీలచే బెదరింపఁబడినదై ధైర్యమునువిడిచి యేడువసాగెను.

ఇది యిరువదినాల్గవసర్గ.

---

## ఇరువది యైదవసర్గ.

౧. నిర్దయురాండ్రగు నారాక్షసస్త్రీలు మిక్కిలి భయంకరములగు కఠినవాక్యములను బలుకఁగా జానకిదుఃఖించుచుండెను.

ఏవముక్త్వాతు వైదేహీ రాక్షసీభి ర్మనస్వినీ।
ఉవాచ పరమత్రస్తా బాష్పగద్గదయా గిరా॥ ౨॥

న మానుషీ రాక్షసస్య భార్యా భవితు మర్హతి।
కామం ఖాదత మాం సర్వా నకరిష్యామి వోవచః॥ ౩॥

సారాక్షసీ మధ్యగతా సీతా సురసుతోపమా।
నశర్మ లేభే దుఃఖార్తా రావణేన చ తర్జితా। ౪॥

వేపతే స్మాధికం సీతా విశంతీ వాంగ మాత్మనః।
వనే యూథపరిభ్రష్టా మృగీ కోకై రివార్దితా॥ ౫॥

సాత్వశోకస్య విపులాం శాఖామాలంబ్య పుష్పితామ్।
చింతయామాస శోకేన భర్తారం భగ్నమానసా॥ ౬॥

సా స్నాపయంతీ విపులౌ స్తనౌ నేత్ర జలస్రవైః।
చింతయంతీ నశోకస్య తదాంత మధిగచ్ఛతి॥ ౭॥

సావేపమానా పతితా ప్రవాతే కదలీ యథా।
రాక్షసీనాం భయత్రస్తా వివర్ణ వదనాభవత్॥ ౮॥

తస్యాస్సా దీర్ఘవిపులా వేపంత్యా స్సీతయా తదా।
దదృశే కంపినీ వేణీ వ్యాళీవ పరిసర్పతీ॥ ౯॥

౨. అట్లు కఠినముగాఁ బలుకఁబడినదై రాక్షసస్త్రీలచే మిక్కిలి భయపెట్టంబడినదైనను దృఢముగుచిత్తముతోడను వడఁకుచున్నమాటనుగలదై యిట్లనియెను.

౩. మనుష్యస్త్రీ రాక్షసునకు భార్యయగుటకుఁ దగదుగావున మీరుచెప్పినట్లు నేయ నేనుదలంపను. మీకుఁదోఁచిన ట్లప్పుడ నన్ను మీరందఱు భక్షింపుఁడు.

౪. రాక్షసస్త్రీల నడుమనున్నదియు దేవకన్యకంబోలి నదియు నగుసీత రావణాసురునిచేతను బెదరింపఁబడినది కావున దుఃఖముచేఁ బీడింపబడినదై సుఖములేక యుండెను.

౫. అడవియందుఁ దనజాతిగుంపునుండి తొలఁగినదై తోడేళ్ళచేఁజిక్కినజింకవలె సీతాదేవి తన శరీరమున మిక్కిలి కంపమునుగలిగి యుండెను.

౬. ఆసీతాదేవి యశోకవృక్షముయొక్క విశాలముగు పూచిన కొమ్మను బట్టుకొని శోకముచేఁ జెడినమనస్సుగలదై శ్రీరాముని ధ్యానము చేసెను.

౭. ఆజానకి తనగొప్పవియగు స్తనములను గన్నీటిచేఁ దడుపుచుఁ జింతించుచుండినదై దుఃఖముయొక్క తుదను గనఁజాలదయ్యె.

౮. రాక్షసస్త్రీలవలని భయముచే జడిసినదిగావునఁ గాంతినెడిన మోమునుగలదియగు జానకి పెనుగాలిచేఁ గదల్పఁబడిన యరఁటిచెట్టువలె వణఁకుచుండెను.

౯. అప్పుడు వణఁకుచున్నదియగు జానకియొక్క పొడవై వెడల్పుగలిగి కదలుచున్నజడ నల్లత్రాఁచుపామువలెఁ గనంబడియెను.

సా నిశ్శ్వసంతీ దుఃఖార్తా శోకోపహత చేతసా।
ఆర్తా వ్యసృజ దశ్రూణి మైథిలీ విలలాపహ॥ ౧౦॥

హా రామేతిచ దుఃఖార్తా హా పున ర్లక్ష్మణేతి చ।
హాశ్వశ్రు మమ కౌసల్యే హా సుమిత్రేతి భామినీ॥ ౧౧॥

లోకప్రవాద స్సత్యోఽయం పండితై స్సముదాహృతః।
అకాలే దుర్లభో మృత్యుః స్త్రియా వా పురుషస్య వా॥ ౧౨॥

యత్రాహ మేవం క్రూరాభీ రాక్షసీభి రిహార్దితా।
జీవామి హీనా రామేణ ముహూర్త మపి దుఃఖితామ్॥ ౧౩॥

ఏషాల్పపుణ్యా కృపణా వినశిష్యా మ్యనాథవత్।
సముద్రమధ్యే నౌః పూర్ణా వాయువేగై రివాహతా॥ ౧౪॥

భర్తారం త మపశ్యంతీ రాక్షసీవశ మాగతా।
సీదామి ఖలు శోకేన కూలం తోయ హతం యథా॥ ౧౫॥

తం పద్మదళ పత్రాక్షం సింహవిక్రాంత గామినమ్।
ధన్యాః పశ్యంతి మే నాథం కృతజ్ఞం ప్రియవాదినమ్॥ ౧౬॥

సర్వథా తేనహీనాయా రామేణ విదితాత్మనా।
తీక్ష్ణం విషమివాస్వాద్య దుర్లభం మమ జీవితమ్॥ ౧౭॥

౧౦. నిట్టూర్పులు విడచుచున్నదియు దుఃఖముచేఁ బీడింపఁబడినదియు, శోకముచేఁగొట్టంబడిన మనస్సుగలదియు మగనిఁబాసియుంటచే నవయుచున్నదియు నగుజానకి కన్నీళ్లు విడిచెను, గోడుగుడిచెను.

౧౧, ౧౨, ౧౩. హా! రామా! లక్ష్మణ! అయోధ్యా! అత్తా! కౌసల్యా! సుమిత్రాదేవి! అనియును, దుఃఖముచేఁ బీడింపంబడినదానను, ఆఁడుదానను నయిన నేనేమికారణమువలన నీక్రకారము భయమునుగలిగించుచున్న రాక్షసస్త్రీలచే నీలంకయందు బాధింపఁబడుచున్నదానను? శ్రీరామునింబాసిదుఃఖించుచుండి యింతకాలము బ్రదికియున్నాను గావునని ట్లుసంభవించెను. స్త్రీకయినను బురుషునకైనను కాలము కానియపుడు చావుగలుగుట యసాధ్యము. పండితులచేఁ జెప్పంబడిన యీలోకవాదు కసత్యము.

౧౪. పుణ్యహీనురాలను నైన నేనీసముద్రమధ్యమున సరకులచే నిండియున్న యోడ వాయువేగమున నీట ముంచఁబడినట్లు నశించుచున్నాను.

౧౫. నేను సర్వగుణసంపన్నుఁడగు నాప్రాణేశునిఁ గనఁజాలక యీరాక్షసురాండ్రచేఁ జిక్కి నీటితాఁకుచే నొడ్డు కఱఁగుచువచ్చునట్లు శోకముచేఁ గఱఁగుచున్నాను.

౧౬. తామర రేకులవంటి కన్నులుగలవాఁడును, సింగమువలె నడుచువాఁడును, మేలుమఱువనివాఁడును, హితముచెప్పువాఁడును నగు నాప్రాణేశునిఁ బుణ్యము నేసి ధన్యులయినవారు గాంతురు.

౧౭. నామనసెఱింగినవాఁడగు శ్రీరామునిఁ బాసితిని గావున భయంకరమైన విషమును భుజించినట్లుగా బాధనొంది దేహమును సర్వవిధముల విడుచుటసత్యము.

కిన్నుశంతు మయా పాపం పురాజన్మాంతరే కృతమ్।
యేనేదం ప్రాప్యతే దుఃఖం మయా ఘోరం సుదారుణమ్॥

జీవితం త్యక్తుమిచ్ఛామి శోకేన మహతా వృతా।
రాక్షసీభిశ్చ రక్ష్యంత్యా రామో నాసాద్యతే మయా॥ ౧౯॥

ధిగస్తు ఖలు మానుష్యం ధిగస్తు పరవశ్యతామ్।
నశక్యం యత్పరిత్యక్తు మాత్మచ్ఛందేన జీవితమ్॥ ౨౦॥

ఇతి శ్రీమత్సుందరకాండే - పంచవింశస్సర్గః.



## షడ్వింశస్సర్గః.

ప్రసక్తాశ్రుముఖీ త్వేవం బ్రువంతీ జనకాత్మజా।
అధోముఖముఖీ బాలా విలప్తు ముపచక్రమే॥ ౧॥

ఉన్మత్తేవ ప్రమత్తేవ భ్రాంతచిత్తేవ శోచతీ।
ఉపావృత్తా కిశోరీవ వివేష్టంతీ మహీతలే॥ ౨।

రాఘవస్య ప్రమత్తస్య రక్షసా కామరూపిణా।
రావణేన ప్రమథ్యాహ మానీతా క్రోశతీ బలాత్॥ 3.

రాక్షసీ వశమాపన్నా భర్త్స్యమానా సుదారుణమ్।
చింతయంతీ సుదుఃఖార్తా నాహం జీవితు ముత్సహే॥

నహి మే జీవితై రర్థో నైవార్థై ర్నచభూషణైః।
వసంత్యా రాక్షసీ మధ్యే వినా రామం మహారథమ్॥ ౪॥

౧౮, ౧౯, ౨౦. పూర్వజన్మమున నాచేత నెట్టిపాపము సేయఁబడెనదో? ఈజన్మమున భయంకరమైయొార్వరానిదగు దుఃఖము దానిచేతనే సంభవించెను. దొడ్డదియగుదుఃఖముచే నల్లాడుచున్నదాననై ప్రాణములను విడువఁ దలఁచుచున్నాను. ఈ రాక్షసస్త్రీలచేఁ జిక్కియున్ననాకు శ్రీరాముండు కనంబడఁడు. ఛీ! మనుష్యదేహమేల! ఛీ! ఇతరులయధీనమున నుండనేల! స్వేచ్ఛగాఁ బ్రాణమునువిడువ సాధ్యముగాకున్నది.

ఇది యిరువదియాఱవసర్గ.

---

## ఇరువదియేడవసర్గ.

౧. ఇట్లని చెప్పుచుండిన పసిదియగుజానకి కన్నీళ్లతోఁగూడిన ముఖమునుగలదై క్రిందుచూచుచు నేడువసాగెను.

౨, ౩, ౪. వెఱ్ఱిదానివలెను, పైపెక్కినదానివలెను, చిత్తముచలించినదానివలెను శ్రమదీఱ భూమిపైఁబడి పొరలుచున్న యాఁడుగుఱ్ఱమువలెను దుఃఖించుచున్నాను. శ్రీరాముఁడేమఱియున్నపుడు కామరూపమును ధరించిన రావణాసురునిచేత బలవంతముగాఁ బీడింపఁబడి తేఁబడినదానను గావున నిట్లుదుఃఖించెదను. బెట్టిదముగ బెదరింపఁబడినదాననై రాక్షసులకు లోనైయున్నదానను. దుఃఖముచే నింతగఁ బీడింపఁబడినదాననుగావున నిట్లుశోకించెదను. బ్రదుకుటకిష్టము లేకున్నదానను.

౫, ౬. ఈరాక్షసస్త్రీలనడుమ శ్రీరాములనుబాసి జీవించియున్న నాకుఁ బ్రాణములవలన నేమిప్రయోజనమున్నది! ధనములచేతను భూషణములచేతను నుపయోగమేమిగలదు? నాహృదయము సత్యముగా నినుము

అశ్మసార మిదం నూన మథవా ప్యజరామరమ్।
హృదయం మమ యేనేదం నదుఃఖే నావశీర్యతే॥ ౬।
ధిఙ్మా మనార్యా మసతీం యాహం తేన వినాకృతా।
ముహూర్తమపి రక్షామి జీవితం పాపజీవితా॥ ౭॥
కాచ మే జీవితే శ్రద్ధా సుఖేవా తం ప్రియం వినా।
భర్తారం సాగరాంతాయా వసుధాయాః ప్రియంవదమ్॥ ౮।
భిద్యతాం భక్ష్యతాం వాపి శరీరం విసృజా మ్యహమ్।
నచాప్యహం చిరందుఃఖం సహేయం ప్రియవర్జితా॥ ౯।
చరణేనాపి సవ్యేన నస్పృశేయం నిశాచరమ్।
రావణం కింపునరహం కామయేయం విగర్హితమ్॥ ౧౦॥
ప్రత్యాఖ్యాతం నజానాతి నాత్మానం నాత్మనఃకులమ్।
యో నృశంసస్వభావేన మాం ప్రార్థయితు మిచ్ఛతి॥ ౧౧॥
ఛిన్నా భిన్నా విభక్తా వా దీప్తేవాగ్నౌ ప్రదీపితా।
రావణం నోపతిష్ఠేయం కింప్రలాపేన వశ్చిరమ్॥ ౧౨॥
ఖ్యాతః ప్రాజ్ఞః కృతజ్ఞశ్చ సానుక్రోశశ్చ రాఘవః।
సద్వృత్తో నిరనుక్రోశశ్శంకే మద్భాగ్యసంక్షయాత్॥ ౧౩॥
రాక్షసానాం సహస్రాణి జనస్థానే చతుర్దశ।
యేనైకేన నిరస్తాని సమాం కిం నాభిపద్యతే॥ ౧౪॥

క్షేఁజేయంబడినది, అట్లుగాక ముసలితనమును జావును లేనిదని చెప్పినను జె ప్పవచ్చును. ఏలనన నింతదుఃఖముఁ నంబడియు నశింపకయున్నది.

౭. నేను శ్రీరాము నెడఁబాసియుఁ బాపపుబ్రదుకుం బ్రదుకుచుఁ గొంచెముకాలమై నను నాప్రాణములను గాపాడుకొంటినిగావునఁ బతివ్రత నుగాననియు, గౌరవమునకుం దగననియు నేనే నన్ను నిందించికొనియెదను.

౮,౯. సముద్రములనే హద్దులుగాఁగల సమస్తభూమికిని మేలు కూర్చువాఁడును, ఇష్టుఁడునునయిన నాప్రియునియందుఁదక్క నాకు సుఖ మందుఁగాని ప్రాణములందుఁగాని యక్కఱ లేదు. నాదేహము నీరాక్షస స్త్రీలు చీల్చికొననిమ్ము! తిననిమ్ము! నేను బ్రాణములవదలెద. మఱియు, ప్రియునెడబాసి యీదుఃఖమును నేను సహింపఁజాలను.

౧౦. ఎడమకాలిచేతనేనియు రాక్షసునిముట్టరాదు. అట్లుండఁగా లోకముచేఁ నిందింపఁబడినట్టి రావణాసురుండన్న నీరాక్షసుని గోరుదునా!

౧౧,౧౨. ఎవండు ఘాతుకస్వభావముచేఁ నన్నుఁ బ్రార్థింపఁదలం చుచున్నాఁడో వాఁడు నేను జేయుతిరస్కారము నెఱుంగఁడు. తనకులమును దన్నును నెఱుంగఁడు. నేను ఖండింపఁబడినను బ్రద్దలు సేయఁబడినను వేఱు వేఱుగాఁ జేయఁబడినను మండుచున్నయగ్నియందుఁ గాల్పఁబడినను రావ ణాసురునింబొందను. మీరింతగ మాటలాడుటచే నేమిప్రయోజనము.

౧౩,౧౪. శ్రీరాముఁడు సర్వముందెలిసినవాఁడు, ఉపకారము మఱువనివాఁడు దయగలవాఁడు మంచినడవడిగలవాఁడుగఁ బేరుపొంది యు నాదౌర్భాగ్యముచే దయలేనివాఁడయ్యెనని సంశయించెదను. జనస్థా నమనుచోటఁ బదునాల్గువేలరాక్షసుల నెవ్వఁడసహాయుఁడైతునుమాడెనో వాఁడు న న్నేలచేరరాఁడు?

నిరుద్ధా రావణే నాహ మల్పవీర్యేణ రక్షసా।
సమర్థః ఖలు మేభర్తా రావణం హంతు మాహవే॥ ౧౫॥
విరాధో దండకారణ్యే యేన రాక్షస పుంగవః।
రణే రామేణ నిహత స్స మాం కింనాభిపద్యతే॥ ౧౬॥
కామం మధ్యే సముద్రస్య లంకేయం దుష్ప్రధర్షణా।
నతు రాఘవ బాణానాం గతిరోధీహవిద్యతే॥ ౧౭॥
కింతు తత్కారణం యేన రామో దృఢపరాక్రమః।
రక్షసా పహృతాంభార్యా మిష్టాం నాభ్యవపద్యతే॥ ౧౮॥
ఇహస్థాం మాం నజానీతే శంకే లక్ష్మ పూర్వజః।
జానన్నపి హి తేజస్వీ ధర్షణం మర్ష యిష్యతి॥ ౧౯॥
హృతేతి యోధిగత్వామాం రాఘవాయ నివేదయేత్।
గృధ్రరాజోపి స రణే రావణేన నిపాతితః॥ ౨౦॥
కృతం కర్మ మహత్తేన మాం తథా భ్యవపద్యతా।
తిష్ఠతా రావణద్వంద్వే వృద్ధేనాపి జటాయుషా॥ ౨౧॥
యదిమా మిహజానీయా ద్వర్తమానాం స రాఘవః।
అద్యబాణై రభిక్రుద్ధః కుర్యాల్లోక మరాక్షసమ్॥ ౨౨॥
విధమేచ్చ పురీం లంకాం శోషయేచ్చ మహోదధిమ్।
రావణస్య చ నీచస్య కీర్తిం నామచ నాశయేత్॥ ౨౩॥
తతో నిహతనాథానాం రాక్షసీనాం గృహేగృహే।
యథాహమేవం రుదతీ తథాభూయో నసంశయః॥ ౨౪॥

౧౫, ౧౬. సామాన్యమగు బలమునుగల యీరాక్షసునిచేత నేనపహరింపఁబడి యిందుఁజిక్కితిని. నాభర్త యుద్ధమందు వానిని జంపనుజాలఁడా! రాక్షసశ్రేష్ఠుఁడగు విరాధుఁడు దండకారణ్యమున నేశూరునిచే మడిసెనో యట్టిశ్రీరామమూర్తి నన్నేలయావరింపఁడు?

౧౭ నుండి ౧౯ కి. సముద్రము నడుమనున్నదియగు నీలంక చొరన శక్యమయినదిగాని శ్రీరాముని బాణముల నడ్డగించునదియెద్దియు నిందులేదు. మఱియు నేనురాక్షసునిచేత నెత్తుకొనిపోవంబడినదియు, ప్రియురాలును భార్యయు నగు నన్నుఁ దెలిసికొనలేదో! నేనిందుండుట నెఱుంగఁడో! అవియే కారణములని తలంచెదను. ప్రతాపధనుఁడగు శ్రీరాముఁ డీవిషయము నెఱింగియుండియు నవమానము నోర్చియుండునా?

౨౦ నుండి ౨౩ కు. శ్రీరామునికడకేగి, సీత రావణాసురునిచే నెత్తికొని పోవంబడినదని చెప్పంగల జటాయువనుపక్షియు రావణాసురునిచేఁ యుద్ధమునఁగూల్పఁబడియెను. అతండు నన్నుఁదెలిసినవాఁడు గావున నేకడా! వృద్ధుఁడైనను రాక్షసునితో ద్వంద్వయుద్ధమునను నిలచెను. అతండు మహోపకారముం జేసెను. రాఘవుఁడు నేనీ లంకయందుండుట నెఱుంగునేని కోపముచే మండిపడి బాణాగ్నిచే నేఁడీలోకమందు రాక్షసు లనుమాటలే కుండఁజేయును. లంకనూఁదివేయును సముద్రమునింకించును నీచుఁడగు రావణుని కీర్తినిం బేరును నాశముచేయును.

౨౪ నుండి ౨౬ కు. అటుపిమ్మట నేనిప్పు డెట్లుదుఃఖించుచున్నానో యటువలెనే, ఇందుఁ జంపఁబడు రాక్షసులయొక్క భార్యలును బ్రతి గృహమందును నేడ్చుచుందురు సంశయములేదు. లక్ష్మణసహితుఁడై శ్రీరా

అన్విష్య రక్షసాం లంకాం కుర్యా ద్రామ స్సలక్ష్మణః।
నహి తాభ్యాం రిపుర్దృష్టో ముహూర్త మపి జీవతి॥ ౨౫॥
చితా ధూమాకులపథా గృధ్రమండల సంకులా।
అచిరేణతు లంకేయం శ్మశాన సదృశీభవేత్॥ ౨౬॥
అచిరేణైవ కాలేన ప్రాప్స్యా మ్యేవ మనోరథమ్।
దుష్ప్రస్థా నోయ మాఖ్యాతి సర్వేషాం వోవిపర్యయమ్॥ ౨౭॥
యాదృశానీహ దృశ్యంతే లంకాయా మశుభానివై।
అచిరేణతు కాలేన భవిష్యతి హతప్రభా॥ ౨౮॥
నూనం లంకాహతే పాపే రావణే రాక్షసాధమే।
శోషం యాస్యతి దుర్ధర్షా ప్రమదా విధవాయథా॥ ౨౯॥
పుణ్యోత్సవ సముత్థా చ నష్టభర్త్రీ సరాక్షసీ।
భవిష్యతి పురీ లంకా నష్టభర్త్రీ యథాంగనా॥ ౩౦॥
నూనం రాక్షస కన్యానాం రుదతీనాం గృహేగృహే।
శ్రోష్యామి నచిరాదేవ దుఃఖార్తా నా మిహధ్వనిమ్॥ ౩౧॥
సాంధకారా హతద్యోతా హతరాక్షస పుంగవా।
భవిష్యతి పురీలంకా నిర్దగ్ధా రామసాయకైః॥ ౩౨॥
యది నామ స శూరోమాం రామో రక్తాంత లోచనః।
జానీయా ద్వర్తమానాం హి రావణస్య నివేశనే॥ ౩౩॥
అనేనతు నృశంసేన రావణే నాధమేన మే।
సమయో యస్తు నిర్దిష్ట స్తస్యకాలో య మాగతః॥ ౩౪॥

సమూర్తి రాక్షసులను వెదకి వెదకి నాశము సేయును. ఆ రామలక్ష్మణులయెదుటఁబడిన శత్రుఁడు రెండుగడియలకాలమేనియు బ్రతుకఁడు. ఈలంక శ్మశానపుపొగచే నిండిన మార్గములనుగలదియు గ్రద్దలగుంపులతోఁ గూడినదియునుగా నేర్పడి శీఘ్రముననే శ్మశానముతోఁ దుల్యమైనది కాఁగలదు.

౨౭ నుండి ౩౦. శీఘ్రకాలముననే నాకోరికను బొందుదును. మీ చెడునడవడి మీకందఱకుఁ జేటుకాలము సమీపించెనని చెప్పుచున్నది. ఈ లంకయం దెట్టియశుభములు కనంబడుచున్నవో యట్టియపశకునములచేత శీఘ్రకాలముననే లంక కాంతిచెడినదియగును. రాక్షసులలోనీచుఁడును పాపాత్ముండును నగు రావణాసురుఁడు చంపంబడినతోడనే, జయింప నలవికానిదై యుండిన లంకాపురి యౌవనమందుండిన చిన్నది విధవయైనట్టులుండును. శుభకరములగు పండుగలు లేనిదియు, అధికారిని బోఁగొట్టుకొన్నదియు, రాక్షసస్త్రీలనుమాత్రము గలదియునగు లంకాపురి పెనిమిటిని బోఁగొట్టుకొన్న యిల్లాలివలె వెలుఁగఁగలదు.

౩౧ నుండి ౩౩కి. శూరుఁడని పేర్కొన్న వాఁడును, ఎఱ్ఱని కడకన్నులుగలవాఁడును నగు రాముండు నేను రావణాసురునియింటఁ జిక్కియుండుట నెఱుంగునేని లంకాపురి శ్రీరామబాణములచేఁ బూర్తిగాఁ గాల్పంబడినదియు, కొట్టంబడినదియు, కొట్టంబడిన రాక్షసోత్తములను గలదియు, కాంతిచెడినదియు, చీఁకటితోఁగూడినదియు నగును. ఇట్టిలంకయందుఁ బ్రతిగృహముననను శోకించుచున్నవారును దుఃఖముచేఁ బీడింపఁబడుచున్నవారునునైన రాక్షసస్త్రీలయొక్క యేడుపుధ్వనిని శీఘ్రకాలముననే వినుదానను.

౩౪. ఘాతుకుఁడును నీచుఁడునునైన యీరావణునిచేత నాకు నియమింపంబడిన సంవత్సరమితిగలకాలము దాదాఁపుగ ముగియవచ్చుచున్నది.

అకార్యం యే నజానంతి నైరృతాః పాపకారిణః।
అధర్మాత్తు మహోత్పాతో భవిష్యతి హి సాంప్రతమ్॥ ౩౫॥
నైతే ధర్మం విజానంతి రాక్షసాః పిశితాశనాః।
ధ్రువం మాం ప్రాతరాశార్థే రాక్షసః కల్పయిష్యతి॥ ౩౬॥
సాహం కథం కరిష్యామి తం వినా ప్రియదర్శనమ్।
రామం రక్తాంత నయన మపశ్యంతీ సుదుఃఖితా॥ ౩౭॥
యది కశ్చి త్ప్రదాతా మే విషస్యాద్య భవే దిహ।
క్షిప్రం వైవస్వతం దేవం పశ్యేయం పతినా వినా॥ ౩౮॥
నా జానా జ్జీవతీం రామ స్స మాం లక్ష్మణ పూర్వజః।
జానంతౌ తౌ నకుర్యాతాం నోర్వ్యాంహి మమమార్గణమ్॥ ౩౯॥
నూనం మమైవ శోకేన సవీరో లక్ష్మణాగ్రజః।
దేవలోక మితోయాత స్త్యక్త్వా దేహం మహీతలే॥ ౪౦॥
ధన్యా దేవా స్సగంధర్వా స్సిద్ధాశ్చ పరమర్షయః।
మమపశ్యంతి యేనాథం రామం రాజీవలోచనమ్॥ ౪౧॥
అథవా న హి తస్యార్థో ధర్మకామస్య ధీమతః।
మయా రామస్య రాజర్షే ర్భార్యయా పరమాత్మనః॥ ౪౨॥
దృశ్యమానే భవత్ప్రీతి స్సౌహృదం నా స్త్యపశ్యతః।
నాశయంతి కృతఘ్నాస్తు నరామో నాశయిష్యతి॥ ౪౩॥
కిన్ను మే న గుణాః కేచిత్ కింవా భాగ్యక్షయో మమ।
యాహం సీదామి రామేణ హీనా ముఖ్యేన భామినీ॥ ౪౪॥

౩౫. ఏరాక్షసు లిదిచేయందగు నిదిచేయరాదని యోచింపరో యట్టివారి యన్యాయవర్తనచే నిప్పుడు గొప్పచేటు కలుగఁబోవుచున్నది.

౩౬. మాంసమే కూడుగాఁగల యీరాక్షసులు న్యాయమునెఱుంగరు. రావణాసురుఁడు వాస్తవముగ నన్ను రేపటిప్రాతభోజనమం దుపయోగించుకొనం దలఁచియున్నాఁడు.

౩౭. ఇట్టిదశయందున్న నేను, ఎఱ్ఱనికన్నులుగలవాఁడగు శ్రీరాముని గనఁజాలక మిక్కిలి దుఃఖించుచు, ఇంపగు దర్శనమునిచ్చు ప్రాణేశునిఁబాసి యేమిచేయుదానను.

౩౮. నేఁడీలంకయందు నాకేవండేనియు విషమునిచ్చునంతటిపుణ్యాత్ముఁడు సంభవించునేని, నాపతి నీలోకముననే వదలిచని సూర్యపుత్రుండగు యమధర్మరాజును శీఘ్రముగఁ గనియెదను.

౩౯ నుండి ౪౪. లక్ష్మణునకన్నయగు శ్రీరామమూర్తి నేను బ్రదికియుండుట నెఱుంగఁడు. వారలు నాస్థితిని నెఱింగియేయున్నచో భూమియందు నను వెదుకకుండరుగదా! ఆశ్రీరాముఁడు ననుంగూర్చిన దుఃఖముచేతనే భూమిపై దేహమునువదలి స్వర్గలోకమునకుఁ బోయినాఁడు, నిశ్చయము. ఏదేవతలును సిద్ధులతోఁగూడిన గంధర్వులును మహామునులును కమలములవంటి కన్నులుగలవాఁడును నాకుభర్తయు నయిన శ్రీరామునిం జూచెదరో! వారే పుణ్యులు. అట్లుగాక ధర్మకార్యమం దాసక్తిగలవాఁడును, శ్రేష్ఠమగు బుద్ధిగలవాఁడును, రాజర్షియు, శ్రేష్ఠమగు స్వభావముగలవాఁడును, పరబ్రహ్మమే యైనవాఁడును నగురామునకు భార్యనగునాతోడఁ బ్రయోజనమే లేదు. చూడఁబడుచున్న వస్తువులయందుఁ బ్రీతిగల్గియున్నను, చూడనివానిపై నాశలేదు. చేసిన యుపకారమును మఱచినవారు స్నేహమునుగనంబఱచక నాశము నేయుదురు. ఏ నేను ముఖ్యుఁడగు రామునిం బాసియుండినందున, ఆఁడుదానను గావున దుఃఖించుచున్నానో యట్టినా కదృష్టముతగ్గినదేమో! నాయందు సుగుణములు లేవేమో!

శ్రేయో మే జీవితా న్మర్తుం విహీనా యా మహాత్మనః।
రామా దక్లిష్ట చారిత్రా చ్ఛూరా చ్ఛత్రు నిబర్హణాత్॥ ౪౫॥

అథవా న్యస్తశస్త్రౌ తౌ వనే మూల ఫలాశినౌ।
భ్రాతరౌ హి నరశ్రేష్ఠౌ సంవృత్తౌ వనగోచరౌ॥ ౪౬॥

అథవా రాక్షసేంద్రేణ రావణేన దురాత్మనా।
ఛద్మనా సాదితౌ శూరౌ భ్రాతరౌ రామలక్ష్మణౌ॥ ౪౭॥

సాహమేవం గతేకాలే మర్తుమిచ్ఛామి సర్వథా।
న చ మే విహితో మృత్యు రస్మిన్ దుఃఖేపి వర్తతి॥ ౪౮॥

ధన్యాః ఖలు మహాత్మానో మునయ స్త్యక్తకిల్బిషాః।
జితాత్మనో మహాభాగా యేషాం న స్తః ప్రియాప్రియే॥ ౪౯॥

ప్రియా న్న సంభవేద్దుఃఖ మప్రియా దధికంభయమ్।
తాభ్యాంహి యే వియుజ్యంతే నమ స్తేషాం మహాత్మనామ్॥

సాహం త్యక్తా ప్రియార్హేణ రామేణ విదితాత్మనా।
ప్రాణాం స్త్యక్ష్యామి పాపస్య రావణస్య గతావశమ్॥ ౫౧॥

ఇతి శ్రీమత్సుందరకాండే - షడ్వింశస్సర్గః.

౪౫. దొడ్డవాడును, నిర్దోషమగు చరితముగలవాడును, శూరుఁడును, శత్రువుల నాశముచేయువాఁడును నగు శ్రీరామునింబాసియున్న నాకు బ్రదుకునకంటెఁ జచ్చుటమేలు.

౪౬. అట్లుగాక పురుషశ్రేష్ఠులును సహోదరులును నగు రామలక్ష్మణులు వనమందుఁ దిరుగాడువారును, దుంపలు ఫలములు భక్షించువారును, ఆయుధములను బాఱవైచినవారును నయిరేమో!

౪౭. అట్లుగాదేని శూరులును నన్నదమ్ములును నగు రామలక్ష్మణు లిరువురు దుర్జనుఁడగు రావణునిచేతఁ గపటముగాఁ జంపంబడిరో.

౪౮. ఇత్తెఱంగునఁ గాలము సాగనుసాగను నెల్లవిధములచేతను నేనును జచ్చుట కిచ్చయించుచున్నాను. ఇంతటి దుఃఖమందును నాకుఁజావు గలుగకున్నది!

౪౯. ఎవ్వారికి నిష్టానిష్టములు లేవో యట్టిమునులు కృతార్థులుగదా! వారు యోగ్యులును బాపములనుండి విడువంబడినవారును,ఇంద్రియముల గెలిచినవారును భాగ్యవంతులు నగుదురు.

౫౦. ఇష్టమగుదానివలన దుఃఖము పుట్టదు. ఇష్టముకానిదానివలన భీతియెక్కువగాఁ గలుగును, ఇష్టానిష్టములచేత నెవరు విడువంబడుచున్నారో యట్టి ధన్యులకు నేనమస్కరించెదను.

౫౧. నేను ప్రియుఁడును బండితుఁడును నగు రామునిచేత విడువంబడినదాననై పాపియగు రావణాసురునిచేతఁ జిక్కి ప్రాణమును విడుచుదానను.

ఇది యిరువదియాఱవ సర్గ.



## సప్తవింశస్సర్గః.

ఇత్యుక్తాః సీతయా ఘోరా రాక్షస్యః క్రోధమూర్ఛితాః।
కాశ్చి జ్జగ్ము స్తదాఖ్యాతుం రావణస్య తరస్వినః॥ ౧
తతస్సీతా ముపాగమ్య రాక్షస్యో ఘోరదర్శనాః।
పునః పరుష మేకార్థ మనర్థార్థ మథా బ్రువన్॥ ౨
అద్యే దానీం తవానార్యే సీతే పాపవినిశ్చయే।
రాక్షస్యో భక్షయిష్యంతి మాంసమేత ద్యథాసుఖమ్॥ ౩
సీతాం తాభి రనార్యాభి ర్దృష్ట్వా సంతర్జితాం తదా।
రాక్షసీ త్రిజటా వృద్ధా శయానా వాక్య మబ్రవీత్॥ ౪
ఆత్మానం ఖాదతా నార్యా నసీతాం భక్షయిష్యథ।
జనకస్య సుతా మిష్టాం స్నుషాం దశరథస్య చ॥ ౫
స్వప్నో హ్యద్య మయాదృష్టో దారుణో రోమహర్షణః।
రాక్షసానా మభావాయ భర్తురస్యా జయాయచ॥ ౬
ఏవముక్తా స్త్రిజటయా రాక్షస్యః క్రోధ మూర్ఛితాః।
సర్వా ఏవా బ్రువన్ భీతా స్త్రిజటాం తా మిదంవచః॥ ౭
కథయస్వ త్వయా దృష్టః స్వప్నోయం కీదృశో నిశి॥ ౭½
తాసాం శ్రుత్వాతు వచనం రాక్షసీనాం ముఖాచ్చ్యుతమ్।
ఉవాచ వచనం కాలే త్రిజటా స్వప్నసంశ్రితమ్॥ ౮½
గజదంతమయీం దివ్యాం శిబికా మంతరిక్షగామ్॥ ౯

## ఇరువదియేడవసర్గ.

౧. ఇట్లు సీతచేఁ జెప్పంబడినవారును, భయంకరులును నగు కొందఱు రాక్షసస్త్రీలు కోపముచే మేనుమఱచినవారై యప్పుడు ఏలపంగడగు రావణాసురునకు దీనినంతయుఁ జెప్పంబోయిరి.

౨, ౩. పిమ్మట భీతినిగలిగించునట్టి రూపములుగల రాక్షసస్త్రీలు సీతకడకువచ్చి, ఓసీతా ? మూర్ఖురాలా ? పాపబుద్ధిగలదానా ! నేఁడు నీ మాంసమును రాక్షస్త్రీలు కొల్లగఁ దినుదురు. అని మర్మములేనిదియుఁ జేటునుగలిగించునదియుఁ గఠినమైనదియు నగు మాటను మరలఁజెప్పిరి.

౪, ౫, ౬. ముసలిదియుఁ బరుండియున్నదియు నగు త్రిజటయను రాక్షసి మూర్ఖురాండ్రగు రాక్షసస్త్రీలచే మిక్కిలి బెదరింపఁబడిన సీతాదేవిని జూచినదై, ఓసీదుష్టురాండ్రారా ! నన్నుఁ దినుఁడు ! జనకమహారాజునకుఁ బుత్రికయు దశరథునకుఁ బ్రియురాలగుకోడలును నగుసీతను మీరుభక్షింపనేరరు. రాక్షసులు పేరులేకపోవుటకును శ్రీరాముని జయముకొఱకును నేఁడు భయంకరమై శరీరమునఁ గంపముపుట్టించునట్టి స్వప్నమును గంటిని, అని పలికెను.

౭, ౭౺. కోపముచే మేనుమఱచిన యారాక్షసస్త్రీలందఱును త్రిజటమాటలను విన్నవారై జడిసి 'రాత్రి యీస్వప్నము నీకెట్లు కనంబడెనో మాకుఁ జెప్పు'మని యడిగిరి.

౮౺. ఆరాక్షసస్త్రీ లాడినమాటనువిని త్రిజట తనస్వప్నముం గూర్చి చెప్పఁదొడఁగెను.

౯ నుండి ౧౧౺కు. తెల్లనిపుష్పహారములను వస్త్రములను ధరించినవాఁడై శ్రీరాముఁడు దంతముతోఁజేయఁబడినదియు శ్రేష్ఠమైనదియు నా

యుక్తాం హంససహస్రేణ స్వయమాస్థాయ రాఘవః।
శుక్లమాల్యాంబరధరో లక్ష్మణేన సహాగతః॥ ౧౦

స్వప్నే చాద్య మయా దృష్టా సీతా శుక్లాంబరావృతా।
సాగరేణ పరిక్షిప్తం శ్వేతం పర్వతమాస్థితా॥ ౧౧

రామేణ సంగతా సీతా భాస్కరేణ ప్రభా యథా॥ ౧౧½

రాఘవశ్చ మయా దృష్టశ్చతుర్దంతం మహాగజమ్।
ఆరూఢశ్శైలసంకాశం చచార సహలక్ష్మణః॥ ౧౨½

తతస్తౌ నరశార్దూలౌ దీప్యమానౌ స్వతేజసా।
శుక్లమాల్యాంబరధరౌ జానకీం పర్యుపస్థితౌ॥ ౧౩½

తతస్తస్య నగస్యాగ్రే హ్యాకాశస్థస్య దంతినః।
భర్త్రా పరిగృహీతస్య జానకీ స్కంధమాశ్రితా॥ ౧౪½

భర్తురంకాత్సముత్పత్య తతః కమలలోచనా।
చంద్రసూర్యౌ మయా దృష్టా పాణినా పరిమార్జతీ॥ ౧౫½

తతస్తాభ్యాం కుమారాభ్యామాస్థితస్స గజోత్తమః।
సీతయా చ విశాలాక్ష్యా లంకాయా ఉపరిస్థితః॥ ౧౬½

పాండురర్షభయుక్తేన రథేనాష్టయుజా స్వయమ్।
ఇహోపయాతః కాకుత్స్థస్సీతయా సహ భార్యయా॥ ౧౭½

కాశమునఁ బోవునదియు, వేయిహంసలతోఁ గూడినదియు నైన చప్పర
మునెక్కి లక్ష్మణసమేతుఁడుగ వచ్చెను. నేఁడు తెల్లవస్త్రములను ధరిం
చినదియై, సముద్రముచేఁ జుట్టంబడిన తెల్లని పర్వతమందు వసియించు
చు నీసీత సూర్యునింబాయని కాంతివలె శ్రీరామునితోఁ గూడియున్నది.

౧౨౫. నాలుగు దంతములుగలదియుఁ బర్వతముతో సమమయిన
దియు నగు పెద్దయేనుఁగునెక్కి లక్ష్మణ సహితుఁడై శ్రీరాముం డిటు వ
చ్చెను.

౧౩౫. అటుపై నరశ్రేష్ఠులును స్వతేజస్సుచేఁ బ్రకాశించుచు
న్నవారును తెల్లనిపుష్పములను వస్త్రములను ధరించినవారును నగురా
మలక్ష్మణులు జానకిం జుట్టుకొని యున్నారు.

౧౪౫, ౧౫౫. ఆతెల్లని కొండయొక్క కొనయందుఁ దన భర్తచే
గ్రహింపఁబడినదియు, ఆకాశమునందున్న యేనుఁగయొక్క మూఁపునెక్కి
నదియు, కమలపత్రములవంటి కన్నులనుగలదియునగుజానకి, పిమ్మట
మగనియొక్క తొడపైనుండి యెగిరి చేతులచేఁ జంద్రసూర్యుల నంటుచు
న్నదై నాకగపడియెను.

౧౬౫. ఆరామలక్ష్మణులచేత నెక్కఁబడినదియగు శ్రేష్ఠమగు నా
యేనుఁగ విశాలమగు కన్నులుగల సీతతోఁగూడ లంకాపురియొక్క పైభాగ
మున నిలచియున్నది.

౧౭౫. బలవంతుఁడును పురుషశ్రేష్ఠుఁడును నగుశ్రీరాముఁడు భా
ర్యయగు సీతతోడఁగూడఁ దెల్లని యెనిమిదెద్దులను గట్టంబడిన రథమునెక్కి
తానిచ్చటికి కేతెంచెను.

(సాండం త్రిభువనం భీమం సర్వత స్సచరాచరమ్।
సర్వంగ్రస్తం మయాదృష్టం రామేణాక్లిష్టకర్మణా॥ ౧౮

క్షీరోదధి జలేమధ్యే శ్వేతశ్శైల స్సముచ్ఛ్రితః।
తస్యమూర్ధ్ని తతశ్శ్వేత శ్చతుర్దంతో మహాగజః॥ ౧౯

తస్యపృష్ఠే స్థిత శ్శ్రీమా న్రామో రాజీవలోచనః।
ఆసీనశ్చ ప్రాఙ్ముఖశ్శ్రీమా నాసనే పరమేశుభే॥ ౨౦

అభిషిక్తస్తు కాకుత్స్థ స్సర్వదేవై ర్నమస్కృతః।
సబ్రహ్మర్షి గణై స్సర్వై స్సర్వతీర్థ జలేనచ॥ ౨౧

శుక్లమాల్యాంబరధరా శుక్లగంధానులేపనా।
సీతా తత్ర పృథుశ్రోణీ రరాజ జనకాత్మజా॥ ౨౨

తతో దేవా స్సగంధర్వా స్సిద్ధాశ్చ పరమర్షయః।
బ్రహ్మాణ మగ్రతఃకృత్వా రామం తత్ర వవందిరే॥ ౨౩

పునరేవ మయాదృష్టా రామో రమయతాంవరః।
విష్ణురేవ స్వయం భూత్వా తస్మిన్నాస్తే వరాసనే॥ ౨౪

పరంబ్రహ్మ పరంసత్యం పరంజ్ఞానం పరంతపః।
పరంబీజం పరంక్షేత్రం పరం కారణకారణమ్॥ ౨౫

౧౮౪. యోగ్యమగు కార్యముంగల వాఁడగు శ్రీరామునిచేఁ భయంకరమైనవియుఁ జరాచరములతోఁ గూడినవియు నగుముల్లోకములు బ్రహ్మాండ సమేతముగా నంతయు గ్రహింపఁ బడియెను.

౧౯౪, ౨౦౪. పాలసముద్ర మధ్యమునం దెల్లనిపర్వతము పుట్టెను, దానిపై నాల్గుదంతములుగల తెల్లని యేనుఁగును దానిమూఁపున నిర్మలమై మంగళకరమైన యాసనముపై కమలములవంటి కన్నులు గలవాఁడగు శ్రీరాముండు తూర్పుముఖముగాఁ గూర్చున్నవాఁడు.

౨౧౪. శ్రీరాముండు సర్వదేవతలచేతను నమస్కరింపఁబడుచున్న వాఁడగుచు బ్రహ్మర్షి సమూహములచేత సమస్త తీర్థోదకములచేతను నభిషిక్తుఁడయ్యెను.

౨౨౪. జనకపుత్రికయగు సీత తెల్లనివస్త్రములను బుష్పములను గంధమును ధరించినదై యింపుగ వెలింగెను.

౨౩౪. పిమ్మట గంధర్వసహితులగు దేవతలును సిద్ధులును మునులును బ్రహ్మదేవుని మున్నిడికొని శ్రీరామునిం గొనియాడిరి.

౨౪౪. ఆశ్రయింపఁ బడదగినవారిలో నుత్తముఁడగు శ్రీరాముఁడు తానే విష్ణుదేవుండై యదేపీఠమునం బ్రకాశించెను.

౨౫౪, నుండి ౨౭౪ వఱకు. బ్రహ్మము సత్యము జ్ఞానము తపము బీజము క్షేత్రము కారణకారణమును శంఖచక్రములు ధరించిన వాఁడును

శంకచక్రధర శ్శ్రీమాన్ పుండరీ కాయతేక్షణః।
శ్రీవత్సవక్షో నిత్యశ్రీ రజయ్యశ్శాశ్వతో ధ్రువః॥ ౨౬

ఏవంభూతో మహాతేజా రామః కమలలోచనః।
సర్వలోకేశ్వర శ్శ్రీమాన్ రరాజ రఘునందనః॥ ౨౭

తతో మహేంద్రః పితరో మునీంద్రా
గంధర్వ విద్యాధర పన్నగేశ్వరాః।
కృతాభిషేకం పరివార్య రామమ్
ప్రతుష్టువుః ప్రాంజలయః ప్రహృష్టాః॥ ౨౮

నృత్యంతి గాయంతి సమేత్య తత్ర
వాద్యం ప్రకుర్వంతి సురేంద్ర నార్యః।
వంశాశ్చ వీణా మురజాశ్చ భేర్యో
నదంతి శంఖాః పణవాశ్చ సర్వే॥ ౨౯

తతోన్యత్ర మయా దృష్టో రామ స్సత్యపరాక్రమః।)
లక్ష్మణేన సహభ్రాత్రా సీతయా సహ భార్యయా॥ ౩౦

ఆరుహ్య పుష్పకం దివ్యం విమానం సూర్యసన్నిభమ్।
ఉత్తరాం దిశమాలోక్య జగామ పురుషోత్తమః॥ ౩౧

కమలములవలె విశాలములగు నేత్రములుగలవాఁడును ఱొమ్మునందు శ్రీవత్స మను మచ్చనుగలవాఁడును తఱుగని సంపదగలవాఁడును జయింపరాని వాఁడును శాశ్వతుఁడును లోకములకెల్ల నీశ్వరుఁడును నగు శ్రీరాముండు తేజోవంతుఁడై ప్రకాశించెను.

౨౯౫. పిమ్మట దేవేంద్రుఁడును పితృదేవతలును మునీంద్రులు గంధర్వులు విద్యాధరులు సర్పరాజులు పట్టాభిషిక్తుఁడైన శ్రీరామునింజుట్టుకొని సంతోషమునం జేతులుమోడ్చి స్తుతియించిరి.

౨౯౫. దేవకన్యకలు చేరవచ్చినవారై నాట్యము సేయుచున్నారు పాడుచున్నారు వాద్యములు వాయించుచున్నారు. స్త్రీలందఱుం గూడి పిల్లనగ్రోవి వీణె మద్దెల నగారా శంఖము మొదలగువానిని వాయించుచున్నారు.

౩౦౫, నుండి ౩౧౫ వఱకు. సీతాలక్ష్మణసమేతుఁడై సూర్యునికాంతివంటి కాంతినిగల దివ్యమగు పుష్పక విమానమును నెక్కి యుత్తరపు దిక్కునుజూచుచు శ్రీరాముండేగుటు నాచేఁ జూడంబడియెను.

ఏవం స్వప్నే మయాదృష్టో రామో విష్ణుపరాక్రమః।
లక్ష్మణేన సహభ్రాత్రా సీతయా సహ భార్యయా॥ ౩౨॥

నహి రామో మహాతేజా శ్శక్యో జేతుం సురాసురైః।
రాక్షసైర్వాపి చాన్యైర్వా స్వర్గః పాపజనైరివ॥ ౩౩॥

రావణశ్చ మయాదృష్టః క్షితౌ తైలసముక్షితః।
రక్తవాసాః పిబన్మత్తః కరవీర కృతస్రజః॥ ౩౪॥

విమానాత్పుష్పకాదద్య రావణః పతితో భువి।
కృష్యమాణః స్త్రియా దృష్టో ముండః కృష్ణాంబరః పునః॥ ౩౫॥

రథేన ఖరయుక్తేన రక్తమాల్యానులేపనః।
పిబం స్తైలం హసన్నృత్యన్ భ్రాంతచిత్తాకులేంద్రియః॥ ౩౬॥

గర్దభేన యయౌ శీఘ్రం దక్షిణాం దిశమాస్థితః।
పునరేవ మయాదృష్టో రావణో రాక్షసేశ్వరః॥ ౩౭॥

పతితోఽవాక్శిరాభూమౌ గర్దభాద్భయమోహితః।
సహసోత్థాయ సంభ్రాంతో భయార్తో మదవిహ్వలః॥ ౩౮॥

ఉన్మత్త ఇవ దిగ్వాసా దుర్వాక్యం ప్రలపన్బహు।
దుర్గంధం దుస్సహం ఘోరం తిమిరం నరకోపమమ్॥ ౩౯॥

మలపంకం ప్రవిశ్యాశు మగ్నస్తత్ర స రావణః॥ ౪౦॥

౩౨½. లోకమందంతట వ్యాపించినపరాక్రమముఁగలవాఁడగుశ్రీరాముఁడు సీతాలక్ష్మణులతోఁ గూడ స్వప్నమందు నాకగపడియెను.

౩౩½. గొప్పప్రతాపముగలవాఁడగు రాముండు దేవతలచేత నేనియు మఱియెవరిచేత నేనియు, రాక్షసులచేత నేనియు (పాపాత్ములచే స్వర్గము జయింపఁబడనట్లు) జయింపఁ బడఁడు.

౩౪½, ౩౫½. నూనెచేఁ దడుపఁబడినవాఁడును, ఎఱ్ఱనివస్త్రములు గలవాఁడును, కల్లుద్రావుచున్నవాఁడును మేనుమఱచినవాఁడును, గన్నేరుపూలదండలు ధరించినవాఁడునునగు రావణాసురుఁడు భూమిపైఁ గనంబడియెను. పుష్పకమను విమానమునుండిపడినవాఁడును స్త్రీచే నీడ్వఁబడినవాఁడును బోడితలవాఁడును నల్లనివస్త్రముగలవాఁడునునై రావణాసురుఁడు గనంబడియె.

౩౬½, ౩౭½. ఎఱ్ఱనిపుష్పములను జందనమునుధరించి, నూనెత్రావుచు నవ్వుచు నాట్యము సేయుచుభ్రమచెందిన చిత్తమును సకలేంద్రియములునుంగలవాఁడై గాడిదెలంగట్టిన తేరెక్కియు, గాడిదెనెక్కియు దక్షిణముఖముగా శీఘ్రమున నేగుటనాచేఁ జూడంబడియెను.

౩౮½. ఆరావణాసురుఁడు దలక్రిందుగా భయభ్రాంతిచే గాడిదెమీఁదనుండి నేలఁబడుచు వేగమునలేచి బెదరినవాఁడును భయముచేఁ బీడింపఁబడినవాఁడును మదముచే ఒడలుమఱచినవాఁడునునై నాకగపడియెను.

౩౯½, ౪౦. ఆరావణాసురుఁడువస్త్రముకట్టుకొననివాఁడై వెఱ్ఱివానివలె ననేకములగు చెడుమాటలనుబలుకుచు, దుర్గంధముగలిగి ఘోరద్వారాని భయంకరమగు నరకముతోఁ దుల్యమైన ముఱికిబురదను జీఁకటియందు శీఘ్రమునఁ బ్రవేశించి యందు మునింగిపోయెను.

కంఠే బధ్వాదశగ్రీవం ప్రమదా రక్తవాసినీ॥ ౨౦॥
కాళీ కర్దమలిప్తాంగీ దిశం యామ్యాం ప్రకర్షతి।
ఏవం తత్ర మయా దృష్టః కుంభకర్ణో నిశాచరః॥ ౨౧॥
రావణస్య సుతాస్సర్వే దృష్టా స్తైల సముక్షితాః।
వరాహేణ దశగ్రీవ శ్శింశుమారేణ చేంద్రజిత్॥ ౨౨॥
ఉష్ట్రేణ కుంభకర్ణశ్చ ప్రయాతో దక్షిణాం దిశమ్।
ఏక స్తత్ర మయాదృష్ట శ్శ్వేతచ్ఛత్రో విభీషణః॥ ౨౩॥
శుక్లమాల్యాంబరధర శ్శుక్లగంధాను లేపనః।
శంఖదుందుభి నిర్ఘోషై ర్నృత్తగీతై రలంకృతః॥ ౨౪॥
ఆరుహ్య మేఘసంకాశం మేఘ స్తనిత నిస్స్వనమ్।
చతుర్దంతం గజందివ్య మాస్తే తత్ర విభీషణః॥ ౨౫॥
చతుర్భి స్సచివై స్సార్థం వైహాయస ముపస్థితః।
సమాజ శ్చ మయాదృష్టో గీతవాదిత్ర నిస్స్వనః॥ ౨౬॥
పిబతాం రక్తమాల్యానాం రక్షసాం రక్త వాససామ్।
లంకా చేయం పురీరమ్యా సవాజి రథకుంజరా॥ ౨౭॥
సాగరే పతితా దృష్టా భగ్న గోపుర తోరణా।
లంకా దృష్టా మయాస్వప్నే రావణే నాభిరక్షితా॥ ౨౮॥
దగ్ధా రామస్య దూతేన వానరేణ తరస్వినా॥ ౨౯॥
పీత్వా తైలం ప్రనృత్తాశ్చ ప్రహసంత్యో మహాస్వనాః।

౪౦౫, ౪౧౫. రక్తమునఁ దడిసిన వస్త్రమునుగలదియు నల్లనిది యు మేనునందెల్ల బురుదనుగలదియు నగు నొకయాఁడుది రావణాసురు నిగొంతునకుఁ ద్రాడుకట్టి దక్షిణదిశ కీడ్చికొనిపోవుచున్నది. ఇట్లే కుంభక ర్ణుఁడును గనంబడియెను.

౪౨౫, ౪౩౫. రావణాసురుని కొడుకులందఱుఁ దైలమంటుకొని కనంబడిరి. రావణాసురుఁడు పందినెక్కియు, ఇంద్రజిత్తు మొసలినెక్కి యు, కుంభకర్ణుఁ డొంటెనెక్కియు, దక్షిణముఖముగాఁ బోవుచుండిరి. తెల్లనిగొడుగునీడయం దున్నవాఁడై విభీషణుఁడు స్వప్నమం దగపడెను.

౪౪౫, ౪౬. తెల్లని పూవులు వస్త్రములు ధరించినవాఁడును, తె ల్లనిగంధము నలందినవాఁడును, శంఖములును నగారాలు వీనియొక్కధ్వను లచేతను నాట్యములచేతను సంగీతములచేతను నలంకరింపఁబడిన వాఁడున గు విభీషణుఁడు, మేఘముతోఁ దుల్యమైనదియు, ఉరుములంబోలు ధ్వనినిగల దియు నాల్గుదంతములు గలదియు స్వర్గమందున్నదియు నగునేనుంగును నలుగురు మంత్రులతోడ నెక్కి విభీషణుఁ డాకాశమునఁ జనుచున్నాఁడు.

౪౬౫ నుండి ౪౯. పాటలయొక్కయు వాద్యములయొక్కయు ధ్వనులుగల త్రాగుబోతులును, ఏఱ్ఱనిపూదండలు ధరించినవారును, ఎఱుపు గువస్త్రములు గట్టుకొన్నవారును నగు రాక్షసులయొక్క సమూహము కూడఁ జూడఁబడియెను. రమ్యమై గుఱ్ఱములతోడను రథములతోడను గజ ములతోడను గూడినదియగు నీలంక విటిగినతోరణములను గలదియై సము ద్రమందుఁ గూలుట గనంబడియెను. రావణాసురునిచేత లెస్సగ రక్షింపఁబ డినదియగులంక శ్రీరామునియొక్క దూతయు వేగవంతుఁడునగు నొకవాన రునిచేఁ గాల్పంబడినట్లు నాకు స్వప్నమం దగుపడియెను.

౫౦, నుండి ౫౧. నూనెను ద్రావుచు నాట్యము నేయుచున్నవారు నుబిగ్గరనవ్వుచున్నవారును నగురాక్షసస్త్రీలు,బూడిదెచేనుడుకై యున్న లీ

లంకాయాం భస్మరూపాయాం ప్రవిష్టా రాక్షసస్త్రియః॥ ౪౦॥
కుంభకర్ణాదయ శ్చేమే సర్వే రాక్షసపుంగవాః॥
రక్తం నివసనం గృహ్య ప్రవిష్టా గోమయహ్రదే॥ ౪౧॥
అపగచ్ఛత నశ్యధ్వం సీతాం ప్రాప్యస రాఘవః॥ ౪౧½
ఘాతయే త్పరమామర్షీ సర్వైస్సార్థం హి రాక్షసైః।
ప్రియాం బహుమతాం భార్యాం వనవాస మనువ్రతామ్॥
భర్త్సితాం తర్జితాం వాపి నానుమంస్యతి రాఘవః॥ ౪౩॥
త దలం క్రూరవాక్యైర్వ స్సాంత్వమే వాభిధీయతామ్॥ ౪౩½
అభియాచామ వైదేహీ మేతద్ధి మమరోచతే।
యస్యా మేవం విధస్స్వప్నో దుఃఖితాయాం ప్రదృశ్యతే॥
సా దుఃఖై ర్వివిధైర్ముక్తా ప్రియం ప్రాప్నోత్యనుత్తమమ్॥ ౪౪॥
భర్త్సితా మపి యాచధ్వం రాక్షస్యః కిం వివక్షయా॥ ౪౪½
రాఘవాద్ధి భయంఘోరం రాక్షసా నా ముపస్థితమ్।
ప్రణిపాత ప్రసన్నా హి మైథిలీ జనకాత్మజా।
అల మేషా పరిత్రాతుం రాక్షస్యో మహతో భయాత్॥ ౪౬॥
అపిచాస్యా విశాలాక్ష్యా నకించి దుపలక్షయే॥ ౪౬½
విరూప మపి చాంగేషు సుసూక్ష్మ మపిలక్షణమ్।
ఛాయా వైగుణ్య మాత్రంతు శంకే దుఃఖ ముపస్థితమ్॥ ౪౭½
అదుఃఖార్హా మిమాం దేవీం వైహాయస ముపస్థితామ్॥ ౪౮

లంకయందుఁ జొచ్చిరి. కుంభకర్ణుఁడు మొదలగువారును దక్కిన యారాక్షసులును నెఱ్ఱని వస్త్రములనుధరించి, ఆవుపేడనుగల మురుగుడు గుంటయందుఁ బ్రవేశించిరి.

౫౧½, నుండి ౫౩. తొలంగుఁడు! నశించెదరు. శ్రీరాముఁడు సీతను బొందఁగలవాఁడు. అతండు మిక్కిలి కోపమునుగలవాఁడై రాక్షసులందఱితోడను మిమ్మును రావణాసురునిం జంపించువాఁడు. శ్రీరాముఁడు లోకమున కిష్టురాలును, తనకుఁ బ్రియురాలును మగనిననుసరించి వనవాసముచేసినదియు, మీచే బెదరింపఁబడినదియు భయపెట్టఁబడినదియునగు భార్యనుగూర్చి మీరుచేసినతప్పును సహించువాఁడుగాఁడు.

౫౩½, నుండి ౫౫. కావుననే కఠినములగుమీమాటలు చాలును, చల్లగనిట్టులై మాటలాడుఁడు. సీతనుబ్రార్థించికొందము. ఇట్లు సేయుట నాకిష్టమైనది. ఏమెవిషయమున నిట్టికలగలిగెనో యామె పెక్కువిధములగు దుఃఖములనుండి విడువఁబడినదై సమానరహితుఁడగు ప్రాణేశునిఁ బొందఁగలదు.

౫౫½, నుండి ౫౭. ఓరాక్షసస్త్రీలారా! బెదరింపఁబడినయామెనే యభయమిమ్మని (ఆపదనుండి రక్షింపుమని) ప్రార్థన సేయుఁడు! యోచించుటచే నిఁక నుపయోగములేదు. రాక్షసులకు గుండెలావటిల్లునట్టి భయము రామునిచేఁ గలిగినట్లుగనే, జానకీదేవి యొక మ్రొక్కుతోఁ దప్పులన్నియు నోర్చికొని కరుణించును. ఎంతటి యాపదనుండి యేనియుఁ గాపాడ నీసీత చాలినదియని యెఱుంగుఁడు!

౫౭½, నుండి ౫౯. విశాలములగు కన్నులుగల యీసీతయొక్క శరీరమందుకొంచెమేనియు నవలక్షణముగనంబడదు. దుఃఖమునకుఁదగనిదియు, స్వర్గసంబంధములగు భోగముల ననుభవించుటకుఁ దగియున్నదియునగు నీసీతాదేవి, శరీరకాంతిచేమాత్రము వేఱుపడినదియని తలంచెదను.

అర్థసిద్ధిం తు వైదేహ్యాం పశ్యామ్యహ ముపస్థితామ్॥ ౪౯
రాక్షసేంద్ర వినాశంచ విజయం రాఘవస్యచ।
నిమిత్త భూత మేతత్తు శ్రోతుమస్యా మహత్ప్రియమ్॥ ౫౦
దృశ్యతే చ స్ఫురచ్చక్షుః పద్మపత్ర మివాయతమ్।
ఈషచ్చ హృషితో వాస్యా దక్షిణాయా హ్యదక్షిణః॥ ౫౧
అకస్మాదేవ వైదేహ్యా బాహు రేకః ప్రకంపతే।
కరేణు హస్తప్రతిమ స్సవ్యశ్చోరు రనుత్తమః॥ ౫౨
వేపమాన స్సూచయతి రాఘవం పురతస్స్థితమ్॥ ౫౩
పక్షీ చ శాఖానిలయం ప్రవిష్టః పునః పునశ్చోత్తమ సాంత్వ
వాదీ। సుస్వాగతాం వాచ ముదీరయానః పునఃపున శ్చోదయ
తీవ హృష్టః॥ ౫౪॥

ఇతి శ్రీమత్సుందరకాండే - సప్తవింశస్సర్గః.

## అష్టావింశస్సర్గః.

సా రాక్షసేంద్రస్య వచో నిశమ్య తద్రావణస్యా ప్రియ మప్రి
యార్తా। సీతా వితత్రాస యథావనాంతే సింహాభిపన్నా గజ
రాజకన్యా॥ ౧॥
సా రాక్షసీ మధ్యగతా చ భీరు ర్వాగ్భిర్భృశం రావణతర్జి
తా చ। కాంతారమధ్యే విజనే విసృష్టా బాలేవకన్యా విలలా
ప సీతా॥

౫౯ నుండి ౬3. సీతాదేవికి మంచికాలమువచ్చినట్లు తలంచెను. రాక్షసరాజునకు వినాశమును శ్రీరామునకు జయమును సంభవించినట్లూహించుచుండెను. ఆపుణ్యవతికి లాభకరమగుమాటను వినంబోవుటకు సూచకముగ విశాలమునైనడమకన్ను తామర రేకువలె నదరుచున్నట్లు గనంబడెను. కొద్దిపాటిగ వెండ్రుకలు నిక్కుచున్నదియు మగనియభిప్రాయము నాశ్రయించినదియునగు నామెయెడమభుజమొక్కటిమాత్రము వలఁపనితెలంపుగా నదరుచున్నది. ఏనుఁగు తొండము నుపమానముగాఁగలదియై యందమున సాటిలేనిదగు నామెయెడమతొడ యదరుచు శ్రీరామమూర్తి యామెయెదుట నిలిచియున్నటుల శకునమును సూచించుచున్నది.

౬౪. చెట్టుకొమ్మయందలి నెలవును బ్రవేశించినదియు, పలుమాఱు నింపులగుమాటల నాడుచున్నదియు, చుట్టములయొక్క రాకను జెప్పుచున్నదియు నగుపక్షియును సంతోషించినదై పలుమాఱుఁ బలుకుచున్నట్లున్నది.

ఇది యిరువదియేడవసర్గ.

---

## ఇరువది యెనిమిదవసర్గ.

౧. రాక్షసరాజుయొక్క యాజ్ఞననుసరించి స్త్రీలాడిన విరోధముగు మాటలనువిని సీతాదేవి మిక్కిలి పరితపించి, వనప్రదేశమునందు సింగముచేఁజిక్కిన పెంటియేనుఁగువలె మిక్కిలి భీతినొందెను.

౨. రాక్షసస్త్రీల నడుమనున్నదియు, వారిమాటలచే మిగుల భయపడుచున్నదియు, రావణునిచే బెదరింపఁ బడినదియునగు నాసీత జనులులేని యడవినడుమ విడిపింపంబడిన పసిపడుచువలె నేడ్చె.

సత్యం బతేదం ప్రవదంతిలోకే నాకాలమృత్యు ర్భవతీతిసంతః
యత్రాహమేవం పరిభర్త్స్యమానా జీవామికించిత్ క్షణమ
ప్యపుణ్యా॥ ౩॥

సుఖాద్విహీనం బహుదుఃఖపూర్ణ మిదంతు నూనం హృదయం
స్థిరం మే। విశీర్యతే య న్నసహస్రధాద్య వజ్రాహతం శృంగ
మి వాచలస్య॥ ౪॥

నై వా స్తిదోషో మమనూనమత్ర వధ్యాహ మస్యా ప్రియదర్శ
నస్య। భావం నచాస్యాహ్య మనుప్రదాతు మలం ద్విజో మంత్ర
మి వాద్విజాయ॥ ౫॥

నూనం మమాంగా న్యచిరాదనార్య శ్శస్త్రై శ్శితై శ్ఛేత్స్యతి
రాక్షసేంద్రః। తస్మి న్ననాగచ్ఛతి లోకనాథే గర్భస్థ జం
తో రివ శల్యకృంతః॥ ౬॥

దుఃఖం బతేదం మమదుఃఖితాయా మాసౌ చిరాయా ధిగమి
ష్యతో ద్వౌ। బద్ధస్య వధ్యస్య తథానిశాంతే రాజాపరా
ధా దివ తస్కరస్య॥ ౭॥

హా రామ హా లక్ష్మణ హా సుమిత్రే హా రామమాత స్సహ
మేజనన్యా। ఏషా విపద్యా మ్యహమల్పభాగ్యా మహార్ణవే నౌ
రివ మూఢవాతా॥ ౮॥

౩. ఇట్లు రాక్షసులచే నెల్లవిధములఁ బీడింపఁబడి నీచముగ జీవించి యున్నానుగావున నేను నిర్భాగ్యురాలనని తలఁచెద. పెద్దలు కాలము కాని యపుడు చావుగలుగదని చెప్పుచున్నారు, ఆమాట సత్యమయ్యె. కట కటా !

౪. నాహృదయము వజ్రాయుధముచే నఱుకంబడిన పర్వతశిఖర మువలె వేయిబ్రద్దలుగాక కఠినమైయున్నది. కావున సౌఖ్యము లెఱుంగనేర దనియు ననేకములగు దుఃఖములచే నిండినదనియు స్పష్టమగుచున్నది.

౫. అనిష్టముగఁ గనఁబడుచున్న యీరావణునిచేఁ జంపఁబడుదా ననై యున్నానుగావున నేను దేహమును విడుచుటచేఁ బాపములేదు. (బ్రా హ్మణేతరునకు మంత్రము నుపదేశింపని యట్లుగా) నాయభిప్రాయము నీ చునకు కెఱిఁగింప కుండుదానను.

౬. ఈరెండుమాసములు ముగియునంతలో శ్రీరాముఁడు రానిచో (గర్భమందుఁ జిక్కి వెలికి రాఁజాలకున్న జంతువులను మంగలివాఁడుము క్కలువడ ఖండించునట్లు) మూర్ఖుఁడగు రావణుఁడు కఱకైనఖడ్గములచేత నన్ను ఛేదించుట సత్యము.

౭. దీర్ఘకాలమునుండి దుఃఖించుచున్న నాకు రావణుఁడు నియ మించిన రెండునెలలకాలము తుదముట్టుచున్నది. రాజద్రోహము చేసినం దులకై కట్టివేయంబడియున్నవాఁడు మఱుసటియుదయమునఁ దన్నుం జం పుటను దలంచితలంచి రేయెల్ల దుఃఖించునట్లు నాకును దుఃఖముగలిగియు న్నది. కటకటా !

౮. హా రామ ! హా లక్ష్మణా ! రామునితల్లివగు నో యమ్మా ! అ య్యో ! సుమిత్రా ! నాతల్లి మొదలుగ నదృష్టహీనురాలనగు నేను మహా సముద్రమున దిక్కుతెలియని జోరుగాలిచే నల్లాడు నోడవలె నాపదయం దుఁ దగుల్కొని యున్నదానను.

తరస్వినా ధారయతా మృగస్య సత్త్వేనరూపం మనుజేంద్రపు
త్రౌ। నూనంవిశస్తౌ మమకారణాత్తౌ సింహర్షభౌ ద్వావివ
వైద్యుతేన॥ ౯॥

నూనం సకాలో మృగరూపధారీ మామల్పభాగ్యాం లులుభే
తదానీం। యత్రార్యపుత్రం విససర్జమూఢా రామానుజం ల
క్ష్మణ పూర్వజం చ॥ ౧౦॥

హా రామ సత్యవ్రత దీర్ఘబాహో హా పూర్ణచంద్ర ప్రతిమా
నవక్త్ర। హా జీవలోకస్యహితః ప్రియ శ్చ వధ్యాం నమాం
వేత్సిహి రాక్షసానామ్॥ ౧౧॥

అనన్య దైవత్వ మియంక్షమా చ భూమౌ చ శయ్యా నియమ
శ్చ ధర్మే।పతివ్రతాత్వం విఫలం మమేదం కృతం కృతఘ్నేష్వి
వ మానుషాణామ్॥ ౧౨॥

మోఘోహి ధర్మశ్చరితో మయాయం తథైకపత్నీత్వ మిదం
నిరర్థం। యాత్వాం నపశ్యామి కృశా వివర్ణా హీనా త్వయా
సంగమనే నిరాశా॥ ౧౩॥

పితుర్నిదేశం నియమేన కృత్వా వనాన్నివృత్త శ్చరిత వ్ర
తశ్చ। స్త్రీభిస్తుమన్యే విపులేక్షణాభి స్త్వంరంస్యసే వీతభయః
కృతార్థః॥ ౧౪॥

౯. లేడివలె వేషమునుధరించిన మారీచునిచేత, ఆరాచబిడ్డ లిరువురును సత్యముగా నానిమిత్తమై(పిడుగుచేఁ గూల్పంబడిన సింగపు కొదమలవలె) చంపఁబడిరి.

౧౦. తెలివిమాలినదాననై నేను పూజ్యులగు శ్రీరామలక్ష్మణులను నెప్పుడు విడిచితినో యప్పుడే నాదౌర్భాగ్యకాలము లేడియైవచ్చి నాయెదుటనుండి నాకాశ కొలిపెను,

౧౧. అయ్యో! రామ! సత్యమును వ్రతముగాఁగలవాఁడ! మోకాళులవఱకు వ్యాపించు చేతులుగలవాఁడా! కటకటా! నిండుచందురుంబోలిన ముఖముంగలవాఁడ! జంతుజాలమున కిష్టమును ననుకూలము నగువాఁడ! నన్ను రాక్షసులు చంపందలఁచియుండుట నీవెఱుంగవా?

౧౨. భర్త తప్ప వేరు దైవము లేఁడని యుండుటయు, ఇట్లుమెండుగ నోర్పును, నేలఁబరుండుటయు, న్యాయమందు రుచియు, పతివ్రతాధర్మమును, మేలుమఱచునట్టి ఘాతుకునకుఁ జేయంబడిన మనుష్యకర్మవలె వ్యర్థమగుచున్నది.

౧౩. ఓ రామా? చిక్కియున్నదానను, కాంతిసెడినదానను నయి నీపొందునుగోరుచు నది లభింపమిచే నాశచెడియున్నదాననై నిన్నుం గనఁజాలకున్న నాచేతఁ జేయంబడిన పుణ్యములన్నియు వ్యర్థము లేకదా? అట్లేకదా! నీయేకపత్నీ వ్రతముగూడ వ్యర్థమయ్యెను.

౧౪. నీతండ్రియొక్క యాజ్ఞను జక్కఁగా నడపి, మఱలినవాఁడవై భయమువిడిచి ధన్యుఁడవై, విశాలమగు కన్నులుగల స్త్రీలతోడ హాయిగ విహరించుచున్నావని తలఁచెదఁ బ్రాణేశా?

అహంతు రామ త్వయిజాతకామా చిరం వినాశాయ నిబద్ధ
భావా। మోఘం చరిత్వాథ తపోవ్రతం చ త్యక్ష్యామి ధిగ్జీవిత
మల్పభాగ్యా॥ ౧౫॥

సాజీవితం క్షిప్రమహం త్యజేయం విషేణ శస్త్రేణ శితేన
వాపి। విషస్యదాతా న హి మేఽస్తికశ్చి చ్ఛస్త్రస్యవా వేశ్మని
రాక్షసస్య॥ ౧౬॥

ఇతీ వ దేవీ బహుధా విలప్య సర్వాత్మనా రామమనుస్మ
రంతీ। ప్రవేపమానా పరిశుష్కవక్త్రా నగోత్తమం పుష్పిత
మాససాద॥ ౧౭॥

శోకాభితప్తా బహుధావిచింత్య సీతాథవేణ్యుద్గ్రథనం గృ
హీత్వా। ఉద్బధ్య వేణ్యుద్గ్రథనేన శీఘ్రమహం గమిష్యామి
యమస్య మూలమ్। ఉపస్థితా సా మృదుసర్వగాత్రీ శాఖాం
గృహీత్వాథ నగస్యతస్య॥ ౧౮॥

తస్యాస్తురామం ప్రవిచింతయంత్యా రామానుజం స్వం చ కు
లం శుభాంగ్యాః॥ ౧౯॥

శోకా నిమిత్తాని తథా బహూని ధైర్యార్జితాని ప్రవరాణి
లోకే। ప్రాదుర్నిమిత్తాని తదా బభూవుః పురాపి సిద్ధాన్యుపల
క్షితాని॥ ౨౦॥

ఇతి శ్రీమత్సుందరకాండే - అష్టావింశస్సర్గః.



౧౫. ఓ శ్రీరామా? అదృష్ట హీనురాలనగు నేను నీయందుఁ జిరకాలమునుండి యిచ్ఛగలదాననై పిమ్మట వ్యర్థమగు వ్రతములను జపములను జేసి చచ్చుట కుద్దేశించి నింద్యమగు నాప్రాణములను విడచెదను.

౧౬. విషముచేతనేని, తీక్ష్ణమగు నాయుధముచేతనేని శీఘ్రమునఁ బ్రాణములవిడచెదను. ఈ రాక్షసుని కొంపయందు విషమేని ఖడ్గమేని మక్ష్యముగా నిచ్చునట్టిదాత యొకఁడును లేఁడు.

౧౭. మిక్కిలివడఁకుచున్నదియు, నోరెండినదియునగుసీత యిటు పెక్కుతెఱంగులశోకించి, సర్వవిధములచేతను శ్రీరామునిఁదలంచుచు తెస్సగఁబూచియున్న యశోకవృక్షమును జేరెను:

౧౮, ౧౮౪. అటుపిమ్మట శోకముచే లెస్సగఁ గ్రాఁగినదియుఁ గోమలమగు దేహమునుగలదియు నగుసీత మిక్కిలిగఁ జింతించి జడను జేతఁబట్టుకొని దీనిచేత నురిపోసికొని శీఘ్రమున యమునిమందిరమును జేరెదనని పలికి యాచెట్టుకొమ్మను జేతఁబట్టుకొని యుండెను.

౧౯, ౨౦. శ్రీరాముని లక్ష్మణుని తనవంశమును గూర్చి యోచించుచున్నదియు నందకత్తెయు నగునాసీతకు దుఃఖనిమిత్తములుగానివియు ధైర్యమును గలిగించునవియు నగుశకునములు పెక్కులు, మున్నూహింపఁబడినవియైనను ప్రత్యక్షఫలమును గలిగించునవిగాఁ గలిగెను.

ఇది యిరువదియెనిమిదవ సర్గ.

—:0:—

## ఏకోన త్రింశస్సర్గః.

తథాగతాం తాం వ్యథితా మనిందితాం వ్యపేతహర్షాం ప
రిదీన మానసామ్ । శుభాం నిమిత్తాని శుభాని భేజిరే నరం
శ్రియాజుష్ట మివోపజీవినః॥ ౧।

తస్యా శ్శుభం వామ మరాళపక్ష్మ రాజీవృతం శుక్లవిశాలకృ
ష్ణమ్ । ప్రాస్పందతైకం నయనం సుకేశ్యా మీనాహతం పద్మ
మివాభి తామ్రమ్॥ ౨।

భుజశ్చ చార్వంచితపీనవృత్తః పరార్ధ్యకాలాగరు చంద
నార్హః । అనుత్తమేనాధ్యుషితః ప్రియేణ చిరేణవామ స్సమ
వేప తాశు॥ 3।

గజేంద్రహస్త ప్రతిమశ్చపీనస్తయోర్ద్వయో స్సంహతయో
స్సుజాతః । ప్రస్పందమానః పునరూరురస్యా రామం పురస్తా
త్స్థిత మాచచక్షే॥ ౪।

శుభం పున ర్హేమసమానవర్ణ మీషద్రజోధ్వస్త మివామలా
క్ష్యాః । వాసస్స్థితాయా శ్శిఖరాగ్రదత్యాః కించిత్పరిస్రం
సత చారుగాత్ర్యాః॥ ౫।

ఏతైర్నిమిత్తై రపరైశ్చ సుభ్రూస్సంబోధితా ప్రాగపి సా
ధుసిద్ధైః । వాతాతపక్లాంత మివ ప్రణష్టం వర్షేణ బీజం ప్రతి
సంజహర్ష॥

## ఇరువదితొమ్మిదవసర్గ.

౧. అట్టి దుఃఖదశయందున్నదియు, మనస్సున బాధగలదియు, శుద్ధురాలును సంతోషములేనిదియు మిక్కిలి మెత్తపడిన మనస్సుగలదియు, మంగళస్వరూపురాలును నగు సీతాదేవిని శుభనిమిత్తములు (సంపదగలవానిని సేవకు లాశ్రయించునట్లు) సేవించెను.

౨. వక్రములైన కనురెప్పల వరుసచేఁ జుట్టంబడినదియు, తెల్లనై విశాలమై నలుపునుగలదియు, తుదలయం దెఱుపు గలదియునగు(సీతాదేవి యొక్క) నెడమకన్ను మాత్రము (చేఁపచేఁ గొట్టంబడిన కమలము గదలు చొప్పున) నదరెను.

౩. అందముచేనొప్పుచు గుండ్రమై బలిసినదైనదియు, శ్రేష్ఠమగు నల్లయగురు చందనమునకుఁదగినదియు, పురుషోత్తముఁడగు భర్తచేఁబట్టంబడినదియు నగు నెడమభుజము శీఘ్రముగ దీర్ఘకాల మదరెను.

౪. ఏనుఁగుతొండమును బోలికగాఁగలవియు, స్థూలమైనవియునందమై పరస్పరము గలిసికొనియున్నవియు నగు సీతయొక్క తొడలురెంటిలో నెడమది యదరుచున్నదై, శ్రీరాముం డెదుటనున్నాఁడని చెప్పునట్లు తోఁచెను.

౫. బంగారుంబోలు వర్ణముగలదియు, కొద్దిగ దుమ్ముచేఁ గప్పంబడినదియు శిఖరముల కొనలవలె సుందరములైన దంతములు గలదియు నిర్మలములగు కన్నులంగలదియు నయియున్న యందకత్తెయగు సీతయొక్క వస్త్రము (వీడిపడినట్లు మఱియొక శుభనిమిత్తముగా) జాఱెను.

౬. ఈశకునములచేతను, ముందే బాగుగ స్ఫురించిన మఱికొన్ని శకునములచేతను లెస్సగ బోధింపఁబడినదియై యందమగు కనుబొమలం గలదియగుసీత (గాలియెండలచే నశించి రూపునెడి మంటిలోఁ గలిసియున్న విత్తనము వానకురియుటతోడనే మొలకయై వెలువడినట్లు) మిక్కిలి సంతోషించెను.

తస్యాః పున ర్బింబఫలాధరోష్ఠం స్వక్షిభ్రుకేశాంత మరాళప
క్ష్మ। వక్త్రం బభాసే సితశుక్లదంష్ట్రం రాహోర్ముఖా చ్చంద్ర
ఇవ ప్రముక్తః॥ ౭॥

సా వీతశోకా వ్యపనీతతంద్రీ శాంతజ్వరా హర్షవివృద్ధసత్త్వా।
అశోభతార్యా వదనేన శుక్లే శీతాంశునా రాత్రి రివోది
తేన॥ ౮॥

ఇతి శ్రీమత్సుందరకాండే-ఏకోనత్రింశస్సర్గః.

---

## త్రింశస్సర్గః.

హనుమా నపి విక్రాంత స్సర్వం శుశ్రావ తత్త్వతః।
సీతాయా స్త్రిజటాయా శ్చ రాక్షసీనాం చ తర్జనమ్॥ ౧॥

అవేక్షమాణ స్తాం దేవీం దేవతా మివ నందనే।
తతో బహువిధాం చింతాం చింతయామాస వానరః॥ ౨॥

యాం కపీనాం సహస్రాణి సుబహూ న్యయుతాని చ।
దిక్షు సర్వాసు మార్గంతే సేయ మాసాదితా మయా॥ ౩॥

చారేణ తు సుయుక్తేన శత్రోః శక్తి మవేక్షితా।
గూఢేన చరతా తావ దవేక్షిత మిదం మయా॥ ౪॥

రాక్షసానాం విశేషశ్చ పురీ చేయ మవేక్షితా।
రాక్షసాధిపతే రస్య ప్రభావో రావణస్య చ॥ ౫॥

౭. దొండపండువంటి పెదవినిగలదియు, అందమగు కనుబొమలు ముఖమునందలిపొడివెండ్రుకలు గలదియు వక్రములగు కనుఱెప్పలు గలదియు తెల్లని దంతములుగలదియు నగు సీతాదేవియొక్క ముఖము (రాహువునోటనుండి విడువంబడిన) చంద్రబింబమువలె నొప్పెను.

౮. పోయిన శోకమునుగలదియు, మానిన తొట్రుపాటు గలదియు, అడఁగిన తాపమును గలదియు, సంతోషముచే వృద్ధిపొందిన బలముంగలదియుఁ బూజ్యురాలును నగుసీతతనమోముచేత (శుక్లపక్షమందుదయించిన చంద్రునితోఁ గూడిన రాత్రివలె) నొప్పెను.

ఇదియిరువది తొమ్మిదవసర్గ.

---

## ముప్పదియవ సర్గ.

౧. పరాక్రమశాలియగు హనుమంతుఁడు సీతయొక్కయు, త్రిజటయొక్కయు వృత్తాంతమును, రాక్షసస్త్రీలు సీతను బెదరించుటయు మొదలగు నంతయు స్పష్టముగ వినియెను.

౨. ఆహనుమంతుఁడు సీతను నందనవనమందున్న వనదేవతవలె నుండఁగాంచి పెక్కువిధములఁ జింతించెను.

౩. వానరులయొక్క వేలకొలఁదియుఁ బదివేలకొలఁదియు నేసీతాదేవిని దిక్కుదిక్కులకేగి వెదకుచున్నవో యట్టిసీత నాచేత నిచ్చోటఁ గనంబడియెను.

౪. యోగ్యుఁడనగు చారుఁడను (ఒక దేశపువర్తమానమును రహస్యముగ నెఱింగి కొనిపోవచ్చిన యన్యదేశస్థుఁడను) శత్రుఁడగు రావణాసురుని శక్తిని గనుచున్నవాఁడను, ఇతరులకుఁ దెలియరాక సంచరించుచున్నవాఁడను నగునాచేత నీచెప్పంబోవు విషయమెల్ల బాగుగఁ జూడంబడియె.

౫. రాక్షసులపెంపును, ఈపట్టణమును రాక్షసరాజగు నీరావణాసురునియొక్క పదవియు నాచేఁ గనంబడియె.

యు_క్తం తస్యా ప్రమేయస్య సర్వసత్వ దయావతః।
సమాశ్వాసయితుం భార్యాం పతిదర్శన కాంక్షిణీమ్॥ ౬॥

అహ మాశ్వాసయా మ్యేనాం పూర్ణచంద్ర నిభాననామ్।
అదృష్టదుఃఖాం దుఃఖార్తాం దుఃఖస్యాంత మగచ్ఛతీమ్॥ ౭॥

యద్యహ్య మిమాం దేవీం శోకోపహాత చేతసామ్।
అనాశ్వాస్య గమిష్యామి దోషవ ద్గమనం భవేత్॥ ౮॥

గతేహి మయి తత్రేయం రాజపుత్రీ యశస్వినీ।
పరిత్రాణ మవిందంతీ జానకీ జీవితం త్యజేత్॥ ౯॥

మయాచ స మహాబాహుః పూర్ణచంద్ర నిభాననః।
సమాశ్వాసయితుం న్యాయ్య స్సీతాదర్శన లాలసః॥ ౧౦॥

నిశాచరీణాం ప్రత్యక్ష మనర్హం చాపిభాషణమ్।
కథంను ఖలు క_ర్తవ్య మిదం కృచ్ఛగతో హ్యహమ్॥ ౧౧॥

అనేన రాత్రిశేషేణ యది నాశ్వాస్యతే మయా।
సర్వథా నా_స్తిసందేహః పరిత్యక్షతి జీవితమ్॥ ౧౨॥

రామశ్చ యదిపృచ్ఛేన్మాం కిం మాం సీతాబ్రవీ ద్వచః।
కిమహం తం ప్రతిబ్రూయా మసంభాష్య సుమధ్యమామ్॥ ౧౩

సీతా సందేశ రహితం మామిత _స్త్వరయాగతమ్।
నిర్దహేదపి కాకుత్స్థః క్రుద్ధ_స్తీ వ్రేణ చక్షుషా॥ ౧౪॥

౬, ౭, ౮. ఊహింపఁ దరముగాని గుణములుగలవాఁడును, సర్వభూతములయందును దయగలవాఁడును నగు శ్రీరామునియొక్క భార్యను (మగని జూడఁ గోరుచున్న దానిని) ఆదరించుటబాగు. నిండుచంద్రునిం బోలు ముఖముగలదియు, దుఃఖముల నెఱుంగనిదియు, దుఃఖముచే నిప్పుడు దగిలియున్నదియు, దుఃఖమునకుఁ గడకానకున్నదియు నగు నీసీతాదేవి నాదరించెదను. దుఃఖముచేఁ జాటుతప్పిన మనసునుగల యీపతివ్రత నాదరింపక యింతటితోఁ బోదునేని నేనుబోవుట దోషమును గలిగించునదియగును.

౯. ఈమెనుగని భాషింపకయే నేనుబోయినచో రాజపుత్రికయుఁ గీర్తిశాలినియు నగు నీదేవి (తన్ను రక్షింతుమన్నమాట నెఱుంగనిదై) ప్రాణముల వదలును.

౧౦. దొడ్డభుజములుగలవాఁడును, నిండుచంద్రునింబోలు మోముగలవాఁడును, సీత నెప్పుడుగాంతునోయని వేఁచియున్నవాఁడును నగు శ్రీరామునింగూడ నిందలి (ఈమెచేఁబలుకంబడు మాటలుగొనిచని యాయనకెఱింగించి) సంగతులచే నూరడించుట ధర్మము.

౧౧, ౧౨. ఈరాక్షసస్త్రీలయెదుట నీమెతో మాటలాడుటతగదు. ఏమిచేయువాఁడను! కష్టమునంజిక్కితిని! ఈమిగిలియున్న రాత్రిపూటయందే యీమెనూరడింపక పోయితినేనిఁ బ్రాణములను విడుచుట సిద్ధము.

౧౩, ౧౪. రాముఁడు నన్నుఁగూర్చి సీతయేమిచెప్పె, నని యడిగినచో (సింగమునడుమువంటి నడుముగల సీతతో మాటలాడకయేపోయి) నేమిచెప్పుదును. సీతపలుని వర్తమానముంగొనక త్వరపడిపోయితినేని శ్రీరామచంద్రుఁడు కోపముగలవాఁడై నిప్పులురాలుకన్నులతో నన్ను దగ్ధముచేయును.

యది చోద్యోజయిష్యామి భర్తారం రామకారణాత్।
వ్యర్థ మాగమనం తస్య ససైన్యస్య భవిష్యతి॥ ౧౫॥
అంతరం త్వహ మాసాద్య రాక్షసీనా మిహాస్థితః।
శనై రాశ్వాసయిష్యామి సంతాపబహుళా మిమామ్॥ ౧౬॥
అహం త్వతితనుశ్చైవ వానరశ్చ విశేషతః।
వాచం చోదాహరిష్యామి మానుషీ మిహ సంస్కృతామ్॥ ౧౭॥
యదివాచం ప్రదాస్యామి ద్విజాతి రివ సంస్కృతామ్।
రావణం మన్యమానా మాం సీతా భీతా భవిష్యతి॥ ౧౮॥
వానరస్య విశేషేణ కథం స్యా దభిభాషణమ్।
అవశ్యమేవ వక్తవ్యం మానుషం వాక్య మర్థవత్॥ ౧౯॥
మయా సాంత్వయితుం శక్యా నాన్యథేయ మనిందితా। ౧౯½
సేయ మాలోక్య మేరూపం జానకీ భాషితం తథా॥ ౨౦॥
రక్షోభి స్త్రాసితా పూర్వం భూయ స్త్రాసం గమిష్యతి।
తతో జాత పరిత్రాసా శబ్దం కుర్యా న్మనస్వినీ॥ ౨౧॥
జానమానా విశాలాక్షీ రావణం కామరూపిణమ్। ౨౧½
సీతయాచ కృతే శబ్దే సహసా రాక్షసీ గణః॥ ౨౨॥
నానాప్రహరణో ఘోర స్సమేయా దంతకోపమః।
తతో మాం సంపరిక్షిప్య సర్వతో వికృతాననాః॥ ౨౩॥
వధే చ గ్రహణే చైవ కుర్యు ర్యత్నం మహాబలమ్॥ ౨౩½

౧౫, ౧౬. ఈమెతో భాషింపకయే చని నాప్రభుఁడగు సుగ్రీవుని శ్రీరామునిపనికై యుద్ధమున కిచ్చుటకిఁ బిలచికొనివచ్చినను, అదియు వ్యర్థమేయగును. ఈరాక్షసస్త్రీలిందొడలుమఱచియున్నపుడుగాని, మఱియెందేని చనినపుడుగాని యవకాశముంగని (దుఃఖముచే జీర్ణించియున్న) యాదేవిని మిక్కిలియాదరించెదఁ గాక.

౧౭, ౧౮. నేను సూక్ష్మమగు శరీరమునుగలవాఁడనై యీమె దగ్గరచేరి నిర్దోషమగు మనుష్యవాక్కులచే విషయమును లెస్సగ భాషించెదను. అట్లు నిర్దోషమగుమనుష్యవాక్కులచే బ్రాహ్మణునివలె మాటలాడితినేని నేను వాస్తవముగ వానరుఁడనని తలఁపకపోవుట మాత్రమేకాక రావణుం డీవేషముతో వచ్చెననియెంచియు భయపడును.

౧౯, ౧౯½. మర్కటమున కితరులతో నధికముగా మాటలాడుశక్తియెందుఁగలదు ? లేదుగావున నభిప్రాయమును దెలుపునంతపాటిగ మనుష్యవాక్కులతోడనె భాషించెదను. ఇట్లుగాక మఱియేచొప్పునను యోగ్యురాలగు నీసీతతో భాషించుట యుక్తముగాదు.

౨౦ నుండి ౨౧½. మున్నే రాక్షసులచే భయపెట్టంబడినది యగు జానకి నారూపమును నాసంభాషణమును గని మఱల భీతిల్లంగలదు. అట్లు భయపడుచో నన్నుఁ గామరూపమునుధరించిన రావణాసురుఁడని తలంచి యఱచును.

౨౨ నుండి ౨౩½. సీత యట్లు ధ్వనిచేసినతోడనే యమునింబోలె భయంకరమగు రాక్షసస్త్రీలగుంపు నానావిధాయుధములను ధరించి మీఁదికివచ్చును. మిక్కిలి బలముగల రాక్షసస్త్రీలు నన్ను నలుప్రక్కలఁ జుట్టుకొని నెట్టుటకుం జింపుటకుఁ గట్టుటకు యత్నించెదరు.

వృక్షాణాం శాఖాః ప్రశాఖాశ్చ స్కంధాంశ్చోత్తమ శాఖినామ్।
దృష్ట్వా విపరిధావంతం భవేయు ర్భయశంకితాః।
మమరూపం చ సంప్రేక్ష్య వనే విచరతో మహత్॥ ౨౪॥
రాక్షస్యో భయవిత్రస్తా భవేయు ర్వికృతాననాః॥ ౨౪½
తతః కుర్యు స్సమాహ్వానం రాక్షస్యో రాక్షసానపి॥ ౨౫॥
రాక్షసేంద్ర నియుక్తానాం రాక్షసేంద్ర నివేశనే।
తే శూల శక్తినిస్త్రింశ వివిధాయుధ పాణయః॥
ఆపతేయు ర్విమర్దే స్మిన్ వేగే నోద్విగ్న కారిణః॥ ౨౬½
సంరుద్ధ స్తైస్తుపరితో విధమ న్రక్షసాం బలమ్॥ ౨౭॥
శక్నుయాం న్నతుసంప్రాప్తుం పరంపారం మహోదధేః।
మాంవా గృహ్ణీయు రాప్లుత్య బహవ శ్శీఘ్రకారిణః॥
స్యాదియం చాగృహీతార్థా మమచ గ్రహణం భవేత్ ౨౯½
హింసాభిరుచయో హింస్యు రిమాం వా జనకాత్మజామ్॥ 30॥
విపన్నం స్యా త్తతఃకార్యం రామసుగ్రీవయో రిదమ్॥ 30½
ఉద్దేశే నష్టమార్గేస్మి న్రాక్షసైః పరివారితే॥ 31॥
సాగరేణ పరిక్షిప్తే గుప్తే వసతి జానకీ।
విశస్తే వా గృహీతేవా రక్షోభి ర్మయి సంయుగే॥ 32॥
నాన్యం పశ్యామి రామస్య సాహాయ్యం కార్యసాధనే।
విమృశం శ్చ నపశ్యామి యోహతే మయి వానరః॥
శతయోజన విస్తీర్ణం లంఘయేత మహోదధిమ్॥ 33½

౨౪ నుండి ౨౫½. రాక్షసస్త్రీలు పెద్దకొమ్ములను జెమ్ములను, చెట్ల మొదళ్లను బట్టుకొని యుద్ధమునకుం బరుగెత్తుచున్న నన్నుంగని, ఈవనమునం దదిరుగుచున్న నాగొప్పరూపమును గాంచి భయముచే జంకినవారగుదురు. దానిచేతనే కలతనొందిన రూపములను గలవారగుదురు.

౨౬ నుండి ౨౭½. అట్లైన నీస్త్రీలు రాక్షసులను బిలుతురు. రాక్షసరాజునగరుకడ నాతనిచే నియమింపఁబడినవారిలోఁ గొందఱు శూలము ఖడ్గము మొదలగు నాయుధముల ధరించి భయంకరులై దొమ్మిగా మొత్తములయి వేగవత్తురు.

౨౮ నుండి ౨౯½. అట్లువారిచే నలుప్రక్కలముట్టడింపఁబడినవాఁడనయి యాసేనను దూలఁగొట్టుచుంటినేని నేను సముద్రముయొక్క యవ్వలిగట్టును జేరనేరను. ఇట్లు చిక్కుపడు నన్ను వేగవంతులగు రాక్షసులు సమీపించి పట్టుకొనినను గొనఁగలరు. అట్లు నేను జిక్కనే చిక్కితినేని శ్రీరామునివృత్తాంత మీసీతాదేవికిం దెలియుట సున్నయగును.

౩౦, ౩౦½. అదిమాత్రముగాక జీవహింసయందు రుచిగలవాండ్రగు నీరాక్షసులు సీతను జంపినను జంపుదురు. అట్లునడచునేని శ్రీరామసుగ్రీవుల కార్యము స్పష్టముగఁ జెడును.

౩౧ నుండి ౩౩½. త్రోవలేనిదియు, రాక్షసులచేఁ జుట్టంబడినదియు, రహస్యమైనదియు నలుప్రక్కల సముద్రపునలల తాకుఁగలదియు నగునీమిట్టపై సీత యునుంపబడియున్నది. వీరితోడ యుద్ధముచేసి నేనుజచ్చినను, వీరిచేఁ జిక్కుపడినను శ్రీరాముని కార్యమును నెఱవేర్చువారు కుఱలేరు. నేనుజచ్చితినేని యేవానరుఁ డిదియంతయు వెదుకఁగలఁడు ? ఎవండీ నూఱామడల సముద్రమును దాఁటువాఁడు ? అట్టివాఁడుగలఁడని నాకుఁదోఁచదు !

కామం హంతుం సమర్థోస్మి సహస్రాణ్యపి రక్షసామ్॥ ౩౪॥
నతు శక్ష్యామి సంప్రాప్తుం పరంపారం మహోదధేః।
అసత్యాని చ యుద్ధాని సంశయో మే నరోచతే॥
కశ్చ నిస్సంశయం కార్యం కుర్యాత్ ప్రాజ్ఞస్ససంశయమ్॥ ౩౫॥
ప్రాణత్యాగశ్చ వైదేహ్యా భవే దనభిభాషణే॥ ౩౬॥
ఏషదోషో మహాన్ హిస్యా న్మమ సీతాభిభాషణే।
భూతాశ్చార్థా విపద్యన్తే దేశకాల విరోధితాః॥
విక్లబం దూత మాసాద్య తమ స్సూర్యోదయే యథా॥ ౩౭॥
అర్థానర్థాంతరే బుద్ధి ర్నిశ్చి తాపి నశోభతే॥ ౩౮॥
ఘాతయంతి హి కార్యాణి దూతాః పండితమానినః।
నవినశ్యే త్కథం కార్యం వైక్లబ్యం నకథంభవేత్॥ ౩౯॥
లంఘనం చ సముద్రస్య కథంను న వృథాభవేత్।
కథంను ఖలు వాక్యంమే శృణుయా న్నో ద్విజేత వా।
ఇతి సంచింత్య హనుమాం శ్చకార మతిమా న్మతిమ్॥ ౪౦॥
రామ మక్లిష్టకర్మాణం స్వబంధు మనుకీర్తయన్॥ ౪౧॥
నైనా ముద్వేజయిష్యామి తద్బంధుగత మానసామ్।
ఇక్ష్వాకూణాం వరిష్ఠస్య రామస్య విదితాత్మనః॥ ౪౨॥
శుభాని ధర్మయుక్తాని వచనాని సమర్పయన్।
శ్రావయిష్యామి సర్వాణి మధురాం ప్రబ్రువన్ గిరమ్॥
శ్రద్ధాస్యతి యథాహీయం తథా సర్వంసమాదధే॥ ౪౩॥

౩౪ నుండి ౩౫శ్లో. నేను రాక్షసులను వేలకొలంది నిర్మూలింపఁ జేయఁగలనుగాని, ఆపనిచేసినపిమ్మట సముద్రమును దాఁటుట యసాధ్యమగును. యుద్ధములలో జయమేపొందుదుమనుట యబద్ధము. సందేహమునుగల విషయమునఁ బ్రవేశింప నాకిష్టములేదు. బుద్ధిమంతుఁ డెవ్వఁడును సందేహముగలవిషయమును నిస్సందేహముగాఁ బూనఁడు.

౩౬ నుండి ౩౭శ్లో. సీతతో మాటలాడనిచో నామె ప్రాణమునువిడుచును. మాటలాడినచో నీచెప్పంబడినంత యనర్థము పొసఁగినను బొసఁగును. సిద్ధములుగనున్న విషయములుగూఁడ దెలివిలేనిదూతయొక్క మౌఢ్యతచే (సూర్యోదయముచేఁ జీఁకటిచెడినట్లు) దేశకాల విరోధములను జెంది నశించుచున్నవి.

౩౮ నుండి ౪౦శ్లో. ఇదితగు నిదితగదని యోచించి నిశ్చయింపఁబడినబుద్ధికూడ మూఢుఁడగుదూతను బొందినపుడు వ్యర్థమగుచున్నది. చాలినంత తెలివిలేకయే పండితులమని గర్వించునట్టిదూతలు కార్యములను జెఱచుచున్నారుగదా! అట్టివారికిఁ గార్యమెట్లుచెడదు? అవివేకమెట్లు గలుగదు? ఇంతటిసముద్రమునుదాఁటుట వ్యర్థమెట్లుకాదు? నామాటనెట్లుసీత వినును? ఎట్లుభయపడకుండును? అనియోచించి బుద్ధిమంతుఁడగు హనుమంతుఁడు నిశ్చయించెను.

౪౧ నుండి ౪౩శ్లో. శ్రమను గలిగింపని కార్యముగలవాఁడును, తనకు బంధువును (ప్రియముగలవాఁడును) నగురాముని దలంచుచు నాతని బంధువులను జెందిన మనస్సునుగలిగియున్న యీసీతను నేనుభయపెట్టను. ఇక్ష్వాకువంశమువారిలో నుత్తముఁడును సీతయొక్క భావము నెఱింగినవాఁడును నగు శ్రీరామమూర్తియొక్క మంగళకరమై ధర్మయుక్తమునైనమాటలనుదెలుపుచు నింపైనపలుకులు గట్టిగాఁ బలుకువాఁడను. అటుపైనీమె యెట్లు తలంచునో చూతమని నిశ్చయించెను.

ఇతి స బహువిధం మహానుభావో జగతిపతేః ప్రమదా మవే
క్షమాణః । మధుర మవితథం జగాద వాక్యం ద్రుమవిటపాంత
ర మాస్థితో హనూమాన్॥ ౪౪॥

ఇతి శ్రీమత్సుందరకాండే - త్రింశస్సర్గః.

ఏకత్రింశస్సర్గః.

ఏవం బహువిధాం చింతాం చింతయిత్వా మహాకపిః
సంశ్రవే మధురం వాక్యం వైదేహ్యా వ్యాజహారహ॥ ౧॥

రాజా దశరథో నామ రథకుంజర వాజిమాన్।
పుణ్యశీలో మహాకీర్తి ఋజురాసీ న్మహాయశాః॥ ౨॥

రాజర్షీణాం గుణశ్రేష్ఠ స్తపసా చర్షిభిస్సమః।
చక్రవర్తికులే జాతః పురందర సమో బలే॥ ౩॥

అహింసారతి రక్షుద్రో ఘృణీ సత్యపరాక్రమః।
ముఖ్య శ్చేక్ష్వాకు వంశస్య లక్ష్మీవాన్ లక్ష్మివర్ధనః॥ ౪॥

పార్థివ వ్యంజనై ర్యుక్తః పృథుశ్రీః పార్థివర్షభః।
పృథివ్యాం చతురంతాయాం విశ్రుత స్సుఖద స్సుఖీ॥ ౫॥

౪౪౫. గొప్పవాఁడగు హనుమంతుఁడు రాజోత్తముఁడగు శ్రీరాముని దేవియగు సీతనుగూర్చి యిట్లు పెక్కుతెఱంగుల యోచించుచు నాచెట్టుకొమ్మలయందు దాఁగియున్నవాఁడై విననింపైనదియు సత్యమైనదియు వ్యర్థముగానిదియు నగుపలుకు పలికెను.

"ఇది ముప్పదియవసర్గ.

---

ముప్పదియొకటవసర్గ.

౧. ఆవానరోత్తముం డిట్లు పెక్కుతెఱంగుల యోచించి, సీతకు మాత్రము వినందగునంతదూరముననుండి యింపగుమాట నామెకు వినిపించెను. ఆశ్చర్యము !

౨ నుండి ౫కు. రథములు యేనుంగులు గుఱ్ఱములు గలవాఁడును, పుణ్యస్వభావము గలవాఁడును, దొడ్డకీర్తిగలవాఁడును, సరియగు నడవడి గలవాఁడును, (౩) రాజఋషులలో నుత్తముఁడును, తపస్సుచే మహర్షులతో సమానుఁడును, చక్రవర్తులుపుట్టిన కులమందుఁ బుట్టినవాఁడును, బలమున దేవేంద్రునితోఁ దుల్యుఁడును, (౪) జీవహింస చేయకుండుటయం దిష్టము గలవాఁడును, అల్పుఁడుగానివాఁడును, దయగలవాఁడును, సత్యమగు పరాక్రమముగలవాఁడును, ఇక్ష్వాకుకులము వారిలో ముఖ్యుఁడును, రాజ్యలక్ష్మిని గలవాఁడును, సంపదను వృద్ధిచేయువాఁడును (౫) రాజచిహ్నములతోఁ గూడినవాఁడును, గొప్పకాంతిగలవాఁడును, రాజోత్తముఁడును భూమియొక్క నాల్గు కడలయందును బ్రసిద్ధి గాంచినవాఁడును, జనులకు సౌఖ్యమును గలిగించువాఁడును, సౌఖ్యము ననుభవించువాఁడును, నగు దశరథుఁడను రాజు గలఁడు.

తస్య పుత్రః ప్రియో జ్యేష్ఠ స్తారాధిప నిభాననః।
రామో నామ విశేషజ్ఞ శ్శ్రేష్ఠ స్సర్వ ధనుష్మతామ్॥ ౬॥
రక్షితా స్వస్య ధర్మస్య స్వజనస్య చ రక్షితా।
రక్షితా జీవలోకస్య ధర్మస్య చ పరంతపః॥ ౭॥
తస్య సత్యాభిసంధస్య వృద్ధస్య వచనా త్పితుః।
సభార్య స్సహ చ భ్రాత్రా వీరః ప్రవ్రాజితో వనమ్ ౮॥
తేన తత్ర మహారణ్యే మృగయాం పరిధావతా।
రాక్షసాని హతాన్యాసన్ బహవః కామరూపిణః॥ ౯॥
జనస్థాన వధం శ్రుత్వా హతౌ చ ఖరదూషణౌ।
తత స్త్వమర్షా పహృతా జానకీ రావణేన తు॥ ౧౦॥
వంచయిత్వా వనే రామం మృగరూపేణ మాయయా॥ ౧౦½
స మార్గమాణ స్తాం దేవీం రామ స్సీతా మనిందితామ్॥ ౧౧॥
ఆససాద వనే మిత్రం సుగ్రీవం నామ వానరమ్।
తత స్స వాలినం హత్వా రామః పరపురంజయః॥ ౧౨॥
ప్రాయచ్ఛ త్కపిరాజ్యం తత్సుగ్రీవాయ మహాబలః॥ ౧౨½
సుగ్రీవేణాపి సందిష్టా హరయః కామరూపిణః ౧౩॥
దిక్షు సర్వాసు తాం దేవీం విచిన్వంతి సహస్రశః।
అహం సంపాతివచనా చ్ఛతయోజన మాయతమ్॥ ౧౪॥
అస్యా హేతో ర్విశాలాక్ష్యా స్సాగరం వేగవాన్ ప్లుతః।
యథారూపాం యథావర్ణాం యథాలక్ష్మీం చ నిశ్చితామ్।
అశ్రౌషం రాఘవస్యాహం సేయమాసాదితా మయా॥ ౧౫½

౬, ౭, ౮. ఆ దశరథమహారాజునకుఁ బ్రియుండును, పెద్దకొడుకు ను, చంద్రునింబోలు మోముగలవాఁడును, సర్వమెఱింగినవాఁడును, ధను స్సును ధరించినవారిలోనెల్ల నుత్తముఁడును, (౭) తనకులధర్మమును ర క్షించువాఁడును, బంధువుల నాదరించువాఁడును, సర్వజంతుజాలమును ధర్మమును గాపాడువాఁడును, శత్రువుల నడికించువాఁడును శూరుఁడును నగు శ్రీరాముఁడను ప్రఖ్యాతిగన్నవాఁడు (౮) సత్యమగు ప్రతిజ్ఞ గలవాఁ డును, వృద్ధుఁడునునగు తనతండ్రియొక్క మాటవలన భార్యను దమ్ముని వెంటఁగలవాఁడై వనములకేగెను.

౯, ౧౦, ౧౦౪. ఆపెద్దయడవియందు వేఁటాడఁదిరుగుచున్న శ్రీరా మునిచేతఁ బెక్కండ్రు శూరులును, కామరూపములను ధరించియున్న రా క్షసులును జంపఁబడిరి. (౧౦) జనస్థానమునఁ బదునాల్గువేల సేన చంపఁ బడుటయు ఖరదూషణులు కూల్పఁబడుటయు విని, మాయచే నొకలేడినిగ ల్పించి దానిచే శ్రీరాముని మోసముగా వనమునకనిచి క్రోధముచేఁ గామ రూపమునుధరించిన రావణునిచేఁ సీత హరింపఁబడియెను.

౧౧ నుండి, ౧౨౪. అంతట శ్రీరాముఁడు పుణ్యవతియగు సీతను వెదకుచు వనమందు సుగ్రీవుఁడనువానరుని మిత్రునిఁగాఁబొందెను. అటుపై శత్రువులపురముల జయించువాఁడును బలశాలియు నగురాముఁడు వాలిని జంపి యారాజ్యమును సుగ్రీవునకిచ్చెను.

౧౩ నుండి, ౧౫౪. కోరినరూపమును ధరింపఁగల వానరులను వేన వేలమందిని సర్వదిశలకు సుగ్రీవుండు సీతాదేవిని వెదుకఁ బనిచెను. నేను సంపాతియనుపక్షి చెప్పినమాటనువిని నూఱామడల వెడల్పుగల యీస ముద్రమును సీతను వెదుకుటకయి వేగమునదాఁటితిని. శ్రీరామునిచేఁ జె ప్పఁబడినచొప్పున రూపమును శరీరకాంతిని సౌందర్యమునుగల యీ దే వి నాచేఁ జూడంబడినది?

విరరా మైవ ముక్త్వా సా వాచం వానరపుంగవః॥ ౧౫
జానకీ చాపి తచ్ఛ్రుత్వా విస్మయం పరమంగతా।
తతస్సా వక్రకేశాంతా సుకేశీ కేశసంవృతమ్॥ ౧౬
ఉన్నమ్య వదనంభీరు శ్శింశుపావృక్ష మైక్షత॥ ౧౭
నిశమ్య సీతా వచనం కపేశ్చ దిశశ్చ సర్వాః ప్రదిశశ్చ వీక్ష్య
స్వయం ప్రహర్షం పరమం జగామ సర్వాత్మనా రామమను
స్మరంతీ॥ ౧౮
సాతిర్యగూర్ధ్వం చ తథాప్యధస్తా న్నిరీక్షమాణా త మచింత్య
బుద్ధిమ్।దదర్శ పింగాధిపతే రమాత్యం వాతాత్మజం సూర్యమి
వోదయస్థమ్॥ ౧౯

ఇతి శ్రీమత్సుందరకాండే - ఏకత్రింశస్సర్గః.

## ద్వాత్రింశస్సర్గః.

తత శ్శాఖాంతరే లీనం దృష్ట్వా చలితమానసా।
వేష్టితార్జున వస్త్రంతం విద్యుత్సంఘాత పింగళమ్॥ ౧
సా దదర్శ కపింతత్ర ప్రశ్రితం ప్రియవాదినమ్।
ఫుల్లాశోకోత్కరాభాసం తప్తచామీకరేక్షణమ్॥ ౨
మైథిలీ చింతయామాస విస్మయం పరమంగతా।
అహోభీమ మిదంరూపం వానరస్య దురాసదమ్॥ ౩
దుర్నిరీక్ష మితిజ్ఞాత్వా పునరేవ ముమోహ సా॥ ౪

౧౬ నుండి, ౧౭౪. అనిపలికి వానరోత్తముం డూరక యుండెను, సీతాదేవియు నామాటనువిని మిక్కిలి యాశ్చర్యమందెను. వంకరగానున్న తలవెండ్రుకల కొనలుగలదియు, అందమగు వెండ్రుకలం గలదియు నగు నాసీత పొడివెండ్రుకలచేఁ గ్రమ్మియున్నదగు మోమునెత్తి భయపడుచు నాచెట్టును గాంచెను.

౧౮ నుండి, ౧౯౪. సీతాదేవి వానరునిమాటనువిని నాల్గు దిక్కులను మూలలనాల్గింటిని గాంచిమనోవాక్కాయకర్మములచేతను శ్రీరాముని దలంచుచుఁ దానుమిక్కిలి యానందమునందెను. ఆసీతప్రక్కలనుగ్రిందిభాగమును మీఁదను జూచుచుండినదై, వర్ణింపనలవికాని బుద్ధినిగలవాఁడును, వానరరాజగు సుగ్రీవునకుమంత్రియు వాయుపుత్రుఁడును నగు హనుమంతుని (ఉదయ పర్వతమునందున్న సూర్యునింగాంచినట్లు) కనెను.

ఇది ముప్పదియొకటవసర్గ.

—:0:—

ముప్పది రెండవసర్గ.

౧, ౨. అటుపిమ్మట సీతాదేవి చెట్టుయొక్క కొమ్మల నడుమ దాఁగినవానిని, ధరింపఁబడిన తెల్లనివస్త్రమునుగలవానిని, మెఱుపుల మొత్తమువలెఁ బచ్చగనున్నవానిని, అచెట్టుననిమిడి యనుకూల వాక్యమును బలుకుచున్నవానిని, పూచిన యశోకవృక్షమువలె మిక్కిలి యొప్పుచున్నవానిని, కుందనపు బంగారమువంటి కన్నులుగలవానిని జలించిన మనస్సుతోఁ జూచెను.

౩, ౩౪. ఆజానకి మిక్కిలి యాశ్చర్యమును జెందినదియై యిట్లు యోచించెను. వానరునియొక్క భయంకరమగు నీరూపము వింతగనున్నది. దీనిని సమీపించుటయుఁ గన్నెత్తిచూచుటయు నసాధ్యము, అనియెంచి సీతాదేవి మఱల భ్రమచెందెను.

విలలాప భృశంసీతా కరుణం భయమోహితా॥ ౪॥

రామరామేతి దుఃఖార్తా లక్ష్మణేతి చ భామినీ।
రురోద మధురం సీతా మందం మందస్వరా సతీ॥ ౫॥

సా తం దృష్ట్వా హరిశ్రేష్ఠం వినీతవ దుపస్థితమ్।
మైథిలీ చింతయామాస స్వప్నోయమితి భామినీ॥ ౬॥

సా వీక్షమాణా పృథుభుగ్నవక్త్రం శాఖామృగేంద్రస్య య
థోక్తకారమ్। దదర్శ పింగాధిపతే రమాత్యం వాతాత్మజం బు
ద్ధిమతాం వరిష్ఠమ్॥ ౭॥

సా తం సమీక్ష్యైవ భృశం విసంజ్ఞా గతాసుకల్పేవ బభూవ
సీతా। చిరేణ సంజ్ఞాం ప్రతిలభ్య భూయో విచింతయామాస
విశాల నేత్రా॥ ౮॥

స్వప్నే మయాయం వికృతోద్య దృష్ట శ్శాఖామృగ శ్శాస్త్రగణై
ర్నిషిద్ధః। స్వస్త్యస్తు రామాయ సలక్ష్మణాయ తథా పితుర్మే
జనకస్య రాజ్ఞః॥ ౯॥

స్వప్నోపి నాయం నహిమేస్తి నిద్రా శోకేన దుఃఖేన చ పీడి
తాయాః। సుఖంహి మే నాస్తి యతోస్మి హీనా తేనేందుపూ
ర్ణ ప్రతిమాననేన॥ ౧౦॥

౪, ౫. మీఁదఁ జెప్పంబడినట్లు భయముచే భ్రాంతిచెందినదై సీత జాలిపుట్టునట్లుగా మిక్కిలియేడ్చెను. అందకత్తెయగు నాయిల్లాలు 'రామ! రామ!' అనియు 'లక్ష్మణా' అనియుఁ దిన్ననిగొంతుతో నింపుగా నేడ్చెను.

౬. ఆజానకి, మిక్కిలి యడఁకువగలవాఁడై సమీపించియున్న వానరోత్తమునింగని 'ఇదిస్వప్నమా! ఏమి? అని యోచించెను.

౭. విశాలమై వక్రమైయున్న మోమునుగలవాఁడును, వానరరాజగు సుగ్రీవుండుచెప్పినట్లుగ నతిక్రమించక చేయువాఁడును, మర్కటరాజునకు మంత్రియైనవాఁడును, బుద్ధిమంతులలో మొదటివాఁడును నగు వాయుపుత్రుని యోచించుచుఁ జూచెను.

౮. ఆసీతాదేవి, మీఁదఁ జెప్పంబడినట్లు వికారరూపుఁడగు హనుమంతునింగాంచియే శుద్ధముగఁ దెలివితప్పినదై చచ్చినదానితోఁ దుల్యురాలై యుండెను. దీర్ఘకాలమునకుఁబిమ్మట మరలఁ దెలివికివచ్చినదై విశాలమగు కన్నులంగల యాసీత యోచించెను.

౯. నేఁడు స్వప్నమందు వికారరూపమును గలదియు, శాస్త్రములందు నిషేధింపఁబడినదియునగు మర్కటదర్శనము నాచేఁజేయంబడియెను. లక్ష్మణునితోఁగూడిన శ్రీరామచంద్రునకును, నాజనకుండగు జనకునకును మేలుగలుగుంగాక. ఈస్వప్నఫలము వారికిం జెందకుండును గాక.

౧౦. ఇది కలగాదు. ఏలననఁగా? శరీరతాపముచేతను మనోవ్యథచేతను నల్లాడుచున్న నాకు నిద్దుర యెట్లు గలుగును? నిండు చంద్రునింబోలిన మోముంగల నాప్రాణేశు నెడఁబాసియున్న నాకు సుఖమును లేదుగదా!

రామేతి రామేతి సదైవ బుద్ధ్యా విచింత్య వాచా బ్రువతీ తమే
వ । తస్యానురూపాం చ కథాం తమర్థ మేవం ప్రపశ్యామి
తథా శృణోమి॥ ౧౧॥

అహం హి తస్యాద్య మనోభవేన సంపీడితా తద్గత సర్వభా
వా । విచింతయంతీ సతతం తమేవ తథైవ పశ్యామి తథా శృ
ణోమి॥ ౧౨॥

మనోరథ స్స్యా దితి చింతయామి తథాపి బుద్ధ్యా చ వితర్క
యామి । కిం కారణం తస్య హి నాస్తి రూపం సువ్యక్త రూ
పశ్చ వద త్యయం మామ్॥ ౧౩॥

నమోస్తు వాచస్పతయే సవజ్రిణే స్వయంభువే చైవ హు
తాశనాయ। అనేన చోక్తం యదిదం మమాగ్రతో వనౌకసా
త చ్చ తథాస్తు నాన్యథా॥ ౧౪॥

ఇతి శ్రీమత్సుందరకాండే - ద్వాత్రింశస్సర్గః.

---

## త్రయస్త్రింశస్సర్గః.

సో వతీర్య ద్రుమా త్తస్మా ద్విద్రుమ ప్రతిమాననః।
వినీతవేషః కృపణః ప్రణిపత్యోపసృత్య చ॥ ౧॥

తామబ్రవీ న్మహాతేజా హనుమా న్మారుతాత్మజః।
శిరస్యంజలి మాధాయ సీతాం మధురయా గిరా॥ ౨॥

౧౧, ౧౨. సర్వకాలములయందును రామ! రామ! అను బుద్ధిచేత తలంచి, వాక్కుచేతను నాతనింబలుకుచు నాతనికింజోలినకథనే కనుచున్నాను. ఆయర్థమునే వినుచున్నాను. నేనాతనిప్రియురాలను,అతనియందే చెందిన త్రికరణములనుగలదానను, మన్మథవేదనచే నవయుచున్నదానను. ఎల్లప్పుడు నాతనినే తలంచుచున్నదానను గావున నాకగుపడునది యంతయు నారామునిరూపముగను, వినంబడునది యాతనికథగను కలంచెదను.

౧౩. నాయెదుట నీరామస్మరణ చేయుచుండువ్యక్తి నాసంకల్పముచే కాంబోలునని యెంచెద. నాబుద్ధిచేతను జర్చించుచున్నదానను, ఏలనగా సంకల్పమునకు రూపములేదుగదా! నాయెదుట నుండు వ్యక్తి రూపముగలిగి వానరమూర్తియై యగుపడుచున్నది. నాతోడ సంభాషించుచున్నది.

౧౪. దేవేంద్రునితోఁ గూడినవాఁడగు బృహస్పతికిని, బ్రహ్మదేవునకును, అగ్నిదేవునకును నమస్కరించెదను. ఈవానరునిచే నాయెదుటఁ జెప్పంబడినమాటలు సత్యమగుంగాక.

ఇది ముప్పదిరెండవ సర్గ.

———:0:———

ముప్పదిమూఁడవసర్గ,

౧, ౨. పగడముతోఁ దుల్యమగు మోముగలవాఁడును, దొడ్డప్రతాపముగలవాఁడును నగు హనుమంతుఁడు, అడఁకువతోఁగూడిన వేషముంగలవాఁడును, దుఃఖముతోఁ గూడినవాఁడునునై చెట్టునుండిదిగి సీతాదేవిదగ్గర కేగించి తలపైఁజేతులుచేర్చి మ్రొక్కుచు నింపగుమాటల సీతతోఁబలికెను.

హేమపద్మపలాశాక్షి క్లిష్టకౌశేయ వాసిని।
ద్రుమస్య శాఖా మాలంబ్య తిష్ఠసి త్వ మనిందితే॥ ౩॥

కిమర్థం తవనేత్రాభ్యాం వారిస్రవతి శోకజమ్।
పుండరీక పలాశాభ్యాం విప్రకీర్ణ మివోదకమ్॥ ౪॥

సురాణా మసురాణాం వా నాగగంధర్వ రక్షసామ్।
యక్షాణాం కిన్నరాణాం వా కా త్వం భవసి శోభనే॥ ౫॥

కాత్వం భవసి రుద్రాణాం మరుతాం వా వరాననే।
వసూనాం వా వరారోహే దేవతా ప్రతిభాసిమే॥ ౬॥

కిన్ను చంద్రమసా హీనా పతితా విబుధాలయాత్।
రోహిణీ జ్యోతిషాంశ్రేష్ఠా శ్రేష్ఠ సర్వగుణాన్వితా॥ ౭॥

కా త్వం భవసి కల్యాణి త్వ మనిందిత లోచనే॥ ౭॥

కోపాద్వా యదివా మోహా ద్భర్తార మసితేక్షణే।
వసిష్ఠం కోపయిత్వా త్వం నాసి కల్యాణ్యరుంధతీ॥ ౮॥

కోను పుత్రః పితా భ్రాతా భర్తా వా తే సుమధ్యమే।
అస్మాల్లోకా దముం లోకం గతం త్వ మనుశోచసి॥ ౯॥

రోదనా దతినిశ్శ్వాసా ద్భూమిసంస్పర్శనా దపి।
న త్వాం దేవి మహం మన్యే రాజ్ఞస్సంజ్ఞావధారణాత్॥ ౧౦॥

3, ४. తామరపూరేకులవంటి కన్నులుగలదానా! మాసిన పట్టు పచ్చడమును ధరించియున్నదానా! నిర్మలమగు చరితముంగలదానా! నీవు చెట్టుయొక్క కొమ్మనుబట్టుకొని యున్నావు. తెల్లతామరపువ్వుయొక్క రేకులవలన జారుచున్న యుదకమువలె నీకన్నులనుండి శోకమువలనఁగలిగిన కన్నీ రేల ప్రవహించుచున్నది?

५. ఓ సొంపగు రూపమునుగలదానా! దేవతలలోను దేవతలుకాని వారలలోను, నాగులలోను గంధర్వరాక్షసులలోను, కిన్నరులలోను నీ వెవ్వతెవు?

६. అందమగు మోముగలదానా! స్త్రీలలో నుత్తమురాలా! నీవు రుద్రులు పదొకండుమందిలోను, వాయువు లేడ్గురిలోను వసువు లెనమండుగురిలోను నెవ్వరవౌదువు. దేవతవలెఁ దోఁచుచున్నావు.

२, २५. చంద్రునిం బాసియున్నదియు, స్వర్గమునుండి మనుష్యలోకమునకువచ్చినదియు నక్షత్రములలో నుత్తమురాలును, ఉత్తమములగుసర్వగుణములతోడను గూడినదియునగు రోహిణివా? ఓపుణ్యవతీ! సుందరములగు చూపులుగలదానా! నీవెవ్వతెవు?

८५. నల్లని చూపులుగలదానా! పుణ్యాత్మురాలా! నీవు కోపముననో మోహమువలననో భర్తయగు వసిష్ఠమహర్షిపైనలిగి స్వర్గమునుండి భూమికివచ్చిన యరుంధతివి కావా?

९५. అందమగు నడుముంగలదానా? నీకొడుకెవ్వఁడు? తండ్రి యెవ్వాఁడు? తోడంబుట్టువెవ్వఁడు? మగఁడో యెవ్వఁడు? భూలోకమును విడిచి పరలోకమున కేగినవారి నెవ్వరింగూర్చి నీవేడ్చెదవు?

१०५. ఏడ్చుచుండుటవలనను, మిక్కిలి శ్వాసవిడుచుటచేతను, భూమి నంటియుండుటచేతను, రాజసంబంధమగు గుఱుతులను ధరించియున్నందునను నిన్ను దేవతాస్త్రీవని తలంప నేరకున్నాను.

వ్యంజనాని చ తే యాని లక్షణాని చ లక్షయే।
మహిషీ భూమిపాలస్య రాజకన్యాసి మే మతా॥ ౧౧॥
రావణేన జనస్థానా ద్బలా దపహృతా యది।
సీతా త్వమసి భద్రం తే త న్మమాచక్ష్వ పృచ్ఛతః॥ ౧౨॥
యథాహి తవ వై దైన్యం రూపంచా ప్యతిమానుషమ్।
తపసా చాన్వితో వేష స్త్వం రామ మహిషీ ధ్రువమ్॥ ౧౩॥
సా తస్య వచనం శ్రుత్వా రామకీర్తన హర్షితా।
ఉవాచ వాక్యం వైదేహీ హనుమంతం ద్రుమాశ్రితమ్॥ ౧౪॥
పృథివ్యాం రాజసింహానాం ముఖ్యస్య విదితాత్మనః।
స్నుషా దశరథ స్యాహం శత్రుసైన్య ప్రతాపినః॥ ౧౫॥
దుహితా జనకస్యాహం వైదేహస్య మహాత్మనః।
సీతా చ నామ నామ్నాహం భార్యా రామస్య ధీమతః॥ ౧౬॥
సమా ద్వాదశ తత్రాహం రాఘవస్య నివేశనే।
భుంజానా మానుషా న్భోగాన్ సర్వకామ సమృద్ధినీ॥ ౧౭॥
తత్ర త్రయోదశే వర్షే రాజ్యే నేక్ష్వాకు నందనమ్।
అభిషేచయితుం రాజా సోపాధ్యాయః ప్రచక్రమే॥ ౧౮॥
తస్మిన్ సంభ్రియమాణేతు రాఘవ స్యాభిషేచనే।
కైకేయీ నామ భర్తారం దేవీ వచన మబ్రవీత్॥ ౧౯॥

౧౧౪. నీశరీరమందలి యవయవములలోఁ దెలియవచ్చుచున్న లక్షణముల వేనినిజూచుచున్నానో వానిచేతనే నీవు రాజుయొక్కపట్టపు దేవివిగాను, రాచకన్యకగాను దలంచుచున్నాఁడను.

౧౨౪. నీవు జనస్థానమనుచోటనుండి రావణాసురునిచే బలవంతముగఁ దేఁబడిన సీతవయినచో నీకిఁక శుభమగును. ఆవిషయముంగూర్చి యడుగుచున్ననాకుఁ దెలియం బలుకుము.

౧౩౪. నీదీనదశ యెంతదొడ్డదై యున్నదో యటువలెనే నీరూపము మనుష్యసౌందర్యమును మించియున్నది, వేషము దపస్సుతోఁ గూడినదిగానున్నది, కావున నీవు రాముని భార్యవని నిశ్చయముగఁ దలంచెదను.

౧౪౪. ఆసీతాదేవి హనుమంతునిమాటనువిని. శ్రీరామునిచరితములను వినుటచేత సంతోషించినదై, వృక్షమునాశ్రయించియున్న హనుమంతునితో నిట్లనియెను.

౧౫, ౧౬. లోకమునందలి రాజోత్తములలో శ్రేష్ఠుఁడును, వివేకియు శత్రువుల నడికించువాఁడునునగు దశరథునికోడలను. విదేహరాజును మహాత్ముఁడును నగుజనకునకుఁ బుత్రికను. సీతయనుపేరుగలదానను. బుద్ధిమంతుఁడగు శ్రీరామునిభార్యను.

౧౭ నుండి ౨౨కు. అట్లు శ్రీరామునిభార్యనై యాతనియింట నేను గోరిన యన్నివిషయములను బొందినదాననై మనుష్యసంబంధమగు భోగములను బండ్రెండు సంవత్సరము లనుభవించితిని (౧౮) పదమూఁడవసంవత్సరమున దశరథమహారాజు పాధ్యాయులగు వసిష్ఠసమేతముగా శ్రీరామునకుఁ దనరాజ్యమునొసంగి యభిషేకము సేయ నారంభించెను. (౧౯) అట్లు కొడుకున కభిషేకముచేయు సన్నాహమున దశరథుఁడుండఁగాఁ గైకేయియను పట్టపుదేవి శ్రీరామునకుఁబట్టాభిషేకము సేయంబడిన ప్రతిదినము నేను భుజించు భోజనమును మానెదను. త్రాగందగినవియెల్ల వదలెదను. ఈపట్టాభిషేకము నాప్రాణమునకు మృత్యువు. (౨౧) ఓరాజోత్తమ

నపిబేయం నఖాదేయం ప్రత్యహం మమ భోజనమ్।
ఏష మే జీవితస్యాంతో రామో యద్యభిషిచ్యతే॥ ౨౦॥

యత్తదుక్తం త్వయా వాక్యం ప్రీత్యా నృపతిసత్తమ।
తచ్చే న్నవితథం కార్యం వనంగచ్ఛతు రాఘవః॥ ౨౧॥

సరాజా సత్యవా గ్దేవ్యా వరదాన మనుస్మరన్।
ముమోహవచనం శ్రుత్వా కైకేయ్యాః క్రూర మప్రియమ్॥

తతస్తు స్థవిరో రాజా సత్యే ధర్మే వ్యవస్థితః।
జ్యేష్ఠం యశస్వినం పుత్రం రుద న్రాజ్య మయాచత॥ ౨౩॥

స పితు ర్వచనం శ్రీమా నభిషేకా త్పరం ప్రియమ్।
మనసా పూర్వమాసాద్య వాచా ప్రతిగృహీతవాన్॥ ౨౪॥

దద్యా న్నప్రతిగృహ్ణీయా న్న బ్రూయా త్కించిదప్రియమ్।
అపిజీవిత హేతోర్వా రామ స్సత్యపరాక్రమః॥ ౨౫॥

స విహా యోత్తరీయాణి మహార్హాణి మహాయశాః।
విసృజ్య మనసా రాజ్యం జనన్యై మాం సమాదిశత్॥ ౨౬॥

సా హం తస్యాగ్రత స్తూర్ణం ప్రస్థితా వనచారిణీ।
నహి మే తేన హీనాయా వాస స్స్వర్గేపి రోచతే॥ ౨౭॥

ప్రాగేవతు మహాభాగ స్సౌమిత్రి ర్మిత్రనందనః।
పూర్వజ స్యానుయాత్రార్థే ద్రుమచీరై రలంకృతః॥ ౨౮॥

నాయందలి ప్రీతిచే మున్ను నీవాడినమాట యబద్ధము కానిచో నీరాముం డరణ్యమున కేగవలయునని పలికెను. మాటతప్పనివాఁడగు నారాజు (౨౨) కైకకిచ్చియుండిన వరములను దలఁచుచు, భయంకరమై యిష్టమునకు విరోధమైయున్న కైకమాటలను వినుచు మూర్ఛనొందెను.

౨౩. పిమ్మట, ముదుసలివాఁడును సత్యమందును ధర్మమందును నిలిచినవాఁడును నగు దశరథుఁడు దుఃఖించుచుఁ బెద్దవాఁడును, కీర్తిని సంపాదించిన పుత్రుఁడును నగు రామునిం (భరతునకు రాజ్యమిమ్మని) ప్రార్థించెదను.

౨౪. కాంతిసంపద గలవాఁడగు నారామమూర్తి పట్టాభిషేకమునకంటెఁ బ్రీతితోఁ దండ్రిమాటనంగీకరించి ముందు మనస్సుచేతను బిదప మాటలచేతను గ్రహించెను.

౨౫, ౨౬. యథార్థమగు పరాక్రమమును గలవాఁడును గొప్పకీర్తిగలవాఁడును నగు రామమూర్తి 'యొకరి కీయవలయునుగాని యొకరివలనఁ గొనఁగూడదు, తాను బ్రదుకుటకై యొకరికివిరోధముగనున్న మాటనయినఁ గొంచెమేనియుఁ జెప్పఁగూడదు' అని యోచించి వెలగల బట్టలనుగూడ వదలి తనతల్లియగు కౌసల్యాదేవికి నన్నుంగూర్చి చెప్పెను.

౨౭. ఆరామునిచే నట్లు కౌసల్యకుఁ జూపంబడిన నేను రామునింబాసి స్వర్గసుఖమేనియు సమ్మతింపనిదాననై నాప్రాణేశునకంటె ముందుగ వేగమునఁ బ్రయాణమైతిని.

౨౮. గొప్పయోగ్యతగలవాఁడును, స్నేహితుల కానందముగలిగించువాఁడును నగు సుమిత్రాపుత్రుఁ డన్నయగు రాముని వెంబడించి పోవుటకై రామమూర్తికంటె మున్నుగా నారచీరలను గట్టుకొనియెను.

తే వయం భర్తురాదేశం బహుమాన్య దృఢవ్రతాః।
ప్రవిష్టా స్మ పురాదృష్టం వనం గంభీర దర్శనమ్॥ ౨౯॥

వసతో దండకారణ్యే తస్యాహ మమితౌజసః।
రక్షసా పహృతా భార్యా రావణేన దురాత్మనా॥ ౩౦॥

ద్వౌమాసౌ తేన మే కాలో జీవితానుగ్రహః కృతః।
ఊర్ధ్వం ద్వాభ్యాం తు మాసాభ్యాం తత స్త్యక్ష్యామి జీవితమ్॥

ఇతి శ్రీమత్సుందరకాండే త్రయస్త్రింశస్సర్గః.

---

## చతుస్త్రింశస్సర్గః.

తస్యా స్తద్వచనం శ్రుత్వా హనుమాన్ హరియూథపః।
దుఃఖా ద్దుఃఖాభిభూతాయా స్సాంత్వ ముత్తర మబ్రవీత్॥ ౧॥

అహం రామస్య సందేశా ద్దేవి దూత స్తవాగతః।
వైదేహీ కుశలీ రామ స్త్వాంచ కౌశల మబ్రవీత్॥ ౨॥

యో బ్రాహ్మ మస్త్రం వేదాంశ్చ వేద వేదవిదాం వరః।
స త్వాం దాశరథీ రామో దేవి కౌశల మబ్రవీత్॥ ౩॥

లక్ష్మణశ్చ మహాతేజా భర్తు స్తే నుచరః ప్రియః।
కృతవాం శోకసంతప్త శ్శిరసా తే భివాదనమ్॥ ౪॥

౨౯. ఇట్టి స్థితియందున్న మేము ప్రభుఁడగు దశరథునియాజ్ఞ ద లచేధరించి, వనవాసము సేయ నిశ్చయించికొని (మున్నెన్నఁడు సూడ నిదియుఁ జొరఁగూడక దట్టమై యగుపడుచున్నదియునైన) యడవిలోఁ బ్రవేశించితిమి సుమా!

౩౦, ౩౧. ఆదండకారణ్యమున వసించుచున్నవాఁడును, ప్రతాప ము గలవాఁడును నగు రామునియొక్క భార్యనైననేను దుర్జనుఁడగు రావణునిచేఁ గొనిపోఁబడితిని. ఆరాక్షసునిచేత రెండునెలలు జీవించి యుండనిచ్చునట్లుగా ననుమతింపఁబడసియున్నాను. కావుననె యిటపైఁ బ్రదుకుట కవకాశ మీరాక్షసుండీయఁడుగావునఁ బ్రాణములనువిడుతును.

ఇది ముప్పదిమూఁడవ సర్గ.

---

ముప్పదినాల్గవ సర్గ.

౧. వానరసమూహమున కధికారియగు హనుమంతుఁడు దుఃఖము చే(దుఃఖకరముగ) నవమానింపఁబడిన యాసీతాదేవియొక్క మాటనువిని యింపగు మఱుమాటను బలికెను.

౨. ఓతల్లీ! జానకీ! రాముఁడు క్షేమముగ నున్నాఁడు, నేనా ప్రభుని సేవకుఁడను, నీవుందుచోటును నీక్షేమమును విచారింపవచ్చితిని. నీ తోడను క్షేమముం జెప్పుమనియెను.

౩. ఎవండు బ్రహ్మాస్త్రమును వేదములను నెఱింగినవాఁడో, వేద ముల నెఱింగినవారిలో నెవఁడుత్తముఁడో యట్టిరాముండు నీక్షేమమున డిగెను.

౪. మిక్కిలి ప్రతాపముగలవాఁడును నీభర్తకు సేవకుఁడును ప్రి యుండును మేలుమఱువనివాఁడును నగు లక్ష్మణుండు దుఃఖముచేఁబొగిలి, నీకు సాష్టాంగ నమస్కారముం జేసితినని చెప్పుమనియెను.

సా తయోః కుశలం దేవీ నిశమ్య నరసింహయోః।
ప్రీతి సంహృష్ట సర్వాంగీ హనుమంత మథాబ్రవీత్॥ ౫॥

కల్యాణీ బత గాథేయం లౌకికీ ప్రతిభాతిమా।
ఏతి జీవంత మానందో నరం వర్షశతా దపి॥ ౬॥

తయా సమాగతే తస్మిన్ ప్రీతిరుత్పాదితా ద్భుతా।
పరస్పరేణ చాలాపం విశ్వస్తౌ తౌ ప్రచక్రతుః॥ ౭॥

తస్యా స్తద్వచనం శ్రుత్వా హనుమాన్ హరియూథపః।
సీతాయాః శోకదీనాయాః స్సమీప ముపచక్రమే॥ ౮॥

యథాయథా సమీపం స హనుమా నుపసర్పతి।
తథాతథా రావణం సా తం సీతా పరిశంకతే॥ ౯॥

అహో ధి గ్దుష్కృత మిదం కథితం హి యదస్యమే।
రూపాంతర ముపాగమ్య స ఏవాయం హి రావణః॥ ౧౦॥

తా మశోకస్య శాఖాం సా విముక్త్వా శోకకర్శితా।
తస్యా మేవా నవద్యాంగీ ధరణ్యాం సముపావిశత్॥ ౧౧॥

హనుమా నపి దుఃఖార్తాం తాం దృష్ట్వా భయమోహితామ్।
అవందత మహాబాహు స్తత స్తాం జనకాత్మజామ్॥ ౧౨॥

సాచైనం భయవిత్రస్తా భూయో నైవా భ్యుదైక్షత॥ ౧౩

౫. ఆదేవి పురుషోత్తములగు రామలక్ష్మణులయొక్క క్షేమమును విని సంతోషముచే గగుర్పాటుచెందిన మేనుగలదై హనుమంతునితో నిట్లని యెను.

౬. 'జీవించియున్న మనుజుని నూఱు సంవత్సరముల పిమ్మటనైనను యు సంతోషము చెందుచున్నది' అనులోకవాదుక నాకు సత్యముగాఁదోఁచుచున్నది. సంతోషము.

౭. అనియిట్లు భాషించెను హనుమంతునియందా దేవికి మిక్కిలిసంతుష్టి గలిగెను. అటుపై నాసీతాహనుమంతు లిరువురును నొకరినొకరునమ్మి బాగుగ మాటలాడిరి.

౮. వానరుల సమూహమున కపిశ్రేష్ఠుఁడగు హనుమంతుఁడు శోకముచేఁ బేదపడియున్న సీతాదేవియొక్క మాటనువిని చేరరాఁబోయెను.

౯. అట్లు హనుమంతుఁడు ప్రక్కకు రానురాను సీత వానిని రావణుఁడు కాఁబోలునని శంకించి జంకుచు జంకుచు నుండెను.

౧౦. ఏ రావణుండు మోసముచే నన్నుఁదెచ్చెనో వాఁడే యిట్లు వానరరూపమగు వేఱురూపమును ధరించినట్లున్నది. వీనియెదుట నాచేఁ జెప్పంబడిన మాటలు వ్యర్థముకదా! ఛీ! వెఱ్ఱితన మయ్యెను.

౧౧. అందమగు నవయవములుగల యాదేవి దుఃఖముచేఁ జిక్కినదై యా యశోకవృక్షముయొక్క కొమ్మను వదలి యాభూమిపైఁ గూర్చుండి యుండెను.

౧౨, ౧౩. అటుపై బలవంతుఁడగు హనుమంతుఁడు దుఃఖముచేఁ బీడింపఁబడినదియు భయముచే భ్రమ చెందినదియు జనకుని పుత్రికయు నగు సీతాదేవికి మ్రొక్కెను. ఆదేవి భీతిచెందినదై మఱల నాహనుమంతునిఁ గన్నెత్తి చూడకయుండెను.

తం దృష్ట్వా వందమానంతు సీతా శశినిభాననా।
అబ్రవీ ద్దీర్ఘ ముచ్ఛ్వస్య వానరం మధురస్వరా॥ ౧౩॥

మాయాం ప్రవిష్టో మాయావీ యదిత్వం రావణ స్స్వయమ్।
ఉత్పాదయసి మే భూయ స్సంతాపం త న్నశోభనమ్॥ ౧౪॥

స్వం పరిత్యజ్య రూపం యః పరివ్రాజక రూపధృత్।
జనస్థానే మయాదృష్ట స్త్వం సఏవాసి రావణః॥ ౧౫॥

ఉపవాస కృశాం దీనాం కామరూప నిశాచర।
సంతాపయసి మాం భూయ స్సంతప్తాం త న్నశోభనమ్॥ ౧౬॥

అథవా నైత దేవం హి యన్మయా పరిశంకితమ్।
మనసో హి మమ ప్రీతి రుత్పన్నా తవదర్శనాత్॥ ౧౭॥

యది రామస్య దూత స్త్వ మాగతో భద్రమస్తు తే।
పృచ్ఛామి త్వాం హరిశ్రేష్ఠ ప్రియా రామకథా హి మే॥ ౧౮॥

గుణా న్రామస్య కథయ ప్రియస్య మమ వానర।
చిత్తం హరసి మే సౌమ్య నదీకూలం యథా రయః॥ ౧౯॥

అహో స్వప్నస్య సుఖతా యాహ మేవం చిరాహృతా।

౧౩౪. చంద్రునింబోలు మోముగల యాదేవి, మ్రొక్కుచున్న హనుమంతుంగని నిట్టూర్పువిడిచి యింపగుమాటలతో హనుమంతుంగూర్చి యిట్లనియెను.

౧౪౪. నీవుమోసగాడవును, మాఱువేషమునుధరించి వచ్చియున్న రావణుడవును నైయున్నచో నాకు మఱల మనోవ్యథను బుట్టించుచున్నావుసుమా! అట్లు నేయుట నీకు శుభముగాదు.

౧౫౪. ఏవండు దనరూపమునువదలి సన్న్యాసి వేషమును ధరించి జనస్థానమనుచోట నాకగపడియెనో యట్టిరావణుడవేయని నిన్నుఁ దలంచెదను.

౧౬౪. కోరినరూపములనెల్ల ధరింపఁగల యోరాక్షసా! ఆహారమును మాని నవయుచున్న దానిని దిక్కుమాలియున్నదానిని శోకముచేఁ బొక్కుచున్నదానిని నన్ను మఱల నేడ్పించుచున్నావు. ఇట్లు నేయుట నీవుబాగుపడుటకుఁ గాదు సుమా!

౧౭౪. అట్లుగాదేని, నిన్నుఁజూచినమాత్రమున నీయందుఁ బ్రీతి పుట్టినదికావున, నీవు రావణాసురుఁడవని నేను సంశయించినది ప్రమాదము.

౧౮౪, ౧౯౪. ఓవానరోత్తమా! నీవు శ్రీరాముని క్షేమలాభముం దెలుపవచ్చుట సత్యమేని నీకుశుభముగుఁగాక! రాముని వృత్తాంతము నిన్నడిగెదను. ఆచరిత్రము నాకిష్టమైనదికదా! నాప్రాణేశుఁడగు రాముని గుణములను నాకుఁజెప్పుము! ఓశాంతుఁడా! ప్రవాహముయొక్క వేగము నదియొక్క గట్టునెరయునట్లుగ నామనస్సు నాకర్షించుచున్నావు సుమా!

౨౦౪. మీఁదఁ జెప్పంబడినట్లుగా నీరాక్షసునిచేఁ దీసికొని రాఁబడిననన్నే నింతదీర్ఘకాలమునకుఁ బిమ్మట రామునిచే నంపఁబడిన వానరోత్తమా,

ప్రేషితం నామ పశ్యామి రాఘవేణ వనౌకసమ్॥ ౨౦

స్వప్నేఽపి యద్యహం వీరం రాఘవం సహలక్ష్మణమ్।
పశ్యేయం నావసీదేయం స్వప్నోఽపి మమమత్సరీ॥ ౨౧

నాహం స్వప్న మిమంమన్యే స్వప్నే దృష్ట్వాహి వానరమ్।
నశక్యోఽభ్యుదయః ప్రాప్తుం ప్రాప్తశ్చాభ్యుదయో మమ॥ ౨౨

కిన్నుస్యాచ్చిత్తమోహోఽయం భవేద్వాతగతి స్త్వియమ్।
ఉన్మాదజో వికారోవా స్యాదియం మృగతృష్ణికా॥ ౨౩

అథవా నాయ మున్మాదో మోహోఽప్యున్మాదలక్షణః।
సంబుధ్యే చాహ మాత్మాన మిమంచాపి వనౌకసమ్॥ ౨౪

ఇత్యేవం బహుధా సీతా సంప్రధార్య బలాబలమ్।
రక్షసాం కామరూపత్వా న్మేనే తం రాక్షసాధిపమ్॥ ౨౫

ఏతాం బుద్ధిం తదాకృత్వా సీతా సా తనుమధ్యమా॥
నప్రతి వ్యాజహారాథ వానరం జనకాత్మజా॥ ౨౬

సీతాయా శ్చింతితం బుద్ధ్వా హనుమా న్మారుతాత్మజః।
శ్రోత్రానుకూలై ర్వచనై స్తదా తాం సంప్రహర్షయత్॥ ౨౭

ఱక్కసునింగనుచున్న దానను. నినుంగాంచుట స్వప్నమందలి సౌఖ్యము గాఁ దలంచెదను.

౨౧౫. విరుఁడును లక్ష్మణసమేతుఁడును నగు రామమూర్తిని నే ను స్వప్నమందేనియుఁ గనియున్నచో నింతగ డస్సియుండను. కటకటా! ఆకలయుంగూడ నాకు శత్రువయ్యెను.

౨౨౫. నేనిప్పటిస్థితిని స్వప్నమని తలంపను, ఏలననఁగా, స్వప్న మందు వానరునింజూచినవారికి శుభముగలుగుట కల్లయఁట, నేను శ్రీరామ వృత్తాంతమును వినుటయనుశుభమును బొందితినిగదా!

౨౩౫. ఈయెదుట నగపడినది నామనస్సుయొక్క భ్రాంతియా? ఉపవాసాదులచేఁ గలిగిన వాతరోగమువలని భ్రమయైయుండునా? వె ఱ్ఱిచేఁగలిగిన మనోచాంచల్యమా? ఇది యెండమావులవలెఁ దోఁచెడును.

౨౪౫. అట్లుగాదు. నాకెదుటనుండు వానరరూపము నా వెఱ్ఱితనము చేతఁగాని, భ్రమచేతఁగాని కల్పితమైనదిగాదు. ఏలననఁగా నేను నన్ను ను వానరుని దెలిసియే మాటలాడుచున్నాను.

౨౫౫. ఈచొప్పున సీతాదేవి యనేకవిధముల రాక్షసులయొక్క యు హనుమంతునియొక్కయు బలదుర్బలములను నిశ్చయించికొని, రా క్షసులు కామరూపముంగలవారుగావున నీవానరాకృతింగలవాఁడు రావ ణాసురుఁడేయని తలంచెను.

౨౬౫. సన్నని నడుమును గలదియు జనకుని పుత్రికయైనదియు నగు సీత, మీఁదఁ జెప్పంబడినట్లు నిశ్చయించికొని పిమ్మట హనుమంతునితో భాషింపకయే యుండెను.

౨౭౫. వాయుపుత్రుఁడైన హనుమంతుఁడు సీతాదేవియొక్క త లంపు నెఱింగి యప్పుడు విననింపయినమాటలుచెప్పి యామెను సంతోషప ఱిచెను.

ఆదిత్య ఇవ తేజస్వీ లోకకాన్తశ్శశీ యథా।
రాజా సర్వస్య లోకస్య దేవో వైశ్రవణో యథా॥ ౨౮
విక్రమేణోపపన్నశ్చ యథా విష్ణుర్మహాయశాః।
సత్యవాదీ మధురవాగ్దేవో వాచస్పతిర్యథా॥ ౨౯
రూపవాన్సుభగశ్శ్రీమాన్ కన్దర్ప ఇవ మూర్తిమాన్॥ ౩౦
స్థానక్రోధః ప్రహర్తా చ శ్రేష్ఠో లోకే మహారథః॥ ౩౦½
బాహుచ్ఛాయామవష్టబ్ధో యస్య లోకో మహాత్మనః।
(దేవా ఇవ మహేన్ద్రస్య మోదన్తే విగతజ్వరాః॥) ౩౧½
అపకృష్యాశ్రమపదాన్మృగరూపేణ రాఘవమ్।
శూన్యే యేనాపనీతాసి తస్య ద్రక్ష్యసి యత్ఫలమ్॥ ౩౨½
నచిరాద్రావణం సంఖ్యే యోవధిష్యతి వీర్యవాన్।
రోషప్రముక్తైరిషుభిర్జ్వలద్భిరివ పావకైః॥ ౩౩½
తేనాహం ప్రేషితో దూతస్త్వత్సకాశమిహాగతః॥ ౩౪
త్వద్వియోగేన దుఃఖార్తస్స త్వాం కౌశలమబ్రవీత్।
లక్ష్మణశ్చ మహాతేజాస్సుమిత్రానన్దవర్ధనః॥ ౩౫
అభివాద్య మహాబాహుస్స త్వాం కౌశలమబ్రవీత్।
రామస్య చ సఖా దేవి సుగ్రీవో నామ వానరః॥ ౩౬
రాజా వానరముఖ్యానాం స త్వాం కౌశలమబ్రవీత్। ౩౬½

౨౮½ నుండి ౩౦½ కు. సూర్యునివలెఁ బ్రతాపముగలవాఁడును, చంద్రునివలె లోకమునకు మనోహరుఁడును, కుబేరునివలె లోకమున కెల్లఁ బ్రభుఁడును (౨౯½) విష్ణుమూర్తివలె దొడ్డకీర్తిగలవాఁడును దర్పముతోఁ గూడినవాఁడును, ప్రశస్తుఁడగు బృహస్పతివలె సత్యమే భాషించువాఁడును, (౩౦½) ఇంపుగమాటలాడువాఁడును, దేహమునుగల మన్మథునివలె నున్న వాఁడును, అందముగలవాఁడును, కాంతిగలవాఁడును, కోపముచూపఁదగినచోటఁ గోపముంజూపువాఁడును, శత్రువులను రూపుమాపు వాఁడును, లోకమున నుత్తముఁడును నగు మహారథుఁ డొకండు గలఁడు.

౩౧½, ౩౨½. దేవతలు దేవేంద్రు నాశ్రయించినట్లు లోకములు గొప్పవాఁడగు నేపురుషునియొక్క భుజములనీడ నాశ్రయించియున్నవో యట్టి రాముని, జింకయను నెపముచే జనులులేని యడవికీడ్చి, ఆశ్రమ స్థానమునుండి యేరావణునిచేఁ దేఁబడితివో యట్టి రాక్షసునకు మును మున్ను కాఁగలఫలమును జూతువుగాక.

౩౩½, ౩౪. బలదర్పములచే నొప్పినవాఁడగు రాముఁడు రోషముచేఁ బ్రయోగింపఁబడినవై యగ్నులవలె మండుచున్న బాణములచేత యుద్ధమునందు రావణాసురుని శీఘ్రకాలమున నెచంపును. అతనిచేత నేపనుపఁబడినవాఁడనై దూతనుగా నీకడకు వచ్చితిని.

౩౫ నుండి ౩౬½ కు. నిన్నెడఁబాసిన దుఃఖముచేఁ బీడింపఁబడుచున్న శ్రీరామమూర్తి నీక్షేమమును విచారించి రమ్మనిచెప్పెను. మిక్కిలి దర్పముగలవాఁడును సుమిత్రకు సంతోషమును బెంచువాఁడును బలశాలియు నగులక్ష్మణుఁడును నమస్కరించి నీక్షేమము నరసిరమ్మనిపలికెను. ఓదేవి! శ్రీరామునకు మిత్రుఁడును వానరోత్తములకు రాజును నగు సుగ్రీవుఁడుంగూడ నీక్షేమము నడిగెను.

నిత్యం స్మరతి రామ స్త్వాం ససుగ్రీవ స్సలక్ష్మణః।
దిష్ట్యా జీవసి వైదేహి రాక్షసీవశ మాగతా॥ ౩౭
నచిరా ద్ద్రక్ష్యసే రామం లక్ష్మణంచ మహాబలమ్।
మధ్యే వానరకోటీనాం సుగ్రీవం చామితౌజసమ్॥ ౩౮
అహం సుగ్రీవ సచివో హనుమా న్నామ వానరః।
ప్రవిశ్య నగరీం లంకాం లంఘయిత్వా మహోదధిమ్॥ ౩౯
కృత్వామూర్ధ్ని పదన్యాసం రావణస్య దురాత్మనః।
త్వాం ద్రష్టు ముపయాతోఽహం సమాశ్రిత్యపరాక్రమమ్॥ ౪౦
నాహమస్మి తథా దేవి యథా మామపగచ్ఛసి।
విశంకా త్యజ్యతా మేషా శ్రద్ధత్స్వ వదతో మమ॥ ౪౧

ఇతి శ్రీమత్సుందరకాండే - చతుస్త్రింశస్సర్గః.

---

## పంచత్రింశస్సర్గః.

తాంతు రామకథాం శ్రుత్వా వైదేహీ వానరర్షభాత్।
ఉవాచ వచనం సాంత్వ మిదం మధురయా గిరా॥ ౧
క్వ తే రామేణ సంసర్గః కథం జానాసి లక్ష్మణమ్।
వానరాణాం నరాణాంచ కథమాసీ త్సమాగమః॥ ౨
యాని రామస్య లింగాని లక్ష్మణస్య చ వానర।
తాని భూయ స్సమాచక్ష్వ నమాం శోక స్సమావిశేత్॥ ౩
కీదృశం తస్యసంస్థానం రూపం రామస్య కీదృశమ్।
కథమూరూ కథంబాహూ లక్ష్మణస్య చ శంసమే॥ ౪

౩౬౫, ౩౭౫. రామచంద్రుఁడు సుగ్రీవ లక్ష్మణ సమేతుఁడై నిన్నెల్లప్పుడు దలంచుచున్నాఁడు. నీవు రాక్షసస్త్రీలచేఁ జిక్కియు సదృష్టవశమున జీవించియున్నావు. బలవంతుఁడగు శ్రీరాముని లక్ష్మణస్వామిని ప్రతాప సంపన్నుండగు సుగ్రీవునిం గోట్లకొలఁది వానరులనడుమఁ జూడఁగలవు.

౩౮౫ నుండి ౪౧౫. నేను సుగ్రీవునిమంత్రిని. హనుమంతుఁడను పేరునఁ బ్రసిద్ధిఁగన్నవాఁడను. ఈమహాసముద్రమును దాఁటి యీలంకాపట్టణమును బ్రవేశించినవాఁడను. దుర్జనుఁడగు రావణాసురునియొక్క తలపై నాపాదముంబెట్టి పిమ్మట నిన్నుఁజూడవచ్చితిని. మాయవేషమును ధరించివచ్చిన రావణుఁడని నన్నుఁదలంచుచున్నావు. నేనట్టివాఁడనుగాను. ఇట్టి వ్యర్థమగు సంశయమునుమానుము. నామాటను నమ్ముము.

ఇది ముప్పదినాల్గవసర్గ.

ముప్పదియైదవసర్గ.

౧. అజానకి యీరామచరిత్రమును వానరశ్రేష్ఠుఁడగు హనుమంతునివలన విని యింపగుమాటలచే నెమ్మదిగలిగి యిట్లనియె.

౨. రామచంద్రునితోడ సంబంధము నీకెందుఁ గలిగెను? లక్ష్మణునెట్లెఱింగితివి? వానరులకును మనుష్యులకును మైత్రి యెట్లుపొసఁగెను.

౩. ఓవానరుఁడా! శ్రీరామున కేయేగుఱుతులున్నవి: లక్ష్మణున కేగుఱుతులుగలవు? వానిని మఱలఁ జెటఁగఁ జెప్పుము! నన్ను దుఃఖము పొందకయుండును.

౪. ఆరామలక్ష్మణుల యవయవములపొందిక యెట్టులుండును? రూపములెట్టివి? తొడలెట్టివి? భుజములెటువంటివి? నాకెఱింగింపుము?

ఏవ ముక్తస్తు వైదేహ్యా హనుమా న్మారుతాత్మజః।
తతో రామం యథాతత్త్వ మాఖ్యాతు ముపచక్రమే॥ ౫॥

జానంతీ బత దిష్ట్యామాం వైదేహి పరిపృచ్ఛసి।
భర్తుః కమలపత్రాక్షి సంస్థానం లక్ష్మణస్య చ॥ ౬॥

యాని రామస్య చిహ్నాని లక్ష్మణస్య చ యాని వై।
లక్షితాని విశాలాక్షి వదత శ్శృణు తాని మే॥ ౭॥

రామః కమలపత్రాక్ష స్సర్వసత్త్వ మనోహరః।
రూపదాక్షిణ్య సంపన్నః ప్రసూతో జనకాత్మజే॥ ౮॥

తేజసా దిత్యసంకాశః క్షమయా పృథివీసమః।
బృహస్పతిసమో బుద్ధ్యా యశసా వాసవోపమః॥ ౯॥

రక్షితా జీవలోకస్య స్వజన స్యాభిరక్షితా।
రక్షితా స్వస్య వృత్తస్య ధర్మస్య చ పరంతపః॥ ౧౦॥

రామో భామిని లోకస్య చాతుర్వర్ణ్యస్య రక్షితా।
మర్యాదానాంచ లోకస్య కర్తా కారయితా చ సః॥ ౧౧॥

అర్చిష్మా నర్చితోత్యర్థం బ్రహ్మచర్య వ్రతేస్థితః।
సాధూనా ముపకారజ్ఞః ప్రచారజ్ఞశ్చ కర్మణామ్॥ ౧౨॥

రాజవిద్యా వినీతశ్చ బ్రాహ్మణానా ముపాసితా।
శ్రుతవా న్శీలసంపన్నో వినీతశ్చ పరంతపః॥ ౧౩॥

యజుర్వేద వినీతశ్చ వేదవిద్భి స్సుపూజితః।
ధనుర్వేదే చ వేదేషు వేదాంగేషు చ నిష్ఠితః॥ ౧౪॥

౫. వాయుపుత్రుండు జానకిచే నట్లడుగంబడినవాఁడై శ్రీరాముని స్వరూప మున్నదియున్నట్లు వర్ణించిచెప్పఁ బూనెను.

౬, ౭. తామరఱేకులవంటి కన్నులంగల యోసీతా! నేను శ్రీరాముదూతనని యెఱింగినదానవై మగనియొక్కయు మఱఁదియొక్కయు నవయవముల చొప్పును నాయదృష్టవశమున నన్నడిగితివి. శ్రీరామునియొక్కయు లక్ష్మణునియొక్కయు నేయే చిహ్నములు నాచేతఁ జూడంబడినవో వానిని జెప్పెదను వినుము.

౮, ౯, ౧౦. రామచంద్రుఁడు తామరఱేకులవంటి కన్నులనుగలవాఁడు, అన్ని జంతువులయొక్కయు మనస్సుల నాకర్షించువాఁడు, సౌందర్యముచేతను దయచేతను బూర్ణుండునై పుట్టినవాఁడు. ఓజానకి ప్రతాపముచేత సూర్యునివంటివాఁడును, ఓర్పుచేత భూమితో సముండును, బుద్ధిచేత బృహస్పతివంటివాఁడును కీర్తిచే నింద్రునివంటివాఁడును జంతుజాలమును రక్షించువాఁడును తన్నాశ్రయించినవారి నాదరించువాఁడును, తననడతను న్యాయమును రక్షించువాఁడును. విరోధుల నల్లాడించువాఁడును.

౧౧ నుండి ౧౨. అందముగలదానా! ఆరామచంద్రుఁడు లోకములోని బ్రాహ్మణులు మొదలగు నాల్గుజాతులవారిని రక్షించువాఁడు. జనులకుండగు నాచారములను నిర్ణయించువాఁడును, నిర్ణయము చేయించువాఁడును, ప్రతాపముగలవాఁడును, పూజింపఁబడువాఁడును బ్రహ్మచర్యవ్రతమునందే యున్నవాఁడును, సజ్జనులగువారు చేయు మేలు నెఱింగినవాఁడును, కర్మపద్ధతిం దెలిసినవాఁడును.

౧౩ నుండి ౧౪కు. రాజులకుపయోగముగు నీతి నెఱింగినవాఁడును, బ్రాహ్మణసేవచేయువాఁడును, ధర్మముల నెఱింగినవాఁడును, సదాచారముంగలవాఁడును సాధుఁడును శత్రుల నుడికించువాఁడును (౧౫) య

విపులాంసో మహాబాహుః కంబుగ్రీవ శ్శుభాననః।
గూఢజత్రు స్సుతామ్రాక్షో రామో దేవి జనై శ్శ్రుతః॥ ౧౫॥

దుందుభిస్స్వన నిర్ఘోష స్స్నిగ్ధ వర్ణః ప్రతాపవాన్।
సమ స్సమవిభక్తాంగో వర్ణం శ్యామం సమాశ్రితః॥ ౧౬॥

త్రిస్థిర స్త్రిప్రలంబశ్చ త్రిసమ స్త్రిషు చోన్నతః।
త్రితామ్ర స్త్రిషు చ స్నిగ్ధో గంభీర స్త్రిషు నిత్యశః॥ ౧౭॥

ర్వేదమందుఁ బరిశ్రమము గలవాఁడును, వేదముల నెఱింగినవారిచే బాగుగఁ బూజింపఁబడినవాఁడును, విలువిద్యయందునుయజుర్వేదముగాక యితరములగు వేదములయందును, వేదముల కంగములగు వ్యాకరణాది శాస్త్రములయందును బ్రజ్ఞగలవాఁడును (౧౫) విశాలములగు మూఁపులుగలవాఁడును, గొప్పభుజములుగలవాఁడును శంఖమువంటికంఠముగలవాఁడును, శుభమగు మోముగలవాఁడును, ఉన్నతములయిన భుజసంధులుగలవాఁడును కొలుకులందెఱుపుంగల కన్నులవాఁడును.

౧౬. డంకామోతవంటి కంఠధ్వనిగలవాఁడును కాంతితోఁగూడిన శరీరచ్ఛాయగలవాఁడును, ప్రతాపముగలవాఁడును, ప్రమాణమునకుందగిన శరీరముంగలవాఁడును, అంగములుగ నేర్పడిన యవయవములు గలవాఁడును, నీలవర్ణమగు దేహకాంతినిగలవాఁడును నగువాఁడుగా రాముఁడు జనులచే వినంబడియెను వల్లీ!

౧౭. ఱొమ్ము, మణికట్టు, పిడికిలియను మూఁడుచోట్లు దృఢముగాఁగలవాఁడును, కనుబొమలు బాహువులు వృషణములు వ్రేలుటగలవాఁడును, తలవెండ్రుకలకొనలు వృషణములుమోకాళ్లు సమముగాఁగలవాఁడును, నాభిలోపలి ప్రదేశమును బొట్టియు ఱొమ్మును నెత్తుగాఁగలవాఁడును, కనుగొలుకులయందును గోళ్లయందును గాలునేతులయందును నెఱ్ఱందనము గలవాఁడును, పాదమునందలి రేఖలు దలవెండ్రుకలు లింగమణి వీనియందు నునుపు గలవాఁడును, కంఠధ్వనియందును నాభియందును చాళ్ప్యర్యమందును లోతుఁగలవాఁడును.

త్రివలీవాం స్త్ర్యవనత శ్చతుర్వ్యంగ స్త్రిశీర్షవాన్।
చతుష్కల శ్చతుర్లేఖ శ్చతుష్కిష్కు శ్చతుస్సమః॥ ౧౭

చతుర్దశ సమద్వంద్వ శ్చతుర్దంష్ట్ర శ్చతుర్గతిః।
మహోష్ఠ హనునాసశ్చ పంచస్నిగ్ధోష్టవంశవాన్॥ ౧౮

దశపద్మో దశబృహ త్త్రిభిర్వ్యాప్తో ద్విశుక్లవాన్।
షడున్నతో నవతను స్త్రిభి ర్వ్యాప్నోతి రాఘవః॥

౧౮. కడుపుపై మూఁడుముడతలుగలవాఁడును వంగిన స్తనము
స్తనములకొనలు పాదరేఖలుగలవాఁడును, కంఠము లింగము వెన్నుపిక్కలు
కుఱుచగాఁగలవాఁడును మూఁడుసుళ్లతోఁగూడిన శిరస్సుగలవాఁడును,
నాలుగువేదములను జదువుటకు సూచకములైన యంగుష్ఠమూలరేఖలుగల
వాఁడును, ముఖపాదహస్తములయందు దీర్ఘాయుష్యమును సూచించు స్వా
ఙ్గరేఖలుగలవాఁడును, ఎనిమిదడుగుల దేహమునుగలవాఁడును, భుజములు
మోకాళ్లు తొడలు చెక్కిళ్లుసమముగాఁ గలవాఁడును.

౧౯. కనుబొమలు, కన్నులు, ముక్కుఱములు, చెవులు, పెదవులు
మోచేతులు, ఱొమ్ముమిట్టలు, మణికట్టులు, మోకాళ్లు, నడుము, చేతులు,
కాళ్లు, మొదలగు పదునాల్గుజంటలును సమముగాఁ గలవాఁడును, దంతము
లలో నాల్గు కోరలవంటిదంతములుగలవాఁడును, సింగము పులి యేనుఁగు
వృషభముల నడలంబోలిననడక గలవాఁడును, ఎఱ్ఱని బలిసిన పెదవులును,
చెంపల పైభాగములును నెత్తైన పొడుగుముక్కును గలవాఁడును, సున్నని
కన్నులు చర్మము దంతములు నఱకాళ్లను మెత్తని వెంట్రుకలును గలవాఁ
డును, వెన్నెముక, మేను, చెవులు, చేతులు, కాలి చేతివ్రేళ్లు, ముక్కు
లింగము, కన్నులు ననునెనిమిదియుఁ బొడవుగాఁ గలవాఁడును.

౨౦. పద్మములంబోలు ముఖము మొదలగు పదియంగములు గలవాఁ
డును, ఱొమ్ము భుజములు మొదలగు పదియంగములు గొప్పవిగాఁ గలవాఁ
డును, ప్రతాప కీర్తి సంపదలనుమూఁడును మెండుగఁ గలవాఁడును, శుద్ధ
ముగు దంతనేత్రములుగలవాఁడును, ముఖము మొదలగు నాఱుచోటు లెత్తుగా
గలవాఁడును, వ్రేళ్లగణుపులు గోళ్లు మొదలగు తొమ్మిదియు సూక్ష్మము
గాఁగలవాఁడును మూఁడువేళలయందును ధర్మార్థ కామములయందు వ్యా
పించువాఁడునునై శ్రీరాముం డుండును.

సత్యధర్మపర శ్శ్రీమా న్సంగ్రహానుగ్రహే రతః।
దేశకాల విభాగజ్ఞ స్సర్వలోక ప్రియంవదః॥ ౨౧॥

భ్రాతా చ తస్య ద్వైమాత్ర స్సౌమిత్రి రపరాజితః।
అనురాగేణ రూపేణ గుణైశ్చైవ తథావిధః॥ ౨౨॥

తావుభౌ నరశార్దూలౌ త్వద్దర్శన సముత్సుకౌ।
విచిన్వంతౌ మహీం కృత్స్నా మస్మాభి రభిసంగతౌ॥ ౨౩॥

త్వామేవ మార్గమాణౌ తౌ విచరంతౌ వసుంధరామ్।
దదర్శతు ర్మృగపతిం పూర్వజే నావరోపితమ్॥ ౨౪॥

ఋశ్యమూకస్య పృష్ఠే తు బహుపాదప సంకులే।
భ్రాతుర్భయార్త మాసీనం సుగ్రీవం ప్రియదర్శనమ్॥ ౨౫॥

వయంతు హరిరాజం తం సుగ్రీవం సత్యసంగరమ్।
పరిచర్యాస్మహే రాజ్యా త్పూర్వజే నావరోపితమ్॥ ౨౬॥

తత స్తౌ చీరవసనౌ ధనుఃప్రవర పాణినౌ।
ఋశ్యమూకస్య శైలస్య రమ్యం దేశ ముపాగతౌ॥ ౨౭॥

స తౌ దృష్ట్వా నరవ్యాఘ్రౌ ధన్వినౌ వానరర్షభః।
అవప్లుతో గిరే స్తస్య శిఖరం భయమోహితః॥ ౨౮॥

తత స్స శిఖరే తస్మి న్వానరేంద్రో వ్యవస్థితః।
తయో స్సమీపం మామేవ ప్రేషయామాస సత్వరమ్॥ ౨౯॥

౨౧. సత్యమందు ధర్మమందును రుచిగలవాఁడును, కాంతిగలవాఁడును, సంపదను జేర్చుటయందును, ఇచ్చుటయందును నిష్ఠగలవాఁడును, స్థలమును గాలమును నిశ్చయించు శక్తిగలవాఁడును లోకమునకెల్ల శుభముం గోరువాఁడును.

౨౨. అగు రామునకుఁ జవతితల్లి కొడుకై సహోదరుఁడైన సుమిత్రాపుత్రుఁడును (లక్ష్మణుఁడును) శత్రువులచే నోడింపఁబడనివాఁడును శ్రేషచేతను గుణములచేతను శ్రీరామునిం బోలినవాఁడును నై యున్నాఁడు.

౨౩. ఆమనుష్యశ్రేష్ఠులిద్దరును నిన్నుం గనఁజాలనను నాశతో దేశమెల్ల వెదకుచువచ్చి మముంజూచి సఖ్యముచేసిరి.

౨౪. నిన్ను వెదకుచువచ్చిన రామలక్ష్మణులు, అన్నయగు వాలిచే రాజ్యమునుండి తొలగింపఁబడిన వానరరాజగు సుగ్రీవునిం గాంచిరి.

౨౫, ౨౬. అన్నయగు వాలిచే నధికారమునుండి తొలఁగింపఁబడి భయభ్రాంతుఁడై పెక్కువృక్షములతో నిండియున్న ఋశ్యమూకపర్వతము యొక్క మఱుఁగుననున్నవాఁడును సాధువును న్యాయముగ యుద్ధముసేయువాఁడునునగు సుగ్రీవున కుపచారములుచేయుచు మేము(వానరులము) నున్నవారము.

౨౭. అట్లుండఁగ నారచీరలను ధరించినవారును, శ్రేష్ఠములగు విల్లను బట్టినవారునునగు శ్రీరాముఁడును లక్ష్మణుఁడును ఋశ్యమూకము నందలి యింపగు నెలవులను జేరవచ్చిరి.

౨౮. వానరరాజగు సుగ్రీవుఁడు ధనుస్సును ధరించియున్న రామలక్ష్మణులంగని భయభ్రాంతుఁడై యాకొండయొక్క శిఖరమునకుఁ బ్రాకినవాఁడయ్యెను.

౨౯. అట్లుచేరి యాసుగ్రీవుఁడందుండి రామలక్ష్మణులయొద్దకు వేగమున నన్నేపంపెను.

తావహం పురుషవ్యాఘ్రౌ సుగ్రీవ వచనాత్ప్రభూ।
రూపలక్షణ సంపన్నౌ కృతాంజలి రుపస్థితః॥ ౩౦।

తౌ పరిజ్ఞాత తత్త్వార్థౌ మయా ప్రీతిసమన్వితౌ।
పృష్ఠమారోప్య తం దేశం ప్రాపితౌ పురుషర్షభౌ॥ ౩౧।

నివేదితౌ చ తత్త్వేన సుగ్రీవాయ మహాత్మనే।
తయోరన్యోన్యసల్లాపా ద్భృశం ప్రీతి రజాయత॥ ౩౨।

తతస్తౌ ప్రీతిసంపన్నౌ హరీశ్వర నరేశ్వరౌ।
పరస్పర కృతాశ్వాసౌ కథయా పూర్వవృత్తయా॥ ౩౩।

తత స్స సాంత్వయామాస సుగ్రీవం లక్ష్మణాగ్రజః।
స్త్రీహేతో ర్వాలినా భ్రాత్రా నిరస్త మురు తేజసా॥ ౩౪।

తత స్త్వన్నాశజం శోకం రామ స్యాక్లిష్టకర్మణః।
లక్ష్మణో వానరేంద్రాయ సుగ్రీవాయ న్యవేదయత్। ౩౫।

తచ్ఛ్రుత్వా వానరేంద్రస్తు లక్ష్మణే నేరితం వచః।
తదాసీ న్నిష్ప్రభోత్యర్థం రాహుగ్రస్త ఇవాంశుమాన్॥ ౩౬॥

తత స్త్వద్గాత్రశోభీని రక్షసా హ్రియమాణయా।
యా న్యాభరణ జాలాని పాతితాని మహీతలే॥ ౩౭।

తాని సర్వాణి రామాయ ఆనీయ హరియూథపాః।
సంహృష్టా దర్శయామాసు ర్గతిం తే నవిదు స్తవ॥ ౩౮।

౩౦. రూపములచేతను శుభలక్షణములచేతను బూర్ణులైన య రుంతోత్తముల నిద్దఱను సుగ్రీవునియాజ్ఞచేఁ జేరంబోయి ప్రెమొక్కి నిలి

౩౧. పురుషశ్రేష్ఠులగు నా రామలక్ష్మణులు నాచేతఁ దెలుపం వాస్తవమగు విషయమునుగలవారై సంతోషించి, నాపీవుపై నెక్కి ఒడి యాచోటునకుఁ గొనిపోవం బడిరి.

౩౨. గొప్పబుద్ధిగల సుగ్రీవునకు రామలక్ష్మణులు వాస్తవము బుపంబడినవారై పరస్పర సంభాషణములచే నుభయులకును మైత్రియ త్రోషమును గలిగెను.

౩౩. అటుపై మిక్కిలి సంతోషముతోఁ గూడిన రామసుగ్రీ ములున్నడిచిన విశేషములను గూర్చి భాషించికొని యొకరినొక రాప కొనిరి.

౩౪. పిమ్మట రామచంద్రుఁడు స్త్రీనిమిత్తముగాఁ బ్రతాపవం తుగు వాలిచేత నధికారమునుండి నిగ్రహింపంబడినవాఁడగు సుగ్రీవుని షముదీఱ నుపచారవాక్యములు పలికెను.

౩౫. అటుపై లక్ష్మణుండు, నీవు కనంబడకపోవుటవలన (క్లేశ లేని కర్మగలవాఁడగు) శ్రీరామునకు సంభవించిన దుఃఖమును వానర ఘుఁడగు సుగ్రీవున కెఱిఁగించెను.

౩౬. వానరరాజగు సుగ్రీవుఁడు లక్ష్మణునిచేఁ బలుకంబడిన యమును విని (రాహువుచే గ్రసింపఁ బడిన సూర్యునివలె) మిక్కిలి కాంతిహీనుఁడయ్యెను.

౩౭, ౩౮. అటుపై రాక్షసునిచేతఁ గొనిపోవంబడుచున్న నీ మందుఁ బ్రకాశించుచుండినవై నీచేత భూమిపై వేయంబడిన భూషణము న్నియు నెత్తియుంచి సంతోషించినట్టివానరోత్తములు శ్రీరామునకు వ జూపిరి. నీవు కొనిపోవంబడినచోటు నెఱుంగరు.

తాని రామాయ దత్తాని మయైవోప హృతాని చ।
స్వనవం త్యవకీర్ణాని తస్మి న్విగతచేతసి॥ ౩౯॥

తాన్యంకే దర్శనీయాని కృత్వా బహువిధం తవ।
తేన దేవప్రకాశేన దేవేన పరిదేవితమ్॥ ౪౦॥

పశ్యత స్తాని రుదత స్తామ్యతశ్చ పునః పునః।
ప్రాదీపయ న్దాశరథే స్తాని శోక హుతాశనమ్॥ ౪౧॥

శయితం చ చిరం తేన దుఃఖా ర్తేన మహాత్మనా।
మయాపి వివిధై ర్వాక్యైః కృచ్ఛ్రా దుత్థాపితః పునః॥ ౪౨॥

తానిదృష్ట్వా మహాబాహు ర్దర్శయిత్వా ముహుర్ముహుః।
రాఘవ స్సహసౌమిత్రి స్సుగ్రీవే స న్యవేదయత్॥ ౪౩॥

స తవాదర్శనా దార్యే రాఘవః పరితప్యతే।
మహతా జ్వలతా నిత్య మగ్నినే వాగ్నిపర్వతః॥ ౪౪॥

త్వత్కృతే త మనిద్రాచ శోక శ్చింతా చ రాఘవమ్।
తాపయంతి మహాత్మాన మగ్న్యగార మివాగ్నయః॥ ౪౫॥

తవాదర్శన శోకేన రాఘవః ప్రవిచాల్యతే।
మహతా భూమికంపేన మహానివ శిలోచ్చయః॥ ౪౬॥

కాననాని సు రమ్యాణి నదీః ప్రస్రవణాని చ।
చర న్నరతి మాప్నోతి త్వా మపశ్య న్నృపాత్మజే॥ ౪౭॥

౩౯. నీచే నాకాశమునుండి క్రిందవేయంబడి ధ్వనించుచుఁ బడినవి యైయుండి నాచేఁ దేఁబడిన యాభూషణములు శ్రీరాముఁడు మూర్ఛచే మునుంగుచుండఁగా నాతని కీయంబడియెను.

౪౦. దేవతలంబోలు కాంతిగలవాఁడగు రామునిచే నాభూషణములు 'నీశరీరముపై నుండునపుడు చూడంబడినవిగదా!' అని తలఁచి తలఁచి దుఃఖింపఁబడియెను.

౪౧. ఆసొమ్ములనుజూచిజూచి యేడ్చియేడ్చి డయ్యుచున్న రామునియొక్క శోకమనునగ్గిని మఱియుమఱియు నాభూషణములు మండించెను.

౪౨. దుఃఖముచేఁ బీడింపఁబడినవాఁడగు నాతండు దీర్ఘకాలము మూర్ఛచే మునింగియుండెను. 'నేను దుఃఖశాంతియగు మాట లనేకముచెప్పి మిక్కిలి శ్రమతోఁ దెలివికిఁ దెచ్చుచుంటిని.

౪౩. బలవంతుఁడగు రాఘవుండు లక్ష్మణసమేతుఁడై యాభూషణములను బలుమాఱుచూచి పిమ్మట సుగ్రీవునిచేత నిచ్చెను.

౪౪. ఓపుణ్యురాలా! ఆరాఘవుండు నినుంజూడమిచేత, గొప్పనిప్పుతోఁగూడి యెల్లపుడు మండుచున్న యగ్నిపర్వతమువలె మిక్కిలి బొగులుచున్నవాఁడు.

౪౫. నీనిమిత్తమై నిద్దురలేకపోవుటయు, దేహతాపమును, మనోవ్యథయు ననుమూఁడును ధీరుఁడగు రాఘవునిఁ (ఆహవనీయము దక్షిణాగ్ని గార్హపత్యములను మూఁడగ్నులును యజ్ఞశాలను బెట్టుపఱచునట్లుగా) దపింపఁజేయుచున్నవి.

౪౬. దొడ్డభూకంపముచేత నట్టిట్టూగు పర్వతమువలె (నినుంగానని శోకముచే) రాఘవుండు కంపము నొందుచున్నవాఁడు.

౪౭. ఓరాజపుత్త్రీ! రామచంద్రుఁడు నినుంగాననందున, రమ్యములగువనములను, నదులను, సెలయేళ్ళను దిరుగుచుండియుఁ దృప్తిలేకయున్నవాఁడు.

స త్వాం మనుజశార్దూలః క్షిప్రం ప్రాప్స్యతి రాఘవః।
సమిత్ర బాంధవం హత్వా రావణం జనకాత్మజే॥ ౪౮॥
సహితౌ రామసుగ్రీవా వుభా వకురుతాం తదా।
సమయం వాలినం హంతుం తవచాన్వేషణం తదా॥ ౪౯॥
తత స్తాభ్యాం కుమారాభ్యాం వీరాభ్యాం సహరీశ్వరః।
కిష్కింధాం సముపాగమ్య వాలీ యుద్ధే నిపాతితః॥ ౫౦॥
తతో నిహత్య తరసా రామో వాలిన మాహవే।
సర్వర్క్ష హరిసంఘానాం సుగ్రీవ మకరో త్పతిమ్॥ ౫౧॥
రామసుగ్రీవయో రైక్యం దేవ్యేవం సమజాయత।
హనుమంతం చ మాం విద్ధి తయోర్దూత మిహాగతమ్॥ ౫౨॥
స్వరాజ్యం ప్రాప్య సుగ్రీవ స్సమానీయ హరీశ్వరాన్।
త్వదర్థం ప్రేషయామాస దిశో దశ మహాబలాన్॥ ౫౩॥
ఆదిష్టా వానరేంద్రేణ సుగ్రీవేణ మహౌజసా।
అద్రిరాజ ప్రతీకాశా స్సర్వతః ప్రస్థితా మహీమ్॥ ౫౪॥
తత స్తే మార్గమాణా వై సుగ్రీవ వచనాతురాః।
చరంతి వసుధాం కృత్స్నాం వయమన్యే చ వానరాః॥ ౫౫॥
అంగదో నామ లక్ష్మీవాన్ వాలిసూను ర్మహాబలః।
ప్రస్థితః కపిశార్దూల స్త్రిభాగ బలసంయుతః॥ ౫౬॥

౪౮. ఓజానకీ! పురుషోత్తముఁడగు రాముఁడు, మిత్రులతోడను, భ్రాతృములతోడనుకూడ రావణుని రూపుమాపి వేగముగ నిన్నుఁ గొనిపోవును.

౪౯. మీఁదఁ జెప్పంబడినట్లు కూడినవారగు రాముఁడును సుగ్రీవుఁడును వాలినిజంపుటకును, నిన్ను వెదకుటకు నప్పుడు ప్రతిజ్ఞఁ జేసికొనిరి.

౫౦. అటుపై శూరులును, పడుచువాండ్రునునగు నా రామలక్ష్మణులప్రాపుచే సుగ్రీవుఁడు కిష్కింధను జేరఁబోయెను. యుద్ధమున వాలి చంపంబడియెను.

౫౧. పిమ్మట రాముండు యుద్ధమున వేగమున వాలినిఁ జంపి సమస్తమగు వానరులకును, ఎలుగుబంట్లకును సుగ్రీవునిఁ బ్రభునిఁ జేసెను.

౫౨. ఓతల్లీ శ్రీరామునకును సుగ్రీవునకును మైత్రి యిట్లుసంభవించెను. ఇచ్చటికి వచ్చియున్న నన్ను వారియొక్క దూతనుగాను హనుమంతుఁడను పేరుగలవానింగాను దెలియుము.

౫౩. మీఁదఁ జెప్పంబడినట్లు తనరాజ్యమును బొందినవాఁడై సుగ్రీవుఁడు బలవంతులగు వానరోత్తముల నందఱను బిలుపించి పది దిక్కులకును వెదుకనంపెను.

౫౪. ప్రతాపసంపన్నుండగు సుగ్రీవునిచే నాజ్ఞాపింపఁబడినవారై పర్వతములతోఁ దుల్యులైన వానరోత్తములు భూమిపై నన్నిదిక్కులకు నేగిరి.

౫౫. సుగ్రీవునియాజ్ఞచే భయపడినవారమై మేమును, మఱికొందఱు వానరులును నిన్ను వెదకుచు భూమియందెల్లఁ దిరుగుచున్నారము.

౫౬. కాంతివంతుఁడును, బలవంతుఁడును, వానరోత్తముఁడును, వాలిపుత్రుఁడునగు నంగదుఁడని పేరుగలవాఁడు మూఁడవపాలుసేనఁ గలవాఁడై ప్రయాణమయ్యెను.

తేషాం నో విప్రణష్టానాం వింధ్యే పర్వత సత్తమే।
భృశం శోకపరీతానా మహోరాత్రగణా గతాః॥ ౫౭॥
తే వయం కార్యనైరాశ్యా త్కాలస్యాతిక్రమేణ చ।
భయాచ్చ కపిరాజస్య ప్రాణాం స్త్యక్తుం వ్యవస్థితాః॥ ౫౮॥
విచిత్య వనదుర్గాణి గిరిప్రస్రవణాని చ।
అనాసాద్య పదం దేవ్యాః ప్రాణాం స్త్యక్తుం సముద్యతాః॥౫౯॥
దృష్ట్వా ప్రాయోపవిష్టాం శ్చ సర్వాన్ వానరపుంగవాన్।
భృశం శోకార్ణవే మగ్నః పర్యదేవయ దంగదః॥ ౬౦॥
తవ నాశం చ వైదేహి వాలిన శ్చ వధం తథా।
ప్రాయోపవేశ మస్మాకం మరణం చ జటాయుషః॥ ౬౧॥
తేషాం నస్స్వామి సందేశా న్నిరాశానాం ముమూర్షతామ్।
కార్యహేతో రివా యాత శ్శకుని ర్వీర్యవాన్ మహాన్॥ ౬౨॥
గృధ్రరాజస్య సోదర్య స్సంపాతి ర్నామ గృధ్రరాట్।
శ్రుత్వా భ్రాతృవధం కోపా దిదం వచన మబ్రవీత్॥ ౬౩॥
యవీయా న్కేన మే భ్రాతా హతః క్వ చ ని పాతితః।
ఏతదాఖ్యాతు మిచ్ఛామి భవద్భి ర్వానరోత్తమాః॥ ౬౪॥
అంగదో కథయ త్తస్య జనస్థానే మహద్వధమ్।
రక్షసా భీమరూపేణ త్వా ముద్దిశ్య యథా తథమ్॥ ౬౫॥

౫౭. పర్వతశ్రేష్ఠమగు వింధ్యమున నొకకొకరిని గనంజాలక మార్గముతప్పి మిక్కిలిశోకించుచున్నమా కెన్నియో దినములుగడచెను.

౫౮. అట్లు దుఃఖించుచున్న మేము కార్యము కాకపోయెనను చింతచేతను, దినములు గడచిపోవుటచేతను, సుగ్రీవునివలని భయముచేతను, ప్రాణములను విడుచుటకు సిద్ధముగా నుంటిమి.

౫౯. చొరఁగూడని యడవులను, నెలయేళ్ళను వెదకి వెదకియు సీతయుండు తావును గనఁజాలక ప్రాణములను విడువఁ బూనితిమి.

౬౦. ౬౧. ఓజానకీ! అన్నపానములనుగొనక చావునకుఁ దెగించియున్న వానరోత్తములను సందఱను, నీవు కనంబడకపోవుటను, తన తండ్రియగువాలి చంపఁబడుటను, జటాయువు చావును మేముప్రాణములనువిడువ సిద్ధముగానుండుటను గాంచి శోకసముద్రమున మిక్కిలి మున్గినవాఁడై యంగదుండు దుఃఖించెను.

౬౨. ౬౩. ప్రభుండగు సుగ్రీవుని యాజ్ఞవలనఁ (అతఁడుచెప్పినంతకాలములో వెదకఁ జాలమైతిమి గావున) ప్రాణములను విడువఁ దలంచిన వారమును, కార్యము దాళచెడి యున్నవారమును నగుమాకుఁ గార్యహేతువవలెనే పరాక్రమవంతుఁడును, గొప్పవాఁడును, గ్రద్దలకురాజగు జటాయువుయొక్క సోదరుఁడును నగు సంపాతియనుపక్షి చేరవచ్చి తన తమ్ముఁడగు జటాయువుయొక్క చావునువిని, కోపమువలన నిట్లనియెను.

౬౪. ఓవానరశ్రేష్ఠులారా! నాకుం బిమ్మటఁ బుట్టినవాఁడగు నా సోదరుఁ డెవనిచేఁ జంపఁబడి యెందుఁబడవేయంబడి యున్నాఁడో మీవలన నెఱుంగఁగోరెదను.

౬౫. జనస్థానమనుచోట ఖరదూషణాదులదియగు గొప్పవధయును, భయంకరుఁడగు రాక్షసునిచే నీకుఁగలిగిన పాటును, క్రమముగ నంతయు నంగదుఁడు సంపాతికెఱింగించెను.

జటాయుషో వధం శ్రుత్వా దుఃఖిత స్స రుణాత్మజః।
త్వాం శశంస వరారోహే వసంతీం రావణాలయే॥ ౭౬॥
తస్య తద్వచనం శ్రుత్వా సంపాతేః ప్రీతివర్ధనమ్।
అంగద ప్రముఖా స్తూర్ణం తత స్సంప్రస్థితా వయమ్॥ ౭౭॥
వింధ్యా దుత్థాయ సంప్రాప్తా స్సాగరస్యాంత ముత్తరమ్।
త్వద్దర్శన కృతోత్సాహా హృష్టా స్తుష్టాః ప్లవంగమాః॥ ౭౮॥
అంగదప్రముఖా స్సర్వే వేలోపాంత ముపస్థితాః।
చింతాం జగ్ముః పునర్భీతా స్త్వద్దర్శన సముత్సుకాః॥ ౭౯॥
అథాహం హరిసైన్యస్య సాదరం ప్రేక్ష్య సీదతః।
వ్యవధూయ భయం తీవ్రం యోజనానాం శతం ప్లుతః॥ ౮౦॥
లంకాచాపి మయా రాత్రౌ ప్రవిష్టా రాక్షసా కులా।
రావణశ్చ మయాదృష్ట స్త్వంచ శోక పరిప్లుతా॥ ౮౧॥
ఏత త్తే సర్వమాఖ్యాతం యథావృత్త మనిందితే।
అభిభాషస్వ మాం దేవి దూతో దాశరథే రహమ్॥ ౮౨॥
తం మాం రామకృతోద్యోగం త్వన్నిమిత్త మిహాగతమ్।
సుగ్రీవ సచివం దేవి బుధ్యస్వ పవనాత్మజమ్॥ ౮౩॥
కుశలీ తవ కాకుత్స్థ స్సర్వశస్త్రభృతాం వరః।
గురో రారాధనే యుక్తో లక్ష్మణశ్చ సులక్షణః॥ ౮౪॥

౧౬. అరుణుని పుత్రుండగు నాసంపాతి జటాయువుయొక్క మరణమును విని దుఃఖించి, ఓదేవీ! రావణునియింటనుండు నినుంగూర్చి తెలియంబలికెను.

౧౭. సంతోషమును వృద్ధిచేయునట్టిదియగు సంపాతిమాటను విని యంగదుని ముందుగలవారము మేమందఱమును వేగమునం దరలితిమి.

౧౮. వానరులు వింధ్యపర్వతమునుండి కదలి, నినుంగాంచు సంతోషముచే నుత్సహించినవారును, సంతోషించినవారును, తృప్తిచెందినవారునునై సముద్రముయొక్క యుత్తరపుగట్టును జేరిరి.

౧౯. అంగదుండును మొదలగువారందఱును నినుంగాంచుటయందు గోరికగలవారై సముద్రపుగట్టును జేరి, భయపడినవారై మరలం జింతించిరి.

౨౦. పిమ్మట నేను వానరసైన్యము పొందుచున్న భయమునుదుఃఖమును ప్రేమతోఁ గాంచి నివారించి యీనూఱామడలను దాఁటితిని.

౨౧. రాక్షసులను మెండుగఁగలిగి కలకలమనుచున్న యీలంకయందు రాత్రివేళఁ బ్రవేశించితిని, రావణునింగంటిని, శోకముతోనున్న నిన్నుం గాంచితిని.

౨౨. ఓశుద్ధురాలా! ఇదియంతయు జరిగినదిజరిగినట్లు నీకుం జెప్పితిని. ఓతల్లీ! నేను రామునిదూతను, నాతోడ మాటలాడుము!

౨౩. ఓదేవీ! శ్రీరాముని కార్యమందున్నవాఁడనగు నన్ను నీనిమిత్తమిచ్చుటకి వచ్చినవానినిగాను, సుగ్రీవుని మంత్రినిఁగాను వాయుదేవుని పుత్రునింగా నెఱుంగుము.

౨౪. ఆయుధములను ధరించినవారిలోనెల్ల నుత్తముఁడగు నీభర్త సౌఖ్యముగ నున్నవాఁడు. శుభలక్షణములనుఁ గలవాఁడగు లక్ష్మణుఁడను సంద్రజితోఁ దుల్యుఁడగు శ్రీరామున కుపచారము నేయుచున్నాఁడు.

తస్య వీర్యవతో దేవి భర్తు స్తవహితే రతః।
అహ మేకస్తు సంప్రాప్త స్సుగ్రీవ వచనాదిహ॥ ౭౫॥

మయే య మసహాయేన చరతా కామరూపిణా।
దక్షిణా ది గనుక్రాంతా త్వన్మార్గ విచయైషిణా॥ ౭౬॥

దిష్ట్యాహం హరిసైన్యానాం త్వన్నాశ మనుశోచతామ్।
అపనేష్యామి సంతాపం తవాభిగమ శంసనాత్॥ ౭౭॥

దిష్ట్యాహి మమ నవ్యర్థం దేవి సాగర లంఘనమ్।
ప్రాప్స్యామ్యహ మిదం దిష్ట్యా త్వద్దర్శనకృతం యశః॥ ౭౮॥

రాఘవశ్చ మహావీర్యః క్షిప్రం త్వా మభిపత్స్యతే।
సమిత్ర బాంధవం హత్వా రావణం రాక్షసాధిపమ్॥ ౭౯॥

మాల్యవా న్నామ వైదేహి గిరీణా ము త్తమోగిరిః।
తతో గచ్ఛతి గోకర్ణం పర్వతం కేసరీ హరిః॥ ॥౮౦॥

స చ దేవర్షిభి ర్దిష్టః పితా మమ మహాకపిః।
తీర్థే నదీపతేః పుణ్యే శంబసాదన ముద్ధరత్॥ ౮౧॥

తస్యాహం హరిణః క్షేత్రే జాతో వాతేన మైథిలి।
హనుమానితి విఖ్యాతో లోకే స్వేనైవ కర్మణా॥ ౮౨॥

౨౫. సుగ్రీవుని యాజ్ఞచొప్పున, పరాక్రమవంతుఁడగు నీభర్త యొక్క కార్యమును జేయుటయం దాసక్తులగువారలలో నేనొక్కండనై యిందువచ్చినవాఁడను.

౨౬. తోఁడులేకయే సంచరించుచున్నవాఁడను, కోరిన రూపము ను ధరించువాఁడను, నిన్ను వెదకుటయే పనిగాఁ గలవాఁడను నగునాచేత నీదక్షిణపుదిశ పొందంబడియెను. (దక్షిణముఖముగావచ్చితి)

౨౭. నీవు కనంబడకపోవుటచే దుఃఖించుచున్న వానరసేనలతో నదృష్టవశమున నేను నినుంజేరవచ్చినచొప్పును దెలిపి వారి మనోవ్యథను బోఁగొట్టఁ గలవాఁడను

౨౮. ఓ తల్లీ! నేను సముద్రమును దాఁటుట యదృష్టవశమున వ్యర్థముకాని దయ్యెను. నినుంగాంచినందున నీకీర్తి నాభాగ్యవశమునఁ బొందితిని.

౨౯. పరాక్రమ సంపన్నుఁడగు శ్రీరాముండు, మిత్రులతోడను బుట్టములతోడను గూడినవాఁడును రాక్షసరాజును నగు రావణునిం జంపి వేగమున నినుంబొందఁగలఁడు.

౩౦. ఓ జానకీ! పర్వతములలో నుత్తమమై మాల్యవంతమనుపే రునఁ బ్రఖ్యాతిగాంచిన కొండయొకటిగలదు. అందుండి కేసరియను వాన రుఁడు గోకర్ణమను పర్వతమునకేగెను.

౩౧. గొప్పవానరుఁడును నాకుఁ దండ్రియు నగునాకేసరి సము ద్రముయొక్క పుణ్యస్థలమున నొకచోటనుండు మహామునులచే నియమిం పంబడినవాఁడై శంబసాదనుఁడను రాక్షసునింజంపెను.

౩౨. ఓ జానకి! ఆవానరునకు భార్యయగు నంజనయను దేవి యందు వాయుదేవునివలనఁ బుట్టినవాఁడనై, నేనై చేసికొనిన కార్యముచే తనే హనుమంతుఁడను ఖ్యాతిని లోకమునం గాంచితిని.

విశ్వాసార్థం తు వైదేహి భర్తు రుక్తా మయా గుణాః।
అచిరా ద్రాఘవో దేవి త్వా మతో నయితా నఘే॥ ౮౩॥

ఏవం విశ్వాసితా సీతా హేతుభి శ్శోకకర్శితా।
ఉపపన్నై రభిజ్ఞానై ర్దూతం త మవగచ్ఛతి॥ ౮౪॥

అతులం చ గతా హర్షం ప్రహర్షేణ చ జానకీ।
నేత్రాభ్యాం వక్రపక్ష్మాభ్యాం ముమోచానందజం జలమ్॥

చారు తద్వదనం తస్యా స్తామ్ర శుక్లాయ తేక్షణమ్।
అశోభత విశాలాక్ష్యా రాహుముక్త ఇవోడురాట్॥ ౮౬॥

హనుమంతం కపిం వ్యక్తం మన్యతే నాన్యథేతి సా।
అథోవాచ హనుమాం స్తా ముత్తరం ప్రియదర్శనామ్॥ ౮౭॥

ఏతత్తే సర్వమాఖ్యాతం సమాశ్వసిహి మైథిలి।
కింకరోమి కథం వా తే రోచతే ప్రతియామ్యహమ్॥ ౮౮॥

హతే సురే సంయతి శంబసాదనే కపిప్రవీరేణ మహర్షి చోదనాత్। తతోఽస్మి వాయుప్రభవో హి మైథిలి ప్రభావత స్తత్ప్రతిమశ్చ వానరః॥ ౮౯॥

ఇతి శ్రీమత్సుందరకాండే - పంచత్రింశస్సర్గః.



౮౩. ఓ దేవి ! నీవు నన్ను నమ్ముటకొఱకు నీభర్తయొక్క గుణములు నాచేఁ జెప్పంబడియెను. ఓ పుణ్యవతీ ! నిన్ను శీఘ్రముగనే రాఘవుండు గొనిపోవం గలఁడు.

౮౪. శోకముచేఁ గృశించియున్నసీత, మీఁద జెప్పంబడినట్లు హేతువులచేతను యుక్తులచేతను బోధింపఁబడినదై నమ్మికగాంచి యావానరుని శ్రీరామదూతగా నెఱింగినదయ్యెను

౮౫. సంతోషమునకు హేతువైన హనుమంతునిమాటలచే సీతాదేవి సాటిలేనిసంతోషమును బొందినదై వక్రములగు ఱెప్పలనుగల కన్నులనుండి యానందబాష్పములను విడిచెను.

౮౬. కొలుకులం దెఱుపునుగలిగి విశాలములైన నేత్రములను గల యందమగు నామెమోము, రాహువుచే విడువఁబడిన చంద్రునిబింబమువలెఁ బ్రకాశించెను.

౮౭. ఆసీతాదేవి హనుమంతుని స్పష్టముగ వానరుఁడనియు, ఇతరుఁడు గాఁడనియుఁ దలంచెను. పిమ్మట నింపగురూపమును గలదియగు నామెతోడ నాతం డిట్లు ప్రత్యుత్తరము పలికెను.

౮౮. ఓజానకీ ! విషయమంతయు నీకు నాచేఁ దేటగఁ జెప్పంబడియెను. ఇఁక నూరడిల్లుము ! నీ వెద్ది యెట్లుచేయుమనియెదవో నేనట్లుచేయువాఁడను. శ్రీరామునింగాన నేగెదను.

౮౯. ఓసీతాదేవి ! మహామునులయొక్క యాజ్ఞచే శంబసాదనుఁడను రాక్షసుఁడు యుద్ధమందు నాతండ్రియగు కేసరిచేఁ జంపఁబడఁగాఁ బిమ్మట నేను వాయుదేవునివలనఁ బుట్టినవాఁడను, శక్తిచే నావాయుదేవునితోఁ దుల్యుఁడనగు వానరుఁడను జుమా !

ఇది ముప్పదియైదవ సర్గ.



## షట్త్రింశస్సర్గః.

భూయ ఏవ మహాతేజా హనుమా న్మారుతాత్మజః।
అబ్రవీ త్ప్రశ్రితం వాక్యం సీతా ప్రత్యయ కారణాత్॥ ౧॥

వానరోహం మహాభాగే దూతో రామస్య ధీమతః।
రామ నామాంకితం చేదం పశ్య దే వ్యంగుళీయకమ్॥ ౨॥

ప్రత్యయార్థం తవానీతం తేన దత్తం మహాత్మనా।
సమాశ్వసి హి భద్రం తే క్షీణదుఃఖ ఫలాహ్యసి॥ ౩॥

గృహీత్వా ప్రేక్షమాణాసా భర్తుః కరవిభూషణమ్।
భర్తార మివ సంప్రాప్తా జానకీ ముదితా భవత్॥ ౪॥

చారు తద్వదనం తస్యా స్తామ్ర శుక్లాయ తేక్షణమ్।
అశోభత విశాలాక్ష్యా రాహుముక్త ఇవోడురాట్॥ ౫॥

తతః సా హ్రీమతీ బాలా భర్తృసందేశ హర్షితా।
పరితుష్టా ప్రియం కృత్వా ప్రశశంస మహాకపిమ్॥ ౬॥

విక్రాంత స్త్వం సమర్థ స్త్వం ప్రాజ్ఞ స్త్వం వానరోత్తమ
యేనేదం రాక్షసపదం త్వయైకేన ప్రధర్షితమ్॥ ౭॥

శతయోజన విస్తీర్ణ స్సాగరో మకరాలయః।
విక్రమ శ్లాఘనీయేన క్రమతా గోష్పదీ కృతః॥ ౮॥

## ముప్పది యాఱవసర్గ.

౧. వాయుపుత్రుఁడును. మిక్కిలి ప్రతాపముగలవాఁడును నగు హనుమంతుఁడు దన్ను సీత బాగుగ నమ్ముటను గారణముగాఁగలిగి మిక్కిలి యడఁకువతోఁగూడిన వాక్యము నిట్లుపలికెను.

౨. ఓ పుణ్యాత్మురాలా! నేను వానరుఁడను, బుద్ధిమంతుఁడగు శ్రీరామునకు దూతను, శ్రీరాముని పేరును గుఱుతుగాఁగల యీయుంగరమును గనుమా! తల్లీ!

౩. పూజ్యుఁడగు శ్రీరామునిచే నీయంబడినదై నీనమ్మికకొఱకై తేఁబడియెను. నీకు మేలగుఁగాక, చింతమానుము! నశించిన దుఃఖముగలదాన వగుదువు.

౪. ఆజానకి భర్తయొక్కచేతికి భూషణముగానుండిన యాయుంగరము నందికొని చూచుచు మగనినిబొందినట్లే తలంచి కరంబు సంతసించెను.

౫. ఎఱ్ఱని కొలుకులతోఁ గూడిన విశాలములగు కన్నులనుగలిగి యందమైన యాయిల్లాలిమోము రాహువుచే విడువంబడిన చంద్రునిబింబమువలె మిక్కిలి యొప్పారెను.

౬. పిమ్మట, మగనిచే నంపఁబడినవార్తనువిని సంతోషించినదియు, సిగ్గుచెందినదియు నగు నాపసియిల్లాలు మిక్కిలి యుప్పొంగి యావానరోత్తమునిఁ గొనియాడెను.

౭. సహాయములేక యొంటరివై, భీకరులగు రాక్షసులనుగల యీలంకయందుఁ బొచ్చితివిగావున నీవు పరాక్రమశాలివి, శక్తిమంతుఁడవు, బుద్ధిశాలివి యగుదువు వానరోత్తమ!

౮. దర్పముచేఁ గొనియాడంబడఁ దగినవాఁడవగు నీచేత, మొసళ్లకునెలవై భీకరమై నూఱు యోజనముల వెడల్పుగల యీసముద్రము దాఁటుటయం దావడుగంత వెడల్పుగలదిగా భావింపం బడియె.

న హి త్వాం ప్రాకృతం మన్యే వానరం వానరర్షభ।
యస్య తే నాస్తి సంత్రాసో రావణా న్నాపి సంభ్రమః॥ ౯॥

అర్హా సే చ కపిశ్రేష్ఠ మయా సమభిభాషితుమ్।
యద్యపి ప్రేషిత స్తేన రామేణ విదితాత్మనా॥ ౧౦॥

ప్రేషయిష్యతి దుర్ధర్షో రామో న హ్యపరీక్షితమ్।
పరాక్రమ మవిజ్ఞాయ మత్సకాశం విశేషతః॥ ౧౧

దిష్ట్యాచ కుశలీ రామో ధర్మాత్మా సత్యసంగరః।
లక్ష్మణశ్చ మహాతేజా సుమిత్రా నందవర్ధనః॥ ౧౨॥

కుశలీ యది కాకుత్స్థః కిన్ను సాగర మేఖలామ్।
మహీం దహతి కోపేన యుగాంతాగ్ని రివోత్థితః॥ ౧౩॥

అథవా శక్తిమంతౌ తౌ సురాణా మపి నిగ్రహే।
మమైవ తు న దుఃఖానా మస్తిమన్యే విపర్యయః॥ ౧౪॥

కచ్చి న్నవ్యథితో రామః కచ్చి న్న పరితప్యతే।
ఉత్తరాణి చ కార్యాణి కురుతే పురుషోత్తమః॥ ౧౫॥

కచ్చి న్నదీన స్సంభ్రాంతః కార్యేషు చ నముహ్యతి।
కచ్చి త్పురుష కార్యాణి కురుతే నృపతే స్సుతః॥ ౧౬

౯. ఓవానరోత్తమా ! రావణునివలన నీకు భయమును, తొట్రుపాటును లేవుగావున నిన్ను సామాన్యవానరునిఁగాఁ దలంపను.

౧౦. ఓవానరోత్తమా ! భావము నెఱింగినవాఁడగు శ్రీరామునిచే నెందుల కనుపంబడితివిగావున నాతోడ మాటలాడఁ దగుదువు సుమా !

౧౧. శత్రువుల కోర్వరానివాఁడగు శ్రీరాముండు బలదర్పములను బాగుగఁ దెలిసికొనక, గుణశీలములు పరీక్షింపక యొకనిని నాకడ కేల పనుచును ?

౧౨. ధర్మస్వభావము గలవాఁడును, న్యాయమగు యుద్ధమును జేయువాఁడును నగురాముం డదృష్టవశముచే క్షేమముగనున్నవాఁడు. సుమిత్రాదేవి కానందమును బెంచువాఁడగు లక్ష్మణుఁడును బాగుగనున్నాఁడు.

౧౩. శ్రీరాముఁడు క్షేమముగా నున్నవాఁడైనచో సముద్రములచే నలుప్రక్కలఁ జుట్టంబడినదియగు భూమండలము నెల్లఁ బ్రళయకాలమందలి యగ్నివలె లేచినవాఁడై కోపముచేఁ గాల్చుచున్నాఁడా ?

౧౪. అట్లుగాకున్నను, బలవంతులగు నన్నదమ్ములిద్దఱును దేవతల నేనియు దండింపఁజాలినవా రగుదురుగాని నాదుఃఖమునకుమాత్రము దుద లేకయున్నది.

౧౫. రామచంద్రుఁడు వ్యసనమునొందుటలేదా ? తపించుచుండుటలేదా ? పురుషశ్రేష్ఠుఁడగు నాతండు ముందుజరుగవలయు పనులకుయత్నము చేయుచున్నాఁడా ?

౧౬. రాచకొమరుఁడగు నాప్రాణేశుం డధైర్యపడలేదుగదా ! కార్యములయందుఁ దొట్రుపాటునొంది భ్రమచెందుట లేదుగదా ! పురుషప్రయత్న మేమరక చేయుచున్నాఁడుగదా !

ద్వివిధం త్రివిధోపాయ ముపాయమపి సేవతే।
విజిగీషు స్సుహృ త్కచ్చి న్మిత్రేషు చ పరంతప॥ ౧౭

కచ్చి న్మిత్రాణి లభతే మిత్రై శ్చాప్యభిగమ్యతే।
కచ్చి త్కల్యాణ మిత్రశ్చ మిత్రై శ్చాపి పురస్కృతః॥ ౧౮

కచ్చి దాశాస్తి దేవానాం ప్రసాదం పార్థివాత్మజః।
కచ్చి త్పురుషకారం చ దైవం చ ప్రతిపద్యతే॥ ౧౯

కచ్చి న్న విగతస్నేహః ప్రవాసా న్మయి రాఘవః।
కచ్చి న్మాం వ్యసనా దస్మా న్మోక్షయిష్యతి వానర॥ ౨౦

సుఖానా ముచితో నిత్య మసుఖానా మనోచితః।
దుఃఖ ముత్తర మాసాద్య కచ్చి ద్రామో న సీదతి॥ ౨౧

కౌసల్యాయా స్తథా కచ్చి త్సుమిత్రాయా స్తథైవ చ।
అభీక్ష్ణం శ్రూయతే కచ్చి త్కుశలం భరతస్య చ॥ ౨౨

మన్నిమిత్తేన మానార్హః కచ్చి చ్ఛోకేన రాఘవః।
కచ్చి న్నాన్యమనా రామః కచ్చి న్మాం తారయిష్యతి॥ ౨౩

కచ్చి దక్షౌహిణీం భీమాం భరతో భ్రాతృవత్సలః।
ధ్వజినీం మంత్రిభి ర్గుప్తాం ప్రేషయిష్యతి మత్కృతే॥ ౨౪

౧౭. శత్రువులను దపింపఁజేయువాఁడును, జయమం దిష్టముగల వాఁడును నగు రాముండు నాయందు మంచిమనస్సుగలవాఁడై సామభేద దానములను నుపాయములను, నాల్గవదియగు దండోపాయమును రెండు రకలుగా మిత్రులయందును శత్రులయందును బ్రయోగించుచున్నాఁడా ?

౧౮. రామచంద్రుఁడు మిత్రులను సంపాదించుచున్నాఁడా? మిత్రులచేతను జెందఁబడుచున్నాఁడా ? యోగ్యులగు మిత్రులను గలిగియున్నాఁడా ? మిత్రులచేతను నాదరింపఁ బడుచున్నాఁడా ?

౧౯. ఆరాచకొమరుండు దేవతలయొక్క దయను వేఁడుచున్నాఁడా ? కార్యములుసాధింప యత్నము సేయుచున్నాఁడా ? దైవానుకూలమును గలిగియున్నాఁడా ?

౨౦. ఓవానరుఁడా ! రాఘవుఁడు నేను దూరదేశమం దున్నాను గావున నాయందుఁ బ్రేమమానియుండలేదుగదా ? ఈవ్యసనమునుండి నన్ను విడిపింపఁ దలఁచియున్నాఁడా ?

౨౧. ఎల్లప్పుడు సౌఖ్యములకుం దగినవాఁడును, అసౌఖ్యములకుఁ దగనివాఁడును నగురాముండు గొప్పదియగు నీదుఃఖమును జెంది నశింపకయున్నాఁడా ?

౨౨. కౌసల్యయొక్కయు సుమిత్రయొక్కయు క్షేమమును భరతునియొక్క క్షేమమును బలుమాఱుం దెలియవచ్చుచున్నది గదా ?

౨౩. గౌరవమున కర్హుఁడైన రామచంద్రుఁడు నానిమిత్తమగు శోకముచే నవయుచున్నాఁడుగదా ? ఇతరమగు నేవిషయమందును మనస్సులేకయె యున్నాఁడుగదా ! నన్నీ చేటునుండి తేర్చునా ?

౨౪. అన్నయందు భక్తిగలవాఁడగు భరతుఁడు, అక్షౌహిణులసంఖ్యగలదియు భయంకరమైనదియు మంత్రులచేరక్షింపఁబడినదియు నగు సేనను నానిమిత్తమై పనుచునా ?

వానరాధిపతి శ్రీమాన్ సుగ్రీవః కచ్చి దేష్యతి।
మత్కృతే హరిభి ర్వీరై ర్వృతో దంతనఖాయుధైః॥ ౨౬

కచ్చిచ్చ లక్ష్మణ శ్శూర స్సుమిత్రా నందవర్ధనః।
అ స్త్రవి చ్ఛరజాలేన రాక్షసా న్విధమిష్యతి॥ ౨౭

రౌద్రేణ కచ్చిద స్త్రేణ జ్వలతా నిహతం రణే।
ద్రక్ష్యా మ్యల్పేన కాలేన రావణం స సుహృజ్జనమ్॥ ౨౮

కచ్చి న్న తద్ధేమసమానవర్ణం తస్యాననం పద్మసమానగంధి।
మయావినా శుష్యతిశోకదీనం జలక్షయే పద్మమి వాతపేన॥

ధర్మాపదేశా త్త్యజతశ్చరాజ్యం మాంచాప్యరణ్యం నయతః
పదాతిమ్ । నాసీద్వ్యథా యస్య నభీ ర్నశోకః కచ్చిచ్చ ధైర్యం
హృదయే కరోతి॥ ౨౯

నచాస్యమాతా నపితాచ నాన్య స్స్నేహాద్విశిష్టోఽస్తి మయాస
మోవా । తావ త్త్వహం వీర జిజీవిషేయం యావత్ప్రవృ
త్తిం శృణుయాం ప్రియస్య॥ 30

ఇతీవదేవీ వచనం మహార్థం తం వానరేంద్రం మధురార్థ ము
క్త్వా । శ్రోతుం పున స్తస్య వచోఽభిరామం రామార్థయుక్తం
విరరామ రామా॥ 3౧

౨౫. లక్ష్మీవంతుఁడును, వానరరాజును నగుసుగ్రీవుండు దంతములును గోళ్లనే యాయుధములుగాఁ గలవారును శూరులును నగువానరులచేతఁ జుట్టంబడినవాఁడై నానిమిత్తము వచ్చునా ?

౨౬. పరాక్రమశాలియు సుమిత్రయొక్క యానందమును వృద్ధి చేయువాఁడును బాణముల నెఱింగినవాఁడును నగులక్ష్మణుఁడు బాణసమూహములచేత రాక్షసుల నెగరఁ జిమ్మునా ?

౨౭. రుద్రసంబంధమైనదియు, మండుచున్నదియు నగుబాణముచే యుద్ధమందు మిత్రబాంధవజన సమేతముగా రామచంద్రునిచేఁ జంపఁబడిన రావణాసురుని శీఘ్రకాలముననే చూతునా ?

౨౮. బంగారముతో సమానమగు వర్ణముగలదియు, తామరపువ్వులవలెఁ బరిమళించునదియు నగు శ్రీరామునియొక్క ముఖము, నన్నెడఁబాసినందున దుఃఖించి చిన్నబోయి(నీ రినికిపోవుటచే నెండదెబ్బతగిలి వాడిన కమలమువలె) నవయుచున్నది.

౨౯. ధర్మమును నెపమున రాజ్యమును విడుచుచున్నవాఁడును, నన్నును గాలినడకచే నరణ్యమునకుఁ గొనిపోవుచున్నవాఁడునునై యుండియు మనోవ్యథయేని, భయమేని, దుఃఖమేని యేరాముండు చెందఁడయ్యెనో యట్టివాఁడు మనస్సున ధైర్యమునే పూనియున్నాఁడుగదా !

౩౦. ప్రేమచే నధికురాలయిన కౌసల్యాదేవియు శ్రీరామునకు నాతోసమురాలుగాదు. తండ్రియగు దశరథుఁడును నాతో సముండుగాఁడు. నన్నాతండు గొనిపోవుటకు యత్నించుసమాచారమును విననంతవఱకు నేను జీవించియుందును వీరుఁడ !

౩౧. ఆజానకి, మీఁదఁ జెప్పంబడినట్లు గొప్పయభిప్రాయముతోఁ గూడి వినుటకింపైయున్నమాటను హనుమంతునకుం జెప్పి, శ్రీరాముని ప్రయోజనమునుగలదియు నింపైనదియు నగుమాట హనుమంతునివలన వినుటకై సీత యూరకుండెను.

సీతాయా వచనం శ్రుత్వా మారుతి ర్భీమవిక్రమః।
శిరస్యంజలి మాధాయ వాక్య ముత్తర మబ్రవీత్॥ ౩౨॥

న త్వా మిహస్థాం జానీతే రామః కమలలోచనే।
తేన త్వాం నానయత్యాశు శచీమివ పురందరః॥ ౩౩॥

శ్రుత్వైవ తు వచో మహ్యం క్షిప్ర మేష్యతి రాఘవః।
చమూం ప్రకర్ష న్మహతీం హర్యృక్ష గణసంకులామ్॥ ౩౪॥

విష్టంభయిత్వా బాణౌఘై రక్షోభ్యం వరుణాలయమ్।
కరిష్యతి పురీం లంకాం కాకుత్స్థ శ్శాంత రాక్షసామ్॥ ౩౫॥

తత్ర యద్యంతరా మృత్యు ర్యది దేవా స్సహాసురాః।
స్థాస్యంతి పథి రామస్య స తా నపి వధిష్యతి॥ ౩౬॥

తవాదర్శనజే నార్యే శోకేన స పరిప్లుతః।
నశర్మ లభతే రామ స్సింహార్దిత ఇవ ద్విపః॥ ౩౭॥

మలయేన చ వింధ్యేన మేరుణా మందరేణ చ।
దర్దురేణ చ తే దేవి శపే మూలఫలేన చ॥ ౩౮॥

యథా సునయనం వల్గు బింబోష్ఠం చారుకుండలమ్।
ముఖం ద్రక్ష్యసి రామస్య పూర్ణచంద్ర మివోదితమ్॥ ౩౯॥

౩౨. భయంకరమైన బలమునుగలవాఁడగు హనుమంతుఁడు సీతవ లని యీమాటలువిని తలపైఁ జేతులుచేర్చి మ్రొక్కుచు నామె కిట్లులనియెను.

౩౩. కమలములవంటి కన్నులుంగలదానా! నీవిచ్చోటనుండుట శ్రీరాముం డెఱుంగఁడు. కావున శచీదేవి నింద్రుండు గొనిపోవునట్లు నిన్నుం గొనిపోకయున్నాఁడు.

౩౪. రాఘవుండు నామాటను వినినతోడనె వానరులయొక్కయు నెలుఁగుబంట్లయొక్కయు మొత్తములచే నొప్పిన దొడ్డసేనను వెంటఁగొని శీఘ్రముననే వచ్చును.

౩౫. బాణసమూహములచేత దుఃఖపెట్టఁ గూడనిదియగు సముద్రమును గట్టినిలిపి, లంకాపురమును రాక్షసులు లేనిదిగాఁ జేయును.

౩౬. నిన్నుం గొనిపోవుటయందు మృత్యుదేవత మార్గమున కడ్డము గానిలచినను, దేవతలును రాక్షసులును మొత్తములై నిలచినను రాముండు వారినింగూడఁ జంపఁగలఁడుసుమా!

౩౭. పుణ్యురాలా! రాముఁడు నినుంగానని శోకముచే నిండినవాఁడై, సింహముచేఁ బీడింపఁబడిన యేనుంగువలె సుఖములేకున్నవాఁడు.

౩౮. ఓదేవి! మలయము వింధ్యము మేరువు మందరము దర్దురములను పర్వతములతోడను, దుంపలు పండ్లు వీనితోడను నేను ప్రమాణము నేయుదును.

౩౯. అందమగు కన్నులుగలదియు, రమ్యమైనదియు దొండపండువంటి పెదవులుగలదియు, సుందరములగు కుండలములఁగలదియు నగు రామచంద్రుని మోము నుదయించినచంద్రునివలెఁ జూతువుగాకయని ప్రమాణము సేయువాఁడను.

క్షిప్రం ద్రక్ష్యసి వైదేహి రామం ప్రస్రవణే గిరౌ।
శతక్రతు మివాసీనం నాకపృష్ఠస్య మూర్ధని॥ ౪౦॥

న మాంసం రాఘవో భుఙ్క్తే న చాపి మధు సేవతే।
వన్యం సువిహితం నిత్యం భక్తమశ్నాతి పంచమమ్॥ ౪౧॥

నైవ దంశా న్నమశకా న్నకీటా న్నసరీసృపాన్।
రాఘవోఽపనయే ద్గాత్రా త్త్వద్గతే నాంతరాత్మనా॥ ౪౨॥

నిత్యం ధ్యానపరో రామో నిత్యం శోకపరాయణః।
నాన్య చ్చింతయతే కించి త్సతు కామవశం గతః॥ ౪౩॥

అనిద్ర స్సతతం రామ స్సుప్తోపి చ నరోత్తమః।
సీతేతి మధురాం వాణీం వ్యాహర న్ప్రతిబుధ్యతే॥ ౪౪॥

దృష్ట్వా ఫలంవా పుష్పంవా యద్వాన్య త్సుమనోహరమ్।
బహుశో హాప్రియే త్యేవం శ్వసం స్త్వా మభిభాషతే॥ ౪౫॥

స దేవి నిత్యం పరితప్యమాన స్త్వామేవ సీతే త్యభిభాషమా
ణః। ధృతవ్రతో రాజసుతో మహాత్మా తవైవలాభాయ కృత
ప్రయత్నః॥ ౪౬॥

౪౦. ఓసీతాదేవి! ప్రస్రవణమను పర్వతముయొక్క పైభాగము నంగూర్చుండి (నాకపృష్ఠమనుచోట నున్నతముగాఁగూర్చుండిన) దేవేంద్రునివలెనున్న రామచంద్రుని శీఘ్రమునఁ జూతువు.

౪౧. శ్రీరాముండు మాంసమును భుజించుటలేదు, కల్లునుద్రావుటలేదు, వనమందుఁబుట్టిన కాయలాకులలోఁ దనకు యోగ్యమని తోఁచిన వానిని సాయంకాలములందు నిత్యము భుజించుచున్నాఁడు.

౪౨. రాఘవుండు నిన్నుంబొందిన యాత్మనుగలవాఁడై, అడవి యీఁగలను, దోమలను, పురుగులను, ఇతరములగు ప్రాకెడుజంతువులను దనమేనిపై సోఁకినను దోలుటలేదు.

౪౩. ఆరాముచంద్రుఁడు మన్మథవేదనఁగలవాఁడై యెల్లప్పుడు నిన్నే తలంచుచున్నవాఁడు. దుఃఖించుచున్నవాఁడు, మఱియెద్దియుఁ దలంచుటలేదు.

౪౪. పురుషశ్రేష్ఠుఁడగు రాముఁ డొకప్పుడేనియు నిద్రించుటలేదు. నిద్దురపోయినను వెంటనే సీత! సీత! అను నింపగుమాటలతో మేల్కొనుచున్నవాఁడు.

౪౫. ఫలమునేనియుఁ బుష్పమునేనియు మనస్సునకింపగు మఱివేనినేనియుఁజూచి, హా! ప్రియురాలా! అని పలుమఱుఁ బలుకుచు దీర్ఘముగశ్వాసవిడుచుచు నిన్నుఁగూర్చి తలఁచుచున్నాఁడు.

౪౬. ఓజానకీ! గొప్పవాఁడును. వ్రతమును ధరించియున్నవాఁడును నగునారాచకొమరుఁడు నిన్నుంగొనిపోవుటకే తగినయత్నముం జేయుచున్నవాఁడై సీతా! అని నిన్నే తలంచుచు నిత్యము పరితపించుచున్నవాఁడు.

సా రామసంకీర్తన వీతశోకా. రామస్య శోకేన సమానశో
కా। శరన్ముఖే సాంబుద శేషచంద్రా నిశేవ వైదేహసుతా
బభూవ॥ ౪౭॥

ఇతి శ్రీమత్సుందరకాండే - షట్త్రింశస్సర్గః

---

## సప్తత్రింశస్సర్గః.

సీతా తద్వచనం శ్రుత్వా పూర్ణచంద్ర నిభాననా।
హనుమంత మువాచేదం ధర్మార్థ సహితం వచః॥ ౧॥

అమృతం విషసంసృష్టం త్వయా వానరభాషితమ్।
యచ్చ నాన్యమనా రామో యచ్చ శోకపరాయణః॥ ౨॥

ఐశ్వర్యే వా సువిస్తీర్ణే వ్యసనే వా సుదారుణే।
రజ్జ్వేవ పురుషం బద్ధ్వా కృతాంతః పరికర్షతి॥ ౩॥

విధి ర్నూన మసంహార్యః ప్రాణినాం ప్లవగోత్తమ।
సౌమిత్రిం మాం చ రామంచ వ్యసనైః పశ్య మోహితాన్॥ ౪॥

శోక స్యాస్య కదా పారం రాఘవో ధిగమిష్యతి।
ప్లవమానః పరిశ్రాంతో హతనౌ స్సాగరే యథా॥ ౫॥

రాక్షసానాం వధంకృత్వా సూదయిత్వా చ రావణమ్।
లంకా మున్మూలితాం కృత్వా కదా ద్రక్ష్యతి మాం పతిః॥ ౬॥

౪౭. శ్రీరామునిశోకముతోఁ దుల్యమగు శోకమునుగలదియు, రామచంద్రునిం దలంచుటచే వగ్గిన శోకమునుగలదియు నగు సీత, శరత్కాలముయొక్క ప్రారంభమున మేఘములతోఁగూడిన చంద్రునింగల రాత్రి వలె నుండెను.

ఇది ముప్పదియాఱవసర్గ.

---

## ముప్పదియేడవ సర్గ.

౧. నిండుచంద్రునింబోలు మోముగలదియగు సీత యామాటను విని, ధర్మసహితమగు మాటను హనుమంతునితో నిట్లు చెప్పెను.

౨. ఓవానరోత్తమా! నీచేఁ బలుకంబడిన 'రాముఁడు వేఱుసంకల్పము లేక నీయందే బుద్ధినిలిపియున్నాఁ'డన్న మాట యమృతముతోఁ దుల్యమైనది. 'శోకమందే మగ్నుఁడై యున్నాఁ'డన్న' మాట విషముతోఁ దుల్యమై వినఁగూడకున్నది.

౩. మున్ను చేయంబడిన కర్మయొక్క పరిపాకము, జనుని మహత్తరమగు నైశ్వర్యమున కేనియు భయంకరమగు వ్యసనమున కేనియుఁ ద్రాటిచేఁగట్టి యీడ్వంబడినట్లు గుంజుచున్నది.

౪. ఓవానరశ్రేష్ఠుఁడా! విధి జంతువులచేఁ దొలఁగింపఁబడునది కాదు. దుఃఖముచేఁ బరవశులమైయున్న నన్నును రామలక్ష్మణులను జూడుము!

౫. మిక్కిలి దస్సియున్న రామచంద్రుఁడు. సముద్రమందేఁగుచున్న యోడ గాలిచేఁ జిక్కి యల్లాడునట్లుగా నవయుచున్నాఁడు. ఈశోకమునకుఁ దుదగాంచుట యెన్నఁడో!

౬. ప్రభుఁడగు శ్రీరాముఁడు రాక్షసులను జంపి రావణుని రూపుమాపి లంకను నామమడఁచి నన్నెప్పుడుచూచును?

స వాచ్య స్సంత్వరస్వేతి యావదేవ న పూర్యతే।
అయం సంవత్సరః కాల స్తావద్ధి మమజీవితమ్॥ ౭॥

వర్తతే దశమో మాసో ద్వౌతు శేషౌ ప్లవంగమ।
రావణేన నృశంసేన సమయో యః కృతో మమ॥ ౮॥

విభీషణేన చ భ్రాత్రా మమనిర్యాతనం ప్రతి।
అనునీతః ప్రయత్నేన నచ తత్కురుతే మతిమ్॥ ౯॥

మమ ప్రతి ప్రదానం హి రావణస్య నరోచతే।
రావణం మార్గతే సంఖ్యే మృత్యుః కాలవశం గతమ్॥ ౧౦॥

జ్యేష్ఠా కన్యా నలానామ విభీషణసుతా కపే।
తయా మమేదమాఖ్యాతం మాత్రా ప్రహితయాస్వయమ్॥ ౧౧॥

అసంశయం హరిశ్రేష్ఠ క్షిప్రం మాం ప్రాప్స్యతే పతిః।
అంతరాత్మా హి మేశుద్ధ స్తస్మింశ్చ బహవోగుణాః ౧౨॥

ఉత్సాహః పౌరుషం సత్త్వ మానృశంస్యం కృతజ్ఞతా।
విక్రమశ్చ ప్రభావశ్చ సంతి వానర రాఘవే॥ ౧౩॥

చతుర్దశ సహస్రాణి రాక్షసానాం జఘాన యః।
జనస్థానే వినాభ్రాత్రా శత్రుః క స్తస్య నోద్విజేత్॥ ౧౪॥

న స శక్య స్తులయితుం వ్యసనైః పురుషర్షభః।
అహం తస్య ప్రభావజ్ఞా శక్రస్యేవ పులోమజా॥ ౧౫॥

౭. రావణుండు నాకొసంగియున్న సంవత్సరకాలము నిండువఱ కే నేను జీవించియుండుటగలదు. కావునఁ ద్వరపడుమని శ్రీరామునితోఁ జెప్పుము.

౮. ఓవానరుఁడా! పదియవనెల నడుచుచున్నది. ఘాతుకుఁడైన రావణునిచేత నాకు నిర్ణయింపఁబడిన కాలమింకను రెండునెలలు మాత్రమున్నది.

౯. నన్ను శ్రీరామునకు మరల సమర్పించుటనుగూర్చి సోదరుఁడగు విభీషణునిచే మిక్కిలి యడుగఁబడినవాఁడయ్యును రావణుండు సమ్మతింపఁ డయ్యెను.

౧౦. నన్ను రామచంద్రునకు సమర్పించుటకు రావణుం డిష్టము లేకున్నవాఁడు. కాల పరిపక్వతను జెందియున్న యారాక్షసుని మృత్యుదేవత యుద్ధమందు వెదకుచున్నది.

౧౧. ఓవానరుఁడా! విభీషణుని పెద్దకూఁతురగు నలయనునది తల్లిచే నాకడ కనుపఁబడినదై నాకీవిషయమును దానేచెప్పెను.

౧౨, ౧౩. ఓవానరోత్తమా! నాప్రియుండు శీఘ్రకాలముననే నన్నుఁ బొందఁగలఁడు. సంశయమేపాటియు లేదు. నాయంతరాత్మ నిర్మలమైయున్నది. ఆరాఘువునియందు యత్నము, పౌరుషము, సాధుత్వము, మేలుమఱువకుండుట, పరాక్రమము మహిమ యనునట్టి పెక్కుగుణములు గలవు.

౧౪. ఏశ్రీరాముండు జనస్థానమునఁ బదునాల్గువేల రాక్షసులను, తమ్ముఁడగు లక్ష్మణునిసహాయ మపేక్షింపకయే రూపుమాపెనో యట్టివాని కేశత్రుఁడు భయపడకుండును?

౧౫. పురుషోత్తముఁడగు నాతఁడు వ్యసనముచే మెత్తపడువాఁడుగాఁడు, నేను దేవేంద్రుని శచీదేవిమెఱింగియున్నట్లు శ్రీరాముని బలదర్పముల నెఱింగియున్నదానను.

శరజాలాంశుమాంఛూరః కపే రామదివాకరః।
శత్రురక్షోమయం తోయ ముపశోషం నయిష్యతి॥ ౧౬॥

ఇతి సంజల్ప మానాం తాం రామార్థే శోకకర్శితామ్।
అశ్రు సంపూర్ణ నయనా మువాచ వచనం కపిః॥ ౧౭॥

శ్రుత్వైవ తు వచో మహ్యం క్షిప్ర మేష్యతి రాఘవః।
చమూం ప్రకర్ష న్మహతీం హర్యృక్షగణ సంకులామ్॥ ౧౮॥

అథవా మోచయిష్యామి త్వా మద్యైవ వరాననే।
అస్మా ద్దుఃఖా దుపారోహ మమపృష్ఠ మనిందితే॥ ౧౯॥

త్వాం తు పృష్ఠగతాం కృత్వా సంతరిష్యామి సాగరమ్।
శక్తిర స్తి హి మే వోఢుం లంకామపి సరావణామ్॥ ౨౦॥

అహం ప్రస్రవణస్థాయ రాఘవా యాద్య మైథిలి।
ప్రాపయిష్యామి శక్రాయ హవ్యం హుత మివానలః॥ ౨౧॥

ద్రక్ష్య స్యద్యైవ వైదేహి రాఘవం సహలక్ష్మణమ్।
వ్యవసాయ సమాయుక్తం విష్ణుం దైత్యవధే యథా॥ ౨౨॥

త్వద్దర్శన కృతోత్సాహ మాశ్రమస్థం మహాబలమ్।
పురందర మివాసీనం నాకరాజస్య మూర్ధని॥ ౨౩॥

పృష్ఠ మారోహ మే దేవి మావికాంక్షస్వ శోభనే।
యోగ మన్విచ్ఛ రామేణ శశాంకే నేవ రోహిణీ॥ ౨౪॥

౧౬. ఓవానరుఁడా! బాణసమూహము లనుకిరణములను గలవా
గు శ్రీరాముఁడనుసూర్యుఁడు శత్రువులగు రాక్షసుల సేనలనుజలరాశి
సుదముట్టి నినుకఁజేయఁగలఁడు.

౧౭. ఇట్లు శ్రీరామునింగూర్చి భాషించుచున్నదియు దుఃఖముచే
పీడించియున్నదియు కన్నులనీళ్లు రాల్చుచున్నదియు నగుసీతతోఁ హను
మంతుఁ డిట్లనియెను.

౧౮. రాఘవుండు నీయొక్క క్షేమసమాచారమును నావలన విని
తోడనే వానరులయొక్కయు నెలుగుబంట్లయొక్కయు సమూహముననల
గొప్పసేనను వెంటఁగొని శీఘ్రమునవచ్చును.

౧౯. అట్లుకాదేని, ఓయందమగు మోముంగలతల్లీ! నిన్నీదుఃఖము
నుండి యిప్పుడే విడిపించుచున్నాను. నావీపెక్కుము పుణ్యవతీ!

౨౦. నిన్ను వీపుపై నెక్కించికొని సముద్రమును దాఁటిపోయెద
ను రావణసహితమగు లంకనుగూడ మోయుటకు నాకు బలముగలదు.

౨౧. ఓజానకీ! తనయందు వ్రేల్వంబడిన హోమద్రవ్యముల నిం
ద్రునకై కొనిపోవు నగ్నిదేవునివలె, ప్రస్రవణపర్వతమందున్న శ్రీరాముని
కడకు నేను నిన్నును గొనిపోవువాఁడను.

౨౨. ఓజానకి! రాక్షసులఁ జంపుటకై యత్నము సేయుచుండు
విష్ణుదేవునివలెనే, రావణవధకు సన్నాహము సేయుచుండు శ్రీరాముని లక్ష్మ
ణసహితముగా నిప్పుడె చూడఁగలవు.

౨౩. స్వర్గ రాజ్యముయొక్క యున్నతస్థానమునఁ గూర్చున్న దే
వేంద్రునివలె నాశ్రమస్థలమున నినుంజూడ నాశించుచునుండు మహాబల
శాలిని రాఘవునిం జూడఁగలవు.

౨౪. ఓపుణ్యాత్మురాలా! నావీపునెక్కుము; ఉపేక్ష చేయకు,
చంద్రునితో రోహిణికూడినట్లు శ్రీరామునితోఁ గూడుటను గోరుమా!

కథయంతీవ చంద్రేణ సూర్యేణ చ మహర్షిణా।
మత్పృష్ఠ మధిరుహ్య త్వం తరాకాశ మహార్ణవమ్॥ ౨౫

నహి మే సంప్రయాతస్య త్వామితో నయతో౽౦గనే।
అనుగంతుం గతిం శక్తా స్సర్వే లంకా నివాసినః॥ ౨౬

యథైవాహ మిహ ప్రాప్త స్తథైవాహ మసంశయః।
యాస్యామి పశ్య వైదేహి త్వా ముద్యమ్య విహాయసమ్॥ ౨౭

మైథిలీతు హరిశ్రేష్ఠా చ్ఛ్రుత్వా వచన మద్భుతమ్।
హర్ష విస్మిత సర్వాంగీ హనుమంత మథాబ్రవీత్॥ ౨౮

హనుమ న్దూర మధ్వానం కథం మాం వోఢు మిచ్ఛసి।
తదేవ ఖలు తే మన్యే కపిత్వం హరియూథప॥ ౨౯

కథం వా ల్పశరీర స్త్వ మా మితో నేతు మిచ్ఛసి।
సకాశం మానవేంద్రస్య భర్తు ర్మే ప్లవగర్షభ॥ 3౦

సీతాయా వచనం శ్రుత్వా హనుమా న్మారు తాత్మజః।
చింతయామాస లక్ష్మీవా న్నవం పరిభవం కృతమ్॥ 3౧

న మే జానాతి సత్వంవా ప్రభావంవా సి తేక్షణా।
తస్మా త్పశ్యతు వైదేహీ యద్రూపం మమ కామతః॥ 3౨

ఇతి సంచింత్య హనుమాం స్తదా ప్లవగ సత్తమః।
దర్శయామాస వైదేహ్యా స్స్వరూప మరిమర్దనః॥ 33

౨౫. నీవు నావీపునెక్కి మిక్కిలి కాంతిచే నొప్పినవారగు సూర్యచంద్రులతోడ సంభాషించుచున్న దానివలె నాకాశమును మహాసముద్రమును దాటుము!

౨౬. ఓయిల్లాలా! ఇచ్చటనుండి కదలి, నిన్నుం గొనిపోవుచున్న నాయొక్క వేగము నాశ్రయింప నీలంకయందుండువారిలో నెవ్వరును జాలినవారుగారు.

౨౭. ఓజానకీ! నేనిందుల కేతెంచినపు డెట్లువచ్చితినో యట్లుల నే యిపుడు నేను నిన్నెత్తికొని యాకాశమార్గమునం బోవంగలను. నీవే చూడుము! సంశయింపవలదు.

౨౮. జానకియు వానరోత్తముండగు హనుమంతునివలన నాశ్చర్యకరమగు నీమాటనువిని దేహమంతట గగుర్పాటు గలదియై యాతనితో నిట్లనియెను.

౨౯. ఓహనుమంతుండ! ఇంతదూరపుత్రోవను నన్ను మోసికొని పోవ నెట్లు తలంచుచున్నావు? ఇట్లునీవు దలంచుటచేతనే యిది వానరస్వభావమని తలంచెద నాంజనేయుండ!

౩౦. వానరశ్రేష్ఠుండ! కొద్దిపాటి శరీరముం గలనీవు, రాజోత్తముండగు నాభర్తయొక్క సమీపమునకు నన్నెట్లు గొనిపోవందలంచుచున్నావు?

౩౧. లక్షణవంతుండును వాయుపుత్రుండు నగు హనుమంతుండు సీతయాడినమాటనువిని క్రొత్తదగు నవమానమును పొందితినిగదా! అని చింతించెను.

౩౨. ‘నల్లని కన్నులనుగలదియగుజానకి నాబలముంగాని నామాహాత్మ్యమునుగాని యెఱుంగకున్నది. కావున నాకుంగల కామరూపమును (కోరినట్లు గలుగురూపమును) జూచునుగాక’.

౩౩. వానరోత్తముండును శత్రువుల సమయించువాండును నగు హనుమంతుం డట్లు యోచించి సీతాదేవికిం దనరూపమును గనంబఱచెను.

స తస్మా త్పాదపాద్ధీమా నాప్లుత్య ప్లవగర్షభః।
తతో వర్ధితు మారేభే సీతా ప్రత్యయకారణాత్॥ ౩౪॥
మేరుమందర సంకాశో బభౌ దీప్తానలప్రభః।
అగ్రతో వ్యవతస్థేచ సీతాయా వానరోత్తమః॥ ౩౫॥
హరిః పర్వత సంకాశ స్తామ్రవక్త్రో మహాబలః।
వజ్రదంష్ట్రనఖో భీమో వైదేహీ మిద మబ్రవీత్॥ ౩౬॥
స పర్వత వనోద్దేశాం సాట్టప్రాకార తోరణామ్।
లంకా మిమాం సనాథాం వా నయితుం శక్తిర స్తిమే॥ ౩౭॥
త దవ స్థాప్యతాం బుద్ధి రలం దేవి వికాంక్షయా।
విశోకం కురు వైదేహి రాఘవం సహలక్ష్మణమ్॥ ౩౮॥
తం దృష్ట్వా భీమసంకాశ మువాచ జనకాత్మజా।
పద్మపత్ర విశాలాక్షీ మారుత స్యౌరసం సుతమ్॥ ౩౯॥
తవసత్త్వం బలంచైవ విజానామి మహాకపే।
వాయోరివ గతించాపి తేజ శ్చాగ్నే రివాద్భుతమ్॥ ౪౦॥
ప్రాకృతోన్యః కథం చేమాం భూమి మాగంతు మర్హతి।
ఉదధే రప్రమేయస్య పారం వానరపుంగవ॥ ౪౧॥
జానామి గమనేశక్తిం నయనే చాపి తే మమ।
అవశ్యం సంప్రధార్యాశు కార్యసిద్ధి ర్మహాత్మనః॥ ౪౨॥

౩౪. పిమ్మట, బుద్ధిమంతుఁడగు నాతం డావృక్షమునుండి దిగివచ్చి సీతకు నమ్మికపుట్టించుటకై తనదేహమును బెనుపసాఁగెను.

౩౫. ఆవానరోత్తముఁడు మేరుమందర పర్వతములతోఁ దుల్యుఁడును, మండుచున్న యగ్నియొక్క కాంతివంటి కాంతినిగలవాఁడును నై వెలింగెను. అట్టిరూపముతో నామెయెదుట నిలచెను.

౩౬. పర్వతముతోఁ దుల్యుఁడైనవాఁడును, ఎఱ్ఱని మోముగలవాఁడును మిక్కిలి బలశాలియు, వజ్రాయుధములంబోలు దంతములు గలవాఁడును భయంకరుఁడును నగు నాయాంజనేయుండు సీతతో నిట్లనియెను.

౩౭. కొండలతోడను వనములతోడను గూడినదియు, కోట బురుజులతోడను వెలుపలిద్వారములతోడను గూడినదియు నగు నీలంకను రావణసమేతముగఁ గొనిపోవ నాకు శక్తిగలదు సుమా!

౩౮. ఓజానకీ! నీమనస్సును దృఢపఱచికొనుము. ఉపేక్షమానుము! లక్ష్మణసహితుఁడగు రామచంద్రుని దుఃఖమునుండి తొలఁగింపుము!

౩౯. తామర పూరేకులవలె విశాలములైన కన్నులనుగలదియగు జానకి, రుద్రునితోఁ దుల్యుఁడుగనున్న వాయుపుత్రునింగాంచి యిట్లనియెను.

౪౦, ౪౧. ఓగొప్పవానరుఁడా! నీబలమును దార్ఢ్యమును, వాయుసంచారమునుబోలిననడకయు నగ్నింబోలిన యద్భుతమగు తేజస్సును బాగుగ నెఱుంగుచున్నాను. వానరోత్తమా! సామాన్యుఁడగు మఱియెవండేనియు మేఱలేనిదగు నీసముద్రముయొక్క యివ్వలిగట్టును జేరి యీలంకలోనికి వచ్చుటకు శక్తుండెట్లగును?

౪౨, ౪౩. ఆకాశమార్గమునఁ జనుటయందును, ననుంగొనిపోవుటయందును నీకుంగలశక్తిని దెలిసికొనుచున్నాను. దొడ్డవాఁడ! శ్రీరాముని యొక్కపని బాగుపడుట శీఘ్రమున ముఖ్యముగ నిశ్చయింపవలయును.

అయుక్తం తు కపిశ్రేష్ఠ మమ గంతుం త్వయానఘ।
వాయువేగ సవేగస్య వేగో మాం మోహయేత్తవ॥ ౪౩॥
అహ మాకాశ మాపన్నా హ్యుపర్యుపరి సాగరమ్।
ప్రపతేయం హి తేపృష్ఠా ద్భయా ద్వేగేన గచ్ఛతః॥ ౪౪॥
పతితా సాగరేచాహం తిమినక్ర ఝషాకులే।
భవేయ మాశు వివశా యాదసా మన్న ముత్తమమ్॥ ౪౫॥
నచ శక్ష్యే త్వయాసార్థం గంతుం శత్రువినాశన।
కళత్రవతి సందేహ స్త్వయ్యపిస్యా దసంశయః॥ ౪౬॥
హ్రియమాణాం తు మాం దృష్ట్వా రాక్షసా భీమవిక్రమాః
అనుగచ్ఛేయు రాదిష్టా రావణేన దురాత్మనా॥ ౪౭॥
తై స్త్వం పరివృత శ్శూరై శ్శూలముద్గర పాణిభిః।
భవే స్త్వం సంశయంప్రాప్తో మయా వీరకళత్రవాన్॥ ౪౮॥
సాయుధా బహవో వ్యోమ్ని రాక్షసా స్త్వం నిరాయుధః।
కథం శక్ష్యసి సంయాతుం మాంచైవ పరిరక్షితుమ్॥ ౪౯॥
యుధ్యమానస్య రక్షోభి స్తవ తైః క్రూరకర్మభిః।
ప్రపతేయం హి తే పృష్ఠా ద్భయార్తా కపిసత్తమ॥ ౫౦॥
అథ రక్షాంసి భీమాని మహాంతి బలవంతి చ।
కథంచి త్సాంపరాయే త్వాం జయేయుః కపిసత్తమ॥ ౫౧॥

ప్రభ్వుండ ! నేను నీతోడవచ్చుట తగదు. వాయువేగమునుబోలిన నీవే
గము నన్ను మూర్ఛనొందించును.

౪౪. నేను సముద్రముపై నేగునపు డాకాశము నంటినదాననై,
వేగమునం జనుచున్న నీవీపునుండి భీతిచేఁ బడుదునుగదా !

౪౫. అదిమాత్రముగాక తిమింగిలములు చేఁపలు మొసళ్లనుగలిగి
నిండుకొనియున్న సముద్రమందుఁ బడినదాననై యొడలుమఱచి తోడనే
యందున్న జంతువులకు మేలగు నాహారముగ నగుదును.

౪౬. శత్రువుల రూపడంచువాఁడా నీతోడవచ్చుటకు నే నోపను.
నేనువచ్చుటచే సర్వమునకు నాధారభూతుఁడవైయున్న నీప్రాణమునకుం
గూడ సంశయముకలుగును. ఇదిసత్యము.

౪౭. భయంకరమగు దర్పముంగలవారగు రాక్షసులు దుర్జనుండగు
రావణునిచే నియమింపఁబడినవారై, నీచేఁ గొనిపోవంబడుచున్న నన్ను వెంబ
డింతురు. ఓ శూరుఁడ ! శూలము ముద్గరము మొదలగు ననేకాయుధము
లను ధరించియున్న శూరులగు రాక్షసులచేఁ జుట్టుకొనంబడినవాఁడ వగు
దువు. అట్లగుట ప్రాణసంశయమును గలిగించును.

౪౯. ఆరాక్షసులు పెక్కాయుధములతోఁ గూడినవారు, నీవు ని
రాయుధుఁడవు, ఇట్టినీకిఁక వారితోడ నాకాశమునం బోరుటకును నన్నుం
గొనిపోవుటకును నెట్లుశక్తిగలుగును.

౫౦. వానరోత్తమా ! ఘాతుకకార్యములు చేయువారగు నారాక్ష
సులతో నీవు యుద్ధము నేయుచుండఁగా, నేనుభయముచేఁ బీడింపఁబడిన
దాననై నీవెనుకనుండి క్రిందఁ బడుదునుగదా !

౫౧. మఱియు, రాక్షసులు భయంకరులును, బలవంతులును, గొ
ప్పవారును నగుదురు. కావున నిన్ను వారెట్లునుజయింతురు వానరోత్తమా!

అథవా యుధ్యమానస్య పతేయం విముఖస్య తే।
పతితాం చ గృహీత్వా మాం నయేయుః పాపరాక్షసాః॥ ౫౧
మాం వా హరేయుస్త్వద్ధస్తా ద్విశసేయు రథాపి వా।
అవ్యవస్థౌ హి దృశ్యేతే యుద్ధే జయపరాజయౌ॥ ౫౨
అహం వాపి విపద్యేయం రక్షోభి రభితర్జితా।
త్వత్ప్రయత్నో హరిశ్రేష్ఠ భవే న్నిష్ఫల ఏవతు॥ ౫౩
కామం త్వమసి పర్యాప్తో నిహంతుం సర్వరాక్షసాన్।
రాఘవస్య యశో హీయే త్త్వయా శస్తైస్తు రాక్షసైః॥ ౫౪
అథవాదాయ రక్షాంసి న్యసేయు స్సంవృతే హి మామ్।
యత్ర తేనాభిజానీయు ర్హరయో నాపి రాఘవౌ॥ ౫౫
ఆరంభస్తు మదర్థోయం తత స్తవ నిరర్థకః॥ ౫౬
త్వయా హి సహరామస్య మహా నాగమనే గుణః॥ ౫౭
మయి జీవిత మాయత్తం రాఘవస్య మహాత్మనః।
భ్రాతౄణాంచ మహాబాహో తవ రాజకులస్య చ॥ ౫౮
తౌ నిరాశౌ మదర్థంతు శోకసంతాప కర్శితౌ।
సహాసర్వర్క్ష హరిభి స్త్యక్ష్యతః ప్రాణ సంగ్రహమ్॥ ౫౯
భర్తృభక్తిం పురస్కృత్య రామా దన్యస్య వానర।
నస్పృశామి శరీరంతు పుంసో వానరపుంగవ॥ ౬౦

౫౨. అట్లు గాకున్నను, యుద్ధమందు జ్ఞాపకముంచి వారితోఁ బోరు చున్న నీవెనుకప్రక్కనుండిన నన్నుఁ బాపాత్ములగు రాక్షసులు మరలఁ గొనిపోదురు

౫౩. అట్లును గాక, చేతినుండియె నన్నెత్తికొనియుం బోదురు. చం పనుజంపుదురు. యుద్ధమందు జయాపజయములు నమ్మందగినవి కావు.

౫౪. వానరోత్తమా! రాక్షసులచే బెదరింపంబడినదాననై నేనై నను జేటుఁబొందుదును. అట్లయినచో నీయత్నమంతయు వ్యర్థమగును.

౫౫. రాక్షసులనందఱను జంపుటకు నీవె చాలియున్నావుగాని నీచేత రాక్షసులు చంపంబడుటచే శ్రీరామునికీర్తి తగ్గిపోవుచున్నది.

౫౬, ౫౭. అటుగాకున్నను రాక్షసులు, ఏచోటనుంచినను వా నరులును రామలక్ష్మణులును నన్నెఱుంగఁజాలరో యట్టి రహస్య స్థలమున కు నన్నుం గొనిపోయి యుంచెదరు. అట్లుచేసిరేని నాకొఱకు నీవుచేసిన యత్నము వ్యర్థమైపోవును.

౫౮ నుండి, ౫౯. నీతోఁడఁగూడ వచ్చుటచే శ్రీరామునకు మిక్క లి మేలుగలదు. ఓబలవంతుఁడా! గొప్పవాఁడగు శ్రీరామునియొక్కయు నత ని సోదరులయొక్కయు నీయొక్కయు సుగ్రీవుని కులముయొక్కయు బ్ర దుకు నాయధీనమునంగదా! ఉన్నది. రామలక్ష్మణులు ననుంగానలేకని రాశ చేసికొన్నయెడల దుఃఖముచేతను బరితాపముచేతను జీర్ణించినవార గుచు సమస్తమగు నెలుగుబంట్లయొక్కయు వానరులయొక్కయు సమూ హములతోడఁ గూడ జీవములను విడుతురు.

౬౦. ఓవానరోత్తమ! మగనియందలి భక్తినిగలదాననై, శ్రీరా మునికంటె నితరుఁడగు నేపురుషునియొక్క శరీరమును నేనుముట్టుట లేదు

యదహం గాత్రసంస్పర్శం రావణస్య బలాద్గతా।
అనీశా కింకరిష్యామి వినాథా వివశా సతీ॥ ౬౧॥

యది రామో దశగ్రీవ మిహహత్వా సబాంధవమ్।
మా మితోగృహ్య గచ్ఛేత త త్తస్య సదృశంభవేత్॥ ౬౨॥

శ్రుతాహి దృష్టాశ్చ మయా పరాక్రమా మహాత్మన స్తస్య ర
ణావమర్దినః। నదేవగంధర్వ భుజంగ రాక్షసా భవంతి రా
మేణ సమా హి సంయుగే॥ ౬౩॥

సమీక్ష్య తం సంయతి చిత్రకార్ముకం మహాబలం వాసవతుల్య
విక్రమమ్। సలక్ష్మణం కో విషహేత రాఘవం హుతాశనం
దీప్తమి వానిలేరితమ్॥ ౬౪॥

సలక్ష్మణం రాఘవ మాజిమర్దనం దిశాగజం మత్తమివ వ్యవస్థి
తమ్। సహేత కో వానరముఖ్య సంయుగే యుగాంతసూర్య
ప్రతిమం శరార్చిషమ్॥ ౬౫॥

సమే హరిశ్రేష్ఠ సలక్ష్మణంపతిం సయూథపం క్షిప్ర మిహోప
పాదయ। చిరాయ రామం ప్రతి శోకకర్శితాం కురుష్వమాం
వానరముఖ్య హర్షితామ్॥ ౬౬॥

ఇతి శ్రీమత్సుందరకాండే - సప్తత్రింశస్సర్గః.



౬౧. నన్నుం గొనివచ్చునపుడు బలాత్కారముగా రావణునిచే నా దేహము ముట్టంబడుట నాభర్త నాసమీపమున లేమిచేతఁ గలిగెను. ఇఁకఁ జేరువలేక పరాధీనురాలనయిన యాఁడుదాన నేమిచేయఁగలను?

౬౨. రామచంద్రుఁడు, బంధుసమేతుండైయున్న రావణునిం బరిమార్చి నన్నిచ్చోటనుండి కొనిపోవునేని మున్ను పొందిన భంగమునకుఁ బ్రతిచేసిన ట్లుండఁగలదు.

౬౩. గొప్పవాఁడును యుద్ధమున శత్రువులను సవమదము చేయువాఁడును నగు రామచంద్రునియొక్క పరాక్రమాదిగుణములు నాచే వినంబడియెను. కన్నులారఁ జూడంబడియెను. దేవగంధర్వ నాగులును రాక్షసులును యుద్ధమున రామునితో సములుగారు.

౬౪. విచిత్రమగు విల్లుగలవాఁడును, గొప్ప బలముగలవాఁడును, ఇంద్రుని పరాక్రమముతోఁదుల్యమగు పరాక్రమము గలవాఁడును లక్ష్మణసమేతుఁడును నగు శ్రీరాముని, వాయువుచే ఊఁచంబడి లెస్సగ మండుచున్నయగ్నిని సమీపించినట్లు సమీపించి చూచి యెవ్వండు సహింపఁగలండు.

౬౫. ఓవానరోత్తమా! యుద్ధమున శత్రువుల నడంచువాఁడును లక్ష్మణసహితుఁడును మదించిన దిగ్గజమువలె నున్నవాఁడును, ప్రళయకాలమండలి సూర్యునితోఁ దుల్యుఁడై బాణములను జ్వాలలు గలవాఁడును నగు శ్రీరామునిఁ యుద్ధమున నెవ్వండు సహింపఁగలఁడు?

౬౬. ఓవానరశ్రేష్ఠా! మీఁదఁజెప్పంబడిన గుణములచే నొప్పిన, లక్ష్మణసహితుఁడై వానరసేనతోఁ గూడియున్న నాప్రాణేశుని వేగమున నిందులకుం దెమ్ము! వానరోత్తమ! చిరకాలమునుండి రామదర్శనము లేమిచేఁ బరితపించుచుఁ జిక్కియున్న నన్ను సంతోషించునట్లు చేయుమా!

ఇది ముప్పదియేడవ సర్గ.

## అష్టత్రింశస్సర్గః.

తత స్స కపిశార్దూల స్తేనవాక్యేన హర్షితః।
సీతాముతవాచ తచ్ఛ్రుత్వా వాక్యం వాక్యవిశారదః॥ ౧।

యుక్తంరూపం త్వయాదేవి భాషితం శుభదర్శనే।
సదృశం స్త్రీస్వభావస్య సాధ్వీనాం వినయస్య చ॥ ౨॥

స్త్రీత్వం నతుసమర్థంహి సాగరం వ్యతివర్తితుమ్।
మామధిష్ఠాయ విస్తీర్ణం శతయోజన మాయతమ్॥ ౩॥

ద్వితీయం కారణం యచ్చ బ్రవీషి వినయాన్వితే।
రామా దన్యస్య నార్హామి సంస్పర్శమితి జానకి॥ ౪॥

ఏత త్తే దేవి సదృశం పత్న్యా స్తస్య మహాత్మనః।
కాహ్యన్యా త్వా మృతే దేవి బ్రూయా ద్వచన మీదృశమ్॥ ౫॥

శ్రోష్యతే చైవ కాకుత్స్థ స్సర్వం నిరవశేషతః।
చేష్టితం యత్త్వయా దేవి భాషితం మమచాగ్రతః॥ ౬॥

కారణై ర్బహుభి ర్దేవి రామప్రియ చికీర్షయా।
స్నేహప్రసన్న మనసా మయైత త్సముదీరితమ్॥ ౭॥

లంకాయా దుష్ప్రవేశత్వా ద్దుస్తరత్వా న్మహోదధేః।
సామర్థ్యా దాత్మనశ్చైవ మయైత త్సముదీరితమ్॥ ౮॥

ఇచ్ఛామి త్వాం సమానేతు మద్యైవ రఘుబంధునా।
గురుస్నేహేన భక్త్యాచ నాన్యథైత దుదాహృతమ్॥ ౯॥

## ముప్పది యెనిమిదవసర్గ.

౧. పిమ్మట వానరోత్తముం డామెయాడిన మాటనువిని సంతోషించినవాఁడై, మాటలయందు నేర్పరియగు నాతండు సీతతో నిట్లనియెను.

౨. ఇంపుగ నగుపడుచున్న యోదేవీ! నీచేఁ బలుకంబడినమాటలు, స్త్రీస్వభావమునకును, పతివ్రత ధర్మమునకును, అడఁకువకును బోలియున్నవి.

౩. గొప్పమేనుగలవాఁడనగు నావీపెక్కి నూఱామడల విరివిగల యీసముద్రమును దాఁటుటకు నీ స్త్రీస్వభావము జంకుచున్నది.

౪, ౫. ఓ యడఁకువగలదానా! శ్రీరామునికంటె నితరుఁడగు పురుషుని ముట్టుట తగదనియెడి రెండవకారణము మహాత్ముఁడగు రఘురాముసకు భార్యవగు నీకుఁ దగినదికాని, మఱియెవ్వతె యిట్టిసమయమున నింతటిమాట వలుకును.

౬. ఓ దేవి! నాయెదుట నీచేత నాడంబడిన మాటలన్నియు, నీయందుచొప్పును శ్రీరాముఁడు పూర్ణముగా వినునుజుమా!

౭. ఓ జననీ! పెక్కుకారణములు గలుగుటచేతను, శ్రీరామునకు మేలుకూర్పవలయునను తలంపుచేతను, స్నేహముచేఁ గలిగిన స్వచ్ఛమగు గౌరవచేతను నేను నావీపునై నెక్కుమని పలికితిని.

౮. లంకయందుఁ జొచ్చుట యసాధ్యముగావునను, సముద్రముం దాఁటుట కష్టసాధ్యముగావునను, నాయొక్కశక్తి మితిమించినదిగావునను నేనట్లువలికితిని.

౯. రామచంద్రునియందున్న స్నేహముచేతను భక్తిచేతను, బంధుప్రియుండగు నాతనితో నిన్ను నేఁడేచేర్చుటకుఁగోరి యట్లు వలికితిఁగాని యట్లుకానిచో నీమాట చెప్పవాఁడనుగాను.

యది నోత్సహసే యాతుం మయాసార్ధ మనిందితే
అభిజ్ఞానం ప్రయచ్ఛ త్త్వం జానీయా ద్రాఘవో హి తత్ ౧౦
ఏవముక్తా హనుమతా సీతా సురసుతోపమా।
ఉవాచ వచనం మందం బాష్పప్రగ్రథి తాక్షరమ్॥ ౧౧
ఇదం శ్రేష్ఠ మభిజ్ఞానం బ్రూయా స్త్వంతు మమ ప్రియమ్।
శైలస్య చిత్రకూటస్య పాదే పూర్వోత్తరే పురా॥ ౧౨
తాపసాశ్రమ వాసిన్యాః ప్రాజ్యమూల ఫలోదకే।
తస్మిన్ సిద్ధాశ్రమే దేశే మందాకిన్యా హ్యదూరతః ౧౩
తస్యోపవన షండేషు నానాపుష్ప సుగంధిషు।
విహృత్య సలిలక్లిన్నా తవాంకే సముపావిశమ్॥ ౧౪
తతో మాంస సమాయుక్తో వాయసః పర్యతుండయత్।
తమహం లోష్టముద్యమ్య వారయామి స్మ వాయసమ్। ౧౫
దారయన్ సచ మాం కాక స్తత్రైవ పరిలీయతే।
నచా ప్యుపారమ న్మాంసా ద్భక్షార్థీ బలిభోజనః॥ ౧౬
ఉత్కర్షంత్యాం చ రశనాం క్రుద్ధాయాం మయి పక్షిణి।
స్రస్యమానేచ వసనే తతో దృష్ట్వా త్వయా హ్యహమ్॥ ౧౭
త్వయా పహసితా చాహం క్రుద్ధా సంలజ్జితా తదా।
భక్షగృధ్నేన కాకేన దారితా త్వాముపాగతా॥ ౧౮
ఆసీనస్యచ తే శ్రాంతా పునరుత్సంగ మావిశమ్।
క్రుధ్యంతీ చ ప్రహృష్టేన త్వయాహం పరిసాంత్వితా॥ ౧౯

౧౦. ఉత్తమచరితముంగలదానా ! నావెంబడివచ్చుటకు నీకిష్టము లేనిచో నీగుఱుతు నెద్దియేనియు నొసంగుము. దానిని రాముఁడు గ్రహించెడుం గునుగదా.

౧౧. దేవకన్యకలతోఁ దుల్యురాలగు సీత హనుమంతునిచే నిట్లు పలుకంబడి కన్నీటితోడఁ గూడినట్లుగా మెల్లన నిట్లులనియెను.

౧౨, ౧౩. మున్ను చిత్రకూట పర్వతముయొక్క నైఋతమున నీశాన్యభాగమున గంగానదిచెంగటఁ బూజ్యములగు ఫలములను పుష్పలను జలము నుగలిగిన సిద్ధాశ్రమమునఁ దపస్వులయాశ్రమమందున్న నన్నుంగూర్చి నడచినదియగు నుత్తమమగు గుఱుతును బ్రాహ్మణునితోఁ జెప్పుము.

౧౪. ఆ పర్వతమునఁ బలువిధములగు పుష్పములయొక్క వాసనలతోఁగూడిన యుద్యానవనములయందుఁ గ్రీడించి యస్సినదాననై నీతొడపైఁ గూర్చుంటిని.

౧౫. పిమ్మటఁ గాకియొక్కటి మాంసమందు దాశగలదియై నామేను ముక్కునఁ బొడిచెను. దానిని నేనొక మంటిగడ్డనెత్తివేసి తోలితిని.

౧౬. మాంసమందు దాశగలదియగు నాకాకి నాశరీరమును గాయము నేయుచు మాంసమును విడువక యందే తగిలియుండెను.

౧౭. అటుపై, వస్త్రము సడలుచుండఁగా నొడ్డాణమును సవరించుచు నేను గాకిపైఁ గోపించినదాన నగుచుండి నీచేఁ జూడంబడితిని.

౧౮. మాంసేచ్ఛగల యాపక్షిచేఁ జీల్పంబడిన దాననై యలిగియున్న నేను నీచేఁ బరిహాసము నేయంబడి సిగ్గునొంది నినుం జేరవచ్చితి.

౧౯. అట్లు కోపగించియున్న నేను సంతోషింపగు నీచేత నూరడింపఁబడి, అలసి నీతొడపై మరలఁ గూర్చుంటిని.

బాష్పపూర్ణముఖీ మందం చక్షుషీ పరిమార్జతీ।
లక్షితాహం త్వయా నాథ వాయసేన ప్రకోపితా॥ ౨౦॥

పరిశ్రమాత్ప్రసుప్తా చ రాఘవాంకే ప్యహం చిరమ్।
పర్యాయేణ ప్రసుప్తశ్చ మమాంకే భరతాగ్రజః॥ ౨౧॥

స తత్ర పునరేవాథ వాయస స్సముపాగమత్॥ ౨౧½

తత స్సుప్త ప్రబుద్ధాం మాం రామస్యాంకా త్సముత్థితామ్।
వాయస స్సహసా గమ్య విదదార స్తనాంతరే॥ ౨౨½

పునఃపున రథోత్పత్య విదదార స మాం భృశమ్।
తత స్సముత్క్షితో రామో ముక్తై శ్శోణిత బిందుభిః॥ ౨౩½

వాయసేన తత స్తేన బలవత్ క్లిశ్యమానయా।
స మయా బోధిత శ్శ్రీమా న్సుఖసుప్తః పరంతపః॥ ౨౪½

స మాం దృష్ట్వా మహాబాహు ర్వితున్నాం స్తనయో స్తదా।
అశీవిష ఇవ క్రుద్ధ శ్శ్వసన్ వాక్య మభాషత॥ ౨౫½

కేన తే నాగనాసోరు విక్షతం వై స్తనాంతరమ్।
కః క్రీడతి సరోషేణ పంచవక్త్రేణ భోగినా॥ ౨౬½

వీక్షమాణ స్తత స్తం వై వాయసం సముదైక్షత।
నఖై స్సరుధిరై స్తీక్ష్ణై ర్మామే వాభిముఖం స్థితమ్॥ ౨౭½

౨౦. నేను గన్నీటిచే నిండిన మోముగలదాననై, కన్నీటిందుడుచుచు, 'కాకిచేఁ గోపింపఁజేయఁబడినదాననై నీకగపడితిని'

౨౧, ౨౧½. బడలిన దాననై నేను రాముని తొడమీఁదను దీర్ఘకాలము నిద్రించితిని. రాఘవుండును ఓమ్మటదానికిమాఱుగా నాతొడపైఁ బలునిడి పరుండియుండెను. పిమ్మట నాకాకి మునుపటివలె నక్కడికే వచ్చెను.

౨౨½. అట్లువచ్చి, నిద్రనుండి మేల్కొని రాముని తొడపైనుండ లేచిననన్ను, వేగమునవచ్చి యాకాకి స్తనమ్ములనడుమ గాయమువడఁజేసెను.

౨౩½. అంతటుపోక యాకాకి యెగిరియెగిరివచ్చి మఱిమఱి గాయములువడఁ బొడిచెను. ఆగాయములనుండివర్షించిన రక్తముచే రాముని మేను తడిసెను.

౨౪½. పిమ్మట, కాకిచే మిక్కిలి బాధింపఁ బడినదాననగు నాచేత సొంపగు రూపముంగలవాఁడును శత్రువులకుఁ గంటకుండును, సుఖముసు నిద్రను బొందియున్నవాఁడును నగురాముండు మేల్కొలుపం బడియెను.

౨౫½. గొప్ప భుజబలముగలవాఁడగు రాముఁడు స్తనములనడుమ గాయముంబడియున్ననన్నుంగని కోపముపొందిన కృష్ణసర్పమువలె బుసపెట్టుచు నిట్లడిగెను.

౨౬½. ఏనుఁగుతొండములవంటితొడలుగలదానా!నీయొక్కస్తనమ్ముపై నెవ్వనిచేఁ గాయము సేయఁబడియె. ఐదుతలలను గలదియై రోషముతోఁ గూడియున్న సర్పముతో నెవండో యాటలాడఁ దలఁచినవాఁడు?

౨౭½. అనిపలికి, నలుప్రక్కలఁజూచుచో రక్తముసోఁకి యెఱ్ఱనై కఱకులైయున్న గోళ్ళతోఁగూడి నాకెదుటనిలచి నన్నే కనుచున్న యాకాకిని రాముండు గనియెను.

పుత్రః కిల స శక్రస్య వాయసః పతతాం వరః।
ధరాంతరగత శ్శీఘ్రం పవనస్య గతౌ సమః॥ ౨౮౻

తత స్తస్మి న్మహాబాహుః కోపసంవ ర్తి తేక్షణః।
వాయసే కృతవా న్క్రూరాం మతిం మతిమతాం వరః॥ ౨౯౻

స దర్భం సం స్తరా ద్గృహ్య బ్రాహ్మే ణా స్త్రే ణ యోజయత్।
సదీ ప్త ఇవ కాలాగ్ని ర్జజ్వా లాభిముఖో ద్విజమ్॥ ౩౦౻

సతం ప్రదీ ప్తం చిక్షేప దర్భం తం వాయసం ప్రతి।
తత స్తం వాయసం దర్భ స్సోంబరే నుజగామహ॥ ౩౧౻

అనుసృష్ట స్తదా కాకో జగామ వివిధాం గతిమ్।
లోకకామ ఇమం లోకం సర్వం వై విచచారహ॥ ౩౨౻

స పిత్రా చ పరిత్య క్త స్సురైశ్చ సమహర్షిభిః।
త్రీ న్లోకాం సంపరిక్రమ్య తమేవ శరణం గతః॥ ౩౩౻

స తం నిపతితం భూమౌ శరణ్య శ్శరణాగతమ్।
వధార్హ మపి కాకుత్థ్సః కృపయా పర్యపాలయత్॥ ౩౪౻

న శర్మ లబ్ధ్వా లోకేషు త మేవ శరణం గతః।
పరిద్యూనం విషణ్ణం చ స త మాయాంత మబ్రవీత్॥ ౩౫౻

౨౮ 4. పక్షులలో వేగవంతమగు నావాయసము దేవేంద్రునకు పుత్రుఁడు. అతండు రామునియొక్క కోపముంగని వేగమున భూమిలోఁ జొచ్చెను.

౨౯ 4. అటుపిమ్మట బలవంతుఁడగు రామచంద్రుఁడు కోపముచేఁ బెరుగుచున్న చూపులుగలవాఁడై యా కాకిపై మిక్కిలి క్రూరత్వముం జూపఁదలఁచెను,

౩౦ 4. అతండు దానుగూర్చున్న దర్భచాపనుండి యొకపోచనెత్తి బ్రహ్మాస్త్రమను మంత్రమును దానితోడ సంధించెను. అయ్యస్త్రము కాకి పోవుచున్న దిక్కునుబట్టి ప్రళయాగ్ని మంటలు గ్రక్కుచున్నటుల గ్రక్కెను.

౩౧ 4. ఆయస్త్రమును శ్రీరాముండు వాయసముపైఁ బ్రయోగించెను. అంతట నాదర్భ కాకిని వెంబడించి యాకాశమునఁ దరుమసాగెను.

౩౨ 4. ఆ కాకము బ్రహ్మాస్త్రముచే వెంబడింపఁబడినదై నానావిధముల బరుంగెత్తెను. తన్ను రక్షించువారిని వెదకుచు లోకమంతట సంచరించెను.

౩౩ 4. ఆ కాక మట్లు ప్రాపుగోరి తిరిగితిరిగి తండ్రియగు నింద్రునిచేతను దేవతలచేతను ఋషులచేతను విడువంబడి మూఁడులోకములను దిరిగి శ్రీరాముని రక్షింపుమని వేఁడెను,

౩౪ 4. కాకుత్స్థవంశసంభవుఁడును దీనులరక్షించువాఁడును నగు రాముఁడు, దండనకుఁ దగినదయ్యును భూమిపై సాగిలపడి మ్రొక్కినదగు కాకిని దయచే రక్షించెను.

౩౫ 4. లోకమున నెందును నండలేక రాముని రక్షకునిఁగాఁ బొందెను. అట్లు తపించి దుఃఖించి తనకడకేతెంచిన కాకితో రాముండిట్లనియె.

మోఘం కర్తుం న శక్యంతు బ్రాహ్మ్యమస్త్రం తదుచ్యతామ్।
హినస్తు దక్షిణాక్షి త్వచ్ఛర ఇత్యథ సోఽబ్రవీత్॥ ౩౭.

తత స్తస్యాక్షి కాకస్య హినస్తి స్మ స దక్షిణమ్।
దత్త్వా స దక్షిణం నేత్రం ప్రాణేభ్యః పరిరక్షితః॥ ౩౮.

స రామాయ నమస్కృత్వా రాజ్ఞే దశరథాయ చ।
విసృష్ట స్తేన వీరేణ ప్రతిపేదే స్వమాలయమ్॥ ౩౯.

మత్కృతే కాకమాత్రేతు బ్రహ్మాస్త్రం సముదీరితమ్।
కస్మా ద్యో మాం హరే త్త్వత్తః క్షమసే తం మహీపతే॥

స కురుష్వ మహోత్సాహః కృపాం మయి నరర్షభ।
త్వయా నాథవతీ నాథ హ్యనాథేవ హి దృశ్యతే॥ ౪౦.

ఆనృశంస్యం పరో ధర్మ స్త్వత్త ఏవ మయా శ్రుతః।
జానామి త్వాం మహావీర్యం మహోత్సాహం మహాబలమ్॥ ౪౧.

అపారపార మక్షోభ్యం గాంభీర్యా త్సాగరోపమమ్।
భర్తారం ససముద్రాయా ధరణ్యా వాసవోపమమ్॥ ౪౨.

ఏవ మస్త్రవిదాం శ్రేష్ఠ స్సత్యవా న్బలవా నపి।
కిమర్థ మస్త్రం రక్షస్సు న యోజయతి రాఘవః॥ ౪౩.

౩౬వ. ఓ కాకీ! బ్రహ్మాస్త్రమును వ్యర్థముగాఁ జేయ సాధ్యము గా దు. కావున 'నీకుడికంటిని గ్రుచ్చి హరించికొ'మ్మని చెప్పుదుము! అనఁగాఁ గాక మట్లనియెను.

౩౭వ. పిమ్మట రాముఁడు కాకియొక్క కుడికంటిని హరించెను. కాకియుఁ గుడికన్నిచ్చి (చాపుతప్పి కన్ను పొత్తపోయె నన్నట్లు) ప్రాణము లను రక్షించికొనియెను.

౩౮వ. అట్లు రక్షించికొని యా కాకము శ్రీరామునకును దశరథు నకును మ్రొక్కి యాశూరునిచే విడువంబడి తన త్రోవ నేగెను.

౩౯వ. రాజా! నాకుహానిచేసిన కాకిమీఁదనే బ్రహ్మాస్త్రము నేసి న శూరుండవు, నీయొద్దనుండి తొలఁగించి నన్నుఁ దెచ్చిన ద్రోహిని నీవేల యోర్చియున్నావు.

౪౦వ. పురుషోత్తమా! అంతయుత్సాహముం గలనీవు నాయందుఁ గరుణింపఁ దగును. నాథునింగలదియగు సీతను నాథుఁడు లేని దానివలెఁ జేసి చూచుచున్నావు గదా!

౪౧వ. హింస పెట్టకుండుట ధర్మములలో నుత్తమమయినదని నీచే నుపదేశించియుంటివి. నీవు యుత్సాహశక్తిగలవాఁడవనియును బలవంతుఁడ వనియును శూరుఁడవనియును నే నెఱుంగుదును.

౪౨వ. ఇంతపాటివాఁడవని తెలియరానివాఁడవు, దుఃఖములకు లోఁబడనివాఁడవు, అభిప్రాయము నితరులకుఁ దెలియనియ్యని వాఁడవు, సముద్రములను మేఱగాఁగల భూమండలమునకుఁ బ్రభుఁడవునని యెఱుం గుదును.

౪౩వ. ఇట్లు ధనుస్సును జేఁపట్టినవారిలోనెల్ల మేటియగు రాముం డు బలవంతుఁడును, సత్యముం భాషించువాఁడును నైయుండియు రాక్ష సులపైఁ బ్రయోగింప బాణము నేలసంధింపకున్నాఁడు?

ననాగా నాపి గంధర్వా నాసురా నమరుద్గణాః।
రామస్య సమరే వేగం శక్తాః ప్రతిసమాధితుమ్॥ ౪౪

తస్య వీర్యవతః కశ్చి ద్యద్యస్తి మయి సంభ్రమః।
కిమర్థం నశరై స్తీక్ష్ణైః క్షయం నయతి రాక్షసాన్॥ ౪౫

భ్రాతు రాదేశ మాదాయ లక్ష్మణో వా పరంతపః।
కస్య హేతో ర్నమాం వీరః పరిత్రాతి మహాబలః॥ ౪౬

యది తౌ పురుషవ్యాఘ్రౌ వాయ్వగ్ని సమ తేజసౌ।
సురాణా మపి దుర్ధర్షౌ కిమర్థం మా ముపేక్షతః॥ ౪౭

మమైవ దుష్కృతం కించి న్మహ దస్తి నసంశయః।
సమర్థా వపి తౌ య న్మాం నావేక్షేతే పరంతపౌ॥ ౪౮

వైదేహ్యా వచనం శ్రుత్వా కరుణం సాశ్రు భాషితమ్।
అథా బ్రవీ న్మహాతేజా హనూమా న్మారుతాత్మజః॥ ౪౯

త్వచ్ఛోక విముఖో రామో దేవి సత్యేన మే శపే।
రామో దుఃఖాభిపన్నే చ లక్ష్మణః పరితప్యతే॥ ౫౦

కథంచి ద్భవతీ దృష్టా న కాలః పరిశోచితుమ్।
ఇమం ముహూర్తం దుఃఖానాం ద్రక్ష్యస్యంత మనిందితే॥ ౫౧

౪౪వ. నాగులును, గంధర్వులును, రాక్షసులును, దేవతలును నను జాతులవారిలో నెవ్వరును యుద్ధమున రాముని వేగము నోర్వఁజాలరు ఎదుట నిలువను నేరరు.

౪౫వ. అంతటి పరాక్రమశాలియగు ప్రభునకు నాయందుఁ బ్రేమ కొంచెమేనిఁ గలిగియున్నచోఁ గఱకుగల బాణములచే రాక్షసుల నేలనాశము నేయఁడు ?

౪౬వ. మహాబలశాలియు, శూరుఁడును, శత్రువుల నుడికించువాఁడునునగు లక్ష్మణుఁడేనియు నన్నయొక్క యనుమతింగొని నన్నేల రక్షింపరాఁడు.

౪౭వ. పురుషశ్రేష్ఠులును, అగ్నివాయువులతో సమమయిన ప్రతాపములం గలవారును నగు రామలక్ష్మణులు దేవతలకును సహింపఁగూడనివారై సుఖులైయుండియు నన్నుఁగరుణింపక యేల యుపేక్షచేయుచున్నారు.

౪౮వ. శత్రువుల నుడికించువారగు రామలక్ష్మణులు సమర్థులై యుండియు నన్నాదరింపకయుండుటనుబట్టి, మున్ను నేనుజేసిన దొడ్డపాపము కొంత నేటికినిమిగిలియేయున్నదని తలంచెదను. ఇందుకు సంశయము లేదు.

౪౯వ. ఇట్లుకన్నీరువిడుచుచుఁ గరుణపుట్టునట్లుగా సంభాషించిన సీతమాటలను విని ప్రతాపసంపన్నుఁడగు హనుమానుం డిట్లనియెను.

౫౦వ. ఓదేవీ ! రాముండు నినుంగూర్చిన దుఃఖముచే నితరములగు సర్వవిషయములను మానియున్నాఁడు. ఆతండు దుఃఖించుటయేగాక లక్ష్మణునిశోకము మేఱలేకయున్నది. ఇట్లుండుట సత్యమని బాసచేసెదను.

౫౧వ. పూజ్యురాలా! దుఃఖించుటకు సమయము గాదు. నిన్ను నేను జూచుచున్న స్వల్పకాలముననే దుఃఖమునుండి విడుదలఁగాంచెదవుసుమా.

తావుభౌ పురుషవ్యాఘ్రౌ రాజపుత్రౌ మహాబలౌ।
త్వద్దర్శన కృతోత్సాహౌ లంకాం భస్మీకరిష్యతః॥ ౫౨

హత్వా చ సమరే క్రూరం రావణం సహబాంధవమ్।
రాఘవ స్త్వాం విశాలాక్షి నేష్యతి స్వాం పురీం ప్రతి॥ ౫౩

బ్రూహి యద్రాఘవో వాచ్యో లక్ష్మణ శ్చ మహాబలః।
సుగ్రీవో వాపి తేజస్వీ హరయోపి సమాగతాః॥ ౫౪

ఇత్యుక్తవతి తస్మింశ్చ సీతా సురసుతోపమా।
ఉవాచ శోకసంతప్తా హనుమంతం ప్లవంగమమ్॥ ౫౫

కౌసల్యా లోకభర్తారం సుషువే యం మనస్వినీ।
తం మమార్థే సుఖం పృచ్ఛ శిరసా చాభి వాదయ॥ ౫౬

స్రజ శ్చ సర్వరత్నాని ప్రియా యాశ్చ వరాంగనాః।
ఐశ్వర్యం చ విశాలాయాం పృథివ్యా మపి దుర్లభమ్॥ ౫౭

పితరం మాతరం చైవ సంమాన్యాభి ప్రసాద్య చ।
అనుప్రవ్రజితో రామం సుమిత్రా యేన సుప్రజాః॥ ౫౮

ఆనుకూల్యేన ధర్మాత్మా త్యక్త్వా సుఖ మనుత్తమమ్।
అనుగచ్ఛతి కాకుత్స్థ భ్రాతరం పాలయ న్వనే॥ ౫౯

సింహస్కంధో మహాబాహు ర్మనస్వీ ప్రియదర్శనః।
పితృవ ద్వర్తతే రామే మాతృవ న్మాం సమాచరన్॥ ౬౦

౫౨. పురుషోత్తములును బలవంతులును రాజపుత్రులును నగు వారిరువురును మిక్కిలి పూనికతో లంకను భస్మము సేయుదురు.

౫౩. క్రూరుఁడగు రావణుని బంధువులతోడఁగూడ యుద్ధమున సంహరించి రాఘవుఁడు నిన్నయోధ్యకుం గొనిపోవఁ గలఁడు విశాలాక్షీ!

౫౪. రామచంద్రున కేమిచెప్పుమనియెదవో యదియు, బలవంతుఁడగు లక్ష్మణునకును, ప్రతాపవంతుఁడగు సుగ్రీవునకును, చేరవచ్చియున్న వానరులకును జెప్పందగుమాటలును జెప్పుమా!

౫౫. అట్లు హనుమంతునిచే నడుగంబడినదియై దేవకన్యకంబోలినదియగు సీత శోకముచే బొగులుచు నిట్లనియెను.

౫౬. చల్లని మనస్సుగల కౌసల్యాదేవి లోకములకు రక్షకుఁడుగ నేపుణ్యాత్ముం గనెనో యాతనినాకుమాఱుగ క్షేమమడుగుము. తలవాంచి మ్రొక్కుము.

౫౭, ౫౮. ఏవానింగనుటచే సుమిత్ర మంచికొడుకులం గలదియయ్యెనో యట్టి లక్ష్మణుఁడు, పూదండలను, సమస్తరత్నములను, చెలికత్తెలతోఁగూడినదియగుతనయార్మిళయనుభార్యను, విరివిగల రాజ్యమును ఇంపగుభోగమును మాని తల్లిదండ్రులను గౌరవించి మ్రొక్కివదలి రాముని వెంట వచ్చినవాఁడు.

౫౯. ధర్మస్వభావమునుగలవాఁడై రామునియందలిభక్తిచే సాటిలేని సౌఖ్యమునువిడిచి వెంటవచ్చి యరణ్యమున నన్న కుపచారములుచేసి రక్షించుచున్నవాఁడు.

౬౦. సింగపు భుజములవంటి భుజములు గలవాఁడును, బలశాలియు, సాధుచిత్తుఁడును, శాంతమూర్తియునగు నాపూజ్యుఁడు రామచంద్రునిం దండ్రివలెను నన్నుఁదల్లివలెను గౌరవించుచున్నవాఁడు.

హ్రియమాణాం తదావీరో నతుమాం వేద లక్ష్మణః॥ ౬౧

వృద్ధోపసేవీ లక్ష్మీవాన్ శక్తో న బహుభాషితా।
రాజ్ఞః పుత్రః ప్రియ శ్శ్రేష్ఠ స్సదృశ శ్శ్వశురస్య మే॥ ౬౨

మమ ప్రియకరో నిత్యం భ్రాతా రామస్య లక్ష్మణః।
నియుక్తో ధురి యస్యాస్తు తాముద్వహతి వీర్యవాన్॥ ౬౩

యందృష్ట్వా రాఘవో నైవ వృత్తమార్య మనుస్మరేత్।
స మమార్థాయ కుశలం వక్తవ్యో వచనా న్మమ॥ ౬౪

మృదుర్నిత్యం శుచి ర్దక్షః ప్రియో రామస్య లక్ష్మణః॥ ౬౪౻

యథాహి వానర శ్రేష్ఠ దుఃఖక్షయకరో భవేత్॥ ౬౫

త్వమస్మి న్కార్యనిర్యోగే ప్రమాణం హరిసత్తమ।
రాఘవ స్త్వత్సమారంభా న్మయి యత్నపరో భవేత్॥ ౬౬

ఇదం బ్రూయాశ్చ మే నాథం శూరం రామం పునఃపునః।
జీవితం ధారయిష్యామి మాసం దశరథాత్మజ॥ ౬౭

ఊర్ధ్వం మాసా న్నజీవేయం సత్యేనాహం బ్రవీమి తే।
రావణే నోపరుద్ధాం మాం నికృత్యా పాపకర్మణా॥ ౬౮

త్రాతుమర్హసి వీర త్వం పాతాళాదివ కౌశికీమ్॥ ౬౮౻

౬౧ నుండి ౬౩కు. శూరుఁడగులక్ష్మణుండు నేను రావణునిచేఁగొని పోఁబడుట నెఱుఁగఁడు. పెద్దల నాశ్రయించి సేవించువాఁడును, శుభగుణములం గలవాఁడును, మితిమించినంత శక్తిగలవాఁడును మితముగమాటలాడువాఁడును, నా మామయగు దశరథునకు నుత్తముండును, తుల్యుఁడును, ఇష్టుఁడును, నాకెల్లపుడు మిక్కిలియిష్టుఁడును, రామునకు భుజము వంటివాఁడును, బలశాలియు నగు లక్ష్మణుఁ డేకార్యమందు రామునిచే నియమింపఁ బడుచున్నాఁడో యట్టికార్యము నాతండు దప్పక చేయుచున్నాఁడు.

౬౪, ౬౫. రామచంద్రుఁ డెవ్వనిం గాంచుటచే తృప్తినొందిన దశరథుని మఱచియున్నాఁడో యట్టి లక్ష్మణునకు నాక్షేమ మెఱింగింపుము. అతం డెల్లప్పుడు దయఁగలవాఁడును శుద్ధుఁడును నేర్పరియు రామునకిష్టుఁడును నగును.

౬౬, ౬౭. ఓ వానరోత్తమా! నీవు నాదుఃఖములను నాశము సేయువాఁడ వైనచొప్పున నే యీకార్యము నెరవేరుటకు నీవే యాధారభూతుఁడవు. ఎట్లనఁగా నీయత్నముచేత నే రాఘవుండును నన్నుద్ధరింపఁదలంచువాఁడగును.

౬౮ నుండి ౭౦౫. ఓ దశరథపుత్రుఁడా! నెలదినములవఱకుఁ బ్రాణములను ధరించియుందును. అంతకుమించి జీవింపఁజాలను. ఇదిసత్యము, నీతోడఁ జెప్పెదను. ఓ శూరుఁడా! దుష్కర్ముఁడగు రావణునిచే మోసముగాఁదేఁబడి యడ్డగింపఁబడియున్న నన్ను (విష్ణుదేవుఁడు దేవేంద్రుని లక్ష్మిని పాతాళమునుండి రక్షించినట్లు) నుద్ధరింపఁదగుదువు. అని యిట్లు శూరుఁడగు నాభర్తతోఁ బలుమాఱు చెప్పుము.

తతో వస్త్రగతం ముక్త్వా దివ్యం చూడామణిం శుభమ్।
ప్రదేయో రాఘవాయేతి సీతా హనుమతే దదౌ॥ ౬౯

ప్రతిగృహ్య తతో వీరో మణిరత్న మనుత్తమమ్।
అంగుళ్యా యోజయామాస నహ్యస్య ప్రాభవ ద్భుజః॥ ౭౦

మణిరత్నం కపివరః ప్రతిగృహ్యాభివాద్యచ।
సీతాం ప్రదక్షిణం కృత్వా ప్రణతః పార్శ్వత స్స్థితః॥ ౭౧

హర్షేణ మహతా యుక్త స్సీతా దర్శనజేన సః।
హృదయేన గతో రామం శరీరేణతు విష్ఠితః॥ ౭౨

మణివర ముపగృహ్య తం మహార్హం జనకనృపాత్మజయా ధృ
తం ప్రభావాత్। గిరి రివ పవనావధూత ముక్త స్సుఖిత మనాః
ప్రతిసంక్రమం ప్రపేదే॥ ౭౩

ఇతి శ్రీమత్సుందరకాండే - అష్టత్రింశస్సర్గః.

---

## ఏకోనచత్వారింశస్సర్గః.

మణిం దత్వా తతస్సీతా హనుమంత మథాబ్రవీత్।
అభిజ్ఞాన మభిజ్ఞాత మేతదామస్య తత్త్వతః॥ ౧

మణింతు దృష్ట్వా రామోవై త్రయాణాం సంస్మరిష్యతి।
వీరో జనన్యా మమచ రాజ్ఞో దశరథస్య చ॥ ౨

౬౯౪. అనిపలికి, సీతాదేవి తనవస్త్రమునకొంగున ముడిచియుండి న యుత్తమమై శుభచిహ్నములుగలదియగు చూడామణిని (తలపై ధరించు రత్నమును) విచ్చి 'దీనిని రామచంద్రున కిమ్మ'ని హనుమంతునిచే నిచ్చెను.

౭౦౪. వీరుండగు నాతం డారత్నశ్రేష్ఠమును దీసికొని చేతి వ్రేళు లనడుమ నుంచికొనియెను. అప్పుడు వానిభుజము లావుగనుండలేదు. కొద్ది రూపమే ధరించియుండెను.

౭౧౪. వానరోత్తముడగునాతం డాయుత్తమరత్నము గొని మ్రొక్కి యాతల్లికి ప్రదక్షిణము జేసి యడకువతోడ పార్శ్వమున నిలచి యుండెను.

౭౨౪. సీతనుజూచుటచేత గలిగిన దొడ్డసంతోషముతోడ గూడిన వాడై యాహనుమంతుడు హృదయముచే శ్రీరామునిం దలచుచు, శరీరముచేమాత్ర మందున్న వాడు.

౭౪౪. ఆయాంజనేయుడు జానకిచే ధరింపబడి యుండినదియు వెలగలదియు నగు నాయుత్తమ రత్నమును దనశక్తిచేగొని గాలిచేత గద ల్పబడినకొండవలె సంతోషించిన మనస్సుగలవాడై మరలి చనుటకు బూనెను.

ఇది ముప్పదియెనిమిదవసర్గ.

---

## ముప్పదితొమ్మిదవసర్గ.

౧. సీతాదేవి చూడామణినిచ్చి, ఈగుఱుతు రామచంద్రునకు బాగు గ దెలిసినది సుమా! అని హనుమంతునితోడ జెప్పెను.

౨. శూరుడగు రాముడీమణిని జూచినతోడనే తల్లియగు కౌస ల్యను దండ్రియగు దశరథుని నన్నును దలంపగలండు.

స భూయ స్త్వం సముత్సాహే చోదితో హరిసత్తమ।
అస్మి న్కార్య సమారంభే ప్రచింతయ యదుత్తరమ్॥
త్వమస్మి న్కార్యనిర్యోగే ప్రమాణం హరిసత్తమ।
హనుమ న్యత్న మాస్థాయ దుఃఖ క్షయకరో భవ॥
తస్య చింతయతో యత్నో దుఃఖ క్షయకరో భవేత్॥
స తథేతి ప్రతిజ్ఞాయ మారుతి ర్భీమవిక్రమః।
శిరసా వంద్య వైదేహీం గమనా యోపచక్రమే॥
జ్ఞాత్వా సంప్రస్థితం దేవీ వానరం మారుతాత్మజమ్।
బాష్పగద్గదయా వాచా మైథిలీ వాక్య మబ్రవీత్॥
కుశలం హనుమ న్బ్రూయాః సహితౌ రామలక్ష్మణౌ।
సుగ్రీవం చ సహామాత్యం వృద్ధా న్సర్వాంశ్చ వానరా న్॥
బ్రూయా స్త్వం వానరశ్రేష్ఠ కుశలం ధర్మ సంహితమ్॥
యథా స చ మహాబాహు ర్మాం తారయతి రాఘవః।
అస్మా ద్దుఃఖాంబు సంరోధా త్త్వం సమాధాతు మర్హసి॥
జీవంతీం మాం యథా రామః సంభావయతి కీర్తిమా న్।
త త్తథా హనుమ న్వాచ్యం వాచా ధర్మ మవాప్నుహి॥
నిత్య ముత్సాహ యుక్తాశ్చ వాచ శ్శ్రుత్వా త్వయేరితా
వర్ధిష్యతే దాశరథేః పౌరుషం మదవాప్తయే॥
మత్సందేశ యుతా వాచ స్త్వత్త శ్శ్రుత్వైవ రాఘవః।
పరాక్రమ విధిం వీరో విధివ త్సంవిధాస్యతి॥

౩. ఓవానరోత్తమా! నీవు నాచే నుత్సాహింపఁజేయఁబడినవాఁడవీ కార్యమునం దెట్లువర్తింపవలయునో యోచింపుము.

౪, ౪½. హనుమంతుఁడ! ఈకార్యము నెఱవేరుటయందు నీవు ప్రధానభూతుఁడవై యున్నావు. కావున యత్నముంజేసి దుఃఖమును నశింపఁజేయువాఁడవు కమ్ము! ఏలనన బాగుగ యోచించి చేయుయత్నమె దుఃఖము నడంపఁజాలినదియే యగును.

౫½. అని యామె వలుకఁగా భయంకరమగు బలమునుగలవాఁడగు వాయుపుత్రుఁడు నీవుకోరినట్లు చేయుదుంగాకయని యొడంబడి తలవాంచి మ్రొక్కి పయనమునకుఁ దొడంగెను.

౬½. అట్లు హనుమంతుఁడు తరలుటనెఱింగి జానకి కన్నీరు రాలుచు, వడంకుచున్న యెలుంగుతో నాతనింగని యిట్లనియెను.

౭½, ౮. హనుమంతుఁడ! ఒకచోటఁ గూడియున్నపుడు రామలక్ష్మణులతోడ నాక్షేమముందెలుపుము. మంత్రిసమేతుఁడుగనున్న సుగ్రీవునితోడను నాక్షేమముం బలుకుము. అందఱి వృద్ధులగు వానరులతోడను జెప్పుము. ఆచెప్పుట ధర్మయుతముగా నుండనిమ్ము!

౯. బలశాలియగు రాఘవుఁడు నన్నీదుఃఖమునుండి దాఁటింప నెట్లుబాధ్యుఁడో యటువలెనె నీవును గార్యానుకూలతను వేచి పనిచేయందగుదువు సుమా!

౧౦. జీవించియున్న నన్ను శ్రీరాముం డెట్లు గౌరవించునో యట్టులనే నీవుచెప్పుమాటయు నింపైయుండవలయు నీవు వాక్కుచేఁ బుణ్యమును బొందుము.

౧౧, ౧౨. శ్రీరామున కుత్సాహమును గలిగించునట్టిమాటలు తఱుచుగఁజెప్పుచుంటివేని నన్నుంగొనిపోవ నాతనిపౌరుషమభివృద్ధియగును. నేను నీతోఁ జెప్పిపంపుమాటలను వినిపించుచుంటివేని రామునకుం బరాక్రమము మిక్కిలిగాఁ బెఱుగును.

సీతాయా వచనం శ్రుత్వా హనుమా న్మారుతాత్మజః
శిరస్యంజలి మాధాయ వాక్యము త్తర మబ్రవీత్॥ ౧౩॥
క్షిప్రమేష్యతి కాకుత్స్థో హర్యృక్ష ప్రవరై ర్వృతః
యస్తే యుధి విజిత్యారీ ఞ్ఛోకం వ్యపనయిష్యతి॥ ౧౪॥
నహి పశ్యామి మర్త్యేషు నాసురేషు సురేషు వా
య స్తస్య క్షిపతో బాణా న్స్థాతు ముత్సహతే గ్రతః ౧౫॥
అప్యర్క మపిపర్జన్య మపి వైవస్వతం యమమ్
స హి సోఢుం రణే శక్త స్తవ హేతో ర్విశేషతః॥ ౧౬॥
సహి సాగర పర్యంతాం మహీం శాసితు మీహతే
త్వన్నిమిత్తో హి రామస్య జయో జనకనందిని॥ ౧౭॥
తస్య తద్వచనం శ్రుత్వా సమ్యక్సత్యం సుభాషితమ్
జానకీ బహుమేనేథ వచనం చేద మబ్రవీత్॥ ౧౮॥
తత స్తం ప్రస్థితం సీతా వీక్షమాణా పునఃపునః
భర్తృ స్నేహాన్వితం వాక్యం సౌహార్దా దనుమానయత్॥ ౧౯॥
యదివా మన్యసే వీర వసైకాహ మరిందమ
కస్మింశ్చి త్సంవృతే దేశే విశ్రాంత శ్శ్వో గమిష్యసి॥ ౨౦॥
మమచే దల్పభాగ్యాయాః సాన్నిధ్యా త్తవ వానర
అస్యశోకస్య మహతో ముహూర్తం మోక్షణం భవేత్॥ ౨౧॥

౧౩. వాయుపుత్రుఁడగు హనుమంతుఁడు సీతయొక్క మాటలనువిని చేతులను మోడ్చి తలపైనిడికొని యిట్లనియెను.

౧౪. మొనగాండ్రగు వానరుల నెలుఁగుబంట్లను వెంటఁగొని రాముఁడు శీఘ్రముననేరాఁగలఁడు, యుద్ధమున శత్రువులను రూపుమాపి నీదుఃఖము నివారింపఁగలఁడు.

౧౫. ధనుస్సును జేపట్టి బాణములను గ్రుమ్మరించుచున్న రామచంద్రున కెదుట నిలువరింపఁగలవాఁడు మనుజులయందును దేవతలయందును రాక్షసులయందును గలుఁగఁడు.

౧౬. ఇంద్రునేనియు, సూర్యపుత్రుఁడగు యమునేనియు, సూర్యునేనియు నీవిషయమయి యుద్ధమున జయింప మిక్కిలి శక్తిగలిగి రాముండున్నాఁడు.

౧౭. రాముఁడు సముద్రములవఱకు వ్యాపించియున్న భూమినంతయుఁ బాలింపఁ జాలినవాఁడు. ఓజానకి! రామునకు నీనిమిత్తమున గెలుపు సిద్ధము.

౧౮. అనియింపైనదియు సత్యమైనదియు బాగుగఁ జెప్పంబడినదియునగు హనుమంతునిమాటనువిని జానకి గౌరవించి యిట్లనియెను.

౧౯. అట్లు కదలిన హనుమంతుని బలుమాఱుచూచినపై తన మగనియందలి స్నేహమును దెలుపునదియగు వాక్యమును మైత్రితో నిట్లు పలికెను.

౨౦. ఓవీరుఁడా! నీకిష్టమున్నచో నింక నొక్కదిన మిందుండి యీ పుష్పవృక్షముల మొత్తముయొక్క నీడల నలపుందీర్చికొని రేపుపొమ్ము!

౨౧. ఓవానర! అదృష్టహీనురాలనగు నాయొక్క మితిలేని శోకమునకు విడుదలయెట్టిదనఁగా నీవిందుండు స్వల్పకాలమే విడుదలయని తలంచెదను.

గతే హి హరిశార్దూల పునరాగమనాయ తు।
ప్రాణానామపి సందేహో మమస్యాన్నాత్ర సంశయః॥ ౧౨॥

తవాదర్శనజ శ్శోకో భూయో మాం పరితాపయేత్।
దుఃఖా ద్దుఃఖపరామృష్టాం దీపయన్నివ వానర॥ ౧౩॥

అయంచ వీర సందేహ స్తిష్ఠతీవ మమాగ్రతః।
సుమహాం స్త్వత్సహాయేషు హర్యృక్షేషు హరీశ్వర॥ ౧౪॥

కథం ను ఖలు దుష్పారం తరిష్యంతి మహోదధిమ్।
తాని హర్యృక్ష సైన్యాని తౌ వా నరవరాత్మజౌ॥ ౧౫॥

త్రయాణామేవ భూతానాం సాగర స్యాస్యలంఘనే।
శక్తి స్స్యా ద్వైనతేయస్య తవ వా మారుతస్య వా॥ ౧౬॥

త దస్మి న్కార్యనిర్యోగే వీరైవం దురతిక్రమే।
కిం పశ్యసి సమాధానం త్వంహి కార్యవిదాం వరః॥ ౧౭॥

కామ మస్య త్వమే వైకః కార్యస్య పరిసాధనే।
పర్యాప్తః పరవీరఘ్న యశస్య స్తే ఫలోదయః॥ ౧౮॥

బలై స్సమగ్రై ర్యదిమాం రావణం జిత్వా సంయుగే।
విజయీ స్వపురీం యాయా త్తత్తు మే స్యా ద్యశస్కరమ్॥ ౧౯॥

౨౨. ఓవానరుఁడా! నీవు మరలవచ్చుటకు యత్నముసేయుచుం డునంతలో నేను జీవించియుండుట కలుగదు. ఇట్లనుట సత్యము.

౨౩. ఓహనుమంతుఁడ! నిను గనకుండుటయనుశోకము మూఁడు దుఃఖముసకంటెవేఱగు క్రొత్తమంఘముచే నవయుచున్న నన్ను దహించు చున్నది.

౨౪. నీకుఁ దోడుగనున్న వానరులను, ఎలుఁగులను గూర్చి గొప్పదగు సందేహమొకటి నాయెదుట నిలచినట్లుగ దోఁచుచున్నది హనుమా!

౨౫. ఆవానరులయొక్కయు నెలుఁగుబంట్లయొక్కయు సేనలు దాఁట నసాధ్యమైనదగు నవ్వలిగట్టునుగల సముద్రము నెట్లు దాఁటును. ఆరాజ కొమరులేనియు దాఁటుట యెట్లుగలుగును?

౨౬. ఈసముద్రమును దాఁటుటయందు, భూతజాలములలో గరుడునకును నీకును నీతండ్రియగు వాయువునకును ముగ్గురకుమాత్రమే శక్తి గలదు.

౨౭. ఓశూరుఁడా! కార్యము నెఱుంగువారిలో నుత్తముఁడవగు నీవు మీఱఁగూడనిదియగు నీకార్యమును సమకూర్చుటయం దేయుపాయమును యోచించెదవు?

౨౮. శత్రువీరులను హరించువాఁడా! ఈకార్యమును నెఱవేర్చుటయందు నీవొక్కఁడవే చాలినవాఁడవు. ఇపని నెరవేరుటయనునది కీర్తిని నీకుఁ గలిగించును.

౨౯. జయించు స్వభావముగలవాఁడగు రాముఁడు సంపూర్ణము లగు సేనలతోవచ్చి యుద్ధమున రావణునిజయించి నన్నుయోధ్యకుఁ గొని పోవునేని నాకది కీర్తికరముగ నుండును.

శరైస్తు సంకులాం కృత్వా లంకాం పరబలార్దనః।
మాం నయేద్యది కాకుత్స్థ స్తత్తస్య సదృశం భవేత్॥ 30॥

తద్యథా తస్య విక్రాంత మనురూపం మహాత్మనః।
భవే దాహవశూరస్య తథా త్వ ముపపాదయ॥ 31॥

తదర్థోపహితం వాక్యం సహితం హేతుసంహితమ్।
నిశమ్య హనుమాన్ శేషం వాక్య ముత్తర మబ్రవీత్॥ 32॥

దేవి హర్యృక్ష సైన్యానా మీశ్వరః ప్లవతాం వరః।
సుగ్రీవ స్సత్త్వసంపన్న స్తవార్థే కృత నిశ్చయః॥ 33॥

స వానర సహస్రాణాం కోటీభి రభిసంవృతః।
క్షిప్ర మేష్యతి వైదేహి రాక్షసానాం నిబర్హణః॥ 34॥

తస్య విక్రమసంపన్నా స్సత్త్వవంతో మహాబలాః।
మనస్సంకల్ప సంపాతా నిదేశే హరయ స్స్థితాః॥ 35॥

యేషాం నోపరి నాధస్తా న్న తిర్య క్సజ్జతే గతిః।
నచ కర్మను సీదంతి మహ త్స్వమిత తేజసః॥ 36॥

అసకృ త్తై ర్మహోత్సాహై స్ససాగర ధరాధరా।
ప్రదక్షిణీకృతా భూమి ర్వాయుమా ర్గానుసారభిః॥ 37॥

౩౦. శత్రుసేనలఁ బీడించువాఁడగు రాముఁడు లంకను బాణములచే నుఱుమాడి నన్నుం గొనిపోవునేని యాతనికీర్తి కది చాలినదియగును.

౩౧. కావున గొప్పవాఁడును యుద్ధశూరుఁడును నగు రామునకుఁ జాలినంతపరాక్రమము గలుగునట్లు నీవు తోడ్పడి యుద్రేకము చేయవలయును.

౩౨. కొంతవఱకుఁ జెప్పఁబడినదియుఁ బరస్పర సంబంధమును గలదియు, హేతువుతోఁగూడినదియు నగు నాసీతయొక్క మాటలనువిని హనుమంతుఁడు దక్షిణభాగమును దాను బూర్తిచేయుచు నిట్లనియెను.

౩౩. ఓతల్లీ! వానరులయొక్కయు నెలుఁగులయొక్కయు సేనలకుఁ బ్రభుండును మర్కటములలో నుత్తముఁడును బలవంతుఁడును నగుసుగ్రీవుఁడు నీవిషయమై నిశ్చయించికొని యున్నాఁడు.

౩౪. ఓజననీ! ఆసుగ్రీవుఁడు వానరులయొక్క సహస్రములచేతను గోట్లచేతను జుట్టంబడినవాఁడై రాక్షసులంగూల్ప శీఘ్రమున రాఁగలండు.

౩౫. పరాక్రమశాలులును, బుద్ధిమంతులును బలవంతులును మనస్సు సంచరించునంత వేగమున సంచరించువారును నగువానరు లాతని యాజ్ఞయం దున్నారు.

౩౬. వానరులు భూమిక్రిందికేనియు నాకాశమునకేనియు నడ్డము గానేనియు నాలస్యములేక పోఁజాలుదురు. మిక్కిలి ప్రతాపముగలవారు.

౩౭. మిక్కిలి పూనికగలవారును, ఆకాశమార్గమున సంచరించువారును నైనయావానరులచేత సముద్రములతోడను బర్వతములతోడను గూడినదియగుభూమి పెక్కుమాఱులు ప్రదక్షిణము సేయంబడిన దయ్యెను.

మద్విశిష్టాశ్చ తుల్యాశ్చ సంతి తత్ర వనౌకసః।
మత్తః ప్రత్యవరః కశ్చిన్నాస్తి సుగ్రీవసన్నిధౌ॥ ౩౮॥
అహం తావదిహ ప్రాప్తః కిం పునస్తే మహాబలాః।
న హి ప్రకృష్టాః ప్రేష్యంతే ప్రేష్యంతే హీతరే జనాః॥ ౩౯॥
తదలం పరితాపేన దేవి శోకో వ్యపైతు తే।
ఏకోత్పాతేన తే లంకామేష్యంతి హరియూథపాః॥ ౪౦॥
మమ పృష్ఠగతౌ తౌ చ చంద్రసూర్యావివోదితౌ।
త్వత్సకాశం మహాసత్త్వౌ నృసింహావాగమిష్యతః॥ ౪౧॥
తౌ హి వీరౌ నరవరౌ సహితౌ రామలక్ష్మణౌ।
ఆగమ్య నగరీం లంకాం సాయకైర్విధమిష్యతః॥ ౪౨॥
సగణం రావణం హత్వా రాఘవో రఘునందనః।
త్వామాదాయ వరారోహే స్వపురం ప్రతియాస్యతి॥ ౪౩॥
తదాశ్వసిహి భద్రం తే భవ త్వం కాలకాంక్షిణీ।
నచిరాద్ద్రక్ష్యసే రామం ప్రజ్వలంతమివానలమ్॥ ౪౪॥
నిహతే రాక్షసేంద్రేఽస్మిన్ సపుత్రామాత్యబాంధవే।
త్వం సమేష్యసి రామేణ శశాంకేనేవ రోహిణీ॥ ౪౫॥
క్షిప్రం త్వం దేవి శోకస్య పారం యాస్యసి మైథిలి।
రావణం చైవ రామేణ నిహతం ద్రక్ష్యసేఽచిరాత్॥ ౪౬॥

౩౮. నాకంటెనధికులును సాత్త్వికులును నగు వానరు లచ్చో
ట ననేకులున్నారు. సుగ్రీవునియొద్ద నాకంటెఁ దక్కువవాఁ డొక్కఁడై
నను లేఁడు.

౩౯. నాబోటివాఁడనే సముద్రమును దాఁటవచ్చితినిగదా ! ఇఁ
కను తక్కిన బలవంతులమాట చెప్పవలసిన దేమియున్నది. ఏదేయేనిప
నిపడినపుడు బలవంతులు ముందుపనుపఁబడరుగాని సామాన్యులు పంపఁ
బడుదురు.

౪౦. కావున నో జానకీ ! దుఃఖముడుగుము. నీదుఃఖము తొలఁగు
చుండును. వానరోత్తము లొక్కపెట్టున లంకను జొరఁగలరు.

౪౧. ఉదయించుచున్న చంద్రసూర్యులను బోలినవారును మిక్కి
లిబలవంతులును, పురుషశ్రేష్ఠులును నగు రామలక్ష్మణులు నావీపున నెక్కి
నీకడకు వత్తురు.

౪౨ శూరులును, పురుషశ్రేష్ఠులును నగురామలక్ష్మణులు కూడి
లంక కేతెంచి బాణములచే నీపురి నూఁదివేయుదురు.

౪౩. రఘుపుత్రుఁడగు రాముఁడు సేనాబంధుసమేతముగా రావ
ణుంబరిమార్చి నిన్నయోధ్యకుం గొనిపోవు నుత్తమురాలా !

౪౪. కావున నూరడిల్లియుండుము. నీకు శుభముకలుగును. కా
లము నెదురుచూచుచుండుము. మండుచున్న యగ్నివలెఁ దేజముచే వెలుం
గుచున్న రాముని శీఘ్రమునఁ జూతువు.

౪౫. పుత్రులతోడను మంత్రులు చుట్టములతోడను గూడినవాఁడ
గు నీరావణుండు సంపఁబడినవాఁ డగుచుండఁగాఁ జంద్రునితోఁ గూడిన
రోహిణివలె రామచంద్రునితోఁ జేరంగలవు.

౪౬. ఓదేవీ ! ఓజానకి ! స్వల్పకాలముననే శోకమునకుఁ గడఁ
గాంచెదవు. శీఘ్రముననే రామునిచే రావణుండు చంపఁబడుట చూడం
గలవు.

ఏవ మాశ్వాస్య వైదేహీం హనుమా న్మారుతాత్మజః।
గమనాయ మతింకృత్వా వైదేహీం పునరబ్రవీత్॥ ౪౭

త మరిఘ్నం కృతాత్మానం క్షిప్రం ద్రక్ష్యసి రాఘవమ్।
లక్ష్మణం చ ధనుష్పాణిం లంకాద్వార ముపస్థితమ్॥ ౪౮

నఖదంష్ట్రాయుధా న్వీరా న్సింహశార్దూల విక్రమాన్।
వానరా న్వారణేంద్రాభా న్క్షిప్రం ద్రక్ష్యసి సంగతాన్॥ ౪౯

శైలాంబుద నికాశానాం లంకా మలయసానుషు।
నర్దతాం కపిముఖ్యానా మార్యే యూథా న్యనేకశః॥ ౫౦

స తు మర్మణి ఘోరేణ తాడితో మన్మథేషుణా।
నశర్మ లభతే రామః సింహార్దిత ఇవద్విపః॥ ౫౧

మారుదో దేవి శోకేన మాభూత్తే మనసోప్రియమ్।
శచీవ పత్యా శక్రేణ భర్త్రా నాథవతీ హ్యసి॥ ౫౨

రామా ద్విశిష్టః కోన్యోస్తి కశ్చి త్సౌమిత్రిణా సమః।
అగ్నిమారుత కల్పౌ తౌ భ్రాతరౌ తవ సంశ్రయౌ॥ ౫౩

నాస్మిం శ్చిరం వత్స్యసి దేవి దేశే రక్షోగణై రధ్యుషితే తిరౌ
ద్రే। న తేచిరా దాగమనం ప్రియస్య క్షమస్వ మత్సంగమకా
లమాత్రమ్॥ ౫౪

ఇతి శ్రీమత్సుందరకాండే - ఏకోన చత్వారింశస్సర్గః.

౪౭. వాయుపుత్రుండగు హనుమంతుఁడు జానకి నిట్లూరడించి పయనమై యాదేవితో మరలనిట్లనియెను.

౪౮. నిశ్చయము గలవాఁడును, శత్రువులనాశము సేయువాఁడును నగు రాఘవుని, ధనుస్సును జేతఁబట్టి లంకాపురముయొక్క ద్వారమున నిలచియున్న లక్ష్మణుని కొద్దికాలముననే చూతువు.

౪౯. గోళ్ళను, కోఱలను నాయుధములుగాఁ గలవారును, శూరులును, సింగములు పులులవంటి పరాక్రమముంగలవారును, ఏనుఁగులవంటి వారును నగువానరులు మొత్తములై వచ్చుట శీఘ్రమునఁ జూతువు.

౫౦. ఓయోగ్యురాలా! పర్వతములవలెను మేఘములవలెను నుండువారును, లంకయొక్కయు మలయపర్వతముయొక్కయు గనులయందు ఱంకెలు వేయుచున్నవారును నగువానరోత్తములయొక్క పెక్కుమొత్తములను గాంతువు.

౫౧. రామచంద్రుండు భయంకరములగు మన్మథబాణములచే మర్మస్థానములయందుఁ గొట్టంబడినవాఁడై సింగముచే బాధింపంబడిన యేనుఁగవలెఁ దెంపులేక యున్నవాఁడు.

౫౨. ఓదేవి! శోకముచేఁ గుందకుము! నీయనిష్టము తొలంగుఁగాక! ఇంద్రునితోఁజేరిన శచివలె రామునింగలసి నాథవతి (మగనింగలదానవు) వయ్యెదవు.

౫౩. రామునకంటె యోగ్యుండగువాఁడును, లక్ష్మణునితో సముఁడును లోకమున నెవ్వండుగలఁడు. అగ్నివలెను వాయువువలెను నుండువారగు నన్నదమ్ము లిరువురు నీకుఁ బ్రాపైయున్నారు.

౫౪. రాక్షసులకు నివాసస్థానమై మిక్కిలి భయంకరమైయున్న యిచ్చోట నీవు దీర్ఘకాలము వసింపఁబోవు. నీమగఁ డిందువచ్చుటకుఁ జాలకాలముపట్టదు. నేను రామునిం జేరఁబోవునంతవఱ కోర్చికొనుము!

ఇది ముప్పదితొమ్మిదవసర్గ.

## చత్వారింశస్సర్గః.

శ్రుత్వాతు వచనం తస్య వాయుసూనో ర్మహాత్మనః।
ఉవాచాత్మహితం వాక్యం సీతా సురసుతోపమా॥ ౧॥

త్వాం దృష్ట్వా ప్రియవక్తారం సంప్రహృష్యామి వానర।
అర్థసంజాత సస్యేవ వృష్టిం ప్రాప్య వసుంధరా॥ ౨॥

యథా తం పురుష వ్యాఘ్రం గాత్రై శ్శోకాభి కర్శితైః।
సంస్పృశేయం సకామాహం తథాకురు దయాం మయి॥ ౩॥

అభిజ్ఞానంచ రామస్య దద్యా హరిగణోత్తమ।
క్షిప్తా మిషీకాం కాకస్య కోపా దేకాక్షి శాతనీమ్॥ ౪॥

మనశ్శిలాయా స్తిలకో గండపార్శ్వే నివేశితః।
త్వయా ప్రణష్టే తిలకే తంకిల స్మర్తు మర్హసి॥ ౫॥

సవీర్యవా నథం సీతాం హృతాం సమనుమన్యసే।
వసంతీం రక్షసాం మధ్యే మహేంద్ర వరుణోపమః॥ ౬॥

ఏష చూడామణి ర్దివ్యో మయా సువరిరక్షితః।
ఏతం దృష్ట్వా ప్రహృష్యామి వ్యసనే త్వా మివానఘ॥ ౭॥

ఏష నిర్యాతిత శ్శ్రీమా న్మయా తే వారిసంభవః।
అతఃపరం నశక్ష్యామి జీవితుం శోక లాలసా॥ ౮॥

## నలువదియవ సర్గ.

౧. మహాత్ముఁడగు వాయుపుత్రునియొక్క మాటనువిని, దేవకన్యకం బోలినదియగు సీత తన కనుకూలమగుమాట నిట్లు నెప్పెను.

౨. సగము మొలచియున్న పైరునుగలదియై వానకురియుటచే సంతోషించిన భూమివలె (హితవాక్యములం జెప్పెడు నిన్నుంగని) మిక్కిలి యానందించితిని.

౩. మన్మథవికారమునుగల నేను, శోకవేగముచేఁ గృశించియున్న యీయవయవములచేతఁ బురుషోత్తముండగు రామచంద్రుని ముట్టునంతటిభాగ్యమును గరుణించి చేయుము.

౪. వానరోత్తమా! కోపముచేఁ బ్రయోగింపఁబడినదై కాకియొక్క యొంటికంటిని బోఁగొట్టిన యిషీకమును (దర్భపోఁచయందు బ్రహ్మాస్త్రముంగూర్చి పంపఁబడినది) గుఱుతును బ్రియునితోఁ జెప్పుము.

౫. ఇడికొన్న తిలకము మాసిపోఁగా మణిశిలయను నెఱ్ఱరాతిపొడిచే నాచెక్కిలియందు మరలఁ దిలకము నీచే నునుపంబడియెను. అట్లు చేయుటను మరలఁ దలంపు మనుము.

౬. ఇంద్రవరుణులను బోలికగాఁ గలవాఁడవును, పరాక్రమవంతుఁడవును నైననీవు రాక్షసునిచేఁ గొనిపోఁబడినదియు రక్కసుల నడుమ నున్నదియునగు నన్నె ట్లుపేక్షించి యున్నావు.

౭. ఓపుణ్యాత్ముఁడ! దేవసంబంధమైనదియగు నీచూడామణి నాచే బాగుగఁ గాపాడఁబడియెను. ఇట్టి దుఃఖమున దానింగని నిన్నుంగాంచినట్లే యానందిచుచున్నాను.

౮. ఉదకమందుఁ బుట్టినదియు, మిక్కిలి కాంతిని గలదియునగునీ చూడామణిని రామునకిమ్మని నీచేత నిచ్చితినిగదా! ఇంకను శోకమున మునింగినదాన నగుదునుగావున నెలకంటె మించి జీవింపను.

అసహ్యాని చ దుఃఖాని వాచ శ్చ హృదయచ్ఛిదః।
రాక్షసీనాం సుఘోరాణాం త్వత్కృతే మర్షయామ్యహమ్॥ ౯॥

ధారయిష్యామి మాసం తు జీవితం శత్రుసూదన।
మాసాదూర్ధ్వం న జీవిష్యే త్వయా హీనా నృపాత్మజ॥ ౧౦॥

ఘోరో రాక్షసరాజోఽయం దృష్టి శ్చ న సుఖా మయి।
త్వాం చ శ్రుత్వా విషజ్జం తం న జీవేయ మహం క్షణమ్॥ ౧౧॥

వైదేహ్యా వచనం శ్రుత్వా కరుణం సాశ్రుభాషితమ్।
అథాబ్రవీ న్మహాతేజా హనుమా న్మారుతాత్మజః॥ ౧౨॥

త్వచ్ఛోక విముఖో రామో దేవి సత్యేన తే శపే।
రామే దుఃఖాభిభూతే తు లక్ష్మణః పరితప్యతే॥ ౧౩॥

కథంచి ద్భవతీ దృష్టా న కాలః పరిశోచితుమ్।
ఇమం ముహూర్తం దుఃఖానా మంతం ద్రక్ష్యసి భామినీ॥ ౧౪॥

తావుభౌ పురుషవ్యాఘ్రౌ రాజపుత్రౌ పరిందమౌ।
త్వద్దర్శన కృతోత్సాహౌ లంకాం భస్మీకరిష్యతః॥ ౧౫॥

హత్వా తు సమరే క్రూరం రావణం సహబాంధవమ్।
రాఘవౌ త్వాం విశాలాక్షి స్వాం పురీం ప్రాపయిష్యతః॥ ౧౬॥

౯. ఓర్వఁగూడని దుఃఖములను, భయమును గలిగించునట్టి రాక్షసస్త్రీలయొక్క (గుండెలు బ్రద్దలుసేయు) ధ్వనులను నీవిందుండుటచే సైచియున్న దానను.

౧౦. శత్రువులను గూల్చువాఁడా? నెలదినములుమాత్రము ప్రాణమును విడువక నిలుపఁగలను. అటుపిమ్మట, సోరాజపుత్రుఁడా! నిమిషమేని జీవించియుండ నోపను.

౧౧. ఈరాక్షసరాజు మిక్కిలిభయంకరుఁడు, వీనిచూపునుగూడ ననిష్టముం జేయునదియై యుండును. కావున నీ వాలస్యమేమాత్రము చేసినను వెంటనే ప్రాణముల విడుతును.

౧౨. దయను బుట్టించునదియు, కన్నీటితోఁ గూడినదియు నగు సీతాదేవియొక్క మాటనువిని ప్రతాపశాలియగు హనుమంతుం డిట్లనియెను.

౧౩. ఓమాత! రామచంద్రుఁడు నినుంగూర్చిన శోకముచేఁ బ్రపంచమున నెద్దియుఁ జూడకున్నాఁడు. ఇట్లని నేను బాస సేయుదును. రాముఁడు దుఃఖించినపుడెల్ల లక్ష్మణుండు శోకముచే మలమల మాడుచున్నాఁడు.

౧౪. ఓ యందమగు మేనుగలతల్లీ! నీవు దీర్ఘకాలమునకుఁ బిమ్మట నిందుఁగనంబడితివి. నీవిందుండుట యెఱుంగరాదయ్యెను. కావున నిఁక నీవు దుఃఖింపవలదు. స్వల్పకాలముననే దుఃఖమునుండి విడుదలఁగాంచెదవు.

౧౫. శత్రువులఁ బీడించువారును, రాజపుత్రులును, పురుషశ్రేష్ఠులును నగు నాయిరువురును నినుంగన నాశగలవారై లంకను బూడిదె చేయంగలరు.

౧౬. క్రూరుఁడగు రావణుని బంధుసమేతముగా యుద్ధమునఁ దునుమాడి రామలక్ష్మణులు నిన్నయోధ్యకుం గొనిపోదురు విశాలాక్షీ!

యత్తు రామో విజానీయా దభిజ్ఞాన మనిందితే।
ప్రీతిసంజననం తస్య భూయ స్త్వం దాతు మర్హసి॥ ౧౬।
సాబ్రవీ ద్దత్తమేవేతి మయాభిజ్ఞాన ముత్తమమ్।
ఏత దేవ హి రామస్య దృష్ట్వా మత్కేశ భూషణమ్॥ ౧౭॥
శ్రద్ధేయం హనుమ న్వాక్యం తవ వీర భవిష్యతి॥ ౧౮॥
స తం మణివరం గృహ్య శ్రీమా న్ప్లవగసత్తమః॥
ప్రణమ్య శిరసా దేవీం గమనా యోపచక్రమే॥ ౧౯॥
త ముత్పాతకృతోత్సాహ మవేక్ష్య హరిపుంగవమ్॥ ౨౦॥
వర్ధమానం మహావేగ మువాచ జనకాత్మజా।
అశ్రుపూర్ణముఖీ దీనా బాష్పగద్గదయా గిరా॥ ౨౧॥
హనుమ న్సింహసంకాశౌ భ్రాతరౌ రామలక్ష్మణౌ।
సుగ్రీవం చ సహామాత్యం సర్వా న్బ్రూయా హ్యనామయమ్॥
యథా చ స మహాబాహు ర్మాం తారయతి రాఘవః।
అస్మా ద్దుఃఖాంబు సంరోధాత్త్వం సమాధాతు మర్హసి॥ ౨౩॥
ఇమం చ తీవ్రం మమ శోకవేగం రక్షోభి రేభిః పరిభర్త్సనం చ। బ్రూయాస్తు రామస్య గతః సమీపం శివశ్చ తేఽధ్వాస్తు హరిప్రవీర॥ ౨౪॥
స రాజపుత్ర్యా ప్రతివేదితార్థః కపిః కృతార్థః పరిహృష్టచేతాః। అల్పావశేషం ప్రసమీక్ష్య కార్యం దిశం హ్యుదీచీం మనసా జగామ॥ ౨౫॥

ఇతి శ్రీమత్సుందరకాండే - చత్వారింశస్సర్గః.

౧౭. ఓయుత్తమురాలా! శ్రీరాముం డేజీవితుఁడనై యుండునో, దే
నింగనుటచే సంతోషమందునో యట్టిగురుతును రామునకు మఱియొక
టిమ్మా!

౧౮, ౧౮½. హనుమంతుఁడ! ఉత్తమమైనగురుతు నీచేత నిచ్చియే
యున్నాను. నాతలవెండ్రుకలయందు ధరించునట్టి యీచూడామణిని జూ
చినచో రాముండు దప్పకనమ్మును. నామాట సత్యము వీరుఁడ! అనిసీ
తాదేవి పలికెను.

౧౯½. వానరోత్తముఁడును, కాంతిమంతుండును నగునాతండు శ్రే
ష్ఠమగు నారత్నమునుగొని, శిరస్సువంచి సీతకు మ్రొక్కి ప్రయాణమయ్యెను.

౨౦, ౨౧. మేను పెంచుచున్నవాఁడును, వేగవంతుఁడును, ఎగయు
టకై సన్నాహము సేయుచున్నవాఁడును నగు నావానరోత్తమునిం గని, క
న్నీటిచే నిండిన మోహముగలదియు, పేదవడినదియు నగుచు, కన్నీటితో
డఁ దడఁబడుచున్న స్వరముం గలదై యిట్లనియెను.

౨౨. ఓహనుమ! సింగపుకొదమలంబోలు రామలక్ష్మణులతోడను,
మంత్రిసహితుఁడగు సుగ్రీవునితోడను నాక్షేమముం దెలుపుము.

౨౩. బలశాలియగు రాముండు నన్నీ దుఃఖసాగరమునుండి తొలఁ
గించి యుద్ధరించుమార్గ మెద్దియో దానిని నీవు సేయవలయును.

౨౪. వానరోత్తమ! సహింపరానిదియగు నిచ్చటి నాదుఃఖము యొ
క్క వేగమును, ఈరాక్షసస్త్రీల బెదరింపులును రామునిచెంతఁజేరి విను
పింపుము, నీవు మార్గమున సుఖముగ నేగుదువుగాక!

౨౫. ఆవానరుఁడు, సీతవలన సర్వముం దెలిసికొని ధన్యుఁడై సం
తోషించి, తానువచ్చినకార్యము కొంత మిగిలియున్నట్లెంచి మనస్సుచే
నుత్తరదిశ కేగెను.

ఇది నలువదియవ సర్గ.

## ఏకచత్వారింశస్సర్గః.

స చ వాగ్భిః ప్రశస్తాభి ర్గమిష్య న్పూజిత స్తయా।
తస్మా ద్దేశా దపక్రమ్య చింతయామాస వానరః॥ ౧॥

అల్పశేష మిదం కార్యం దృష్టేయ మసితేక్షణా।
త్రీ నుపాయా నతిక్రమ్య చతుర్థ ఇహ దృశ్యతే॥ ౨॥

నసామ రక్షస్సు గుణాయ కల్పతే నదాన మర్థోప చితేషు
యుజ్యతే। నభేదసాధ్యా బలదర్పితా జనాః పరాక్రమస్త్వే
వ మమేహ రోచతే॥ ౩॥

నచాస్య కార్యస్య పరాక్రమాదృతే వినిశ్చయః కశ్చి దిహోప
పద్యతే। హతప్రవీరాహి రణేహి రాక్షసాః కథంచి దీయు
ర్యదిహాద్య మార్దవమ్॥ ౪॥

కార్యేకర్మణి నిర్దిష్టే యో బహూన్యపి సాధయేత్।
పూర్వకార్యా విరోధేన స కార్యం కర్తు మర్హతి॥ ౫॥

నహ్యేక స్సాధకో హేతుః స్వల్పస్యా పీహ కర్మణః।
యో హ్యర్థం బహుధా వేద ససమర్థో ర్థసాధనే॥ ౬॥

ఇహైవ తావ త్కృతనిశ్చయో హ్యహం యదివ్రజేయం ప్లవ
గేశ్వ రాలయమ్। పరాత్మసంమర్ద విశేష తత్త్వవి త్తతఃకృ
తం స్యా న్మమ భర్తృశాసనమ్॥ ౭॥

## నలువదియొకటవసర్గ.

౧. ఆహనుమంతుఁడు సీతాదేవిచేతఁ గొనియాడంబడినవాఁడై సనుచు నందుండి తొలఁగిపోయి యిట్లుచింతించెను.

౨. నల్లని కన్నులుగలదియగుసీత చూడంబడియెనుగదా! ఇంకను గొంచెముపని మిగిలియున్నది. సామభేదదానములను మూఁడుపాయములునుగాక దండోపాయ ముపయోగించి పరిబల మెఱింగెదను.

3. రాక్షసులయందు సామోపాయము (మంచిమాటలాడుట) ఫలింపదు సంపదపెంపుగల వీరియందు దానోపాయము (ద్రవ్యమిచ్చుట) నిష్ప్రయోజనము. బలవంతులగు వీరు భేదోపాయముచే (పరస్పరవిరోధములు ప్రభుమంత్రులకుఁ గల్పించుట) లోఁబడువారుగారు. కావునవీరియెడల దర్పమునుజూపుటయే యోగ్యమని తోఁచెడును.

౪. ఈకార్యమునకు దర్పముచే నెదిరించుటచేఁ దప్ప వేఱుమార్గమునఁ బ్రయోజనములేదు. యుద్ధమునం దొక్కఁబడినవారైరేని రాక్షసులు గష్టముచే నెట్లయిన లోఁబడుదురు.

౫. ఒకకార్యముచేయుటకై యధికారిచే నియమింపఁ బడినవాఁడైయెవం డితరములగు పెక్కుకార్యములు సాధింపఁదలంచునో వాఁడు మొదటికార్యమునకు భంగము లేకుండునట్లుగాఁ బనిచేయం దగును.

౬. కొద్దిపాటిపనికైనను సాధించుట కొక్కకారణము చాలదు. అనేకములగు సాధనముల నెవ్వం డెఱుంగుచున్నాఁడో వాఁడు కార్యమును సాధించుటలో సమర్థుఁడు.

౭. నేను శత్రువులయొక్కయు మనయొక్కయు బలాబలములనెఱింగి వీరిపాటివారని తెలిసి నిశ్చయించికొని సుగ్రీవునికడ కేగితినేని నాప్రభునియాజ్ఞను బూర్తిగ నెరవేర్చిన వాఁడ నగుదును.

కథం ను ఖల్వద్య భవేత్సుఖాగతం ప్రసహ్య యుద్ధం మమ
రాక్షసైస్సహ। తథైవ ఖల్వాత్మబలంచ సారవ త్సంమాన
యే న్మాం చ రణే దశాననః॥ ౯॥
తత స్సమాసాద్య రణేదశాననం సమంత్రివర్గం సబల ప్రయా
యినమ్। హృదిస్థితం తస్య మతం బలం చ వై సుఖేన మత్వా
హమితః పునర్వ్రజే॥ ౯॥
ఇదమస్య నృశంసస్య నందనోపమ ముత్తమమ్।
వనం నేత్ర మనఃకాంతం నానా ద్రుమ లతాయుతమ్॥ ౧౦॥
ఇదం విధ్వంస యిష్యామి శుష్కం వన మివానలః।
అస్మి న్భగ్నే తతః కోపం కరిష్యతి దశాననః॥ ౧౧॥
తతో మహా త్సాశ్వమహారథద్విపం బలం సమాదేక్ష్యతి రాక్ష
సాధిపః। త్రిశూల కాలాయస పట్టసాయుధం తతో మహద్యు
ద్ధ మిదం భవిష్యతి॥ ౧౨॥
అహంతు తైస్సయుంతి చండవిక్రమై స్సమేత్య రక్షోభి రసహ్య
విక్రమః। నిహత్య తద్రావణచోదితం బలం సుఖం గమిష్యామి
కపీశ్వ రాలయమ్॥ ౧౩॥
తతో మారుతవత్ క్రుద్ధో మారుతి ర్భీమవిక్రమః।
ఊరువేగేన మహతా ద్రుమాన్క్షేప్తు మథా రభత్॥ ౧౪॥
తతస్తు హనుమా న్వీరో బభంజ ప్రమదావనమ్।
మత్తద్విజ సమాఘుష్టం నానాద్రుమ లతాయుతమ్॥ ౧౫॥

౮. నేఁడీరాక్షసులతో బలవంతముగ నాకు యుద్ధమేలాగున సంభవించును? అట్లు సంభవించుయుద్ధమున రావణుఁడు దనపక్షపువారిని గౌరవించునట్లే నాబలమునుగాంచి నన్నునుగౌరవించును.

౯. అటుపై, మంత్రులతోడను సేనలతోడను గూడినవాఁడగురాక్షసుని యుద్ధమునం జేరఁబోయి వానిహృదయమందుండు నభిప్రాయమును, వాని దిటవును దెలిసికొని యిందుండి నెమ్మదిగా మరలిపోదునుగాక.

౧౦. ఇది ఘాతుకుఁడగు నీరావణునియొక్క యుద్యానవనము; దేవేంద్రుని నందనవనముం బోలినదై కన్నుల పండువై పెక్కువిధములగు వృక్షములను గలిగియున్నది.

౧౧. ఎండినవనము నగ్ని హోత్రుండు భస్మముచేసినట్లు దీనిని నేను నాశము నేయువాఁడను. అట్లు నేయుదునేని రావణుఁడు కోపించును.

౧౨. అట్లుకోపించి రావణుండు గుఱ్ఱములను బూన్చంబడిన రథములను, ఏనుఁగులను, త్రిశూలము, పట్టిసము మొదలగు నాయుధములనుగలదియగు గొప్పసైన్యమును బనుచును. అట్లయినచో నిది గొప్పయుద్ధము గాక మానదు.

౧౩. ఆయుద్ధమున నూర్వరాని పరాక్రమమునుగల నేను వేంద్రమగు బలమునుగల రాక్షసులను డాసి యారావణుసేనల నెల్ల రూపుమాపి సుగ్రీవునింగాన సంతోషముతో నేగెదను.

౧౪. అనితలంచి భయంకరమగు బలముగలవాఁడగు హనుమంతుఁడు వాయువు కోపించినట్లు గోపించి గొప్పదియగు తొడలయొక్క వేగముచేఁ జెట్లను గూలఁద్రోయ నారంభించెను.

౧౫. అట్లువూని యాశూరుండు మదించిన పక్షులయొక్కరొదను గలదియు, పెక్కులగు చెట్లతోడను దీఁగెలతోడను గూడినదియు నగు నుద్యానవనమును రూపుమాపెను.

తద్వనం మథితై ర్వృక్షై ర్భిన్నైశ్చ సలిలాశయైః।
చూర్ణితైః పర్వతాగ్రైశ్చ బభూవాప్రియదర్శనమ్॥ ౧౬

నానాశకుంత విరుతైః ప్రభిన్నైస్సలిలాశయైః।
తామ్రైః కిసలయైః క్లాంతైః క్లాంతద్రుమ లతాయుతమ్॥ ౧౭

నబభౌ తద్వనం తత్ర దావానల హతం యథా।
వ్యాకులావరణా రేజు ర్విహ్వలా ఇవ తా లతాః॥ ౧౮

లతాగృహై శ్చిత్రగృహై శ్చ నాశితై ర్మహోరగై ర్వ్యాళ
మృగైశ్చ నిర్ధుతైః। శిలాగృహై రున్మథితై స్తథా గృహైః ప్రణ
ష్టరూపం తదభూ న్మహద్వనమ్॥ ౧౯

సా విహ్వలా శోకలతాప్రతానా వనస్థలీ శోకలతాప్రతానా
జాతా దశాస్య ప్రమదావనస్య కపేర్బలాద్ధి ప్రమదావనస్య॥
స తస్య కృత్వార్థపతే ర్మహాకపి ర్మహద్వ్యలీకం మనసో మహా
త్మనః। యుయుత్సురేకో బహుభి ర్మహాబలైః శ్రియాజ్వలం
స్తోరణ మాస్థితః కపిః॥ ౨౧

ఇతి శ్రీమత్సుందరకాండే - ఏకచత్వారింశస్సర్గః.



## ద్విచత్వారింశస్సర్గః.

తతః పక్షి నినాదేన వృక్షభంగ స్వనేన చ।
బభూవు స్త్రాససంభ్రాంతా స్సర్వే లంకానివాసినః॥ ౧

౧౬. నురుమాడంబడిన చెట్లచేతను, త్రెంపంబడిన చెఱువులచేత ను, నుగ్గుచేయంబడిన పర్వతశిఖరములచేతను జూడ నసహ్యమై యావన మగపడియెను.

౧౭, ౧౮. వాడినచెట్ల చిగురాకులతోఁ గూడిన యావనము చెక్కి దెబ్బతిన్న పక్షులయొక్క ధ్వనులచేతను. గట్లుతెగిన చెఱువులచేతను, వాడి యెఱ్ఱగనున్న చిగుళ్ళచేతను జూడ నింపుగాక, కార్చిచ్చుచేఁగా ల్పంబడిన దానివలె నుండెను. అట్లుకూలిన చెట్లపైనున్నలతలు నిలువనే రక భీతిచెందిన స్త్రీలవలె నల్లాడెను.

౧౯. నాశము నేయంబడిన పొదరిళ్ళచేతను, చిత్రశాలలచేతను, బాధనొందిన సర్పములచేతను దుష్టమృగములచేతను, ఇడియఁగొట్టంబడిన యింండ్లచేతను, లాతెయిండ్లచేతను, విరూపముంగలదియై యావన మగపడి యెను.

౨౦. కలతనొందని యశోకవృక్షముల శాఖలను గలదియగు రావ ణుని యుద్యానవనమునందలి విహారప్రదేశము హనుమంతుని బలముచేరూ పుచెడి శోకలతలయొక్క తఱుచును గలదియయ్యెను.

౨౧. సుగ్రీవుని ప్రాపును గలవాఁడగు నాహనుమంతుఁడు మహాబ లశాలియు ధీరుఁడును నగు రావణాసురుని మనస్సునకు గొప్ప విరోధము ను జేయుటమాత్రముగాక బలవంతులగు రాక్షసులతో యుద్ధము సేయఁగో రియందుండు తోరణస్తంభముపై మిక్కిలి తేజోవంతుఁడై కూర్చుండెను.

ఇది నలువదియొకటవసర్గ.

---

## నలువదిరెండవసర్గ.

౧. ఆవనమందలి పక్షులధ్వనులచేతను, చెట్లు విఱుగుటవలని చప్పు డుచేతను, లంకయందు వసియించువారందఱును భయముచేఁ జలించిన వారైరి.

విద్రుతాశ్చ భయత్రస్తా వినేదుర్మృగపక్షిణః।
రక్షసాం చ నిమిత్తాని క్రూరాణి ప్రతిపేదిరే॥ ౨

తతో గతాయాం నిద్రాయాం రాక్షస్యో వికృతాననాః।
తద్వనం దదృశుర్భగ్నం తం చ వీరం మహాకపిమ్॥ ౩

స తా దృష్ట్వా మహాబాహుర్మహాసత్త్వో మహాబలః।
చకార సుమహద్రూపం రాక్షసీనాం భయావహమ్॥ ౪

తతస్తం గిరిసంకాశమతికాయం మహాబలమ్।
రాక్షస్యో వానరం దృష్ట్వా పప్రచ్ఛుర్జనకాత్మజామ్॥ ౫

కోఽయం కస్య కుతో వాయం కిన్నిమిత్తమిహాగతః।
కథం త్వయా సహానేన సంవాదః కృత ఇత్యుత॥ ౬

ఆచక్ష్వ నో విశాలాక్షి మా భూత్తే సుభగే భయమ్।
సంవాదమసితాపాంగే త్వయా కింకృతవానయమ్॥ ౭

అథాబ్రవీత్తదా సాధ్వీ సీతా సర్వాంగసుందరీ।
రక్షసాం భీమరూపాణాం విజ్ఞానే మమ కా గతిః॥ ౮

యూయమేవాభిజానీత యోఽయం యద్వా కరిష్యతి।
అహిరేవ హ్యహేః పాదాన్విజానాతి న సంశయః॥ ౯

అహమప్యస్య భీతాస్మి నైనం జానామి కోన్వయమ్।
వేద్మి రాక్షసమేవైనం కామరూపిణమాగతమ్॥ ౧౦

౨. మృగములును పక్షులును భయముచెందినవియై నలుగడలంబరుగెత్తెను. వికారముగఁ గేకలువేసెను. రాక్షసులకును భయంకరములగు నపశకునములు గలిగెను.

3. వికారములగు మోములంగల రాక్షసస్త్రీలు నిద్రమాని మేల్కొని యట్లు రూపునెడియున్న వనమును ఘూరుఁడగువానరునిం గాంచిరి.

౪. గొప్పభుజములు గలవాఁడును, బలవంతుఁడునగు నాహనుమంతుఁడు వారలంగని భయంకరమగు గొప్పరూపముగలుగునట్లు మేనుపెంచెను.

౫. పిమ్మట నారాక్షసస్త్రీలు గొప్పమేనుగలవాఁడును మహాబలశాలియు, పర్వతముం బోలినవాఁడును నగు వానరునింగాంచి యాతండెవ్వఁడని జానకి నడగిరి.

౬. ఈతండెవఁడు! ఎవ్వరివాఁడు! ఏమిపనికై యెందుండి యిచ్చోటునకు వచ్చెను. ఈతనితో నీకు సంవాద మేలకలిగెను.

౭. విరివిగల కన్నులంగలదానా! నల్లని కనుగొనలు గలదానా! అందముంగలదానా! ఈతండు నీతో నేమిభాషించెనో. మాకుఁ దెలియంబలుకుము! అట్లుచెప్పుటచే నీకు హానిలేదు.

౮. అనఁగా నన్నియంగములయందును నందముంగలదియుఁ బతివ్రతయు నగు సీత 'భయంకరాకారులగు రాక్షసుల నెఱుంగుటకు నేను శక్తురాలనా?'

౯. ఈతం డెవఁడో! ఏమిచేయునో! మీరే యెఱుంగవలయును, పాముయొక్క జాడను బామే యెఱుంగునుగాని యితరు లెఱుంగరు. ఇది సత్యము.

౧౦. వీనింగని నేనును భయపడుచున్నాను. వీఁడెవండో తెలియరాదు, కామరూపమును ధరించి రావణుండే యిట్లువచ్చెనని తలంచెదను.

వైదేహ్యా వచనం శ్రుత్వా రాక్షస్యో విద్రుతా దిశః।
స్థితాః కాశ్చి ద్గతాః కాశ్చి ద్రావణాయ నివేదితుమ్॥ ౧॥

రావణస్య సమీపేతు రాక్షస్యో వికృతాననాః।
విరూపం వానరం భీమ మాఖ్యాతు ముపచక్రముః॥ ౨॥

అశోక వనికామధ్యే రాజ న్భీమవపుః కపిః।
సీతాయా కృతసంవాద స్తిష్ఠ త్యమిత విక్రమః॥ ౩॥

నచ తం జానకీ సీతా హరిం హరిణలోచనా।
అస్మాభి ర్బహుధా పృష్టా నివేదయితు మిచ్ఛతి॥ ౪॥

వాసవస్య భవేద్దూతో దూతో వైశ్రవణస్య వా।
ప్రేషితో వాపి రామేణ సీతాన్వేషణ కాంక్షయా॥ ౫॥

తేన త్వద్భుతరూపేణ య త్తత్తవ మనోహరమ్।
నానామృగ గణాకీర్ణం ప్రమృష్టం ప్రమదా వనమ్॥ ౬॥

నతత్ర కశ్చి దుద్దేశో య స్తేన నవినాశితః।
యత్ర సా జానకీ సీతా స తేన నవినాశితః॥ ౭॥

జానకీ రక్షణార్థం వా శ్రమాద్వా నోపలభ్యతే।
అథవా కశ్శ్రమ స్తస్య సైవ తేనాభిరక్షితా॥ ౮॥

చారుపల్లవ పుష్పాఢ్యం యం సీతా స్వయమాస్థితా।
ప్రవృద్ధ శ్శింశుపావృక్ష స్స చ తేనాభిరక్షితః॥ ౯॥

౧౧. సీతచెప్పిన మాటలనువిని రాక్షసస్త్రీలు కొందఱు దిక్కులకుం బాఱిరి. కొందఱు చెట్టువడి నిలచియుండిరి. కొందఱు రావణాసురున కెఱింగింపఁ బోయిరి.

౧౨. వికారములగు ముఖములను గలవారగు రాక్షసస్త్రీలు. భయంకరరూపమును ధరించినవాఁడగు హనుమంతునింగూర్చి రాక్షసరాజున కెఱింగింపనేగిరి.

౧౩. ఓరాజా! అశోకవనమధ్యమున పరాక్రమశాలియై భయంకరాకారముంగల వానరుఁడొకండు సీతతో సంభాషించుచున్నవాఁడు.

౧౪. లేడిచూపులం గలదియు జనకపుత్రికయు నగుసీత,మాచే నానావిధముల నడుగంబడియు నామర్కటముంగూర్చి చెప్ప నిష్టము లేకున్నది.

౧౫. అతం డింద్రునిదూతయో! కుబేరునిదూతయో! సీతను వెదకుటకై రామునిచే నంపఁబడిన దూతయో యగును.

౧౬. వింతయగు రూపముంగల యాతనిచే, పెక్కులగు మృగములయొక్క సమూహములచే నిండినదియు, ఇంపైనదియునగు నీయుద్యానవనము రూపుమాపంబడియెను.

౧౭, ౧౮. ఆవనమున నాతనిచే నాశము సేయంబడనిభాగ మెందును లేదు. సీత కూర్చున్న చోటునందు వృక్షములుమాత్రము (సీతను రక్షించుటకొఱకో లేక యలసియుండుటచేతనో) నాశనము సేయంబడలేదు. వాని కలు పెట్లుగలుగును? సీతనురక్షింపనే యట్లుంచియుండును.

౧౯. అందమగు చిగుళ్లతోడను బుష్పములతోడను గూడినదియగు నేవృక్షమును సీత యాశ్రయించియున్నదో యదిమాత్ర మాతనిచే రక్షింపఁబడియెను.

తస్యోగ్రరూపస్యోగ్రత్వం దండమాజ్ఞాతు మర్హసి।
సీతా సంభాషితా యేన తద్వనంచ వినాశితమ్॥ ౨౦

మనః పరిగృహీతాం తాం తవ రక్షోగణేశ్వర।
క స్సీతా మభిభాషేత యో నస్యా త్త్యక్తజీవితః॥ ౨౧

రాక్షసీనాం వచశ్శ్రుత్వా రావణో రాక్షసేశ్వరః।
హుతాగ్ని రివ జజ్వాల కోప సంవర్తితేక్షణః॥ ౨౨

తస్యక్రుద్ధస్య నేత్రాభ్యాం ప్రాపత న్నాస్రబిందవః।
దీప్తాభ్యా మివ దీపాభ్యాం సార్చిష స్స్నేహబిందవః॥ ౨౩

ఆత్మన స్సదృశాం చ్ఛూరా న్కింకరాన్నామ రాక్షసాన్।
వ్యాదిదేశ మహాతేజా నిగ్రహార్థం హనూమతః॥ ౨౪

తేషా మశీతి సాహస్రం కింకరాణాం తరస్వినామ్।
నిర్యయు ర్భవనా త్తస్మా త్కూటముద్గర పాణయః॥ ౨౫

మహోదరా మహాదంష్ట్రా ఘోరరూపా మహాబలాః।
యుద్ధాభి మనస స్సర్వే హనుమ ద్గ్రహణోన్ముఖాః॥ ౨౬

తే కపీంద్రం సమాసాద్య తోరణస్థ మవస్థితమ్।
అభిపేతు ర్మహావేగాః పతంగా ఇవ పావకమ్॥ ౨౭

౨౧. సీత యెవ్వనిచే భాషింపఁబడియెనో, వనము నెవ్వఁడు ధ్వంసముచేసెనో యాభయంకరుఁడగు వానరునియొక్క వృత్తాంతము నంతయు నీవాజ్ఞాపింప వలయును.

౨౧. ఓరాక్షసరాజా ! నీచే నాశింపఁబడినదియగు నింతితోఁ బ్రాణములయం దాశగలపురుషుం డెవండేనియు మాటలాడునా ?

౨౨. రాక్షసరాజగు రావణాసురుఁడు రాక్షస స్త్రీల మాటను విని కోపముచేఁ దిరుగుచున్న చూపులుగలవాఁడై, నేయిహోయంబడిన యగ్గివలె మండిపడియెను.

౨౩. అట్లుకోపించిన రావణాసురుని కన్నులనుండి (మండుచున్న దీపములనుండి మంటలతోఁగూడఁ జమురుబొట్లు రాలునట్లు) రక్తబిందువులు రాలెను.

౨४. గొప్పప్రతాపముం గలవాఁడగు రావణుఁడు, తనతో సమానులును శూరులునగు కింకరులనురాక్షసులను హనుమంతుని దండింప నానతిచ్చెను.

౨౫, ౨౬. వేగవంతులగు నాకింకరు లనువా రెనుబదివేలమంది, పెద్దపొట్టలుగలవారును, పెద్దకోఱలుగలవారును భయంకర రూపములను గలవారును మిక్కిలి బలవంతులును నగురాక్షసులు యుద్ధమునకుం బూనినవారై యందఱును గుదియలుమొదలగు నాయుధములను ధరించి హనుమంతునిం బట్టికొనుతలంపుతో నచ్చోటనుండి వెడలిరి.

౨౭. ఆరాక్షసులు మిక్కిలి వేగముతోఁ గూడినవారై. తోరణస్తంభముపై నున్న హనుమంతునిఁజేరఁబోయి (అగ్నిని మిడుతలెదిరించినట్లు) యెదిరించిరి.

తే గదాభి ర్విచిత్రాభిః పరిఘైః కాంచ నాంగదైః।
ఆజఘ్ను ర్వానరశ్రేష్ఠం శరై శ్చాదిత్యసన్నిభైః॥ ౨౮॥
ముద్గరైః పట్టసై శ్శూలైః ప్రాస తోమర శక్తిభిః।
పరివార్య హనూమంతం సహసా తస్థు రగ్రతః॥ ౨౯॥
హనూమానపి తేజస్వీ శ్రీమా న్పర్వత సన్నిభః।
క్షితా వావిధ్య లాంగూలం ననాద చ మహాస్వనమ్॥ 3౦॥
స భూత్వా సు మహాకాయో హనుమా న్మారుతాత్మజః।
ధృష్ట మాస్ఫోటయామాస లంకాం శబ్దేన పూరయన్॥ 3౧॥
తస్యాస్ఫోటిత శబ్దేన మహతా సానునాదినా।
పేతు ర్విహంగా గగనా దుచ్చై శ్చేద మఘోషయత్॥ 3౨॥
జయ త్యతిబలో రామో లక్ష్మణశ్చ మహాబలః।
రాజా జయతి సుగ్రీవో రాఘవే ణాభిపాలితః॥ 33॥
దాసోహం కోసలేంద్రస్య రామ స్యాక్లిష్ట కర్మణః।
హనూమాం చ్ఛత్రుసైన్యానాం నిహంతా మారుతాత్మజః॥
న రావణ సహస్రం మే యుద్ధే ప్రతిబలం భవేత్।
శిలాభిస్తు ప్రహరతః పాదపై శ్చ సహస్రశః॥ 3౫॥
అర్దయిత్వా పురీంలంకా మభివాద్య చ మైథిలీమ్।
సమృద్ధార్థో గమిష్యామి మిషతాం సర్వరక్షసామ్॥ 3౬॥

౨౮. ఆరక్కసులు విచిత్రములయిన గదలచేతను, బంగారు కట్లు గల గుదియలచేతను, సూర్యుని తేజమువంటి కాంతిని గల బాణములచేతను వానరోత్తమునిం గొట్టిరి.

౨౯. దుడ్డుకఱ్ఱలచేతను, బల్లెములచేతను, శూలములచేతను శక్తి మొదలగు నాయుధములచేతను హనుమంతుని వేగమున నడ్డగించి యెదుట నిలచిరి.

3౦. ప్రతాపవంతుఁడును, కాంతిగలవాఁడును, పర్వతమువంటి వాఁడును నగు హనుమంతుఁడు తోఁకను భూమిపైఁ గొట్టి గొప్పధ్వనిం జేసెను.

3౧. ఆహనుమంతుఁడు గొప్పదేహముగలవాఁడై ధ్వనిచే లంకాపట్టణమంతయు నిండించుచు బెట్టుగ సింహనాదము సేసెను.

3౨. గుహలయందుఁ బ్రతిధ్వనిని గలిగించుచున్నదియగు హనుమంతుని సింహనాదముచేతఁ బక్షులాకాశమునుండి భూమిపైఁ బడియెను. అతండు గట్టిగా నిట్లు కూఁతలుపెట్టెను.

33. మిక్కిలి బలశాలియగు రాముఁడు జయమందుచున్నాఁడు, శూరుఁడగు లక్ష్మణుఁడు ప్రఖ్యాతిం గనుచున్నాఁడు. రామునిచేఁ బాలింపఁబడినవాఁడయి సుగ్రీవుండు పెంపొందును.

3౪. నేను గోసలదేశమునకుఁ బ్రభుఁడును, కష్టమునియ్యని కార్యములుగలవాఁడును నగు రామునకు సేవకుఁడను, హనుమంతుఁ డనువాఁడను. వాయుపుత్రుఁడను శత్రుసైన్యములను రూపుమాపు వాఁడను.

3౫. రాళ్లచేతను వృక్షములచేతను వెక్కుతెఱంగులఁ గొట్టుచున్ననాకు యుద్ధమున వేయిమందిరావణులేనియు నెదుట నిలువనేరరు.

3౬. లంకను జీఁకాకుపఱచి, జానకికి నమస్కరించి, సఫలమైన కార్యముం గలవాఁడనై, ఈరాక్షసులందఱుఁ జూచుచుండఁగ నేఁబోదును.

తస్య సన్నాద శబ్దేన తే భవ న్భయశంకితాః।
దదృశు శ్చ హనూమంతం సంధ్యామేఘ మివోన్నతమ్॥ ౩౭॥

స్వామిసందేశ నిశ్శంకా స్తత స్తే రాక్షసాః కపిమ్।
చిత్రైః ప్రహరణై ర్భీమై రభిపేతు స్తత స్తతః॥ ౩౮॥

స తైః పరివృత శ్శూరైః సర్వత స్సమహాబలః।
ఆససా దాయసం భీమం పరిఘం తోరణాశ్రితమ్॥ ౩౯॥

స తం పరిఘ మాదాయ జఘాన రజనీచరాన్।
స పన్నగ మివాదాయ స్ఫురంతం వినతా సుతః॥ ౪౦॥

విచచా రాంబరే వీరః పరిగృహ్యాచ మారుతిః॥ ౪౦½

స హత్వా రాక్షసా న్వీరా న్కింకరా న్మారుతాత్మజః।
యుద్ధకాంక్షీ పునర్వీర స్తోరణం సముపాశ్రితః॥ ౪౧½

తత స్తస్మా ద్భయాన్ముక్తాః కతిచి త్తత్ర రాక్షసాః।
నిహతా న్కింకరా న్సర్వా న్రావణాయ న్యవేదయన్॥ ౪౨½

స రాక్షసానాం నిహతం మహద్బలం నిశమ్య రాజా పరివృత్త
లోచనః। సమాదిదేశా ప్రతిమం పరాక్రమే ప్రహ స్తపుత్రం
సమరే సుదుర్జయమ్॥ ౪౩½

ఇతి శ్రీమత్సుందరకాండే - ద్విచత్వారింశస్సర్గః.



౩౭. ఆరాక్షసులు హనుమంతునియొక్క సింహనాదముచే భీతి పొందినవారైరి. ఎత్తుగనున్న యాహనుమంతుని సంధ్యాకాలమం దెఱ్ఱగ నుండు మేఘముంగాంచినట్లు గనిరి.

౩౮. ఆరాక్షసులు తమప్రభునియాజ్ఞచొప్పున జంకులేనివారై విచిత్రములును భయంకరములును నగు బాణములచేత నందందునిలచి హనుమంతునిం గొట్టిరి.

౩౯. శూరులగు రాక్షసులచేతఁ జుట్టంబడినవాఁడై బలశాలియగు హనుమంతుఁ డినుముచేఁ జేయంబడిన భయంకరమగునదియును, తోరణ స్తంభముకడ నున్నదానిని గొనియెను.

౪౦, ౪౦½. అట్లుగొని యాంజనేయుఁడు దానిచే రాక్షసులను మోదెను. ఆవాయుపుత్రుండు వెలుంగుచున్న గదనుగైకొని పెద్దసర్పమును బట్టుకొన్న గరుడునివలె నొప్పినయాకారముతో సంచరించెను.

౪౧½. ఆవీరుఁడగు వాయుపుత్రుఁడు శూరులగు కింకరులను జంపి యింకను యుద్ధముంగోరుచుఁ దోరణస్తంభము నెక్కియుండెను.

౪౨½. పిమ్మట నచ్చోట హనుమంతునిచేఁ జావక మిగిలియున్న రాక్షసులుగొందఱందుండితప్పించుకొని 'కింకరులు వానరునిచేఁజంపఁబడిరని చెప్పుటకు రావణాసురునికడ కేగిరి.

౪౩½. రాక్షసరాజగు నాతండు గొప్పదియగు తనసేన చంపఁబడుటవిని, కోపముచేఁ గనుగ్రుడ్లుత్రిప్పుచుఁ బరాక్రమమున సాటిలేనివాఁడును యుద్ధమున గెలువరానివాఁడును నగుప్రహస్తునిపుత్రునిం బొమ్మని యాజ్ఞాపించెను.

ఇది నలువదిరెండవసర్గ.

---:0:---

## త్రిచత్వారింశస్సర్గః.

తత స్స కింకరా న్హత్వా హనుమా న్ధ్యాన మాస్థితః।
వనం భగ్నం మయా చైత్య ప్రాసాదో న వినాశితః॥ ౧॥

తస్మా త్ప్రాసాద మప్యేవం భీమం విధ్వంసయా మ్యహమ్।
ఇతి సంచింత్య మనసా హనుమా న్దర్శయ న్బలమ్॥ ౨॥

చైత్యప్రాసాద మాప్లుత్య మేరుశృంగ మివోన్నతమ్।
ఆరురోహ కపిశ్రేష్ఠో హనుమా న్మారుతాత్మజః॥ ౩॥

ఆరుహ్య గిరిసంకాశం ప్రాసాదం హరియూథపః।
బభౌ స సుమహాతేజాః ప్రతిసూర్య ఇవోదితః॥ ౪॥

సంప్రధృష్య చ దుర్ధర్షం చైత్య ప్రాసాద ముత్తమమ్।
హనుమా న్ప్రజ్వలన్ లక్ష్మ్యా పారియాత్రోపమో భవత్॥ ౫॥

స భూత్వా సుమహాకాయః ప్రభావా న్మారుతాత్మజః।
ధృష్ట మాస్ఫోటయా మాస లంకాం శబ్దేన పూరయన్॥ ౬॥

తస్యాస్ఫోటిత శబ్దేన మహతా శ్రోత్రఘాతినా।
పేతు ర్విహంగమా స్తత్ర చైత్యపాలాశ్చ మోహితాః॥ ౭॥

అస్త్రవి జ్జయతాం రామో లక్ష్మణశ్చ మహాబలః।
రాజా జయతి సుగ్రీవో రాఘవే ణాభిపాలితః॥ ౮॥

దాసోహం కోసలేంద్రస్య రామస్యాక్లిష్టకర్మణః।
హనుమాం చ్ఛత్రుసైన్యానాం నిహంతా మారుతాత్మజః॥ ౯॥

## నలుబది మూఁడవసర్గ.

౧. అట్లు కింకరుల నువారిం గూల్చిన హనుమంతుఁడు, అశోకవనము ను ధ్వంసము సేసితిని గాని రాక్షసుని గొప్పమేడను నాశము సేయఁబోయితిని గదా, అని చింతించెను.

౨. కావున గొప్పదియై భయంకరముగా నగుపడుచున్న యీమే డనుగూడఁ గూలఁద్రోయుదునని హనుమంతుఁడు మనస్సుచే యోచించు చుండెను.

౩. ఆవాయుపుత్రుం డిట్లుయోచించి మేరుపర్వతముయొక్క శిఖర మువలె నున్నతమైన యాగొప్పమేడపై దుమికి ప్రాఁకెను.

౪. ఆవానరోత్తముఁడు పర్వతముంబోలిన యాయింటిమీఁది కెక్కి ప్రతాపవంతుఁడగు నాతం డుదయించిన రెండవసూర్యునివలె నొప్పెను.

౫. హనుమంతుఁడు కాంతిచే నొప్పుచున్నవాఁడై, లోఁబఱచికొన రానిదియగు నాదేవాలయముంబోలు మేడను గ్రమ్ముకొని పారియాత్రమను పర్వతమువలె నుండెను.

౬. ఆవాయుపుత్రుఁడు తనశక్తిచే గొప్పమేనును గలవాఁడై గాఁ బెఱిగి ధ్వనిచే లంకయంతయు నిండునట్లు బిగ్గర సింహనాదము సేసెను.

౭. చెవులను బ్రద్దలు సేయునదియగు నాసింహధ్వనిచే నందున్న పక్షులన్నియు నేలం గూలెను. ఆమేడనుఁ గావలియున్నవారు భ్రమఁ జెందిరి.

౮. అస్త్రములనెఱింగినవాఁడగు రాముండును, బలవంతుఁడగు లక్ష్మణుండును రామునిచేఁ బాలింపఁబడు సుగ్రీవుండును జయించుదురు.

౯. శ్రమలేని కార్యములుంగలవాఁడును, కోసలదేశమునకుఁ బ్రభుండును నగురామునకు నేనుసేవకుండను, హనుమంతుఁడను పేరుగల వాఁడను, వాయుపుత్రుఁడను, శత్రువులసేనల నాశము సేయువాఁడను.

న రావణసహస్రం మే యుద్ధే ప్రతిబలం భవేత్।
శిలాభిస్తు ప్రహరతః పాదపైశ్చ సహస్రశః॥ ౧౦॥
అర్దయిత్వా పురీం లంకా మభివాద్య చ మైథిలీమ్।
సమృద్ధార్థో గమిష్యామి మిషతాం సర్వరక్షసామ్॥ ౧౧॥
ఏవ ముక్త్వా విమానస్థ శ్చైత్యస్థా న్హరియూథపః।
ననాద భీమనిర్హ్రాదో రక్షసాం జనయ న్భయమ్॥ ౧౨॥
తేన శబ్దేన మహతా చైత్యపాలా శ్శతం యయుః।
గృహీత్వా వివిధానస్త్రా న్ప్రాసా న్ఖడ్గా న్పరశ్వధాన్॥ ౧౩॥
విసృజంతో మహాకాయా మారుతిం పర్యవారయన్॥ ౧౩½
తే గదాభి ర్విచిత్రాభిః పరిఘైః కాంచనాంగదైః।
ఆజఘ్ను ర్వానరశ్రేష్ఠం బాణై శ్చాదిత్యసన్నిభైః॥ ౧౪½
ఆవర్త ఇవ గంగాయా స్తోయస్య విపులో మహాన్।
పరిక్షిప్య హరిశ్రేష్ఠం స బభౌ రక్షసాం గణః॥ ౧౫½
తతో వాతాత్మజః క్రుద్ధో భీమరూపం సమాస్థితః॥ ౧౬॥
ప్రాసాదస్య మహా న్తస్య స్తంభం హేమపరిష్కృతమ్।
ఉత్పాటయిత్వా వేగేన హనుమా న్పవనాత్మజః॥ ౧౭॥
తత స్తం భ్రామయామాస శతధార మ్మహాబలః।
తత్ర చాగ్ని స్సమభవ త్ప్రాసాద శ్చా ప్యదహ్యత॥ ౧౮॥
దహ్యమానం తతో దృష్ట్వా ప్రాసాదం హరియూథపః।
స రాక్షసశతం హత్వా వజ్రేణేంద్ర ఇవా సురాన్॥ ౧౯॥

౧౧. యుద్ధమున బండలచేతను వేలకొలఁది వృక్షములచేతనుఁ గొట్టుచున్న నాకు వేయిమంది రావణులేనియు నెదుట నిలువ నేరరు.

౧౨. లంకాపట్టణమును బాధించి సీతకు మ్రొక్కి కార్యమును సాధించుకొనినవాఁడనై యీ రాక్షసులందఱుం జూచుచుండఁగా నేను మన

౧౩. జయాలయముపైనుండు విమానమునందుండి వానరోత్తముఁ డెల్లవలికి రాక్షసులకు భయమును బుట్టించుచు భయంకరముగ ధ్వనిఁ జేసెను.

౧౪, ౧౪½. అతఁడు చేసిన గొప్పధ్వనిని విని చైత్యప్రాసాదరక్షకులుగాఁ గావలియున్న నూఱుమంది పాఱిపోయిరి. బలశాలులగు రాక్షసులు గొందఱు నానాబాణములను ఖడ్గములను బల్లెములను గొని విసరివేయుచు నాతని నలుప్రక్కలం గ్రమ్ముకొనిరి.

౧౫½. వారలు విచిత్రములగు గదలచేతను, బంగారు కట్లుగల గుదియలచేతను కాంతిగల బాణములచేతను వానరోత్తమునిం గొట్టిరి.

౧౬½, ౧౭. గంగానదిలోని యుదకమునందున్న విశాలమగు సుడిగుండమువలె, పెద్దదియగు రాక్షసులగుంపు వానరోత్తముని నలుప్రక్కలం గ్రమ్మి వెలింగెను. అందులకుఁ గోపించి యాతఁడు భయంకరమగు రూపమును ధరించి నిలిచెను.

౧౮, ౧౯. వాయుపుత్త్రుఁడును బలశాలియు నగు హనుమంతుండు బంగారముచేనలంకరింపఁబడినదియగు నా మేడయొక్క పొడవగు స్తంభమును నూఱుముక్కలుగా విఱచెను. అందు నిప్పుపుట్టి యానగరును దగ్ధము చేసెను.

౨౦, ౨౦½. వానరసమూహమునకు మొనగాఁడగు నాతఁడు గాలుచున్న యాలయముంగని (ఇంద్రుఁడు వజ్రాయుధముచేఁ గొట్టునట్లు)

అంతరిక్షే స్థితశ్శ్రీమా నిదంవచన మబ్రవీత్॥ ౧౯

మాదృశానాం సహస్రాణి విసృష్టాని మహాత్మనా।
బలినాం వానరేంద్రాణాం సుగ్రీవ వశవర్తినామ్॥ ౨౦

అటన్తి వసుధాం కృత్స్నాం వయ మన్యే చ వానరాః॥ ౨౧

దశనాగబలాః కేచి త్కేచి ద్దశగుణోత్తరాః।
కేచిన్నాగ సహస్రస్య బభూవు స్తుల్యవిక్రమాః॥ ౨౨

సంతి చౌఘబలాః కేచి త్కేచి ద్వాయు బలోపమాః।
అప్రమేయ బలాశ్చాన్యే తత్రాస న్హరియూథపాః॥ ౨౩

ఈదృగ్విధైస్తు హరిభి ర్వృతో దంతనఖాయుధైః।
శతై శ్శతసహస్రైశ్చ కోటీభి రయుతై రపి॥ ౨౪

ఆగమిష్యతి సుగ్రీవ స్సర్వేషాం వో నిషూదనః॥ ౨౫

నేయమస్తి పురీ లంకా నయూయం న చ రావణః।
యస్మా దిక్ష్వాకు నాథేన బద్ధం వైరం మహాత్మనా॥ ౨౬

ఇతి శ్రీమత్సుందరకాండే - త్రిచత్వారింశస్సర్గః.

---

## చతుశ్చత్వారింశస్సర్గః.

సందిష్టో రాక్షసేంద్రేణ ప్రహస్తస్య సుతోబలీ।
జంబుమాలీ మహాదంష్ట్రో నిర్జగామ ధనుర్ధరః॥ ౧

ధనచేసియున్న స్తంభముచే ననేక రాక్షసులంగూల్చి కాంతిసంపదతో నాకాశమున నిలచి యిట్లులనియెను.

౨౦½. ౨౧. మావలె గొప్పధైర్యముగలవారును, బలవంతులును, సుగ్రీవునకు లోఁబడినవారునునగు వానరులు వేలకొలఁది సుగ్రీవునిచే నియమింపఁబడినవారై భూమియందంతటఁ దిరుగుచున్నారు. మేమింతయు నెఱింగితిమి.

౨౨. కొందఱు పదియేనుఁగుల బలమును, కొందఱు నూఱేనుఁగుల బలమును, మఱికొందఱు వేయియేనుంగుల దిటవునుగలవారై సర్వమున నేకరీతిగలిగి యున్నారు.

౨౩. కొంద ఱోఘమను మితిగల బలముతోఁగూడినవారును, కొందఱు వాయుదేవుని బలమంతటి బలముగలవారును, కొందఱు మితిలేని బలముగలవారునుగ వానరోత్తము లనేకులుగలరు.

౨౪, ౨౪½. కోఱలను గోళ్లనే యాయుధములుగాఁగల, మీఁదఁ జెప్పంబడినట్టి వానరుల నూఱులతోడను వేలతోడను బదివేలతోడను గోట్ల సంఖ్యలతోడనుగూడినవాఁడై సుగ్రీవుండు మిమ్ముందఱ నాశము నేయ వచ్చుచున్నాఁడు.

౨౫½. ఇక్ష్వాకువంశ సంభవుండగు రామచంద్రునితో గాఢముగ విరోధముంబొందితిరిగావున నిఁక లంకనిలువదు, మీరు దక్కరు, రావణాసురుండు గతించినవాఁడు.

ఇది నలువదిమూఁడవ సర్గ.

---

## నలువది నాల్గవసర్గ.

౧. ప్రహస్తుని పుత్త్రుఁడును బలశాలియు గొప్పకోఱలు గలవాఁడునునగు జంబుమాలి రావణాసురునిచే ననుపంబడినవాఁడై ధనుస్సును గైకొని యుద్ధమునకు వెడలెను.

ర_క్తమాల్యాంబరధరః స్రగ్వీ రుచిరకుండలః।
మహా న్వివృ_త్త నయన శ్చండ స్సమరదుర్జయః॥ ౨॥
ధను శ్శక్రధనుః ప్రఖ్యం మహ ద్రుచిర సాయకమ్।
విస్ఫారయానో వేగేన వజ్రాశని సమస్వనమ్॥ ౩॥
తస్య విస్ఫార ఘోషేణ ధనుషో మహతా దిశః।
ప్రదిశశ్చ నభ_శ్చైవ సహసా సమపూర్యత॥ ౪॥
ఉదయస్థ ఇవాదిత్యః ప్రభాభి రతిలోహితః।
లోహితాంగేన మహతా కవచే నాభిసంవృతః॥
తిష్ఠ తిష్ఠేతి సహసా హనూమంత మథాబ్రవీత్।
రథేన ఖరయు_క్తేన త మాగత ముదీక్ష్య సః।
హనుమా న్వేగసంపన్నో జహర్ష చ ననాద చ॥ ౫॥
తం తోరణవిటంకస్థం హనుమంతం మహాకపిమ్।
జంబుమాలీ మహాబాహు ర్వివ్యాధ నిశితై శ్శరైః॥ ౬॥
అర్ధచంద్రేణ వదనే శిరస్యేకేన కర్ణినా।
బాహ్వో ర్వివ్యాధ నారాచై ర్దశభి _స్తం కపీశ్వరమ్॥ ౭॥
తస్య తచ్ఛు శుభే తామ్రం శరే ణాభి హతమ్ ముఖమ్।
శరదీ వాంబుజం ఫుల్లం విద్ధం భాస్కరరశ్మినా॥ ౮॥
త_త్తస్య ర_క్తం ర_క్తేన రంజితం శుశుభే ముఖమ్।
యథా కాశే మహాపద్మం సి_క్తం చందన బిందుభిః॥ ౯॥
చుకోప బాణాభిహతో రాక్షసస్య మహాకపిః।
తతః పార్శ్వే౽తి విపులాం దదర్శ మహతీం శిలామ్॥ ౧౦॥

౨, ౩. ఎఱ్ఱని పుష్పములును వస్త్రములును ధరించినవాఁడును, ప్రకాశించెడు కుండలములుగలవాఁడును, వేగముగలవాఁడును, యుద్ధమునఁ బోఁబడనివాఁడును, తిరుగుచున్న కనుగ్రుడ్లు గలవాఁడును. గొప్పవాఁడునునగు రాక్షసుండు ప్రకాశించుచున్న బాణములనుగలదియై యింద్రుని ధనుస్సుతోఁ దుల్యమగు ధనుస్సును, పిడుగుయొక్క ధ్వనివంటిధ్వని గలుగునట్లు నారిమ్రోయించుచు వెడలెను.

౪. ఆవింటియొక్క నారిచప్పుడుచే దిక్కులు, దిక్సంధులును, గగనమును శీఘ్రమున నిండింపంబడిన వయ్యెను.

(ఎఱ్ఱని మేనితోడను, ఎఱ్ఱని కాంతులతోడను వెలింగి పొడ్డకవచమును ధరించి యుదయపర్వతమందున్న సూర్యునివలెనొప్పి హనుమంతుని నిలు నిలుమని శీఘ్రమునఁ బలికెను.)

౫. గాడిదెలనుగట్టిన రథమునందెక్కివచ్చిన జంబుమాలినిగని వేగవంతుఁడగు హనుమంతుఁడు సంతోషించెను. అంకెలువైచెను.

౬. గొప్పభుజములు గలవాఁడగు జంబుమాలి యాద్వారముయొక్క ముంజూరుపట్టెపైనున్న గొప్పవానరుఁడగు హనుమంతునిం గఱకగు బాణములచేఁ గొట్టెను.

౭. ముఖమందొక యర్ధచంద్రబాణముచేతను, తలయందొక బాణముచేతను, భుజములను బదిబాణములచేతను వానరోత్తమునిం గొట్టెను.

౮. అంతట బాణములచేఁ గొట్టంబడినదియగు నాతని మోము (సూర్య కిరణములచే గ్రుచ్చంబడిన) శరత్కాలమందలి కమలమువలెఁ బ్రకాశించెను.

౯. స్వభావసిద్ధముగనే యెఱ్ఱగనుండు హనుమంతునిమోము రక్తముయొక్క బిందువులచేఁగలిగిన యెఱ్ఱతనమునఁ (ఆకాశమునఁ జందనముయొక్కబిందువులచేఁ దడుపంబడిన మహాపద్మమువలెఁ) బ్రకాశించెను.

౧౦. అట్లుబాణములచే లెస్సగఁ గొట్టంబడినవాఁడై యామహావా

తరసా తాం సముత్పాట్య చిక్షేప బలవద్బలీ।
తాం శరై ర్దశభిః క్రుద్ధ స్తాడయామాస రాక్షసః॥ ౧౧॥
విపన్నం కర్మ తద్దృష్ట్వా హనుమాం శ్చండవిక్రమః।
సాలం విపుల ముత్పాట్య భ్రామయామాస వీర్యవాన్॥ ౧౨॥
భ్రామయంతం కపిం దృష్ట్వా సాలవృక్షం మహాబలమ్।
చిక్షేప సుబహూన్ బాణాన్ జంబుమాలీ మహాబలః॥ ౧౩॥
సాలం చతుర్భి శ్చిచ్ఛేద వానరం పంచభి ర్భుజే।
ఉరస్యేకేన బాణేన దశభిస్తు స్తనాంతరే॥ ౧౪॥
స శరైః పూరితతనుః క్రోధేన మహతా వృతః।
తమేవ పరిఘం గృహ్య భ్రామయామాస వేగితః॥ ౧౫॥
అతివేగోఽతివేగేన భ్రామయిత్వా బలోత్కటః।
పరిఘం పాతయామాస జంబుమాలే ర్మహోరసి॥ ౧౬॥
తస్య చైవ శిరో నాస్తి న బాహూ న చ జానునీ।
న ధను ర్న రథో నాశ్వా స్తత్రాదృశ్యంత నేషవః॥ ౧౭॥
స హత స్తరసా తేన జంబుమాలీ మహాబలః।
పపాత నిహతో భూమౌ చూర్ణితాంగ విభూషణః॥ ౧౮॥
జంబుమాలిం చ నిహతం కింకరాంశ్చ మహాబలాన్।
చుక్రోధ రావణ శ్శ్రుత్వా కోపసంరక్త లోచనః॥ ౧౯॥

నరుండు రాక్షసునిపైఁ గోపించెను. ఆప్రక్కనుండు విశాలమగు బండను గాంచెను.

౧౧. బలవంతులలో మొనగాఁడగు నావానరుఁ డాబండను పెళ్లగించి వేగమున రాక్షసునిపై వైచెను. వాఁడాబండను గోపించి పది బాణములచేఁ బొడిచేసెను.

౧౨. రౌద్రమగు కర్మముఁగలవాఁడును బలశాలియునగు హనుమంతుఁడు దాను జేసిన పని వ్యర్థమౌటగని గొప్పదియగు నొకచెట్టును బెఱికి త్రిప్పెను.

౧౩. మహాబలుండగు జంబుమాలి, ఆచెట్టును త్రిప్పుచున్న బలవంతుఁడగు వానరుంగని పెక్కుబాణములు ప్రయోగించెను.

౧౪. నాల్గుబాణములచేఁ జెట్టును ఖండించి, వానరుని భుజములపై నైదుబాణములచేతను, ఱొమ్మునొకబాణముచేతను, స్తనములనడుమ పదిబాణములచేతను గొట్టెను.

౧౫. ఆహనుమంతుఁడు బాణములచేత నిండింపఁబడిన దేహముఁగలవాఁడై మిక్కిలికోపించి యందున్నగుదియనెత్తుకొని వేగమునం ద్రిప్పెను.

౧౬. మిక్కిలి వేగముంగలవాఁడును బలశాలియునగు నాతండు పరిఘ వేగమునం ద్రిప్పిత్రిప్పి జంబుమాలియొక్క పెద్దఱొమ్మునఁ బడవైచెను.

౧౭. ఆవేయుటచే నారాక్షసునితలయు భుజములును మోకాళ్లును ధనుస్సును రథమును గుఱ్ఱములును బాణములును రూపుచెడినవయ్యెను.

౧౮. ఆబలవంతుఁడగు జంబుమాలి హనుమంతునిచేఁ గొట్టఁబడినవాఁడై పొడియైన యవయవములను భూషణములను గలిగి నేలంగూలెను.

౧౯. బలవంతులగు కింకరులును జంబుమాలియుఁ జంపంబడుట విని కోపముచే నెఱ్ఱనైన కన్నులుగలవాఁడై రావణుండు మిక్కిలి యాగ్రహించెను.

సరోష సంవర్తిత తామ్రలోచనః ప్రహస్తపుత్రే నిహతే మ
హాబలే। అమాత్యపుత్రా నతివీర్య విక్రమాన్ సమాదిదేశా
శు నిశాచ రేశ్వరః॥ ౨౦॥

ఇతి శ్రీమత్సుందరకాండే - చతుశ్చత్వారింశస్సర్గః.

---

## పంచచత్వారింశస్సర్గః.

తత స్తే రాక్షసేంద్రేణ చోదితా మంత్రిణ స్సుతాః।
నిర్యయు ర్భవనా త్తస్మా త్సప్త సప్తార్చి వర్చసః॥ ౧॥
మహాబల పరీవారా ధనుష్మంతో మహాబలాః।
కృతా స్త్రా స్త్ర విదాం శ్రేష్ఠాః పరస్పర జయైషిణః॥ ౨॥
హేమజాల పరిక్షిప్తై ర్ధ్వజవద్భిః పతాకిభిః।
తోయదస్వన నిర్ఘోషై ర్వాజియుక్తై ర్మహారథైః॥ ౩॥
తప్తకాంచన చిత్రాణి చాపా న్యమితవిక్రమాః।
విస్ఫారయంత స్సంహృష్టా స్తటిత్వంత ఇవాంబుదాః॥ ౪॥
జనన్య స్తు తత స్తేషాం విదిత్వా కింకరా న్హతాన్।
బభూవు శ్శోకసంభ్రాంతా స్సబాంధవ సుహృజ్జనాః॥ ౫॥
తే పరస్పర సంఘర్షా త్తప్తకాంచన భూషణాః।
అభిపేతు ర్హనూమంతం తోరణస్థ మవస్థితమ్॥ ౬॥
సృజంతో బాణవృష్టిం తే రథగర్జిత నిస్వనాః।
వృష్టిమంత ఇవాంభోదా విచేరు ర్నైరృతాంబుదాః॥ ౭॥

౨౦. రాక్షసేశ్వరుండు, ప్రహస్తపుత్రుండగు జంబుమాలి చంపఁబడినవాఁడగుటచేఁ గోపముచేఁ దిరుగుచున్న నెఱ్ఱని కన్నుగ్రుడ్లు గలవాఁడై మిక్కిలి దర్పముగలవారగు మంత్రిపుత్రుల ననిచెను

ఇది నలుబదినాల్గవసర్గ.

——:o:——

## నలుబదియైదవసర్గ.

౧. అగ్నితోఁ దుల్యమగు తేజముంగలవారగు మంత్రిసుతు లేడ్వురును రావణునిచే నియమింపఁబడినవారై యాభవనమునుండి వెడలిరి.

౨. మెండగు సేనలుగలవారును, విండ్లుగలవారును, బలశాలులును విలువిద్యనేర్చినవారిలో నేర్పరులును, ఒక్కొక్కరే గెలుపు గోరుచున్న వారును,

౩. బంగారు తోరణగంట్లచే నొప్పినవియు, టెక్కెములను కెం జాలను గలవియు, ఉరుములంబోలు ధ్వనినిగలవియు, పెక్కుగుఱ్ఱములను గట్టంబడినవియు నగురథములం గలవారును.

౪. మిక్కిలి దర్పవంతులును, కుందనపుబంగారముచే వింతగఁ బనిచేయంబడియున్న విండ్లనారులనీడ్చుచున్నవారును, మెఱుపులంగలమేఘములవంటివారును, ఉత్సాహముగలవారును నగునయ్యేడ్వురును రావణుని కొలువునుండి వెలువడిరి.

౫. ఆమంత్రిపుత్రులతల్లులు కింకరు లనువారు మున్న చంపఁబడిరనివిని బంధుమిత్రులతోడఁగూడి బోరన నేడ్చిరి.

౬. కుందనపు నగలచే నొప్పుచున్నవారేడ్గురును బరస్పరము తోపులతో నేగి, యుద్ధసన్నద్ధులై తోరణస్తంభముపైనున్న హనుమంతునిం జేరఁబోయిరి.

౭. బాణములను జల్లును, రథములధ్వనియను నుఱుములను గలిగించుచున్నవియగు రాక్షసు లనుమేఘములు (వర్షించుచున్న మబ్బులవలె) సంచరించెను.

అవకీర్ణ స్తతస్తాభి ర్హనుమాం చ్ఛరవృష్టిభిః।
అభవ త్సంవృతాకార శ్శైలరాడివ వృష్టిభిః॥ ౯॥
స శరా న్మోఘయామాస తేషా మాశు చరః కపిః।
రథవేగం చ వీరాణాం విచర న్విమలేంఽబరే॥ ౯॥
స తైః క్రీడ న్ధనుష్మద్భి ర్వ్యోమ్ని వీరః ప్రకాశతే।
ధనుష్మద్భి ర్యథా మేఘై ర్మారుతః ప్రభు రంబరే॥ ౧౦॥
సకృత్వా నినదం ఘోరం త్రాసయం స్తాం మహాచమూమ్।
చకార హనుమా న్వేగం తేషు రక్షస్సు వీర్యవాన్॥ ౧౧॥
తలే నాభ్యహన త్కాంశ్చి త్పాదైః కాంశ్చి త్పరంతపః।
ముష్టినా భ్యహన త్కాంశ్చి న్నఖైః కాంశ్చి ద్వ్యదారయత్॥
ప్రమమా థోరసా కాంశ్చి దూరుభ్యా మపరా న్కపిః।
కేచి త్తస్య నినాదేన తత్రైవ పతితా భువి॥ ౧౩॥
తత స్తే ష్వవసన్నేషు భూమౌ నిపతితేషు చ।
తత్సైన్య మగమత్సర్వం దిశో దశ భయార్దితమ్॥ ౧౪॥
వినేదు ర్విస్వరం నాగా నిపేతు ర్భువి వాజినః।
భగ్ననీడ ధ్వజచ్ఛత్రై ర్ధూశ్చ కీర్ణాభవ ద్రథైః॥ ౧౫॥
స్రవతా రుధిరేణాథ స్రవంత్యో దర్శితాః పథి।
వివిధైశ్చ స్వరై ర్లంకా ననాద వికృతం తదా॥ ౧౬॥

౮. పిమ్మట హనుమంతుఁడు రాక్షసులయొక్క బాణవర్షములచేఁ గప్పంబడి వర్షధారలచే ముసురుకొనియున్న మహాపర్వతమువలెనుండెను.

౯. ఆవానరుఁడు యుద్ధమున నిటునటుఁదిరుగుచున్నవాఁడై యా రాక్షసులబాణములను వ్యర్థము చేసెను. ఆకాశమున నెగసి సంచరించుచు శరవేగమును వమ్ము సేసెను.

౧౦. బలవంతుఁడగు వాయుదేవుఁ డాకాశమున ఇంద్రధనుస్సుతోఁగూడిన మేఘములయందు సంచరించుచు వెలుఁగునట్లు శూరుఁడగు హనుమంతుఁ డాకాశమున ధనుస్సులుగల రాక్షసులతోఁ గ్రీడించుచు నొప్పెను.

౧౧. బలవంతుఁడగు నాతఁడు భయంకరమగు సింహనాదమును జేసి యాగొప్పసేనను భయపెట్టుచు రక్కసులను జక్కాడుటకై త్వరపడియెను.

౧౨, ౧౩. శత్రువులఁ బీడించువాఁడగు హనుమంతుఁడు పాదములచేఁ గొందఱను, అఱచేతులచేఁ గొందఱను గొట్టిచంపెను. పిడికిలిచేఁ గొందఱను గ్రుద్దెను. గోళ్లచేఁ గొందఱను జీల్చెను. కొందఱను ఱొమ్ము పోటుచేతను మఱికొందఱను దొడలచేతను నుఱుము సేసెను. కొందఱాతని సింహనాదముచే నచ్చోటనె భూమిపైఁ బడిరి.

౧౪. ఇట్లు మంత్రిపుత్రులు ప్రాణములను విడుచువారును, నేలం గూలువారును గాఁగా వారిసైన్యమంతయు భయముచే భ్రాంతినొంది నలుదిక్కులకుం బాఱెను.

౧౫. ఏనుఁగులు వికారముగ ధ్వనిచేసెను. గుఱ్ఱములు నేలకు మ్రొగ్గెను. విఱిగిన గూళ్ళను, ధ్వజములను గొడుగులను గలిగి భూమి పట్టుముగ రథములచేఁ గప్పంబడినట్లుండెను.

౧౬. కాఱుచున్న రక్తముచే నామార్గమున నేఱులు పాఱెను, నానావిధములగు ధ్వనులతో లంక వికారముగఁ బ్రతిధ్వనించెను.

స తాన్ప్రవృద్ధాన్వినిహత్య రాక్షసాన్ మహాబలశ్చండపరాక్రమః కపిః। యుయుత్సురన్యైః పునరేవ రాక్షసైస్తమేవ వీరో౽భిజగామ తోరణమ్॥ ౧౭॥

ఇతి శ్రీమత్సుందరకాండే - పంచచత్వారింశస్సర్గః.

---

## షట్చత్వారింశస్సర్గః.

హతాన్ మంత్రిసుతాన్ బుద్ధ్వా వానరేణ మహాత్మనా।
రావణస్సంవృతాకారశ్చకార మతిముత్తమామ్॥ ౧॥
సవిరూపాక్ష యూపాక్షౌ దుర్ధరం చైవ రాక్షసమ్।
ప్రఘసం భాసకర్ణంచ పంచసేనాగ్రనాయకాన్॥ ౨॥
సందిదేశ దశగ్రీవో వీరాన్నయవిశారదాన్।
హనుమద్గ్రహణే వ్యగ్రాన్వాయువేగసమాన్యుధి॥ ౩॥
యాత సేనాగ్రగాస్సర్వే మహాబల పరిగ్రహాః।
సవాజి రథమాతంగాస్స కపిశ్శాస్యతామితి॥ ౪॥
యత్తైశ్చ ఖలు భావ్యం స్యాత్తమాసాద్య వనాలయమ్।
కర్మచాపి సమాధేయం దేశకాల విరోధినమ్॥ ౫॥
నహ్యహం తం కపిం మన్యే కర్మణా ప్రతితర్కయన్।
సర్వథా తన్మహద్భూతం మహాబల పరిగ్రహమ్॥ ౬॥
భవేదింద్రేణవా సృష్ట మస్మదర్థం తపోబలాత్॥ ౭
సనాగయక్ష గంధర్వా దేవాసుర మహర్షయః।
యుష్మాభిస్సహితైస్సర్వైర్మయా సహ వినిర్జితాః॥ ౮

౧౭. బలశాలియు, నేంద్రుడును పరాక్రమము గలవాఁడును శ్రీమంతుఁడును నగుహనుమంతుఁడు సమర్థులగు నారాక్షసులను జూచి మరల నితరులగు రాక్షసులతోఁ బోర నెదురుచూచుచుఁ దోరణస్తంభముపైఁ జేరెను.

ఇది నలుబది యైదవసర్గ.

---

నలుబదియాఱవసర్గ.

౧. దొడ్డవాఁడగువానరునిచే మంత్రిపుత్రులేడ్గురును నీల్గుటవిని యభిప్రాయమును వెలికిఁ దెలియనీయక దిటవుతో మెలంగె రావణుండు.

౨, ౩. ఆరావణుండు వీరులును నీతిమంతులును యుద్ధమున వాయువుంబోలు వేగముంగలవారును హనుమంతునింబట్టి తెచ్చుటకై త్వరపడుచున్నవారును నగువిరూపాక్ష యూపాక్షులును దుర్ధరుఁడును, ప్రఘసుఁడును, భాసకర్ణుఁడును ననుసేనానాయకుల నైదుమందిని నియమించి పనిచెను.

౪. ఓసేనానాయకులారా! మీరందఱును మెండుగ సేనలంగొని గుఱ్ఱములు రథములు నేనుఁగులతోడ వానరుని దండింపఁబొండు.

౫. ఆవానరుని చేరంబోయి జయించుటకుఁ దగుయత్నము సేయుచుండుఁడు. మీరుచేయుకార్యములు దేశకాలములకు విరోధములై యుండఁగూడదు.

౬, ౬½. ఆతండు నేసిన కార్యములను దలంచిచూడఁగా నాబుద్ధికాతండు వానరుఁడుగఁ దోఁపకున్నవాఁడు. నన్నుఁ గష్టపెట్టుటకై తపశ్శక్తిచేఁ గల్పింపఁబడి దేవేంద్రునిచే విడువంబడిన మహాభూతమని యెల్లవిధములఁ దలంచెదను.

౭½. మీతోడఁ గూడినవాఁడనగు నాచేతనే నాగగంధర్వ యక్షులును, దేవతలు రాక్షసులు మహాఋషులును బాగుగ గెలువంబడిరి.

ప్రతీకారవశ్యం విధాతవ్యం వ్యలీకం కించిదేవ నః।
తదేవ నాత్ర సందేహః ప్రసహ్య పరిగృహ్యతామ్॥ ౮
...సమానో భవద్భిశ్చ హరిర్ధీరపరాక్రమః॥ ౯
దృష్టా హి హరయః పూర్వం మయా విపులవిక్రమాః
వాలీ చ సహసుగ్రీవో జాంబవాంశ్చ మహాబలః॥ ౧౦
నీలస్సేనాపతిశ్చైవ యే చాన్యే ద్వివిదాదయః।
నైవం తేషాం గతిర్భీమా న తేజో న పరాక్రమః॥ ౧౧
న మతిర్న బలోత్సాహౌ న రూపపరికల్పనమ్।
మహత్సత్త్వమిదం జ్ఞేయం కపిరూపం వ్యవస్థితమ్॥ ౧౨
ప్రయత్నం మహదాస్థాయ క్రియతామస్య నిగ్రహః। ౧౨
కామం లోకాస్త్రయస్సేంద్రాస్ససురాసురమానవాః॥ ౧౩
భవతామగ్రతస్స్థాతుం న పర్యాప్తా రణాజిరే।
తథాపి తు నయజ్ఞేన జయమాకాంక్షతా రణే॥ ౧౪
ఆత్మా రక్ష్యః ప్రయత్నేన యుద్ధసిద్ధిర్హి చంచలా॥ ౧౫
తే స్వామివచనం సర్వే ప్రతిగృహ్య మహౌజసః॥ ౧౬
సముత్పేతుర్మహావేగా హుతాశసమతేజసః।
రథైర్మత్తైశ్చ మాతంగైర్వాజిభిశ్చ మహాజవైః॥ ౧౭
శస్త్రైశ్చ వివిధైస్తీక్ష్ణైస్సర్వైశ్చోపచితా బలైః॥ ౧౮

౮వ. కావుననే వారేపాటిగనైనను మనకు హానిచేయఁదలఁచి యుక్తులుచేసియుందురు. ఇందు కేపాటియు శంకగలుగదు. ఎట్లైనను ఈవానరుని బట్టుట ముఖ్యము.

౯నుండి౧౨వకు. ధీరుఁడును బరాక్రమశాలియునగు నీవానరుఁడు మీచేత నవమానములం బొందఁదగినవాఁడుగాఁడు. మున్ను మిక్కిలిబలదర్పములు గలవారగు సుగ్రీవుని వాలిని బలశాలియగు జాంబవంతుని సేనాధిపతియగు నీలుని మఱియు ద్వివిదుఁడు మొదలగువారేని వానరులను గాంచియున్నవాఁడను. వారలకును నింతవేగమున నడచుశక్తి లేదు. ఇంతభయంకరమైనదర్పమును గలుగదు. ఇంతటిబుద్ధియు, బలమును, యత్నమును, ఎదిరి యభిప్రాయమును గ్రహించుటయు లేదు. ఈ మహాభూతము వానరరూపముతో వచ్చియున్నది. ఇట్లగుటనైనను మీరు మిక్కిలియత్నముతో నీవానరుని బట్టి కొట్టవలయును.

౧౩నుండి౧౪వ. దేవేంద్రునితోడను దేవతలతోడను రాక్షసులతోడను మనుష్యులతోడను గూడినవైనను మూఁడులోకములును యుద్ధరంగమున మీయెదుటనిలువ నేపాటియుఁ జాలవు. అయినను యుద్ధమున జయము నమ్మఁదగినది కాదు గావున నీతిశాలియగువాఁడు యుద్ధమున సర్వవిధములచేతను దనప్రాణమును గాపాడుకొనవలయును.

౧౫,౧౬ ౧౭వ. మిక్కిలి తేజముంగలిగి యగ్నిహోత్రునివలె వెలుఁగుచున్నవారును వేగముంగలవారును నగు నారాక్షసులు [illegible] రథములతోడను, ఏనుఁగులతోడను, వేగముంగల గుఱ్ఱములతోడను, కఱకుగల పెక్కాయుధములతోడను ఖడ్గములతోడను సైన్యములతోడను గూడుకొని యుద్ధమునకు వెడలిరి.

తత స్తం దదృశు ర్వీరా దీప్యమానం మహాకపిమ్॥ ౧౬॥
రశ్మిమంత మివోద్యంతం స్వతేజోరశ్మిమాలినమ్।
తోరణస్థం మహోత్సాహం మహాసత్త్వం మహాబలమ్॥ ౧౭॥
మహామతిం మహావేగం మహాకాయం మహాబలమ్॥ ౧౮॥
తం సమీక్ష్యైవ తే సర్వే దిక్షు సర్వా స్వవస్థితాః।
తైస్తైః ప్రహరణై ర్భీమై రభిపేతు స్తత స్తతః॥ ౧౯॥
తస్య పంచాయసా స్తీక్ష్ణా శ్శితాః పీతముఖా శ్శరాః॥ ౨౦॥
శిర స్యుత్పలపత్రాభా దుర్ధరేణ నిపాతితాః।
స తైః పంచభి రావిద్ధ శ్శరై శ్శిరసి వానరః॥ ౨౧॥
ఉత్పపాత నద న్వ్యోమ్ని దిశో దశ వినాదయన్॥ ౨౧॥
తతస్తు దుర్ధరో వీర స్సరథ స్సజ్యకార్ముకః।
కిరన్ శరశతై స్తీక్ష్ణై రభిపేదే మహాబలః॥ ౨౨॥
స కపి ర్వారయామాస తం వ్యోమ్ని శరవర్షిణమ్।
వృష్టిమంతం పయోదాంతే పయోదమివ మారుతః॥ ౨౩॥
అర్ద్యమాన స్తత స్తేన దుర్ధరే ణానిలాత్మజః।
చకార కదనం భూయో వ్యవర్ధత చ వేగవాన్॥ ౨౪॥
స దూరం సహసోత్పత్య దుర్ధరస్య రథే హరిః।
నిపపాత మహావేగో విద్యుద్రాశి ర్గిరావివ॥ ౨౫॥
తత స్స మథితాష్టాశ్వం రథం భగ్నాక్షకూబరమ్।
విహాయ న్యపత ద్భూమౌ దుర్ధర స్త్యక్తజీవితః॥ ౨౬॥

౧౭,౧౮,౧౯౹. అట్లు వెడలి శూరులగు నా సేనానాయకులు, తే కాంతియొక్క పెంపుచే నుదయించుచున్న సూర్యునివలె వెలుంగుచున్న వాఁడును, తోరణస్తంభముపై నున్నవాఁడును, యత్నమును బలమును గల వాఁడును, గొప్పబుద్ధియు మిక్కిలివేగమును దొడ్డదేహమును గలవాఁడై ను నగు వానరోత్తమునిం గనిరి.

౧౯౹. సేనలతోఁగూడినవారైదుగురును హనుమంతుంగని న ల్దిక్కులనిలచి వారివారిభయంకరములగు నాయుధములతో నడ్డగించిరి.

౨౦, ౨౧౹. ఉక్కుచేఁ జేయంబడినవియు గట్టినైనవియుఁ బచ్చ నికొనలంగలవియు నల్లకలువరేకులవలె వెలుఁగుచుండునవియు నగు నైదు బాణములు దుర్ధరునిచే హనుమంతుని తలపై వేయంబడియెను. అట్లాయైదు బాణములచేఁ గొట్టంబడిన హనుమానుఁడు ఱంకెలువేయుచు ధ్వనిచేఁ బది దిక్కులను బగల్చుచు నాకాశమున కెగరెను.

౨౨౹. తోడనే బలశాలియగు దుర్ధరుండు రథమునుండి, ఎక్కిడిన వి ల్లుగొని కఱకగు బాణములు నూఱులకొలఁది వేయుచు నెదురుగానేగెను.

౨౩౹. అంతట హనుమంతుండు బాణముల జల్లుగురిపించుచున్న దు ర్ధరుని (వర్షించుచున్న మేఘములను వానకాలముయొక్క కడపటి వాయు దేవుండు నివారించునట్లు) వారించెను.

౨౪౹. పిమ్మట వాయుపుత్రుండు దుర్ధరునిచేఁ బీడింపఁబడినవాఁడై యాగ్రహించి మఱిమఱి యుద్ధము సేసెను. మేనును మిక్కిలి పెంచెను.

౨౫౹. వేగవంతుఁడగు హనుమంతుఁడు మిక్కిలి యెత్తుగనెగిరి, ప ర్వతముపైఁ బిడుగువడునట్లు రాక్షసునిరథముపైఁ బడియె.

౨౬౹. తోడనే నురుమైన యెనిమిదిగుఱ్ఱములనుగలదియు, విఱిగి న నొగయును విరసును గలదియునగు రథమునువిడిచి, ప్రాణములనువిడిచి నవాఁడై దుర్ధరుఁడు నేలంబడియె.

తం విరూపాక్ష యూపాక్షౌ దృష్ట్వా నిపతితం భువి।
సంజాతరోషౌ దుర్ధర్షా వుత్పేతతు రరిందమౌ॥ ౨౭

స తాభ్యాం సహసోత్పత్య విష్ఠితో విమలేంబరే।
ముద్గరాభ్యాం మహాబాహు ర్వక్ష స్యభిహతం కపిః॥ ౨౮

తయో ర్వేగవతో ర్వేగం వినిహత్య మహాబలః।
నిపపాత పునర్భూమౌ సుపర్ణ సమవిక్రమః॥ ౨౯

స సాలవృక్ష మాసాద్య తముత్పాట్య చ వానరః।
తావుభౌ రాక్షసౌ వీరౌ జఘాన పవనాత్మజః॥ ౩౦

తతస్తాం స్త్రీన్ హతాన్ జ్ఞాత్వా వానరేణ తరస్వినా।
అభిపేదే మహావేగః ప్రసహ్య ప్రఘసో హరిమ్॥ ౩౧

భాసకర్ణశ్చ సంక్రుద్ధ శ్శూలమాదాయ వీర్యవాన్।
ఏకతః కపిశార్దూలం యశస్విన మవస్థితమ్॥ ౩౨

పట్టసేన శితాగ్రేణ ప్రఘసః ప్రత్యయోధయత్।
భాసకర్ణశ్చ శూలేన రాక్షసః కపిసత్తమమ్॥ ౩౩

స తాభ్యాం విక్షతై ర్గాత్రై రసృగ్దిగ్ధ తనూరుహః।
అభవ ద్వానరః క్రుద్ధో బాలసూర్య సమప్రభః॥ ౩౪

సముత్పాట్య గిరేశ్శృంగం సమృగ వ్యాళపాదపమ్।
జఘాన హనుమాన్వీరో రాక్షసౌ కపికుంజరః॥ ౩౫

తత స్తేష్వవసన్నేషు సేనాపతిషు పంచసు।
బలం తదవశేషం చ నాశయామాస వానరః॥ ౩౬

౨౭౪. అట్లు నేలంగూల్పఁబడిన దుర్ధరునింగాంచి వికటాక్షవిరూపాక్షులు మిక్కిలి రోషముంగలవారై వానరునిమీఁది కెగిరిరి.

౨౮౪. శుద్ధమగు నాకాశమందున్నవాఁడును బలశాలియునగు వానరుఁ డారాక్షసులచే ముద్గరలను నాయుధములచే వక్షమ్మునం గొట్టఁబడినవాఁ డయ్యెను.

౨౯౪. గరుడుని వేగముంబోలు వేగముంగలవాఁడును బలశాలియునగు హనుమంతుఁ డాయిరువురు రాక్షసులయొక్కయు వేగము నణఁచి భూమిపై మరల దుమికెను.

౩౦౪. వాయుపుత్రుండగు నావీరుం డొక సాలవృక్షమును బెకలించి యారక్కసులనిద్దరను గొట్టెను.

౩౧౪. వేగవంతుఁడగు వానరునిచే నీరాక్షసులు ముగ్గురుం గూల్పఁబడుటంగని ప్రఘసుండు వేగమున నెదుర్కొనియెను.

౩౨౪, ౩౩౪. శూరుఁడగు భాసకర్ణుఁడు మిక్కిలికోపించి శూలముంగొని, ఒకచోటనిలచియున్న కీర్తిమంతుఁడగు హనుమంతు నెదిరించెను. ప్రఘసుండును గఱుకైన కొనసుగల పట్టిసముంగొని యెదిరించెను. వీరిద్దరును శూలపట్టిసములఁగొని యాతనితోఁబోరిరి.

౩౪౪. ఆయిరువురచేతఁ గొట్టంబడిన యంగములతోడ రక్తమునం బడెనిన రోమములుగలవాఁడై యావానరుఁడు గోపించి బాలసూర్యునితోఁ దుల్యమగు తేజముంగలవాఁ డయ్యెను.

౩౫౪. వీరుఁడును వానరోత్తముండును నగుహనుమంతుఁడు మృగములతోడను వృక్షములతోడను గూడినదియగు పర్వతశృంగమును బెల్లగించి రాక్షసుల నిద్దరను గొట్టెను.

౩౬౪. ఆసేనాపతు లయిదుగురును మృతినొందఁగా మిగిలియున్న సేనను వానరుండు నాశము సేసెను.

అశ్వై రశ్వా న్గజై ర్నాగాన్ యోధై ర్యోధాన్ రథై రథాన్।
స కపి ర్నాశయామాస సహస్రాక్ష ఇవాసురాన్॥ ౩౭

హతై ర్నాగై శ్చ తురగై ర్భగ్నాక్షై శ్చ మహారథైః।
హతై శ్చ రాక్షసై ర్భూమీ రుద్ధమార్గా సమంతతః॥ ౩౮

తతః కపి స్తాన్ ధ్వజినీపతీ న్రణే నిహత్య వీరాన్ సబలాన్ సవా
హనాన్ । సమీక్ష్య వీరః పరిగృహ్య తోరణం కృతక్షణః కాల
ఇవ ప్రజాక్షయే॥ ౩౯

ఇతి శ్రీమత్సుందరకాండే - షట్చత్వారింశస్సర్గః.

---

## సప్తచత్వారింశస్సర్గః.

సేనాపతీ న్పంచ స తు ప్రమాపితాన్ హనూమతా సాను చ
రాన్ సవాహనాన్ । సమీక్ష్యరాజా సమరోద్ధతోన్ముఖం కు
మార మక్షం ప్రసమైక్ష తాగ్రతః॥ ౧

స తస్య దృష్ట్యర్పణ సంప్రచోదితః ప్రతాపవా న్కాంచన చి
త్రకార్ముకః। సముత్పపాతాథ సదస్యుదీరితో ద్విజాతిముఖ్యై
ర్హవిషేవ పావకః॥ ౨

తతో మహద్బాలదివాకరప్రభం ప్రతప్తజాంబూనద జాలసం
తతమ్ । రథం సమాస్థాయ యయౌ సవీర్యవాన్ మహాహరిం
తంప్రతి నైరృతర్షభః॥ ౩

౩౭½. ఆహనుమంతుఁడు గుఱ్ఱములను గుఱ్ఱములతోడను, ఏనుఁగుల నేనుంగులతోడను భటులను భటులతోడను రథముల రథములతోడను గొట్టి యింద్రుఁడు రాక్షసులను నురుమాడునట్లు సైన్యమును నిస్సారము జేసెను.

౩౮½. చంపఁబడిన యేనుంగులచేతను గుఱ్ఱములచేతను రాక్షసులచేతను విఱిగినరథములచేతను భూమి యన్నియెడలఁ గప్పంబడియెను.

౩౯½. సేనలతోడను వాహనములతోడను సేనాపతులను యుద్ధమునం గూల్చి పిమ్మట నావీరుఁడగు వానరుఁడు తోరణస్తంభముం జెంది లయకాలమం దుత్సాహముతోఁగూడిన యమునివలె నుండెను.

ఇది నలువదియాఱవసర్గ.

---

## నలువదియేడవసర్గ.

౧. రాజగు రావణుఁడు హనుమంతునిచే, వాహనసమేతముగ సేనలతోడఁగూడను సేనానాయకు లైదుగురుం జంపఁబడుటవిని, యుద్ధమునకు సన్నద్ధుఁడై తనయెదుటనున్న యక్షుఁడనుకుమారునిం గనియెను.

౨. అంతట ప్రతాపవంతుఁడగు నక్షకుమారుఁడు, రావణుని చూపు తనపైసోఁకినమాత్రముననే ప్రేరేపింపఁబడినవాఁడై, బ్రాహ్మణోత్తములుచేయు నాహుతులచేఁ బెనుపంబడినయగ్నివలె నందమైన బంగారు వింటినిగలవాఁడై సభయందు నిలచెను.

౩,౪,౫,౬. పిమ్మట దొడ్డవాఁడును బలశాలియు రాక్షసోత్తముఁడును దేవతలతోఁ దుల్యమగు పరాక్రమముగలవాఁడును నగు నక్షుఁడు కుందనపుసోరణగండ్ల కాంతియొక్క మొత్తముచే నెడలేక వెలుంగుచున్నదియు బాలసూర్యుని కాంతివంటి కాంతినిగలదియు (౪) తపస్సుయొక్క

తత స్తపస్సంగ్రహ సంచయార్జితం ప్రతప్తజాంబూనద జా
ల శోభితమ్। పతాకినం రత్నవిభూషిత ధ్వజం మనోజ వాష్టా
శ్వవరై స్సుయోజితమ్॥ ౮॥

సురాసు రాధృష్య మసంగచారిణం రవిప్రభం వ్యోమ చరం
సమాహితమ్ । సతూణ మష్టాసి నిబద్ధబంధురం యథాక్ర
మావేశిత శ క్తితోమరమ్॥ ౯॥

విరాజమానం పరిపూర్ణవస్తునా సహేమదామ్నా శశిసూ
ర్యవర్చసా । దివాకరాభం రథ మాస్థిత స్తత స్సనిర్జగా మా
మరతుల్య విక్రమః॥ ౧౦॥

స పూరయన్ ఖం చ మహీంచ సా చలాం తురంగమాతంగ
మహారథస్వనైః । బలైస్సమేతై స్సహి తోరణస్థితం సమర్థ
మాసీన ముపాగమ త్కపిమ్॥ ౧౧॥

స తం సమాసాద్య హరిం హరీక్షణో యుగాంతకాలాగ్నిమి
వ ప్రజాక్షయే । అవస్థితం విస్మితజాతసంభ్రమ స్సమైక్షతా
క్షో బహుమాన చక్షుషా॥ ౧౨॥

స తస్య వేగం చ కపే ర్మహాత్మనః పరాక్రమం చారిషు పార్థి
వాత్మజః। విధారయన్ స్వం చ బలం మహాబలో హిమక్షయే
సూర్య ఇవాభి వర్ధతే॥ ౧౩॥

సంపాదనచే నాస్త్రింపఁబడినదియు, అపరంజిచే నిర్మింపఁబడిన గవాక్షములఁ ను గలిగి యొప్పుచున్నదియు, కెంపాలనుగలదియు రత్నములచే నలంకరింపంబడిన పెక్కెమునుగలదియు మనస్సునకుం గలయంతటివేగమును గలెనిమిదిగుఱ్ఱములను బూన్పఁబడినదియు (౫) దేవతలచేతను రాక్షసులచేతను దిరస్కరింపఁ బడరానిదియు, అంటఁబడక పోఁగలదియు సూర్యుని కాంతివంటి కాంతినిగలదియు, ఆకాశమునఁ దిరుగాడునదియు, అమ్ముఁ పొదులను గలదియు ఎనిమిదికత్తులను గలిగి సొంపైయున్నదియు, వరుసలుగ కనుంపంబడిన శక్తి తోమరము మొదలగు నాయుధములనుగలదియు(౬)బంగారపు కాంతులతోఁ గూడినదియునై చంద్రసూర్యులకాంతులను గ్రక్కుచున్న వస్తుసమూహముచే వెలుఁగుచున్నదియు సూర్యునింబోలినదియు నగు రథము నెక్కి యందుండి వానరోత్తముఁడగు హనుమంతునిమీఁది కేగెను.

౭. ఆయతుం డాకాశమును కొండలతోఁ గూడినదియగు భూమిని, గుఱ్ఱములయొక్కయు నేనుఁగులయొక్కయు రథములయొక్కయు ధ్వనులచేనిండించుచు మొత్తములయిన సేనలతోడ,శక్తిమంతుఁడును తోరణస్తంభముపైఁ గూర్చున్నవాఁడును నగుహనుమంతునిఁ జేరఁబోయెను.

౮. సింగపుచూపులవంటి చూపులుగలవాఁడగు నక్షుఁడు లోకములను నశింపఁజేయుసమయమున వెలుఁగునగ్నివలె వానరుని డాయంబోయి యాశ్చర్యముచేఁగలిగిన తొట్రుపాటుతోడను గౌరవముగల చూపుతోఁ జనుగాంచెను.

౯. గొప్పబలశాలియగు నారాజపుత్రుఁడు ధీరుఁడగు వానరునియొక్క వేగమును శత్రువులపైఁజూపునట్టి పరాక్రమమును దనబలమును గణించుచు మంచువిరిసినపిమ్మట వెలుఁగు సూర్యునివలె విజృంభించెను.

స జాతమన్యుః ప్రసమీక్ష్యవిక్రమం స్థిరం స్థిరస్సంయతి దుర్ని
వారణమ్ । సమాహితాత్మా హనుమంత మాహవే ప్రచోద
యామాస శరై స్త్రిభి శ్శితైః॥ ౧౦॥

తతః కపిం తం ప్రసమీక్ష్య గర్వితం జితశ్రమం శత్రు పరాజ
యోర్జితమ్ । అవైక్షతాక్ష స్సముదీర్ణ మానస స్సబాణపాణిః
ప్రగృహీత కార్ముకః॥ ౧౧॥

స హేమనిష్కాంగద చారుకుండల స్సమాససా దాశు పరా
క్రమః కపిమ్ । తయోర్బభూవా ప్రతిమస్సమాగమ స్సురాసు
రాణా మపి సంభ్రమప్రదః॥ ౧౨॥

ననాస భూమి ర్నతతాప భానుమా న్వవౌ న వాయుః ప్రచ
చాల చాచలః । కపేః కుమారస్య చ వీక్ష్య సంయుగం ననాద
చ ద్యౌ రుదధిశ్చ చుక్షుభే॥ ౧౩॥

తత స్సవీర స్సుముఖా న్పతత్రిణ స్సువర్ణపుంఖా న్సవిషాని
వోరగాన్ । సమాధిసంయోగ విమోక్షతత్త్వవి చ్ఛరా నథ
త్రీ న్కపిమూర్ధ్న్యపాతయత్॥ ౧౪॥

స తైశ్శరై ర్మూర్ధ్ని సమం నిపాతితైః క్షరన్నసృగ్దిగ్ధ వివృత్త
లోచనః । నవోదితాదిత్యనిభ శ్శరాంశుమా న్వ్యరాజ తా
దిత్య ఇవాంశుమాలికః॥ ౧౫॥

౧౦. ఆయక్షుఁడు మనోనిశ్చయముగలవాఁడై, నివారింపరాని పరాక్రమమును గనుంగొని యుద్ధమునం జలింపకనిలచి కఱకగు మూఁడుబాణములచే హనుమంతునింగొట్టి యుద్ధమునకుఁ బురికొల్పెను.

౧౧. పిమ్మట నక్షుఁడు, గర్వించినవాఁడును శ్రమలేనివాఁడును శత్రువుల భంగపెట్టుటయందు సమర్థుఁడును నగువానరునింగాంచి యుత్సహించినవాఁడై బాణములను జేతంగొని వింటినిధరించి మఱియుంగాంచెను.

౧౨. బంగారునాణెములచేఁ జేయంబడిన భుజకీర్తులను గిరీటమును గలవాఁడును దర్పముంగలవాఁడును నగునక్షుఁడు వానరోత్తమునిం దాయఁబోయెను. దేవతలకును రాక్షసులకునునేని భ్రాంతిని గలిగించునట్టిదియగు నెదుర్కోలు వారిరువురకుఁ గలిగెను.

౧౩. ఆహనుమంతునకు నక్షకుమారునకును జరుగుచున్నయుద్ధముంగాంచి భూమివణంకెను, సూర్యుఁడు వేఁడిమిచూపలేదు, గాలివీవదయ్యెను, కొండలూగులాడెను, ఆకాశముధ్వనించెను, సముద్రముఘోషించెను.

౧౪. ఆవల లక్ష్యమునెఱుంగుటయొక్కయు బాణములను గూర్చుటయొక్కయు శత్రువులపైనేయుటయొక్కయుఁ దత్త్వమునెఱింగినవాఁడగునక్షుఁడు,మంచికొనలుగలవియు ఱెక్కలనుగలవియు బంగారుపింజెలుగలవియు విషముతోఁగూడిన త్రాఁచులవలెనున్నవియు నగు మూఁడమ్ములను వానరునితలపై నేసెను.

౧౫. తలపైనొక్కమాఱుగఁ బ్రయోగింపంబడిన బాణములచేఁ గాఱుచున్న రక్తమునందడిసిన విప్పుగన్నులుగలవాఁడై బాలసూర్యుని వంటివాఁడగు నాతండు బాణములనుకిరణములచేఁ నొప్పినసూర్యునివలె నొప్పారెను.

తత స్స పింగాధిపమంత్రిస త్తమ స్సమీక్ష్య తం రాజవరాత్మజం రణే । ఉదగ్రచిత్రాయుధ చిత్రకార్ముకం జహర్ష చాపూర్యత చాహవోన్ముఖః॥ ౧౬॥

స మందరాగ్రస్థ ఇవాంశుమాలికో వివృద్ధకోపో బలవీర్య సంయుతః । కుమారమక్షం సబలం సవాహనం దదాహ నేత్రాగ్ని మరీచిభి స్తదా॥ ౧౭॥

తత స్స బాణాసన చిత్రకార్ముక శ్శరప్రవర్షో యుధి రాక్షసాంబుదః । శరా న్సుమోచాశు హరీశ్వరాచలే వలాహకో వృష్టిమి వాచలోత్తమే॥ ౧౮॥

తతః కపి స్తం రణచండవిక్రమం వివృద్ధతేజో బలవీర్య సంయుతమ్ । కుమారమక్షం ప్రసమీక్ష్య సంయుగే ననాద హర్షా ద్ఘనతుల్య విక్రమః॥ ౧౯॥

స బాలభావా ద్యుధి వీర్యదర్పితః ప్రవృద్ధమన్యుః క్షతజోప మేక్షణః । సమాససా దాప్రతిమం కపిం రణే గజో మహాకూప మివావృతం తృణైః॥ ౨౦॥

స తేన బాణైః ప్రసభంనిపాతితై శ్చకార నాదం ఘననాదనిస్స్వనః । సముత్పపా తాశు నభ స్సమారుతి ర్భుజోరువిక్షేపణ ఘోరదర్శనః॥ ౨౧॥

౧౬. అటుపై సుగ్రీవునిమంత్రులలోముఖ్యుఁడగు హనుమంతుఁడు భయంకరములయి నానావిధములయిన యాయుధములను విల్లునుగల రాక్షసరాజపుత్రుని యుద్ధమునఁగాంచి యుద్ధమున కుత్సహించినవాఁడై సంతోషించి పెరిగెను.

౧౭. బలదర్పములతోడఁగూడిన యాహనుమానుఁడు పెరిగిన కోపముంగలవాఁడై మందరపర్వతముయొక్క చివరనున్న సూర్యునివలె సొప్పి కన్నులనుండి వెడలుచున్న కోపాగ్నియొక్క జ్వాలలచే. సేనలతోడను వాహనములతోడనుగూడ నాయకుఁడనురాక్షసునిం గాల్చెను.

౧౮. పిమ్మట విల్లనునింద్రధనుస్సునుగలవాఁడును బాణములను జల్లుగలవాఁడును నగురాక్షసుఁడనుమేఘుఁడు హనుమంతుఁడను పర్వతముపై (కొండపై మేఘములువర్షించునట్లు) బాణములు వైచెను.

౧౯. తోడనే మేఘముతోఁ దుల్యమగు పరాక్రమముంగలవాఁడగు హనుమానుఁడు యుద్ధమున సహింపరాని ప్రతాపమునుగలవాఁడును, పెంపొందిన బలదర్పములుగలవాఁడును నగునక్షకుమారుని యుద్ధమునఁ గాంచి సంతోషించి సింహనాదము సేసెను.

౨౦. యుద్ధమున బలముచేగర్వించిన యారాక్షసుఁడు బాల్యముచేతఁ బెరిగినకోపముంగలవాఁడును రక్తముపలె నెఱ్ఱనైన కన్నులంగలవాఁడునునై కసవుచేఁ గప్పంబడినబావియందుఁ బ్రవేశించు నేనుంగువలె యుద్ధమున సాటిలేనివాఁడగు వానరునిం జేరఁబోయెను.

౨౧. మేఘధ్వనింబోలు సింహనాదముఁ జేయువాఁడగు హనుమంతుఁడు బలాత్కారముగా శత్రునిచే నేయబడిన బాణములతోడను కూడినవాఁడై సింహనాదము సేసెను. భుజములయొక్కయుఁ దొడలయొక్కయు విప్పుటతోడఁగూడ భీకరుఁడై తోఁచుచు నాకాశమున కెగిరెను.

సముత్పతన్తం సమభిద్రవ ద్బలీ సరాక్షసానాం ప్రవరః ప్రతా
పవాన్ । రథీ రథిశ్రేష్ఠతమః కిరన్ శరైః పయోధర శ్శైలమి
వాశ్మవృష్టిభిః॥ ౨౨॥

స తాన్ శరాం స్తస్య హరి ర్విమోక్షయన్ చచార వీరః పథి
వాయుసేవితే । శరాంతరే మారుతవ ద్వినిష్పత న్మనోజవ
స్సంయతి చండవిక్రమః॥ ౨౩॥

త మాత్తబాణాసన మాహవోన్ముఖం ఖ మాస్తృణంతం విశి
ఖై శ్శరోత్తమైః । అవైక్షతాక్షం బహుమాన చక్షుషా జగా
మ చింతాంచ స మారుతాత్మజః॥ ౨౪॥

తత శ్శరై ర్భిన్నభుజాంతరః కపిః కుమార వీరేణ మహాత్మనా
నదన్ । మహాభుజః కర్మవిశేషత త్త్వవి ద్విచింతయామాస ర
ణే పరాక్రమమ్॥ ౨౫॥

అబాలవ ద్బాలదివాకరప్రభః కరోత్యయంకర్మ మహన్మహాబ
లః । నచాస్య సర్వాహవకర్మశోభినః ప్రమాపణే మే మతి
రత్రజాయతే॥ ౨౬॥

అయం మహాత్మా చ మహాంశ్చ వీర్యత స్సమాహిత శ్చాతిసహ
శ్చ సంయుగే । అసంశయం కర్మగుణోదయా దయం సనాగ
యక్షై ర్మునిభిశ్చ పూజితః॥ ౨౭॥

౨౨. బలశాలియు రాక్షసులలో నుత్తముఁడును బ్రతాపవంతుఁడును రథమందున్నవాఁడును రథికులలో నుత్తమోత్తముఁడును నగు నక్షుఁడు (మేఘుఁడు వడగండ్లవానను బర్వతముపైఁ గురిపించునట్లు) హనుమంతునిపై బాణములేయుచు నెదురునడచెను.

౨౩. వీరుఁడును మనస్సుయొక్క వేగముంబోలు వేగముంగలవాఁడును యుద్ధమున నెదుర్కొనఁగూడని పరాక్రమముగలవాఁడును నగు హనుమంతుఁడు రాక్షసుని బాణములను విదిలించికొనుచు నాబాణములనడుమ గాలివలె సంచరించుచు నాకాశమార్గమున మెలంగెను.

౨౪. వాయుపుత్రుండగునాతఁడు వింటిని చేకొని యుద్ధసన్నద్ధుఁడుగనున్నవాఁడును బాణములచే నాకాశమునుగప్పుచున్నవాఁడును నగు నక్షునిం గౌరవదృష్టితోఁ గాంచెను. చింతిల్లెను.

౨౫. అటుపై దొడ్డవాఁడగు నక్షకుమారుఁడను శూరునిచే బ్రద్దలు సేయంబడిన ఱొమ్ముంగలవాఁడై గొప్పభుజములుగలవాఁడును, కర్మవిశేషముయొక్క స్వరూపము నెఱింగినవాఁడును నగువానరుఁడు సింహనాదము సేయుచు రాక్షసుని బలముంగూర్చి యోచించెను.

౨౬. వీఁడు మిక్కిలి బలశాలి, బాలసూర్యునింబోలు కాంతినిగలవాఁడు, పెద్దవాండ్రు చేయునట్లె యుద్ధముయొక్క సన్నాహమును మిక్కిలిచేయుచున్నవాఁడు, యుద్ధమున సర్వవిధవ్యాపారములచేతను బ్రకాశించుచున్నవాఁడగు నీబాలునిం జంపుటకు నాకు బుద్ధిపుట్టకున్నది.

౨౭. వీఁడు దొడ్డవాఁడు, పరాక్రమముచే నధికుఁడు యుద్ధమందు గడిదేఱినవాఁడును సహనముంగలవాఁడును, వీఁడు పౌరుషయుతమగు కార్యములపెంపుచే యక్షులచేతను మునులచేతను బూజింపఁబడినవాఁడును నగును. ఇందుకు సందియము లేదు.

పరాక్రమోత్సాహ వివృద్ధమానస స్సమీక్షతే మాం ప్రము
ఖాగత స్థ్సితః । పరాక్రమో హ్యస్య మనాంసి కంపయే త్సు
రాసురాణా మపి శీఘ్రగామినః॥ ౨౮॥

నఖల్వయం నాభిభవే దుపేక్షితః పరాక్రమో హ్యస్య రణే వివ
ర్ధతే । ప్రమాపణం త్వేవ మమాస్య రోచతే నవర్ధమానోగ్ని
రుపేక్షితుం క్షమః॥ ౨౯॥

ఇతి ప్రవేగంతు పరస్య తర్కయ న్స్వకర్మయోగం చ విధా
య వీర్యవాన్। చకార వేగం తు మహాబల స్తదా మతించ చక్రే
స్యవధే మహాకపిః॥ 30॥

స తస్య తా నష్టహయా న్మహాజవాన్ సమాహితాన్ భారస
హా న్వివర్తనే । జఘానవీరః పథి వాయుసేవితే తలప్రహారైః
పవనాత్మజః కపిః॥ 3౧॥

తత స్తలేనాభిహతో మహారథః స తస్య పింగాధిపమంత్రిని
ర్జితః । ప్రభగ్ననీడః పరిముక్తకూబరః పపాత భూమౌ హత
వాజి రంబరాత్॥ 3౨॥

స తం పరిత్యజ్య మహారథో రథం సకార్ముకః ఖడ్గధరః ఖము
త్పతన్ । తపోభియోగా దృషి రుగ్రవీర్యవా న్విహాయ దేహం
మరుతా మివాలయమ్॥ 33॥

౨౮. దర్పముచేతను యత్నముచేతను పెనుపొందిన మనస్సుగల వాఁడును, ఎదురుగావచ్చినవాఁడునునై ననుంజూచుచున్నవాఁడును, శీఘ్రమునం బోవుచున్నవాఁడునునగు వీనిపరాక్రమము దేవతలకేనియు రాక్షసులకేనియు మనంబులఁ జలింపఁజేయఁజాలును.

౨౯. యుద్ధమున వృద్ధినొందుచున్న పరాక్రమముంగలవీఁ డుపేక్షింపఁబడఁదగినవాఁడుగాఁడు. అట్లు చేసినచో నవమానపఱుపక మానఁడు. నాకో వీనికో చావు సమ్మతింపఁదగును. వృద్ధినొందుచున్నయగ్నినిం జూచియుఁజూడక యుండరాదు.

౩౦. బలదర్పములంగలవాఁడగు హనుమంతుఁడు శత్రువగురాక్షసుని బలముంగూర్చి యిట్లుతర్కించుచుఁ దానుజేయందగుపనియు యోచించుకొని యప్పుడతనిం గూల్చుట బాగని మనంబున నిశ్చయించికొనియెను.

౩౧. వీరుఁడును వాయుపుత్రుఁడును నగుహనుమంతుఁడు మిక్కిలివేగమును బలమునుగలవియు భారమునీడ్వఁగలవియు నగునెనిమిదిగుఱ్ఱములను నాకాశమార్గమున నఱచేతిదెబ్బతో నడఁచెను.

౩౨. అట్లు చేతిచేనడువంబడినదై రాక్షసునియొక్క గొప్పతేరు హనుమంతునిచే జయింపఁబడి విఱిగినగూళ్ళనుగలదియుఁ దునిసిన నొగను గలదియుఁ జదుపంబడిన గుఱ్ఱములనుగలదియునై యాకాశమునుండి నేలం బడియెను.

౩౩. మహారథుఁడును భయంకరమగు బలముంగలవాఁడును నగు యతఁ డారథమునువదలి వింటెని ఖడ్గమునుగొని యాకాశమున కెగరి తపశ్శక్తిచే దేహమునువిడిచి స్వర్గమునకుం జనుచున్నఋషివలె నొప్పారెను.

తతః కపి స్తం విచరంతమంబరే పతత్రిరా జానిలసిద్ధసేవితే
సమేత్య తం మారుతతుల్యవిక్రమః క్రమేణజగ్రాహ స పాద
యో ర్దృఢమ్॥ ౩౫

స తం సమావిధ్య సహస్రశః కపి ర్మహోరగంగృహ్య ఇవాం
డజేశ్వరః । ముమోచవేగా త్పితృతుల్యవిక్రమో మహీతలే
సంయతి వానరోత్తమః॥ ౩౬

స భగ్నబాహూరు కటీశిరోధరః క్షరన్న సృ క్నిర్మథితాస్థిలో
చనః । సభగ్నసంధిః ప్రవికీర్ణబంధనో హతఃక్షితౌ వాయు సు
తేన రాక్షసః॥ ౩౭

మహాకపి ర్భూమితలే నిపీడ్య తం చకార రక్షోధిపతే ర్మహ
ద్భయమ్ ౩౮

మహర్షిభి శ్చక్రచరై ర్మహావ్రతై స్సమేత్యభూతైశ్చ సయక్షప
న్నగైః। సురైశ్చ సేంద్రై ర్భృశజాతవిస్మయై ర్హతే కుమారే
స కపి ర్నిరీక్షితః॥ ౩౯

నిహత్య తం వజ్రిసుతోపమప్రభం కుమారమక్షం క్షతజోప
మేక్షణమ్ । తమేవ వీరో భిజగామ తోరణం కృతక్షణః కా
లఇవ ప్రజాక్షయే॥ ౪౦

ఇతి శ్రీమత్సుందరకాండే - సప్తచత్వారింశస్సర్గః.

౩౪. పిమ్మట వాయువుతోఁదుల్యమగు పరాక్రమముం గలవాఁడగు హనుమంతుఁడు గరుత్మంతునిచేతను వాయువుచేతను సేవింపఁబడుచున్న యాకాశమున సంచరించుచున్న రాక్షసునిం జేరఁబోయి పాదముల నొడిసిపట్టుకొనియెను.

౩౫. తండ్రితోఁ దుల్యమగు పరాక్రమముంగలవాఁడును వానరోత్తముఁడును నగుహనుమంతుఁడు (గరుడుండు సర్పంబుంబట్టుకొన్నట్లు) యుద్ధమునం బట్టుకొని వేయిభంగుల మర్దించి భూమిపై వేగమున వైచెను.

౩౬, ౩౬½. ఆయక్షకుమారుఁడు హనుమంతునిచే విఱుగఁగొట్టఁబడిన భుజములు తొడలు నడుము కంఠమును గలవాఁడై కాఱుచున్న రక్తముచేనొప్పిన నలిగినయెముకలుం గన్నులునుగలవాఁడై తునిసిపీడిన రాక్షసుని భూమిపైఁబెట్టి నలియంద్రొక్కి హనుమంతుఁడు రాక్షసరాజునకు గొప్పభీతిని బుట్టించెను.

౩౭½. అక్షకుమారుండు సంపఁబడఁగా నాకాశమందుఁ దిరుగాడుచున్నవారును నియతవ్రతములు గలవారును నగుగొప్పఋషులచేతను, యక్షులతోడను సర్పములతోడను గూడినభూతములచేతను, ఆశ్చర్యముం జెందినవారై దేవేంద్రసహితులైయున్న దేవతలచేతను హనుమంతుఁడు ఱానిచూడంబడినవాఁ డయ్యెను.

౩౮½. వీరుండగుహనుమంతుఁడు దేవేంద్రపుత్రుని తేజముతోఁ దుల్యమగు తేజముంగలవాఁడును రక్తముంబోలు కన్నులుగలవాఁడును నగు నక్షునిం దునిమి లయకాలమందు సంతోషముచే నొప్పినయమునివలె నెప్పటియట్లు తోరణస్తంభముం జేరెను.

ఇది నలువది యేడవసర్గ.

## అష్ట చత్వారింశస్సర్గః.

తత స్స రక్షోధిపతి ర్మహాత్మా హనూమ తాక్షే నిహతే కు
మారే । మనస్సమాధాయ తదేంద్రకల్పం సమాదిదే శేంద్ర
జితం సరోషమ్॥ ౧॥

త్వమస్త్రవి చ్ఛస్త్రవిదాంవరిష్ఠ స్సురాసురాణా మపి శోక
దాతా । సురేషు సేంద్రేషుచ దృష్టకర్మా పితామహా రాధన
సంచితాస్త్రః॥ ౨॥
తవాస్త్రబల మాసాద్య నాసురా నమరుద్గణాః।
న శేకుస్స మరేస్థాతుం సురేశ్వర సమాశ్రితాః॥ ౩॥
నకశ్చి త్త్రిషులోకేషు సంయుగే నగతశ్రమః।
భుజవీ ర్యాభిగు ప్తశ్చ తపసా చాభిరక్షితః॥ ౪॥
దేశకాల విభాగజ్ఞ స్త్వమేవ మతిస త్తమః। ౪౫
న తే స్త్యశక్యం సమరేషు కర్మణా న తే స్త్యకార్యం మతిపూ
ర్వమంత్రణే । నసో స్తికశ్చి త్త్రిషుసంగ్రహేషువై నవేద య
స్తే స్త్రబలం బలం చ తే॥ ౫॥
మమానురూపం తపసోబలంచ తే పరాక్రమ శ్చాస్త్రబలంచ
సంయుగే। న త్వాం సమాసాద్య రణావమర్దే మనశ్శ్రమం
గచ్ఛతి నిశ్చితార్థమ్॥ ౬॥

## నలువది యెనిమిదవసర్గ.

౧. పిమ్మటదొడ్డవాఁడగు రావణుఁడు హనుమంతునిచే నక్షుఁడు సంపఁబడినందులకు వగచివగచి మనస్సును కుదురు పఱచుకొని, దేవేంద్రునితోఁ దుల్యుఁడును రోషముతోఁ గూడినవాఁడును నగు నింద్రజిత్తును బనిచెను.

౨. మనతాతయగు బ్రహ్మదేవునింగొలిచి సంపాదించిన బాణములను గలవాఁడవగునీవు విలువిద్యనేర్చినవారిలో నుత్తముఁడవు, దేవేంద్రునితోడి యుద్ధములయందు దర్పముం జూపినవాఁడవు. దేవతలను రాక్షసుల నేడ్పించినవాఁడవు.

3. నీబాణములనెదిరించి రాక్షసులుగాని, దేవేంద్రునిప్రాపున నున్న దేవతలసమూహములు గాని యుద్ధమున నిలువనేరని వయ్యెను.

౪, ౪½. యుద్ధమున శ్రమచెందనివాఁడు మూఁడులోకములయందును గలుగఁడు. నీవొక్కఁడవే భుజబలముచేత రక్షించికొనఁ బడినవాఁడవు తపస్సుచేఁ గాపాడికొనఁబడినవాఁడవు కాలదేశముల నెఱింగినవాఁడవును బుద్ధిమంతుఁడవును.

౫½. యుద్ధమునందు నిచేఁదీర్పరాని కార్యము గలుగదు. బుద్ధిపూర్వకముగ యోచించుటయందు నీకులోఁబడనిది లేదు మూఁడులోకములయందును నీబాణములబలమును దేహబలమును దెలిసికొననివాఁడు గలుగఁడు.

౬½. నీయొక్కతపోబలమును యుద్ధమున బాణములబలమును నీదర్పమును ననుంబోలినవియేయగును. యుద్ధక్రీడయందునామనస్సు నిన్నుఁగూర్చి యెప్పుడును నిశ్చయింపఁబడిన గెలుపునుగలదిగావున శ్రమచెందుట లేదు.

నిహతాః కింకరా స్సర్వే జంబుమాలీచ రాక్షసః॥ ౭॥
అమాత్యపుత్రా వీరాశ్చ పంచసేనాగ్ర యాయినః।
బలాని సుసమృద్ధాని సాశ్వనాగ రథానిచ॥ ౮॥
సహోదర స్తే దయితః కుమారో౽క్షశ్చ సూదితః।
నహి తేష్వేవ మే సారో య స్త్వ య్యరినిషూదన॥ ౯॥
ఇదం హి దృష్ట్వా మతిమ న్మహద్బలం కపేః ప్రభావం చ పరా
క్రమం చ । త్వ మాత్మనశ్చాపి సమీక్ష్య సారం కురుష్వ వేగం
స్వబలానురూపమ్॥ ౧౦॥
బలావమర్ద స్త్వయి సన్నికృష్టే యథాగతే శామ్యతి శాంతశ
త్రౌ । తథా సమీక్ష్యాత్మబలం పరం చ సమారభ స్వాస్త్ర
విదాం వరిష్ఠ॥ ౧౧॥
న వీర సేనా గణశో౽చ్యవంతి నవజ్రమాదాయ విశాలసారమ్
న మారుత స్యాస్యగతేః ప్రమాణం నచాగ్నికల్పః కరణేన
హంతుమ్॥ ౧౨॥
త మేవ మర్థం ప్రసమీక్ష్య సమ్యక్ స్వకర్మసామ్యాద్ధి సమా
హితాత్మా । స్మరంశ్చ దివ్యం ధనుషో౽స్త్రవీర్యం వ్రజాక్షతం
కర్మ సమారభస్వ॥ ౧౩॥
న ఖ ల్వియం మతిశ్శ్రేష్ఠా యత్త్వాం సంప్రేషయామ్యహమ్।
ఇయం చ రాజధర్మాణాం క్షత్రస్య చ మతిర్మతా॥ ౧౪॥

౭, ౮, ౯. కింకరులను రాక్షసులందఱును జంబుమాలియు మంత్రిపుత్రులును శూరులగు సేనానాయకులైదుగురును జంపంబడిరి. గుఱ్ఱములతో రథములతో నేనుంగులతోఁగూడిన సంపూర్ణములైన సేనలును నీకిష్టుఁడగుతమ్ముఁడును నాకుబిడ్డఁడును నగునక్షుండును గూల్పంబడెను. శత్రువులను హరించు స్వభావముం గలవాఁడా! నీయందు నాకుంగలయంతనమ్మిక మీఁదఁజెప్పంబడినవారిలో నెవ్వరియందును లేదుసుమా!

౧౦. ఓబుద్ధిమంతుఁడా! ఆవానరునియొక్క యపారమగు బలమును శక్తియు దర్పమును నిట్టిదిగానెఱింగి నీయొక్క బలమును దెలిసికొని నీ బలమునకుఁ దగినవేగమును గలుగవలయు!

౧౧. విలుకాండ్రలో నుత్తముఁడా! అడంపఁబడినశత్రువులనుగల వాఁడవగునీవు వానరుని సమీపించినపుడు సేనలు నాశమగుట తప్పనట్లు యూహించి నీబలమునువైరిబలమునుదెలిసి మఱి కయ్యమునకుడాయుము.

౧౨. ఓశూరుఁడా! మొత్తములుమొత్తములుగనున్న సేనల నేర్పించువాఁడగు నీవానరునివిషయమున సేనలరక్షించుకొనుట నైకసాధ్యము. తగ్గిన బలమునుగలదియగు వజ్రాయుధమునుబూని వానిని జేరఁబోకుము. ఈవానరుని వేగమునకు మితిలేదు, ఇంతటివేగము వాయుదేవునకుంగూడలేదుసుమా! అగ్నితోఁదుల్యమగు తేజముం గలయాతని నాయుధములచేఁ గొట్టుట యసాధ్యము.

౧౩. ఆవిషయమును బాగుగనెఱింగి, నీపనికిందగునట్లు మనోనిశ్చయముంగలిగి దేవసంబంధమగు ధనుస్సుయొక్కయు బాణములయొక్కయు బలమునుదలంచుచుం జనుమా! భంగముగలుగనికార్యము నారంభింపుము.

౧౪. ఇట్టిభీకరమగుయుద్ధమునకు నిన్నుంబంపుట యనుతలంపు మంచిదికాదుసుమా! ఇట్టితలంపు క్షత్రియులకును క్షత్రియప్రవృత్తి నవలంబించిన యితరులకును సమ్మతమైనది.

నానాశస్త్రైశ్చ సంగ్రామే వైశారద్య మరిందమ।
అవశ్యమేవ బోద్ధవ్యం కామ్యశ్చ విజయో రణే॥ ౧౫॥

తతః పితు స్తద్వచనం నిశమ్య ప్రదక్షిణం దక్షసుతప్రభావః।
చకార భర్తార మదీనసత్త్వో రణాయవీరః ప్రతిపన్నబుద్ధిః॥౧౬॥

తత స్తైస్స్వగణై రిష్టై రింద్రజి త్ప్రతిపూజితః।
యుద్ధోద్ధతః కృతోత్సాహ స్సంగ్రామం ప్రత్యపద్యత॥ ౧౭॥

శ్రీమా న్పద్మపలాశాక్షో రాక్షసాధిప తేస్సుతః।
నిర్జగామ మహాతేజా స్సముద్రఇవ పర్వసు॥ ౧౮॥

స పక్షిరాజోపమ తుల్యవేగై ర్వ్యాళై శ్చతుర్భి స్సిత తీక్ష్ణదం
ష్ట్రైః। రథంసమాయుక్త మసంగవేగం సమారురో హేంద్ర
జి దింద్రకల్పః॥ ౧౯॥

స రథీ ధన్వినాం శ్రేష్ఠ శ్శస్త్రజ్ఞో స్త్రవిదాం వరః।
రథేనా భియయౌ క్షిప్రం హనుమా న్యత్రసోభవత్॥ ౨౦॥

సతస్య రథనిర్ఘోషం జ్యాస్వనం కార్ముకస్య చ।
నిశమ్య హరివీరోసౌ సంప్రహృష్టతరో భవేత్॥ ౨౧॥

సుమహచ్చాప మాదాయ శితశల్యాంశ్చ సాయకాన్।
హనుమంత మభిప్రేత్య జగామ రణపండితః॥ ౨౨॥

౧౫. శత్రువుల నడఁకించువాఁడా! యుద్ధమునం బెక్కాయుధము
లచే నేర్పుచూపుశక్తినీకుఁగలదు. కావున నీవుతప్పకయుద్ధము సేయఁ దగు
దువు. యుద్ధమున గెలువు గోరందగినదిసుమా!

౧౬. పిమ్మట దక్షపుత్రుని ప్రభావమువంటి ప్రభావముంగలవాఁ
డును, కొదువకాని బలముంగలవాఁడును శూరుఁడును నగు నింద్రజిత్తు తం
డ్రిపలుకులువిని, యుద్ధమునకుం బూనిన బుద్ధిగలవాఁడై ప్రభునకుఁ బ్ర
దక్షిణము చేసెను.

౧౭. పిమ్మట, యుద్ధమున కీర్తినవాఁడగు నింద్రజిత్తు తన సేనలచే
గౌరవింపఁబడినవాఁడై యుత్సహించి యుద్ధమునకుఁ గదిసెను.

౧౮. కాంతిగలవాఁడును, తామరరేకులవంటి కన్నులంగలవాఁ
డును మిక్కిలి ప్రతాపముగలవాఁడును నగురాక్షసరాజపుత్రుఁడు పర్వ
ములయందు సంద్రము పొంగునటుల వెడలెను.

౧౯. ఇంద్రునింబోలినవాఁడగు నింద్రజిత్తు, గరుత్మంతునితోఁ బో
ల్పఁదగిన వేగముం గలవియు, కఱకైతెల్లనైన కోఱలనుగలవియు నగు నాల్గు
దుష్టమృగములను బూన్పఁబడిన వేగవంతమగు రథము నెక్కెను.

౨౦. రథమందెక్కినవాఁడును, విలుకాండ్రలో మేటియు, ఖడ్గము
మొదలగు నాయుధములప్రయోగము నెఱింగినవాఁడును బాణముల నేయు
వారిలో నేర్పరియు నగునింద్రజిత్తు హనుమంతుఁ డున్నచోటునకు శీఘ్ర
మునం జనియెను.

౨౧. శూరుఁడగు నావానరోత్తముఁ డింద్రజిత్తుయొక్క రథధ్వనిని,
వింటినారియొక్క శబ్దమును విని మిగుల సంతోషించినవాఁ డయ్యెను.

౨౨. యుద్ధశాస్త్రమునఁ బండితుఁడగు నారాక్షసుఁడు గొప్పవిం
టిని, కఱకైనకొనలుగల బాణములనుగొని హనుమంతుని మీఁది కేగెను.

తస్మిం స్తతస్సంయతి జాతహర్షే రణాయ నిర్గచ్ఛతి బాణపా
ణౌ। దిశశ్చసర్వాః కలుషాబభూవు ర్మృగాశ్చ రౌద్రా బహు
ధా వినేదుః॥ ౧౩॥

సమాగతా స్తత్ర తు నాగయక్షా మహర్షయ శ్చక్రచరాశ్చ
సిద్ధాః। నభ స్సమావృత్య చ పక్షిసంఘా వినేదు రుచ్చైః పర
మ ప్రహృష్టాః॥ ౧౪॥

ఆయాంతం సరథం దృష్ట్వా తూర్ణ మింద్రజితం కపిః।
వినినాద మహానాదం వ్యవర్ధత చ వేగవాన్॥ ౧౫॥

ఇంద్రజిత్తు రథందివ్య మాస్థిత శ్చిత్రకార్ముకః।
ధను ర్విస్ఫారయామాస తటిదూర్జిత నిస్స్వనమ్॥ ౧౬॥

తత స్సమేతా వతితీక్ష్ణవేగౌ మహాబలౌ తౌ రణనిర్విశంకౌ।
కపిశ్చ రక్షోధిపతేశ్చ పుత్ర స్సురాసురేంద్రావివ బద్ధవైరౌ॥

స తస్య వీరస్య మహారథస్య ధనుష్మత స్సంయతి సమ్మతస్య।
శరప్రవేగం వ్యహనత్ప్రవృద్ధ శ్చచారమార్గే పితురప్రమేయః॥

తత శ్శరా నాయతతీక్ష్ణశల్యాన్ సుపత్రిణః కాంచనచిత్రపుం
ఖాన్। ముమోచ వీరః పరవీరహంతా సుసన్నతాన్ వజ్రనిపా
తవేగాన్॥ ౧౯॥

౨౩. అట్లాతండు యుద్ధమున నుత్సహించి బాణములనుగొని వెళ్ళుచుండఁగా నన్నిదిక్కులుకలతనొందెను, మృగములు నానావిధముల భయంకరములగు ధ్వనులుచేసెను.

౨౪. నాగులును యక్షులును మహాఋషులును, చక్రములం జరియించు సిద్ధులును యుద్ధరంగమును జేరవచ్చి యాకాశమునఁ గ్రమ్మినిలచిరి. పక్షిసమూహములును బిగ్గర ధ్వనులుచేసెను.

౨౫. ఆవానరుఁడు, రథసహితుఁడై వేగమునవచ్చుచున్న యింద్రజిత్తునుగాంచి సింహనాదము నేసెను. మేను వెంచెను.

౨౬. దేవసంబంధమగు రథమునయున్నవాఁడును, విచిత్రమగు విల్లుగలవాఁడును నగునింద్రజిత్తు మేఘధ్వనింబోలు ధ్వనినిగల ధనుస్సును మ్రోయించెను.

౨౭. పిమ్మట సహింపఁగూడని వేగముంగలవారును బలవంతులును నగుహనుమంత రావణపుత్రులు యుద్ధమున శంకలేనివారై దేవేంద్రరాక్షసేంద్రులవలెఁ దీఱనివైరముతోడం గవిసిరి.

౨౮. ఆహనుమంతుఁడు మేను వెంచి, శూరుఁడును మహారథుఁడును నగురాక్షసునియొక్క బాణములవేగము నలక్ష్యముచేసెను. వాయుమార్గమున సంచరించెను.

౨౯. అటుపై శత్రువీరులహరించువాఁడును శూరుఁడునునగు నింద్రజిత్తు దీర్ఘములై కఱకులైనవియగు కొనలుగలవియు, మంచిఱెక్కలుగలవియు, బంగారముచేఁ జేయంబడి విచిత్రములైన పింజలు గలవియు, మంచివంపులుగలవియు, వజ్రాయుధముంబోలు బెట్టగుపాటునుగలవియు నగుబాణములను వైచెను.

తతస్తు తత్స్యందన నిస్స్వనం చ మృదంగ భేరీ పటహస్వనం
చ । వికృష్యమాణ స్య చ కా ర్ముకస్య నిశమ్య ఘోషం పునరు
త్పపాత॥ ౩౦॥

శరాణా మంతరే ష్వాశు వ్యవ ర్తత మహాకపిః।
హరి స్తస్యాభిలక్ష్యస్య మోఘయ౯ లక్ష్యసంగ్రహమ్॥ ౩౧॥

శరాణా మగ్రత స్తస్య పున స్సమభివ ర్తత।
ప్రసార్యహస్తౌ హనుమా నుత్పపా తానిలాత్మజః॥ ౩౨॥

తావుభౌ వేగసంపన్నౌ రణకర్మ విశారదౌ।
సర్వభూత మనోగ్రాహి చక్రతు ర్యుద్ధ ము త్తమమ్॥ ౩౩॥

హనూమతో వేద న రాక్షసోంతరం నమారుతి స్తస్యమహా
త్మనోంతరమ్ । పరస్పరం నిర్విషహౌ బభూవతు స్సమేత్య తౌ
దేవసమాన విక్రమౌ॥ ౩౪॥

తతస్తు లక్ష్యే స విహన్యమానే శరేష్వమోఘేషు చ సంపత
త్సు । జగామ చింతాం మహతీం మహాత్మా సమాధిసంయోగ
సమాహితాత్మా॥ ౩౫॥

తతో మతిం రాక్షసరాజసూను శ్చకార తస్మి౯ హరివీరము
ఖ్యే। అవధ్యతాం తస్యకపే స్సమీక్ష్య కథంనిగచ్ఛే దితి నిగ్రహా
ర్థమ్॥ ౩౬॥

౩౦. పిమ్మట నారాక్షసుని రథధ్వనియు మద్దెలమొదలగు వాద్యములధ్వనియు నీడ్వఁబడుచున్న వింట్లయొక్కధ్వనియు విని హనుమంతుఁడు మరలనెగరెను.

౩౧. గొప్పవానరుఁడగు హనుమంతుఁడు గుఱియం దుండువస్తువుపై నేయనేర్చినవాఁడగు నింద్రజిత్తుయొక్క గుఱినుండితొలఁగి వానిబాణములను వమ్ముసేయుచు బాణములనడుమ తిరుగుచుండెను.

౩౨. వాయుపుత్రుఁడు రాక్షసుని బాణములకెదుటఁ జేతులుసాచి ముందరికి వచ్చుచుండెను. మీఁదికెగరెను.

౩౩. మిక్కిలివేగమునుగలవారును, యుద్ధకార్యములయందు నేర్పరులును నగునింద్రజిత్తును హనుమంతుఁడును సర్వభూతములయొక్కయు మనస్సుల నాకర్షించునట్టి గొప్పయుద్ధమును జేసిరి.

౩౪. రాక్షసుఁడు హనుమంతునియొక్కబలిమి యీపాటిదని తెలియంగఁడయ్యెను. బలశాలియగు నింద్రజిత్తుయొక్క సారమును హనుమంతుండును దెలియఁడయ్యెను. దేవతలతోఁ దుల్యమగు విక్రమమునుగల యీయిద్దరు నొండొరులనెదుర్కొని యుగ్రులైరి.

౩౫. పిమ్మట వ్యర్థములుగాని బాణములు పైఁబడుచున్నను వానికిగుఱియైనహనుమంతుఁ డాబాణములకుఁ దొలఁగుచురాఁగా, గుఱిచూచుట యందును బాణములేయుటయందును మనస్సు నిలిపినవాఁడగు నాబలశాలియగురాక్షసుఁడు గొప్పచింతను బొందెను.

౩౬. అటుపై రాక్షసరాజపుత్రుఁడగు నింద్రజిత్తు, వానరుండు నావునకు లోఁబడఁకుండుటను గనుంగొని వానరోత్తముఁడగు హనుమంతునిం దిరస్కరించుటయేనియు నసాధ్యమా ! అని తలంచెను.

తతః పైతామహం వీర స్సో౽స్త్ర మస్త్రవిదాం వరః।
సందధే సుమహాతేజా స్తం హరిప్రవరం ప్రతి॥ ౩౭॥

అవధ్యో౽య మితి జ్ఞాత్వా త మస్త్రేణాస్త్రతత్త్వవిత్।
నిజగ్రాహ మహాబాహు ర్మారుతాత్మజ మింద్రజిత్॥ ౩౮॥

తేనబద్ధ స్తతో౽స్త్రేణ రాక్షసేన స వానరః।
అభవ న్నిర్విచేష్ట శ్చ పపాతచ మహీతలే॥ ౩౯॥

తతో౽వబుద్ధ్వా స తదా౽స్త్రబంధం ప్రభోః ప్రభావా ద్విగతా
త్మవేగః। పితామహానుగ్రహ మాత్మనశ్చ విచింతయామాస
హరిప్రవీరః॥ ౪౦॥

తత స్స్వాయంభువై ర్మంత్రై ర్బ్రహ్మాస్త్ర మభిమంత్రితమ్।
హనుమాం శ్చింతయామాస వరదానం పితామహాత్॥ ౪౧॥

న మే౽స్త్రబంధస్యచ శక్తిర స్తి విమోక్షణే లోకగురోః ప్రభా
వాత్। ఇత్యేవమత్వా విహితో౽స్త్రబంధో మయా౽౽త్మయోనే
రనువర్తితవ్యః॥ ౪౨॥

స వీర్య మస్త్రస్య కపిర్విచార్య పితామహానుగ్రహ మాత్మన
శ్చ। విమోక్షశక్తిం పరిచింతయిత్వా పితామహాజ్ఞా మనువ
ర్తతే స్మ॥ ౪౩॥

అస్త్రేణాపి హి బద్ధస్య భయం మమ నజాయతే।
పితామహా మహేంద్రాభ్యాం రక్షిత స్యానిలేన చ॥ ౪౪॥

౩౭. శూరుఁడును బాణములప్రయోగము నేర్చినవారిలో సత్తముఁడును, మిక్కిలి ప్రతాపముగలవాఁడును నగునింద్రజిత్తు హనుమంతునిమీఁదనేయ బ్రహ్మాస్త్రముం గూర్చెను.

౩౮. బాణముల స్వభావము నెఱిఁగిన వాఁడును బలశాలియునగు నింద్రజిత్తు 'ఈవానరుఁడు చావునకులోఁబడఁ' డని తెలిసి యాతనిం బ్రహ్మాస్త్రముచేఁ బట్టెను.

౩౯. పిమ్మట నా రాక్షసేంద్రునిచే బ్రహ్మాస్త్రముచేఁ గట్టఁబడిన వాఁడై వ్యాపారము లుడిగినవాఁడయ్యెను. మఱియు భూమిపైఁబడియెను.

౪౦. అట్లుపడినవాఁడై వానరోత్తముఁ డప్పుడు దానస్త్రముచేఁ గట్టఁబడుటనెఱింగి, శిక్షించుటకును రక్షించుటకును దక్షుఁడగు బ్రహ్మదేవునియొక్క మహిమవలనఁ దనశక్తితగ్గినదిగాఁగా బ్రహ్మదేవునియొక్క యనుగ్రహమునుగూర్చి చింతించెను.

౪౧. పిమ్మట బ్రహ్మదేవునిసంబంధమగు మంత్రముల బలిమిచేఁ దనపై బ్రహ్మాస్త్రము ప్రయోగింపఁబడుటనెఱింగి బ్రహ్మదేవునివలన వరమును బొందుటను దలంచెను.

౪౨. 'లోకములకు గురుండగు బ్రహ్మదేవునియొక్క మాహాత్మ్యమువలనఁ గలిగినదియగు నీయస్త్రమువలనిబంధమును వదలించికొన నాకు శక్తిలేదు' అనితలంచి దీనికిలోఁబడి యుండవలసిన దయ్యెను.

౪౩. ఆహనుమంతుఁడు బ్రహ్మాస్త్రముయొక్క బలమును, బ్రహ్మదేవునివలనఁ దనకుంగలవరమును యోచించి, బ్రహ్మాస్త్రమునుండివదలించికొనుశక్తినిదలంచి బ్రహ్మదేవుని యాజ్ఞకులోఁబడి యుండెను.

౪౪. బ్రహ్మాస్త్రముచేఁ గట్టంబడినవాఁడనై యున్నను బ్రహ్మచేతను దేవేంద్రునిచేతను వాయువుచేతను గాపాడఁబడుచున్న నాకు భయము గలుగనేరదుగదా!

గ్రహణేచాపి రక్షోభి ర్మహాన్మే గుణదర్శనః।
రాక్షసేంద్రేణ సంవాద స్తస్మా ద్గృహ్ణంతు మాంపరే॥ ౪౫

స నిశ్చితార్థః పరవీరహంతా సమీక్ష్యకారీ వినివర్తచేష్టః।
పరైః ప్రసహ్యాభిగతై ర్నిగృహ్య ననాద తైస్తైః పరిభర్త్స్య
మానః॥ ౪౬

తత స్తం రాక్షసా దృష్ట్వా నిర్విచేష్ట మరిందమమ్।
బబంధు శ్శణవల్కై శ్చ ద్రుమచీరై శ్చ సంహతైః॥ ౪౭

స రోచయామాస పరైశ్చ బంధనం ప్రసహ్యవీరై రభిని
గ్రహంచ కౌతూహలా న్మాం యది రాక్షసేంద్రో ద్రష్టుం వ్యవసే
దితి నిశ్చితార్థః॥ ౪౮

స బద్ధ స్తేన వల్కేన విముక్తో ఽస్త్రేణ వీర్యవాన్।
అస్త్రబంధ స్సచాన్యంహి నబంధ మనువర్తతే॥ ౪౯

అథేంద్రజిత్తు ద్రుమచీరబద్ధం విచార్యవీరః కపిసత్తమం తమ్
విముక్తమస్త్రేణ జగామచింతాం నాన్యేనబద్ధో హ్యనువర్త
తేఽస్త్రమ్॥ ౫౦

అహో మహత్కర్మ కృతం నిరర్థకం నరాక్షసై ర్మంత్రగతిర్వి
మృష్టా। పునశ్చ నాస్త్రే విహతేఽస్త్రమన్య త్ప్రవర్తతే సంశ
యితాస్స్మ సర్వే॥ ౫౧

౪౫. రాక్షసులచేతఁబట్టుకొనఁబడుటయందనుగుణముఁజూపును, నట్టిదియు దొడ్డదియునగు సంవాదము రాక్షసరాజుతోడ నాకుంబొసఁగును. కావున నన్ను రాక్షసులు పట్టుకొనుటయే బాగనితలంచెదను.

౪౬. శత్రువీరులం గూల్చువాఁడును జక్కఁగయోచించువాఁడును నగుహనుమంతుఁడు మనంబున నిట్లునిశ్చయించికొని, తన కెదుటవచ్చుచున్న శత్రువులచేనెల్ల బలవంతముగాఁ బట్టుకొనంబడి పెనరుపెట్టఁబడినవాఁడైనను జేష్టలేవ్వియు లేకయే యఱచుచుండెను.

౪౭. పిమ్మట శత్రువులనుడికించువాఁడగు హనుమంతుఁ డూరక మూర్ఛనొందుటఁజూచి జనుపనారపట్టలచేతను నారచీరలచేతను గట్టివైచిరి.

౪౮. "రాక్షసేంద్రుఁ డుల్లాసముతో ననుంజూడ నిచ్ఛయించును" నేను త్వరపడనేలయని నిశ్చయించికొని హనుమంతుఁడు శత్రువీరులు కట్టుటలును బలవంతముగాఁ బట్టుటలును సహించెను.

౪౯. బలవంతుఁడగు నాతండు నారచీరచేఁ గట్టఁబడి యుండియు తొల్లింటిబ్రహ్మాస్త్రముచే విడువంబడియెను. ఆయస్త్రముయొక్క బంధము నారచీరయొక్క బంధము నాశ్రయించినది కాదుగదా!

౫౦. అపల శూరుఁడగు నింద్రజిత్తు వానరోత్తముఁడగు హనుమంతుఁడు నారచీరచేఁగట్టంబడినవాఁడుగను బ్రహ్మాస్త్రముచే విడువంబడినవాఁడుగను నెఱింగి 'మఱిదేనిచేతనైనియుఁ గట్టంబడినవానిని బ్రహ్మాస్త్రము గట్టదుగదా! అదియెఱుంగమిచే మోసముగలిగెనని చింతించెను.

౫౧. నాచేఁ జేయంబడిన [illegible] యీ రాక్షసుల [illegible] చే వ్యర్థమయ్యెను. ఈ మూర్ఖులు బ్రహ్మాస్త్రముయొక్క [illegible] నైరి. ఇట్లు బ్రహ్మాస్త్రము వ్యర్థమైనచో [illegible] గా! ఈరాక్షసులు హనుమంతుఁడు [illegible] విడువంబడినట్లు [illegible] హించెదరు

అస్త్రేణ హనుమాన్ ముక్తో నాత్మాన మవబుధ్యత।
కృష్యమాణస్తు రక్షోభి స్తైశ్చ బంధై ర్నిపీడితః॥ ౫౨॥
హన్యమాన స్తతః క్రూరై రాక్షసైః కాష్ఠముష్టిభిః।
సమీపం రాక్షసేంద్రస్య ప్రాకృష్యత స వానరః॥ ౫౩॥

అథేంద్రజిత్తం ప్రసమీక్ష్య ముక్త మస్త్రేణ బద్ధం ద్రుమచీరసూ
త్రైః। వ్యదర్శయ త్తత్ర మహాబలం తం హరిప్రవీరం సగ
ణాయ రాజ్ఞే॥ ౫౪॥

తం మత్తమివ మాతంగం బద్ధం కపివరోత్తమమ్।
రాక్షసా రాక్షసేంద్రాయ రావణాయ న్యవేదయన్॥ ౫౫॥

కోఽయం కస్య కుతో వాత్ర కింకార్యం కో వ్యపాశ్రయః।
ఇతి రాక్షసవీరాణాం తత్ర సంజజ్ఞిరే కథాః॥ ౫౬॥

హన్యతాం దహ్యతాం వాపి భక్ష్యతామితి చాపరే।
రాక్షసా స్తత్ర సంక్రుద్ధాః పరస్పర మథాబ్రువన్॥ ౫౭॥

అతీత్య మార్గం సహసా మహాత్మా స తత్ర రక్షోధిప పాద
మూలే। దదర్శ రాజ్ఞః పరిచారవృద్ధాన్ గృహం మహారత్న
విభూషితం చ॥ ౫౮॥

స దదర్శ మహాతేజా రావణః కపిసత్తమమ్।
రక్షోభి ర్వికృతాకారైః కృష్యమాణ మితస్తతః॥ ౫౯॥
రాక్షసాధిపతిం చాపి దదర్శ కపిసత్తమః।
తేజోబల సమాయుక్తం తపంత మివ భాస్కరమ్॥ ౬౦॥

౫౨. ఆంజనేయుఁడు దాను బ్రహ్మాస్త్రముచే విడువంబడుట తెలిసికొనలేదు. రాక్షసులచేఁ గట్టంబడి యీడ్వంబడినవాఁడై చనుచున్నవాఁడు.

౫౩. పదంపడి హనుమానుఁడు రక్కసులచేఁ బిడికిళులచేతను గఱ్ఱలచేతను గొట్టంబడి రావణునియెదటి కీడ్చికొని తేఁబడియెను.

౫౪. పిమ్మట నింద్రజిత్తు, హనుమంతుఁడు బ్రహ్మాస్త్రముచే విడువంబడినవాఁడుగను నారచీరలచేమాత్రము గట్టంబడినవాఁడుగ నెఱింగి, బలశాలియు వీరుఁడునగు నావానరుని రాక్షస సమూహములతో నున్న రావణునకుం జూపెను.

౫౫. ఆరాక్షసులు, త్రాళ్ళచేఁగట్టంబడి మదించిన యేనుఁగు వలె నుండు వానరోత్తముని రాక్షసరాజగు రావణునకుఁ దెలిపిరి.

౫౬. ఇతండెవఁడు? ఎవ్వనివాఁడు? ఎచ్చోటనుండివచ్చెను? ఏల వచ్చెను? ఎవరినాశ్రయించియున్నాఁడు? అను నిట్టిమాట లచ్చోట న చ్చోట ననేకములు పుట్టెను.

౫౭. అచ్చోట మఱికొందఱురక్కసులు కోపించినవారై వీనింగొట్టుఁడు కాల్చుఁడు. తినుండు! అని యొండొరు లనుకొనిరి.

౫౮. గొప్పవాఁడగుహనుమ శీఘ్రమున మార్గమునుగడచి కొలువున రావణునిపాదములకడనున్న వృద్ధరాక్షసులను గాంచెను. వెలగలరత్నములచే నలంకరింపంబడిన యింటినింగూడఁ గనియెను.

౫౯. మిక్కిలి ప్రతాపముంగలవాఁడగు రావణుఁడు వికారరూపులగు రాక్షసులచే నిటునటు నీడ్వఁబడుచున్నవానరోత్తమునిం గనియెను.

౬౦. ప్రతాపబలములతోఁ గూడినవాఁడగు రాక్షసరాజును వెలుంగుచున్న సూర్యునివలెనున్నవానిని హనుమంతుఁడు గనియెను.

సరోష సంవర్తితతామ్రదృష్టి ర్దశానన స్తం కపి మన్వవేక్ష్య
అథోపవిష్టా న్కులశీలవృద్ధా న్సమాదిశ త్తంప్రతి మంత్రిముఖ్యాన్। ౬౧॥

యథాక్రమం తై స్సకపి ర్విపృష్టః కార్యార్థ మర్థస్యచ మూలమాదౌ। నివేదయామాస హరీశ్వరస్య దూత స్సకాశా దహమాగతోస్మి॥ ౬౨॥

ఇతి శ్రీమత్సుందరకాండే - అష్టచత్వారింశస్సర్గః.

## ఏకోన పంచాశస్సర్గః.

తత స్స కర్మణా తస్య విస్మితో భీమవిక్రమః।
హనుమా న్రోషతామ్రాక్షో రక్షోధిప మవైక్షత॥ ౧॥

భ్రాజమానం మహార్హేణ కాంచనేన విరాజతా।
ముక్తా జాలావృతే నాథ మకుటేన మహాద్యుతిమ్॥ ౨॥

వజ్రసంయోగ సంయుక్తై ర్మహార్హ మణివిగ్రహైః।
హైమై రాభరణై శ్చి త్రై ర్మనసేవ ప్రకల్పితైః॥ ౩॥

మహార్హ క్షౌమ సంవీతం రక్తచందన రూషితమ్।
స్వనులిప్తం విచిత్రాభి ర్వివిధాభి శ్చ భక్తిభిః॥ ౪॥

౬౧. పిమ్మట రావణుండా వానరునింగాంచి, కోపముచేఁ దిరుగుచున్న యెఱ్ఱని కనుగ్రుడ్లుగలవాఁడై, అందుఁగూర్చున్నవారును, కులముచేతను నడత చేతను వృద్ధులైనవారును నగుమంత్రిశ్రేష్ఠులను హనుమంతునిం గూర్చి నియమించెను.

౬౨. ఆరాక్షసులచేత, ఏపనికై వచ్చుటయు, దానికి మూలమేది యగుటయుఁ గ్రమముగా నడుగంబడి హనుమంతుఁడు త్రోలుదొత్ర వానరరాజగు సుగ్రీవుని దూతను, ఆతనియొద్దనుండియే యిందువచ్చితిని. అని పలికెను.

ఇది నలువదియెనిదవసర్గ.

---

## నలవది తొమ్మిదవసర్గ.

౧. అట్లు రావణుఁడు మంత్రులనునియమించి తనవిషయము వారిచేనడిగించి తానుమాటాడక రాజసముతోడ మెలంగినందుల కాశ్చర్యపడి యాగ్రహించి యెఱ్ఱనికన్నులతో హనుమంతుఁ డాతనిం జూచెను.

౨. పిమ్మట మిక్కిలి పూజ్యమైనదియు బంగారముచేఁజేయంబడి వెలుంగుచున్నదియు ముత్తెపుసరములచేఁజుట్టంబడినదియు నగుకిరీటముచే వెలుంగుచున్న తేజోవంతుఁడగు రావణుంగాంచెను.

3, ౪. వజ్రములమొత్తమును బొదుగుటగలవియు, వెలగలరత్నములను పూవులుగలవియు బంగారముచే వింతలుగఁజేయంబడినవియు, సంకల్పముచేతనే కల్పింపఁబడినవియు నగుభూషణములతోఁ గూడినవాఁడును, వెలగలపట్టుపచ్చడముం ధరించినవాఁడును, ఎఱ్ఱనిచందన ములందినవాఁడును వింతలై పెక్కువిధములైన పరిమళద్రవ్యముల రేఖలచే నలంకరింపఁబడినవాఁడును.

వివృత్తై ర్దర్శనీయైశ్చ రక్తాక్షై ర్భీమదర్శనైః।
దీప్తతీక్ష్ణమహాదంష్ట్రైః ప్రలంబ దశనచ్ఛదైః॥

శిరోభి ర్దశభి ర్వీరం భ్రాజమానం మహౌజసమ్।
నానావ్యాళ సమాకీర్ణై శ్శిఖరై రివ మందరమ్॥

నీలాంజనచయ ప్రఖ్యం హారేణోరసి రాజతా।
పూర్ణచంద్రాభ వక్త్రేణ సబలాక మివాంబుదమ్॥

బాహుభి ర్బద్ధకేయూరై శ్చందనో త్తమ రూషితైః।
భ్రాజమా నాంగదైః పీనైః పంచశీర్షై రివోరగైః॥

మహతి స్ఫాటికే చిత్రే రత్నసంయోగ సంస్కృతే।
ఉ త్తమా స్తరణా స్తీర్ణే సూపవిష్టం వరాసనే॥

అలంకృతాభి రత్యర్థం ప్రమదాభి స్సమంతతః।
వాలవ్యజనహస్తాభి రారా త్సముపసేవితమ్॥

దుర్ధ రేణ ప్రహ స్తేన మహాపా ర్శ్వేన రక్షసా।
మంత్రిభి ర్మంత్రత త్త్వజ్ఞై ర్నికుంభేన చ మంత్రిణా॥

సుఖోపవిష్టం రక్షోభి శ్చతుర్భి ర్బలదర్పితైః।
కృత్స్నః పరివృతో లోక శ్చతుర్భి రివ సాగరైః॥

మంత్రిభి ర్మంత్రతత్త్వజ్ఞై రన్యైశ్చ శుభబుద్ధిభిః।
అన్వాస్యమానం రక్షోభి స్సురై రివ సురేశ్వరమ్॥

౫, ౬. అందమై యెఱ్ఱనై భయంకరమైయున్న విప్పకన్నులతోడను, కటువై వెలుంగుచున్న గొప్పదంతములతోడను వ్రేలాడుచున్న పెదవులతోడను, పదితలలతోడను వెలుంగుచుఁ బెక్కుదుష్టమృగములను గలిగిన శిఖరములతో నొప్పుచున్న మందరపర్వతమువలెనున్నవాఁడును శూరుఁడును బరాక్రమశాలియు నగువాఁడును

౭. కాటుకదిబ్బవలె నల్లగనున్నవాఁడును, ఱొమ్మునందు నిండుచంద్రునింబోలునాయకమణిచే నొప్పుచున్నహారముతోఁ గూడినవాఁడును, కొంగలవరుసచే నొప్పుచున్న నీలమేఘమువలె నున్నవాఁడును.

౮, ౯. తొడుగంబడిన భుజకీర్తులంగలవియు, మంచిచందనముచేఁ బూయంబడినవియు, భుజకీర్తులచేఁ బ్రకాశించుచున్నవియు, బలిసినవియు నైదుతలలుగల సర్పములవలెనున్నవియు నగుభుజములతోఁ గూడినవాఁడును, స్ఫటికపురాతిచే వింతగఁజేయఁబడినదియు, రత్నములు చెక్కంబడి యందమై యున్నదియు శ్రేష్ఠమగు రత్నకంబళి పరుపంబడినదియు నగు సింహాసనమునఁ గూర్చున్న వాఁడును.

౧౦. లెస్సగ నలంకరింపఁబడినవారును మంచివయస్సున నున్నవారును, చామరములను ధరించియున్నవారును నగు స్త్రీలచేఁ బార్శ్వములందంతట సేవింపఁబడు చున్నవాఁడును.

౧౧. దుర్ధరుఁడును, ప్రహస్తుఁడును మహాపార్శ్వుఁడును, రక్షుఁడయ్యును జక్కగయోచించువాఁడగునికుంభుఁడును ననురాచకార్యములయందు నేర్పరులగు మంత్రులతోఁ గూడినవాఁడును.

౧౨. బలముచేగర్వించిననలుగురురాక్షసులతోడఁ గూర్చున్నవాఁడై నాల్గుసముద్రములచేతనుజుట్టంబడినసమస్తలోకమువలెనున్నవాఁడును.

౧౩. కార్యాలోచనమెఱింగిన మంత్రులచేతను, నేర్పరులగు మఱికొందఱిచేతను నాశ్రయింపఁబడినవాఁడునునై దేవతలచేఁ గొలువంబడిన యింద్రునివలె నున్నవాఁడును.

అపశ్య ద్రాక్షసపతిం హనుమా నతితేజసమ్।
విష్ఠితం మేరుశిఖరే సతోయ మివ తోయదమ్॥ ౧౪॥

స తై స్సంపీడ్యమానోఽపి రక్షోభి ర్భీమవిక్రమైః।
విస్మయం పరమం గత్వా రక్షోధిప మవైక్షత॥ ౧౫॥

భ్రాజమానం తతో దృష్ట్వా హనుమా న్రాక్షసేశ్వరమ్।
మనసా చింతమాస తేజసా తస్య మోహితః॥ ౧౬॥

అహో రూప మహో ధైర్య మహో సత్త్వ మహో ద్యుతిః।
అహో రాక్షసరాజస్య సర్వలక్షణయుక్తతా॥ ౧౭॥

యద్యధర్మో న బలవా న్స్యాదయం రాక్షసేశ్వరః।
స్యాదయం సురలోకస్య సశక్ర స్యాపి రక్షితా॥ ౧౮॥

అస్య క్రూరై ర్నృశంసైశ్చ కర్మభి ర్లోకకుత్సితైః।
తేన బిభ్యతి ఖల్వస్మా ల్లోకా స్సామరదానవాః॥ ౧౯॥

అయం హ్యుత్సహతే క్రుద్ధః కర్తు మేకార్ణవం జగత్।
ఇతి చింతాం బహువిధా మకరో న్మతిమా న్హరిః॥ ౨౦॥

దృష్ట్వా రాక్షసరాజస్య ప్రభావ మమితౌజసః॥ ౨౦½

ఇతి శ్రీమత్సుందరకాండే-ఏకోనపంచాశస్సర్గః.

---:o:---

౧౪. మేరుపర్వతముయొక్క శిఖరమందున్న జలముతోఁగూడిన మేఘమువలె నున్నవాఁడును, ప్రతాపశాలియు నగు రాక్షసరాజును హనుమంతుఁడు గనుంగొనియెను.

౧౫. ఆతండు భయంకరమగుదర్పముంగల రాక్షసులచే జుట్టఁబడియున్నవాఁడైనను మిక్కిలి యచ్చెరువంది రాక్షసరాజునుగనియెను.

౧౬. పిమ్మట హనుమంతుఁడు ప్రకాశించుచున్న రాక్షసరాజును గని యాతని తేజముచే మైమఱచి మనస్సున నిట్లుతలంచెను.

౧౭ నుండి ౨౦వఱకు. బుద్ధిమంతుఁడగు వానరుఁడు మిక్కిలిప్రతాపవంతుఁడగు రాక్షసరాజుయొక్క మహిమనుజూచి, ఈతనియొక్కరూపము ధైర్యము బలము కాంతి సమస్తశుభలక్షణములను గలిగియుండుట యాశ్చర్యకరముగనున్నవి. బలవంతుఁడగునీతం డధర్మపరుఁడుగాకుండెనేని దేవేంద్రసహితమగు స్వర్గమునుగూడ నేలుటకుఁదగినవాఁడు. ఘాతుకమును క్రూరమును భయంకరమును లోకముచే నిందింపఁబడినదియు నగు నీతని వృత్తిచేతను, అధర్మముచేతను దేవదానవులుమున్నగు లోకములో నివారందఱు నీతనింగని భయపడుచున్నారు. ఈరావణుండలిగెనేని లోకములనెల్ల నేకసముద్రముగాఁ జేయుటకును జాలినవాఁడు. అని పెక్కుతెఱఁగులఁ జింతించెను.

ఇదినలువది తొమ్మిదవసర్గ.

## పంచాశస్సర్గః.

తముద్వీక్ష్య మహాబాహుః పింగాక్షం పురతస్స్థితమ్।
కోపేన మహతావిష్టో రావణో లోకరావణః॥ ౧॥

శంకాహృతాత్మా దధ్యౌ స కపీంద్రం తేజసావృతమ్।
కిమేష భగవాన్నందీ భవేత్సాక్షా దిహాగతః॥ ౨॥

యేనశప్తోస్మి కైలాసే మయా సంచాలితే పురా।
సోయం వానరమూర్తిస్స్యా త్కింస్విద్బాణోపివాసురః॥ ౩॥

సరాజా రోషతామ్రాక్షః ప్రహస్తం మంత్రిసత్తమమ్।
కాలయుక్త మువాచేదం వచో విపుల మర్థవత్॥ ౪॥

దురాత్మా పృచ్ఛ్యతా మేష కుతః కింవాస్యకారణమ్।
వనభంగే చ కోస్యార్థో రాక్షసీనాం చ తర్జనే॥ ౫॥

మత్పురీ మప్రధృష్యాంవా గమనే కిం ప్రయోజనమ్।
ఆయోధనేవా కిం కార్యం పృచ్ఛ్యతా మేషదుర్మతిః॥ ౬॥

రావణస్య వచశ్శ్రుత్వా ప్రహస్తో వాక్యమబ్రవీత్।
సమాశ్వసి హి భద్రం తే నభీః కార్యా త్వయాకపే॥ ౭॥

యది తావ త్త్వ మింద్రేణ ప్రేషితో రావణాలయమ్।
తత్త్వమాఖ్యాహి మాభూత్తే భయం వానర మోక్షసే॥ ౮॥

## ఏఁబదియవసర్గ.

౧, ౨, ౩. గొప్పభుజములుగలవాఁడును, లోకములనేడ్పించువాఁడును నగురావణుండు పసపువర్ణపు కన్నులుగలవాఁడును దనయెదుట నున్నవాఁడును నగుహనుమంతునిం గాంచి మిక్కిలికోపము నొందెను. ఆతండు సందేహముగలవాఁడై వీఁడు ప్రత్యక్షముగా నిందువచ్చిన నందీశ్వరుఁడా యేమి, మున్ను నాచేఁ గైలాసపర్వతము గదలింపఁబడినపుడున న్నే నందీశ్వరుఁడు శపించెనో యాతం డీవానరరూపమునుధరించి వచ్చెనో? లేక బాణాసురుఁడా! అని కాంతిచేఁ జుట్టంబడినవాఁడగు హనుమంతునింగూర్చి చింతించెను.

౪. రాజగునాతండు కోపముచే నెఱ్ఱనైన కన్నులుగలవాఁడై మంత్రిశ్రేష్ఠుఁడగు ప్రహస్తుగూర్చి కాలమునకుం దగినదియు గంభీరమగునర్థముంగలదియు నగుపలుకు లిట్లువలికెను.

౫, ౬. వీఁడెక్కడనుండివచ్చెనో! వీఁడువచ్చుటకుఁ గారణమేదియో! వనముం జెఱుచుటయందును రాక్షసస్త్రీల బెదిరించుట యందును బ్రయోజనమేదో? దుష్టస్వభావముగల యీవానరు నడుగుము! జయింపరానిదియగు నాపట్టణమునకు వచ్చుటయందుఁగాని యుద్ధమందుఁగాని ప్రయోజనమేమి? దుర్బుద్ధియగు నీవానరు నడుగుము.

౭. ప్రహస్తుఁడు రావణునిమాటనువిని, ఓవానరుఁడా! ఊరడిల్లుము! నీకుశుభముగదా! భయపడకుము!

౮. నీవు దేవేంద్రునిచే నిందుఁబంపఁబడిన వాఁడవైతివేని యథార్థముగా నామాటవలుకుము! నీవు భయపడవలదు. నీవు విడువంబడుదువు.

యది వైశ్రవణస్య త్వం యమస్య వరుణస్య చ।
చారరూప మిదంకృత్వా ప్రవిష్టో నః పురీ మిమామ్॥ ౯।
విష్ణునా ప్రేషితో వాపి దూతో విజయకాంక్షిణా॥ ౯½
నహి తే వానరం తేజో రూపమాత్రం తు వానరమ్॥ ౧౦।
తత్త్వతః కథయస్వాద్య తతో వానర మోక్ష్యసే।
అనృతం వదతశ్చాపి దుర్లభం తవ జీవితమ్॥ ౧౧॥
అథవా యన్నిమిత్తం తే ప్రవేశో రావణాలయే॥ ౧౧½
ఏవముక్తో హరిశ్రేష్ఠ స్తదా రక్షోగణేశ్వరమ్॥ ౧౨॥
అబ్రవీ న్నాస్మి శక్రస్య యమస్య వరుణస్యవా।
ధనదేన నమేసఖ్యం విష్ణునా నాస్మి చోదితః॥ ౧౩॥
జాతిరేవ మమ త్వేషా వానరోహ మిహాగతః।
దర్శనే రాక్షసేంద్రస్య దుర్లభే తదిదం మయా॥ ౧౪॥
వనం రాక్షసరాజస్య దర్శనార్థే వినాశితమ్।
తత స్తే రాక్షసాః ప్రాప్తా బలినో యుద్ధకాంక్షిణః॥ ౧౫॥
రక్షణార్థం తు దేహస్య ప్రతియుద్ధా మయారణే।
అస్త్రపాశై ర్నశక్యోహం బద్ధుం దేవాసురైరపి॥ ౧౬॥
పితామహా దేషవరో మమా ప్యేషో భ్యుపాగతః।
రాజానం ద్రష్టుకామేన మయాస్త్ర మనువర్తితమ్॥ ౧౭॥
విముక్తో హ్యహ మస్త్రేణ రాక్షసై స్త్వభిపీడితః।
కేనచి ద్రాజకార్యేణ సంప్రాప్తోస్మి తవాంతికమ్॥ ౧౮॥

౮, ౯. కుబేరునకయినను యమునకైనను వరుణునకైనను యిట్లు వర్తమానముంగొనిపోవు వేషమునుధరించి యీపురమునఁ బ్రవేశించిననీవు దూతవై యున్నయెడలను జయమును గోరుచున్నవాఁడగు విష్ణుదేవునిచేత దూతవుగానంపఁబడి యున్నయెడలను నాకుఁ దెలియం బలుకుము.

౧౦, ౧౧, ౧౨. నీయొక్క కాంతి సామాన్యమగు వానరునికాంతివంటిదిగాదు, ఆకారముమాత్రము వానరుంబోలియున్నది. కావున నిప్పుడు సత్యముంబలుకుము! నీవువిడువఁబడుదువు. అబద్ధమాడితివేని నీవు బ్రదుకుట యసాధ్యము, ఎందులకై రావణునియింటఁ బ్రవేశించితివో యది తెలియం బలుకుము.

౧౩ నుండి ౧౯కి. మీచేఁ జెప్పంబడిన తెఱంగున నడుగంబడినవాఁడై వానరోత్తముఁడు నేను దేవేంద్రయమ వరుణులలో నెవ్వనికిని దూతనుగాను, కుబేరునితో నాకు మైత్రియు లేదు, విష్ణుదేవునిచేత నంపఁబడినవాఁడనుగాను. ఈవానరరూపము నాకుసహజమైనది కాని కృత్రిమముగాదు. పొంద నసాధ్యమయినదియగు రాక్షసరాజయొక్క దర్శనముకొఱకై యిందువచ్చితిని. కావుననే నీదర్శనము లభించుటకై యీవనము పాడుచేయంబడియెను. దానం జేసియే బలవంతులగు రాక్షసభటులు యుద్ధముంజేయవచ్చిరి. అట్టివారినందఱను నాదేహమును సంరక్షించుకొనుటకై యుద్ధమందు రూపుమాపితిని. దేవతలకేనియు రాక్షసులకేనియు నస్త్రశస్త్రములచేతను బ్రాళ్ళచేతను గట్టుటకు లోఁబడ వాఁడనుగాను. ఇట్టి వరము నాకు బ్రహ్మవలననే లభించెను. రాజును జూచవలెనని కోరినవాఁడనై కావున బ్రహ్మాస్త్రమునకు లోఁబడియుంటిని. రాక్షసులచే నెల్లవిధములఁ బీడింపఁబడి బ్రహ్మాస్త్రమువలన విడువఁబడినవాఁడనైతిని. ఇక రాజకార్యము

దూతోఽహ మితి విజ్ఞేయో రాఘవ స్యామితౌజసః।
శ్రూయతాం చాపి వచనం మమ పథ్య మిదం ప్రభో॥ ౧౯॥

ఇతి శ్రీమత్సుందరకాండే - పంచాశస్సర్గః.

## ఏకపంచాశస్సర్గః.

తం సమీక్ష్య మహాసత్త్వం సత్త్వవా న్హరిసత్తమః।
వాక్య మర్థవ దవ్యగ్ర స్తమువాచ దశాననమ్॥ ౧॥

అహం సుగ్రీవ సందేశా దిహాప్రాప్త స్తవాలయమ్।
రాక్షసేంద్ర హరీశ స్త్వాం భ్రాతా కుశల మబ్రవీత్॥ ౨॥

భ్రాతుశ్శృణు సమాదేశం సుగ్రీవస్య మహాత్మనః।
ధర్మార్థోపహితం వాక్య మిహాచాముత్ర చ క్షమమ్॥ ౩॥

రాజా దశరథోనామ రథకుంజర వాజిమాన్।
పితేవ బంధు ర్లోకస్య సురేశ్వర సమద్యుతిః॥ ౪॥

జ్యేష్ఠ స్తస్య మహాబాహుః పుత్రః ప్రియకరః ప్రభుః।
పితు ర్నిదేశా న్నిష్క్రాంతః ప్రవిష్టో దండకావనమ్॥ ౫॥

లక్ష్మణేన సహభ్రాత్రా సీతయా చాపి భార్యయా।
రామోనామ మహాతేజా ధర్మ్యం పంథాన మాశ్రితః॥ ౬॥

బగుటచే నీకడకువచ్చితిని. మిక్కిలి పరాక్రమముగలవాఁడగు శ్రీరాముని యొక్క దూతనని యెఱుంగుము. ఓరాజా! నీకు మేలు నేయునదియగు నా మాటను వినుము! అని రావణునితోఁ జెప్పెను.

ఇది యేఁబదియవసర్గ.

---

ఏఁబదియొకటవసర్గ.

౧. బలవంతుఁడగు హనుమంతుఁడు మహాబలశాలియగు రావణునిఁ గని చలింపక గంభీరమగు నర్థముంగలమాట నిట్లువలికెను.

౨. ఓరాక్షసరాజా! నేను సుగ్రీవునియాజ్ఞ చొప్పున నీలంకయందు నీయింటికి వచ్చితిని. నీకు సహోదరుఁడగు సుగ్రీవుఁడు క్షేమవార్త నిప్పి వనిచెను.

౩. ధర్మార్థములతోఁ గూడినదియు, ఇందును బరలోకమందును శుభమునిచ్చునదియు, మహాత్ముఁడును నీకుసోదరుండును నగుసుగ్రీవునిచేఁ జెప్పిపనుపంబడినదియు నగుమాటను వినుము.

౪. రథముల నేనుంగుల గుఱ్ఱములను గలవాఁడును, లోకములకుఁ జంద్రునివలెఁ బుట్టమైనవాఁడును దేవేంద్రునితోఁ దుల్యమగు తేజముంగలవాఁడును నగుదశరథుఁడనురాజు గలఁడు.

౫. గొప్పబలముగలవాఁడును, అందఱకు మేలు నేయువాఁడును జనులను శిక్షింపను రక్షింపను సమర్థుఁడును నగునాదశరథునకుఁ బెద్దకొడుకు దండ్రియొక్క యాజ్ఞవలన వెలువడినవాఁడై దండకారణ్యమునఁ బ్రవేశించెను.

౬. మిక్కిలి దర్మముగలవాఁడును రాముఁడను పేరుగలవాఁడును నగునాతండు తమ్ముఁడగు లక్ష్మణునితోడను భార్యయైన సీతతోడను ధర్మమార్గము నాశ్రయించెను.

తస్య భార్యా వనే నష్టా సీతా పతిమనువ్రతా।
వైదేహస్య సుతా రాజ్ఞో జనకస్య మహాత్మనః॥ ౭॥

మార్గమాణ స్తాం దేవీం రాజపుత్ర స్సహానుజః।
ఋశ్యమూక మనుప్రాప్త స్సుగ్రీవేణ సమాగతః॥ ౮॥

తస్య తేన ప్రతిజ్ఞాతం సీతాయాః పరిమార్గణమ్।
సుగ్రీవస్యాపి రామేణ హరిరాజ్యం నివేదితమ్॥ ౯॥

తత స్తేన మృధే హత్వా రాజపుత్రేణ వాలినమ్।
సుగ్రీవ స్థాపితో రాజ్యే హర్యృక్షాణాం గణేశ్వరః॥ ౧౦॥

త్వయా విజ్ఞాతపూర్వశ్చ వాలీ వానరపుంగవః।
రామేణ నిహతస్సంఖ్యే శరేణైకేన వానరః॥ ౧౧॥

స సీతామార్గణే వ్యగ్ర స్సుగ్రీవ స్సత్యసంగరః।
హరీన్ సంప్రేషయామాస దిశస్సర్వా హరీశ్వరః॥ ౧౨॥

తాం హరీణాం సహస్రాణి శతాని నియుతాని చ।
దిక్షు సర్వాసు మార్గంతే హ్యధ శ్చోపరి చాంబరే॥ ౧౩॥

వైనతేయసమాః కేచి త్కేచి త్తత్రానిలోపమాః।
అసంగ గతయ శ్శీఘ్రా హరివీరా మహాబలాః॥ ౧౪॥

౭. విదేహదేశమునకుఁ బ్రభుఁడును, గొప్పవాఁడునునగు జనకుఁడనురాజునకుఁ గొమార్తెయుఁ బతివ్రతయు సీతయనుపేరుగలదియు నగు రామునిభార్య యరణ్యమందుఁ గనంబడకపోయెను.

౮. ఆ రాముండు దమ్మునితోడఁగూడ సీతాదేవిని వెదకుచు ఋశ్యమూక పర్వతమునకువచ్చి సుగ్రీవునితో మైత్రిచేసెను.

౯. ఆసుగ్రీవునిచేత, సీతాదేవిని వెదకుట శ్రీరామునకుఁ బ్రతిజ్ఞ చేయంబడియెను. శ్రీరామునిచేతను వానరరాజ్యము సుగ్రీవునకు వాగ్దత్తము సేయంబడియెను.

౧౦. పిమ్మట రాజపుత్రుఁడగు శ్రీరామునిచే వాలి చంపంబడియెను. వానరులయొక్కయు నెలుఁగులయొక్కయు రాజ్యమునకుఁ బ్రభుత్వము సుగ్రీవున కీయంబడియెను.

౧౧. మున్ను నీకుఁ దెలియవచ్చినవాఁడును, వానరోత్తముఁడును నగువాలి శ్రీరామునియొక్క యొక్కబాణముచే యుద్ధమునఁ గూల్పంబడియెను.

౧౨. సత్యమగు ప్రతిజ్ఞగలవాఁడును వానరరాజును నగుసుగ్రీవుఁడు సీతను వెదకుటయందక్కఱగలవాఁడై వానరులమొత్తముల నెల్ల దిక్కులకుం బనిచెను.

౧౩. వానరులయొక్క నూఱులును, వేలును, నూఱువేలును దిక్కులయందును పాతాళమందును మీఁదను గగనమునను సీతాదేవిని వెదకుచున్నవి.

౧౪. ఆవానరులలో బలవంతులగుకొందఱు గరుడునితో సమానులు కొందఱు వాయువుతోఁ దుల్యులునై వెంటనంటఁగూడనియంత వేగమునుగలవారై యున్నారు.

అహం తు హనుమా న్నామ మారుత స్యౌరసస్సుతః।
సీతాయాస్తు కృతే తూర్ణం శతయోజన మాయతమ్॥ ౧౫॥

సముద్రం లంఘయిత్వైవ తాం దిదృక్షు రిహాగతః।
భ్రమతా చ మయా దృష్టా గృహే తే జనకాత్మజా॥ ౧౬॥

తద్భవాన్ దృష్ట ధర్మార్థ స్తపః కృత పరిగ్రహః।
పరదారా న్మహాప్రాజ్ఞ నోపరోద్ధుం త్వమర్హసి॥ ౧౭॥

నహి ధర్మ విరుద్ధేషు బహ్వపాయేషు కర్మసు।
మూలఘాతిషు సజ్జంతే బుద్ధిమంతో భవద్విధాః॥ ౧౮॥

కశ్చ లక్ష్మణముక్తానాం రామకోపాను వర్తినామ్।
శరాణా మగ్రతస్థ్సాతుం శక్తో దేవాసు రేష్వపి॥ ౧౯॥

నచాపి త్రిషులోకేషు రాజ న్విద్యేత కశ్చన।
రాఘవస్య వ్యలీకం యః కృత్వా సుఖమవాప్నుయాత్॥ ౨౦॥

తత్త్రికాలహితం వాక్యం ధర్మ్య మర్థాను బంధిచ।
మన్యస్వ నరదేవాయ జానకీ ప్రతిదీయతామ్॥ ౨౧॥

దృష్టా హీయం మయా దేవీ లబ్ధం యదిహ దుర్లభమ్।
ఉత్తరంకర్మ యచ్ఛేషం నిమిత్తం తత్ర రాఘవః॥ ౨౨॥

౧౫, ౧౬. వాయుదేవుని పుత్రుండనగు నేను హనుమంతుఁడను పేరుగలవాఁడను. సీతను వెదకుటకై నూఱామడల వెడల్పుగల యీసముద్రమును దాఁటి యీమెను జూడ నిందువచ్చితిని. నీగృహమందు వెదకి వెదకి సీతను గాంచితిని.

౧౭. గొప్ప తెలివిగలవాఁడా! నీవు ధర్మార్థముల నెఱింగినవాఁడవు. తపస్సుచే లోకమును మెప్పించినవాఁడవు. ఇట్టి నీవు పరులభార్యల నడ్డగింపఁ దగవుసుమా!

౧౮. నినుంబోలు బుద్ధిమంతులు, ధర్మమునకు విరుద్ధమైనట్టియు, పెక్కపాయములను గలిగించునట్టియు, మొదటికి మోసము తెచ్చునట్టియు పనులయందుఁ బ్రవర్తింపరు.

౧౯. రామునికోపము ననుసరించినవియు, లక్ష్మణునిచే విడువఁబడినవియు నగుబాణములయెదుట నిలచుటకు దేవతలయందును రాక్షసులయందును సమర్థుం డెవఁడు?

౨౦. ఓరాజా! శ్రీరామునకు మూఁడులోకములయందును నెవ్వాండేని విరోధముంజేసి బ్రతికియుండుట కలుగదు.

౨౧. కావున సుగ్రీవునివాక్యమును భూతభవిష్యద్వర్తమానములను మూఁడుకాలములయందును మేలుచేయునదియు న్యాయమైనదియుఁ బ్రయోజనముం గలదియునుగా నెఱింగి జానకిని శ్రీరామున కొసఁగుము.

౨౨. ఈతల్లి యిచ్చోట నాచేఁ జూడంబడియెఁగదా! ఇతరవానరులకు లభింపక వారితాపహేతువైయున్న సీతాదర్శనము నాకు భాగ్యవశమున నిందులభించెను. కాని, తక్కినపని శ్రీరామునిచే ముగియింపఁగినది.

లక్షితేయం మయా సీతా తథా శోకపరాయణా।
గృహ్య యాం నాభిజానాసి పంచాస్యా మివ పన్నగీమ్॥ ౨౩

నేయం జరయితుం శక్యా సాసురై రమరై రపి।
విషసంసృష్ట మత్యర్థం భుక్తమన్న మివౌజసా॥ ౨౪॥

తపస్సంతాప లబ్ధస్తే యోఽయం ధర్మపరిగ్రహః।
న స నాశయితుం న్యాయ్య ఆత్మప్రాణ పరిగ్రహః॥ ౨౫॥

అవధ్యతాం తపోభిర్యాం భవాన్ సమనుపశ్యతి।
ఆత్మన స్సాసురై ర్దేవై ర్హేతు స్తత్రా ప్యయం మహాన్॥ ౨౬

సుగ్రీవో నహి దేవోఽయం నాసురో న చ రాక్షసః।
నదానవో న గంధర్వో నయక్షో నచ పన్నగః॥ ౨౭॥

తస్మా త్ప్రాణపరిత్రాణం కథం రాజ న్కరిష్యసి॥ ౨౮

నతు ధర్మోపసంహార మధర్మఫల సంహితమ్॥ ౨౮।

తదేవ ఫలమన్వేతి ధర్మశ్చా ధర్మనాశనః।
ప్రాప్తం ధర్మఫలం తావ ద్భవతా నాత్రసంశయః॥ ౨౯

ఫల మస్యా ప్యధర్మస్య క్షిప్రమేవ ప్రపత్స్యసే॥ ౨౯।

జనస్థాన వధంబుద్ధ్వా బుద్ధ్వా వాలివధం తథా।
రామసుగ్రీవ సఖ్యం చ బుధ్యస్వ హితమాత్మనః॥ 30

౨౩. ఏసీతాదేవిని గొనివచ్చి, ఐదుతలలుగల యాఁడుసర్పమని తెలియక నీయింటనుంచుకొని యున్నావో, దుఃఖాక్రాంతయగు నాతల్లిని నేనుగాంచితిని.

౨౪. మిక్కిలి విషముతోఁగూడినదై భుజింపఁబడిన యన్నము జీర్ణము కానియట్లు రాక్షసులతోఁగూడిన దేవతలచేతనుగాని సీతాదేవి సర్వముచే హరింపఁబడునది కాదు.

౨౫. తపస్సుచేసి దయ్యుటచేఁ గలిగినదియు, ధర్మమునకు సాధనమైనదియు నగు నీయొక్క ప్రాణధారణమును నీవే నశింపఁజేయుట న్యాయముగాదు.

౨౬. నీయొక్క తపోబలము చేత, రాక్షసులతోఁగూడిన దేవతలచేతనేనియు నీవు చంపంబడవని తలంచుటగలిగినను నీచావునకు గొప్పనిమిత్తము గలదుసుమా!

౨౭, ౨౭4. సుగ్రీవుఁడు దేవతలలో నసురులలో రాక్షసులలో దానవులలో గంధర్వులలో యక్షులలో సర్పములలోఁ జేరినవాఁడుగాఁడు గావున నీప్రాణము నెట్లురక్షించుకొనియెదవో.

౨౮, ౨౯, ౨౯4. ధర్మమునకు ఫలరూపమైన సౌఖ్య మధర్మముయొక్క దుఃఖరూపమగుఫలముతోఁ గూడియుండదు. దానిదానికిందగుఫలము దానిదానినాశ్రయించియుండును. ధర్మముచే నధర్మము నశించునది కాదు. నేటివఱకును సంపూర్ణముగా ధర్మముయొక్కఫల మనుభవించితివి. ఇందులకు నిస్సందేహము. ఇప్పుడు చేసినయధర్మమునకు ఫలము నింకశీఘ్రమునసే చెందఁగలవు.

౩౦4. జనస్థానమున వధయు, వాలిచంపంబడుటయు, శ్రీరామునకును సుగ్రీవునకును సఖ్యమగుటయు నెఱింగి నీమేలును యోచింపుము.

కామం ఖ ల్వహమప్యేక స్సవాజి రథకుంజరామ్।
లంకాం నాశయితుం శ క్త స్తస్యైషతు ననిశ్చయః॥ ౩౧

రామేణ హి ప్రతిజ్ఞాతం హర్యృక్షగణసన్నిధౌ।
ఉత్సాదన మమిత్రాణాం సీతాయై స్తు ప్రధర్షితా॥ ౩౨

అపకుర్వ న్హిరామస్య సాక్షాదపి పురందరః।
నసుఖం ప్రాప్నుయా దన్యః కింపున స్త్వద్విధో జనః॥ ౩౩

యాం సీతే త్యభిజానాసి యేయం తిష్ఠతి తేవశే।
కాళరాత్రీతి తాం విద్ధి సర్వలంకా వినాశినీమ్॥ ౩౪

తదలం కాలపాశేన సీతావిగ్రహ రూపిణా।
స్వయం స్కంధావసక్తేన క్షమమాత్మని చింత్యతామ్॥ ౩౫

సీతాయా స్తపసా దగ్ధాం రామకోప ప్రపీడితామ్।
దహ్యమానా మిమాంపశ్య పురీం సాట్టప్రతోళికామ్॥ ౩౬

స్వాని మిత్రాణి మంత్రీంశ్చ జ్ఞాతీ న్భ్రాతౄ న్సుతా న్హి
తాన్। భోగా న్దారాం శ్చ లంకాం చ మా వినాశ ముపా
నయ॥ ౩౭

సత్యం రాక్షస రాజేంద్ర శృణుష్వ వచనం మమ।
రామదాసస్య దూతస్య వానరస్య విశేషతః॥ ౩౮

౩౧వ. ఏనుఁగలతో గుఱ్ఱములతో రథములతోఁగూడిన యీలంకను నాశముసేయ నేనొక్కఁడనే మిక్కిలిచాలుదును. ఇట్లుచేయుట శ్రీరామున కిష్టములేదు.

౩౨వ. సీత యెవ్వారిచే నవమానింపఁ బడియెనో యట్టిశత్రువుల యొక్క నాశముంగూర్చి వానరులయొక్కయు నెలుఁగులయొక్కయు సన్నిధానమున శ్రీరాముండు ప్రతిజ్ఞ చేసెను.

౩౩వ. శ్రీరామున కపకారముంజేసి, సాక్షాదింద్రుండైనను సుఖపడఁజాలఁడనఁగా నినుంబోలు సామాన్యులమాట యేపాటిది.

౩౪వ. నీవు సీతయని యెవ్వతెనుదలంచుచున్నావో, ఇట్లు నీ వశమునంజిక్కియుండు నిల్లాలెవరో యామెను లంకయందంతటను మెలంగుచున్న లయహేతువగు శక్తియని తెలియుము.

౩౫వ. సీతాదేవియను రూపమును ధరించియున్నదియు, తానై నీకుత్తుకకుం జుట్టుకొన్నదియు నగు యమునిపాశముతోడిపని చాలును! దానినుండి తొలంగునుపాయమును డెందమునం దలంపుము.

౩౬వ. బురుజులతోడను రాజమార్గములతోడను గూడినదియగు నీపురము సీతయొక్క తపస్సుచేఁ గాల్పఁబడినదియు రామునికోపముచే బీడింపఁబడినదియునై మండుచున్నదిగాఁ దలంపుము.

౩౭వ. నీ చెలికాండ్రను, హితులను, దాయాదులను, తోఁడంబుట్టువులను, కొడుకులను, భార్యలను, భోగములను లంకను వినాశము చెందింపకుము.

౩౮వ. ఓరాక్షసరాజా! శ్రీరామునకు సేవకుఁడను దూతను వానరుఁడను నగునామాట సత్యము! వినుము.

సర్వాన్ లోకాన్ సుసంహృత్య సభూతాన్ స చరాచరాన్।
పునరేవ తథాస్రష్టుం శక్తో రామో మహాయశాః॥ ౩౯॥
దేవాసుర నరేంద్రేషు యక్షరక్షోగణేషు చ॥ ౪౦॥
విద్యాధరేషు సర్వేషు గంధర్వేషూరగేషు చ।
సిద్ధేషు కిన్నరేంద్రేషు పతత్రిషు చ సర్వతః॥ ౪౧॥
సర్వభూతేషు సర్వత్ర సర్వకాలేషు నాస్తిసః।
యోరామంప్రతి యుధ్యేత విష్ణుతుల్య పరాక్రమమ్॥ ౪౨॥
సర్వలోకేశ్వరస్యైవం కృత్వా విప్రియముత్తమమ్।
రామస్య రాజసింహస్య దుర్లభం తవ జీవితమ్॥ ౪౩॥
దేవాశ్చ దైత్యాశ్చ నిశాచరేంద్ర గంధర్వవిద్యాధర నాగయ
క్షాః । రామస్య లోకత్రయ నాయకస్య స్థాతుం నశక్తాస్సమ
రేషు సర్వే॥ ౪౪॥
బ్రహ్మా స్వయంభూశ్చతురాననో వా రుద్రస్త్రినేత్ర స్త్రిపు
రాంతకో వా। ఇంద్రో మహేంద్ర స్సురనాయకో వా త్రాతుం
నశక్తా యుధి రామవధ్యమ్॥ ౪౫॥
ససౌష్ఠవోపేత మదీనవాదినః కపేర్నిశమ్యా ప్రతిమోప్రియం
వచః । దశాననః కోపవివృత్తలోచన స్సమాదిశత్తస్య వధం
మహాకపేః॥ ౪౬॥

ఇతి శ్రీమత్సుందరకాండే – ఏకపంచాశస్సర్గః.

౩౯. గొప్పకీర్తిని గలవాఁడగు రాముండు, పంచ భూతములతోడను, కదలునట్టియుఁ గదలనియట్టియు భూతములతోడను గూడినలోకములనెల్ల నశింపఁజేయను మరలసృజింపను జాలినవాఁడు.

౪౦,౪౧ ౪౨. విష్ణుదేవునితోఁ దుల్యముగఁ బరాక్రమముంగలవాఁడగు రామున కెదుటనిలిచియుద్ధము సేయంజాలినవాఁడు దేవతలయందును రాక్షసులయందును మనుష్యులయందును,యక్షులు రాక్షసులుసర్పములు ననువారియందును సిద్ధులు కిన్నరులు గరుడులనువారియందును సర్వభూతములయందును, సర్వస్థలములయందును, సర్వకాలములయందును గలుగఁడు.

౪౩. అన్ని లోకములకు నధికారియు, రాజోత్తముఁడుననగు రామునకు దొడ్డదియగు నపకారమును జేసి, నీవుబ్రదుకుటయసాధ్యమయ్యెను.

౪౪. ఓరాక్షసరాజా! దేవతలును రాక్షసులును గంధర్వ విద్యాధర యక్షులును సర్పములుననునంపఱును, మూఁడులోకములకును నాయకుండైన శ్రీరామునియొక్క యెదుట యుద్ధమున నిలువంజాలరు.

౪౫. తానై జనించినవాఁడును నాల్గు మోములుగలవాఁడును నగు బ్రహ్మదేవుఁడేనియు, మూఁడుకన్నులవాఁడును త్రిపురములను దగ్ధము చేసినవాఁడును నగురుద్రుండేనియు, మూఁడులోకములకధికారియు దేవతలకుం బ్రభుండుననగు నింద్రుఁడేనియు శ్రీరామునిచేఁ జంపంబడఁదగువానిని రక్షింప నశక్తులుసుమా!

౪౬. అని ధైర్యముతో భాషించుచున్నవాఁడగు హనుమంతునియొక్క స్పష్టమై హితమైన మాటనువిని, సాటిలేనివాఁడగు రావణుఁడు, కోపముచేఁ దిరుగుచున్న కనుగ్రుడ్లుగలవాఁడై యావానరోత్తముని జంపుటకాజ్ఞాపించెను.

ఇది ఏఁబది యొకటవ సర్గ.

## ద్విపంచాశస్సర్గః.

తస్య తద్వచనం శ్రుత్వా వానరస్య మహాత్మనః।
ఆజ్ఞాపయ ద్వధం తస్య రావణః క్రోధమూర్ఛితః॥ ౧॥
వధే తస్య సమాజ్ఞప్తే రావణేన దురాత్మనా।
నివేదితవతో దౌత్యం నానుమేనే విభీషణః॥ ౨॥
తం రక్షోధిపతిం క్రుద్ధం తచ్చ కార్య ముపస్థితమ్।
విదిత్వా చింతయామాస కార్యం కార్యవిధౌ స్థితః॥ ౩॥
నిశ్చితార్థ స్తత స్సామ్నా పూజ్య శత్రుజి దగ్రజమ్।
ఉవాచ హిత మత్యర్థం వాక్యం వాక్యవిశారదః॥ ౪॥
క్షమస్వ రోషం త్యజ రాక్షసేంద్ర ప్రసీద మద్వాక్య మిదం శృ
ణుష్వ। వధం నకుర్వంతి పరావరజ్ఞా దూతస్య సంతో వసు
ధాధిపేంద్రాః॥ ౫॥
రాజధర్మ విరుద్ధం చ లోకవృత్తే శ్చ గర్హితమ్।
తవ చాసదృశం వీర కపేరస్య ప్రమాపణమ్॥ ౬॥
ధర్మజ్ఞ శ్చ కృతజ్ఞ శ్చ రాజధర్మ విశారదః।
పరావరజ్ఞో భూతానాం త్వమేవ పరమార్థవిత్॥ ౭॥
గృహ్యంతే యది రోషేణ త్వాదృశోపి విపశ్చితః।
తత శ్శాస్త్ర విపశ్చిత్త్వం శ్రమ ఏవ హి కేవలమ్॥ ౮॥

ఏఁబదిరెండవసర్గ.

౧. రావణుఁడు ధీరుఁడగు వానరునియొక్క మాటను విని కో
ముచే మేనుమఱచినవాఁడై హనుమంతునిం జంపుట కాజ్ఞాపించెను.

౨. దూతచేయు పనిని జేసినవాఁడగు హనుమంతుని జంపుటకు
జ్ఞనుండగు రావణుఁ డాజ్ఞయొసంగినవాఁడుకాఁగా విభీషణుఁ డందుల
సమ్మతింపఁడయ్యెను.

3. యుక్తాయుక్తముల నెఱింగి కార్యములం జేయువాఁడగు విభీ
ణుండు, రావణుండు కోపించియుండుటను, వానరునివధ తప్ప పనుట
దెలిసికొని, ఎట్లుచేయుదునని యోచించెను.

౪. పిమ్మట శత్రువులగెలిచినవాఁడును, మాటనేర్పరియు నగు
భీషణుండు నిశ్చయించికొన్నవాఁడై యన్నను జులకనగాఁజూచి మె
నిమాటలచే మిక్కిలియనుకూలమగునట్లు వలికెను.

౫. రాక్షసరాజా! రోషమునువిడుపుము, చల్లవడుము! నా
టవినుము! అధికుల నల్పుల నెఱింగినవారును యోగ్యులునునగు ప్రభువు
దూతలను జంపుటలేదు.

౬. ఓశూరుఁడా! ఈవానరునిం జంపుట రాజధర్మమునకు వి
ధము. లోకముయొక్క యనుష్ఠానమునను నిందింపఁబడినది. నీయధికా
మునకును దగనిది.

౭. నీవు భూతజాలమున నెల్లధర్మశాస్త్రముల నెఱింగిన వాఁడ
మేలు మఱువనివాఁడవు, రాజధర్మములనేర్చినవాఁడవు, అధికుల నల్పు
నెఱింగినవాఁడవు. వేయేల ముఖ్యమగువానినెల్ల నెఱుంగుదువు.

౮. నినుంబోలుపండితులే రోషమునకులోఁబడిరేని శ్రమపడి శా
ముల నభ్యసించుటయంతయు వ్యర్థమేకదా!

తస్మాత్ప్రసీద శత్రుఘ్న రాక్షసేంద్ర దురాసద।
యుక్తాయుక్తం వినిశ్చిత్య దూతదండో విధీయతామ్॥ ౯॥

విభీషణ వచశ్శ్రుత్వా రావణో రాక్షసేశ్వరః।
రోషేణ మహతావిష్టో వాక్యముత్తరమబ్రవీత్॥ ౧౦॥

న పాపానాంవధే పాపం విద్యతే శత్రుసూదన।
తస్మాదేనం వధిష్యామి వానరం పాపచారిణమ్॥ ౧౧॥

అధర్మమూలం బహుదోషయుక్త మనార్య జుష్టం వచనం నిశమ్య। ఉవాచవాక్యం పరమార్థతత్త్వం విభీషణో బుద్ధిమతాం వరిష్ఠః॥ ౧౨॥

ప్రసీద లంకేశ్వర రాక్షసేంద్ర ధర్మార్థయుక్తం వచనం శృణుష్వ। దూతా నవధ్యాః సమయేషు రాజన్ సర్వేషు సర్వత్ర వదంతి సంతః॥ ౧౩॥

అసంశయం శత్రురయం ప్రవృద్ధః కృతం హ్యనేనాప్రియ మప్రమేయమ్। నదూతవధ్యాం ప్రవదంతిసంతో దూతస్య దృష్టా బహవోహి దండాః॥ ౧౪॥

వైరూప్యమంగేషు కశాభిఘాతో మౌండ్యం తథా లక్షణసన్నిపాతః। ఏతాన్హి దూతే ప్రవదంతి దండాన్ వధస్తు దూతస్య న నశ్శ్రుతోపి॥ ౧౫॥

౯. కావున శత్రువులంగూల్చువాఁడా! చేరరానివాఁడా! రాక్షసరాజా! యుక్తాయుక్తముల నాలోచించి దూతకు దండననిర్ణయింపుము.

౧౦. రాక్షసరాజగు రావణుండు విభీషణునిమాటనువిని మిక్కిలి రోషమును జెందినవాఁడై యిట్లు మాఱుపలికెను.

౧౧. శత్రువులను గూల్చువాఁడగు తముఁడా! పాపాత్ములను జంపుటచే దోషముగలుగదు. కావునఁ బాపముం జేసినవాఁడగు నీవానరుని జంపుదును.

౧౨. బుద్ధిమంతులలో నుత్తముఁడగు విభీషణుఁడు, అధర్మమునకు మూలమైనదియు, మిక్కిలి రోషముతోఁగూడినదియు, దుర్జనులు మెచ్చునదియు నగు రావణునిమాటనువిని యుత్తమమగు ప్రయోజనముంగల మాట నిట్లుపలికెను.

౧౩. లంకకు రాజవగు నోరాక్షసోత్తమా! కరుణింపుము! ధర్మముతోఁగూడినదియగు నామాటనువినుము దూతకార్యముం జేయువా రేకాలమందును, ఎట్టిచోటులయందును జంపంబడంవగరని పండితులు చెప్పుచున్నారు.

౧౪. ఈవానరునిచే మితిలేనియంతయపకారము చేయంబడియెఁగావున నీతండు మనకు నిస్సందేహముగ బలవంతుఁడగు శత్రుండే యయ్యెనుగాని, దూతకుఁ జేయందగినదండన లనేకములు చెప్పంబడియును వధమాత్రము తగదని చెప్పుచున్నారు.

౧౫. అంగములయందు విరూపమును గలిగించుట, కొరడాలతోఁ గొట్టించుట క్షౌరము నేయించుట గుఱుతువేయుట యనునిట్టివి దూతలకుం దగు దండనలని విధింపఁబడియెనుగాని, దూతను జంపుటమాత్రము వినమైతిమి,

కథం చ ధర్మార్థ వినీత బుద్ధిః పరావర ప్రత్యయ నిశ్చితార్థః
భవద్విధః కోపవశేహి తిష్ఠే త్కోపం నియచ్ఛంతి హి సత్త్వ
వంతః॥ ౧౬॥

నధర్మవాదే నచ లోకవృత్తే నశాస్త్రబుద్ధి గ్రహణేషు చాపి।
విద్యేతకశ్చి త్తవ వీర తుల్య స్త్వం హ్యుత్తమ స్సర్వ సురా
సురాణామ్॥ ౧౭॥

నచాప్యస్య కపేర్ఘాతే కంచి త్పశ్యామ్యహం గుణమ్।
తేష్వయం పాత్యతాం దండో యైరయం ప్రేషితః కపిః॥ ౧౮॥

సాధుర్వా యదివాసాధుః పరై రేష సమర్పితః।
బ్రువ న్పరార్థం పరవాన్ నదూతో వధమర్హతి॥ ౧౯॥

అపిచాస్మి న్హతేరాజ న్నాన్యం పశ్యామి ఖేచరమ్।
ఇహ యః పునరాగచ్ఛే త్పరంపారం మహోదధేః॥ ౨౦॥

తస్మా న్నాస్యవధే యత్నః కార్యః పరపురంజయ।
భవాన్ సేంద్రేషు దేవేషు యత్నమాస్థాతు మర్హతి॥ ౨౧॥

అస్మిన్వినష్టే న హి దూతమన్యం పశ్యామి యస్తౌ నరరాజపు
త్రౌ। యుద్ధాయ యుద్ధప్రియ దుర్వినీతా వుద్యోజయే ద్దీర్ఘ
పథా వరుద్ధౌ॥ ౨౨॥

(అస్మిన్హతే వానరయూథముఖ్యే సర్వాపదం సంప్రవదంతి

౧౬. ధర్మార్థములయందనుభవముంగలవాఁడును, అల్పాధిక భేదముల నెఱింగినవాఁడును నగునీవంటివాఁడును కోపమునకు లోఁబడినచోఁ గేవల బలవంతులగువా రెట్లుసహింతురు.

౧౭. ఓశూరుఁడా! ధర్మముల నుపన్యసించుట యందును, లోకానుభవమందును, శాస్త్రాభిప్రాయముల గ్రహించుటయందును నీకు సముండు లేఁడు. నీవే సమస్తదేవతలురాక్షసులులోనగువారిలో నుత్తముఁడవు.

౧౮. దూతయగు నీవానరుని జంపుటయందు గుణమేపాటియు నాకుంగనఁబడదు. ఎవరిచేత నీతండనుపఁబడెనో వారినివధించుట తగును.

౧౯. ఈతండు యోగ్యుఁడో కాఁడో యటుండనిమ్ము! పరులచే ననుపంబడినవాఁడు, పరులకై వారికనుకూలముగ మాటలాడెను. ఇట్టి దూత వధకుం దగినవాఁడుగాఁడు.

౨౦. ఓరాజా! ఈతం డిందుఁజంపంబడియె నేని మహాసముద్రము యొక్క యివ్వలిగట్టుగు నిచ్చోటున కాకాశముననే యెగసి రాఁజాలిన వాని నితరుని నచ్చోటంగానను.

౨౧. శత్రువుల పురములను జయించినవాఁడా! ఇంద్రునితోఁగూడిన దేవతలనేనియు యుద్ధమున సహింపఁజాలియున్నావు. ఇట్టినీవు దూతను జంపుటయను యత్నమును జేయకుము.

౨౨. యుద్ధమునందిష్టముగలవాఁడా! ఈదూతనశించునేని, అడఁకువలేనివారును, దీర్ఘమగుత్రోవచే నడ్డగింపఁబడినవారును, రాచకొమరులును నగు రామలక్ష్మణులను యుద్ధమునకుఁ బూనించునట్టిదూత మఱియొవ్వండును గలుగఁడు.

సర్వే। నహి ప్రపశ్యామి గుణం యశోవా లోకాపవాదో
భవతి ప్రసిద్ధః॥ ౨౩॥

మూర్ఖైః ప్రగల్భై రతిదుర్వినీతై స్తైర్వ్యానరోయం పురుషై
స్సృష్టః। తేషాం వధార్థం కురు వీర యత్నం శీఘ్రం వినా
శాయ నిశాచరేంద్ర॥ ౨౪॥

కురుష్వ తావత్ పరమం ప్రయత్నం ధర్మం సమాస్థాయ సు
రేంద్ర శత్రో। దేవేషు సేంద్రేషు సపావకేషు దైత్యేషు స
ర్వేషు సదానవేషు॥ ౨౫॥

కృత్వా ప్రయత్నం సుదృఢం సుశీఘ్రం మద్వాక్య మేవం మన
సా కురుష్వ। తౌ రాజపుత్రౌ వినిగృహ్య వీరౌ జయం పరం
ప్రాప్స్యసి రాక్షసేంద్ర॥) ౨౬॥

పరాక్రమోత్సాహ మనస్వినాం చ సురా సురాణామపి దు
ర్జయేన। త్వయా మనోనందన నైరృతానాం యుద్ధాయనిర్నా
శయితుం నయుక్తౌ॥ ౨౭॥

హితాశ్చ శూరాశ్చ సమాహితాశ్చ కులేషు జాతాశ్చ మ
హాగుణేషు। మనస్వినశ్శస్త్రభృతాం వరిష్ఠాః కోట్యగ్రతస్తే
సుభృతాశ్చ యోధాః॥ ౨౮॥

తదేకదేశేన బలస్య తావ త్కేచి త్తవాదేశకృతోఽభియాంతు।
తౌ రాజపుత్రౌ వినిగృహ్యమూఢౌ పరేషు తే భావయితుం
ప్రభావమ్॥ ౨౯॥

౨౩. (వానరసమూహమున ముఖ్యుండగు సీతనింజంపినయెడల స మస్తకష్టములును గలుగునని యందఱు నందురు. దీనిచేత యోగ్యతయేని కీర్తియేనియుం గలుగదుగాని యపవాదముమాత్రము ప్రసిద్ధమై నిలుచును.

౨౪. ఈవానరుఁడు, మూఢుఁడో నేర్పరియో పోకిరియోయగు నెవనిచేత నసుపంబడెనో వానింజంపుటకై రూపుమాపుటకై శీఘ్ర మున యత్నము సేయుము వీరుఁడవగు రాక్షసరాజా!

౨౫. దేవేంద్రునకుశత్రుఁడా! ఇంద్రునితోడను నగ్నితోడనుగూడిన దేవతలయందేని దానవులతోఁగూడిన సమస్త రాక్షసులయందేని నీశత్రుని వెదకి జయించుటకు ధర్మమునసుసరించి చాలినంతయత్నమును జేయుము.

౨౬. దృఢముగను శీఘ్రముగను దానికై యత్నించి నావాక్యమును మనఃపూర్తిగఁజేయుము వీరులగు నారాజపుత్రులను ఓఁబఱచికొంటివేని మేలగుజయమును బొందెదవు రాక్షసాధిప.)

౨౭. పరాక్రమముచే నుత్సహించుచున్న మనస్సుగలవారును దేవతలకు రాక్షసులకుఁగూడ జయింప నలవికానివాఁడవగునీచేత సంతోషపెట్టఁబడువారును నగురక్కసులకు యుద్ధములభించుటను నీవు మానుపఁగూడదు.

౨౮. మేలుగోరువారును, వీరులును, ఒద్దికగలవారును, ఉత్తమగుణములుగలవారును, ఆయుధములు ధరించినవారిలో గొప్పవారును బాగుగఁ బోషింపఁబడినవారును గోటిసంఖ్యను గలవారును నగుయుద్ధవీరులు నీకుం దున్నవారు.

౨౯. కావుననే నీయుత్తరువును సాగించునట్టి, కొందఱుభటులు మూఢులగు రామలక్ష్మణులఁ జులకనచేసి నీయొక్కప్రతాపమును శత్రులపైఁ జూపుటకు నీసేనయొక్క యొక్కభాగముతోడనే వారికెదురు నడువంగలరు.

నిశాచరాణామధిపో నుజస్య విభీషణ స్యోత్తమవాక్య మిష్టమ్
జగ్రాహ బుద్ధ్యా సురలోకశత్రు ర్మహాబలో రాక్షసరాజ
ముఖ్యః॥ 30

(కింవా పరంబ్రహ్మ పరంచ సత్యం సర్వస్యబీజం జగతోస్య
ష్ణోః। యు ద్దేవదేవస్య పరంచ తేజ స్తదేవ తేజః కపిరేషవీర
వధాయ మే వైష్ణవ తేజఏవ న సంశయోయం కపి రూపధారీ
ఇత్యేవ మేత ద్బహుధా విచింత్య రక్షోధిపః క్రోధవశం జగామ
క్రోధం తు జాతం హృదయే నిరుధ్య విభీష ణోక్తం వచన
నిశమ్య। ఉవాచ రక్షోధిపతి ర్మహాత్మా విభీషణం శస్త్రభృ
తాం వరిష్ఠమ్॥) 33

ఇతి శ్రీమత్సుందరకాండే - ద్విపంచాశస్సర్గః.

---

త్రిపంచాశస్సర్గః.

తస్య తద్వచనం శ్రుత్వా దశగ్రీవో మహాబలః।
దేశకాల హితం వాక్యం భ్రాతు రుత్తర మబ్రవీత్॥

సమ్యగుక్తం హి భవతా దూతవధ్యా విగర్హితా।
అవశ్యంతు వధాదన్యః క్రియతా మస్యనిగ్రహః॥

కపీనాం కిల లాంగూల మిష్టంభవతి భూషణమ్।
తదస్య దీప్యతాం శీఘ్రం తేన దగ్ధేన గచ్ఛతు॥

౩౦. రాక్షసులకు రాజును, స్వర్గమునకు విరోధియు మిక్కిలి బలశాలియు రాక్షసరాజులలో నుత్తముఁడును నగురావణుఁడు తమ్ముండగు విభీషణునియొక్క హితమగు నుత్తమవాక్యమును మెచ్చియంగీకరించెను.

(౩౧. వీరుఁడగు నీవానరుఁడు పరబ్రహ్మమా? సత్యమా? ఈసర్వజగత్తునకు బీజమా? దేవదేవుండగు విష్ణుదేవుని సర్వోత్తమమగు తేజమా యేమి? ఆతేజమే యై యుండవచ్చును!

౩౨. ఈవానరరూపమును ధరించియుండునది నన్నువధించుటకై వచ్చిన వైష్ణవతేజమే సుమా! సందేహము లేదు. అనియిట్లు పెక్కువిధములలోచించి యారాక్షసరాజు కోపముచేఁ బరవశుఁడయ్యెను.

౩౩. ఆరాక్షసరాజు! మీఁదఁజెప్పంబడినట్లు జనించినకోపమును విభీషణుని మాటనువిని మనస్సున నణంచి యాయుధములు పట్టినవారిలో మొనగాఁడగు విభీషణునితో నిట్లనియెను.)

ఇది యేఁబది రెండవ సర్గ.

---

## ఏఁబదిమూఁడవసర్గ.

౧. మిక్కిలి బలశాలియగు రావణుండు విభీషణుండట్లు పలుకుటను విని దేశకాలములను విరోధింపక యనుకూలమైన తెఱంగునఁ దమ్మునకిట్లనియెను.

౨. దూతను వధించుట పగదని నీచేఁబలుకంబడుట లెస్సయైయున్నది. వధకంటె నితరమగుదండన యెద్దియేనియు నీవానరునకుఁ జేయుట వలయును.

౩. వానరులకు వాలము ప్రియమైనభూషణముకదా! కావున దానిని శీఘ్రమునఁ గాల్పింపుము. కాలినతోఁకతోడనే వీఁడేగునుగాక.

తతః పశ్యంత్విమం దీన మంగవైరూప్య కర్శితమ్।
సమిత్రా జ్ఞాతయ స్సర్వే బాంధవా స్ససుహృజ్జనాః॥ ౪॥
ఆజ్ఞాపయ ద్రాక్షసేంద్రః పురం సర్వం స చత్వరమ్।
లాంగూలేన ప్రదీప్తేన రక్షోభిః పరిణీయతామ్॥ ౫॥
తస్య తద్వచనం శ్రుత్వా రాక్షసాః కోపకర్శితాః।
వేష్టయంతిస్మ లాంగూలం జీర్ణైః కార్పాసకైః పటైః॥ ౬॥
సంవేష్ట్యమానే లాంగూలే వ్యవర్ధత మహాకపిః।
శుష్క మింధన మాసాద్య వనేష్వివ హుతాశనః॥ ౭॥
తైలేన పరిషిచ్యాథ తేగ్నిం తత్రాభ్యపాతయన్॥ ౭½
లాంగూలేన ప్రదీప్తేన రాక్షసాం స్తా నపాతయత్।
రోషామర్ష పరీతాత్మా బాలసూర్య సమాననః॥ ౮½
లాంగూలం సంప్రదీప్తంతు ద్రష్టుం తస్య హనూమతః।
సహస్త్రీబాలవృద్ధాశ్చ జగ్ముః ప్రీతా నిశాచరాః॥ ౯½
సభూయ స్సంగతైః క్రూరై రాక్షసై ర్హరిస త్తమః।
నిబద్ధః కృతవా న్వీర స్తత్కాల సదృశీం మతిమ్॥ ౧౦½
కామంఖలు నమేశక్తా నిబద్ధస్యాపి రాక్షసాః॥ ౧౧॥
ఛిత్త్వాపాశా న్సముత్పత్య హన్యామహ మిమాన్పునః।
యదిభర్తు ర్హితార్థాయ చరంతం భర్తృశాసనాత్॥ ౧౨॥

౪. అట్లుపోఁగా, మిత్రులతోఁ గూడినవారగు దాయాదులును, బంధువులును వాలముకాలుటచే విరూపముంజెంది నవయుచున్న యీబక్క వానరుని జూతురుగాక.

౫. ఈవానరుఁడు మండుచున్నతోఁకతోడ నీపురమందు సర్వప్రదేశములయందును, త్రోవలుగలియుచోట్లయందును బాగుగఁ ద్రిప్పంబడవలయునని రావణుఁ డాజ్ఞాపించెను.

౬. ఆరావణునిమాటనువిని, రాక్షసులు కోపముచే నిలువరింపనేరక, ప్రాఁతవియగు దూదిబట్టలచేఁ దోఁకనుజుట్టిరి.

౭, ౭½. తోఁకకు బట్టలుచుట్టుచువచ్చి నూనెచేఁదడిపి రక్కసులు నిప్పును దగిల్చిరి. వెంటనే వనమునం దెండినపుడకల నంటుకొనిజ్వలించు నగ్నివలె నాదొడ్డవానరుఁడు మిక్కిలి పెరిగెను.

౮½. రోషముచేతను గోపముచేతను గ్రమ్మిన మనస్సుగలవాఁడై బాలసూర్యునితో సమమగు మోముంగలయాతం డారాక్షసులను మండుచున్న తోఁకచేఁ బడఁగొట్టెను.

౯½. ఆహనుమంతునియొక్క మండుచున్నతోఁకను గనుటకు రాక్షసులు బాలురతోడను వృద్ధులతోడను స్త్రీలతోడను సంతోషముతో నేగిరి.

౧౦½. శూరుఁడును వానరోత్తముఁడునునగు నాతండు, మరలమొత్తమయిన ఘాతుకులగురాక్షసులచేఁ గట్టివేయంబడినవాఁడై కాలమునను సరించిన సంకల్పముంగలవాఁడై.

౧౧ నుండి ౧౬కు. నేను గట్టంబడినవాఁడనైనను రాక్షసులు నను సహింపఁజాలరుగదా! ఈత్రాళ్లను ద్రెంపుకొనియెగసి యీరాక్షసులను మరల మర్దించెదను. అధికారియొక్కపనికై సంచరించుచున్న దుర్జనులగు

బద్ధం త్వేతై ర్దురాత్మానో నతు మే నిష్కృతిః కృతా।
సర్వేషా మేవ పర్యాప్తో రాక్షసానా మహం యుధి॥ ౧౩॥

కింతు రామస్య ప్రీత్యర్థం విషహిష్యే౽హ మీదృశమ్।
లంకా చారయితవ్యా మే పున రేవ భవేదితి॥ ౧౪॥

రాత్రౌ నహి సుదృష్టా మే దుర్గకర్మ విధానతః।
అవశ్యమేవ ద్రష్టవ్యా మయా లంకా నిశాక్షయే॥ ౧౫॥

కామం బద్ధస్య మే భూయః పుచ్ఛస్యోద్దీపనేన చ।
పీడాం కుర్వంతు రక్షాంసి నమే౽స్తి మనసశ్శ్రమః॥ ౧౬॥

తత స్తే సంవృతాకారం సత్త్వవంతం మహాకపిమ్।
పరిగృహ్య యయు ర్హృష్టా రాక్షసాః కపికుంజరమ్॥ ౧౭॥

శంఖభేరీ నినాదై స్తం ఘోషయంత స్స్వకర్మభిః।
రాక్షసాః క్రూరకర్మాణ శ్చారయంతిస్మ తాంపురీమ్॥ ౧౮॥

అన్వీయమానో రక్షోభి ర్యయౌ సుఖ మరిందమః।
హనుమాం శ్చారయామాస రాక్షసానాం మహాపురీమ్॥ ౧౯॥

అథాపశ్య ద్విమానాని విచిత్రాణి మహాకపిః।
సంవృతాన్ భూమిభాగాంశ్చ సువిభక్తాం శ్చ చత్వరాన్॥

వీథీశ్చ గృహసంబాధాః కపి శ్శృంగాటకాని చ।
తథా రథ్యోపరథ్యా శ్చ తథైవ గృహకాంతరాన్॥ ౨౦॥
గృహాంశ్చ మేఘసంకాశాన్ దదర్శ పవనాత్మజః॥ ౨౧॥

నైరాక్షసులు రాజాజ్ఞవలనఁ గట్టుదురేని నాకు వారుమాఱు సేసినట్లు తలంచను. యుద్ధమున రాక్షసుల నందఱిఁ జంపుటకు నేనే చాలుదునుగాని లంకయందింకొకతూరి యుల్లాసముగఁ దిరుగవలసియున్నది. కావుననిట్టిబాధను సహించియున్నాను. కోటయందుఁ జేయఁబడియున్న చిత్రవిచిత్రములగు పనులన్నియు రాత్రిపూట చక్కఁగఁ జూడరాదయ్యెను. ఉదయమునఁ దప్పక సర్వముం జూతునుగాక. బట్టలు చుట్టంబడియున్న నాతోఁకయొక్కకొనను మండునట్లుచేసి నాకు దురలబాధనుగలిగింతురు. అయినను నామనస్సున కాయాసము లేదు. అని వానరోత్తముఁ డనుకొనియెను.

౧౭. పిమ్మట నారక్కసులు సంతోషించినవారై రూపమును గుఱుచపఱచియున్నవాఁడును, బలశాలియునగు వానరోత్తమునిఁ బట్టుకొనిపోయిరి.

౧౮. క్రూరస్వభావముగల రాక్షసులు దమపనులచేతను, శంఖభేరీనాదములచేతను బట్టణమంతట ధ్వనింపఁజేయుచు హనుమంతునిం ద్రిప్పిరి.

౧౯ శత్రువులనణఁచువాఁడగు హనుమంతుఁడు రాక్షసులు వెంట నడువఁగా నేగెను. రాక్షసులయొక్క గొప్పపట్టణమును హనుమంతుఁడు బాగుగఁగాంచెను.

౨౦. ఆదొడ్డవానరుఁడు విచిత్రములగు విమానములను, ప్రాకారములనుగలభూములను, బాగుగ నేర్పడిన ముంగిళ్లను గనుంగొనియెను.

౨౧, ౨౧½. చేరికగా నిండ్లనుగల వీధులను, నాల్గుత్రోవలుగలియుచోట్లను, పెద్దబాటలను జిన్నబాటలను, లోపలియిండ్లను దెలియరానిద్వారములను మేఘములవలెనుండు గృహములను హనుమంతుఁడు గనుంగొనియెను.

చత్వరేషు చతుష్కేషు రాజమార్గే తథైవచ।
ఘోషయంతి కపింసర్వే చారీక ఇతి రాక్షసాః॥ ౨౨

స్త్రీబాలవృద్ధా నిర్జగ్ము స్తత్రతత్ర కుతూహలాత్।
తం ప్రదీపితలాంగూలం హనుమతం దిదృక్షవః॥ ౨౩

దీప్యమానే తత స్తస్య లాంగూలాగ్రే హనూమతః।
రాక్షస్య స్తా విరూపాక్ష్య శ్శంసు ర్దేవ్యా స్తదప్రియమ్॥ ౨౪

య స్త్వయాకృత సంవాద స్సీతే తామ్రముఖః కపిః।
లాంగూలేన ప్రదీప్తేన స ఏష పరిణీయతే॥ ౨౫

శ్రుత్వా తద్వచనం క్రూర మాత్మాప హరణోపమమ్।
వైదేహీ శోకసంతప్తా హుతాశన ముపాగమత్॥ ౨౬

మంగళాభిముఖీ తస్య సా తదాసీ న్మహాకపేః।
ఉపతస్థే విశాలాక్షీ ప్రయతా హవ్యవాహనమ్॥ ౨౭

యద్యస్తి పతిశుశ్రూషా యద్యస్తి చరితం తపః।
యదిచా స్త్యేకపత్నీత్వం శీతోభవ హనూమతః॥ ౨౮

యదికశ్చి దనుక్రోశ స్తస్య మయ్యస్తి ధీమతః।
యదివా భాగ్యశేషో మే శీతోభవ హనూమతః॥ ౨౯

౨౨౪. ఎల్లరాక్షసులును ముంగిళ్లయందును వీధులు గలియుచోట్ల యందును రాజవీథులయందును హనుమంతుఁడు 'వర్తమానము నెఱింగి పోవచ్చిన చారుఁడని' కేకలువైచిరి.

౨౩౪. మండుచున్నతోఁకను గలవాఁడగు హనుమంతునిఁ జూడఁ దలంచినవారై యాఁడువాండ్రును బాలురును వృద్ధులును సంతోషముతో నందదునుండి చూడఁబోయిరి.

౨౪౪. పిమ్మట నట్లు హనుమంతుని వాలముయొక్క కొన మండుచు రాఁగా వికారములగు కన్నులుగల రాక్షసస్త్రీలు విరోధమగు నీమాటను సీతాదేవికిం దెలిపిరి.

౨౫౪. ఓసీతా! ఎఱ్ఱనిమోముంగల యేవానరుఁడు నీతో భాషించెనో వాఁడే మండుచున్నతోఁకతోడ నీయూరనంతటం ద్రిప్పఁ బడుచున్నవాఁడు.

౨౬౪. ప్రాణము హరించుటతోఁ దుల్యమై క్రూరమైనదగు నామాటనువిని సీతాదేవి మిక్కిలి తపించినదై యగ్నిని మనంబున సేవించెను.

౨౭౪. సీతాదేవి యాగొప్పవానరునకు శ్రేయము గలుగుటయం దాసక్తిగలదియయ్యెను. విశాలములగు కన్నులుగల యాయిల్లాలు పూనికతో నిట్లగ్ని దేవునిం గొనియాడెను.

౨౮౪. మగనికి నుపచారము సేయుచుందునేని, మగఁడే దైవమని తపస్సుచేయుదాననైతినేని, నాభర్త పరస్త్రీలను గన్నెత్తి చూడనివాఁడయ్యెనేని, ఓయగ్నిదేవుఁడా! మాహనుమంతునకుఁ జల్లనివాఁడవుకమ్ము.

౨౯౪. బుద్ధిమంతుఁడగు నాప్రాణేశునకు నాయందించుక దయగలదేని, నాకదృష్టమేపాటియేనియుఁగలదేని, హనుమంతునకుఁ జల్లనివాఁడవుకమ్ము!

యదిమాం వృత్తసంపన్నాం తత్సమాగమ లాలసామ్।
స విజానాతి ధర్మాత్మా శీతో భవ హనూమతః॥ 30॥

యదిమాం తారయేదార్య స్సుగ్రీవ స్సత్యసంగరః।
అస్మా ద్దుఃఖాంబుసంరోధా చ్ఛీతో భవ హనూమతః॥ 31॥

తత స్తీక్ష్ణార్చి రవ్యగ్రః ప్రదక్షిణ శిఖోనలః।
జజ్వాల మృగశాబాక్ష్యా శ్శంసన్నివ శివంకపేః॥ 32॥

హనుమ జ్జనక శ్చాపి పుచ్ఛానలయుతో నిలః।
వవౌ స్వాస్థ్యకరో దేవ్యాః ప్రాలేయానిల శీతలః॥ 33॥

దహ్యమానే చ లాంగూలే చింతయామాస వానరః। 34॥
ప్రదీప్తోగ్ని రయం కస్మా న్నమాందహతి సర్వతః।
దృశ్యతే చ మహాజ్వాలః కరోతి న చ మే రుజమ్॥ 35॥

శిశిరస్యేవ సంపాతో లాంగూలాగ్రే ప్రతిష్ఠితః॥ 36॥

అథవా తదిదం వ్యక్తం యద్దృష్టం ప్లవతా మయా।
రామప్రభావా దాశ్చర్యం పర్వత స్సరితాం పతౌ॥ 37॥

యది తావ త్సముద్రస్య మైనాకస్య చ ధీమతః।
రామార్థం సంభ్రమస్తాదృ క్కిమగ్ని ర్నకరిష్యతి॥ 38॥

౩౦½. ధర్మాత్ముఁడగుహనుమ నన్ను మంచినడతగలదానినిగాను భ
ర్తతోఁగూడుటను గోరియున్నదానినిగాను దెలిసినవాఁడగునేని, హనుమం
తునకుఁ జల్లనివాఁడవగుము !

౩౧½. సత్యమగు ప్రతిజ్ఞనుగలవాఁడగు సుగ్రీవుఁడు నన్నీదుఃఖస
ముద్రమునుండి తొలఁగించుటగలదేని నీవు హనుమంతునకుఁ జల్లనివాఁ
డగుమా !

౩౨½. ఇట్లు సీత యగ్నినిగొనియాడినపిమ్మట, సమీక్షింపరాని
జ్వాలను గలిగియుండినదియు, చలింపకయుండినదియు నగునగ్ని లేడిపిల్ల
యొక్కచూపులవంటి చూపులుగల సీతయొక్క శుభమును హనుమంతున
కుఁ జెప్పినట్లు ప్రదక్షిణముగఁ జుట్టిచుట్టిమండెను.

౩౩½. హనుమంతుని తండ్రియగు వాయుదేవుఁడుంగూడ, తోఁక
యందలి నిప్పుతోఁగూడినవాఁడై యున్నను, అట్టి హనుమంతునకు సీతయొ
క్కమహిమాతిశయముచే మంచుగాలివలె నింపుగవీచెను.

౩౮, ౩౯, ౩౯½, తోఁకకాల్పంబడుచున్నను, మండుచుండు నీ
యగ్ని యేకారణముచేతనో మొదలంటు ననుంగాల్పకున్నది? ఇంతగొప్ప
జ్వాలతో నగ్నిమండుచున్నను నాకుఁ దాపముగలుగకున్నది. తోఁకయొక్క
కొన మిక్కిలి చల్లనై మంచుకురిసినట్లయున్నది.

౩౬½. అట్లుగాక, నేను దాఁటునపుడు నదులకుభర్తయగు స
ముద్రునినడుమ నాకుపచారముఁజేయఁ బర్వతరూపమున నొకయాశ్చర్య
ము శ్రీరామునిమహిమవలన వెలువడియెనుగదా! ఈనిప్పు చల్లవడుటయు
నట్టిమహిమయేయని తెలియుచున్నది.

౩౭½. బుద్ధిమంతుఁడగు సముద్రునకును, పర్వతమునకును శ్రీరా
ముని కార్యవిషయమై యంతసంపూర్ణమగు త్వరకలిగియుండెఁగదా! గొ
ప్పవాఁడగు నగ్నికి రామకార్యమున నెంతయక్కఱ యుండదు?

సీతాయా శ్చానృశంస్యేన తేజసా రాఘవస్య చ।
పితుశ్చ మమ సఖ్యేన నమాం దహతి పావకః॥ ౩౮

భూయ స్స చింతయామాస ముహూర్తం కపికుంజరః।
ఉత్పపాతాథ వేగేన ననాద చ మహాకపిః॥ ౩౯

పురద్వారం తత శ్శ్రీమా న్శైలశృంగ మివోన్నతమ్।
విభక్త రక్ష స్సంబాధ మాససా దానిలాత్మజః॥ ౪౦

సభూత్వా శైలసంకాశః క్షణేన పున రాత్మవా న్।
హ్రస్వతాం పరమాం ప్రాప్తో బంధనా న్యపశాతయత్॥ ౪౧

విముక్త శ్చాభవ చ్ఛ్రీమా న్పునః పర్వతసన్నిభః।
వీక్షమాణశ్చ దదృశే పరిఘం తోరణాశ్రితమ్॥ ౪౨

స తం గృహ్య మహాబాహుః కాలాయస పరిష్కృతమ్।
రక్షిణ స్తా న్పునస్సర్వా న్సూదయామాస మారుతిః॥ ౪౩

స తా న్నిహత్వా రణచండవిక్రమ స్సమీక్షమాణః పున రేవలం
కామ్। ప్రదీప్తలాంగూల కృతార్చిమాలీ ప్రకాశ తాదిత్య ఇ
వార్చిమాలీ॥ ౪౪

ఇతి శ్రీమత్సుందరకాండే త్రిపంచాశస్సర్గః.

౩౮౪. సీతయొక్క సాధువర్తనముచేతను శ్రీరామునియొక్క ప్రతాపముచేతను, నాతండ్రియందుఁగల మైత్రిచేతను, అగ్నిదేవుండు నన్నుఁ గాల్పకున్నవాఁడు.

౩౯౪. అవానరోత్తముఁడు కొంతసేపు పలుమాటు యోచించెను. వేగమున నెక్కఁగంతువైచెను. సింహనాదము చేసెను.

౪౦౪. పిమ్మట, కాంతినిగలవాఁడగు వాయుపుత్రుఁడు రాక్షసుల యునికి లేనిదియు, పర్వతశిఖరమువలె నెత్తయినదియు నగుపట్టణపు వాకిలిని జేరెను.

౪౧౪. ధీరుఁడగు హనుమంతుఁడు నిమిషమునఁ బర్వతమువలెఁ బెరిగి వెంటనే మిక్కిలి కుఱుచయయి కట్లనెల్ల సడలించికొనియెను.

౪౨౪. కాంతినిగలవాఁడగు నాహనుమంతుఁడు బంధములవలనవిడుపంబడి తోడనె కొండంతమేనుగలవాఁడై, తోరణస్తంభమునందున్న గుదియను జూచుచుండఁగా రాక్షసులు గాంచిరి.

౪౩౪. గొప్పభుజములుగలవాఁడగు నాహనుమానుఁడు, ఇనుపకట్లనుగల యాగుదియనందికొని యాద్వారమునం గావలియున్న రక్కసులనందఱను గొట్టెను.

౪౪౪. యుద్ధమున వేండ్రమగు దర్పమునుగల హనుమంతుఁడు, అందుఁగావలియున్నవారిం గొట్టి లంకదిక్కుమొగంబై చూచుచు మండుచున్న తోఁకయొక్కజ్వాలలవరుస గలవాఁడై, కిరణములచే నొప్పుచున్న సూర్యునివలె వెలింగెను.

ఇది యేఁబదిమూఁడవసర్గ.

---

## చతుః పంచాశస్సర్గః.

వీక్షమాణ స్తతో లంకాం కపిః కృతమనోరథః।
వర్ధమాన సముత్సాహః కార్యశేష మచింతయత్॥ ౧॥

కిన్ను ఖల్వవశిష్టం మే కర్తవ్య మిహ సాంప్రతమ్।
యదేషాం రక్షసాం భూయ స్సంతాపజననం భవేత్॥ ౨॥

వనం తావ త్ప్రమథితం ప్రకృష్టా రక్షసా హతాః।
బలైకదేశః క్షపిత శ్శేషం దుర్గవినాశనమ్॥ ౩

దుర్గే వినాశితే కర్మ భవే త్సుఖపరిశ్రమమ్।
అల్పయత్నేన కార్యేస్మి న్మమస్యా త్సఫలశ్శ్రమః॥ ౪॥

యోహ్యయం మమలాంగూలే దీప్యతే హవ్యవాహనః।
అస్య సంతర్పణం న్యాయ్యం కర్తుమేభి ర్గృహోత్తమైః॥ ౫॥

తతః ప్రదీప్తలాంగూల స్సవిద్యు దివ తోయదః।
భవనాగ్రేషు లంకాయా విచచార మహాకపిః॥ ౬॥

గృహాద్గృహం రాక్షసానా ముద్యానాని చ వానరః।
వీక్షమాణో హ్యసంత్రస్తః ప్రాసాదాంశ్చ చచార సః॥ ౭॥

## ఏఁబదినాల్గవసర్గ.

౧. అట్లు పురమందంతటందిరిగి తనకోరికను దీర్చికొన్నవాఁడై హనుమంతుఁడు లంకనుజూచుచుఁ బెంపొందుచున్న యుత్సాహముతో మిగిలి యున్నపనిని దలంచెను.

౨. ఏపని యింకను మిగిలియున్నదో యది యిప్పుడిచ్చట నేను చేయందగును. ఈపనియుంగూడ రాక్షసులకు మరల సంతాపమును బుట్టించునదియే యగును.

౩. అశోకవనము నాశముచేయంబడియెను. బలియురగు రక్కసులు చంపంబడిరి. రావణుని సేనలో నొకభాగము గూల్పంబడియెను. ఇంకను జేయవలయునది కోటనుగాల్చుట యొకటే.

౪. కోటను బాడుచేసితినేని నేఁజేసినపనియంతయు శ్రమలేకచేయంబడినట్లు తలంచెదను. కొంచెమగు యత్నముచేతనే యీకార్యమునందు నాశ్రమ నివారణమగుచున్నది.

౫. ఏయగ్ని నావాలమునంటి వెలుంగుచున్నదో యద్దానికి నిండలి యందములగు మేడలచేఁ దృప్తిసేయుట న్యాయ్యము.

౬. పిమ్మట, మండుచున్న వాలముంగల యామహోద్ధవానరుఁడు మెఱుములతోఁగూడిన మేఘమువలె లంకానగరముయొక్క మేడలపై నిటునటు సంచరించెను.

౭. రాక్షసులయొక్క యొకయింటినుండి మఱియొక యింటికి రాజగృహములను వనములను జూచుచు వెఱువక హనుమంతుఁడు సంచరించెను.

అవప్లుత్య మహావేగః ప్రహస్తస్య నివేశనమ్।
అగ్నిం తత్ర స నిక్షిప్య శ్వసనేన సమో బలీ।
తతోఽన్యత్పుప్లువే వేశ్మ మహాపార్శ్వస్య వీర్యవాన్।
ముమోచ హనుమానగ్నిం కాలానల శిఖోపమమ్॥
వజ్రదంష్ట్రస్య చ తథా పుప్లువే స మహాకపిః।
శుకస్య చ మహాతేజాః సారణస్య చ ధీమతః॥
తథా చేంద్రజితో వేశ్మ దదాహ హరియూథపః।
జంబుమాలేః సుమాలేశ్చ దదాహ భవనం తతః॥
రశ్మికేతోశ్చ భవనం సూర్యశత్రోస్తథైవ చ।
హ్రస్వకర్ణస్య దంష్ట్రస్య రోమశస్య చ రక్షసః॥
యుద్ధోన్మత్తస్య మత్తస్య ధ్వజగ్రీవస్య రక్షసః।
విద్యుజ్జిహ్వస్య ఘోరస్య తథా హస్తిముఖస్య చ॥
కరాళస్య పిశాచస్య శోణితాక్షస్య చైవ హి।
కుంభకర్ణస్య భవనం మకరాక్షస్య చైవ హి॥
యజ్ఞశత్రోశ్చ భవనం బ్రహ్మశత్రోస్తథైవ చ।
నరాంతకస్య కుంభస్య నికుంభస్య దురాత్మనః॥
వర్జయిత్వా మహాతేజా విభీషణ గృహం ప్రతి।
క్రమమాణః క్రమేణైవ దదాహ హరిపుంగవః॥
తేషు తేషు మహార్హేషు భవనేషు మహాయశాః।
గృహేష్వృద్ధిమతామృద్ధిం దదాహ స మహాకపిః।

౮, ౯. వాయుదేవునితోఁ దుల్యుఁడును, మిక్కిలి వేగముంగలవాఁడును బలవంతుఁడును బ్రతాపశాలియునగు హనుమంతుఁడు ప్రహస్తుని యింటిమీఁదికిదుమికి యందు నిప్పుపెట్టి యాదుండి మహాపార్శ్వుని యొక్క యింటిమీఁదికి జేరెను. ప్రళయకాలమందలి యగ్నితోఁ దుల్యమగు నగ్నిని నచ్చోటను వైచెను.

౧౦. నుండి ౧౬ వ. ప్రతాపశాలియు, వానరసమూహమును రక్షించువాఁడును నగు హనుమంతుఁడు మీఁదఁ జెప్పంబడిన వజ్రదంష్ట్రుఁడు ధీరుఁడగు శుకుఁడు సారణుఁడు, ఇంద్రజిత్తు జంబుమాలి సుమాలి యను వారలయిండ్లను గాల్చెను. రశ్మికేతుఁడు సూర్యశత్రుఁడు హ్రస్వకర్ణుఁడు దంష్ట్రుఁడు రోమశుఁడను రాక్షసుఁడు యుద్ధోన్మత్తుఁడు మత్తుఁడు ధ్వజగ్రీవుఁడు భయంకరుఁడగు విద్యుజ్జిహ్వుఁడు హస్తిముఖుఁడు కరాళుఁడు పిశాచుండు శోణితాక్షుఁడు కుంభకర్ణుఁడు మకరాక్షుఁడు యజ్ఞశత్రుఁడు బ్రహ్మశత్రుఁడు నరాంతకుఁడు కుంభుఁడు దుష్టుఁడగు నికుంభుఁడు నను వారలయిండ్లమీఁదికి దాఁటుచుంబోయి వరుసగా నందఱిగృహములను దగ్ధముచేసెను. విభీషణునియింటినిమాత్రము గాల్పక మానెను.

౧౭. గొప్ప కీర్తినిగలవాఁడగు హనుమంతుఁడు మిక్కిలిపూజ్యము లైనవియగు నాయాగృహములయందు సంపదలచే నొప్పియున్నవారియొక్క పెంపును మసిచేసెను.

స్వరేషాం సమతిక్రమ్య రాక్షసేంద్రస్య వీర్యవాన్।
ఆససా దాథ లక్ష్మీవాన్ రావణస్య నివేశనమ్॥ ౧౮॥
తత స్తస్మి న్గృహే ముఖ్యే నానారత్న విభూషితే।
మేరుమందర సంకాశే సర్వమంగళ శోభితే॥ ౧౯॥
ప్రదీ ప్తమగ్ని ముత్సృజ్య లాంగూలాగ్రే ప్రతిష్ఠితమ్।
ననాద హనుమా న్వీరో యుగాంత జలదో యథా॥ ౨౦॥
శ్వసనేన చ సంయోగా దతివేగో మహాబలః।
కాలాగ్నిరివ జజ్వాల ప్రావర్ధత హుతాశనః॥ ౨౧॥
ప్రదీ ప్త మగ్నిం పవన స్తేషువేశ్మ స్వచారయత్।
అభూ చ్ఛ్వసన సంయోగా దతివేగో హుతాశనః॥ ౨౨॥
తాని కాంచన జాలాని ముక్తామణిమయాని చ।
భవనా న్యవశీర్యంత రత్నవంతి మహాంతి చ॥ ౨౩॥
తాని భగ్న విమానాని నిపేతు ర్వసుధాతలే।
భవనానీవ సిద్ధానా మంబరా త్పుణ్యసంక్షయే॥ ౨౪॥
సంజజ్ఞే తుములశ్శబ్దో రాక్షసానాం ప్రధావతామ్।
స్వగృహస్య పరిత్రాణే భగ్నోత్సా హోర్జిత శ్రియామ్॥ ౨౫॥
నూన మేషాగ్ని రాయాతః కపిరూపేణ హా ఇతి॥ ౨౫½
క్రందంత్య స్సహసా పేతు స్స్తనంధయధరా స్త్రియః।
కాశ్చి దగ్నిపరీతేభ్యో హర్మ్యేభ్యో ముక్తమూర్ధజాః॥ ౨౬½
పతంత్యో రేజిరే భ్రేభ్య సౌదామిన్య ఇవాంబరాత్॥ ౨౭॥

౧౮. బలశాలియు ధీరుఁడును నగుహనుమానుఁడు రాక్షసగృహంబులనెల్లఁగడచి రాక్షసరాజగు రావణునియొక్క గృహమును జేరెను.

౧౯, ౨౦. పిమ్మట శూరుఁడగు నాంజనేయుండు పెక్కురత్నములచే నలంకరింపఁబడినదియు మేరుమందరపర్వతములతోఁ దుల్యమైనదియు, సర్వసంపదలచేతను బ్రకాశించుచున్నదియు ముఖ్యమైనదియునగు రావణునియింటియందు, తనతోఁకయొక్క కొనయందు మండుచున్ననిప్పును వైచి ప్రళయకాలమందు మేఘములు ధ్వనించునట్లు సింహనాదము నేసెను.

౨౧. ఆయగ్ని వాయువుయొక్కతోడ్పాటుచే మిక్కిలి వేగమును బలమునుగలదై ప్రళయకాలమందలియగ్నివలె మండెను. వ్యాపించెను.

౨౨. వాయువు మండుచున్నయగ్నిని గృహములయందంతట వ్యాపింపఁజేసెను. అగ్ని వాయువుయొక్క మైత్రిచే వేగముంగలదయ్యెను.

౨౩. బంగారు గవాక్షములును ముత్తెములు మణులు రత్నములుగల గొప్పమేడలు మసియయ్యెను.

౨౪. చేసికొనినపుణ్యము క్షీణింపఁగానే యాకాశమునుండి నేలంగూలు సిద్ధులయిండ్లవలె, అందలి విఱిగినవిమానములు భూమిపైఁబడియెను.

౨౫, ౨౫½. తమతమయిండ్లను గాపాడుకొనుటయం దుత్సాహమును బలమును లేనివారై పరుఁగెత్తుచున్న రాక్షసులు 'అగ్ని హోత్రుఁడే వానరరూపమున వచ్చెనక్కటా! ఇది సత్యము' అని మొత్తమై ధ్వనింజేసిరి.

౨౬, ౨౬½. బిడ్డలను జేతనుంచుకొన్న కొందఱు స్త్రీలు దలవెంట్రుకలు ముడివదలి జారవైచికొని దుఃఖించుచు, మంటలుచుట్టుకొనిన మేడలనుండి శీఘ్రమున వెలువడిరి. ఆమేడలపైనుండి క్రిందికిఁ బడుచున్న స్త్రీలు మేఘములనుండి వెలువడు మెఱుపులవలె నొప్పిరి.

వజ్రవిద్రుమ వైడూర్య ముక్తారజత సంహితాన్।
విచిత్రా న్భవనా న్ధాతూన్ స్యందమానా న్దదర్శ సః॥ ౨౮॥

నాగ్ని స్తృప్యతి కాష్ఠానాం తృణానాం హరియూథపః।
నాగ్నే ర్నాపి విశస్తానాం రాక్షసానాం వసుంధరా॥ ౨౯॥

క్వచి త్కింశుకసంకాశాః క్వచి చ్ఛాల్మలి సన్నిభాః।
క్వచి త్కుంకుమసంకాశా శ్శిఖా వహ్నే శ్చకాశిరే॥ ౩౦॥

హనూమతా వేగవతా వానరేణ మహాత్మనా।
లంకాపురం ప్రదగ్ధంత ద్రుద్రేణ త్రిపురం యథా॥ ౩౧॥

తత స్తు లంకాపురపర్వతాగ్రే సముత్థితో భీమపరాక్రమోగ్నిః।
ప్రసార్య చూడావలయం ప్రదీప్తో హనూమతా వేగవతా విసృష్టః॥ ౩౨॥

యుగాంతకాలానల తుల్యవేగ స్సమారుతోగ్ని ర్వవృధే దివి స్పృక్। విధూమరశ్మి ర్భవనేషుసక్తో రక్షశ్శరీరాజ్య సమర్పితార్చిః॥ ౩౩॥

ఆదిత్యకోటీసదృశ స్సుతేజా లంకాం సమస్తాం పరివార్యతిష్ఠన్। శబ్దై రనేకై రశనిప్రరూఢై ర్భిందన్నివాండం ప్రబభౌ మహాగ్నిః॥ ౩౪॥

౨౮. వజ్రములు వైడూర్యములు ముత్తెములు వెండి వీనితోఁగూడి నవియు వింతలైనవియు నగుగృహములనుండి వేడిమిచేఁ గరఁగి పాఱుచున్న బంగారము మొదలగులోహముల నాతండు గనియెను.

౨౯. అగ్ని కట్టెపుడకలచేతను గడ్డిపోఁచలచేతను తనివి చెందకుండెనియట్లును, అగ్నిచే మరణమునొందిన రాక్షసులచేత భూమితృప్తిఁ జెందని యట్లును హనుమంతుఁడు చచ్చినరాక్షసులతోఁ దృప్తిఁ బొందఁడయ్యెను.

౩౦. అగ్నిజ్వాల లొకచోట మోదుగపువ్వులవలెను మఱియొకచో బూరుగపువ్వులతోఁ దుల్యముగను, ఇంకొకయెడఁ గుంకుమకాంతితోఁ సమముగను వెలింగెను.

౩౧. వేగవంతుఁడును ధీరుఁడు నగుహనుమంతుఁడను వానరునిచేత, త్రిపురములు రుద్రునిచేఁ గాల్పంబడినట్లు లంక దగ్ధము సేయంబడెను.

౩౨. పిమ్మట వేగవంతుఁడగు హనుమంతునిచేత విడువంబడినదియు భయంకరమైనదియు నగునగ్ని, జ్వాలలనువ్యాపింపఁజేసి మండుచున్నదై లంకాపురముండునట్టి పర్వతముపై విజృంభించెను.

౩౩. ప్రళయకాలమందలి యగ్నితోఁ దుల్యమగు వేగమును గలదియు గాలితోఁగూడినదియు నాకాశమునంటుచున్నదియు, పొగలేని కాంతిని గలదియు, ఇండ్లయందంటుకొన్నదియు నగునగ్ని రాక్షసులశరీరములనెడు నేతిచేఁ బెనుపొందినజ్వాలలను గలదియై పెరిగెను.

౩౪, కోటిసూర్యులంబోలిన తేజస్సునుగలదియగు గొప్పయగ్ని లంకాపురమందంతట వ్యాపించినదై, పిడుగులవలె దృఢములైన పెక్కుధ్వనులచేఁ బ్రహ్మాండమును బ్రద్దలుసేయుదానివలె వెలింగెను.

తత్రాంబరా దగ్ని రతిప్రవృద్ధో రూక్షప్రభః కింశుక పుష్పచూ
డః । నిర్వాణ ధూమాకుల రాజయశ్చ నీలోత్పలాభాః ప్రచకా
శి రేఽభ్రాః॥ ౩౫॥

వజ్రీ మహేంద్ర స్త్రిదశేశ్వరోవా సాక్షాద్యమోవా వరుణో
నిలోవా । రుద్రోఽగ్ని రర్కో ధనదశ్చ సోమో న వానరోఽయం
స్వయమేవ కాలః॥ ౩౬॥

కింబ్రహ్మణ స్సర్వపితామహస్య సర్వస్యధాతు శ్చతురాననస్య।
ఇహాఽగతో వానరరూపధారీ రక్షోపసంహారకరః ప్రకోపః॥ ౩౭॥

కింవైష్ణవంవా కపిరూపమేత్య రక్షోఽవినాశాయ పరంసు తేజః।అ
నంత మవ్యక్త మచింత్యమేకం స్వమాయయా సాంప్రతమా
గతం వా॥ ౩౮॥

ఇత్యేవమూచు ర్బహవో విశిష్టా రక్షోగణా స్తత్ర సమేత్యస
ర్వే । సప్రాణిసంఘాం సగృహాం సవృక్షాం దగ్ధాం పురీం తాం
సహసా సమీక్ష్య॥ ౩౯॥

తతస్తు లంకా సహసా ప్రదగ్ధా సరాక్షసా సాశ్వరథా సనా
గా । సపక్షిసంఘా సమృగా సవృక్షా రురోద దీనా తుములం
సశబ్దమ్॥ ౪౦॥

౩౫. ఆకాశమునుండి మిక్కిలి పెరిగినదియగునగ్ని వేండ్రమగు కాంతినిగలదియై మోదుగపువ్వులఁబోలిన యెఱ్ఱనిజ్వాలలు గలది యయ్యె. చల్లారుచున్న నిప్పులవలన వెడలిన పొగచేఁ గ్రమ్మినవై మేఘములు నల్లకలువలవలెఁ బ్రకాశించినవియయ్యెను.

౩౬. ఈతండు వజ్రమును ధరించియున్నవాఁడును మహేంద్రుఁడను బిరుదుఁగలవాఁడును నగు దేవేంద్రుఁడో! ప్రత్యక్షమైన యముఁడో! వరుణుఁడో! వాయువో! రుద్రుఁడో! అగ్నియో! సూర్యుఁడో! కుబేరుఁడో! చంద్రుఁడో! తానై వచ్చిన లయకాలమో! అగునుగాని వానరుఁడు గాఁడు.

౩౭. జీవకోటికెల్ల విధాతయు సర్వమునుసృజించువాఁడును నాల్గుమోములుగలవాఁడును నగుబ్రహ్మయొక్క విశేషకోపము వానరరూపమునుధరించి రాక్షసులనునాశము సేయునదియగుచు నిందువచ్చెనాయేమి?

౩౮. కడలేనిదియు, తెలియరానిదియు, చర్చింపసాధ్యముగానిదియు, మఱియొండులేనిదియు, అన్నింటిని మించినదియు, విష్ణుదేవునిసంబంధమైనదియు, నగుమహాతేజము రాక్షసులను నాశముసేయుకొఱకుఁ దన మాయచే నిప్పుడు వానరరూపమునుధరించి వచ్చెనో!

౩౯. చావఁగా మిగిలియున్న రాక్షసులందఱును జేరి జంతువులసమూహములతోడను గృహములతోడను వృక్షములతోడను దగ్ధమైన పురము గాంచి మీఁదఁజెప్పంబడిన ట్లనుకొనిరి.

౪౦. పిమ్మట లంకాపురి రాక్షసులు గుఱ్ఱములు రథములు నేనుఁగులు పక్షిసమూహములు మృగములు వృక్షములు మొదలగు వానితోడఁగూడ శీఘ్రమున లెస్సగఁ గాల్పంబడినదై బలహీనముగనుండు నొకధ్వనితోడ నేడ్చెను.

హా తాత హా పుత్రక కాంత మిత్ర హా జీవితం భోగయుతం
సుపుణ్యమ్ । రక్షోభి రేవం బహుధా బ్రువద్భి శ్శబ్దః కృతో
ఘోరతర స్సుభీమః॥ ౪౧॥

హుతాశనజ్వాల సమావృతా సా హతప్రవీరా పరివృత్తయో
ధా । హనూమతః క్రోధబలాభిభూతా బభూవ శాపోప హ
తేవ లంకా॥ ౪౨॥

ససంభ్రమత్రస్త విషణ్ణరాక్షసాం సముజ్జ్వలజ్జ్వాల హుతాశ
నాంకితామ్ । దదర్శ లంకాం హనుమాన్ మహామనా స్స్వయం
భు కోపోపహతా మివా వనిమ్॥ ౪౩॥

భజ్క్త్వావనం పాదపరత్న సంకులం హత్వాతు రక్షాంసి మ
హాంతి సంయుగే । దగ్ధ్వాపురీం తాం గృహరత్నమాలినీం త
స్థౌ హనూమా న్పవనాత్మజః కపిః॥ ౪౪॥

త్రికూటశృంగాగ్రతలే విచిత్రే ప్రతిష్ఠితో వానర రాజసింహః
ప్రదీప్తలాంగూల కృతార్చిమాలీ. వ్యరాజతాదిత్య ఇవాంశు
మాలీ॥ ౪౫॥

సరాక్షసాం స్తాన్ సుబహూంశ్చ హత్వా వనం చ భజ్క్త్వా
బహుపాదపం తత్ । విసృజ్య రక్షోభవనేషు చాగ్నిం జగామ
రామం మనసా మహాత్మా॥ ౪౬॥

౪౧. ఓతండ్రీ ! ఓబిడ్డా ! ఓప్రాణేశా ! ఓప్రియుఁడా ! భోగములతోఁ గూడినదియై పుణ్యమును బ్రకటించుచున్నదియగు బ్రతుకా ! కటకటా ! అని పెక్కుతెఱంగులఁ బలుకుచున్న రాక్షసులచేత వినిసహింపరానిదియు, భయంకరమైనదియు నగుధ్వని చేయంబడియెను.

౪౨. అగ్నిజ్వాలలచేఁ జుట్టంబడినదియు, కొట్టంబడిన వీరులను గలదియు, పాఱిపోయిన బంటులనుగలదియు, నగులంక హనుమంతునియొక్క కోపాతిశయముచే రూపుమాపంబడి శాపముచేఁ జెడినదానివలె నుండెను.

౪౩. గొప్పమనస్సుగలవాఁడగు హనుమంతుఁడు, ప్రకాశించుచున్నమంటలనుగల యగ్నిచేఁ దెలియఁదగినదియు, తొట్రుపాటుచేత ఖిన్నులైన రాక్షసులతోడను గూడినదియునగు లంకను బ్రహ్మదేవుని కోపముచేఁ బాడునేయంబడిన భూమివలె నుండఁగనియెను.

౪౪. వాయుపుత్రుఁడగు హనుమంతుఁడు మంచివృక్షములచే నెడములేకున్నవనమును నాశముచేసి, యుద్ధమున గొప్పవారగు రాక్షసులను జంపి, అందమగు నిండ్లను గలదియగులంకాపురముం గాల్చివైచెను.

౪౫. వింతయైనదియగు త్రికూటపర్వతముయొక్క శిఖరమున నున్నవానరోత్తముఁడు మండుచున్నతోఁకచేఁ గల్పింపఁబడిన జ్వాలలను గలవాఁడై కిరణములచేనొప్పిన సూర్యునివలె వెలిఁగెను.

౪౬. దొడ్డవాఁడగు నాతఁడు పెక్కుచెట్లను గలదియగు వనమును రూపుమాపి, పెక్కండ్రు రక్కసులను నేలఁగలిపి, రాక్షసగృహములయం దగ్నివైచి మనస్సున శ్రీరాముని దలంచెను.

తతస్తు తం వానరవీరముఖ్యం మహాబలం మారుతతుల్యవేగమ్
మహామతిం వాయుసుతం వరిష్ఠం ప్రతుష్టువు ర్దేవగణాశ్చ
సర్వే॥ ౪౭॥

భఙ్క్త్వా వనం మహాతేజా హత్వా రక్షాంసి సంయుగే।
దగ్ధ్వా లంకాపురీం రమ్యాం రరాజ స మహాకపిః॥ ౪౮।

తత్ర దేవా స్సగంధర్వా స్సిద్ధాశ్చ పరమర్షయః।
దృష్ట్వా లంకాం ప్రదగ్ధాం తాం విస్మయం పరమంగతాః॥౪౯॥

తం దృష్ట్వా వానరశ్రేష్ఠం హనుమంతం మహాకపిమ్।
కాలాగ్నిరితి సంచింత్య సర్వభూతాని తత్రసుః॥ ౫౦॥

దేవాశ్చ సర్వే మునిపుంగవాశ్చ గంధర్వ విద్యాధర నాగయ
క్షాః । భూతాని సర్వాణి మహాంతితత్ర జగ్ముః పరాంప్రీతి
మతుల్యరూపామ్॥ ౫౧॥

ఇతి శ్రీమత్సుందరకాండే - చతుఃపంచాశస్సర్గః.



## పంచపంచాశస్సర్గః.

లంకాం సమస్తాం సందీప్య లాంగూలాగ్నిం మహాబలః।
నిర్వాపయామాస తదా సముద్రే హరిసత్తమః॥ ౧॥

సందీప్యమానాం విధ్వస్తాం త్రస్తరక్షోగణాం పురీమ్।
అవేక్ష్య హనుమా న్లంకాం చింతయామాస వానరః॥ ౨॥

౪౭. అటుపై వానరవీరులలో ముఖ్యుఁడును బలశాలియు వాయువుంబోలు వేగముంగలవాఁడును గొప్పబుద్ధిగలవాఁడును వాయుదేవుని పుత్రుఁడును యోగ్యుఁడును నగుహనుమంతుని దేవతలసమూహము లన్నియుం గొనియాడెను.

౪౮. మిక్కిలి ప్రతాపముంగలవాఁడగు నాదొడ్డవానరుఁడు వనమును జెఱచి యుద్ధమున రాక్షసులఁ దునిమి యందమగు లంకాపురమును గాల్చి ప్రకాశించినవాఁ డయ్యెను.

౪౯. దేవతలును గంధర్వులును సిద్ధులును ఋషిశ్రేష్ఠులును లెస్స గదగ్ధమైన లంకనుగాంచి యందు మిక్కిలియచ్చెరువందిరి.

౫౦. వానరులలో శ్రేష్ఠుఁడగు హనుమంతునింగాంచి, ఇది ప్రళయకాలమందలి యగ్నికాఁబోలునని సర్వభూతములును భీతిల్లెను.

౫౧. అందు దేవతలందఱును, మునిశ్రేష్ఠులును, గంధర్వసిద్ధవిద్యాధరులును సాటిలేనియంతటి సంతోషమును బొందుటగలిగెను.

ఇది యేఁబదినాల్గవసర్గ.

---

ఏఁబది యైదవసర్గ.

౧. గొప్పబలముంగలవాఁడగు నావానరోత్తముఁడు తోఁకయందలి నిప్పును లంకయందంతటవెలింగించి పిమ్మట దానిని సముద్రమునఁ జల్లార్చెను.

౨. మండుచున్నదియు, రూపుమాసినదియు భీతిల్లినరాక్షసుల మూఁకలనుగలదియు నగులంకనుగాంచి వానరుఁడగుహనుమ చింతించెను.

తస్యాభూ త్సుమహాం స్త్రాసః కుత్సాచాత్మ న్యజాయత।
లంకాం ప్రదహతా కర్మ కింస్వి త్కృత మిదం మయా॥ ౩॥

ధన్యా స్తే పురుషశ్రేష్ఠా యేబుద్ధ్యా కోపముత్థితమ్।
నిరుంధంతి మహాత్మానో దీప్తమగ్ని మివాంభసా॥ ౪॥

క్రుద్ధః పాపం నకుర్యాత్కః క్రుద్ధోహన్యా ద్గురూ నపి।
క్రుద్ధః పరుషయా వాచా నర స్సాధూ నధిక్షిపేత్॥ ౫॥

వాచ్యావాచ్యం ప్రకుపితో నవిజానాతి కర్హిచిత్।
నాకార్యమస్తి క్రుద్ధస్య నావాచ్యం విద్యతే క్వచిత్॥ ౬॥

య స్సముత్పతితం క్రోధం క్షమయైవ నిరస్యతి।
యథోరగ స్త్వచం జీర్ణాం సవై పురుష ఉచ్యతే॥ ౭॥

ధిగస్తు మాం సుదుర్బుద్ధిం నిర్లజ్జం పాపకృత్తమమ్।
అచింతయిత్వా తాం సీతా మగ్నిదం స్వామిఘాతుకమ్॥ ౮॥

యదిదగ్ధా త్వియం లంకా నూనమార్యాపి జానకీ।
దగ్ధా తేన మయా భర్తు ర్హతం కార్య మజానతా॥ ౯॥

యదర్థ మయ మారంభ స్తత్కార్య మవసాదితమ్।
మయాహి దహతా లంకాం నసీతా పరిరక్షితా॥ ౧౦॥

ఈషత్కార్య మిదం కార్యం కృతమాసీ న్నసంశయః।
తస్య క్రోధాభి భూతేన మయా మూలక్షయః కృతః॥ ౧౧॥

౩. ఆంజనేయునకు దొడ్డభయము పుట్టెను. మనస్సున నిందయుఁదోఁచెను. లంకనుగాల్చుచున్న నాచేత నిందింపఁబడిన యీ కార్యము చేయంబడియెను.

౪. మండుచుండునగ్నిని నీటిచేఁ జల్లార్చునట్లు బుద్ధిచేతఁ గోపము నెవ్వ రణంపఁగలరో యట్టిపురుషశ్రేష్ఠులు కృతార్థులు.

౫. కోపగించినవాఁడెవం డేకార్యముం జేయఁడు ? కోపముంగల వాఁడు గురువులనుగూడఁజంపును. కోపించిన జనుఁడు వాక్కుచే యోగ్యులనుగూడ నిందించును.

౬. కోపించినవాఁడు చెప్పఁదగినమాటలు జెప్పఁదగనిమాటలను దెలియనేరఁడుగదా ! కోపగించినవానికిఁ జేయరానిపని లేదు. ఎందేనియుఁ జెప్పఁగూడనిమాటయుఁ గలుగదు.

౭. పాము కుబుసమూడ్చునట్లుగ నెవండుదనకోపము నోర్పుచేన ణఁచుచున్నాఁడో వాఁడే పురుషుఁడని చెప్పంబడును.

౮. సీతాదేవిని దలఁపకయే లంకయందగ్గి పెట్టిన స్వామిద్రోహిని, పాపాత్ములలో మొదటివానిని, సిగ్గుమాలినవానిని, దుష్టబుద్ధి గలవానిని నన్నుంగూర్చి నిందింపఁదగును.

౯. ఈలంకాపురి కాల్పంబడినదే యైనచో నుత్తమురాలగు సీతయు నిశ్చయముగఁ గాల్పంబడియే యుండును. కోపస్వభావము గలవాఁడ నగు నాచేత స్వామికార్యము చెఱుపంబడియెను.

౧౦. లంకనుగాల్చుచున్న నాచేత సీత రక్షింపఁబడదయ్యెం గావున నెందుకై యింతసన్నాహముచేసితినో యాపని చెఱుపంబడినదియయ్యెను.

౧౧. నేనువచ్చినపని గొప్పదియయ్యును గొద్దిపాటిదిగాఁ జేయం బడినదయ్యెను. ఇందులకు సందేహములేదు. కోపముచేఁ లోఁబఱచికొనఁ బడిననాచేత నట్టికార్యమునకు మూలముగానుండిన పదార్థము నాశము నేయఁబడియెను.

వినష్టా జానకీ నూనం నహ్యదగ్ధః ప్రదృశ్యతే।
లంకాయాం కశ్చిదుద్దేశ స్సర్వా భస్మీకృతా పురీ॥

యది తద్విహతం కార్యం మమ ప్రజ్ఞావిపర్యయాత్।
ఇహైవ ప్రాణసన్న్యాసో మమాపి హ్యద్య రోచతే॥

కిమగ్నౌ నిపతామ్యద్య ఆహోస్విద్బడబాముఖే।
శరీరమాహో సత్త్వానాం దద్మి సాగరవాసినామ్॥

కథం హి జీవతా శక్యో మయా ద్రష్టుం హరీశ్వరః।
తౌ వా పురుషశార్దూలౌ కార్యసర్వస్వఘాతినా॥

మయా ఖలు తదేవేదం రోషదోషాత్ప్రదర్శితమ్।
ప్రథితం త్రిషు లోకేషు కపిత్వ మనవస్థితమ్॥

ధిగస్తు రాజసం భావ మనీశ మనవస్థితమ్।
ఈశ్వరేణాపి యద్రాగాన్మయా సీతా న రక్షితా॥

వినష్టాయాం తు సీతాయాం తావుభౌ వినశిష్యతః।
తయోర్వినాశే సుగ్రీవ స్సబంధు ర్వినశిష్యతి॥

ఏతదేవ వచశ్శ్రుత్వా భరతో భ్రాతృవత్సలః।
ధర్మాత్మా సహశత్రుఘ్నః కథం శక్ష్యతి జీవితుమ్॥

ఇక్ష్వాకువంశే ధర్మిష్ఠే గతే నాశ మసంశయమ్।
భవిష్యంతి ప్రజాస్సర్వాః శోకసంతాపపీడితాః॥

౧౨. లంకయందేచోటును గాల్పఁబడనిది గానఁబడలేదు. పట్టణమంతయు బూడిదెయయ్యెను. సీతయు నిశ్చయముగ నశించియుండవలెను.

౧౩. నా తెలివి లేమిచే నీపని యిట్లే చెడియుండునేని నేనిచ్చట నే నా ప్రాణములను విడుచుట కిప్పుడుద్యుక్తుఁడనై యున్నాఁడను.

౧౪. ఇవుడే నిప్పునఁ బడుదునా! బడబాగ్నియొక్క వాతం బడుదునా! అట్లు కాదేని సముద్రమునందున్న జంతువులకు దేహమును ధార వోయుదునా!

౧౫. కార్యమునంతయుఁ జెఱచి బ్రదికియున్న నాచేత సుగ్రీవుఁడేని పురుషోత్తములగు రామలక్ష్మణులేని యెట్లు చూడందగినవారు.

౧౬. రాక్షసులయందు నాకుంగల రోషముయొక్క దోషముచేని ట్లుచేసినవాఁడనైతినిగదా! దీనిచే వానరబుద్ధి చపలమైనదని మూఁడులోకములయందును బ్రఖ్యాతమయ్యెను.

౧౭. రక్షింపఁజాలినవాఁడనై యుండియుఁ గోపముచేఁబీడింపఁబడిన నాచేత సీత రక్షింపఁబడదయ్యెను గావున, అధికారినిగలుగనిదియుఁ జపలమైనదియునగు రజోగుణబద్ధమయిన నా స్వభావమును నిందించువాఁడను.

౧౮. సీత నశించిన దేని రామలక్ష్మణులిద్దరును నశింతురు వారి పిమ్మట బంధుసహితముగ సుగ్రీవుఁడు నశింపఁగలఁడు.

౧౯. సోదరులయందు నెయ్యముంగలవాఁడును ధర్మపరుఁడును నగు భరతుఁ డీమాటను విని శత్రుఘ్న సమేతుఁడై యెట్లు బ్రతికియుండును?

౨౦. ధర్మస్వభావముం గలదియగు నిక్ష్వాకువంశము నశించినచోఁ బ్రజలందఱును శోకమువలని సంతాపముచేఁ బాధింపఁబడుదురు. నిస్సంశయము.

తదహం భాగ్యరహితో లుప్త ధర్మార్థ సంగ్రహః।
రోషదోష పరీతాత్మా వ్యక్తం లోకవినాశనః॥ ౨౧॥

ఇతి చింతయత స్తస్య నిమిత్తా న్యుపపేదిరే।
పూర్వమ ప్యుపలబ్ధాని సాక్షా త్పున రచింతయత్॥ ౨౨॥

అథవా చారుసర్వాంగీ రక్షితా స్వేన తేజసా।
న నశిష్యతి కల్యాణీ నాగ్నిరగ్నౌ ప్రవర్తతే॥ ౨౩॥

నహి ధర్మాత్మన స్తస్య భార్యా మమిత తేజసః।
స్వచారిత్రాభి గుప్తాం తాం స్ప్రష్టు మర్హతి పావకః॥ ౨౪॥

నూనం రామప్రభావేన వైదేహ్యా స్సుకృతేన చ।
యన్మాం దహనకర్మాయం నాదహ ద్ధవ్యవాహనః॥ ౨౫॥

త్రయాణాం భరతాదీనాం భ్రాతౄణాం దేవతాచ యా।
రామస్య చ మనః కాంతా సా కథం వినశిష్యతి॥ ౨౬॥

యద్వా దహనకర్మాయం సర్వత్ర ప్రభురవ్యయః।
న మే దహతి లాంగూలం కథమార్యాం ప్రధక్ష్యతి॥ ౨౭॥

పునశ్చా చింతయ త్తత్ర హనుమా న్విస్మిత స్తదా।
హిరణ్యనాభస్య గిరే ర్జలమధ్యే ప్రదర్శనమ్॥ ౨౮॥

తపసా సత్యవాక్యేన అనన్యత్వా చ్చ భర్తరి।
అపి సా నిర్దహే దగ్నిం న తా మగ్నిః ప్రధక్ష్యతి॥ ౨౯॥

౨౧. కావుననే నే నదృష్టహీనుఁడను, ధర్మార్థములను జెఱచి కొన్నవాఁడను, రోషముచే నాక్రమింపఁబడిన యాత్మనుగలవాఁడను స్పష్టముగా లోకనాశకుఁడనైతిని.

౨౨. అని ఇట్లు చింతించుచున్న హనుమంతునకు శుభసూచకము లుతోఁచెను. పూర్వము గలిగినవియైనను మరల యోచించెను.

౨౩. అట్లుగాదు, సర్వాంగములయందును సౌందర్యముఁగలదియు శుభస్వరూపురాలును నగుసీత తన పతివ్రతాధర్మముచే నశింపకయే నుండును. ఏలనన నగ్నియం దగ్ని ప్రవేశింపనేరదు.

౨౪. ధర్మాత్ముఁడును మిక్కిలి తేజముంగలవాఁడును నగు రామునకు భార్యయైనదియు, తన నడవడిచేతనే రక్షింపఁబడినదియు నగు సీత నగ్నిదేవుఁడు ముట్టంజాలఁడు.

౨౫. కాల్చుటయను పనిగల యాయగ్నిహోత్రుఁడు నన్నే కారణముచేఁ గాల్పండయ్యెనో యట్టి శ్రీరామునిమహిమవలనను సీతయొక్క పుణ్యముచేతను సీత నంటఁజాలఁడు.

౨౬. ఏ సీత భరతుఁడు మొదలగు ముగ్గురన్నదమ్ములకు దేవతవలెఁ బూజ్యురాలో, శ్రీరామునకుఁబ్రియురాలో, యట్టిదేవి యేల నశించును.

౨౭. కాల్చుటయే పనిగాఁగలవాఁడును, సమర్థుఁడును నాశములేని వాఁడునునగు నగ్ని నాతోఁకనే కాల్పఁడయ్యెను; పూజ్యురాలగు సీత నెట్లు కాల్చును.

౨౮, ౨౯. హనుమంతుఁ డచ్చట నప్పుడు మరల సముద్రమునందలి, సముద్రమధ్యమున హిరణ్యనాభమనుపర్వతమును [illegible] తలంచెను. తపస్సుచే సత్యవ్రతముచే భర్తయందలి సంకల్పము [illegible] నాదేవి యగ్నినే దహింపఁగలదుగాని యగ్ని యామెనుగాల్పనేరదు.

సతథా చింతయం స్తత్ర దేవ్యా ధర్మపరిగ్రహామ్।
శుశ్రావ హనుమాన్ వాక్యం చారణానాం మహాత్మనామ్॥
అహో ఖలు కృతంకర్మ దుష్కరం హి హనూమతా।
అగ్నిం విసృజతాభీక్ష్ణం భీమం రాక్షసవేశ్మని॥ ౩౧॥
ప్రపలాయిత రక్షస్త్రీ బాలవృద్ధ సమాకులా।
జనకోలాహలా ధ్మాతా క్రందంతీ వాద్రికందరే॥ ౩౨॥
దగ్ధేయం నగరీ సర్వా సాట్టప్రాకార తోరణా।
జానకీ న చ దగ్ధేతి విస్మయో ద్భుత ఏవ నః॥ ౩౩॥
స నిమిత్తైశ్చ దృష్టార్థైః కారణైశ్చ మహాగుణైః।
ఋషివాక్యైశ్చ హనుమా నభవ త్ప్రీతమానసః॥ ౩౪॥
తతః కపిః ప్రాప్తమనోరథార్థ స్తామక్షతాం రాజసుతాం వి
దిత్వా। ప్రత్యక్షత స్తాం పునరేవ దృష్ట్వా ప్రతిప్రయాణాయ
మతిం చకార॥ ౩౫॥

ఇతి శ్రీమత్సుందరకాండే - పంచపంచాశస్సర్గః.

---

## షట్పంచాశస్సర్గః.

తతస్తు శింశుపామూలే జానకీం పర్యుపస్థితామ్।
అభివా ద్యాబ్రవీ ద్దిష్ట్యా పశ్యామి త్వా మిహాక్షతామ్॥ ౧॥

౩౦. అచ్చట సీతాదేవియొక్క ధర్మస్వరూపమునుగూర్చి స్మరించుచున్న హనుమంతుఁడు దొడ్డవారగు చారణులయొక్కవాక్యమును వినియెను.

౩౧, ౩౨, ౩౩. రాక్షసుల ఇండ్లయందు భయంకరమైన యగ్నిని బలుమాఱువైచుచున్న హనుమంతునిచేత నసాధ్యమగుపని చేయఁబడియెను గదా! ఆశ్చర్యము! పాఱిపోవుచున్న రాక్షసస్త్రీలు బాలురు వృద్ధులు మొదలగువారిచే సమ్మర్దమైనదియు జనులయొక్క సంకులమగు ధ్వనిచే మ్రోఁగుచున్నదియునై పర్వతగుహయం దేడ్చుచున్నదో యన్నట్లున్నదియు, బురుజులతోడను ప్రాకారములతోడను ద్వారములతోడనుగూడినదియు నగు నీపట్టణమంతయుఁగాల్పఁబడినది, సీతాదేవిమాత్రముకాల్పఁబడలేదు. అనునట్టి యాశ్చర్యము మనకు వింతయేకదా!

౩౪. ఆహనుమంతుఁడు ప్రత్యక్షమైన ఫలములనుగల శకునములచేతను, గొప్పగుణములనుగల కారణములచేతను. ఋషులవాక్యములచేతను సంతోషించినవాఁడయ్యెను.

౩౫. పిమ్మట నాంజనేయుండు, కోరినప్రయోజనమును బొందినవాఁడై, సీతాదేవి చేటుపొందలేదని యెఱింగి, ఆమెను మఱియొకతూరి ప్రత్యక్షముగఁగాంచి ప్రయాణముగా నుద్దేశించెను.

ఇది ఏఁబదియైదవసర్గ.

ఏఁబదియాఱవసర్గ.

౧. పిమ్మట నశోకవనమున నొక యిరుగుడుచెట్టుయొక్క మొదటఁగూర్చున్న నీతకుమ్రొక్కి. ఓ దేవి నిని గ్చోట నేయాపదను జెందకయున్నదానినిగా నాభాగ్యవశమునం గనుచున్నానని హనుమంతుఁడువలికెను.

తత స్తం ప్రస్థితం సీతా వీక్షమాణా పునఃపునః।
భర్తృ స్నేహాన్వితం వాక్యం హనుమంత మభాషత॥
కామ మస్య త్వమేవైకః కార్యస్య పరిసాధనే।
పర్యాప్తః పరవీరఘ్న యశస్య స్తే బలోదయః॥
శరైస్తు సంకులాం కృత్వా లంకాం పరబలార్దనః।
మాం నయేద్యది కాకుత్థ్స స్తత్తస్య సదృశంభవేత్॥
తద్యథా తస్య విక్రాంత మనురూపం మహాత్మనః।
భవత్యాహవ శూరస్య తథా త్వ ముపపాదయ॥
త దర్థోపహితం వాక్యం ప్రశ్రితం హేతు సంహితమ్।
నిశమ్య హనుమాం స్తస్యా వాక్యము త్తర మబ్రవీత్॥
క్షిప్రమేష్యతి కాకుత్థ్సో హర్యృక్ష ప్రవరై ర్వృతః।
య స్తేయుధి విజిత్యారీన్ శోకం వ్యపనయిష్యతి॥
ఏవ మాశ్వాస్య వైదేహీం హనుమా న్మారుతాత్మజః।
గమనాయ మతింకృత్వా వైదేహీ మభ్యవాదయత్॥
తత స్స కపిశార్దూల స్స్వామి సందర్శనోత్సుకః।
ఆరురోహ గిరిశ్రేష్ఠ మరిష్ట మరిమర్దనః॥
తుంగపద్మక జుష్టాభి ర్నీలాభి ర్వనరాజిభిః।
సోత్తరీయ మివాంభోదై శ్శృంగాంతర విలంబిభిః॥

౨. పిమ్మటఁ బ్రయాణమైన హనుమంతుని సీతాదేవి పలుమాఱు చూచుచు, మగనియందలి స్నేహముతోఁ గూడినదియగు నామె హనుమంతునితోఁ బలికెను.

౩. శత్రువీరుల నణఁచువాఁడా! ఈ రాక్షసులను జయించి నన్నుఁ గొనిపోవుట యనుపని చేయుటయందు నీవొక్కఁడవే లెస్సఁగఁ జాలుదువు. ఇంతటిబలముం గలుగుట నీకీర్తికొఱకే యగును.

౪. శత్రుసేనలను పీడించువాఁడగు రాముండు లంకను బాణములచేఁ గప్పి నన్నుఁ గొనిపోవునేని యాతని పెంపున కది తగినదియగును.

౫. కావున నే గొప్పవాఁడును యుద్ధమునఁ దెంపరియునగు శ్రీరామునకుఁ దగిన పౌరుష మెట్లుగలుగునో యట్లు నీవు పురికొల్పుము.

౬. ఆ రాముని కార్యమునే కూర్చినదియు, అడఁకువగలదియు, హేతువుతోఁ గూడినదియు నగు సీతయొక్క మాటవిని హనుమంతుఁడు మాఱు పలికెను.

౭. వానరులచేతను, ఎలుఁగుబంట్లచేతను, జుట్టంబడినవాఁడై శ్రీరాముండు శీఘ్రమున నిందువచ్చును. ఆతండు యుద్ధమున శత్రువులనుజయించి నీయొక్క దుఃఖముం దీర్పఁగలవాఁడు.

౮. వాయుపుత్రుఁడగు హనుమంతుఁడు సీత నిట్లూరడించి ప్రయాణమున కుద్దేశించినవాఁడై సీతాదేవికి మ్రొక్కెను.

౯. అటుపై శత్రువుల నణఁచువాఁడును వానరోత్తముఁడును నగు హనుమంతుఁడు ప్రభుండగు శ్రీరాముని జూచుటయం దుత్సాహముం గలవాఁడై యరిష్టమను గొప్ప కొండమీఁది కెక్కెను.

౧౦ నుండి ౨౧కి. పొడవులుగా లేచియున్న కామర పువ్వులతోఁ

బోధ్యమాన మివప్రీత్యా దివాకర కరైశ్శుభైః
ఉన్మిషంత మివోద్ధూతై ర్లోచనై రివ ధాతుభిః॥ ౧౧॥

తోయౌఘ నిస్స్వనై ర్మంద్రైః ప్రాధీత మివ పర్వతమ్।
ప్రగీతమివ విస్పష్టై ర్నానా ప్రస్రవణస్వనైః॥ ౧౨॥

దేవదారుభి రత్యుచ్చై రూర్ధ్వ బాహు మివస్థితమ్।
ప్రపాత జలనిర్ఘోషైః ప్రాక్రుష్ట మివ సర్వతః॥ ౧౩॥

వేపమాన మివశ్యామైః కంపమానై శ్శరద్ఘనైః।
వేణుభి ర్మారు తోద్ధూతైః కూజంత మివ కీచకైః॥ ౧౪॥

నిశ్శ్వసంత మివామర్షా ద్ఘోరై రాశీవిషోత్తమైః।
నీహార కృతగంభీరై ర్ధ్యాయంత మివ గహ్వరైః॥ ౧౫॥

మేఘపాద నిభైః పాదైః ప్రక్రాంతమివ సర్వతః।
జృంభమాణ మివాకాశే శిఖరై రభ్రమాలిభిః॥ ౧౬॥

కూటైశ్చ బహుధాకీర్ణై శ్శోభితం బహుకందరైః।
సాలతాలాశ్వకర్ణైశ్చ వంశై శ్చ బహుభి ర్వృతమ్॥ ౧౭॥

లతావితానై ర్వితతైః పుష్పవద్భి రలంకృతమ్।
నానామృగ గణాకీర్ణం ధాతునిష్యంద భూషితమ్॥ ౧౮॥

బహుప్రస్రవణోపేతం శిలాసంచయ సంకటమ్।
మహర్షి యక్షగంధర్వ కిన్నరోరగ సేవితమ్॥ ౧౯॥

గూడినదియు నల్లనైనవియునగు వనములవరుసలచేతను, శిఖరములపై ము
సరుకొనియున్న మేఘములచేతను బట్టకప్పంబడినట్లున్నదియు; మంగళకర
మైన సూర్యకిరణములచే మేలుకొలుపంబడుచున్నట్లున్నదియు, పుట్టిన
కన్నులవలెనుండు మణిశిలమొదలగు ధాతువులచేఁ (పాషాణములచేఁ) జూ
చుచున్నట్లున్నదియు, గంభీరములైన నీటియోడికధ్వనిచేఁ జదువుచున్నది
యగు పర్వతమో యన్నట్లున్నదియు, తేటగ వినవచ్చుచున్న యాటబుగ్గల
గుబగుబధ్వనిచే సంగీతముపాడుచున్నదో యన్నట్లున్నదియు, పొడవులైన
దేవదారువృక్షములచేత మీఁదికెత్తంబడిన చేతులంగలదియో యన్నట్లున్న
దియు, బండలపైనుండిపడియెడు నీటిధ్వనిచేత రోదనధ్వనివంటి ధ్వనిని గల
దియు, నల్లనై కదలుచున్న శరత్కాలమేఘములచేత వడంకుచున్నట్లున్నది
యు, గాలిచేఁ బలుకుచున్న వెదురుబొంగులచేతఁ బిల్లనగ్రోవులచేతఁ బాడఁ
బడుచున్నట్లున్నదియు,భయంకరములగు సర్పములచేత (హనుమంతునిపైఁ
గోపముచే) దీర్ఘశ్వాసము విడుచుచున్నదో యనునట్లున్నదియు, మంచు
చేఁ గంభీరములైనవియగు గుహలచే స్తోత్రముచేయుచున్నదో యన్నట్లున్న
దియు, మేఘముల పాదములంబోలు చుట్టునుండు చిన్నగుట్టలచే నలుప్రక్క
ల వ్యాపించుచున్నట్లున్నదియు, మేఘముల వరుసలుగల శిఖరములచేతఁ
బెరుగుచున్నట్లున్నదియు, నానాముఖములఁబడియున్న శిఖరములచేతను
పెక్కుగుహలచేతను బ్రకాశించుచున్నదియు, ఏపె మొదలగుచెట్లచేతను,
వెదుళ్లచేతను జుట్టంబడినదియు, పూవులుగలిగినట్టిదియు విరివిగలట్టిదియుఁ
దీఁగెలసమూహముచేత నలంకరింపఁబడినదియు, పెక్కువిధముల మృగము
లచే నిండియున్నదియు, మణిశిలమొదలగు ధాతువులనుండి కాఱుచున్న
నీటిధారలచే నంబమైనదియు. అనేకములగు నూటలతోఁగూడినదియు,
బండల మొత్తములచే నెడలేకయున్నదియు, గొప్పఋషులు యక్షులు గం

లతాపాదప సంఘాతం సింహాధ్యుషితకందరమ్।
వ్యాఘ్రసంఘ సమాకీర్ణం స్వాదుమూల ఫలద్రుమమ్॥ ౨౦॥

తమారురోహ హనుమాన్ పర్వతం పవనాత్మజః।
రామదర్శన శీఘ్రేణ ప్రహర్షేణాభిచోదితః॥ ౨౧॥

తేన పాదతలాక్రాంతా రమ్యేషు గిరిసానుషు।
సఘోషాః సమశీర్యంత శిలాశ్చూర్ణీకృతాస్తతః॥ ౨౨॥

స తమారుహ్య శైలేంద్రం వ్యవర్ధత మహాకపిః।
దక్షిణాదుత్తరం పారం ప్రార్థయన్ లవణాంభసః॥ ౨౩॥

అధిరుహ్య తతో వీరః పర్వతం పవనాత్మజః।
దదర్శ సాగరం భీమం మీనోరగ నిషేవితమ్॥ ౨౪॥

స మారుత ఇవాకాశం మారుతస్యాత్మసంభవః।
ప్రపేదే హరిశార్దూలో దక్షిణాదుత్తరాం దిశమ్॥ ౨౫॥

స తదా పీడితస్తేన కపినా పర్వతోత్తమః।
రరాస సహ తైర్భూతైః ప్రవిశన్వసుధాతలమ్॥ ౨౬॥

కంపమానైశ్చ శిఖరైః పతద్భిరపిచ ద్రుమైః।
తస్యోరువేగోన్మథితాః పాదపాః పుష్పశాలినః॥ ౨౭॥

నిపేతుర్భూతలే రుగ్ణాః శక్రాయుధ హతా ఇవ॥ ౨౮॥

ధర్వులు కిన్నరులు సర్పములు మొదలగువానిచే సేవింపఁ బడినదియు, తీఁగెలయొక్కయు వృక్షములయొక్కయు సమూహమునుగలదియు సింగములకు నెలవులైన గుహలనుగలదియు, పులుల మొత్తముచేఁ దఱుచైనదియు, రుచిగల ఫలములుగల చెట్లనుగలదియునగు నరిష్టపర్వతమును, హనుమంతుఁడు శ్రీరాముని జూచుటయందలి వేగముతోఁగూడిన సంతోషముచేఁ బ్రేరితుఁడై యెక్కెను.

౨౨. మనోహరములైన కొండచరియలయందలి ఱాళ్లు హనుమంతుని పాదములక్రిందఁ బడినవియై ధ్వనితో నుఱుమైరాలెను.

౨౩. ఆ హనుమంతుఁడు గొప్పదియగు నాకొండపై నెక్కి లవణసముద్రముయొక్క దక్షిణపుగట్టునుండి యుత్తరపుగట్టు నుద్దేశించినవాఁడై మిక్కిలి పెరిగెను.

౨౪. ధీరుఁడగు వాయుపుత్రుఁడు పర్వతముపై నెక్కి మీనములచేతను సర్పములచేతను సేవింపఁబడినదియగు సముద్రమును గనియెను.

౨౫. వాయుపుత్రుఁడును వానరోత్తముఁడునునగు నాతఁడు వాయు వాకాశమున వ్యాపించినట్లు దక్షిణమునుండి యుత్తరదిక్కు నాశ్రయించెను.

౨౬. అప్పుడు వానరునిచే నట్లుపీడింపఁబడినదియగు నాగొప్పకొండ తనపైనుండు జంతుజాలములతోఁగూడ భూమిలోఁ బ్రవేశించెను, మ్రోసెను.

౨౭, ౨౭½. కదలుచున్న శిఖరములచేతను, పడుచున్న చెట్లచేతను విఱిగినవియు, హనుమంతునియొక్క తొడల వేగముచే నుఱుమైనవియు, పుష్పములనుగలవియునగు చెట్లు వజ్రాయుధముచేఁగొట్టంబడినవానివలె భూమిపైఁబడెను.

కందరాంతర సంస్థానాం పీడితానాం మహౌజసామ్॥
సింహానాం నినదో భీమో నభో భిందన్ స శుశ్రువే॥ ౨౮

త్రస్త వ్యావృత్తవసనా వ్యాకులీకృత భూషణాః।
విద్యాధర్య స్సముత్పేతుః సహసా ధరణీ ధరాత్॥ ౨౯

అతిప్రమాణా బలినో దీప్తజిహ్వా మహావిషాః।
నిపీడిత శిరోగ్రీవా వ్యవేష్టంత మహాహయః॥ ౩౦

కిన్నరోరగ గంధర్వ యక్షవిద్యాధరా స్తదా।
పీడితం తం నగవరం త్యక్త్వా గగనమాస్థితాః॥ ౩౧

సచ భూమిధర శ్శ్రీమా న్బలినా తేన పీడితః।
సవృక్ష శిఖరోదగ్రః ప్రవివేశ రసాతలమ్॥ ౩౨

దశయోజన విస్తార స్త్రింశద్యోజన ముచ్ఛ్రితః।
ధరణ్యాం సమతాం యాతః సబభూవ ధరాధరః॥ ౩౩

స లిలంఘయిషు ర్భీమం సలీలం లవణార్ణవమ్।
కల్లోలాస్ఫాల వేలాంత ముత్పపాత నభో హరిః॥ ౩౪

ఇతి శ్రీమత్సుందరకాండే - షట్పంచాశస్సర్గః.



౨౮వ. గుహలయందున్నవియు, బాధనొందినవియు మిక్కిలి ప్రతాపముఁగలవియునగు సింగములయొక్క భయంకరమగుధ్వని యాకాశమును బ్రద్దలుసేయుచు వినంబడియెను.

౨౯వ. విద్యాధరస్త్రీలు సడలినట్టియుఁ జినిఁగినట్టియు వస్త్రములుగలవారును, కలతనొందిన భూషణములుగలవారునై కొండపైనుండి శీఘ్రమున నెగిరిపోయిరి.

౩౦వ. మిక్కిలి పొడవైనవియు బలముగలవియు మండుచున్న నాలుకలుగలవియు మెండుగవిషముఁగలవియు నొచ్చినతలలు మెడలుగలవియునగు గొప్పసర్పములు చుట్టుకొనియెను.

౩౧వ. కిన్నరులు సర్పములు గంధర్వులు యక్షులు విద్యాధరులు నట్లు బాధింపఁబడిన కొండనువదలి యప్పు డాకాశమున కెగసిరి.

౩౨వ. సంపదలనుగలదియగు నాపర్వతము బలవంతుఁడగు నాతనిచేఁ బీడింపఁబడి వృక్షములతోడను బొడవగు శిఖరములతోడను బాతాళలోకమునంజొచ్చెను.

౩౩వ. పదియోజనములనిడివియు ముప్పదియోజనములయెత్తును గల యాపర్వతము భూమితో సమమయ్యెను.

౩౪వ. చెలియలికట్టవఱకు వ్యాపించుచున్న పెద్దయలలనుగలదియై భయంకరమైన యుప్పుసముద్రమును దాఁటఁదలంచినవాఁడై యావానరుఁ డాకాశమున కెగసెను.

ఇది ఏఁబదియాఱవసర్గ.

——:0:——

## సప్తపంచాశస్సర్గః.

సచంద్ర కుముదం రమ్యం సార్కకారండవం శుభమ్।
తిష్య శ్రవణ కాదంబ మభ్రశైవాల శాద్వలమ్॥ ౧॥

పునర్వసు మహామీనం లోహితాంగ మహాగ్రహమ్।
ఐరావత మహాద్వీపం స్వాతీహంస విలోళితమ్॥ ౨॥

వాతసంఘాత జాతోర్మి చంద్రాంశు శిశిరాంబుమత్।
భుజంగ యక్షగంధర్వ ప్రబుద్ధ కమలోత్పలమ్॥ ౩॥

హనుమా న్మారుతగతి ర్మహానౌరివ సాగరమ్।
అపార మపరిశ్రాంతః పుప్లువే గగనార్ణవమ్॥ ౪॥

గ్రసమాన ఇవాకాశం తారాధిప మివోల్లిఖన్।
హరన్నివ సనక్షత్రం గగనం సార్కమండలమ్॥ ౫॥

మారుతస్యాత్మజ శ్శ్రీమా న్కపి ర్వ్యోమ చరో మహాన్।
హనుమా న్మేఘజాలాని వికర్షన్నివ గచ్ఛతి॥ ౬॥

పాండురారుణ వర్ణాని నీలమాంజిష్ఠ కానిచ।
హరితారుణ వర్ణాణి మహాభ్రాణి చకాశిరే॥ ౭॥

ప్రవిశ న్నభ్రజాలాని నిష్పతంశ్చ పునఃపునః।
ప్రచ్ఛన్నశ్చ ప్రకాశశ్చ చంద్రమాఇవ లక్ష్యతే॥ ౮॥

ఏఁబదియేడవసర్గ.

౧ నుండి ౪ వఱకు. చంద్రుఁడను తెల్లకలువలతోఁ గూడినదియు, మనోహరమైనదియు, సూర్యుఁడను కన్నెలేడిపిట్టను గలదియు, మంగళకరమైనదియు, పుష్యమిశ్రవణనక్షత్రములనుకలహంసలను గలదియు, మేఘములనెడు నీటిపాచిని పచ్చికనుగలదియు, పునర్వసు నక్షత్రమను పెద్దచేఁపనుగలదియు, అంగారకుఁడను మొసలినిగలదియు, ఐరావతమనుగొప్పద్వీపమునుగలదియు, స్వాతీనక్షత్రమను హంసచే సంచరింపఁ బడినదియు, వాయువుచే లేచిన యలలనెడు వెన్నెలయందలి చలిమిరిగలదియు, సర్పములు యక్షులు గంధర్వులననెడి వికసించినకమలములను గలువలనుగలదియు, తెలియఁబడని యెదటిగట్టును గలదియునగు నాకాశమను సముద్రమును వాయువేగమువంటివేగముంగల హనుమంతుఁడు కొంచెమేనియు శ్రమనొందనివాఁడై పెద్దయోడవలె దాఁటెను.

౫, ౬. వాయువునకుఁ బుత్రుండును తేజోవంతుఁడును గొప్పవాఁడును గగనమునం దిరుగువాఁడును నగుహనుమంతుండనువానరుఁడు గగనమును మ్రింగుచున్నట్లును చంద్రుని నొరయుచున్నట్లును, నక్షత్రములతోడను సూర్యమండలముతోడను గూడిన యాకాశమును జేతముట్టుచున్నట్లును మేఘముల సమూహముల నీడ్చికొనుచున్నట్లును జనుచున్నవాఁడు.

౭. తెలుపునెఱుపువర్ణములను గలవియు నీలవర్ణమును బసపురంగును గలవియు. ఆకుపచ్చవర్ణము నెఱ్ఱచాయయుఁ గలవియు నగు పెద్దమేఘములు ప్రకాశించెను.

౮. మేఘములలోఁ బ్రవేశించుచుఁ బలుమఱు వెలుపడుచు నదృశ్యుఁడగుచు కనఁబడుచుఁ జంద్రునివలెఁ గనఁబడుచున్నాఁడు.

వివిధాభ్రఘనాపన్న గోచరో ధవళాంబరః।
దృశ్యాదృశ్యతను ర్వీర స్తదా చంద్రాయ తేంబరే॥ ౯॥
తార్క్ష్యాయమాణో గగనే బభాసే వాయునందనః।
దారయ న్మేఘబృందాని నిష్పతంశ్చ పునఃపునః॥ ౧౦॥
నద న్నాదేన మహతా మేఘస్వన మహాస్వనః।
ప్రవరా న్రాక్షసా న్హత్వా నామ విశ్రావ్య చాత్మనః॥ ౧౧॥
ఆకులాం నగరీం కృత్వా వ్యథయిత్వాచ రావణమ్।
అర్దయిత్వా బలం ఘోరం వైదేహీ మభివాద్యచ॥ ౧౨॥
ఆజగామ మహాతేజాః పునర్మధ్యేన సాగరమ్। ౧౨॥
పర్వతేంద్రం సునాభంచ సముపస్పృశ్య వీర్యవాన్।
జ్యాముక్తఇవ నారాచో మహావేగో భ్యుపాగతః॥ ౧౩॥
సకించ దనుసంప్రాప్తః సమాలోక్య మహాగిరిమ్।
మహేంద్రం మేఘసంకాశం ననాద హరిపుంగవః॥ ౧౪॥
స పూరయామాస కపి ర్దిశో దశ సమంతతః।
నద న్నాదేన మహతా మేఘస్వన మహాస్వనః॥ ౧౫॥
స తం దేశ మనుప్రాప్తః సుహృద్దర్శన లాలసః।
ననాద హరిశార్దూలో లాంగూలం చాప్యకంపయత్॥ ౧౬॥
తస్య నానద్యమానస్య సుపర్ణచరితే పథి।
ఫలతీ వాస్య ఘోషేణ గగనం సార్కమండలమ్॥ ౧౭॥

౯. నానావిధములగు మేఘములమొత్తములను డాసిచనుచున్నవాఁడును. తెల్లని వస్త్రముఁగలవాఁడును నగు నావీరుండపుడు కనఁబడియుఁ గనంబడకయున్న శరీరమునుగలవాఁడై చంద్రునివలె నున్నవాఁడు.

౧౦. వాయుపుత్రుఁడు మేఘజాలములను విరియించుచు నప్పుడప్పుడగుపడుచు నాకసమందు గరుడునివలె నొప్పారెను.

౧౧ నుండి ౧౨½కు. మిక్కిలియగు ప్రతాపమునుగలవాఁడును, మేఘధ్వనింబోలు గొప్పనాముఁగలవాఁడును నగు నాతండు గట్టిగా ధ్వనిచేయుచు బలవంతులగు రాక్షసులనుజంపి, తన పేరు తెలియంబలికి, లంకను జేఁకాకుపఱిచి, రావణుని దుఃఖపెట్టి భయంకరమగు సేనను నుగ్గుచేసి, సీతకు నమస్కరించి సముద్రమునకు నడిమిభాగమున దాఁటిపోయెను.

౧౩½. బలవంతుఁడగు నాతండు పర్వతములలో మేలిదియగు మైనాకపర్వతమును జేతనంటి, వింటినారివలన విడువంబడినబాణమువలె మిక్కిలి వేగమునం జనియెను.

౧౪½. వానరోత్తముఁడగు హనుమంతుఁడు గొంతదవ్వేగి మేఘములంబోలిన మహేంద్రపర్వతమును ముందుగాంచి యొక్కధ్వనిచేసెను.

౧౫½. ఉరుములంబోలె ధ్వనిచేయు నాయాంజనేయుఁడు గొప్పదియగు ధ్వనిచేఁ బదిదిక్కులను నిండించెను.

౧౬½. వానరోత్తముఁడగు నాతండచ్చోటునుబొందినవాఁడై మిత్రులంగాంచుటయం దాశగలవాఁడై బిగ్గర కేకవైచెను. తోఁకను విదిలించెను.

౧౭½. గరుత్మంతునిచే సంచరింపఁబడినమార్గమున ధ్వనిచేయుచున్న హనుమంతునిధ్వనిచే సూర్యమండలముతోఁ గూ[illegible]యన నాకాశము బీఁటలువాఱునట్లు తోఁచెను.

యేతు తతోత్తరే తీరే సముద్రస్య మహాబలాః।
పూర్వం సంవిష్ఠితాశ్శూరా వాయుపుత్ర దిదృక్షవః॥ ౧౮

మహతో వాయునున్నస్య తోయదస్యేవ గర్జితమ్।
శుశ్రువుస్తే తదాఘోష మూరువేగం హనూమతః॥ ౧౯

తే దీనమనస స్సర్వే శుశ్రువుః కాననౌకసః।
వానరేంద్రస్య నిర్ఘోషం పర్జన్య నినదోపమమ్॥ ౨౦

నిశమ్య నదతో నాదం వానరాస్తే సమంతతః।
బభూవు రుత్సుకాస్సర్వే సుహృద్దర్శన కాంక్షిణః॥ ౨౧

జాంబవాన్ సహరిశ్శ్రేష్ఠః ప్రీతిసంహృష్ట మానసః।
ఉపామంత్ర్య హరీన్ సర్వా నిదంవచన మబ్రవీత్॥ ౨౨

సర్వథా కృతకార్యోసౌ హనుమాన్నాత్రసంశయః।
నహ్యస్యాకృతకార్యస్య నాద ఏవంవిధో భవేత్॥ ౨౩

తస్య బాహూరువేగంచ నినాదంచ మహాత్మనః।
నిశమ్య హరయో హృష్టా స్సముత్పేతు స్తత స్తతః॥ ౨౪

తేనగాగ్రా న్నగాగ్రాణి శిఖరా చ్ఛిఖరాణిచ।
ప్రహృష్టా స్సమపద్యంత హనూమంతం దిదృక్షవః॥ ౨౫

తే ప్రీతాః పాదపాగ్రేషు గృహ్య శాఖాను విష్ఠితాః।
వాసాంసీవ ప్రశాఖాశ్చ సమావిధ్యంత వానరాః॥ ౨౬

౧౮౹, ౧౯౹. మిక్కిలి బలవంతులును శూరులును నగు నేవానరులు హనుమంతుని రాకకై వేచి సముద్రముయొక్క యుత్తరపుగట్టున మహేంద్రపర్వతమున నుండిరో వారు వాయువుచేఁ బ్రేరితమైనగొప్పమేఘముయొక్క ధ్వనివలె, తొడలవేగముతోఁగూడినదియగు నాతని ధ్వనిని వినిరి.

౨౦౹. వేదపడినమనస్సులుగల యావానరులందఱు నుఱుమును బోలికగాఁగల (హనుమంతుని) సింహనాదమును వినిరి.

౨౧౹. మిత్రుఁడగు హనుమంతుని దర్శనముం గోరుచున్న యావానరులందఱు నంతటను వ్యాపించుచున్న యాతని ధ్వనినివిని సంతోషముం జెందిరి.

౨౨౹, ౨౩౹. ఆవానరులలో మొనగాఁడగుజాంబవంతుఁడు సంతోషముచే నుప్పొంగిన మనస్సుగలవాఁడై వానరులనందఱిఁ జేరఁబిలచి యీహనుమంతుఁడు సర్వవిధములచేతను స్వామికార్యమును జేసినవాఁడు. ఇందుకు సందియము లేదు. ఈతండు పనిచేయకయే వచ్చునేని ధ్వని యిట్లుండదు. అని పలికెను.

౨౪౹. పిమ్మట వానరు లాతనిధ్వనిని, భుజములయొక్కయుఁ దొడలయొక్కయు వేగమునువిని సంతోషించినవారై యందంద గంతులువైచిరి.

౨౫౹. వారలు హనుమంతునింజూచునాశతో నున్నవారై సంతోషించి కొండకొసనుండి మఱియొక్క కొండకును శిఖరమునుండి మఱియొక శిఖరమునకును దాఁటిరి.

౨౬౹. సంతోషించినవారై యావానరులు చెట్లకొనలయందుండి కొమ్మలను రెమ్మలను బట్టుకొని వస్త్రములను విదిలించినట్లు విదిలించిరి.

గిరిగహ్వర సంలీనో యథాగర్జతి మారుతః।
ఏవం జగర్జ బలవాన్ హనుమాన్మారుతాత్మజః॥ ౨౬౹

త మభ్ర ఘనసంకాశ మాపతంతం మహాకపిమ్।
దృష్ట్వా తే వానరాస్సర్వే తస్థుః ప్రాంజలయ స్తదా॥ ౨౭౹

తతస్తు వేగవాం స్తస్య గిరే ర్గిరినిభః కపిః।
నిపపాత మహేంద్రస్య శిఖరే పాదపాకులే॥ ౨౮౹

హర్షే ణాపూర్యమాణోఽసౌ రమ్యే పర్వతనిర్ఝరే।
ఛిన్నపక్ష ఇవాకాశా త్పపాత ధరణీధరః॥ ౩౦౹

తత స్తే ప్రీతమనసః సర్వే వానరపుంగవాః॥ ౩౧॥

హనుమంతం మహాత్మానం పరివా ర్యోపతస్థిరే।
పరివార్యచ తేసర్వే పరాం ప్రీతి ముపాగతాః॥ ౩౨॥

ప్రహృష్ట వదనాస్స ర్వే త మరోగ ముపాగతమ్।
ఉపాయనాని చాదాయ మూలాని చ ఫలానిచ॥ ౩౩॥

ప్రత్యర్చయన్ హరి శ్రేష్ఠం హరయో మారుతాత్మజమ్॥ ౩౩౹

హనుమాంస్తు గురూ న్వృద్ధా జ్జాంబవ త్ప్రముఖాం స్తదా।
కుమార మంగదం చైవ సోవందత మహాకపిః॥ ౩౪౹

స తాభ్యాం పూజితః పూజ్యః కపిభిశ్చ ప్రసాదితః।
దృష్టా సీతేతి విక్రాంత స్సంక్షేపేణ న్యవేదయత్॥ ౩౫౹

౨౭½. బలవంతుఁడును వాయుపుత్రుఁడునగు హనుమంతుఁడు పర్వతగుహాయందుఁజిక్కి వాయువుశబ్దించునట్లు గర్జించెను.

౨౮½. మేఘముల మొత్తమువలెనున్నవాఁడును నేలకుదిగుచున్నవాఁడునునగు దొడ్డవానరునింజూచి యావానరులందఱు నప్పుడు చేతుల మోడ్చి నిలిచిరి.

౨౯½. అటుపై వేగవంతుఁడును బర్వతముతో సమఁడును నగు హనుమంతుఁడు చెట్లచేనిండిన యామహేంద్రపర్వతముయొక్క శిఖరముపై నుఱికెను.

౩౦½. సంతోషముచే నిండియున్నవాఁడగుహనుమంతుఁ డాకాశమునుండి, ఱెక్కలు దెగఁగొట్టఁబడిన పర్వతమువలె మనోహరమగు నొక నెలయేటియందుఁ బడియెను.

౩౧, ౩౨. పిమ్మట వానరశ్రేష్ఠులందఱు సంతోషించినవారై దొడ్డవాఁడగు హనుమంతునిఁ గ్రమ్ముకొని కొనియాడిరి. అట్లుచుట్టుకొని వారెల్ల మిక్కిలి సంతోషమునందిరి.

౩౩, ౩౩½. వారందఱును సంతోషించిన మోములుగలవారై జాడ్యమెద్దియులేక బాగుగమరలివచ్చిన యావానరోత్తమునకు దుంపలనుఫలములును గానుకలుగానిచ్చి యాదరించిరి.

౩౪½. హనుమంతుఁడను నాగొప్పవానరుఁడు గురులకును వృద్ధులకును జాంబవంతునకును, అంగదునకును మ్రొక్కెను.

౩౫½. పూజ్యుఁడును, పరాక్రమశాలియునగు నాతం డావానరులచేఁ బూజితుఁడును, కృపగలవాఁడునుగాఁ జేయఁబడి "చూడఁబడియెను సీత" అని సంగ్రహముగాఁ జెప్పెను.

నిషసాద చ హస్తేన గృహీత్వా వాలినస్సుతమ్।
రమణీయే వనోద్దేశే మహేంద్రస్య గిరే స్తదా॥ ౩౬।

హనుమా నబ్రవీ దృష్ట స్తదా తా న్వానరర్షభాన్॥ ౩౭॥

అశోక వనికా సంస్థా దృష్టా సా జనకాత్మజా।
రక్ష్యమాణా సుఘోరాభీ రాక్షసీభి రనిందితా॥ ౩౮।

ఏకవేణిధరా బాలా రామదర్శన లాలసా।
ఉపవాస పరిశ్రాంతా జటిలా మలినా కృశా॥ ౩౯।

తతో దృష్టేతి వచనం మహార్థ మమృతోపమమ్।
నిశమ్య మారుతే స్సర్వే ముదితా వానరా భవన్॥ ౪౦।

క్ష్వేళం త్యన్యే నదంత్యన్యే గర్జంత్యన్యే మహాబలాః।
చక్రుః కిలకిలా మన్యే ప్రతిగర్జంతి చాపరే॥ ౪౧॥

కేచి దుచ్ఛ్రిత లాంగూలాః ప్రహృష్టాః కపికుంజరాః।
అంచితాయత దీర్ఘాణి లాంగూలాని ప్రవివ్యధుః॥ ౪౨॥

అపరేచ హనూమంతం వానరా వారణోపమమ్।
ఆప్లుత్య గిరిశృంగేభ్యః సంస్పృశంతిస్మ హర్షితాః॥ ౪౩॥

ఉక్తవాక్యం హనూమంత మంగద స్త మథాబ్రవీత్।
సర్వేషాం హరివీరాణాం మధ్యే వచన ముత్తమమ్॥ ౪౪॥

౩౬½, ౩౭. అప్పుడు హనుమంతుఁడు రమ్యమగు మహేంద్రపర్వతముయొక్క యున్నతమగు వనప్రదేశమున వాలిపుత్రుఁడగు నంగదుని చేయిపట్టుకొని కూర్చుండెను. అపుడు సంతోషించినవాఁడై వానరోత్తములతోఁ బలికెను.

౩౮, ౩౯. 'అశోకవనమందున్నదియు భయమునుగలిగించు రాక్షసస్త్రీలచేఁ గాపాడఁబడుచున్నదియు, నిర్దూష్యమగు చరిత్రముంగలదియు, ఒకేజడను ధరించియున్నదియు, పనిదియు, శ్రీరామునిదర్శనముం గోరుచున్నదియు, ఉపవాసములచే డస్సినదియు, జడలుగట్టిన వెండ్రుకలంగలదియు, మాసిన మేనుంగలదియు బక్కవడియున్నదియునగు జానకి చూడంబడియెను.

౪౦. మిక్కిలి, ఫలముంగలదియు, అమృతమువలె నింపైనదియు, నగు 'చూడంబడియె' అనుహనుమంతునిమాటనువిని వానరులందఱు సంతోషించినవారైరి.

౪౧. విశేష బలముంగలవారగు వానరులు కొందఱు సింహనాదము చేసిరి, కొందఱు ధ్వనిచేయుచున్నవారు, కొందఱు గర్జించిరి, కొందఱు కిలకిలధ్వనిచేసిరి, మఱికొందఱు ప్రతిధ్వనులు చేసిరి.

౪౨. కొందఱు వానరోత్తములు మిక్కిలి సంతోషించినవారై యెత్తఁబడిన తోఁకలుగలవారగుచు విశాలములై నిడుపులై యందములైయున్నవానినే భూమిపై వైచిరి.

౪౩. మఱికొందఱువానరులు సంతోషించినవారై కొండశిఖరములనుండిదిగి యేనుఁగంబోలిన హనుమంతునిఁ గౌఁగిలించికొనిరి.

౪౪. అటుపై నంగదుఁడు పైచొప్పున క్షేమముందెలిపిన హనుమంతునితోడ వానరవీరులందఱు విన నిట్లొకమంచిమాట పలికెను.

సత్త్వే వీర్యే న తే కశ్చి త్సమో వానర విద్యతే।
యదవప్లుత్య వి_స్తీర్ణం సాగరం పునరాగతః॥ ౪౫॥

అహో స్వామిని తే భక్తి రహో వీర్య మహో ధృతిః।
దిష్ట్యా దృష్టా త్వయా దేవీ రామపత్నీ యశస్వినీ॥ ౪౬॥

దిష్ట్యా త్యక్ష్యతి కాకుత్స్థ శ్శోకం సీతా వియోగజమ్॥ ౪౭॥

తతోఽంగదం హనూమంతం జాంబవంతం చ వానరాః।
పరివార్య ప్రముదితా భేజిరే విపులా శ్శిలాః॥ ౪౮॥

శ్రోతుకామా స్సముద్రస్య లంఘనం వానరో త్తమాః।
దర్శనంచాపి లంకాయా స్సీతాయా రావణస్య చ॥ ౪౯॥

తస్థుః ప్రాంజలయస్స ర్వే హనుమ ద్వదనోన్ముఖాః॥ ౫౦॥

తస్థౌ తత్రాంగద శ్శ్రీమా న్వానరై ర్బహుభి ర్వృతః।
ఉపాస్యమానో విబుధై ర్దివి దేవపతి ర్యథా॥ ౫౧॥

హనూమతా కీర్తిమతా యశస్వినా తథాంగదే నాంగద బద్ధ బాహునా। ముదా తదా ధ్యాసిత మున్నత మ్మహ న్మహీధరాగ్రం జ్వలితం శ్రియాభవత్॥ ౫౨॥

ఇతి శ్రీమత్సుందరకాండే సప్తపంచాశస్సర్గః.



౪౫ నుండి ౪౬½కు. మిగులవిరివిగలదియగు నింతసముద్రమును దాఁటి చని మరలి రాఁజాలితివిగావున బలమునను దర్పమునను నీతోఁదుల్యుఁడు మఱియొకండు లేఁడు వానరుఁడా! నీకుంగల ప్రభునియందలిభక్తి యాశ్చర్యకరమైనది నీపరాక్రమ ధైర్యములు నట్టివేయగును. కీర్తినిగలదియుఁ బట్టపుదేవియు నగురాముభార్య భాగ్యవశమున నీచేఁ జూడంబడియెను. సీతనెడబాసినదుఃఖమును రాముఁడు విడుచును.

౪౭½. పిమ్మట సంతోషించినవారై వానరులు హనుమంత జాంబవదంగదులను జుట్టికొని పెద్దబండలపై నిలచియుండిరి.

౪౮½, ౪౯. వానరోత్తములందఱు, సముద్రమును దాఁటుటయు లంకను గనుటయు, సీతనుగాంచుటయు, రావణునిం జూచుటయు వినం గోరినవారై చేతులు మోడ్చుకొని హనుమంతుని మోముంజూచుచు నిలచియుండిరి.

౫౦. బలవంతుఁడగు నంగదుఁ డచ్చోటఁ జెక్కుండ్రు వానరులచేఁ జుట్టంబడినవాఁడై దేవతలచేఁ గొలువంబడుచున్న యింద్రునివలె నుండెను.

౫౧. కీర్తిని గలవాఁడగు హనుమంతునిచేతను, యశస్సుగలవాఁడును భుజకీర్తులను ధరించినవాఁడును నగునంగదునిచేతను సంతోషముచే నెక్కంబడినదియుఁ బొడవైనదియునగు నాపర్వతముయొక్క శిఖరము కాంతిచేఁ బ్రకాశించుచున్నది యయ్యెను.

ఇది యేఁబదియేడవసర్గ.

---

## అష్టపంచాశస్సర్గః.

తతస్తస్య గిరేశ్శృంగే మహేంద్రస్య మహాబలాః।
హనుమత్ప్రముఖాః ప్రీతిం హరయో జగ్మురుత్తమామ్॥ ౧

తం తతః ప్రీతిసంహృష్టః ప్రీతిమంతం మహాకపిమ్।
జాంబవాన్కార్యవృత్తాంతమపృచ్ఛదనిలాత్మజమ్॥ ౨

కథం దృష్టా త్వయా దేవీ కథం వా తత్ర వర్తతే।
తస్యాం వా స కథం వృత్తః క్రూరకర్మా దశాననః॥ 3

తత్త్వతస్సర్వమేతన్నః ప్రబ్రూహి త్వం మహాకపే।
శ్రుతార్థాశ్చింతయిష్యామో భూయః కార్యవినిశ్చయమ్॥

యశ్చార్థస్తత్ర వక్తవ్యో గతైరస్మాభిరాత్మవాన్।
రక్షితవ్యం చ యత్తత్ర తద్భవాన్వ్యాకరోతు నః॥ ౫

స నియుక్తస్తతస్తేన సంప్రహృష్టతనూరుహః।
ప్రణమ్య శిరసా దేవ్యై సీతాయై ప్రత్యభాషత॥ ౬

ప్రత్యక్షమేవ భవతాం మహేంద్రాగ్రాత్ఖమాప్లుతః।
ఉదధేర్దక్షిణం పారం కాంక్షమాణస్సమాహితః॥ ౭

గచ్ఛతశ్చ హి మే ఘోరం విఘ్నరూపమివాభవత్।
కాంచనం శిఖరం దివ్యం పశ్యామి సుమనోహరమ్॥ ౮

స్థితం పంథానమావృత్య మేనే విఘ్నం చ తం నగమ్॥ ౯

## ఏఁబదియెనిమిదవసర్గ.

౧ పిదప మిక్కిలి బలశాలులగు హనుమంతుఁడు మొదలగు వానరులు మహేంద్రపర్వతముయొక్క శిఖరముననుండి యుత్తమమగు నానందమును బొందిరి.

౨. అటుపై సంతోషముచేఁ బొంగినవాఁడై జాంబవంతుఁడు సంతోషముతోఁ గూడినవాఁడగు వాయుపుత్రుని లంకలోజరిగిన వృత్తాంతమడిగెను.

౩. సీత నీచే నెట్లుచూడఁబడియెను? లంకయందెట్లున్నది? క్రూరకర్ముఁడగు రావణుఁ డామెయెడల నెట్లున్నవాఁడు?

౪. వానరోత్తమా! ఇదియంతయు నడిచినది నడిచినట్లు మాకుఁ దెలుపుము! ఫలము నెఱింగినవారమై చేయందగుపనిని బిమ్మట యోచింతము.

౫. శ్రీరాముని కడకేగినపుడు మనమేవిషయముచెప్పవచ్చునో ఏదిచెప్పఁగూడదో యావిషయమంతయు మాకుఁదేటగఁ జెప్పుము!

౬. అని యడుగఁగా నాజాంబవంతునిచే నట్లు నియమింపఁ బడినవాఁడై హనుమంతుఁడు సంతోషముచేఁ బులకరించిన మేనుగలవాఁడై తలవాంచి జననియగు సీతకు మ్రొక్కి జాంబవంతునకు మాఱువలికెను.

౭. దృఢమగుచిత్తముంగలవాఁడనై సముద్రముయొక్క దక్షిణపుగట్టు నుద్దేశించి మహేంద్రపర్వతమునుండి యాకసమున కెగయుట మీకుఁ దెలిసినదే కదా?

౮, ౯. అట్లాకాశమునఁ జనుచున్ననాకు బంగారముచేనొప్పినందమగు పర్వతశిఖరము భయంకరమగు విఘ్నమువలెఁ గనఁబడియెను. దానింగంటిని. మార్గము నడ్డగించియున్న యాకొండను నాకు విఘ్నమని తలంచితిని

ఉపసంగమ్య తం దివ్యం కాంచనం నగసత్తమమ్।
కృతా మే మనసా బుద్ధి ర్భేత్తవ్యోయం మయేతి చ॥ ౯
ప్రహతం చ మయా తస్య లాంగూలేన మహాగిరేః।
శిఖరం సూర్యసంకాశం వ్యశీర్యత సహస్రధా॥ ౧౦

వ్యవసాయం చ తం బుద్ధ్వా సహోవాచ మహాగిరిః।
పుత్రేతి మధురాం వాణీం మనః ప్రహ్లాదయ న్నివ॥ ౧౧
పితృవ్యం చా పి మాం విద్ధి సఖాయం మాతరిశ్వనః।
మైనాక మితి విఖ్యాతం నివసంతం మహోదధౌ॥ ౧౨

పక్షవంతః పురా పుత్ర బభూవుః పర్వతోత్తమాః।
ఛందతః పృథివీం చేరు ర్బాధమానా స్సమంతతః॥ ౧౩

శ్రుత్వా నగానాం చరితం మహేంద్రః పాకశాసనః।
చిచ్ఛేద భగవా న్పక్షా న్వజ్రేణైషాం సహస్రశః॥ ౧౪
అహం తు మోక్షిత స్తస్మా త్తవ పిత్రా మహాత్మనా।
మారుతేన తదా వత్స ప్రక్షిప్తో స్మి మహార్ణవే॥ ౧౫

రామస్య చ మయా సాహ్యే వర్తితవ్య మరిందమ।
రామో ధర్మభృతాం శ్రేష్ఠో మహేంద్రసమ విక్రమః॥ ౧౬
ఏతచ్ఛ్రుత్వా వచ స్తస్య మైనాకస్య మహాత్మనః।
కార్య మావేద్య తు గిరే రుద్యతం చ మనో మమ॥ ౧౭

తేన చాహ మనుజ్ఞాతో మైనాకేన మహాత్మనా।
స చా ప్యంతర్హిత శ్శైలో మానుషేణ వపుష్మతా॥ ౧౮

౯వ. శ్రేష్ఠమైనదియుఁ బర్వతములలోఁ బేరొందినదియు నగు నా బంగారవుకొండనుడాసి బ్రద్దలు సేయుదును గాక యనియుఁ దలంచితిని.

౧౦వ. సూర్యునివలె వెలుంగుచున్నదియగు నాపర్వతశిఖరము నాతోఁకయొక్క దెబ్బచేత వేయిముక్కలు సేయంబడి రాలెను.

౧౧వ. ఆపెద్దపర్వతము నేనుదన్ని బ్రద్దలు సేయ నుత్సహించుట నెఱింగి హా! పుత్రా! అని నామనస్సు సంతోషించునట్లు వలికెను.

౧౨వ. నేనువాయుదేవునకు మిత్రుఁడననియు, నీకుఁదండ్రితోడఁ బుట్టినచుట్టముననియు, ఈపెద్దసముద్రమునందుండు మైనాకుఁడను పేరుగలవాఁడననియు నెఱుంగుము!

౧౩వ. ఓబిడ్డా! మున్ను పర్వతములు ఱెక్కలుగలిగినవైయుండెను. అవి లోకమును బాధించుచు నిష్టానుసారముగా నంతటను సంచరించుచుండెను.

౧౪వ. మహాత్ముఁడగు దేవేంద్రుఁడు పర్వతములయొక్క వర్తన విని కొండలఱెక్కలను వేయిముక్కలుగా వజ్రముచే ఖండించెను.

౧౫వ. ఓతండ్రీ! మహాత్ముఁడును నీజనకుండును నగువాయువుచే దేవేంద్రునివలనఁ దప్పించుకొని యీసముద్రమునం బడినవాఁడను.

౧౬వ. శత్రువుల నణఁచువాఁడా! శ్రీరాముఁడు ధర్మమును రక్షించువారిలోనుత్తముఁడు. దేవేంద్రునింబోలె దర్పముం గలవాఁడు. అట్టి రామునకు నేనును సహాయము చేయందగువాఁడను.

౧౭వ. దొడ్డవాఁడగుమైనాకుని పలుకులువిని, నేనుబోవుపనిని బర్వతమునకుందెలిపి, నామనస్సు కార్యమునకుత్సహించినది కాఁగా.

౧౮వ,౧౯. గొప్పవాఁడగు నామైనాకునిచే ననుమతి పొందినవాఁ

శరీరేణ మహాశైలః శైలేన చ మహోదధౌ॥ ౧౯॥
ఉత్తమం జవమాస్థాయ శేషం పంథాన మాస్థితః।
తతో౽హం సుచిరం కాలం వేగేనాభ్యగమం పథి॥ ౨౦॥

తతః పశ్యామ్యహం దేవీం సురసాం నాగమాతరమ్।
సముద్రమధ్యే సా దేవీ వచనం మా మభాషత॥ ౨౧॥
మమ భక్షః ప్రదిష్ట స్త్వ మమరై ర్హరిసత్తమ।
అతస్త్వాం భక్షయిష్యామి విహిత స్త్వం చిరస్య మే॥ ౨౨॥

ఏవముక్త స్సురసయా ప్రాంజలిః ప్రణతస్థితః।
వివర్ణవదనో భూత్వా వాక్యం చేద ముదీరయమ్॥ ౨౩॥
రామో దాశరథి శ్శ్రీమాన్ ప్రవిష్టో దండకావనమ్।
లక్ష్మణేన సహ భ్రాత్రా సీతయా చ పరంతపః॥ ౨౪॥

తస్య సీతా హృతా భార్యా రావణేన దురాత్మనా।
తస్యా స్సకాశం దూతో౽హం గమిష్యే రామశాసనాత్॥ ౨౫॥

కర్తు మర్హసి రామస్య సాహాయ్యం విషయే సతీ।
అథవా మైథిలీం దృష్ట్వా రామం చాక్లిష్టకారిణమ్॥ ౨౬।
ఆగమిష్యామి తే వక్త్రం సత్యం ప్రతిశృణోమి తే॥ ౨౬॥

ఏవముక్తా మయా సాతు సురసా కామరూపిణీ।
అబ్రవీ న్నాతివర్తేత కశ్చి దేష వరో మమ॥ ౨౭॥
ఏవముక్త స్సురసయా దశయోజన మాయతః।
తతో౽ర్థగుణవిస్తారో బభూ వాహం క్షణేన తు॥ ౨౮॥

డనయితిని. ఆపర్వతము మనుష్యరూపముతో నీటమునుంగు పడియెను. ప ర్వతరూపమున నీట మునింగియుండెను.

౨౦. అటుపై నేను మంచివేగమునుబొంది మిగిలినత్రోవందరలితిని. అట్లే వేగముతో విశేషకాలము చనుచుంటిని.

౨౧. ఆవల సర్పములకు దల్లియగు సురసయనుదేవిని సముద్ర మధ్యమునంగంటిని. ఆదేవి నాతోడ నిట్లులనియెను.

౨౨. వానరోత్తముడా! నాకాహారముగా దేవతలచే నీవు చూ పంబడితివి. బహుకాలమునకుం బిమ్మట నీవులభించితివి. కావుననే నిన్నుం దినుదానను.

౨౩ సురసచే నిట్లువలుకంబడినవాండనై చేతులుమోడ్చి మ్రొక్కు చుం బేదవడినమోముతో నిట్లువలికితిని.

౨౪. సంపద్యుక్తుండును శత్రువులం బీడించువాండును పరరక్షపు త్రుండును నగురాముండు తమ్ముండగు లక్ష్మణునితోడను భార్యయగు సీత తోడను దండకారణ్యమునం బ్రవేశించెను.

౨౫. ఆతనిభార్యయగుసీత మర్జనుండగు రావణునిచేం గొనిపోం బడి యెను. ఆసీతకడకు రామునియాజ్ఞచే నేను జనుచున్నవాండను.

౨౬, ౨౬½. శ్రీరాముని దేశమందుండుసీవు రామునికార్యమునకుం దోడ్పడుట న్యాయ్యము అట్లుకాదేని సీతనుగాంచి, లోకమునకపకారము చేయనివాండగు రామునింగనుంగొని పిమ్మట నీనోటంబడువాండను. ఇది సత్యము వినుమా!

౨౭½. ఇట్లు నాచేం బలుకంబడియుం గోరినరూపమును ధరించున దియగుసురస యెవండును సన్నుమించిపోరాదు. ఇది నేంబొందినవరము.

౨౮½. ఇట్లు సురసవలుకంగానే క్షణమాత్రమున నేనుబదియోజ నములనిడువును,అయిదుయోజనముల వెడల్పునుగలమేనుగలవాండనైతిని

మత్ప్రమాణానురూపం చ వ్యాదితంతు ముఖంతయా।
తద్దృష్ట్వా వ్యాదితం చాస్యం హ్రస్వం హ్యకరవం వపుః॥ ౨౯
తస్మిన్ముహూర్తే చ పున ర్బభూ వాంగుష్ఠ మాత్రకః॥ ౩౦॥
అభిపత్యాశు తద్వక్త్రం నిర్గతోహం తతః క్షణాత్।
అబ్రవీ త్సురసా దేవీ స్వేనరూపేణ మాం పునః॥ ౩౧॥
అర్థసిద్ధ్యై హరిశ్రేష్ఠ గచ్ఛసౌమ్య యథా సుఖమ్।
సమానయ చ వైదేహీం రాఘవేణ మహాత్మనా॥ ౩౨॥
సుఖీ భవ మహాబాహో ప్రీతాస్మి తవ వానర।
తతో హం సాధు సాధ్వీతి సర్వభూతైః ప్రశంసితః॥ ౩౩॥
తతోంతరిక్షం విపులం ప్లుతోహం గరుడో యథా।
ఛాయా మే నిగృహీతాచ నచపశ్యామి కించన॥ ౩౪॥
సో హం విగత వేగస్తు దిశో దశ విలోకయన్।
నకించి త్తత్రపశ్యామి యేన మేపహృతా గతిః॥ ౩౫॥
తతో మే బుద్ధిరుత్పన్నా కిన్నామ గగనే మమ।
ఈదృశో విఘ్నఉత్పన్నో రూపం యత్ర నదృశ్యతే॥ ౩౬॥
అధోభాగేన మేదృష్టి శ్శోచతా పాతితా మయా।
తతో ద్రాక్ష మహం భీమాం రాక్షసీం సలిలేశయామ్॥ ౩౭॥
ప్రహస్య చ మహానాద ముక్తోహం భీమయా తయా।
అవస్థిత మసంభ్రాంత మిదం వాక్య మశోభనమ్॥ ౩౮॥

౨౯, ౩౦. ఆసురసయు నామేనికిందగునట్లు నోరుదెఱచెను. అంతగా నోరుతెఱచుకొంగని మేనుకుఱుచగాఁజేసితిని. తోడనే బొటన వ్రేలి ప్రమాణముగల శరీరముంగలవాఁడ నైతిని.

౩౧నుండి౩౩కు.ఆసురసయొక్క నోటను శీఘ్రమునంజొచ్చి వెంటనే వెలువడితిని. అంతట సురసయుఁ దనరూపముతో 'ఓశాంతుఁడ! ఓ వానరోత్తమా! కార్యానుకూలమునకై సుఖముగంబొమ్ము! సీతను మహాత్ముఁడగు రామునితోడఁ గూర్పుటయుం జేయుము! భుజబలముంగలవాఁడా! సౌఖ్యముగనుండుము. నీయెడసంతోషించితిని. అని నాతోఁబలుకు ఱుపలికెను. పిమ్మట సర్వభూతములును నన్ను మెచ్చి పొగడెను.

౩౪. పిమ్మటనేను గరుడునివలె విశాలమగు నంతరిక్షమున కెగసితిని. నానీడ దేనిచేతనో పట్టువడియెనుగాని యదియెద్దియో యెఱుంగనైతిని.

౩౫. అట్లు పట్టువడిననేను బదిదిక్కులనుజూచుచు నానడక దేనిచే నడ్డగింపఁబడినదియుఁ గొంచమేని కనుంగొననేరక యుంటిని.

౩౬. రూపమెందుఁ గనంబడలేదో యట్టిగగనమున నీవిధమగు విఘ్నమొకటి యెందులకై కలిగెనో యనుసంశయము నాకుఁబుట్టెను.

౩౭. దుఃఖించుచున్న నేను గ్రిందిప్రక్కంజూచితిని. నీటిపైనున్న భయంకరమగు రాక్షసిని గాంచితిని.

౩౮. భయంకరురాలగు నారాక్షసిచే గొప్పధ్వనియగునట్లు నవ్వంబడి, తొట్రుపాటులేకయు దృఢముగను నశుభమగునీమాట దానిచేఁ బలుకంబడితిని.

క్వాసి గంతా మహాకాయ క్షుధితాయా మమేప్సితః।
భక్షః ప్రీణయ మే దేహం చిర మాహారవర్జితమ్॥ ౩౯॥
బాఢమిత్యేవ తాం వాణీం ప్రత్యగృహ్ణా మహంతతః।
ఆస్యప్రమాణా దధికం తస్యాః కాయ మపూరయమ్॥ ౪౦॥
తస్యా శ్చాస్యం మహద్భీమం వర్ధతే మమ భక్షణే।
న చ మాం సా తు బుబుధే మమ వా నికృతం కృతమ్॥ ౪౧॥
తతోఽహం విపులం రూపం సంక్షిప్య నిమిషాంతరాత్।
తస్యా హృదయ మాదాయ ప్రపతామి నభస్థ్సలమ్। ౪౨॥
సా విసృష్టభుజా భీమా పపాత లవణాంభసి।
మయా పర్వతసంకాశా నికృత్త హృదయా సతీ॥ ౪౩॥
శృణోమి ఖగతానాం చ సిద్ధానాం చారణైః సహ।
రాక్షసీ సింహికా భీమా క్షిప్రం హనుమతా హతా॥ ౪౪॥
తాం హత్వా పునరేవాహం కృత్య మాత్యయికం స్మరన్।
గత్వా చాహం మహాధ్వానం పశ్యామి నగమండితమ్॥ ౪౫॥
దక్షిణం తీరముదధే ర్లంకా యత్ర చ సా పురీ॥ ౪౬॥
అస్తం దినకరేయాతే రక్షసాం నిలయం పురమ్।
ప్రవిష్టోఽహ మవిజ్ఞాతో రక్షోభి ర్భీమవిక్రమైః॥ ౪౭॥

౩౯. ఓ గొప్పమేనుగలవాఁడా! ఎందులకేఁగుచున్నావు? ఆఁకలిగొన్ననాకు నీవాహారమైతివి. చిరకాలమునుండి యాహారములేక యున్ననా దేహమును దనుపుము!

౪౦. అని యనఁగానే దానిమాటల కంగీకరించితిని. దానినోటి వైశాల్యముకంటె నధికమగు ప్రమాణముగలుగునటుల నామేను పెంచితిని.
౪౧. అట్లుసేయఁగా నారాక్షసియొక్క నోరు నన్ను మ్రింగుతలంపుతో వృద్ధిచేయఁబడుచుండెనుగాని నాదేహము బెంచుచున్నాననుట యారాక్షసికిఁ దెలియదయ్యెను.

౪౨. అవల విశాలమగురూపమును నిమిషమాత్రమునఁ గుఱుచపఱచి దానిగుండెను బగల్చి యాకాశమున కేగితిని.

౪౩. కొండలను బోలినదియు భయంకరమైనదియు నగురాక్షసి నాచే ఖండింపఁబడిన గుండెనుగలదియై భుజములువిడచి సముద్రమునం బడియెను.

౪౪. భయంకరురాలగు సింహికయనురక్కసి హనుమంతునిచే శీఘ్రమునఁ జంపంబడియెను. అని యాకాశమందుండు సిద్ధచారణులు పలుకుట వింటిని.

౪౫, ౪౫½. ఆసింహిక నట్లుచంపి మరల, ప్రాణమును మ్రింగునది యగు నాపనినే తలంచుచు దీర్ఘమగు త్రోవంజని చెట్లచే నలంకరింపఁబడినదియు, లంకకునెలవైనదియు నగుసముద్రముయొక్క దక్షిణపుగట్టును గాంచితిని.

౪౬½. సూర్యుఁ డస్తమించినతోడనే భయంకరమగు దర్పముంగలవారగురాక్షసుల కెఱుఁగఁబడనివాఁడనై, రాక్షసుల కునికిపట్టగులంక యందుఁ బ్రవేశించితిని.

తత్ర ప్రవిశత శ్చాపి కల్పాంత ఘనసన్నిభా।
అట్టహాసం విముంచంతీ నారీ కాప్యుత్థితా పురః॥ ౪౭

జిఘాంసంతీం తతస్తాంతు జ్వలదగ్ని శిరోరుహామ్।
సవ్యముష్టి ప్రహారేణ పరాజిత్య సుభైరవామ్॥ ౪౮

ప్రదోషకాలే ప్రవిశమ్ భీతయాహం తయోదితః॥ ౪౯

అహం లంకాపురీ వీర నిర్జితా విక్రమేణ తే।
యస్మా త్తస్మా ద్విజేతాసి సర్వరక్షాం స్యశేషతః॥ ౫౦

తత్రాహం సర్వరాత్రంతు విచిన్వన్ జనకాత్మజామ్।
రావణాంతఃపుర గతో నచాపశ్యం సుమధ్యమామ్॥ ౫౧

తత స్సీతా మపశ్యంస్తు రావణస్య నివేశనే।
శోకసాగర మాసాద్య నపార ముపలక్షయే॥ ౫౨

శోచతా చ మయాదృష్టం ప్రాకారేణ సమావృతమ్।
కాంచనేన వికృష్టేన గృహోపవన ముత్తమమ్॥ ౫౩

సప్రాకార మవప్లుత్య పశ్యామి బహుపాదపమ్।
అశోక వనికా మధ్యే శింశుపా పాదపో మహాన్॥ ౫౪

త మారుహ్య చ పశ్యామి కాంచనం కదళీవనమ్॥ ౫౫

అదూరే శింశుపావృక్షా త్పశ్యామి వరవర్ణినీమ్॥ ౫౬

శ్యామాం కమలపత్రాక్షీ ముపవాసకృశాననామ్।
తదేకవాస స్సంవీతాం రజోధ్వస్త శిరోరుహామ్॥ ౫౭

౪౭½. అట్లు ప్రవేశించునపుడు ప్రళయకాలమందలి మేఘముతోఁ దుల్యరాలగు నొకయాఁడుది గొల్లున నవ్వుచు నెదుట నిలచెను.

౪౮½, ౪౯. అపలఁ జింపఁదలంచియున్నదియు, మండుచున్న యగ్నిని బోలిన నేత్రములుగలదియు భయంకరముగనున్నదియునగు నాస్త్రీని నాయెడమచేతిగ్రుద్దుచే నోడించి సాయంకాలమునఁ బట్టణమునఁ బ్రవేశించితిని. బెదరినదియగు నాయాఁడుది నాతోడ నిట్లులనియెను.

౫౦. ఓవీరుఁడా! పరాక్రమవంతుఁడవగు నీచేత లంకాపురదేవత నగు నేను జయింపఁబడితినిగావున రాక్షసులనందఱను నీవు జంకులేక జయింపఁగలవాఁడవు.

౫౧. ఆప్పటి రాత్రియంతయు సీతను వెదకుచు రావణుని యంతఃపురమునందుఁ జొచ్చియు నందక త్తైయగు సీతాదేవిని గాననైతిని.

౫౨. పిమ్మట నారావణునియింట సీతనుగానక దుఃఖసముద్రమునంబడి గట్టునుగననేరక యుంటిని.

౫౩. ఉన్నతమగు బంగారుప్రాకారముచేఁ జుట్టంబడిన రమ్యమగు నుద్యానవనము దుఃఖించుచున్నవాఁడనగు నాకగపడియె.

౫౪, ౫౪½. అనేక వృక్షములనుగలదియుఁ బ్రాకారముతోఁ గూడినదియునగు నావనముం జేరి, అయశోకవనమునడుమ గొప్పదియగు నిరుఁగుడుచెట్టును గంటిని, దానిపై నెక్కి బంగారరఁటిచెట్ల వనమును గాంచితి.

౫౫ నుండి ౫౭½. ఉత్తమ చరితముంగలదియు, నడిమివయస్సునందున్నదియు తామరరేకులవంటి కన్నులంగలదియు, ఉపవాసములచే వాడిన మోముంగలదియు, ముందుకట్టుకొనిన యొకేవస్త్రముతోడనున్నదియు దుమ్ముగ్రమ్మిన తలవెండ్రుకలంగలదియు, శోకముచేఁ గ్రాఁగిన దుర్బలమగు మేనుగలదియు, మగనియొక్క క్షేమమునే కోరుచున్నదియు, వికారరూపము

శోకసంతాప దీనాంగీం సీతాం భర్తృహితే స్థితామ్।
రాక్షసీభి ర్విరూపాభిః క్రూరాభి రభిసంవృతామ్॥ ౫౭॥

మాంసశోణిత భక్షాభి ర్వ్యాఘ్రీభి ర్హరిణీ మివ। ౫౭½
సా మయా రాక్షసీమధ్యే తర్జ్యమానా ముహుర్ముహుః॥ ౫౮॥

ఏకవేణీధరా దీనా భర్తృచింతా పరాయణా।
భూమిశయ్యా వివర్ణాంగీ పద్మినీవ హిమాగమే॥ ౫౯॥

రావణా ద్వినివృత్తార్థా మర్తవ్య కృతనిశ్చయా।
కథంచి న్మృగశాబాక్షీ తూర్ణ మాసాదితా మయా॥ ౬౦॥

తాం దృష్ట్వా తాదృశీం నారీం రామపత్నీం యశస్వినీమ్।
తత్రైవ శింశుపావృక్షే పశ్యన్నహ మవస్థితః॥ ౬౧॥

తతో హాలహలాశబ్దం కాంచీ నూపురమిశ్రితమ్।
శృణో మ్యధిక గంభీరం రావణస్య నివేశనే॥ ౬౨॥
తతోఽహం పరమోద్విగ్న స్స్వంరూపం ప్రతిసంహరన్॥
అహంతు శింశుపావృక్షే పక్షీవ గహనే స్థితః॥ ౬౩॥

తతో రావణదారాశ్చ రావణశ్చ మహాబలః।
తం దేశం సమనుప్రాప్తా యత్రసీతా భవత్ స్థితా॥ ౬౪॥

తం దృష్ట్వాథ వరారోహా సీతా రక్షోగణేశ్వరమ్।
సంకుచ్యోరూ స్తనాపీనా బాహుభ్యాం పరిరభ్యచ॥ ౬౫॥

గలిగి క్రూరురాండ్రై రక్తమాంసములంగుడుచుచున్న రాక్షసస్త్రీలచే న
న్నిప్రక్కలఁ జుట్టంబడినదై (ఆఁడుపులులచేఁ జుట్టంబడిన జింకవలె) యు
న్న సీత నామ్రానిమీఁదనుండియే సమీపమునఁ గాంచితిని.

౫౮ నుండి ౬౦కి. పలుమాఱు బెదరింపఁబడుచున్నదియు, ఒంటిజడ
ను ధరించియున్నదియు, దిగులుపడియున్నదియు, మగనిందలంచుటయందే
యాసక్తురాలును, నేలపైఁ బరుండునదియు, మంచుకాలమందలి తామర
తీఁగలవలె మాసిన మేనుగలదియు, రావణునివలన విడువంబడిన ప్రయోజ
నముంగలదియు, ప్రాణత్యాగమునకై నిశ్చయించికొనియున్నదియు, లేఁడి
పిల్లచూపులంబోలు చూపులుగలదియు నగుసీతాదేవి రాక్షసస్త్రీలనడుమ
నెంతోకష్టముతో వేగమే నాచేఁ గనంబడియెను.

౬౧. రామునిభార్యయు, కీర్తిగలదియు నగునట్టి యిల్లాలినిగాంచి
యాయిరుగుడుచెట్టునందేయుండి సీతనుజూచుచుంటిని.

౬౨. అటుపై నందెలతోడను మొలనూలుతోడను గలిసి మిక్కిలి
గంభీరమైన హలహలమనుశబ్దము రావణునియింట వింటిని.

౬౩. తోడనె మిక్కిలిజడిసి నారూపమును కుఱుచపఱచుచుఁ ప
ఱచుగనుండుచెట్లయందుఁ బక్షివలె నాచెట్టుననే యొదిగియుంటిని.

౬౪. పిమ్మట రావణునిభార్యలును, బలశాలియగు రావణుఁడును
సీతయుండునట్టి చోటికిఁ జేరఁబాఱిరి.

౬౫. పిమ్మట నుత్తమురాలగుసీత బలవంతుఁడగు నారాక్షసునింగ
ని తొడలనుముడుచుకొని యున్నతములయిన స్తనములను భుజములచే
గప్పికొని భీతినిచెందినదయ్యెను.

విత్రస్తాం పరమోద్విగ్నాం వీక్షమాణాం తత స్తతః।
త్రాణం కించి దపశ్యంతీం వేపమానాం తపస్వినీమ్॥ ౧౬॥

తా మువాచ దశగ్రీవ స్సీతాం పరమదుఃఖితామ్।
అవాక్ఛిరాః ప్రపతితో బహు మన్యస్వ మామితి॥ ౧౭॥

యది చే త్త్వం తు దర్పా న్మాం నాభినందసి గర్వితే।
ద్వౌ మాసా వంతరం సీతే పాస్యామి రుధిరం తవ॥ ౧౮॥

ఏతచ్ఛ్రుత్వా వచ స్తస్య రావణస్య దురాత్మనః।
ఉవాచ పరమక్రుద్ధా సీతా వచన ముత్తమమ్॥ ౧౯॥

రాక్షసాధమ రామస్య భార్యా మమితతేజసః।
ఇక్ష్వాకుకులనాథస్య స్నుషాం దశరథస్య చ॥ ౨౦॥
అవాచ్యం వదతో జిహ్వా కథం న పతితా తవ॥ ౨౦½

కించిద్వీర్యం తవానార్య యో మాం భర్తు రసన్నిధౌ।
అపహృత్యాగతః పాప తేనాదృష్టో మహాత్మనా॥ ౨౧½

న త్వం రామస్య సదృశో దాస్యేప్యస్య న యుజ్యసే।
యజ్ఞీయ స్సత్యవాదీ చ రణశ్లాఘీ చ రాఘవః॥ ౨౨½

జానక్యా పరుషం వాక్య మేవ ముక్తో దశాననః।
జజ్వాల సహసా కోపా చ్చితాస్థ ఇవ పావకః॥ ౨౩½

వివృత్య నయనే క్రూరే ముష్టి ముద్యమ్య దక్షిణమ్।
మైథిలీం హంతు మారబ్ధ స్త్రీభి ర్హాహాకృతం తదా॥ ౨౪½

౬౬ నుండి ౬౮. మిక్కిలి భయపెట్టఁబడినదియు, చలించిన చిత్తముగలదియు, అందందుఁజూచుచున్నదియు, రక్షించువారికై యెదురు చూచుచున్నదియు, వణంకుచున్నదియు, దిక్కుమాలినదియు, మిక్కిలి దుఃఖముఁజేయఁబడినదియు నగుసీతతోడ రావణుఁడు వంచినతలతోడ సొగసుకత్తెనన్ను గౌరవింపుము! ఓగర్వించినదానా! నీవు నన్ను సమ్మతింపకున్నను రెండుమాసము లవకాశమిచ్చితిని. అప్పుడును నీవు విరోధించితివేని నీరక్తముఁద్రావుదును. అని చెప్పెను.

౬౯. దుర్జనుఁడగు రావణుఁ డిట్లాడినమాటను విని మిక్కిలి కోపించి సీతాదేవి వానికిఁ బ్రత్యుత్తరముగా నుంచిమాటఁజెప్పెను.

౭౦, ౭౦౹. రాక్షసులలోనీచుఁడ! మితిమించిన ప్రతాపముగలవాఁడగు రామునకు భార్యను. ఇక్ష్వాకుకులమునకు వన్నెతెచ్చిన దశరథునకుఁ గోడలిని, చెప్పరానిమాటను జెప్పుచున్న నీనాలుక యేలపడదయ్యెను.

౭౧౹, ౭౨౹. అయోగ్యుఁడా! పాపాత్ముఁడ! నాభర్త యింటలేనియపుడును, ఆమహాత్ముచేఁ జూడంబడకయు నన్నుం గొనివచ్చినట్టి నీయొక్క బలము స్వల్పమేను! యజ్ఞములుసేయు నిచ్ఛగలవాఁడును సత్యమే భాషించువాఁడును యుద్ధమునం దిష్టముగలవాఁడును నగురామునకు నీవు సముఁడవుగావు. అతని సేవకుఁడవుగను నుండఁదగవు.

౭౩౹. రావణుఁడు జానకిచే నిష్ఠురముగ భాషింపఁబడినవాఁడై పేర్చిన చిచ్చునంబడినయగ్నివలె వేగమునమండెను.

౭౪౹, ౭౫౹. ఆరావణుఁడు భయంకరములగు కన్నులందెఱచి కుడిచేతి పిడికిలినెత్తికొని జానకిని జంపఁబోయెను. అప్పుడు వాని వెంటనున్న స్త్రీలందఱు హాహాకారముఁజేసిరి. ఆదుష్టునియొక్క భార్యయగు మండో

స్త్రీణాం మధ్యా త్సముత్పత్య తస్య భార్యా దురాత్మనః।
వరా మందోదరీ నామ తయా స ప్రతిషేధితః॥ ౭౫

ఉక్తశ్చ మధురాం వాణీం తయా స మదనార్దితః।
సీతయా తవ కిం కార్యం మహేంద్ర సమవిక్రమ॥ ౭౬

దేవగంధర్వ కన్యాభి ర్యక్షకన్యాభి రేవచ।
సార్ధం ప్రభో రమస్వేహ సీతయా కిం కరిష్యసి॥ ౭౭

తత స్తాభి స్సమేతాభి ర్నారీభి స్సమహాబలః।
ప్రసాద్య సహసా నీతో భవనం స్వం నిశాచరః॥ ౭౮

యాతే తస్మిన్ దశగ్రీవే రాక్షస్యో వికృతాననాః।
సీతాం నిర్భర్త్సయామాసు ర్వాక్యైః క్రూరై స్సుదారుణైః॥

తృణవ ద్భాషితం తాసాం గణయామాస జానకీ।
గర్జితం చ తదా తాసాం సీతాం ప్రాప్య నిరర్థకమ్॥ ౮౦

వృథాగర్జిత నిశ్చేష్టా రాక్షస్యః పిశితాశనాః।
రావణాయ శశంసు స్తా స్సీతాధ్యవసితం మహత్॥ ౮౧

తత స్తా స్సహితా స్సర్వా విహతాశా నిరుద్యమాః।
పరిక్షిప్య సమంతా త్తాం నిద్రావశ ముపాగతాః॥ ౮౨

తాసు చైవ ప్రసుప్తాసు సీతా భర్తృహితే రతా।
విలప్య కరుణం దీనా ప్రశుశోచ సుదుఃఖితా॥ ౮౩

తాసాం మధ్యా త్సముత్థాయ త్రిజటా వాక్య మబ్రవీత్॥

వరియను నుత్తమురాలా స్త్రీసమూహమునుండి లేచి మగని నాఘాతుకకార్యమునుండి యడ్డగించినది.

౭౬½, ౭౭½. దేవేంద్రునితోఁదుల్యమగు పరాక్రమమునుగలవాఁడా! నీకు సీతతో నేమిపని? దేవతలయొక్కయు గంధర్వుల యొక్కయు రాక్షసులయొక్కయుఁ బడుచులతో భోగింపుము రాజా! సీతవలన నేమి ప్రయోజనము!

౭౮½. పిమ్మటఁ గూడుకొనినవారగు నాస్త్రీలతోడ, మహాబలశాలియగు రావణుఁడు చల్లపఱుపంబడి యింటికిఁ గొనిపోవంబడియెను.

౭౯½. ఆరావణుఁడు పోయినతోడనే వికారములగు మోములంగల రాక్షసస్త్రీలు, వినఁగూడనట్టియు భయంకరమైనట్టియు మాటలచే సీతను బెదరించిరి.

౮౦½. ఆ స్త్రీలబెదరింపులను సీతాదేవి యొకగడ్డిపోఁచవలెఁదలంచెను. వారుచేసిన యార్పులును సీతయెడల వ్యర్థములయ్యెను.

౮౧½. మాంసముందినువారగు రాక్షసస్త్రీలు దాముచేసిన యాటోపమంతయు వ్యర్థముకాఁగా, రావణుని కడకేగి సీతయొక్క నిశ్చయమును దెలియంజెప్పిరి.

౮౨½. పిమ్మట వారందఱుంగూడి యాశచెడినవారును యత్నములేనివారునునై యామెను నలుప్రక్కలఁజుట్టుకొని పరుండి నిద్రించిరి.

౮౩½. ఆ స్త్రీలట్లునిద్రింపఁగా, మగనియొక్కమేలును గోరుచున్నదియగుసీత దిగులుపడి, చూచువారేడ్చునట్లుగా దుఃఖించినదై గొంతెత్తియేడ్చెను.

౮౪½ నుండి ౮౬. వారలనడుమనుండి త్రిజటయనునది లేచియిట్లనియెను. జనకునకుఁ బుత్రికయు, దశరథునకుంగోడలును, పతివ్రతయునగు

ఆత్మానం ఘాదత క్షిప్రం నసీతా వినశిష్యతి॥ ౮
జనక స్యాత్మజా సాధ్వీ స్నుషా దశరథస్య చ।
స్వాప్నో హ్యద్య మయాదృష్టో దారుణో రోమహర్షణః॥ ౮
రక్షసాం చ వినాశాయ భర్తుస్స్యా జయాయ చ॥ ౮
అల మస్మాత్ పరిత్రాతుం రాఘవా ద్రాక్షసీగణమ్।
అభియాచామ వైదేహీ మేతద్ధి మమ రోచతే॥ ౮
యస్యా హ్యేవంవిధస్స్వప్నో దుఃఖితాయాః ప్రదృశ్యతే।
సా దుఃఖై ర్వివిధై ర్ముక్తా సుఖ మాప్నోత్యనుత్తమమ్। ౮
ప్రణిపాత ప్రసన్నా హి మైథిలీ జనకాత్మజా॥ ౮
తత స్సా హ్రీమతీ బాలా భర్తు ర్విజయ హర్షితా।
అవోచ ద్యది త త్తథ్యం భవేయం శరణం హి వః॥ ౮
తాం చాహం తాదృశీం దృష్ట్వా సీతాయా దారుణాందశా
చింతయామాస విక్రాంతో న చ మే నిర్వృతం మనః॥ ౯
సంభాష ణార్థం చ మయా జానక్యా శ్చింతితో విధిః।
ఇక్ష్వాకూణాం హి వంశస్తు తతో మమ పురస్కృతః॥ ౯
శ్రుత్వాతు గదితాం వాచం రాజర్షి గణ పూజితామ్।
ప్రత్యభాషత మాం దేవీ బాష్పైః పిహిత లోచనా॥ ౯
క స్త్వం కేన కథం చేహ ప్రాప్తో వానర పుంగవ।
కా చ రామేణ తే ప్రీతి స్త న్మే శంసితు మర్హసి॥ ౯

సీత నశించునది కాదు. తినవలయునని యిష్టమున్నచో నన్నుఁ దినుఁడు భయంకరమైనదియుఁబులకలు పుట్టించునదియు నగు స్వప్నము రాక్షసనాశముకొఱకును, ఈమె భర్తయొక్క జయముకొఱకును నాచే నిపుడు గనఁబడియెను.

౮౭. ఈరాక్షస్త్రీ సమూహమును రాఘవునిచేఁ బొవకుండఁ గాచుట కీసీతచాలినదియగును. అందులకై యీసీతను వేఁడుదము. ఇద్దియే నాకిష్టము.

౮౮,౮౯. దుఃఖితురాలైనదియగు నేయిల్లాలి విషయమునని ట్టిస్వప్నము చూడఁబడియెనో యట్టి సీతాదేవి దుఃఖములచే విడువఁబడిన సాటిలేని సౌఖ్యమునుబొందును. జనకపుత్రియగుసీత మ్రొక్కినవారియం దుఁ గరుణించునదికదా!

౯౫. అని త్రిజటపలికినపిమ్మట సిగ్గుపడుచున్నదియగు నాచిన్నది మగనియొక్క గెలుపునుగూర్చి సంతోషించినదై, ఆస్వప్నము నందలి విషయము సత్యమయ్యెనేని మిమ్ము రక్షింతును, అనిపలికెను.

౬౦౫. పరాక్రమవంతుఁడనగు నే నాసీతాదేవిని, ఆమెయొక్క కష్టతరమగుదశను గాంచి చింతించితిని. నామనస్సునకును నెమ్మది లేదయ్యెను.

౬౧౫. జానకితో మాటలాడుటకు పాయమెద్దియని యోచించితిని. పిమ్మట నిక్ష్వాకువంశపురాజులయొక్క కులమును గొనియాడితిని.

౬౨౫,౬౩౫. రాజఋషులసమూహమునుచేరొకానుటచేఁ బూజింపఁదగినదియగు నాచేఁదెలుపఁబడిన వాక్యములువిని, సీతాదేవి కన్నీటిచేఁ గప్పంబడిన కన్నులుగలదియై నాతోనిట్లనియెను. ఓవానరోత్తమా! నీ వెవ్వండవు? నీవిచ్చోటున కేమిపనికై యెట్లువచ్చితివి? నీకు రామునితోడి స్నేహమెట్టిది? దానిని నాకుఁ దెలియఁబలుకుము!

తస్యా స్తద్వచనం శ్రుత్వా హ్యాహమ ప్యబ్రువం వచః॥ ౯౪॥
దేవీ రామస్య భర్తు స్తే సహాయో భీమవిక్రమః।
సుగ్రీవో నామ విక్రాంతో వానరేంద్రో మహాబలః॥ ౯౫॥
తస్య మాం విద్ధి భృత్యం త్వం హనుమంత మిహాగతమ్।
భర్త్రా ఽహం ప్రేషిత స్తుభ్యం రామే ణాక్లిష్టకర్మణా॥ ౯౬॥
ఇదం చ పురుషవ్యాఘ్రః శ్రీమాన్ దాశరథి స్స్వయమ్।
అంగులీయ మభిజ్ఞాన మదాత్తుభ్యం యశస్విని॥ ౯౭॥
త దిచ్ఛామి త్వయా జ్ఞప్తం దేవి కిం కరవాణ్యహమ్।
రామలక్ష్మణయోః పార్శ్వం నయామి త్వాం కిము త్తరమ్॥ ౯౮॥
ఏతచ్ఛ్రుత్వా విదిత్వా చ సీతా జనకనందినీ।
ఆహ రావణ ముత్సాద్య రాఘవో మాం నయత్వితి॥ ౯౯॥
ప్రణమ్య శిరసా దేవీ మహ మార్యా మనిందితామ్।
రాఘవస్య మనోహ్లాద మభిజ్ఞాన మయాచిషమ్॥ ౧౦౦॥
అథ మా మబ్రవీ త్సీతా గృహ్యతా మయ ము త్తమః।
మణి ర్యేన మహాబాహూ రామ స్త్వాం బహుమన్యతే॥ ౧౦౧॥
ఇత్యు క్త్వా తు వరారోహా మణి ప్రవర మద్భుతమ్।
ప్రాయచ్ఛ త్పరమో ద్విగ్నా వాచా మాం సం దిదేశ హ॥
తత స్తస్యై ప్రణమ్యాహం రాజపుత్ర్యై సమాహితః।
ప్రదక్షిణం పరిక్రామ మిహాభ్యుద్గత మానసః॥ ౧౦౩॥

౯౪ నుండి ౯౬కు. ఆదేవియాడినమాటలువిని నేనిట్లు పలికితిని. ఓదేవి! భయంకరమగు పరాక్రమముగలవాఁడును, దర్పముంగలవాఁడును మిక్కిలిబలశాలియునగు సుగ్రీవుఁడను వానరోత్తముఁడు నీ భర్తయగు శ్రీరామునకు సహాయుఁడైనవాఁడు. ఇందులకువచ్చియున్న హనుమంతుఁడనున న్నాసుగ్రీవునకు బంటుగా నెఱుంగుము! కష్టములేని కార్యములంగలవాఁడగు రామునిచేత నీకడ కనుపంబడితిని.

౯౭. కీర్తినిగలదానా! పురుషోత్తముఁడును సౌందర్యముగలవాఁడును నగురాముఁడు తానై యీయుంగరమును నీకు గుఱుతుగానిచ్చెను.

౯౮. ఓదేవీ! నీచే నాజ్ఞాపింపఁబడినదానిని జేయ నున్నవాఁడను. ఏమిచేయవలయును! ప్రత్యుత్తరము నొసంగితివేని రామలక్ష్మణుల కడకుఁ గొనిపోవువాఁడను.

౯౯. జనకపుత్రికయగుసీత నామాటలనువిని గ్రహించి శ్రీరాముండు రావణుంజంపి నన్నుంగొనిపోవలయును. అని పలికెను.

౧౦౦. పూజ్యురాలును, నిందింపంబడనిదియును నగునామెకుఁ దలవాంచి మ్రొక్కి, శ్రీరామునకు సంతోషమును గలిగించునట్టి గుఱుతు నిమ్మని యడిగితిని.

౧౦౧. గొప్ప భుజములుగలవాఁడగు శ్రీరాముఁడు దేనినిగనినిన్ను గౌరవించునో యట్టి యుత్తమమగుచూడామణిం గొనుమని సీత పలికెను.

౧౦౨. ఉత్తమురాలగు నాదేవి యిట్లుపలికి మిక్కిలి ఖిన్నురాలైరత్నములలో నుత్తమమును వింతగనున్నదియు నగు చూడామణి నిచ్చెను. అచ్చోటఁ జెప్పుమని కొన్నిమాటలను బలికెను.

౧౦౩. పిమ్మట నారాజపుత్రిక కూరటచెంది మ్రొక్కి ప్రయాణముగాఁదలంచినవాఁడనై ప్రదక్షిణముచేసి తరలితిని.

ఉత్తరం పునరేవేదం నిశ్చిత్య మనసా తయా।
హనుమన్మమ వృత్తాంతం వక్తుమర్హసి రాఘవే॥ ౧౦౪॥

యథా శ్రుత్వైవ నచిరాత్తావుభౌ రామలక్ష్మణౌ।
సుగ్రీవసహితౌ వీరావుపేయాతాం తథా కురు॥ ౧౦౫॥

యద్యన్యథా భవేదేతద్ద్వౌ మాసౌ జీవితం మమ।
న మాం ద్రక్ష్యతి కాకుత్స్థో మ్రియే సాహమనాథవత్॥ ౧౦౬॥
తచ్ఛ్రుత్వా కరుణం వాక్యం క్రోధో మామభ్యవర్తత।
ఉత్తరం చ మయా దృష్టం కార్యశేషమనంతరమ్॥ ౧౦౭॥
తతో ఽవర్ధత మే కాయస్తదా పర్వతసన్నిభః।
యుద్ధకాంక్షీ వనం తచ్చ వినాశయితుమారభే॥ ౧౦౮॥

తద్భగ్నం వనషండం తు భ్రాంతత్రస్తమృగద్విజమ్।
ప్రతిబుద్ధా నిరీక్షంతే రాక్షస్యో వికృతాననాః॥ ౧౦౯॥
మాం చ దృష్ట్వా వనే తస్మిన్ సమాగమ్య తతస్తతః।
తాః సమభ్యాగతాః క్షిప్రం రావణాయాచచక్షిరే॥ ౧౧౦॥

రాజన్వనమిదం దుర్గం తవ భగ్నం దురాత్మనా।
వానరేణ హ్యవిజ్ఞాయ తవ వీర్యం మహాబల॥ ౧౧౧॥
దుర్బుద్ధేస్తస్య రాజేంద్ర తవ విప్రియకారిణః।
వధమాజ్ఞాపయ క్షిప్రం యథాసౌ విలయం వ్రజేత్॥ ౧౧౨॥

తచ్ఛ్రుత్వా రాక్షసేంద్రేణ విసృష్టా భృశదుర్జయాః।
రాక్షసాః కింకరా నామ రావణస్య మనోఽనుగాః॥ ౧౧౩॥

౧౧౪ నుండి ౧౦౬ కు. మఱియొకసారి యోచింపంబడియు సీతాదేవిచే నిట్లుత్తరము నిశ్చయించి చెప్పంబడియెను. ఓహనుమా! శ్రీరామునితోడ నాస్థితినిగూర్చి తెలుపవలయుంజుమా! ఆరామలక్ష్మణులు సుగ్రీవ సహితులై నీవుచెప్పెడిమాటను వినినంతనే ప్రయాణమై నాకడకేతెంచునట్లు నేయుమా! అట్లు వారు రాకచిక్కరేని నేనుబ్రతికియుండుట కింకనెంతేనుమా! నన్ను రాఘవుండు సూడఁజేని దిక్కుమాలినదానివలెఁ జచ్చుదానను

౧౦౭. మనస్సును గరగించునట్టిదియగు నామాటను విని కోపము నన్నుమించినదయ్యెను. ఇప్పుడు చేసినపనిగాక లంకవిషయమున మిగిలియున్నపనియుంగూడఁ జేయుదునా? అని యోచించితిని.

౧౦౮. వెంటనే నామేను పర్వతముంబోలెఁ బెరిగెను. యుద్ధమును గోరుచున్నవాఁడనై వనమునుగూడఁ ధ్వంసము సేయ నారంభించితిని.

౧౦౯. వికారపు మోముంగల రాక్షసస్త్రీలు వనసమూహముచెడినదిగాను, బెదరిడస్సినమృగములను బక్షులను గలదిగాను వెలినీకొని చూచుచుండిరి.

౧౧౦. ఆరాక్షసస్త్రీలు వనమందంతటనుండివచ్చి నన్నుంగాంచి పోయి రావణునకుం జెప్పిరి.

౧౧౧. బలవంతుఁడవగు ఓరాజా? దుష్టుఁడగువానరునిచేఁ (నీబలమిట్టిదని వానికి దెలియనందున) జొరఁగూడనిదియగు నశోకవనము రూపుమాపంబడియెను.

౧౧౨. ఓరాజేంద్రా! నీకపకారముం జేయుచున్న దుర్బుద్ధియగు వానరుఁడు శీఘ్రముననే నశించునట్లుగా వధ కుత్తరు వొసంగుము!

౧౧౩. ఆమాటనువిని రావణుఁడు సామాన్యముగ జయింపంబడనివారును, తనయభిప్రాయము ననుసరించువారును నగు కింకరులను రాక్షసులను బనిచెను.

తేషా మశీతి సాహస్రం శూల ముద్గర పాణినామ్।
మయా తస్మి న్వనోద్దేశే పరిఘేణ నిషూదితమ్॥ ౧౧౪॥
తేషాం తు హతశేషా యే తే గత్వా లఘువిక్రమాః।
నిహతం చ మహ త్సైన్యం రావణా యాచచక్షిరే॥ ౧౧౫॥
తతో మే బుద్ధి రుత్పన్నా చైత్యప్రాసాద మాక్రమమ్।
తత్రస్థా న్రాక్షసా న్హత్వా శతం స్తంభేన వై పునః॥ ౧౧౬॥
లలామ భూతో లంకాయా స్సవై విధ్వంసితో మయా।
తతః ప్రహస్తస్య సుతం జంబుమాలిన మాదిశత్॥ ౧౧౭॥
రాక్షసై ర్బహుభిస్సార్థం ఘోరరూపై ర్భయానకైః॥ ౧౧౭॥
తమహం బలసంపన్నం రాక్షసం రణకోవిదమ్।
పరిఘే ణాతిఘోరేణ సూదయామి సహానుగమ్॥ ౧౧౮॥
తచ్ఛ్రుత్వా రాక్షసేంద్రస్తు మంత్రిపుత్రా న్మహాబలాన్।
పదాతిబల సంపన్నా న్ప్రేషయామాస రావణః। ౧౧౯॥
పరిఘేణైవ తాన్ సర్వా న్నయామి యమసాదనమ్॥ ౧౨౦॥
మంత్రిపుత్రా న్హతాం ఛ్ఛ్రుత్వా సమరే లఘువిక్రమాన్।
పంచ సేనాగ్రగాం ఛ్ఛూరాన్ ప్రేషయామాస రావణః ౧౨౧॥
తా నహం సహసైన్యాన్వై సర్వానేవా భ్యసూదయమ్।
తతః పున ర్దశగ్రీవః పుత్ర మక్షం మహాబలమ్।
బహుభీ రాక్షసై స్సార్థం ప్రేషయామాస రావణః॥ ౧౨౨॥

౧౧౪. శూలముద్గరములను నాయుధములను ధరించినవారగు నా రాక్షసులయొక్క యెనుబదివేలసేన యావనప్రదేశముననే నాచేత గుదియతోఁ గూల్పంబడియెను.

౧౧౫. ఆ రాక్షసులలో నల్పబలముగలవారును, చావక మిగిలినవారునునగు కొందఱు 'గొప్పదియగు మనసేనయంతయుఁ జంపంబడియె' నని రావణునకుం జెప్పిరి.

౧౧౬, ౧౧౬½. పిమ్మట మఱియొకతలంపుగల్గినవాఁడనై గ్రామమధ్యముననుండు రచ్చమేడను గ్రమ్ముకొంటిని. అచ్చోటనున్న ననేకులగు రాక్షసులను స్తంభముచేఁ జంపి, లంకకు భూషణమువలెనుండిన యాచైత్యను గూలంద్రోసితిని.

౧౧౭½. పిమ్మట రావణుండు ప్రహస్తునిపుత్త్రుఁడగు జంబుమాలిని వికారమగు రూపముగలవారును భయంకరులైనవారునునగు పెక్కండ్రు రాక్షసులతోఁగూడ యుద్ధమునకుఁబనిచెను.

౧౧౮½. బలముచేమించినవాఁడును యుద్ధమునవిద్వాంసుఁడైనవాఁడునునగు నారాక్షసుని వానివెంటవచ్చినవారితోఁగూడ గుదియచేమోది నశింపఁజేసితిని.

౧౧౯, ౧౨౦. రాక్షసరాజగు రావణుఁడామాటనువిని గొప్పబలముగలవారును కాల్బలమును మెండుగాఁగలవారునునగు మంత్రిపుత్త్రులనుబనిచెను, తొల్లింటి గుదియచేతనే వారలనందఱను యమునియింటి కనిచితిని.

౧౨౧, ౧౨౧½. మిక్కిలి దర్పమునుగలవారగు మంత్రిపుత్త్రులు యుద్ధమునఁ గూల్పంబడిరని విని, శూరులగు నైదుగురు సేనా నాయకులను రావణుండుపనిచెను, వారలను సేనాసమేతముగా నందఱం దునిమితిని.

౧౨౨½. పిమ్మట రావణుఁడు తనపుత్త్రుఁడును బలశాలియు నగు నక్షునిఁ బెక్కండ్రురాక్షసులతోడ యుద్ధమునకుం బనిచెను.

తంతు మందోదరీపుత్రం కుమారం రణపండితమ్॥ ౧౨౩॥
సహసా ఖం సముత్క్రాంతం పాదయో శ్చ గృహీతవాన్।
చర్మాసినం శతగుణం భ్రామయిత్వా వ్యపేషయమ్॥ ౧౨౪॥
త మక్ష మాగతం భగ్నం నిశమ్య స దశాననః।
తత ఇంద్రజితంనామ ద్వితీయం రావణ స్సుతమ్॥ ౧౨౫॥
వ్యాదిదేశ సుసంక్రుద్ధో బలినం యుద్ధదుర్మదమ్॥ ౧౨౬॥
త చ్చాప్యహం బలంసర్వం తం చ రాక్షస పుంగవమ్।
నష్టౌజసం రణేకృత్వా పరంహర్ష ముపాగమమ్॥ ౧౨౭॥
మహతాపి మహాబాహుః ప్రత్యయేన మహాబలః।
ప్రేషితో రావణేనైవ సహవీరై ర్మదోత్కటైః॥ ౧౨౮॥
సో విషహ్యం హి మాంబుధ్వా స్వబలం చావ మర్దితమ్।
బ్రాహ్మేణాస్త్రేణ స తు మాం ప్రాబధ్నా చ్చాతివేగితః॥
రజ్జుభి శ్చాభిబధ్నంతి తతో మాం తత్ర రాక్షసాః।
రావణస్య సమీపంచ గృహీత్వా మా ముపానయన్॥ ౧౨౯॥
దృష్ట్వా సంభాషిత శ్చాహం రావణేన దురాత్మనా॥ ౧౩౦॥
పృష్టశ్చ లంకాగమనం రాక్షసానాం చ తం వధమ్।
తత్సర్వం చ మయాతత్ర సీతార్థ మితి జల్పితమ్॥ ౧౩౧॥
అస్యాహం దర్శనాకాంక్షీ ప్రాప్త స్త్వద్భవనం విభో।
మారుత స్యౌరసః పుత్రో వానరో హనుమా నహమ్॥ ౧౩౨॥

౧౨౩, ౧౨౪. మండోదరీపుత్రుఁడును యుద్ధశాస్త్రమునఁ బండితుఁడును, శీఘ్రమున నాకాశముమీఁదికేగినవాఁడును ఖడ్గమును డాలును గలవాఁడును, సూఱంతలబలముగలవాఁడునునగు నక్షకుమారుని బాదముల కడఁబట్టి వేగమునంద్రిప్పిత్రిప్పి నుఱుముగావైచితిని.

౧౨౫, ౧౨౫½. పదిమోములంగలవాఁడగు నారావణుఁ డక్షుఁడు యుద్ధమున నీల్గెననివిని మిక్కిలికోపించి, తన రెండవకొడుకగు నింద్రజిత్తును బలవంతుని గర్వించినవానిని యుద్ధమునకనిచెను.

౧౨౬½. అంతట నేనా రాక్షసునియొక్క సేనను, బలవంతుఁడగు నాతనిం డయ్యునట్లుచేసి మిక్కిలి సంతోషమును బొందితిని.

౧౨౭½. గొప్పభుజములను మెండగు బలమునుగలవాఁడగు నాతండు గొప్పదియగు నమ్మికచే, మదించిన వీరులతోడఁగూడఁ బనుపంబడెనవాఁడు.

౧౨౮½. ఆయింద్రజిత్తు నేను సహింపఁగూడనివానింగాను,తన సేన నాశము సేయఁబడినదిగాను తెలిసికొని మిక్కిలిత్వరతో నన్ను బ్రహ్మాస్త్రముచే బాగుగఁగట్టెను.

౧౨౯½. అవల రాక్షసులు నన్నుఁ ద్రాళ్ళతోఁగట్టిరి, పెక్కండ్రు రక్కసులు పట్టుకొని నన్ను రావణునికడకుఁ గొనిపోయిరి.

౧౩౦, ౧౩౧. దుష్టస్వభావముంగలవాఁడగు రావణునిచేత నేను జూచి మాటలాడంబడితిని, లంకకు వచ్చుటకుఁ గారణమును రాక్షసులను వధించుటయు నడుగంబడితిని, ఆవిషయమంతయు సీతకుఁగాఁ జేసితినని చెప్పితిని.

౧౩౨. ఓ ప్రభుఁడా! సీతాదర్శనమును గోరినవాఁడనై నేను నీన గరునందుఁ జొచ్చితిని, నేను వాయుపుత్రుఁడను హనుమంతుఁడను పేరుగల వానరుఁడను.

రామదూతం చ మాం విద్ధి సుగ్రీవ సచివం కపిమ్।
సోహం దూత్యేన రామస్య త్వత్సకాశ మిహాగతః॥ ౧౩౩।
సుగ్రీవశ్చ మహాతేజా స్స త్వాం కుశల మబ్రవీత్।
ధర్మార్థకామ సహితం హితం పథ్య మువాచ చ॥ ౧౩౪॥
వసతో ఋశ్యమూకే మే పర్వతే విపులద్రుమే।
రాఘవో రణవిక్రాంతో మిత్రత్వం సముపాగతః॥ ౧౩౫॥
తేన మే కథితం రాజ్ఞా భార్యా మే రక్షసా హృతా।
తత్ర సాహాయ్య మస్మాకం కార్యం సర్వాత్మనా త్వయా॥౧౩౬॥
మయా చ కథితం తస్మై వాలినశ్చ వధం ప్రతి।
తత్ర సాహాయ్య హేతోర్మే సమయం కర్తు మర్హసి॥ ౧౩౭॥
వాలినా హృతరాజ్యేన సుగ్రీవేణ మహాప్రభుః।
చక్రేగ్నిసాక్షికం సఖ్యం రాఘవ స్సహలక్ష్మణః॥ ౧౩౮॥
తేన వాలిన ముత్పాట్య శరేణైకేన సంయుగే।
వానరాణాం మహారాజః కృత స్స ప్లవతాం ప్రభుః॥ ౧౩౯।
తస్య సాహాయ్య మస్మాభిః కార్యం సర్వాత్మనా త్విహ।
తేన ప్రస్థాపిత స్తుభ్యం సమీప మిహాధర్మతః॥ ౧౪౦॥
క్షిప్ర మానీయతాం సీతా దీయతాం రాఘవాయ చ।
యావన్న హరయో వీరా విధమంతి బలం తవ॥ ౧౪౧।
వానరాణాం ప్రభావోహి న కేన విదితః పురా।
దేవతానాం సకాశంచ యేగచ్ఛంతి నిమంత్రితాః॥ ౧౪౨॥

౧౩౩. శ్రీరామునిదూతనుగాను సుగ్రీవునిమంత్రినిగాను వానరునింగాను నన్నెఱుంగుము. అట్టి నేను శ్రీరామునిదూతనై పనిగలిగి నీకడకే తెంచితిని.

౧౩౪. గొప్ప ప్రతాపముగలవాఁడగు సుగ్రీవుండు నీక్షేమము నడిగెను. ధర్మార్థ కామములతోఁ గూడినదియగు నీతిని నీకుఁజెప్పి పనిచెను.

౧౩౫. గొప్పవృక్షములనుగల ఋశ్యమూకపర్వతమున వసించుచున్న నాచేత యుద్ధమందుఁ బరాక్రమముంగలవాఁడగు శ్రీరాముఁడు సుగ్రీవుని మైత్రినింబొందెను.

౧౩౬. 'నాభార్య రాక్షసునిచేఁ గొనిపోఁబడియెను' అసీతను వెదకుటకై మాకు నీశక్తికొలఁది సహాయముచేయందగును. అని రాముఁడు సుగ్రీవునడిగెను.

౧౩౭. సీతను వెదకుటకై మీకు సహాయముంజేయఁ బ్రతిజ్ఞచేయంబడును గాని, వాలినివధించువిషయమున సుగ్రీవునకుం దోడ్పడుఁడని నేనడిగితిని.

౧౩౮. రాజులకురాజగు శ్రీరాముఁడు లక్ష్మణసహితుఁడై, వాలిచే హరింపఁబడినరాజ్యముంగలసుగ్రీవునితో నగ్నిని సాక్షిగా నుంచుకొని సఖ్యముంజేసెను.

౧౩౯. ఆరామునిచే నొక్కబాణముచే యుద్ధమున వాలినిదునిమి వానరులకురాజగు సుగ్రీవుఁడు మహారాజుగాఁ జేయంబడియె.

౧౪౦. అట్టిరామున కెల్లభంగుల మేము సహాయముచేయందగును ఆసుగ్రీవునిచేత నీకడకు ధర్మముననుసరించి పనుపంబడినవాఁడను.

౧౪౧. శీఘ్రముననే సీతనుదెప్పించి రామున కొసఁగఁదగును. బలవంతులగువానరులు నీసేన నూఁదివేయంగలరు.

౧౪౨. మున్ను పిలువంబడినవారై దేవతలయొక్కచేరువ కెవరు చనుచుండిరో యట్టి వానరులయొక్కమహిమ నెవఁడెఱుంగఁడు.

ఇతి వానరరాజ స్త్వాం మాహే త్యభిహితో మయా।
సమైక్షత తతః క్రుద్ధ శ్చక్షుషా ప్రదహన్నివ॥ ౧౪౩॥

తేన వధ్యో హ మాజ్ఞప్తో రక్షసా రౌద్రకర్మణా।
మ త్ప్రభావ మవిజ్ఞాయ రావణేన దురాత్మనా॥ ౧౪౪॥

తతో విభీషణో నామ తస్య భ్రాతా మహామతిః।
తేన రాక్షసరాజోఽసౌ యాచితో మమ కారణాత్॥ ౧౪౫॥

నైవం రాక్షస శార్దూల త్యజ్యతా మేష నిశ్చయః।
రాజశాస్త్ర వ్యపేతో హి మార్గ స్సంసేవ్యతే త్వయా॥ ౧౪౬॥

దూతవధ్యా నదృష్టా హి రాజశాస్త్రేషు రాక్షస।
దూతేన వేదితవ్యం చ యథార్థం హితవాదినా॥ ౧౦౭॥

సుమహ త్యపరాధేపి దూత స్యాతుల విక్రమ।
విరూపకరణం దృష్టం నవధో స్తీతి శాస్త్రతః॥ ౧౪౮॥

విభీషణేనైవ ముక్తో రావణ స్సందిదేశ తాన్।
రాక్షసా నేత దేవాస్య లాంగూలం దహ్యతా మితి॥ ౧౪౯॥

తత స్తస్య వచశ్శ్రుత్వా మమ పుచ్ఛం సమంతతః।
వేష్టితం శణవల్కైశ్చ జీర్ణైః కార్పాసజైః పటైః॥ ౧౫౦॥

రాక్షసా స్సిద్ధసన్నాహా స్తత స్తే చండవిక్రమాః।
తదా దహంత మేపుచ్ఛం నిఘ్నంతః కాష్ఠముష్టిభిః॥ ౧౫౧॥

బద్ధస్య బహుభిః పాశై ర్యంత్రితస్య చ రాక్షసైః॥ ౧౫౨

౧౪౩. ‘అని వానరరాజు నీతోఁ జెప్పుమనియెను’ అని నేను బలికితిని. పిమ్మటఁ గోపించినవాఁడై కన్నులచే నన్నుఁగాల్చునట్లు వేంద్రముగఁజూచెను.

౧౪౪. ఘోరమగు పనిచేయువాఁడును దుష్టుఁడును నగు రావణుఁచే, నేను జంపఁబడువాఁడనుగానని యెఱుఁగక, నన్ను వధించుమని యాజ్ఞాపింపఁబడిన వాఁడనైతిని.

౧౪౫ నుండి ౧౪౮. పిమ్మట రావణునకు గొప్పబుద్ధినిగలవాఁడగు విభీషణుఁడను సోదరుండుగలఁడు. ఆతండు నాక్షేమమునకయి ‘రాక్షసోత్తమా! ఇట్లు సేయరాదు, దూతనువధించుటయను నిశ్చయమును విడువుము రాజధర్మములనుండి తొలఁగిన మార్గమును నీవవలంబించుచున్నావు, రాజధర్మములయందు దూత వధార్హుఁడని చెప్పంబడలేదు. మేలును జెప్పునట్టి దూతమూలముగనే సత్యము తెలియందగును. సాటిలేని పరాక్రమముంగల వాఁడా! ఎంత గొప్ప తప్పుచేసినను దూతకు విరూపమునుగలిగించుట మాత్రమె చెప్పంబడియున్నది వధ చెప్పంబడదయ్యెను. అని రావణుని వేఁడెను.

౧౪౯. ఇట్లు విభీషణునిచేఁ జెప్పంబడినవాఁడై, రావణుఁడు, ఇతనిపుచ్ఛమును గాల్పుఁడని రాక్షసులకాజ్ఞాపించెను.

౧౫౦. పిమ్మట నాతనియాజ్ఞ చొప్పున నాతోఁకపొడవునను జనుపనారబట్టలచేతను జీర్ణించిన దూదిబట్టలచేతను జుట్టంబడియెను.

౧౫౧, ౧౫౨. వేంద్రమగు పరాక్రమముంగల యారాక్షసులు బలయుత్సాహముంగలవారై కఱ్ఱలచేతను బిడికిళ్ళచేతను గొట్టుచుఁ బెక్కుండ్రు రక్కసులచేతఁ జుట్టికొనంబడి త్రాళ్ళచేఁగట్టఁబడిన నాయొక్క తోఁకనుగాల్చిరి.

తత స్తే రాక్షసా శ్శూరా బద్ధం మా మగ్ని సంవృతమ్।
అఘోషయ న్రాజమార్గే నగరద్వార మాగతాః॥ ౧౫౨
తతోఽహం సుమహద్రూపం సంక్షిప్య పునరాత్మనః।
విమోచయిత్వా తం బంధం ప్రకృతిస్థ స్థితః పునః॥ ౧౫౩
ఆయసం పరిఘం గృహ్య తాని రక్షాంస్యసూదయమ్॥ ౧౫౪
తత స్తన్నగరద్వారం వేగేనా ప్లుతవా నహమ్॥ ౧౫౪
పుచ్ఛేన చ ప్రదీప్తేన తాం పురీం సాట్టగోపురామ్॥ ౧౫౫
దహామ్యహ మసంభ్రాంతో యుగాంతాగ్ని రివ ప్రజాః।
వినష్టా జానకీ వ్యక్తం నహ్యదగ్ధః ప్రదృశ్యతే॥ ౧౫౬
లంకాయాం కశ్చిదుద్దేశ స్సర్వా భస్మీకృతా పురీ।
దహతా చ మయా లంకాం దగ్ధా సీతా న సంశయః॥ ౧౫౭
రామస్య హి మహత్కార్యం మయేదం వితథీకృతమ్।
ఇతి శోకసమావిష్ట శ్చింతా మహ ముపాగతః॥ ౧౫౮
అథాహం వాచ మశ్రౌషం చారణానాం శుభాక్షరామ్।
జానకీ నచ దగ్ధేతి విస్మయోదంత భాషిణామ్॥ ౧౫౯
తతో మే బుద్ధిరుత్పన్నా శ్రుత్వా తా మద్భుతాం గిరమ్।
అదగ్ధా జానకీ త్యేవం నిమిత్తైశ్చోపలక్షితా॥ ౧౬౦
దీప్యమానేతు లాంగూలే న మాం దహతి పావకః।
హృదయంచ ప్రహృష్టంమే వాతా స్సురభిగంధినః॥ ౧౬౧

౧౫౨½. అటుపై శూరులగు రాక్షసులు రాజమార్గమున నగరు వాకిటికేతెంచి కట్టంబడినట్టియు నగ్నిచేఁ గ్రమ్మియున్నట్టియు నన్నుంజూచి కేకలువైచిరి.

౧౫౩½, ౧౫౪½. పిమ్మట నేను నాదొడ్డరూపమును సంగ్రహపఱచి శరీరమందున్న బంధములన్నియు సడలించుకొని యెప్పటివలెనే యినుపకట్లుగల గుదియనుగొని యారాక్షసులను నాశముచేసితిని. తోడనె యాపట్టణపు వాకిలిమీఁది కెక్కినవాఁడనైతిని.

౧౫౫ నుండి ౧౫౮. ప్రళయకాలమందలి యగ్ని ప్రజలను గాల్చునట్లు తొట్రుపాటులేనివాఁడనై బురుజులతోడను బురద్వారములతోడను గూడినదియగు లంకను మండుచున్న తోఁకచేఁగాల్చితి. సీతయు స్పష్టముగా నశించినదయ్యెను. ఏలనన లంకయందుఁ గాల్పంబడనిచోటెందును లేదు పట్టణమంతయు బూడిదెగాఁ జేయంబడియె లంకనుగాల్చుచుండిన నాచేత సీతయుం గాల్పంబడియెను, సందేహము లేదు. గొప్పదియగు శ్రీరామునికార్యము నాచే వ్యర్థముచేయంబడియెను. అని నేను దుఃఖించిన మనస్సుగలవాఁడనై ఖిన్నుఁడనైతిని.

౧౫౯. పిమ్మట నేను జానకి కాల్పంబడలేదు! అని యాశ్చర్యమును గలిగించు మాటలాడుకొనుచున్న చారణులయొక్క మంగళకరమగు వాక్కును వింటిని.

౧౬౦. వింతను గలిగించునట్టి యావాక్కును విని జానకి కాల్పఁబడలేదని హేతువులతోఁగూడినదియునగు యోచన పుట్టెను.

౧౬౧. తోఁక మండుచున్నను నన్నగ్నిహోత్రుఁడు గాల్పకున్నాఁడు, మనస్సు సంతోషమందుచున్నది. వాయువులు పరిమళములతో వీచుచున్నవి.

తైర్నిమిత్తైశ్చ దృష్టార్థైః కారణైశ్చ మహాగుణైః।
ఋషివాక్యైశ్చ సిద్ధార్థైరభవం హృష్టమానసః॥ ౧౬౨॥
పునర్దృష్ట్వాచ వై దేహీం విసృష్టశ్చ తయా పునః।
తతః పర్వత మాసాద్య తత్రారిష్టమహం పునః॥ ౧౬౩॥
ప్రతిప్లవన మారేభే యుష్మద్దర్శన కాంక్షయా।
తతః పనచంద్రార్క సిద్ధగంధర్వ సేవితమ్॥ ౧౬౪॥
పంథానమహ మాక్రమ్య భవతో దృష్టవా నిహ॥ ౧౬౪॥
రాఘవస్య ప్రభావేన భవతాం చైవ తేజసా।
సుగ్రీవస్య చ కార్యార్థం మయా సర్వ మనుష్ఠితమ్॥ ౧౬౫॥
ఏతత్సర్వం మయాతత్ర యథావ దుపసాదితమ్।
అత్ర య న్నకృతం శేషం తత్సర్వం క్రియతా మితి॥ ౧౬౬॥

ఇతి శ్రీమత్సుందరకాండే - అష్టపంచాశస్సర్గః.

## ఏకోన షష్టితమస్సర్గః.

ఏత దాఖ్యాయ తత్సర్వం హనుమా న్మారుతాత్మజః।
భూయ స్సముపచక్రామ వచనం వక్తుము త్తరమ్॥ ౧॥
సఫలో రాఘవోద్యోగ స్సుగ్రీవస్య చ సంభ్రమః।
శీలమాసాద్య సీతాయా మమ చ ప్రవణం మనః॥ ౨॥
తపసా ధారయే ల్లోకా న్క్రుద్ధో వా నిర్దహే దపి।
సర్వథాతిప్రవృద్ధో సౌ రావణో రాక్షసాధిపః॥ ౩॥

౧౬౨. ప్రత్యక్షఫలములం జూపుచున్న యీ నిమిత్తములచేతను గొప్పగుణములంగల కారణములచేతను సిద్ధమగు ప్రయోజనములంగలవియగు ఋషివాక్యములచేతను సంతోషించిన మనస్సుగలవాఁడనైతిని.

౧౬౩ నుండి ౧౬౪½. సీతాదేవిని మరలఁగనుంగొని యామెయనుమతిని మరలఁగొని పిమ్మట నరిష్టమనుపర్వతమునకు మరలఁజేరి మిమ్ముఁ జూడవలయునను నాశచే మరలవచ్చుటకై యారంభముచేసితిని. పిమ్మట చంద్ర సూర్య వాయువులచేతను సిద్ధ గంధర్వులచేతను సేవింపఁబడినదియగు నాకాశమార్గము నాశ్రయించి యిచ్చోటు మిమ్ముంగాంచితిని.

౧౬౫½. శ్రీరామునిమహిమచేతను, మీప్రతాపముచేతను, సుగ్రీవుకార్యముకొఱకును నాచే నయినంతవట్టు చేయంబడియెను.

౧౬౬½. ఇంతవట్టును లంకయందు నాచేత సాంగముగఁజేయంబడియెను, ఇఁక నాఁచే జేయంబడక మిగిలియున్న దంతయుఁ జేయందగును.

ఇది ఏఁబదియెనిమిదవసర్గ.

---

## ఏఁబదితొమ్మిదవసర్గ.

౧. వాయుపుత్రుండగు హనుమంతుఁడు లంకయందు నడచినవృత్తాంతమంతయుం జెప్పి యావలివిషయమును జెప్పుటకారంభించెను.

౨. సుగ్రీవునియొక్క త్వరయును, సీతయొక్క శీలమును బొందినదయి శ్రీరామునియొక్కయత్నము ఫలమును జెందినదియు, నామనస్సు గూడఁ ద్వరపడుచున్నది.

౩, ౩½. రాక్షసరాజగు రావణుఁడు తపస్సుచే లోకములను భ

తస్య తాం స్పృశతో గాత్రం తపసా న వినాశితమ్॥ ౩౹
న తదగ్నిశిఖా కుర్యా త్సంస్పృష్టా పాణినా సతీ।
జనక స్యాత్మజా కుర్యా ద్యత్క్రోధ కలుషీకృతా॥ ౪
జాంబవ త్ప్రముఖాన్ సర్వా ననుజ్ఞాప్య మహాహరీన్॥ ౫॥
అస్మి న్నేవం గతే కార్యే భవతాంచ నివేదితే।
న్యాయ్యం స్మ సహ వైదేహ్యా ద్రష్టుం తౌ పార్థివాత్మజౌ॥ ౬॥
అహ మేకోపి పర్యాప్త స్సరాక్షసగణాం పురీమ్।
తాం లంకాం తరసా హంతుం రావణం చ మహాబలమ్॥ ౭॥
కింపున స్సహితో వీరై ర్బలవద్భిః కృతాత్మభిః।
కృతాస్త్రైః ప్లవగై శ్శూరై ర్భవద్భి ర్విజయైషిభిః॥ ౮॥
అహంతు రావణం యుద్ధే ససైన్యం సపురస్సరమ్।
సహపుత్రం వధిష్యామి సహోదరయుతం యుధి॥ ౯॥
బ్రాహ్మ మైంద్రంచ రౌద్రంచ వాయవ్యం వారుణం తథా।
యది శక్రజితోస్త్రాణి దుర్నిరీక్షాణి సంయుగే॥ ౧౦॥
తాన్యహం విధమిష్యామి నిహనిష్యామి రాక్షసాన్।
భవతా మభ్యనుజ్ఞాతో విక్రమో మే రుణద్ధితమ్॥ ౧౧॥
మయాతులా విసృష్టాహి శైలవృష్టి ర్నిరంతరా।
దేవానపి రణేహన్యా త్కింపునస్తా న్నిశాచరాన్॥ ౧౨॥

ంపఁగలఁడు కోపముచేఁ గాల్పనుగలఁడు. ఎల్లవిధములచేతను జెంపొందిన వాఁడు.

౩౪. జనకరాజపుత్రిక కోపముచే మేనుమఱచినచో నేపని చేయఁగలదో యాపాటిచేటు (చేత నంటఁబడినపుడుకూడ) నగ్నిజ్వాలయైనను జేయనేరదు.

౫, ౬. ఇదిట్లుండఁగా, అందుజరిగినవిషయము మీకును దెలుపంబడినది యగుచుండఁగా, జాంబవంతుఁడు మొదలగు వానరోత్తముల నంపఱను సమ్మతపఱచి సీతతోఁగూడ నున్నవారుగ రామలక్ష్మణులనుగాంచుట న్యాయము.

౭, ౮. రాక్షసగణముతోఁగూడినదియగు నా లంకాపురమును బలవంతుఁడగు రావణుని శీఘ్రమునఁజంపుటకు నేనొక్కఁడ నేచాలుదును, వీరులును బలవంతులును మనోనిశ్చయముగలవారును, అస్త్రవిద్యయందభ్యాసముగలవారును శూరులును జయమునుగోరుచున్నవారును నగు మీతోఁగూడ నేగుదునేని జయము విషయమునఁ జెప్పవలయున దేమియున్నది?

౯. మదించినవాఁడును సేనలతోఁ గూడినవాఁడును ముందు చనువారితోడఁ గూడినవాఁడును బుత్రులతోఁ దమ్ములతోఁ గూడినవాఁడును నగు రావణుని యుద్ధమున నేనేచంపుదును.

౧౦, ౧౧. బ్రహ్మాస్త్రము, ఇంద్రాస్త్రము, రుద్రాస్త్రము, వాయవ్యాస్త్రము, వరుణాస్త్రము, మొదలగు నింద్రజిత్తుని యస్త్రములు యుద్ధమునఁ గన్నెత్తి చూడరానివియయినను వానిని నేనూఁదివేయువాఁడను, మీయనుమతినిబొంది రాక్షసులను నాశము నేయువాఁడను నాపరాక్రమము వాని నడ్డగించునది.

౧౨. సాటిలేనిదిగను, తెలుపలేనిదిగను నాచే విడువంబడిన ఱాళ్లవాన యుద్ధమున దేవతలనుకూడఁగూల్చును. ఇఁక నా రాక్షసు లేపాటివారు?

సాగరో ప్యతియాద్వేలాం మందరః ప్రచలే దపి।
న జాంబవంతం సమరే కంపయే దరివాహినీ॥ ౧౩॥
సర్వరాక్షస సంఘానాం రాక్షసా యేచ పూర్వకాః।
అలమేకో వినాశాయ వీరో వాలిసుతః కపిః॥ ౧౪॥
పనస స్యోరువేగేన నీలస్య చ మహాత్మనః।
మందరో ప్యవశీర్యేత కింపున ర్యుధి రాక్షసాః॥ ౧౫॥
స దేవాసుర యక్షేషు గంధర్వోరగ పక్షిషు।
మైందస్య ప్రతియోద్ధారం శంసత ద్వివిదస్యవా॥ ౧౬॥
అశ్విపుత్రౌ మహాభాగా వేతౌ ప్లవగసత్తమౌ।
ఏతయోః ప్రతియోద్ధారం నపశ్యామి రణాజిరే॥ ౧౭॥
పితామహా వరోత్సేకా త్పరమం దర్ప మాస్థితౌ।
అమృత ప్రాశినా వేతౌ సర్వవానర సత్తమౌ॥ ౧౮॥
అశ్వినో ర్మాననార్థంహి సర్వలోక పితామహః।
సర్వావధ్యత్వ మతుల మనయో ర్దత్తవా న్పురా॥ ౧౯॥
వరోత్సేకేన మత్తౌ చ ప్రమథ్య మహతీంచమూమ్।
సురాణా మమృతం వీరౌ పీతవంతౌ ప్లవంగమౌ॥ ౨౦॥
ఏతావేవ హి సంక్రుద్ధౌ సవాజి రథకుంజరామ్।
లంకాం నాశయితుం శక్తౌ సర్వేతిష్ఠంతు వానరాః॥ ౨౧॥

౧౩. సముద్రము చెలియలికట్టను మీఱుంగాక, మందరపర్వతము కదలునుగాక, శత్రుసేన యుద్ధమున జాంబవంతుని గదలుపనేరదు.

౧౪. రాక్షస సమూహమునందంతట మొనగాండ్రెవరో వారిని నాశముసేయ వాలిపుత్రుఁడును బలశాలియునగు నంగదుఁ డొక్కఁడు చాలును.

౧౫. పనసునియొక్క తొడలవేగముచేతను, నీలునితొడల బలము చేతను, మందర పర్వతమేనియుఁ బొడియగును, యుద్ధమున రాక్షసులన నెంతటివారు?

౧౬. దేవ దానవ యక్షులయందును, గంధర్వులయందును. సర్పములయందును బక్షులయందును మైందునితో సరిగాఁ బోరువానినిగాని ద్వివిదుని మార్కొనువానింగాని జేర్కొనుఁడు!

౧౭. మీఁదఁజెప్పంబడిన వానరోత్తములిరువురు నశ్వీదేవతలకుఁ బుత్రులు మిక్కిలి పెంపుగలవారు, యుద్ధమున వీరితోసమముగఁ బోరువానిని గానను.

౧౮. ఈ యిద్దరును బ్రహ్మదేవుని వరమువలన మిక్కిలి దర్పముం బొందినవారు. అమృతముం ద్రావినవారు, వానరులలోనెల్ల ముఖ్యులు.

౧౯. లోకములకెల్లఁ బితామహుఁడగు (తాతయగు) బ్రహ్మదేవుఁ డశ్వీదేవతల గౌరవించుటకై, వీరల కెవ్వరిచేతను జావులేకుండుటయను సాటిలేని వరమును మున్నిచ్చెను.

౨౦. వీరులగు నీయిద్దరును వరముయొక్క పెంపుచే మదించి నొప్పదియగు సేననుగూల్చి దేవతలయొక్క యమృతమును ద్రాగిరి.

౨౧. వానరులందఱు నటుండుదురుగాక. ఈ మైందద్వివిదులను వారిద్దరును గోపగించినవారై గుఱ్ఱములతో రథములతో నేనుంగులతోఁ గూడి నదియగు లంకను నాశముసేయ సమర్థులు.

మయైవ నిహతా లంకా దగ్ధా భస్మీకృతా పునః।
రాజమార్గేషు సర్వత్ర నామవిశ్రావితం మయా॥ ౨౩॥
జయ త్యతిబలో రామో లక్ష్మణశ్చ మహాబలః।
రాజా జయతిసుగ్రీవో రాఘవే ణాభిపాలితః॥
అహం కోసలరాజస్య దాసః పవనసంభవః।
హనుమా నితి సర్వత్ర నామవిశ్రావితం మయా॥ ౨౪॥
అశోకవనికామధ్యే రావణస్య దురాత్మనా।
అధస్తా చ్ఛింశుపావృక్షే సాధ్వీ కరుణ మాస్థితా॥ ౨౫॥
రాక్షసీభిః పరివృతా శోక సంతాప కర్శితా।
మేఘలేఖా పరివృతా చంద్రలేఖేవ నిష్ప్రభా॥ ౨౬॥
అచింతయంతీ వై దేహీ రావణం బలదర్పితమ్॥ ౨౬½
పతివ్రతాచ సుశ్రోణీ అవష్టబ్ధా చ జానకీ॥ ౨౭॥
అనురక్తా హి వై దేహీ రామం సర్వాత్మనా శుభా।
అనన్యచిత్తా రామే చ పౌలోమీవ పురందరే॥ ౨౮॥
తదేకవాస స్సంవీతా రజోధ్వస్తా తథైవచ।
శోకసంతాప దీనాంగీ సీతా భర్తృహితే రతా॥ ౨౯॥
సా మయా రాక్షసీమధ్యే తర్జ్యమానా ముహుర్ముహుః।
రాక్షసీభి ర్విరూపాభి ర్దృష్టాహి ప్రమదావనే॥ 3౦॥
ఏకవేణీ ధరాదీనా భర్తృచింతా పరాయణా।
అధశ్శయ్యా వివర్ణాంగీ పద్మినీవ హిమాగమే॥ 3౧॥

౨౨. నాచేతనే లంకకాల్పంబడియెను. పిమ్మటఁ గాల్పను బడియెను. బూడిదెగాఁ జేయనుబడియెను. రాజమార్గములం దంతట మన పేరు (రామనామము) వినుపింపంబడియెను.

౨౩, ౨౪. అతిబలుండగు రాముఁడును మహాబలుండగు లక్ష్మణుఁడును రామునిచేఁ బాలింపఁబడినవాఁడును రాజును నగు సుగ్రీవుఁడును జయంపొందుచున్నవారు. నేను కోసలదేశపురాజుయొక్క బంటును, వాయుపుత్రుఁడను. హనుమంతుఁడను, అని యంతటను నామము నాచే వినిపింపఁబడియెను.

౨౫, ౨౬. పతివ్రతయగుసీత సర్వజ్ఞుండగు రావణునియొక్క యశోకవనమధ్యమున నిరుగుడుచెట్టుక్రిందఁ జేర్పఁబడియున్నదియు, రాక్షసస్త్రీలచేఁజుట్టంబడినదియు, దుఃఖము వలనితాపముచేఁ జిక్కియున్నదియు మబ్బుచేఁ జుట్టంబడిన చంద్రరేఖవలెఁ గాంతిలేకయున్నదియు రావణునిం దలంపనిదియు నైయున్నది.

౨౭, ౨౮. పతివ్రతయు, అందముగు పిఱుఁదులుఁగలదియు, దిక్కులేనిదియు జనకునిపుత్రికయు శుభస్వరూపురాలును నగుసీత దేవేంద్రుని యందు శచివలె రామునియందు వేఱుతలంపులేక రామునియందుఁ బ్రేమ గలదియై యెల్లభంగుల నాతనిం దలంచుచున్నది.

౨౯. అప్పటి యొంటివస్త్రముచేతనే చుట్టంబడినదియు దుమ్ముచేఁ గప్పంబడినదియు శోకముచేఁ గ్రాఁగి నవయుచున్న మేనుఁగలదియు మగనియొక్క క్షేమమును గోరుచున్నదియు.

౩౦ నుండి ౩౩కు. ఉద్యానవనమునందు రాక్షసస్త్రీలనడుమ వికారరూపములుఁగల రాక్షసస్త్రీలచేఁ బలుమాఱు బెదరింపఁబడుచున్నదియునై సీత నాచేఁజూడంబడియెను. ఒంటిజడను గలదియు దిగులుపడియున్నదియు మగనిం దలఁచుటయే పనిగాఁ గలదియు, భూమిపైఁ బరుండియున్నదియు మంచుకాలమునందలి తామరతీఁగవలె మాసిన మేనుంగలదియు రావణుని

రావణా ద్వినివృత్తార్థా మర్తవ్యకృతనిశ్చయా।
కథం చి న్మృగశావాక్షీ విశ్వాస ముపపాదితా॥ ౩౨॥
తత స్సంభాషితా చైవ సర్వమర్థం చ దర్శితా।
రామసుగ్రీవ సఖ్యంచ శ్రుత్వా ప్రీతి ముపాగతా॥ ౩౩॥
నియత స్సముదాచారో భక్తిర్భర్తరి చోత్తమా।
యన్న హంతి దశగ్రీవం సమహాత్మా కృతాగసమ్॥ ౩౪॥
నిమిత్తమాత్రం రామస్తు వధేతస్య భవిష్యతి॥ ౩౪½
సా ప్రకృత్యైవ తన్వంగీ తద్వియోగా చ్చకర్శితా।
ప్రతిప త్పాఠశీలస్య విద్యేవ తనుతాం గతా॥ ౩౫½
ఏవమాస్తే మహాభాగా సీతా శోక పరాయణా।
య దత్ర ప్రతికర్తవ్యం త త్సర్వ ముపపద్యతామ్॥ ౩౬½

ఇతి శ్రీమత్సుందరకాండే-ఏకోనషష్టితమస్సర్గః.

## షష్టితమస్సర్గః.

తస్య త ద్వచనం శ్రుత్వా వాలిసూను రభాషత।
అయుక్తం తు వినా దేవీం దృష్టవద్భి శ్చ వానరాః॥ ౧॥
సమీపం గంతు మస్మాభీ రాఘవస్య మహాత్మనః।
దృష్టా దేవీ న చానీతా ఇతి తత్ర నివేదనమ్॥ ౨॥
అయుక్త మివ పశ్యామి భవద్భిః ఖ్యాతవిక్రమైః।
న హి నః ప్లవనే కశ్చి న్నాపి కశ్చి త్పరాక్రమే॥ ౩॥
తుల్యస్సామర దైత్యేషు లోకేషు హరిసత్తమాః॥ ౩½

యందుఁ దలంపుగలుగనిదియుఁ జావునకై నిశ్చయించికొని యున్నదియు లేడిపిల్లయొక్క చూపులవంటి చూపులుంగలదియునగుసీత మిక్కిలి కష్టముతో నాచే నమ్మింపఁబడినదియయ్యెను. ఆవల మాటలాడుటయు, శ్రీరామునిచే నంపఁబడినయానవాలును జూపుటయునయ్యెను. రామునకును సుగ్రీవునకును సఖ్యమగుటవిని మిక్కిలి సంతోషించినది.

౩౪, ౩౪½. చలింపని పతివ్రతాత్వమును, మగనియం దుత్తమమగు భక్తియు నపరాధముచేసినవాఁడగు రావణునిఁజంపకపోవుటచే వాఁడు మహాత్ముఁడని తలఁపందగును. ఆతని చావువిషయమున శ్రీరాముఁడు నిమిత్తమాత్రముగా నుండును.

౩౫½. స్వాభావికముగనే బక్కవడిన మేనుగలదియు, దానికై పతినెడబాసియుండుటచే మేను కృశించినదియునగు సీత పాడ్యమినాఁడు పాఠముంజదువు స్వభావముగలవానియొక్క విద్యవలె మిక్కిలి చిక్కియున్నది.

౩౬½. గొప్పయోగ్యతనుగలదియగుసీత యిట్లు దుఃఖమునకులోఁబడియున్నది. ఈకార్యమునకై మాఱు నేయఁదగినదియంతయు మీకనుకూలము నేయందగును.

ఇది యేఁబదితొమ్మిదవసర్గ.

---

## అఱువదియవ సర్గ.

౧ నుండి ౪½. వాలిపుత్రుఁడగు నంగదుఁడు హనుమంతుఁడు చెప్పినదంతయువిని, ఓవానరులారా! సీతనుజూచినవాండ్రమగు మనము మహాత్ముఁడగు శ్రీరాముని యొద్దకు సీతను గొనిపోకయే పోవుట బాగుకాదు. 'సీతనుగాంచితిమి, తేలేదు' అని ప్రసిద్ధమైన పరాక్రమముంగల మీచేతఁ బలుకంబడుట యోగ్యముకాదనితలంచెదను. దేవతలతో రాక్షసులతోఁ గూడిన లోకములయందంతటను దాఁటుటయం దెవ్వఁడును మనకుఁ దుల్యుఁడు

తేష్వేవం హతవీరేషు రాక్షసేషు హనూమతా।
కిమన్య దత్రకర్తవ్యం గృహీత్వా యామ జానకీమ్॥ ౧౪

తమేనం కృతసంకల్పం జాంబవా న్హరిసత్తమః।
ఉవాచ పరమప్రీతో వాక్యమర్థవ దర్థవిత్॥ ౧౫

న తావ దేషా మతి రక్షమానో యథాభవాన్పశ్యతి రాజపుత్ర
యథా తు రామస్యమతిర్నివిష్టా తథాభవన్పశ్యతుకార్యసిద్ధిమ్॥

ఇతి శ్రీమత్సుందరకాండే-షష్టితమస్సర్గః.

---

ఏకషష్టితమస్సర్గః.

తతో జాంబవతో వాక్య మగృహ్ణంత వనౌకసః॥
అంగద ప్రముఖా వీరా హనుమాంశ్చ మహాకపిః॥ ౧॥

ప్రీతిమంత స్తతస్సర్వే వాయుపుత్ర పురస్సరాః।
మహేంద్రాదిం పరిత్యజ్య పుప్లువుః ప్లవగర్షభాః॥ ౨॥

మేరుమందర సంకాశా మత్తా ఇవ మహాగజాః।
ఛాదయంత ఇవాకాశం మహాకాయా మహాబలాః॥ ౩॥

సభాజ్యమానం భూతైస్త మాత్మవంతం మహాబలమ్।
హనుమంతం మహావేగం వహంతఇవ దృష్టిభిః॥ ౪॥

రాఘవే చార్థనిర్వృత్తిం కర్తుం చ పరమం యశః।
సమాధాయ సమృద్ధార్థాః కర్మసిద్ధిభి రున్నతాః॥ ౫॥

ఁడు. పరాక్రమమందును మనకు సముఁడులేఁడుగదా! ఆరాక్షసవీరులు హనుమంతునిచేతనే కొట్టంబడినవారుగాఁగా నవుడుఁ జేయవలసిన యితర కార్య మేదియున్నది? సీతను వెంటఁబెట్టుకొనియే పోవుదము. అని వానరులతోఁ జెప్పెను.

౫౫. కార్యాకార్యముల నెఱింగినవాఁడును వానరులలో శ్రేష్ఠుఁ డైనను నగుజాంబవంతుఁడు మిక్కిలి సంతోషించి మీఁదఁ జెప్పఁబూనినట్లు పలికిన యంగదునితోఁ బ్రయోజనముంగలదియగు వాక్యమునిట్లు పలికెను.

౬౫. ఓరాజపుత్రుఁడా! నీవు యోచించిన కార్యము మనకిప్పుడు తగినది కాదు. శ్రీరామునియొక్క యిష్ట మెట్లున్నదో యట్లు నీవు పనిచే యుటను యోచింపుము.

ఇది యఱువదియవసర్గ.

---

అఱువదియొకటవసర్గ.

౧. ఆవల నంగదుఁడు మొదలగు వీరులును, పెద్ద వానరుఁడగు హనుమంతుఁడును దక్కుటి వానరులును జాంబవంతుని యోచన నంగీకరించిరి.

౨ నుండి ౭కు. వానరోత్తములందఱును సంతోషించినవారై హనుమంతుని మున్నిడికొని మహేంద్రపర్వతమును వదలిచనిరి. మేరు మందరపర్వతములతోఁ దుల్యులును బెద్దయేనుంగులవలె మదించినవారును, ఆకాశమును గప్పుచున్నవారివలె గొప్పమేనులను మెండగుబలమును గలవారును (భూతములచేఁ గొలువంబడఁదగువాఁడును ధీరుఁడును మిక్కిలి బలముగలవాఁడును వేగముంగలవాఁడును నగు) హనుమంతునిం జూపులచే మోయుచున్నారో యనునట్లున్నవారును, శ్రీరామునియందుఁ గార్యసిద్ధిని

ప్రియాఖ్యానో న్ముఖాస్సర్వే సర్వే యుద్ధాభినందినః।
సర్వే రామప్రతీకారే నిశ్చితార్థ మనస్వినః॥ ౬।

ప్లవమానాః ఖమాప్లుత్య తత స్తే కానన నౌకసః।
నందనోపమ మాసేదు ర్వనం ద్రుమలతాయుతమ్॥ ౭।

య త్త న్మధువనంనామ సుగ్రీవ స్యాభిరక్షితమ్।
అధృష్యం సర్వభూతానాం సర్వభూత మనోహరమ్॥ ౮।

యద్రక్షతి మహావీర్య స్సదా దధిముఖః కపిః।
మాతులః కపిముఖ్యస్య సుగ్రీవస్య మహాత్మనః॥ ౯।

తే తద్వన ముపాగమ్య బభూవుః పరమోత్కటాః।
వానరా వానరేంద్రస్య మనఃకాంతతమం మహత్॥ ౧౦।

తత స్తే వానరా హృష్టా దృష్ట్వా మధువనం మహత్।
కుమార మభ్యయాచంత మధూని మధుపింగళాః॥ ౧౧।

తతః కుమార స్తా న్వృద్ధా న్జాంబవత్ప్రముఖాన్ కపీన్।
అనుమాన్య దదౌ తేషాం నిసర్గం మధుభక్షణే॥ ౧౨।

తత శ్చానుమతా స్సర్వే సంప్రహృష్టా వనౌకసః।
ముదితాః ప్రేరితా శ్చాపి ప్రనృత్యంతో భవం స్తతః॥ ౧౩।

గాయంతికేచి త్ప్రణమంతికేచి న్నృత్యంతికేచి త్ప్రహసం
తికేచిత్ । పతంతికేచి ద్విచరంతికేచిత్ ప్లవంతికేచిత్ ప్రల
పంతికేచిత్॥ ౧౪।

కీర్తిలాభమును గలిగింపనిశ్చయించి, పెంపొందిన ప్రయోజనములు గల పనులు ఫలింపఁజేసికొని గొప్పవారైనవారును, అందఱును శ్రీరామునకు శుభమును జెప్పఁబూనినవారును, అందఱును యుద్ధమున కుత్సహించుచున్నవారును, అందఱును రామునకుఁ బ్రత్యుపకారము సేయ నిశ్చయించికొన్న మనస్సులుగలవారును.

౭. అగు నావానరు లాకాశమున కెగసి చెట్లను పొదలను గలిగి నందనవనముతోఁ దుల్యమగువనమునం జొచ్చిరి.

౮నుండి ౧౦కు. చక్కఁగా రక్షింపంబడినదియు, ఏవారికిం బోరంగూడనిదియు సర్వభూతములకును మనోహరమైనదియు వానరరాజగు సుగ్రీవునకు మేనమామయు బలవంతుఁడునునగు దధిముఖుఁడను వానరునిచే నెల్లపుడు గాపాడంబడుచున్నదియు వానరరాజుయొక్కమనస్సునకింపైనదియు నగువనమును జేరవచ్చి వానరులు మిక్కిలి యుబ్బొంగినవారైరి.

౧౧. అట్లువచ్చి తేనెవర్ణముంగలవారగు నావానరులు విశాలమైనదియగు మధువనమునుగాంచి రాచకొమరుఁడగు నంగదునిం దేనెకై యాచించిరి.

౧౨. అంగదుఁడును జాంబవంతుఁడు మొదలగు వృద్ధులతోఁ దెల్పి వారినిష్టపడఁజేసి తక్కినవానరులకుఁ దేనెను ద్రావుట కనుమతించెను.

౧౩. అట్లనుమతినిం బొందినవారై వానరులందఱు సంతోషించిరి పరస్పరము సంతోషపెట్టంబడినవారును ప్రేరేపింపఁబడినవారును నైవానరులందఱు నాట్యము సేసిరి.

౧౪. కొందఱుగానము జేసిరి కొందఱువాలుచుండిరి. కొందఱు నాట్యముచేసిరి. కొందఱు నవ్విరి. కొందఱు పడిరి. మఱికొందఱు తిరుగాడుచుండిరి. కొందఱు దుముకుచుండిరి. కొందఱు కేకలు వేయుచుండిరి.

పరస్పరం కేచి దుపాశ్రయంతే పరస్పరం కేచి దుపాక్రమంతే । పరస్పరం కేచి దుపబ్రువంతే పరస్పరం కేచి దుపారమంతే॥ ౧౫॥

ద్రుమాద్ద్రుమం కేచి దభిద్రవంతే క్షితౌ నగాగ్రా న్నిపతంతి కేచిత్ । మహీతలాత్కేచి దుదీర్ణవేగా మహాద్రుమాగ్రాణ్యభిసంపతంతి॥ ౧౬॥

గాయంత మన్యః ప్రహస న్నుపైతి హసంత మన్యః ప్రరుద న్నుపైతి। రుదంత మన్యః ప్రణుద న్నుపైతి నుదంత మన్యః ప్రణద న్నుపైతి॥ ౧౭॥

సమాకులం తత్కపిసైన్య మాసీ న్మధుప్రపానో త్కటసత్త్వచేష్టమ్ । నచాత్ర కశ్చి న్న బభూవ మత్తో నచాత్ర కశ్చి న్న బభూవ తృప్తః॥ ౧౮॥

తతో వనం తత్పరిభక్ష్యమాణం ద్రుమాంశ్చ విధ్వంసితపత్రపుష్పాన్ । సమీక్ష్య కోపా ద్దధివక్త్రనామా నివారయామాస కపిః కపీం స్తాన్॥ ౧౯॥

స తైః ప్రవృద్ధైః పరిభర్త్స్యమానో వనస్య గోప్తా హరివీరవృద్ధః । చకార భూయో మతి ముగ్రతేజా వనస్య రక్షాం ప్రతి వానరేభ్యః॥ ౨౦॥

౧౫. కొందఱొకరినొక రాశ్రయించుచున్నారు. కొందఱొకరినొకరు లోఁబఱచికొనుచున్నారు. కొందఱొకరితోనొకరు చెప్పుకొనుచున్నారు మఱికొందఱొండొరులు మాటలాడుచున్నారు.

౧౬. కొందఱు చెట్టునుండి మఱియొకచెట్టునకుఁ బరువిడుచున్నారు. కొందఱు చెట్టునుండి క్రిందికింబడుచున్నారు. కొందఱు భూమినుండి మిక్కిలి వేగముతో గొప్పవృక్షములకొనల కెక్కుచున్నారు.

౧౭. మఱియొకఁడు గానము చేయుచున్నవానికడకుం జనుచున్నాఁడు ఇంకొకఁడు నవ్వుచున్నవానికడ కేడ్చుచుఁ జనుచున్నాఁడు. వేఱొకఁ డేడ్చుచున్నవానికడకుఁ బ్రేరేపించుచుఁ జనుచున్నాఁడు. ప్రేరేపించుచున్నవానికడ కొండొక్కఁడు కేకలువేయుచు నేగుచున్నవాఁడు.

౧౮. ఉద్రేకముం జెందినదియగు నావానరసేన తేనెం ద్రావుటచే మితిమించిన మనోవ్యాపారముంగలదియయ్యెను. ఈసేనయందు మదమెక్కనివాఁడును, తనివిచెందనివాఁడును గలుగఁడు.

౧౯. పిమ్మట దధిముఖుఁడను పేరుగల వనపాలకుఁడగు వానరుఁడు, అనుభవయోగ్యముగానుండిన యామధువనములోని నాశము నేయంబడిన పుష్పములను బత్రములనుగల చెట్లనుజూచి కోపమువలన నడ్డపెట్టెను.

౨౦. మిక్కిలి ప్రతాపము గలవాఁడును వనమును బాలించువాఁడును వానరవీరులయందుఁ బెద్దవాఁడును నగుదధిముఖుఁడు గొప్పవియగు నాకోఁతులచే బెదరింపంబడుచున్నవాఁడగుచు వారలచే నాపదనొందక రక్షింపఁబడుటకై యోచించెను.

ఉవాచ కాంశ్చి త్పరుషాణి ధృష్ట మసక్త మన్యాంశ్చ తలై ర్జఘాన । సమేత్య కైశ్చి త్కలహం చకార తథైవ సామ్నోపజగామ కాంశ్చిత్॥ ౨౧॥

స తై ర్మదా త్సంపరివార్య వాక్యై ర్బలాచ్చ తేన ప్రతివార్యమాణైః । ప్రధర్షిత స్త్యక్తభయై స్సమేత్య ప్రకృష్యతే చాప్యనవేక్ష్య దోషమ్॥ ౨౨॥

నఖై స్తుదంతో దశనై ర్దశంత స్తలై శ్చ పాదై శ్చ సమాపయంతః । మదాత్కపిం తం కపయస్సమగ్రా మహావనం నిర్విషయం చచక్రుః॥ ౨౩॥

ఇతి శ్రీమత్సుందరకాండే-ఏకషష్టితమస్సర్గః.

## ద్విషష్టితమస్సర్గః.

తా నువాచ హరిశ్రేష్ఠో హనుమా న్వానరర్షభః।
అవ్యగ్ర మనసో యూయం మధు సేవత వానరాః॥ ౧॥
అహ మావారయిష్యామి యుష్మాకం పరిపంథినః॥ ౧½
శ్రుత్వా హనుమతో వాక్యం హరీణాం ప్రవరోఽంగదః॥ ౨॥
ప్రత్యువాచ ప్రసన్నాత్మా పిబంతు హరయో మధు।
అవశ్యం కృతకార్యస్య వాక్యం హనుమతో మయా॥ ౩
అకార్య మపి కర్తవ్యం కిమంగ పునరీదృశమ్॥ ౩½

౨౧. కొందఱిని గఠినముగా మాటలు పలికెను. మఱికొందఱి న ఱచేతులచేఁ గొట్టెను. కొందఱినిఁదాసి కలహించెను. కొందఱిని మంచిమాటలతోఁ జేరవచ్చెను.

౨౨. మఱియు వనపాలకునిచే నడ్డగింపఁబడినవారును భయమును విడిచినవారునునగు నావానరులచేత, మదముచేతను బలముచేతనుఁ బట్టుకొని యవమానింపఁబడినవాఁడై దధిముఖుఁడు యుక్తాయుక్తముల విచారింపక పీడింపఁబడినవాఁ డయ్యెను.

౨౩. మొత్తములై యున్న వానరులు దధిముఖునిం గోళ్లచేఁ గోరాడుచు దంతములచేఁ గొఱుకుచు నఱచేతులచేతను బాదములచేతను మోదుచు నావనమును స్వరూపనాశము నేసిరి.

ఇది యఱువదియొకటవసర్గ.

---

అఱువదిరెండవసర్గ.

౧, ౧౪. ఓవానరులారా! మీరు మనస్సులయందుఁ దొట్రుపాటు లేక తేనెను ద్రాఁవుడు. మిమ్మడ్డగించువారిని నేనుదోలెదను. అని వానరోత్తముఁడగు హనుమంతుఁడు పలికెను.

౨, ౩, ౩౪. వానరులలో శ్రేష్ఠుఁడగు నంగదుండు హనుమంతుని మాటనువిని సంతోషించి యిట్లనియెను. వానరులు తేనెను వలయునంతయుఁ ద్రావుఁడు? స్వామికార్యముం జేసినవాఁడగు హనుమంతునిమాట (చేయఁగూడనిదియైనను) నేనుజేయవలసినదియే యగును. వానరులారా! ఇట్టి పని విషయమున నేమిచెప్పవలయును.

అంగదస్య ముఖాచ్ఛ్రుత్వా వచనం వానరర్షభాః।
సాధు సాధ్వితి సంహృష్టా వానరాః ప్రత్యపూజయన్॥ ౪

పూజయిత్వాంగదం సర్వే వానరా వానరర్షభమ్।
జగ్ముర్మధువనం యత్ర నదీవేగా ఇవ ద్రుతమ్॥ ౫

తే ప్రవిష్టా మధువనం పాలానాక్రమ్య వీర్యతః॥ ౬

అతిసర్గాచ్చ పటవో దృష్ట్వాశ్రుత్వా చ మైథిలీమ్।
పపుస్సర్వే మధు తదా రసవత్ఫలమాదదుః॥ ౭

ఉత్పత్య చ తతస్సర్వే వనపాలాన్ సమాగతాన్।
తాడయంతి స్మ శతశస్సక్తాన్మధువనే తదా॥ ౮

మధూని ద్రోణమాత్రాణి బాహుభిః పరిగృహ్య తే।
పిబంతి సహితాస్సర్వే నిఘ్నంతి స్మ తథా పరే॥ ౯

కేచిత్పీత్వాపవిధ్యంతి మధూని మధుపింగళాః।
మధూచ్ఛిష్టేన కేచిచ్చ జఘ్నురన్యోన్యముత్కటాః॥ ౧౦

అపరే వృక్షమూలేతు శాఖాం గృహ్య వ్యవస్థితాః।
అత్యర్థం చ మదగ్లానాః పర్ణాన్యాస్తీర్య శేరతే॥ ౧౧

ఉన్మత్తభూతాః ప్లవగా మధుమత్తాశ్చ హృష్టవత్।
క్షిపంతి చ తదాన్యోన్యం స్ఖలంతి చ తథాపరే॥ ౧౨

కేచిత్ క్ష్వేళాం ప్రకుర్వంతి కేచిత్కూజంతి హృష్టవత్।
హరయో మధునామత్తాః కేచిత్సుప్తా మహీతలే॥ ౧౩

౪. వానరులలో నుత్తములగు నాయూరు లంగదునిమాటను విని బాగు బాగనుచు సంతోషించినవారై గౌరవించిరి.

౫. వానరులందఱును వానరోత్తముఁడగు నంగదునిం బూజించి మధువనముకడకు నదిలోఁ బ్రవాహము పరుగిడునట్లు వేగమునఁజనిరి.

౬, ౭. సమర్థులగు నావానరులు సీతనుగాంచియు నావర్తమానమునువినియు నంగదునియనుజ్ఞపొందియుఁ గౌరవచేఁ దోఁటకావలివాండ్రను బలవంతముగఁ దిరస్కరించి మధువనమునఁ జొచ్చిరి. అందఱును దేనెను ద్రావిరి. తియ్యనిఫలములను భక్షించిరి.

౮. ఆవనమును రక్షించునట్టివారు పముపై నాగ్రహముతోడ రాఁగా వారలపైఁబడి నానావిధములఁ గొట్టిరి.

౯. ఆవానరులందఱుంగూడి భుజములచేఁ దూమెడు తేనెను జేర్చి త్రాగిరి. మఱికొందఱు తేనెను బాఱఁబోసిరి.

౧౦. తేనెవలె శరీరచ్ఛాయఁగలకొందఱువానరులు తేనెను ద్రావి కొంత పాఱవైచిరి. మఱికొంద ఱాతేనెమైనముతో నొండొరులం గొట్టుకొనిరి.

౧౧. ఇతరులు చెట్లమొదళ్లకడ వానికొమ్మలనంటుచు నుండిరి. మఱి కొందఱు మిక్కిలి మత్తెక్కినవారై యాకులను బఱచుకొని పండుకొనిరి.

౧౨. తేనెను ద్రాగి మత్తెక్కి వెఱ్ఱివాండ్రవలెనున్న కొందఱు వానరులు సంతోషించినట్లుగా నొండొరులఁ ద్రోసికొనుచున్నారు. అట్టులే త్రొట్రుపడుచున్నారు.

౧౩. తేనెచే మత్తుచెందినవారయి వానరులుకొందఱు సింహనాదము నేయుచున్నారు. కొందఱు మూలుగుచున్నారు. కొందఱు నేలంబడి నిద్రించుచున్నవారు.

కృత్వాకేచి ద్ధసంత్యన్యే కేచి త్కుర్వంతి చేతరత్।
కృత్వాకేచి ద్వదం త్యన్యే కేచి ద్బుధ్యంతి చేతరత్॥ ౧౪॥
యేప్యత్ర మధుపాలాస్స్యుః ప్రేష్యా దధిముఖస్యతు।
తేపి తై ర్వానరై ర్భీమైః ప్రతిషిద్ధా దిశోగతాః॥ ౧౫॥
జానుభి స్తు ప్రకృష్టా శ్చ దేవమార్గం ప్రదర్శితాః।
అబ్రువన్ పరమోద్విగ్నా గత్వా దధిముఖం వచః॥ ౧౬॥
హనూమతా దత్తవరై ర్హతం మధువనం బలాత్।
వయంచ జానుభిః కృష్టా దేవమార్గం చ దర్శితాః॥ ౧౭॥
తతో దధిముఖః క్రుద్ధో వనప స్తత్రవానరః।
హతం మధువనం శ్రుత్వా సాంత్వయామాస తాన్హరీన్।
ఇహాగచ్ఛత గచ్ఛామో వానరాన్ బలదర్పితాన్।
బలేన వారయిష్యామో మధుభక్షయతో వయమ్॥ ౧౯॥
శ్రుత్వాదధిముఖ స్యేదం వచనం వానరర్షభాః।
పున ర్వీరా మధువనం తే నైవ సహసా యయుః॥ ౨౦॥
మధ్యే చైషాం దధిముఖః ప్రగృహ్య తరసా తరుమ్।
సమభ్యధావ ద్వేగేన తే చ సర్వే ప్లవంగమాః॥ ౨౧॥
తే శిలాః పాదపాం శ్చాపి పర్వతాం శ్చాపి వానరాః॥
గృహీత్వా భ్యగమన్ క్రుద్ధా యత్ర తే కపికుంజరాః॥ ౨౨॥

౧౪. కొందఱు కోఁతి చేష్టలుచేసి నవ్వుచున్నారు. ఇతరులు మఱి కొన్ని పనులు చేయుచున్నారు కొందఱుచేసినపనులు చెప్పికొనుచున్నారు. మఱికొందఱు మఱికొన్ని పనులుచేయ నుద్దేశించుచున్నారు.

౧౫. మఱియు నావనమందు దధిముఖునిచే నియమింపఁబడిన కావలివాం డ్రెవ్వరుండిరో వారుంగూడ భయమును గలుగఁజేయు నావానరుల చేఁ దోలంబడి దిక్కులకుఁ బాఱిరి.

౧౬. ఆకావలివాండ్రు మోకాళ్ళచేఁ బొడువంబడిన వారును, ఆసనములు చూపంబడినవారును నై మిక్కిలి భీతిఁజెంది దధిముఖునికడకేగి చెప్పికొనిరి.

౧౭. హనుమంతునిచే నియ్యంబడిన వరములను గలవారగు వానరులచేత బలవంతముగా మధువనము చెఱుపంబడియె. మేమును మోకాళ్ల చేఁ బొడువంబడితిమి. ఆసనములు చూపంబడితిమి.

౧౮. ఆవనమును బాలించువాఁడగు దధిముఖుఁడను వానరుఁడు మధువనము నాశమయ్యెనని విని కోపించి యాకావలివాండ్ర నూరార్చినవాఁడయ్యెను.

౧౯. పోవుదమురండు! మనము తేనెను ద్రావుచు బలముచేఁ గర్వించియున్న వానరులను మొత్తమై తోలుదము.

౨౦. వీరులగునాకావలివాండ్రు దధిముఖుని మాటనువిని మరల నదేమార్గమున వేగమున మధువనమునకుం బోయిరి.

౨౧. ఈవానరులలో దధిముఖుఁడనువాఁడు శీఘ్రమున నొకచెట్టునుగొని వనముదిక్కుపాఱెను. తక్కినవానరులును వానివెంటనేగిరి.

౨౨. తక్కినవానరులును గోపగించి చెట్లను గొండలను ఱాలను గొని వానరోత్తములున్న మధువనముకడ కేగిరి.

తే స్వామివచనం వీరా హృదయే వ్యవసజ్య తత్।
త్వరయా హ్యభ్యధావంతం సాలతాల శిలాయుధాః॥ ౧౩॥

వృక్షస్థాం శ్చ తలస్థాం శ్చ వానరా న్బలదర్పితాన్।
అభ్యక్రామం స్తతో వీరాః పాలా స్తత్ర సహస్రశః॥ ౧౪॥

అథ దృష్ట్వా దధిముఖం క్రుద్ధం వానరపుంగవాః।
అభ్యధావంత వేగేన హనుమ త్ప్రముఖా స్తదా॥ ౧౫॥

తం సవృక్షం మహాబాహు మాపతంతం మహాబలమ్।
ఆర్యకం ప్రాహర త్తత్ర బాహుభ్యాం కుపితోఽంగదః॥ ౧౬॥

మదాంధ శ్చ న వేదైన మార్యకోఽయం మమేతి సః।
అథైనం నిష్పిపేషాశు వేగవ ద్వసుధాతలే॥ ౧౭॥

సభగ్న బాహూరు భుజో విహ్వల శ్శోణితోక్షితః।
ముమోహ సహసా వీరో ముహూర్తం కపికుంజరః॥ ౧౮॥

స సమాశ్వస్య సహసా సంక్రుద్ధో రాజమాతులః।
వానరా న్వారయామాస దండేన మధుమోహితాన్॥ ౧౯॥

స కథంచి ద్విముక్త స్తై ర్వానరై ర్వానరర్షభః।
ఉవాచైకాంత మాశ్రిత్య భృత్యా న్స్వా న్సముపాగతాన్।
ఏ తే తిష్ఠంతు గచ్ఛామో భర్తా నో యత్రవానరః।
సుగ్రీవో విపులగ్రీవ స్సహరామేణ తిష్ఠతి॥ ౨౦॥

౨౩. వీరులగు నా కావలివాండ్రు తమయధికారియగు దధిముఖుని యాజ్ఞను మనమునందలంచి చెట్లను బండలను సాధనములుగాఁగొని వేగమున నంగదాదుల కెదురునడచిరి.

౨౪. పిమ్మట వీరులగు వేలకొలఁది కావలివాండ్రు చెట్లపైనున్నవారును భూమిపైనున్నవారును జలమునఁ గ్రుంకినవారును నగు వానరుల కెదురుగా నేగిరి.

౨౫. ఆవల హనుమంతుఁడు మొదలగు వానరోత్తములు కోపించి యున్న దధిముఖునింగాంచి వేగమున వానిమీఁదికిఁ బరువెత్తిరి.

౨౬. అంగదుఁడు కోపముచెందినవాఁడై వృక్షమును జేతంగలవాఁడును పెద్దభుజములుగలవాఁడును, ఎదుటనున్నవాఁడును దనతండ్రికి మేనమామయగుటచే గౌరవార్హుఁడునగు దధిముఖుని భుజములచేఁ గొట్టెను.

౨౭. మదముచేఁ గన్నుగాననివాఁడగు నంగదుఁడు దధిముఖుఁడు దనకుఁ బూజార్హుఁడని తెలియనేరఁడయ్యెను. మఱియు నాతని భూమిపై వైచి నలిచివైచెను.

౨౮. శూరుఁడును వానరోత్తముఁడునునగు దధిముఖుఁడు విఱిగిన భుజములను దొడలను జేతులనుగలవాఁడై మేనుమఱచి వెంటనే రక్తమునం దడిసి కొంతసేపు మూర్ఛన్మునింగియుండెను.

౨౯. రాజగు సుగ్రీవుని మేనమామయగు దధిముఖుఁడు శీఘ్రముగ మూర్ఛదేరి కోపించి, తేనెచే మత్తెక్కియున్న వానరులను గఱ్ఱతోఁ దోలెను

౩౦. వానరశ్రేష్ఠుఁడగు నాదధిముఖుఁ డాతోఁట నాక్రమించిన వానరులచే నెట్లో విడువంబడి యెవ్వరును లేనిచోటఁ జేరి, తనకడకువచ్చిన సేవకులతో నిట్లుచెప్పెను.

౩౧. ఈవానరుల నిచ్చటనే యుండనిందు! మనకధికారియు విశాలమైన కంఠముంగలవాఁడునగు సుగ్రీవుఁడు శ్రీరామునితోఁ గూడ నుండుచోటునకు మనమేగుదము.

సర్వం చైవాఙ్గదే దోషం శ్రావయిష్యామి పార్థివే।
అమర్షీ వచనం శ్రుత్వా ఘాతయిష్యతి వానరాన్॥ ౩౨
ఇష్టం మధువనం హ్యేత త్సుగ్రీవస్య మహాత్మనః।
పితృపైతామహం దివ్యం దేవైరపి దురాసదమ్॥ ౩౩
స వానరా నిమాన్ సర్వా న్మధులుబ్ధా న్గతాయుషః।
ఘాతయిష్యతి దండేన సుగ్రీవ స్ససుహృజ్జనాన్॥ ౩౪
వధ్యా హ్యేతే దురాత్మానో నృపాజ్ఞా పరిభావినః।
అమర్ష ప్రభవో రోష స్సఫలో నో భవిష్యతి॥ ౩౫
ఏవముక్త్వా దధిముఖో వనపాలా న్మహాబలః।
జగామ సహసోత్పత్య వనపాలై స్సమన్వితః॥ ౩౬
నిమేషాంతర మాత్రేణ సహి ప్రాప్తో వనాలయః।
సహస్రాంశుసుతో ధీమాన్ సుగ్రీవో యత్ర వానరః॥ ౩౭
రామంచ లక్ష్మణం చైవ దృష్ట్వా సుగ్రీవ మేవచ।
సమప్రతిష్ఠాం జగతీ మాకాశా న్నిపపాత హ॥ ౩౮
సన్నిపత్య మహావీర్య స్సర్వై స్తైః పరివారితః।
హరి ర్దధిముఖః పాలైః పాలానాం పరమేశ్వరః॥ ౩౯
స దీనవదనో భూత్వా కృత్వా శిరసి చాంజలిమ్।
సుగ్రీవస్య శుభౌ మూర్ధ్నా చరణౌ ప్రత్యపీడయత్॥ ౪౦

ఇతి శ్రీమత్సుందరకాండే - ద్విషష్టితమస్సర్గః.

౩౨ నుండి ౩౫. అంగదునియందు దోషమంతయు రాజునకుం దెలుపుదము. అతండు కోపముం జెంది వానరులను గొట్టించును. మధువనము మహాత్ముఁడగు సుగ్రీవునకుఁ బ్రియమైనది, అతని తండ్రి తాతల కనుభవమందుండినది, దేవతలకునుగూడఁ జొరరానిదియు రమ్యమైనదియు. తేనెయం దాశగలవారును జీవితకాలము తగ్గినవారును నగు నీవానరులనెల్ల మిత్రసమూహముతోఁగూడ సుగ్రీవుఁడు దండముచేఁ గొట్టించును. రాజాజ్ఞను మీఱినవారగు నీదుష్టులు చంపంబడఁదగినవారు అట్లుచేయంబడినచోఁ గ్రోధమువలని నారోపము తనివిం జెందును.

౩౬. మహాబలశాలియగు దధిముఖుఁడు వనపాలకులతో నిట్లువలికి వారలచేఁ జుట్టఁబడినవాఁడై వేగమున లేచి వెడలెను.

౩౭. ఆ దధిముఖుఁడను వానరుఁడు సూర్యునిపుత్రుఁడును బుద్ధిమంతుఁడునునగు సుగ్రీవుఁడుండు నెడకు నిమిషమాత్రమున నేగెను.

౩౮. ఏగి, రాముని లక్ష్మణుని సుగ్రీవుని గనుంగొని యాకాశమునుండి దిగి చదరమైన నేలపై సాగిలఁబడియెను.

౩౯, ౪౦. తోటకావలివాండ్రలో ముఖ్యుఁడును మిక్కిలి బలశాలియునగు దధిముఖుఁడు వనపాలకు లందఱితోడను సాగిలఁబడి పేదవడిన మోమునుగలవాఁడై శిరమునఁ జేతులుచేర్చికొని, మంగళకరమగు సుగ్రీవుని పాదములను శిరస్సుచే నంటెను.

ఇది యఱువదిరెండవసర్గ.

---

## త్రిషష్టితమస్సర్గః.

తతో మూర్ధ్నా నిపతితం వానరం వానరర్షభః।
దృష్ట్వైవోద్విగ్నహృదయో వాక్యమేత దువాచహ॥ ౧

ఉత్తిష్ఠోత్తిష్ఠ కస్మాత్త్వం పాదయోః పతితోమమ।
అభయం తే భవేద్వీర సర్వమేవాభిధీయతామ్॥ ౨

సతు విశ్వాసిత స్తేన సుగ్రీవేణ మహాత్మనా।
ఉత్థాయ సుమహాప్రాజ్ఞో వాక్యం దధిముఖోఽబ్రవీత్॥ ౩

నైవర్క్షరజసా రాజ న్నత్వయా నాపి వాలినా।
వనం నిసృష్టపూర్వంహి భక్షితం తచ్చ వానరైః॥ ౪

ఏభిః ప్రధర్షితా శ్చైవ వానరా వనరక్షిభిః।
మధూ న్యచింతయిత్వే మా న్భక్షయంతి పిబంతి చ॥ ౫

శిష్ట మత్రాపవిధ్యంతి భక్షయంతి తథాపరే।
నివార్యమాణా స్తే సర్వే భ్రువో వై దర్శయంతిహి॥ ౬

ఇమేహి సంరబ్ధతరా స్తథా తైః సంప్రధర్షితాః।
వారయంతో వనా త్తస్మా త్క్రుద్ధై ర్వానరపుంగవైః॥ ౭

తత స్తైర్బహుభి ర్వీరై ర్వానరై ర్వానరర్షభ।
సంరక్తనయనైః క్రోధా ద్ధరయః ప్రవిచాలితాః॥ ౮

పాణిభి ర్నిహతాః కేచి త్కేచి జ్జానుభి రాహతాః।
ప్రకృష్టా శ్చ యథాకామం దేవమార్గం చ దర్శితాః॥ ౯

అఱువదిమూఁడవసర్గ.

౧. పిమ్మట సాగిలఁబడియున్న దధిముఖునింగాంచి వానరరాజగు సుగ్రీవుఁడు బెదరినమనస్సుగలవాఁడై యిట్లుపలికెను.

౨. ఓ వీరుఁడా! లెమ్ము! లెమ్ము! నాపాదములపై నేలపడితివి? నీ భయము పోయనుగాక, నడచినవిషయమంతయుం దెలుపుము!

౩. మిక్కిలి బుద్ధిమంతుఁడగు దధిముఖుఁడు గొప్పవాఁడగు సుగ్రీవునిచే నమ్మింపంబడి లేచి యిట్లుపలికెను.

౪. ఓ రాజా! ఋక్షరజసుఁడను మీతండ్రిచేతను నీచేతను వాలిచేతను నేనాఁడు నుపేక్షలేక శ్రద్ధతోఁ గాపాడఁబడినదియగు మధువనము నేఁడు వానరులచే నాక్రమించి యనుభవింపఁబడియెను.

౫. వానరు లీవనపాలకులచేఁ దోలంబడియు వీరిని లక్ష్యపెట్టక వనమునందలి ఫలములనుదిని తేనెను ద్రావుచున్నారు.

౬. కొందఱు తేనెను పలయువటికుండ్రావి మిగిలినది నేలపైఁ బాఱఁబోయుచున్నారు, బొండని తోలితిమేని మిక్కిలి కోపించి కనుబొమలు ముడివైచి చూచెదరు.

౭. ఈ వనపాలకులు వారిని దోలవలయునని పూని, లోఁబడనివారును గోపించినవారును నగు బలవంతులైన యీవానరులచే మిక్కిలి తిరస్కరింపఁబడినవారు.

౮. ఓ వానరోత్తమా! పిమ్మటఁ గోపముచే నెఱ్ఱనయిన కన్నులు గలవారును శూరులునునగు పెక్కండ్రువానరులచేత నీవనపాలకు లందుండి వెడలఁగొట్టంబడిరి.

౯. కొందఱుచేతులచేతను, కొందఱుమోకాళ్లచేతను, గొట్టంబడిరి. తోఁచినట్లెల్ల నీడ్వంబడి యాసనములు చూపంబడిరి.

ఏవమేతే హతే శ్శూరా స్త్వయి తిష్ఠతి భర్తరి।
కృత్స్నం మధువనం చైవ ప్రకామం తైః ప్రభక్ష్యతే॥ ౧౦॥
ఏవం విజ్ఞాప్యమానం తం సుగ్రీవం వానరర్షభమ్।
అపృచ్ఛత్తం మహాప్రాజ్ఞో లక్ష్మణః పరవీరహా॥ ౧౧॥
కిమయం వానరో రాజన్ వనపః ప్రత్యుపస్థితః।
కంచార్థ మభినిర్దిశ్య దుఃఖితో వాక్యమబ్రవీత్॥ ౧౨॥
ఏవముక్తస్తు సుగ్రీవో లక్ష్మణేన మహాత్మనా।
లక్ష్మణం ప్రత్యువాచేదం వాక్యం వాక్య విశారదః॥ ౧౩॥
ఆర్య లక్ష్మణ సంప్రాహ వీరో దధిముఖః కపిః।
అగంద ప్రముఖై ర్వీరై ర్భక్షితం మధు వానరైః॥ ౧౪॥
విచిత్య దక్షిణామాశా మాగతై ర్హరిపుంగవైః।
నైషా మకృతకృత్యానా మీదృశ స్స్యా దుపక్రమః॥ ౧౫॥
ఆగతైశ్చ ప్రమథితం యథా మధువనం హి తైః।
ధర్షితం చ వనంకృత్స్న ముపయుక్తం చ వానరైః॥ ౧౬॥
వనం యదాభిపన్నాస్తే సాధితం కర్మ వానరైః।
దృష్టా దేవీ నసందేహో నచాన్యేన హనూమతా॥ ౧౭॥
నహ్యన్య స్సాధనే హేతుః కర్మణోస్య హనూమతః।
కార్యసిద్ధి ర్మతిశ్చైవ తస్మి న్వానరపుంగవే॥ ౧౮॥
వ్యవసాయశ్చ వీర్యం చ శ్రుతంచాపి ప్రతిష్ఠితమ్॥ ౧౯

౧౦. ప్రభుఁడవగు నీవుండఁగనే శూరులగు నీవానరు లిట్లు కొట్టఁబడినవారై మధువనమంతయు వారి యిష్టము వచ్చిన ననుభవింపఁ బడు చున్నది.

౧౧. ఇట్లు మనవిచేసికొనంబడుచున్నవాఁడును వానరశ్రేష్ఠుఁడును నగు సుగ్రీవుని మిక్కిలి బుద్ధిమంతుఁడును శత్రువీరుల హరించువాఁడును నగులక్ష్మణుఁ డావృత్తాంతము నడిగెను.

౧౨. ఓ రాజా! వనపాలకుఁడగు నీ వానరుఁ డేమిపనికై వచ్చెను? ఏల దుఃఖించుచు మాటలాడుచున్నాఁడు? అని యడిగెను.

౧౩. దొడ్డవాఁడగు లక్ష్మణునిచే నిట్లడుగంబడినవాఁడై మాటల యందు నేర్పరియగు సుగ్రీవుం డిట్లు బదులుసెప్పెను.

౧౪ నుండి ౧౬. పూజ్యుఁడ! లక్ష్మణ! వానరవీరుఁడగు దధిముఖుఁడు మధువనమందలి తేనె దక్షిణదిశయందంతట సీతను వెదకివచ్చిన వీరులగు నంగదుఁడు మొదలగువారిచే భక్షింపఁబడె ననియెను. వారలచే మధువనము నాశము సేయంబడియెను, స్వాధీనము చేసికొనంబడియెను, వనమందంతట నిష్టమువచ్చినట్లు మెలంగిరి, మనము విధించిన పనిని జేయకవచ్చిన వార లిట్టిసాహసకృత్యముం జేయరు.

౧౭ నుండి ౧౯. ఆ వానరు లెప్పుడు నా వనమునఁ బ్రవేశించిరో యప్పుడే వారలచే నాపని సాధింపఁబడినట్లు తలంపవలయును. సీతాదేవి చూడంబడియెను. మఱియెవ్వరిచేతను గాదు. హనుమంతునిచేతనే సుమా! ఈ కార్యమును సాధించుటయందు హనుమంతునికంటె మఱియొక సాధనము గలుగదు. ఆతనియందుఁ గార్య మనుకూలించుటకు నేర్పు యత్నము బల పరాక్రమములు శాస్త్రపరిచయమునుఁగూడఁ గలవు.

జాంబవా న్యత్ర నేతాస్యా దంగద శ్చ మహాబలః।
హనూమాం శ్చాప్యధిష్ఠాతా నతస్యగతి రన్యథా॥ ౧౯

అంగద ప్రముఖై ర్వీరై ర్హతం మధువనం కిల।
వారయంత శ్చ సహితా స్తథా జానుభి రాహతాః॥ ౨౦

ఏతదర్థ మయంప్రాప్తో వక్తుం మధురవా గిహ।
నామ్నా దధిముఖో నామ హరిః ప్రఖ్యాత విక్రమః॥ ౨౧

దృష్టా సీతా మహాబాహో సౌమిత్రే పశ్య తత్త్వతః।
అభిగమ్య తథా సర్వే పిబంతి మధువానరాః॥ ౨౨

నచాప్యదృష్ట్వా వైదేహీం విశ్రుతాః పురుషర్షభ।
వనం దత్తవరం దివ్యం ధర్షయేయు ర్వనౌకసః॥ ౨౩

తతః ప్రహృష్టో ధర్మాత్మా లక్ష్మణ స్సహరాఘవః।
శ్రుత్వా కర్ణసుఖాం వాణీం సుగ్రీవవదనా చ్చ్యుతామ్।
ప్రాహృష్యత భృశం రామో లక్ష్మణ శ్చ మహాబలః॥ ౨౪

శ్రుత్వా దధిముఖ స్యైవం సుగ్రీవస్తు ప్రహృష్య చ।
వనపాలం పునర్వాక్యం సుగ్రీవః ప్రత్యభాషత॥ ౨౫

ప్రీతోఽస్మి సోఽహం యద్భుక్తం వనం తైః కృతకర్మభిః।
మర్షితం మర్షణీయం చ చేష్టితం కృతకర్మణామ్॥ ౨౬

౧౯౪. జాంబవంతుఁ డెచటఁ గార్యమును నడపువాఁడో, మహాబలుండగు నంగదుఁ డెందధికారము వహించునో, హనుమంతుఁడు కార్యసాధనమున నెందుండునో యట్టిపని ఫలింపకపోదు.

౨౦౪. అంగదుఁడు మొదలగు వీరులచే మధువనము నాశము సేయఁబడియెఁగదా! ఆవనపాలకులు మొత్తములయి యడ్డగింపఁబోఁగా వారిచే మోకాళ్లచేఁ బొడువఁబడిరి.

౨౧౪. ఉతండింపుగమాటలాడువాఁడును, ప్రశస్తమగు పరాక్రమముగలవాఁడును నగు దధిముఖుఁడను వానరుఁడు, వానరవీరులుచేసినపనిం జెప్పుటకు వచ్చెను.

౨౨౪. గొప్పభుజములంగలవాఁడవగు లక్ష్మణుఁడా! సీతాదేవి చూడఁబడియెను. వాస్తవమని తలఁపుము! ఆవానరులందఱునేతెంచి యట్లు తేనెను ద్రావుచున్నారు.

౨౩౪. పురుషులలో నుత్తముఁడా! సీతనుజూడనివారై, పరాక్రమవంతులగు నావానరులు (బ్రహ్మచేత మాతండ్రికీయఁబడిన వరమునుగలది యగు) రమ్యమగు నావనమును లోఁబఱచికొనరు.

౨౪, ౨౫. ధర్మస్వభావముంగలవాఁడగు లక్ష్మణుఁడు శ్రీరామునితోడఁగూడ, సుగ్రీవునిముఖమునుండి వెలువడినదియు వీననింపైనదియు నగు వాక్యమును విని మిక్కిలి సంతోషించెను. శ్రీరాముఁడును బలశాలియగు లక్ష్మణుఁడును మిక్కిలిగా సంతోషమును వెలికిఁదెలిపిరి.

౨౬. అందమగు కంఠముంగలవాఁడగు సుగ్రీవుఁడు దధిముఖుని మాటలవలన సంతోషించి, ఆవనపాలకునితో నిట్లుత్తరము చెప్పెను.

౨౭. నియమింపఁబడిన కార్యమును జేసినవారగు నావానరులచే మధువన మనుభవింపఁబడినందుకు సంతోషించితిని. విధింపఁబడిన కార్యమును జేసి తీర్చినవారగు వారలతప్పు క్షమింపఁదగును.

ఇచ్ఛామి శీఘ్రం హనుమత్ప్రధానా౯ శాఖామృగాం స్తా౯
మృగరాజదర్పా౯। ద్రష్టుం కృతార్థా౯ సహరాఘవాభ్యాం
శ్రోతుం చ సీతాధిగమే ప్రయత్నమ్॥ ౨౮॥
ప్రీతి స్ఫీతాక్షౌ సంప్రహృష్టౌ కుమారౌ దృష్ట్వా సిద్ధార్థౌ వాన
రాణాం చ రాజా। అంగైస్సంహృష్టైః కర్మసిద్ధిం విదిత్వా
బాహ్వోరాసన్నాం సోతిమాత్రం ననంద॥ ౨౯॥

ఇతిశ్రీమత్సుందరకాండే - త్రిషష్టితమస్సర్గః.

---

## చతుష్షష్టితమస్సర్గః.

సుగ్రీవేణైవ ముక్తస్తు హృష్టో దధిముఖః కపిః।
రాఘవం లక్ష్మణం చైవ సుగ్రీవం చాభ్యవాదయత్॥ ౧॥
స ప్రణమ్య చ సుగ్రీవం రాఘవౌ చ మహాబలౌ।
వానరైస్సహితైశ్శూరైర్దివమేవోత్పపాతహ॥ ౨॥
స యథైవాగతః పూర్వం తథైవ త్వరితం గతః।
నిపత్య గగనాద్భూమౌ తద్వనం ప్రవివేశహ॥ 3॥
స ప్రవిష్టో మధువనం దదర్శ హరియూథపా౯।
విమదా నుత్థితా౯ సర్వా౯ మేహమానా౯ మధూదకమ్॥ ౪॥
స తానుపాగమ ద్వీరో బద్ధ్వాం కరపుటాంజలిమ్।
ఉవాచ వచనం శ్లక్ష్ణ మిదం హృష్టవ దంగదమ్॥ ౫॥

౨౮. సింగముయొక్క దర్పమునుబోలిన దర్పమునుగలవారును హనుమంతుని ముఖ్యునింగాఁ గలవారును ధన్యులైన యావానరులనుజూడను, సీతనుదెచ్చుకొను యత్నమును విసను రామలక్ష్మణ సమేతముగాఁ గోరుచున్నవాఁడను.

౨౯. సంతోషముచే వికసించినకన్నులుగలవారును, గురుపాటిదినవారును, కార్యసాఫల్యముం గలవారునునగు రామలక్ష్మణులనుజూచి రాజగు సుగ్రీవుఁడు పులకలుపుట్టిన యంగములతోఁ గార్యఫలము చేతికందినదిగా నెఱింగి మిక్కిలి యానందించెను.

ఇది యఱువదిమూఁడవసర్గ.

---

అఱువదినాల్గవసర్గ.

౧, ౨. మీదఁజెప్పంబడినట్లు సుగ్రీవునిచేఁ బలుకంబడినవాఁడై దధిముఖుఁడు రామునకును లక్ష్మణునకును సుగ్రీవునకును మ్రొక్కెను. అట్లు మ్రొక్కి తనతోడివానరులతోఁగూడ నాకాశమున కెగసిచనియెను.

3. పూర్వమాదధిముఖుఁ డేమార్గమునవచ్చెనో యదేమార్గమున శీఘ్రమునం జనియెను. అట్లుచని యాకాశమునుండి వనముదగ్గర భూమికి డిగియెను.

౪. ఆవనపాలకుఁడు వనమునంజొచ్చి ఫలరససంబంధముంగల యుదకమును మూత్రముగా విడుచుచు మత్తతమానియున్న యావానరుల నందఱింగాంచెను.

౫. శూరుఁడగు నాదధిముఖుఁడు చేతులుమోడ్చి మ్రొక్కుచు వారిసిఁ డాసి యంగదునితోఁ దనసంతోషమును దెలుపుచు మెల్లగ నిట్లనియె.

సౌమ్య రోషో నక ర్తవ్యో యదేభి రభివారితః।
అజ్ఞానా ద్రక్షిభిః క్రోధా ద్భవంతః ప్రతిషేధితాః॥ ౬॥

యువరాజ స్త్వమీశశ్చ వనస్యాస్య మహాబల।
మౌర్ఖ్యాత్పూర్వం కృతోదోష స్తం భవాన్ క్షంతుమర్హతి॥ ౭॥

ఆఖ్యాతం హి మయాగత్వా పితృవ్యస్య తవానఘ।
ఇహోపయాతం సర్వేషా మేతేషాం వనచారిణామ్॥ ౮॥

స త్వ దాగమనం శ్రుత్వా సహైభి ర్హరియూథపైః।
ప్రహృష్టో నతు రుష్టోఽసౌ వనం శ్రుత్వా ప్రధర్షితమ్॥ ౯॥

ప్రహృష్టో మాం పితృవ్య స్తే సుగ్రీవో వానరేశ్వరః।
శీఘ్రం ప్రేషయ సర్వాం స్తా నితిహోవాచ పార్థివః॥ ౧౦॥

శ్రుత్వా దధిముఖ స్యేదం వచనం శ్లక్ష్ణ మంగదః।
అబ్రవీ త్తాన్ హరిశ్రేష్ఠో వాక్యం వాక్యవిశారదః॥ ౧౧॥

శంకే శ్రుతోఽయం వృత్తాంతో రామేణ హరియూథపాః।
తత్క్షమం నేహ నస్థాతుం కృతే కార్యే పరంతపాః॥ ౧౨॥

పీత్వా మధు యథాకామం విశ్రాంతా వనచారిణః।
కిం శేషం గమనం తత్ర సుగ్రీవో యత్ర మే గురుః॥ ౧౩॥

సర్వే యథా మాం వక్ష్యంతి సమేత్య హరియూథపాః।
తథాస్మి కర్తా క ర్తవ్యే భవద్భిః పరవా నహమ్॥ ౧౪॥

౬. ఓ సాధుఁడ! ఈ వనపాలకులచే నీవడ్డగింపఁబడినందులకుఁ గోపింపకుము! తెలియమిచేతను గోపముచేతను వనపాలకులు మిమ్ముఁ బాఱఁదోలిరి.

౭. బలశాలియగునో యంగదుఁడా! ఈ వనమునకు నీవు యువరాజవు. ఈవనమునకు నీవు నధికారివేయగుదువు. తెలివిలేమిచే మున్ను తప్పు చేయంబడియెను. దానిని క్షమింపవలయును!

౮. ఓ పుణ్యుఁడ! ఈవనమునకు వానరులందఱును వచ్చుట నేనీ మీపినతండ్రికిఁ జెప్పితిని.

౯. ఆతండు, ఈవానరులతోఁడఁగూడ నీవువచ్చుటను విని మిక్కిలి సంతోషించెనుగాని, వనము చెఱుపఁబడియెనని కోపింపఁడయ్యెను.

౧౦. నీపినతండ్రియు వానరులకురాజును నగు సుగ్రీవుఁడనురాజు మిక్కిలి సంతోషించి, ఆ వానరులనందఱను శీఘ్రముగఁ బనుపుమని నాతోఁబలికెను.

౧౧. వానరోత్తముఁడును మాటలయందు నేర్పరియునగు నంగదుఁడు దధిముఖునియొక్క ఆన్నిమాటనువిని యావానరులతో నిట్లనియె.

౧౨. శత్రువులఁ దపింపఁజేయునట్టి వానరోత్తములారా! మనమిందువచ్చియుండుట శ్రీరామునకుఁ దెలిసెనేమోయని తలంచెదను; కార్యమును జేసికొనివచ్చియు నిందుజాగు సేయుట బాగులేదు.

౧౩. వానరులు కోరినకొలంది తేనెను ద్రావి యలుపుదీర్చికొన్నవారు. మఱి చేయవలసినది యేమి గలదు? నాతండ్రియగు సుగ్రీవుని కడకుఁబోవుటయే!

౧౪. వానరోత్తములారా! మీరందఱుం జేరి యేమిచెప్పుదురో యట్లుచేయువాఁడను, చేయందగు కార్యములయందు నేనితరులుచెప్పునట్లు చేయువాఁడనే కాని నాకెద్దియుఁ దెలియదు.

ఆజ్ఞాపయితు మీశోహం యువరాజోస్మి యద్యపి।
అయుక్తం కృతకర్మాణో యూయం ధర్షయితుం మయా॥ ౧౫॥
బ్రువత శ్చాంగద స్యైవం శ్రుత్వా వచన మవ్యయమ్।
ప్రహృష్ట మనసో వాక్య మిద మూచు ర్వనౌకసః॥ ౧౬॥
ఏవం వక్ష్యతి కో రాజన్ ప్రభుస్సన్ వానరర్షభ।
ఐశ్వర్య మదమత్తో హి సర్వోహ మితి మన్యతే॥ ౧౭॥
తవ చేదం సుసదృశం వాక్యం నాన్యస్య కస్యచిత్।
సన్నతిర్హి తవాఖ్యాతి భవిష్యచ్ఛుభయోగ్యతామ్॥ ౧౮॥
సర్వే వయ మపి ప్రాప్తా స్తత్ర గంతుం కృతక్షణాః।
స యత్ర హరివీరాణాం సుగ్రీవః పతి రవ్యయః॥ ౧౯॥
త్వయా హ్యనుక్తై ర్హరిభి ర్నైవ శక్యం పదాత్పదమ్।
క్వచి ద్గంతుం హరిశ్రేష్ఠ బ్రూమ స్సత్య మిదం తు తే॥ ౨౦॥
ఏవం తు వదతాం తేషా మంగదః ప్రత్యభాషత।
బాఢం గచ్ఛామ ఇత్యుక్త్వా ఖ ముత్పేతు ర్మహాబలాః॥ ౨౧॥
ఉత్పతంత మనూత్పేతు స్సర్వే తే హరియూథపాః।
కృత్వాకాశం నిరాకాశం యంత్రోత్క్షిప్తా ఇవాచలాః॥ ౨౨॥
తేంబరం సహసోత్పత్య వేగవంతః ప్లవంగమాః।
వినదంతో మహానాదం ఘనా వాతేరితా యథా॥ ౨౩॥
అంగదే హ్యననుప్రాప్తే సుగ్రీవో వానరాధిపః।
ఉవాచ శోకోపహతం రామం కమలలోచనమ్॥ ౨౪॥

౧౫. నేను యువరాజునయినను, ఆజ్ఞచేసినపుడు యోగ్యుఁడనుగాను స్వామికార్యమును నిర్వహించి ధన్యులైయున్నమీరు నాచే నడుపంబడుటకును దిరస్కరింపఁబడుటకును దగరు.

౧౬. ఇత్తెఱంగునఁ బలుకుచున్నయంగదుని యుత్తమవాక్యమును విని మిక్కిలి సంతోషించినమనస్సులుగలవారై వానరులిట్లనిరి.

౧౭. ఓవానరోత్తమా ! ఓరాజా ! రాజుగానుండియు నెవ్వండిట్లు పలుకును? ఐశ్వర్యమదముచే మేనుమఱచినవాఁడు సర్వముం దానసిద్ధమే తలఁచును.

౧౮. ఇట్టిమాట నీకేతగును గాని యితరులకుఁదగదు. నీయణఁకువ యనునది యుత్తరకాలమున నీకుఁగలుగఁబోవు శుభమును జెప్పుచున్నది.

౧౯. వచ్చియున్న మేమందఱమును వానరవీరులకుఁ బ్రభుఁడును గొదువలేనివాఁడునునగు సుగ్రీవుఁడున్న చోటునకేఁగఁ గోరెదము.

౨౦. వానరోత్తమ! నీయనుమతిపొందనివానరుల కెక్కడకైనను అడుగెత్తిపెట్టను సాధ్యముగాదు. ఇది సత్యమని పలుకుచున్నాము.

౨౧. వానరులిట్లు పలుకఁగా 'మంచిది' అని యంగదుఁడు మాఱు పలికెను. తోడనె బలవంతులగు వానరులు 'పోదము' అని యాకాశమున కెగసిరి.

౨౨. ఆవానరులందఱు యంత్రముచేఁ జల్లింబడిన కొండలవలెనాకాశమున నెడములేనియట్లుగా నెగసి యంగదునివెంట నేగిరి.

౨౩. ఆవానరులు గాలిచేఁ బ్రేరేపింపఁబడిన మేఘములవలె శీఘ్రమున నాకాశమునకెగసి గొప్పధ్వనిచేయుచుం జనిరి.

౨౪. అంగదుఁడు వచ్చునంతలో వానరరాజగు సుగ్రీవుఁడు శోకముచే నొచ్చినవాఁడయినను దామరఱేకులవంటి కన్నులుగలవాఁడగు రామునితో నిట్లనియె.

సమాశ్వసిహి భద్రం తే దృష్టా దేవీ నసంశయః।
నాగంతుమిహ శక్యం తై రతీతే సమయే హి నః॥ ౨౫॥

న మత్సకాశ మాగచ్ఛే త్కృత్యే హి వినిపాతితే।
యువరాజో మహాబాహుః ప్లవతాం ప్రవరోఽంగదః॥ ౨౬॥

యద్యప్యకృతకృత్యానా మీదృశ స్స్యాదుపక్రమః।
భవే త్తు దీనవదనో భ్రాంతవిప్లుత మానసః॥ ౨౭॥

పితృపైతామహం చైత త్పూర్వకై రభిరక్షితమ్।
న మే మధువనం హన్యా దహృష్టః ప్లవగేశ్వరః॥ ౨౮॥

కౌసల్యా సుప్రజా రామ సమాశ్వసిహి సువ్రత।
దృష్టా దేవీ న సందేహో నచాన్యే న హనూమతా॥ ౨౯॥

నహ్యన్యః కర్మణో హేతు స్సాధనేస్య హనూమతః।
హనూమతి హి సిద్ధిశ్చ మతి శ్చ మతి సత్తమ॥ 30॥

వ్యవసాయశ్చ వీర్యంచ సూర్యే తేజ ఇవ ధ్రువమ్। 30½

జాంబవా న్యత్ర నేతా స్యా దంగదశ్చ బలేశ్వరః। 3౧

హనుమాం శ్చా ప్యధిష్ఠాతా నతస్య గతి రన్యథా।
మాభూ శ్చింతా సమాయుక్త స్సంప్రత్యమితవిక్రమ॥ 3౨॥

తతః కిలకిలాశబ్దం శుశ్రా వాసన్న మంబరే।
హనుమత్కర్మ దృప్తానాం నర్దతాం కాననౌకసామ్॥ 33॥

౨౫. ఊరడిల్లుము! నీకు శుభము! సీతాదేవి చూడంబడియెను, సంశయము లేదు. నాచే నిర్ణయింపఁబడిన కాలము దాఁటునంతలో నిందువచ్చుటకు వారలకు సాధ్యము కాదయ్యెను.

౨౬. యువరాజును గొప్పభుజములుగలవాఁడును వానరులలో శ్రేష్ఠుఁడు నగు నంగదుఁడు కార్యము చెడియుండునేని నాకడకు రానేరఁడు.

౨౭, ౨౮. మధువనమునఁ జొచ్చుట మొదలగు నిట్టి యత్నములు (నియమింపఁబడిన కార్యముం జేయకయే) చేసియుండరేని, అంగదుఁడు మాత్రము వేదపడిన మోముగలవాఁడును భ్రమచెందినట్టియు జడిసినట్టియు మనస్సుగలవాఁడును సంతోషము లేనివాఁడును నగును. తండ్రితాతలనుండి యుండినదియు వారలచే బాగుగ రక్షింపఁబడినదియునగు నావనమునుగూడఁ జెఱచియుండఁడు.

౨౯ నుండి ౩౦½. ఓ రామా! మంచివ్రతములుగలవాఁడా! కౌసల్య మంచి సంతానము గలదియయ్యెను. ఊరడిల్లుము! సీత చూడంబడియెను, సందేహము లేదు, హనుమంతునికంటె నితరుని చేతఁగాదు. ఈ కార్యమును సాధించువిషయమున హనుమంతునికంటె నితరమగుసాధనము గలుగదు. హనుమంతునియందే కార్యసిద్ధియు బుద్ధియు యత్నమును బలమును (సూర్యునియందుఁ దేజము నిత్యమైయున్నట్లు) స్థిరమైయున్నవి బుద్ధిమంతుఁడా!

౩౧ నుండి ౩౨. జాంబవంతుఁ డెందుఁ గార్యము నడుపువాఁడో, అంగదుఁ డెందు సేనకధిపతియో, హనుమంతుఁడు కార్యము పూనువాఁడో యట్టి కార్యము చెడదు. మితిలేని పరాక్రమముంగలవాఁడా! ఇప్పుడు సీతను చింతనొందకుము!

౩౩, ౩౩½. పిమ్మట, హనుమంతుఁడు నేనిపోనిచ్చిన కార్యసిద్ధి నొసగ్నాంచిన వారును, కిష్కింధను జేరవచ్చినవారును నగు వానరులతో

కిష్కింధా ముపయాతానాం సిద్ధిం కథయతా మివ॥ ౩౩
తతశ్శ్రుత్వా నినాదం తం కపీనాం కపిసత్తమః।
ఆయతాంచిత లాంగూల స్సోభవ ద్ధృష్టమానసః॥ ౩౪
ఆజగ్ము స్తేపి హరయో రామదర్శన కాంక్షిణః।
అంగదం పురతః కృత్వా హనూమంతం చ వానరమ్॥ ౩౫
తేంగద ప్రముఖా వీరాః ప్రహృష్టా శ్చ ముదాన్వితాః।
నిపేతు ర్హరిరాజస్య సమీపే రాఘవస్య చ॥ ౩౬
హనూమాం శ్చ మహాబాహుః ప్రణమ్య శిరసా తతః।
నియతా మక్షతాం దేవీం రాఘవాయ న్యవేదయత్॥ ౩౭
నిశ్చితార్థ స్తత స్తస్మిన్ సుగ్రీవః పవనాత్మజే।
లక్ష్మణః ప్రీతిమా న్ప్రీతం బహుమానా దవైక్షత॥ ౩౮
ప్రీత్యా చ రమమాణోథ రాఘవః పరవీరహా।
బహుమానేన మహతా హనుమంత మవైక్షత॥ ౩౯

ఇతి శ్రీమత్సుందరకాండే - చతుష్షష్టితమస్సర్గః.

---

## పంచషష్టితమస్సర్గః.

తతః ప్రస్రవణం శైలం తే గత్వా చిత్రకాననమ్॥
ప్రణమ్య శిరసా రామం లక్ష్మణం చ మహాబలమ్॥ ౧
యువరాజం పురస్కృత్య సుగ్రీవ మభివాద్య చ।
ప్రవృత్తి మథ సీతాయాః ప్రవక్తు ముపచక్రముః॥ ౨

కార్యానుకూలతను జెప్పుచున్నదానివలెనున్న కిలకిలధ్వని యాకాశమున దాపునవినవచ్చెను.

౩౪౫. పిమ్మట, వానరశ్రేష్ఠుఁడగు సుగ్రీవుఁడు వానరుల కిలకిలధ్వనివిని నిడుపై యంచమగుచున్నతోఁకను గలవాఁడై సంతోషించెను.

౩౫౫. ఆవానరులు శ్రీరాముదర్శనముం గోరుచున్నవారై యంగదుని హనుమంతునిం ముందుంచుకొని చేరవచ్చిరి.

౩౬౫. అంగదుఁడు మొదలగువానరవీరులు మనస్సున సంతోషించుచు యాచేష్టలనువెలిఁబుచ్చుచు వానరరాజుయొక్కయు శ్రీరామునియొక్కయు సమీపమున నిలచిరి.

౩౭౫. అవల గొప్పభుజములుగలవాఁడగు హనుమంతుఁడు తల వాంచి మ్రొక్కి, సీతాదేవిని నియతిగలదిగాను జీవించియున్నదిగాను శ్రీరామున కెఱింగించెను.

౩౮౫. పిమ్మట, సుగ్రీవుఁడువాయుపుత్రునియందు నిశ్చయించఁబడిన ప్రయోజనముంగలవాఁడయ్యెను. సంతోషముంగలవాఁడై లక్ష్మణుఁడు సంతోషముతోఁగూడినవాఁడగుహనుమంతుని గౌరవముతోఁజూచెను.

౩౯౫. శత్రువీరులను హరించువాఁడగు శ్రీరాముఁడు సంతోషమునముని౦గి హనుమంతుని మిక్కిలి గౌరవముతోఁ గనియెను.

ఇది యఱువదినాల్గవసర్గ.

---

అఱువదియైదవసర్గ.

౧,౨. అటుపై నావానరులు విచిత్రమగు నడవులుగల ప్రస్రవణపర్వతమున కేగి గొప్పబలమునుగలవాఁడగు రామునికి లక్ష్మణునిం సుగ్రీవునకు తలవాంచి మ్రొక్కి యువరాజగు నంగదునిముందుంచికొని సుగ్రీవునకు మ్రొక్కియావల సీతాదేవియొక్క వృత్తాంతముం జెప్పుట కారంభించెను.

రావణాంతఃపురే రోధం రాక్షసీభి శ్చ తర్జనమ్।
రామే సమనురాగం చ యశ్చాయం సమయః కృతః॥ ౩॥
ఏతదాఖ్యాంతి తేసర్వే హరయో రామసన్నిధౌ।
వైదేహీ మక్షతాం శ్రుత్వా రామస్తూత్తర మబ్రవీత్॥ ౪॥
క్వ సీతా వర్తతే దేవీ కథం చ మయి వర్తతే।
ఏత న్మే సర్వ మాఖ్యాత వైదేహీంప్రతి వానరాః॥ ౫॥
రామస్య గదితం శ్రుత్వా హరయో రామసన్నిధౌ।
చోదయంతి హనూమంతం సీతా వృత్తాంత కోవిదమ్॥ ౬॥
శ్రుత్వాతు వచనం తేషాం హనుమా న్మారుతాత్మజః।
ప్రణమ్య శిరసా దేవ్యై సీతాయై తాం దిశంప్రతి॥ ౭॥
ఉవాచ వాక్యం వాక్యజ్ఞ స్సీతాయా దర్శనం యథా॥ ౮॥
సముద్రం లంఘయిత్వాహం శతయోజన మాయతమ్।
అగచ్ఛం జానకీం సీతాం మార్గమాణో దిదృక్షయా॥ ౯॥
తత్ర లంకేతి నగరీ రావణస్య దురాత్మనః।
దక్షిణస్య సముద్రస్య తీరే వసతి దక్షిణే॥ ౧౦॥
తత్ర దృష్టా మయాసీతా రావణాంతఃపురే సతీ।
సన్న్యస్య త్వయి జీవంతీ రామా రామ మనోరథమ్॥ ౧౧॥
దృష్టా మే రాక్షసీ మధ్యే తర్జ్యమానా ముహుర్ముహుః।
రాక్షసీభి ర్విరూపాభీ రక్షితా ప్రమదావనే॥ ౧౨॥
దుఃఖ మాసాద్యతే దేవీ తథా దుఃఖోచితా సతీ॥ ౧౩॥

౩, ౪. రావణునియంతఃపురమందు నిలిచియుండుటయు, రాక్షస స్త్రీలు బెదరించుటయు, శ్రీరామునియందుఁ బ్రేమగలిగియుండుటయు, సీతకుఁ గాలము నిర్ణయింపఁబడియుండుటయు వానరులంతయు రాముని సన్నిధియందుఁ జెప్పిరి. రాముఁడు సీత రక్షింపలేదనుమాటనువిని పిమ్మట మఱు మాటవలికెను.

౫. వానరులారా! సీతయెందున్నది? నాయెడ నెట్లువర్తించుచున్నది? అను సీతనుగూర్చిన సమస్తమును నాకుం జెప్పుఁడు!

౬. వానరులు శ్రీరామునిమాటనువిని, సీతవృత్తాంతము నంతయు బాగుగ నెఱింగినవాఁడగుహనుమంతుని శ్రీరాము సన్నిధియందుఁ బ్రేరేపించిరి.

౭, ౭½. వాయుపుత్రుఁడగు హనుమంతుఁడు వానరులాడినమాటనువిని, దక్షిణపుదిక్కు మొగంబై సీతాదేవినిదలంచి తలవాంచి మ్రొక్కి మాటలనేర్పుగలవాఁడగు హనుమ యిట్లనియెను.

౮½. నేను సీతాదేవినిజూచు తలంపుతో వెదకుచు నూఱామడల వెడల్పుగల సముద్రమును దాఁటిపోయితిని.

౯½. ఆదక్షిణసముద్రముయొక్క దక్షిణపుగట్టున, దుర్జనుఁడగు రావణునకు సంబంధించినదియగు లంకయనుపట్టణముగలదు.

౧౦½, ౧౧. ఓరామ! ఆలంకయందు రావణాంతఃపురముననున్నదియు, కోరికను నీయందు నిలిపి బ్రదికియున్నదియునగు సీత నాచేఁ జూడంబడియెను. ఉద్యానవనమున రాక్షసస్త్రీలనడుమఁ బలుమాఱు బెదరింపఁబడుచున్నదై వికారరూపములుగల రాక్షసస్త్రీలచే రక్షింపఁబడుచున్న యిల్లాలు నాచేఁ గనంబడియెను ఆతల్లి దుఃఖములకుంబాలయి శ్రమపడుచున్నది.

రావణాంతఃపురే రుద్ధా రాక్షసీభి స్సురక్షితా।
ఏకవేణీధరా దీనా త్వయి చింతాపరాయణా॥ ౧౨

అధశ్శయ్యా వివర్ణాంగీ పద్మినీవ హిమాగమే।
రావణా ద్వినివృత్తార్థా మర్తవ్య కృతనిశ్చయా॥ ౧౩
దేవీ కథంచి త్కాకుత్స్థ త్వన్మనా మార్గితా మయా॥౧౪
ఇక్ష్వాకు వంశవిఖ్యాతిం శనైః కీర్తయతానఘ।
సా మయా నరశార్దూల విశ్వాస ముపపాదితా॥ ౧౫
తత స్సంభాషితా దేవీ సర్వమర్థం చ దర్శితా।
రామ సుగ్రీవ సఖ్యం చ శ్రుత్వా ప్రీతి ముపాగతా॥ ౧౬
నియత స్సముదాచారో భక్తిశ్చా స్యా స్తథాత్వయి।
ఏవం మయా మహాభాగా దృష్టా జనకనందినీ॥ ౧౭
ఉగ్రేణ తపసాయుక్తా త్వద్భక్త్యా పురుషర్షభ॥ ౧౮
అభిజ్ఞానం చ మే దత్తం యథావృత్తం తవాంతికే।
చిత్రకూటే మహా ప్రాజ్ఞ వాయసంప్రతి రాఘవ॥ ౧౯
విజ్ఞాప్య శ్చ నరవ్యాఘ్రో రామో వాయుసుత త్వయా।
అఖిలే నేహ యద్దృష్ట మితి మా మాహ జానకీ॥ ౨౦
ఇదం చాస్మై ప్రదాతవ్యం యత్నా త్సుపరిరక్షితం।
మణిరత్నం కపిశ్రేష్ఠ శిరోభూషణ ముత్తమమ్॥ ౨౧
బ్రువతా వచనా న్యేవం సుగ్రీవ స్యోప శృణ్వతః॥ ౨౨

౧౩ నుండి ౧౪½ శ్రీరామా! రావణునియంతఃపురమున రాక్షస స్త్రీలచే నడ్డగింపఁబడినదై, బాగుగ రక్షింపఁబడుచు నొంటిజడను ధరించి నీయందే మనసును నిల్పినదై భూమిపై బరుండుచు మంచుకాలమందలి తామరతీఁగవలె మాసిన మేనుగలదియు, రావణునియందే ప్రయోజనమును గోరనిదియు, మరణమునకు నిశ్చయించికొని యున్నదియునై యున్న సీతాదేవి మహాకష్టముతో నాచే వెదకంబడియెను.

౧౫½. పాపరహితుఁడా! పురుషశ్రేష్ఠుఁడ! ఇక్ష్వాకువంశము యొక్క కీర్తిని గొనియాడుచున్న నాచే నాదేవి క్రమముగా నమ్మింపఁబడెను.

౧౬½. ఆవల నామె భాషింపఁబడినదియై, సుగ్రీవునితో మీకు సఖ్య మగుట మున్నగు వృత్తాంతమెల్ల దెలుపంబడియెను. మీకును సుగ్రీవునకును సఖ్యమగుటను విని మిక్కిలి యానందించెను.

౧౭½, ౧౮. పురుషోత్తమా! ఆమెయొక్క నడవడి నియతిగలది నీ యందలిభక్తియు నట్లేయున్నది. గొప్పమహిమగలదియు వేండ్రమగు తప స్సుగలదియు నీయందుభక్తిగలదియునై సీతాదేవి నాచేఁజూడంబడెను.

౧౯. గొప్పప్రజ్ఞగల యో రాముఁడా! చిత్రకూట పర్వతమునందు నీచెంగటనే కాకాసురునిఁగూర్చి జరిగినవిషయమంతయు నట్లే యానవాలుగఁ జెప్పంబడియెను.

౨౦. ఓహనుమంతుఁడ! ఇందు నీచే నేయేవిషయము బాగుగఁజూడంబడియెనో యదియంతయుఁ బురుషోత్తముండగు రామునకు నీచేఁదెలుపంబడఁదగును? అని యామె నాతోఁ జెప్పెను.

౨౧ నుండి ౨౫. ఇది శిరస్సున ధరింపఁబడుచుండిన యుత్తమ రత్నము మిక్కిలి కాంతితోఁ గూడినదియగు నీచూడామణి నాచే మిక్కిలి ప్రయత్నముతో రక్షింపఁబడినది. నాచెక్కిలియందలి బొట్టు మాసిపోఁగా

ఏష చూడామణి శ్శ్రీమా న్మయా సుపరిరక్షితః॥ ౨౨
మనశ్శిలాయా స్తిలకో గండపార్శ్వే నివేశితః।
త్వయా ప్రణష్టే తిలకే తం కిల స్మర్తు మర్హసి॥ ౨౩
ఏష నిర్యాతిత శ్శ్రీమా న్మయా తే వారిసంభవః।
ఏతం దృష్ట్వా ప్రమోదిష్యే వ్యసనే త్వా మివానఘ॥ ౨౪
జీవితం ధారయిష్యామి మాసం దశరథాత్మజ।
ఊర్ధ్వం మాసా న్న జీవేయం రక్షసాం వశమాగతా॥ ౨౫
ఇతి మా మబ్రవీ త్సీతా కృశాంగీ ధర్మచారిణీ।
రావణాంతఃపురే రుద్ధా మృగీవోత్ఫుల్లలోచనా॥ ౨౬
ఏతదేవ మయాఽఽఖ్యాతం సర్వం రాఘవ యద్యథా।
సర్వథా సాగరజలే సంతారః ప్రవిధీయతామ్॥ ౨౭
జాతా శ్వాసా .రాజపుత్రౌ విదిత్వా తచ్చాభిజ్ఞానం రా
ఘవాయ ప్రదాయ । దేవ్యా చాఖ్యాతం సర్వ మేవానుపూ
ర్వ్యాద్వాచా సంపూర్ణం వాయుపుత్ర శ్శశంస॥ ౨౮

ఇతి శ్రీమత్సుందరకాండే - పంచషష్టితమస్సర్గః.

---

## షట్షష్టితమస్సర్గః.

ఏవముక్తో హనుమతా రామో దశరథాత్మజః।
మణిం హృదయే కృత్వా ప్రరురోద స లక్ష్మణః॥ ౧

మణిశిలనుజాది నాచెక్కిలియందు నీచేఁబొట్టుగ నుంపంబడుట మదిం
దలంపవలయును కాంతినిగలదియగు నీమణి నీకై నాచేఁ బనుపంబడియెను.
ఓపుణ్యుఁడ! ఈవ్యసనకాలమున దీనినిగాంచి నిన్నుంగాంచిన ట్లానందిం
చుచుంటిని, ఓదశరథపుత్రుఁడ! ఇంక నెలదినములు ప్రాణమును ధరించి
యుండఁగలను. ఈరాక్షసులచేఁ జిక్కియున్న నేను నెలకంటెమించి
జీవింపఁజాలను. ఈమాటలను సుగ్రీవుఁడు వినుచుండఁగా సీమణి శ్రీరాముని
చే నీయందగును.

౨౬. చిక్కినమేనుగలదియు, ధర్మము ననుష్ఠించుచున్నదియు,
జింకచూపులవలె వికసించిన కన్నులుగలదియు రావణుని యంతఃపురమున
నడ్డగింపఁబడియున్నదియు నగు సీత యిట్లువలికెను.

౨౭. ఓరాఘవా! అందునడచినది నడచినట్లు నీకుం జెప్పంబడి
యెను. ఎల్లవిధములచేతను సముద్రమున వంతెన నిర్మింపఁబడ వలయును

౨౮. హనుమంతుఁడు, రామలక్ష్మణులు బ్రదికినవారుగా నెటిం
గి, సీతయొసంగిన గుఱుతును రాఘవునకు సమర్పించి, ఆమెచేఁ బలుకంబ
డినవృత్తాంతమంతయుఁ గ్రమముగా సంపూర్ణముగా వారికిఁజెప్పెను.

ఇది యఱువదియైదవ సర్గ.

---

అఱువదియాఱవసర్గ.

౧. దశరథపుత్రుండగు రాముఁడు హనుమంతునిచే నట్లు వలుకం
బడినవాఁడై యాచూడామణిని రొమ్మునం జేర్చుకొని లక్ష్మణసహితుఁడై
యేడ్చెను.

తంతు దృష్ట్వా మణిశ్రేష్ఠం రాఘవ శ్శోకకర్శితః।
నేత్రాభ్యా మశ్రుపూర్ణాభ్యాం సుగ్రీవ మిదమబ్రవీత్॥ ౨॥

యథైవ ధేనుస్స్రవతి స్నేహా ద్వత్సస్య వత్సలా।
తథా మమాపి హృదయం మణిరత్నస్య దర్శనాత్॥ 3॥

మణిరత్న మిదం దత్తం వైదేహ్యా శ్శ్వశురేణ మే।
వధూకాలే యథాబద్ధ మధికం మూర్ధ్ని శోభతే॥ ౪॥

అయం హి జలసంభూతో మణి స్సజ్జన పూజితః।
యజ్ఞే పరమతుష్టేన దత్త శ్శక్రేణ ధీమతా॥ ౫॥

ఇమం దృష్ట్వా మణిశ్రేష్ఠం యథా తాతస్యదర్శనమ్।
అద్యాస్మ్యవగత స్సౌమ్య వైదేహస్య తథా విభోః॥ ౬॥

అయం హి శోభతే తస్యాః ప్రియాయా మూర్ధ్ని మే మణిః।
అస్యాద్య దర్శనే నాహం ప్రాప్తాం తా మివ చింతయే॥ ౭॥

కిమాహ సీతా వైదేహీ బ్రూహి సౌమ్య పునఃపునః।
పిపాసు మివ తోయేన సించంతీ వాక్య వారిణా॥ ౮॥

ఇతస్తు కిం దుఃఖతరం య దిమం వారిసంభవమ్।
మణిం పశ్యామి సౌమిత్రే వైదేహీ మాగతంవినా॥ ౯॥

౨. శోకముచేఁ జిక్కిపోయినవాఁడగు రాఘవుఁడు కన్నీటిచేతో నిండిన నేత్రములు గలవాఁడై యాయుత్తమరత్నమును గాంచి సుగ్రీవునితో నిట్లనియె.

౩. పాడియందుఁ బ్రేమగలయావు దానిం గాంచినయంతనే పొట్లుచేఁపుచున్నదో యటువలె నీయుత్తమరత్నముం గాంచుటవలన నా మనస్సు కరఁగుచున్నది.

౪. ఈయుత్తమరత్నము వివాహకాలమందు (కన్యాదానకాలమునందు) సీతయొక్క శిరస్సున మిక్కిలి ప్రకాశించునట్లుగా నలంకరింపఁబడి మామయగు జనకునిచే నాకీయంబడియె.

౫. సజ్జనులచేఁ బూజింపంబడినదియు, జలమునందుఁ బుట్టినదియు నగునీమణి యజ్ఞమందు మిక్కిలి తనివిచెందిన బుద్ధిమంతుఁడగు నింద్రునిచే జనకమహారాజున కొసంగంబడియె.

౬. ఓసాధుఁడా! నేఁడీమణిశ్రేష్ఠమును గాంచి మాతండ్రిని గాంచినట్లును విదేహరాజగు జనకునిఁగాంచినట్లును దలంచుచున్నాఁడను.

౭. ఈరత్నము నాహితురాలియొక్క శిరస్సునందుఁ బ్రకాశించుచున్నదికదా! నేఁడు దీనింగాంచుటచే నాయిల్లాలు లభించినట్లుగాఁ దలంచుచున్నాఁడను.

౮. ఓసాధుఁడా! విదేహరాజపుత్రికయగు సీత దప్పిగొనినవానిని జలముచేఁ దడుపునట్లు మాటలనెడు చల్లనినీటిచే నన్నుఁ దడుపుచు నేమి చెప్పెను?, నాకామాటలు పలుమఱు చెప్పుము.

౯. లక్ష్మణా! జలమందుఁ బుట్టినదియగు నీరత్నము సీతను వెంటం గొనిరాకయే తానుమాత్రము వచ్చినదిగాఁ గనుచున్నాఁడను. ఇంతకంటె మించినదుఃఖమెద్ది?

చిరంజీవతి వైదేహీ యది మాసం ధరిష్యతి।
క్షణం సౌమ్య నజీవేయం వినా తామసితేక్షణామ్॥ ౧౦।

నయ మామపి తం దేశం యత్ర దృష్టా మమప్రియా।
న తిష్ఠేయం క్షణమపి ప్రవృత్తి ముపలభ్య చ॥ ౧౧।

కథం సా మమసుశ్రోణి భీరుభీరు స్సతీ సదా।
భయావహానాం ఘోరాణాం మధ్యే తిష్ఠతి రక్షసామ్॥ ౧౨।

శారద స్తిమిరో న్ముక్తో నూనం చంద్ర ఇవాంబుదైః।
ఆవృతం వదనం తస్యా నవిరాజతి రాక్షసైః॥ ౧౩॥

కిమాహ సీతా హనుమం స్తత్త్వతః కథయాద్య మే।
ఏతేన ఖలు జీవిష్యే భేషజే నాతురో యథా॥ ౧౪।

మధురా మధురాలాపా కిమాహ మమ భామినీ।
మద్విహీనా వరారోహా హనుమ న్కథయస్వ మే॥ ౧౫।

ఇతి శ్రీమత్సుందరకాండే - షట్‌షష్టితమస్సర్గః.

---

## సప్తషష్టితమ స్సర్గః.

ఏవ ముక్తస్తు హనుమా న్రాఘవేణ మహాత్మనా।
సీతాయా భాషితం సర్వం న్యవేదయత రాఘవే॥ ౧।

౧౦. ఓశాంతుఁడ! తాను జెప్పి పనిచినట్లు సీత నెలదినములు బ్రదికియుండఁ గలిగినచో దీర్ఘకాలము జీవించియున్నదిగాఁ దలంచెదను. నీలనన నల్లని కన్నులంగలదియగు నాప్రియురాలినిబాసి యిఁక క్షణకాలమేనియు నేను జీవింపనేరను.

౧౧. నాప్రియురాలగు సీత యెందుఁగొనంబడియెనో యచ్చోటికి నన్నును గొనిపొమ్ము. సీతావృత్తాంతమును బొందితినిగావున క్షణమేనియు నిఁక నిచట మనఁజాలను.

౧౨. అందమగు పిఱుందులుగలదియు, మిక్కిలి భయపడు స్వభావముఁగలదియు, పతివ్రతయు నగు నాప్రియురాలు భయంకరులయినట్టియు, నిర్దయులైనట్టియు రాక్షసులనడుమ నెట్లున్నదిః

౧౩. రాక్షసులచేఁ జుట్టికొనంబడినదియగు నాప్రియురాలి మోము మేఘముల చీఁకటివలన విడువంపడినదియు, శరత్కాలసంబంధమైనదియునగు చంద్రబింబమువలెఁ బ్రకాశింపకయున్నది.

౧౪. హనుమంతుడా! సీతయేమిచెప్పెనో దానిని వాస్తవముగనాకిప్పు డెఱిఁగింపుమా! దీనిచే (మందుచే రోగి బ్రదికినట్లు) బ్రదికియుండెదనుమా!

౧౫. ఓహనుమా! ఇంపైనదియు, ముద్దులాలుకుమాటలుం గలదియు, జందకర్తెయు నగునాసఖి నన్నుఁ దాఁపునఁగలుగనిదై శ్రమనొందుచు నేమిఁ జెప్పెనో తెలియంబలుకుము.

ఇది యఱువదియాఱవ సర్గ.

---

## అఱువదియేడవసర్గ.

౧. మహాత్ముఁడగు రాఘవునిచే నట్లువలుకంబడినవాఁడై హనుమంతుఁడు సీతయొక్క సంభాషణమంతయు రామునకుం దెలిపెను.

ఇద ముక్తవతీ దేవీ జానకీ పురుషర్షభ।
పూర్వవృత్త మభిజ్ఞానం చిత్రకూటే యథాతథమ్॥ ౨॥
సుఖసుప్తా త్వయా సార్థం జానకీ పూర్వ ముత్థితా।
వాయస స్సహసోత్పత్య విదదార స్తనాంతరే॥ ౩
పర్యాయేణ చ సుప్త స్త్వం దేవ్యంకే భరతాగ్రజ।
పునశ్చ కిల పక్షీ స దేవ్యా జనయతి వ్యథామ్॥ ౪॥
పునః పున రుపాగమ్య విదదార భృశం కిల।
తత స్త్వం బోధిత స్తస్యా శ్శోణితేన సముక్షితః॥ ౫॥
వాయసేన చ తేనైవ సతతం బాధ్యమానయా।
బోధితః కిల దేవ్యాత్వం సుఖసుప్తః పరంతప॥ ౬॥
తాంతు దృష్ట్వా మహాబాహో దారితాం చ స్తనాంతరే।
ఆశీవిష ఇవక్రుద్ధో నిశ్శ్వసన్నభ్యభాషథాః॥ ౭
నఖాగ్రైః కేన తే భీరు దారితం తు స్తనాంతరమ్।
కః క్రీడతి సరోషేణ పంచవక్త్రేణ భోగినా॥ ౮।
నిరీక్షమాణ స్సహసా వాయసం సమవైక్షథాః।
నఖై స్సరుధిరై స్తీక్ష్ణై స్తా మేవాభిముఖం స్థితమ్॥ ౯॥
సుతః కిల సశక్రస్య వాయసః పతతాం వరః।
ధరాంతరచర శ్శీఘ్రం పవనస్య గతౌ సమః॥ ౧౦॥
తత స్తస్మి న్మహాబాహో కోపసంవర్తితేక్షణః।
వాయసే త్వం కృథాః క్రూరాం మతిం మతిమతాం వర॥ ౧౧॥

౨. పురుషోత్తమా! జానకి చిత్రకూటపర్వతమునందు మున్ను నడిచినదియగు నీగుఱుతును సాకల్యముగాఁ జెప్పెను.

౩. సీత నీతోఁగూడ సుఖనిద్రం జెంది నీకంటె మున్ను లేచి కూర్చుండఁగాఁ గాకియొక్కటివచ్చి స్తనములనడుమ గాయముపడఁబొడిచెను.

౪. భరతునకు జ్యేష్ఠుఁడవైనవాఁడా! సీత నీతొడపై మున్ను పరుండినందులకు మాఱుగా నామెయొక్కతొడపై నీవు నిద్రించితివి. ఆకాకము మరలఁనే తెంచి సీతకు బాధనుగలిగించెను.

౫. పిమ్మట నాకాకి పలుమఱుచేరవచ్చి గాఢముగాఁ బొడిచెను. ఆగాయమునందలి రక్తముచేఁ దడుపంబడినవాఁడవై మేలుకొంటివి.

౬. శత్రువులను పీడించువాఁడా! ఆకాకిచేతనే విడువరలేకబాధింపఁబడుచున్న యాదేవిచే, నిద్రించుచున్న నీవు మేల్కొలుపంబడితివి.

౭. గొప్ప భుజములంగలవాఁడా! ఱొమ్ములనడుమఁ జీల్పంబడిన యామెనుగని సర్పమువలెఁ గోపించి బుసవెట్టుచు నిట్లంటివి.

౮. ఓభయపడుదానా! ఎవ్వనిచే నీఱొమ్ములనడిమిచోటు కొనగోళ్లచేఁ జీల్పంబడియె. రోషముతోఁగూడినదియగు నైదుతలల సర్పముతో నాటలాడఁ దలంచినవాఁ డెవ్వఁడు?

౯. అటుసూచుచు, రక్తముతోఁగూడిన కఱకుఁగల గోళ్లతో నామెకెదుట నిలచియున్న కాకిని గాంచితివి.

౧౦. వేగముతో భూమియందు సంచరించునదియు, వాయువుతోఁ దుల్యమగు వేగముఁగలదియు, పక్షులలో మేటియునగు నావాయసము దేవేంద్రపుత్రుఁడఁట.

౧౧. ఓగొప్పభుజములంగలవాఁడా! బుద్ధిమంతులలో మేటివాఁడా! పిమ్మట నాకాకియందు నీవు నీమతిని క్రూరము చేసితివి.

స దర్భం సంస్తరాద్గృహ్య బ్రహ్మాస్త్రేణ హ్యయోజయః।
స దీప్త ఇవ కాలాగ్నిర్జజ్వాలాభిముఖః ఖగమ్॥ ౧౨॥

క్షిప్తవాంస్త్వం ప్రదీప్తం హి దర్భం తం వాయసం ప్రతి।
తతస్తు వాయసం దీప్తస్స దర్భోఽనుజగామ హ॥ ౧౩॥

స పిత్రా చ పరిత్యక్తస్సురైశ్చ సమహర్షిభిః।
త్రీన్లోకాన్ సంపరిక్రమ్య త్రాతారం నాభిగచ్ఛతి॥ ౧౪॥

పునరేవాగతస్త్రస్తస్త్వత్సకాశమరిందమ॥ ౧౪½

స తం నిపతితం భూమౌ శరణ్యశ్శరణాగతమ్।
వధార్హమపి కాకుత్స్థ కృపయా పర్యపాలయః॥ ౧౫½

మోఘమస్త్రం న శక్యం తు కర్తుమిత్యేవ రాఘవ।
భవాంస్తస్యాక్షి కాకస్య హినస్తి స్మ స దక్షిణమ్॥ ౧౬½

రామ త్వాం స నమస్కృత్య రాజ్ఞే దశరథాయ చ।
విసృష్టస్తు తదా కాకః ప్రతిపేదే స్వమాలయమ్॥ ౧౭½

ఏవమస్త్రవిదాం శ్రేష్ఠస్సత్త్వవాన్ శీలవానపి।
కిమర్థమస్త్రం రక్షస్సు న యోజయసి రాఘవ॥ ౧౮½

న నాగా నాపి గంధర్వా నాసురా న మరుద్గణాః।
న చ సర్వే రణే శక్తా రామం ప్రతి సమాసితుమ్॥ ౧౯½

తస్య వీర్యవతః కశ్చిద్యద్యస్తి మయి సంభ్రమః।
క్షిప్రం సునిశితైర్బాణైర్హన్యతాం యుధి రావణః॥ ౨౦½

౧౨. కూర్చుండిన దర్భాసనమునుండి యొకపోఁచనుగొని బ్రహ్మాస్త్రమంత్రమా దానియందుఁ గూర్చితివి. అది యాపక్షి కెదురుమోముఁగలదై ప్రళయకాలాగ్నిజ్వాలవలె నుండెను.

౧౩. ఆమండుచున్న దర్భపోఁచను వాయసముపై వైచితివి. అది పక్షిని వేగముతో మండుచు వెంటనంటెను.

౧౪, ౧౪½. శత్రువులఁ బీడించువాఁడా! ఆ కాకము తండ్రియగు దేవేంద్రుని చేతను ఋషిసమూహములచేతను విడువంబడి మూఁడులోకములందిరిగితిరిగి తన్ను రక్షించువారిఁగానక మరల నన్నే నీకడకే వచ్చెను.

౧౫½. ఓ కాకుత్స్థుఁడ! రక్షింపఁదగినవాఁడవు నీవు, రక్షింపుమని వేఁడిన వాఁడును, నీపాదములకడ భూమిపైఁ బడియున్నవాఁడును నగు నావాయసము వధకర్హమైయుండినను దయచే మన్నించి రక్షించితివి.

౧౬½. రాఘవా! ఆయస్త్రము శత్రువును జెఱుపక యూరకపోవునది గాదని యాకాకియొక్క కుడికంటిని హరించితివి.

౧౭½. శ్రీరామ! ఆ కాకి నీకును నీతండ్రియగు దశరథ ప్రభునకును మ్రొక్కి నీచే విడువంబడి మఱల తననెలవున కేగెను.

౧౮½. శ్రీరాముఁడు మీచేఁ జెప్పంబడినట్లుగా నస్త్రముల నేర్చినవారిలో నుత్తముఁడును, బలశాలియు, సదాచారము గలవాఁడునునైయుండియు బాణము రాక్షసులపై నేల ప్రయోగింపకున్నవాఁడు?

౧౯½. యుద్ధమున శ్రీరామున కెదురునిలువ నాగులు, గంధర్వులు, దేవతలు దేవతలతోఁ జేరినవారగు నితరులు ననువా రెవ్వరును శక్తిమంతులుగారు.

౨౦½. బలశాలియగు నాతనికి నాయం దించుకయైనఁ గలదేని యుద్ధమునఁ గఱకగు బాణములచే రావణుఁడు చంపంబడవలయు.

భ్రాతురాదేశ మాస్థాయ లక్ష్మణో వా పరంతపః।
స కిమర్థం నరవరో నమాం రక్షతి రాఘవః॥ ౨౧

శక్తౌ తౌ పురుషవ్యాఘ్రౌ వాయ్వగ్ని సమ తేజసౌ।
సురాణా మపి దుర్ధర్షౌ కిమర్థం మా ముపేక్షతః॥ ౨౨

మమైవ దుష్కృతం కించి న్మహద స్తి నసంశయః।
సమర్థౌ సహితౌ యన్మాం నావేక్షేతే పరంతపౌ॥ ౨౩

వైదేహ్యా వచనం శ్రుత్వా కరుణం సాశ్రుభాషితమ్।
పునరప్యహ మార్యాం తా మిదంవచన మబ్రువమ్॥ ౨౪

త్వచ్ఛోక విముఖో రామో దేవి సత్యేన తే శపే।
రామే దుఃఖాభి భూతే తు లక్ష్మణః పరితప్యతే॥ ౨౫

కథంచి ద్భవతీ దృష్టా నకాలః పరిశోచితుమ్।
అస్మి న్ముహూర్తే దుఃఖానా మంతం ద్రక్ష్యసి భామినీ॥ ౨౬

తావుభౌ నరశార్దూలౌ రాజపుత్రా వనిందితౌ।
త్వద్దర్శన కృతోత్సాహౌ లంకాం భస్మీకరిష్యతః॥ ౨౭

హత్వా చ సమరే క్రూరం రావణం సహబాంధవమ్।
రాఘవస్త్వాం వరారోహే స్వాంపురీం నయతే ధ్రువమ్॥ ౨౮

౨౧. శత్రుల నడికించువాఁడును, పురుషులలో శ్రేష్ఠుఁడును, రఘువంశములోఁ బుట్టినవాఁడును నగులక్ష్మణుఁడేనియు నన్నుయొక్క యనుమతింగొని కాపాడఁగూడదా?

౨౨. అగ్నివాయువులతోఁ దుల్యమగు ప్రతాపముఁగలవారును, శక్తిఁగలవారును, దేవతలకుంగూడ సహింపఁగూడనివారును. పురుషశ్రేష్ఠులునునగు నాయిరువురు నన్నేల యుపేక్షించుచున్నారు?

౨౩. శత్రువులను బీడించువారును, బలవంతులునునగు రామలక్ష్మణులు నన్నింక నుపేక్షించుచుండుటవలన నేమున్ను చేసినపాప మెద్దియో యింకను నశ్లేయున్నదని తలంచెద.

౨౪. అని కన్నీరువిడుచుచు దీనదశతోఁబలికిన జానకియొక్క మాటనువిని పూజ్యురాలగు నాదేవితో మరల నేనిట్లు పలికితి.

౨౫. ఓతల్లీ! శ్రీరాముఁడు నినుంబాసినదుఃఖముచే సర్వకార్యములకుఁ బెడమోముగలవాఁడై యున్నాఁడు. శ్రీరాముఁడు దుఃఖించినపుడంతయు లక్ష్మణుఁడును మనంబెరియఁ బొక్కుచున్నవాఁడు. ఈమాట సత్యమని ప్రమాణము సేయువాఁడ.

౨౬. ఓదేవీ! మిక్కిలి ప్రయాసపడి నినుంగాంచితిని. ఇదినీవు దుఃఖించుటకుం దగినకాలముగాదు. ఈక్షణముననే దుఃఖములకుఁ దుద గాంచఁగలవు.

౨౭. పురుషశ్రేష్ఠులును, రాచకొమరులును, యోగ్యులును, నినుంజూడఁగోరుచున్నవారును నగునాయిరువురు లంకనుమసిచేయఁగలరు.

౨౮. ఓయుత్తమురాలా! భయంకరుఁడగురావణుని బంధుసహితముగా యుద్ధమునంగూల్చి శ్రీరాముఁడు నిన్నుఁ దనరాజధానికిం గొనిపోఁ గలఁడు. ఇదిసత్యము.

యత్తు రామో విజానీయా దభిజ్ఞాన మనిందితే।
ప్రీతిసంజననం తస్య ప్రదాతుం త్వ మిహార్హసి॥ ౨౯॥
సాభివీక్ష్య దిశస్సర్వా వేణ్యుద్గ్రథన ముత్తమమ్।
ముక్త్వా వస్త్రా ద్దదౌ మహ్యం మణిమేతం మహాబల॥ ౩౦॥
ప్రతిగృహ్య మణిం దివ్యం తవ హేతో రఘూద్వహ।
శిరసా తాం ప్రణమ్యార్యా మహ మాగమనే త్వరే॥ ౩౧॥
గమనే చ కృతోత్సాహ మవేక్ష్య వరవర్ణినీ।
వివర్ధమానం చ హి మా ముచాచ జనకాత్మజా॥ ౩౨॥
అశ్రుపూర్ణముఖీ దీనా బాష్పసందిగ్ధ భాషిణీ।
మమోత్పతన సంభ్రాంతా శోకవేగ సమాహతా॥ ౩౩॥
హనుమన్ సింహసంకాశౌ భ్రాతరౌ రామలక్ష్మణౌ। సుగ్రీవం
చ సహామాత్యం సర్వాన్ బ్రూయా హ్యనామయమ్॥ ౩౪॥
యథా చ స మహాబాహు ర్మాం తారయతి రాఘవః। అస్మా
ద్దుఃఖాంబు సంరోధా త్త్వం సమాధాతు మర్హసి॥ ౩౫॥
ఇమంచతీవ్రం మమ శోకవేగం రక్షోభి రేభిః పరిభర్త్సనంచ బ్రూ
యాస్తు రామస్య గతస్సమీపం శివశ్చ తేధ్వాస్తు హరిప్రవీర॥
ఏత త్తవార్యో నృపరాజసింహ సీతా వచః ప్రాహ విషాద
పూర్వమ్। ఏతచ్చ బుద్ధ్వా గదితం మయా త్వం శ్రద్ధత్స్వ సీ
తాం కుశలాం సమగ్రామ్। ౩౭॥

ఇతి శ్రీమత్సుందరకాండే - సప్తషష్టితమస్సర్గః.

౨౯వ. ఓపూజ్యురాలా! శ్రీరాముఁ డేగుఱుతును బాగుగనెఱుంగు నో యేదిసంతోషమును బుట్టించునో యట్టిదానిని యోచించియొసంగుము.

౩౦వ. ఓమహాబలవంతుఁడ! ఆదేవి నలుదిక్కులుంజూచి జడయందు ధరించునదియు శ్రేష్ఠమైనదియు నగునీయుత్తమరత్నమును వస్త్రమునుండి ముడివిచ్చి నాకొసంగెను.

౩౧వ. రఘువంశము నలంకరించువాఁడా! నీకై శ్రేష్ఠమగు చూడామణిని గైకొని పూజ్యురాలగు నాదేవికిఁ దలవంచి మ్రొక్కి పయనమునకై త్వరపడితిని.

౩౨వ. ఆపూజ్యురాలగుజానకి ప్రయాణమునకై యత్నించుచున్నవాఁడను, మేను పెంచుచున్నవాఁడను నగునన్నుంగాంచి యిట్లనియె.

౩౩వ, ౩౪వ. కన్నీటిచేనిండిన మోముగలదియు, ఖేదపడినదియు, కొంకుపడుచున్న మాటలంగలదియు, నేను జనుచున్నానని తొట్రుపడుచున్నదియు, శోకముయొక్క హెచ్చుచేఁ గొట్టువడినదియు నగునాదేవి, ఓ హనుమంతుఁడ సింగములంబోలు నారామలక్ష్మణుల కిరువురకును మంత్రిసహితుఁడగు సుగ్రీవునకును దక్కటివానరులకెల్లను నేనారోగ్యముగ నున్నానని చెప్పుము.

౩౫వ. ఈదుఃఖసముద్రమునడుమనుండి నన్ను గొప్పభుజములుగల రాఘవుం డెట్లు దాఁటించునో యావిధానమును గూర్చ నీవు తగినవాఁడవు.

౩౬వ. వానరులలో శూరుఁడా! సహింపరానిదియగు నాదుఃఖముయొక్క వేగమును, ఈరాక్షసులచేఁ బడుపాట్లును బెదరింపులును శ్రీరామునిచేరువకేగి తెలియంజెప్పుము. నీకు మార్గమున శుభంబగుఁగాక.

౩౭వ. ఓరాజోత్తమా! పూజ్యురాలగు నీదేవి కన్నీరువిడుచుచు నిట్లుచెప్పెను. నాచేఁ జెప్పంబడిన యీవిషయము నెఱింగి సీత క్షేమముగనే యున్నట్లూరడిల్లుము.

ఇది యఱువదియేడవసర్గ.

## అష్టషష్టితమస్సర్గః.

అథాహ ముత్తరం దేవ్యా పునరుక్తస్ససంభ్రమః।
తవస్నేహాన్నరవ్యాఘ్ర సౌహార్దా దనుమాన్య వై॥ ౧।

ఏవం బహువిధం వాచ్యో రామో దాశరథి స్త్వయా।
యథా మామాప్నుయా చ్ఛీఘ్రం హత్వా రావణ మాహవే॥

యది వా మన్యసే వీర వసైకాహ మరిందమ।
కస్మింశ్చి త్సంవృతే దేశే విశ్రాంత శ్శ్వో గమిష్యసి॥ ౩।

మమచా ప్యల్పభాగ్యాయా స్సాన్నిధ్యా త్తవ వీర్యవన్।
అస్య శోకవిపాకస్య ముహూర్తం స్యా ద్విమోక్షణమ్॥ ౪॥

గతేహి త్వయి విక్రాంతే పునరాగమనాయ వై।
ప్రాణానా మపి సందేహో మమస్యా న్నాత్ర సంశయః॥ ౫॥

తవాదర్శనజ శ్శోకో భూయో మాం పరితాపయేత్।
దుఃఖాద్దుఃఖపరాభూతాం దుర్గతాం దుఃఖభాగినీమ్॥ ౬॥

అయం చ వీర సందేహ స్తిష్ఠతీవ మమాగ్రతః।
సుమహాం స్త్వత్సహాయేషు హర్యృక్షేషు హరీశ్వర॥ ౭॥

కథం ను ఖలు దుష్పార న్తరిష్య న్తి మహోదధిమ్।
తాని హర్యృక్షసైన్యాని తౌవా నరవరాత్మజౌ॥ ౮।

త్రయాణా మేవ భూతానాం సాగరస్యాస్య లంఘనే।
శక్తిస్స్యా ద్వైనతేయస్య తవవా మారుతస్యవా॥ ౯।

## అఱువదియెనిమిదవసర్గ.

౧. పురుషోత్తమా! నీయందలి స్నేహమువలనను, ఒద్దికవలనను సీతాదేవిచే గౌరవింపఁబడి నీతో చెప్పందగువిషయముంగూర్చి మఱియొకతూరి యామెచేఁ జెప్పంబడితిని.

౨. దశరథపుత్రుఁడగు శ్రీరాముఁడు శీఘ్రమున రావణుని యుద్ధమున సంహరించి నన్నుఁగొనిపోవునట్లు పెక్కుతెఱంగుల నీవు చెప్పందగును.

౩. ఓవీరుఁడా? నీకిష్టముండెనేని మఱియొక్కదిన మిందుండుము. ఏదియేని పట్టముగనుండునొకచెట్టునీడ శ్రమందీర్చికొని రేపు పోదువుగాక.

౪. ఓబలవంతుఁడ! అదృష్టహీనురాలనగు నాకు నీవిందుండుటచే నా గొప్పశోకమునకు స్వల్పకాలమేనియు విడుదల కలుగును.

౫. పరాక్రమశాలివగునీవు పయనమైపోయితివేని నీవు మరలవచ్చునంతలోపల నాప్రాణము లుండుటయు సంశయము. ఇదికల్లగాదు.

౬. నిన్నుఁజూడకపోవుటచేఁ గలుగుశోకము, దుఃఖముపై దుఃఖముసంభవించి భంగపడి యదృష్టహీనురాలను దుఃఖముల ననుభవించుదానను నగుచున్న నన్నింకను బరితపింపఁజేయును.

౭. ఓవీరుఁడా! వానరశ్రేష్ఠుఁడా! నీకుసహాయులగు వానరులఁగూర్చియు నెలుఁగుబంట్లంగూర్చియుఁ బెద్దసందేహమొకటి నాయెదుటఁ గూర్చున్నట్లున్నది.

౮. ఆవానరులయొక్కయు నెలుఁగుబంట్లయొక్కయు సేనలును, రాజకుమారులును, దాఁటరానిది యగు మహాసముద్రము నెట్లు దాఁటుదురు!

౯. ఈసముద్రమును దాఁటుటయందు భూతములలో గరుత్మంతుఁడు, నీవు, వాయుదేవుఁడు నను ముగ్గురికిమాత్రమే శక్తికలదు.

తదస్మి న్కార్యనిర్యోగే వీరైవం దురతిక్రమే।
కింపశ్యసి సమాధానం బ్రూహి కార్యవిదాం వర॥ ౧౦॥

కామ మస్య త్వమేవైకః కార్యస్య పరిసాధనే।
పర్యాప్తః పరవీరఘ్న యశస్య స్తే బలోదయః॥ ౧౧॥

బలై స్సమగ్రై ర్యది మాం హత్వా రావణ మాహవే।
విజయీ స్వాం పురీం రామో నయే త్తత్స్యా ద్యశస్కరమ్॥

యథాహం తస్య వీరస్య వనా దుపధినా హృతా।
రక్షసా తద్భయా దేవ తథా నార్హతి రాఘవః॥ ౧౩॥

బలైస్తు సంకులాం కృత్వా లంకాం పరబలార్దనః।
మాం నయే ద్యది కాకుత్స్థ స్తత్తస్య సదృశం భవేత్॥ ౧౪॥

తద్యథా తస్య విక్రాంత మనురూపం మహాత్మనః।
భవ త్యాహవశూరస్య తథా త్వ ముపపాదయ॥ ౧౫॥

తదర్థోపహితం వాక్యం ప్రశ్రితం హేతుసంహితమ్।
నిశమ్యాహం తత శ్శేషం వాక్య ముత్తర మబ్రువమ్॥ ౧౬

దేవి హర్యృక్షసైన్యానా మీశ్వరః ప్లవతాం వరః।
సుగ్రీవ స్సత్త్వసంపన్న స్తవార్థే కృతనిశ్చయః॥ ౧౭

తస్య విక్రమసంపన్నా స్సత్త్వవంతో మహాబలాః।
మనస్సంకల్పసంపాతా నిదేశే హరయః స్థితాః॥ ౧౮

౧౦. కావున వీరుఁడా! మీఱఁగూడనివగు నీకార్యవిషయమున నెట్లుపాయమూహించెదవు. చెప్పుము బుద్ధిమంతుఁడా!

౧౧. శత్రువీరుల నుఱుమాడువాఁడా! ఈ పనిని సాధించుటయందు నీవొక్కఁడవే పూర్ణముగాఁ జాలుదువు. నీబలముయొక్క పెంపు నీకుం గీర్తినిచ్చునదియగును.

౧౨. శ్రీరాముఁడు పూర్ణముగు సేనలతో యుద్ధమున రావణాసురుం జంపి నన్నుఁ దనపట్టణమునకుం గొనిపోవునేని యశస్సును గలిగించు నదియే హేతువు.

౧౩. శూరుఁడైన శ్రీరామునకు వెఱచిన రావణునిచే నేను మోసముగా నెట్లు తేఁబడితినో యట్లే రాఘవుఁడును నన్ను మోసముగాఁగొనిపోఁదగదు.

౧౪. శత్రుసేనలఁ బీడించువాఁడగు శ్రీరాముఁడు సేనలచే లంకను గ్రిందుమీఁదు చేసి నన్నుంగొనిపోవునేని యాతనిగౌరవమున కదితగినది.

౧౫. కావున యుద్ధశూరుఁడును గొప్పవాఁడునునగు నాతని కెట్టి పరాక్రమముంజూపుట తగునో యట్లే తగుసన్నాహముం జేయుము.

౧౬. అని సీత పలుకఁగా గంభీరమైన యభిప్రాయముగలదియు నడంకువఁగలదియు హేతువుతోఁగూడినదియునగు నామెమాటనువిని యామెకుఁ బ్రత్యుత్తర మిట్లుచెప్పితిని.

౧౭. ఓ తల్లీ వానరులయొక్కయు నెలుఁగుబంట్లయొక్కయు సేనల కధికారియు వానరులలోఁ శ్రేష్ఠుఁడును మిక్కిలి బలశాలియునగు సుగ్రీవుఁడు నీవిషయమున నిశ్చయించుకొని యున్నాఁడు.

౧౮. పరాక్రమముచేఁ జూపినవారును, బలవంతులును మనస్సునకుంగలయంతటివేగముంగలవారును నగువానరులు సుగ్రీవునియొక్కయాజ్ఞయం దనేకులు గలరు.

ఏషాం నోపరి నాధస్తా న్న తిర్యక్ సజ్జతే గతిః।
న చ కర్మసు సీదంతి మహత్స్వ మితతేజసః॥ ౧౯॥

అసకృ త్తై ర్మహాభాగై ర్వానరై ర్బల గర్వితైః।
ప్రదక్షిణీ కృతా భూమి ర్వాయుమార్గాను సారిభిః॥ ౨౦॥

మద్విశిష్టా శ్చ తుల్యా శ్చ సంతి తత్ర వనౌకసః।
మత్తః ప్రత్యవరః కశ్చి న్నాస్తి సుగ్రీవ సన్నిధౌ॥ ౨౧॥

అహం తావ దిహ ప్రాప్తః కిం పున స్తే మహాబలాః।
న హి ప్రకృష్టాః ప్రేష్యంతే ప్రేష్యంతే హీతరే జనాః॥ ౨౨॥

త దలం పరితాపేన దేవి మన్యు ర్వ్యపైతు తే।
ఏకో త్పాతేన తే లంకా మేష్యంతి హరియూథపాః॥ ౨౩॥

మమ పృష్ఠగతౌ తౌ చ చంద్రసూర్యా వివోదితౌ।
త్వత్సకాశం మహాభాగే నృసింహా వాగమిష్యతః॥ ౨౪॥

అరిఘ్నం సింహ సంకాశం క్షిప్రం ద్రక్ష్యసి రాఘవమ్।
లక్ష్మణం చ ధనుష్పాణిం లంకా ద్వార ముపస్థితమ్॥ ౨౫॥

నఖదంష్ట్రాయుధా న్వీరా న్సింహ శార్దూల విక్రమా న్।
వానరా న్వారణేంద్రాభా న్క్షిప్రం ద్రక్ష్యసి సంగతా న్॥ ౨౬॥

శైలాంబుద నికాశానాం లంకా మలయ సానుషు।
నర్దతాం కపి ముఖ్యానా మచిరా చ్ఛ్రోష్యసి స్వనమ్॥ ౨౭॥

౧౯. ఆవానరులయొక్క సంచారము మీఁదనేని, క్రిందనేని, అడ్డముగనేని యెందును దడఁబడదు. మిక్కిలి ప్రతాపముఁగలవారు గొప్పపనులయందును వెనుకతీయరు.

౨౦. గొప్పమహిమగలవారును, బలముచే గర్వించినవారును, ఆకాశమున సంచరించువారునునగు నావానరులచేత నీభూమికిఁ బెక్కుమాఱులు ప్రదక్షిణము సేయంబడియె.

౨౧. ఆసుగ్రీవునియొద్ద నాతోఁ దుల్యులును నాకంటె నధికులును నగు వానరులుకలరు. నాకంటె తక్కువగువాఁ డొకండును లేఁడు.

౨౨. నాబోటివాఁడనే యింతకష్టతరముగుచోటికి రాఁగలిగినపుడు, ఆ బలవంతులమాట యేమిచెప్పుదును. ఇట్టి కార్యములయందు గొప్పవాండ్రు పనుపంబడుటలేదుగాని, సామాన్యులు పనుపంబడుదురు.

౨౩. కావున, ఓ దేవీ! తపింపకు, నీదుఃఖము ముడుగునుగాక, ఆవానరశ్రేష్ఠులు లంక కొక్కదాఁటున జేరఁగలరు.

౨౪. ఓ గొప్పమహిమగలదానా! పురుషశ్రేష్ఠులగు నాయిరువురును నుదయించిన చంద్రసూర్యులవలె నావీపుపై నెక్కి నీకడకు వత్తురు.

౨౫. శత్రువులనుజంపువాఁడును, పరాక్రమమున సింగముంబోలువాఁడునునగు రాఘవునిఁ లంకాద్వారమందు ధనుస్సును జేతంబట్టుకొని నిలిచియుండు లక్ష్మణునిఁ శీఘ్రమునం గాంచెదవు.

౨౬. గోళ్లను దంతములను సాధనములుగాఁగలవారును, వీరులును సింగములను బులులనుబోలిన పరాక్రమముగలవారును, మదించిన యేనుఁగులఁబోలువారును, మొత్తములైనవారును నగు వానరులను శీఘ్రమునఁ జూడంగలవు.

౨౭. కొండవలె మేఘమువలె నున్నవారును, లంకా మలయపర్వతముల చరులయందుఁ గ్రీడించుచున్నవారును నగు వానరోత్తములయొక్క ధ్వనిని శీఘ్రముననే వినఁగలవు.

నివృత్త వనవాసం చ త్వయా సార్ధ మరిందమమ్।
అభిషిక్త మయోధ్యాయాం క్షిప్రం ద్రక్ష్యసి రాఘవమ్॥ ౨౮॥
తతో మయా వాగ్భి రదీన భాషిణా శివాభి రిష్టాభి రభి ప్రసాదితా। జగామ శాంతిం మమ మైథిలాత్మజా తవాపి శోకేన తదాభి పీడితా॥
౨౯॥

ఇత్యార్షే శ్రీమద్రామాయణే ఆదికావ్యే
వాల్మీకీయే చతుర్వింశ త్సహస్రికాయాం సంహితాయాం
శ్రీమత్సుందరకాండే అష్టషష్టితమస్సర్గః.

శ్రీమత్సుందరకాండ స్సమాప్తః.



౨౮. శత్రువులను దహింపఁజేయువాఁడగు రాఘవుఁడు వనవాసమును మానినవాఁడై నీతోఁగూడ నయోధ్యయందుఁ బట్టాభిషేకముఁ బొందినవాఁడుగా శీఘ్రమునఁ జూడఁగలవు.

౨౯. నిన్నెడఁబాసియున్న వ్యథచేతను, నేను వదలివచ్చుచున్నందున దుఃఖముచేతను బీడింపఁబడుచున్నదియగు జానకి ధైర్యముఁగలట్టియు నింపై శుభకరమైనట్టియు నామాటలచే బుజ్జగింపఁబడినదై తనివిచెంది మిన్నకయుండెను.

ఇది అఱువదియెనిమిదవసర్గ.

చంద్రబింబ సమాకారం వాంఛితార్థ ప్రదాయకమ్।
హనూమ త్సేవితం ధ్యాయే త్సుందరే కాండ ఉత్తమే॥